అత్యున్నత జ్ఞానపీఠ పురస్కారం (2012) పొందిన నవల

# పాకుడురాళ్ళు



డాక్టర్ రావూరి భరద్వాజ



అత్యున్నత 'జ్ఞానపీఠ పురస్కారం' పొందిన నవల

# పాకుడురాళ్ళు

సినీజగత్తులోని వ్యక్తుల అంతరాంతరాలను

ప్రతిభావంతంగా బొమ్మకట్టించిన తొలి ప్రయోగం

## డా. రావూరి భరద్వాజ

# భారత జ్ఞానపీఠమెక్కిన తొలి తెలుగు నవల

ఇన్నాళ్ళకిన్నాళ్లకు తెలుగు సాహితి మళ్లీ గద్దెనెక్కింది. ఓ చక్కని తెలుగు సాహితీ ప్రక్రియ-నవల-కో కలికితురాయి దక్కింది. 1988 తర్వాత 2013లో సాహితీక్షేత్రంలో ప్రతి రచయితకో రచన పర్యాయపదంగా ఉండడం చూస్తుంటాం. శ్రీశ్రీ 'మహాప్రస్థానం', బుచ్చిబాబు 'చివరకు మిగిలేది'. గోపీచంద్ 'అసమర్థుని జీవయాత్ర', కొడవటిగంటి 'చదువు', రావిశాస్త్రి 'సారాకథలు', వట్టికోట 'ప్రజలమనిషి', దాశరథి 'అగ్నిధార', ఆరుద్ర 'త్వమేవాహం', జాషువా 'గబ్బిలం', సీతాదేవి 'మట్టిమనిషి'....ఇలా ఇలా ఎందరో ఎన్నెన్నో...

అలా-రావూరి భరద్వాజ అంటే "పాకుడురాళ్ళు". రచయితలు తమ అన్ని రచనల్లోనూ నూతన ఆలోచనా ధోరణులనూ, కళా నైపుణ్యాలనూ నిబిడీకృతం చేస్తూనే ఉంటారు. అయితే ఏదో ఒక్క తమ రచనలో రచయిత తానే అంతటా తన విశ్వరూపం చూపిస్తూ తన జవసత్వాల న్నిటినీ పొందుపరిచి తానంతవరకూ సంపాదించుకున్న రచనా వైశిష్ట్యాన్నీ, పరిశీలనా నైశిత్యాన్నీ, విశ్లేషణా చాతుర్యాన్నీ పాఠకులకందిస్తాడు. పాఠకులు కూడా ఆ రచనలోని వస్తువు రీత్యా కానీ, రచనా ప్రాబల్యం వల్ల కానీ-అతని అన్ని రచనల్లోకీ ఈ రచననే ఆ రచయిత యొక్క ప్రాతినిధ్య రచనగా స్వీకరిస్తారు. ఈ రచననే ఆ రచయిత సమగ్రంగా ఆవిష్కరింపచేసే రచనగా భావించి పెద్దపీట వేస్తారు. ఆ రచయిత రచనల జాబితాలో ముందు పీఠాన నిలబెడ్తారు. ఇదిగో అలా సాహితీలోకం సగౌరవంగా సంభావించిందే ఈ "పాకుడురాళ్ళు".

భరద్వాజగారి సమగ్ర సాహితీ మూర్తిమత్వాన్ని పరిగణనలోకి తీసుకుంటూనే-ఓ విశిష్ట రచనగా "పాకుడురాళ్ళు"నవలనూ, రచయితనూ ఈ బహుమతికి ఎంపిక చేశారు.

రావూరి భరద్వాజ సామాన్య రచయితల మధ్య అసామాన్య రచయిత. సాధారణంగా ఏ రచయిత చూపులకూ తగలని సామాజిక కోణాలే ఈ రచయితకు వస్తువు. అలాటి ఓ సినిమా బాపతు వస్తువుతో మలిచిన ఈ నవలకు -తొలి నుంచీ ప్రసిద్ధి రావడానికి కారణం- ఆ నవలను నిర్వహించిన తీరు, చెప్పిన పద్ధతి. ఆయా సందర్భాలను ఆసరా చేసుకొని రచయిత విస్తరించిన భావజాలం. జనం ఓ రచయితకు జేజేలు పలకటం అంటే ఆ రచయిత తన రచనల్లో అందించిన భావజాలం పట్ల ఆకృష్టులలైనందువల్లా అనే అనుకోవాలి. ఆ భావజాలం తమదిగా పాఠకులు భావించినందువల్లేననాలి. దాన్ని వివరించటంలో భరద్వాజకు పాండిత్యలేమి బాగా సహకరించింది. ఓ సందర్భంలో కొందరు పాఠకులు శరత్‌ను -'రవీంద్రుని' గురించి అడిగారట. అందుకు శరత్-రవీంద్రుడు నాలాంటి వాళ్ళకోసం రాస్తారు అన్నాట్ట. మరి మీరో అంటే నేను మీలాంటి వాళ్ళకోసం రాస్తాను. నాకు పాండిత్యం లేదు. అందుకని నేను సామాన్యుల కర్థమవు తాను-అన్నాట్ట. అలాగే భరద్వాజకు పాండిత్యం లేకపోవటం ఓ వరంగా అందివచ్చింది. తెలుగువాడు తెలుగువాడికోసం రాసిన తెలుగు రచనగా ఆయన రచన ఉంటుంది.

హాలాహాలాన్ని తాను మింగుతున్నా నవ్వుతూ జీవితపోరాటంలో సైనికుడుగా ఉండాలన్న సత్యాన్ని చాప్లిన్ రుజువు చేశాడు. సామాజిక పోరాటాల్ని చేశాడు. అలానే కాలువేస్తే జారిపోయే ''పాకుడురాళ్ళు''....జీవన పోరాట గమనాన్ని తెలిపే ఈ నవల. అందుకే ప్రతిష్ఠాత్మకమైన 'జ్ఞానపీఠ పురస్కారం'. నిలవ నీళ్ళలో ఒడ్డుకు దగ్గరగా కనబడీ కనబడకుండా ఉన్న బండరాళ్ళమీద పాచి పేరుకునుంటుంది. సూర్యకిరణాల వెలుగు పడ్డప్పుడు ఆ పాచి తళతళా మెరుస్తూంటుంది. ఆకర్షణీయంగా ఉంటుంది. ఆ రాళ్ళమీద కాలెట్టి నిలబడదామనుకున్నా అలా నిలబడి గాలమేసి చిన్నచిన్న చేపల్ని పడదామనుకుని ఎక్కినవాడు రాళ్ళమీది పాచివల్ల జారి నీళ్ళలో పడడం సహజం.

సమాజంలో ఇలాంటి 'పాకుడురాళ్ళు' ఉండే సందర్భాలున్న రంగాలు అనేకానేకాలు. భరద్వాజ తనకు అప్పటికి (1965)బాగా అవగాహన ఉన్న, ప్రజల్లో ఉత్సుకత ఉన్న-సినిమా రంగాన్ని వస్తువుగా తీసుకొని నవలీకరించిన సందర్భమే ఈ''పాకుడురాళ్ళు''. దానికే ఈ పురస్కారం. అందుకు ప్రముఖ రచయిత రావూరి భరద్వాజగారికి అభినందనలు. వారి ఈ రచనను మా ప్రచురణగా నాలుగోసారి పాఠకులందిస్తున్నాం. అందుకు వారికి కృతజ్ఞతలు.

తెలుగు భాషా సంస్కృతీ వికాస సంవత్సరంగా మన రాష్ట్రప్రభుత్వం 2013 ప్రకటించిన సందర్భంలో ''ఈ పురస్కారం ఈ నవలకు రావటం తెలుగు వారి సౌభాగ్యం''. మా ప్రచురణాలయం ప్రచురణ రంగంలో అరవయ్యేళ్ళుగా కృషిచేస్తూ వజ్రోత్సవ సంవత్సరంలో (1953-2013) ప్రవేశించిన సందర్భం కూడా ఇదే. ఇప్పుడు దేశంలోని అత్యంత ప్రతిష్ఠాత్మక ''కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం''-'పెద్దిభొట్ల సుబ్బరామయ్య కథలు''-మొదటి సంపుటానికీ, ఈ 'జ్ఞానపీఠ పురస్కారం' ఇప్పుడు 'పాకుడురాళ్ళు' అన్న మా ప్రచురణలకు రావడం మాకెంతో గర్వకారణం. రచయితలకు అభినందనలు.

ఇన్నాళ్ళుగా మా ప్రచురణాలయం కృషికి వెన్నుదన్నుగా ఉంటూ ప్రోత్సహిస్తున్న రచయితలకూ, పాఠకులకూ, అభిమానులకూ సర్వదా కృతజ్ఞులం.

18-04-2013 -ప్రచురణకర్తలు

## ఐదవ ముద్రణకు

# నా మాట

'పాకుడురాళ్ళు' నవలకు 'జ్ఞానపీఠ పురస్కారం' వచ్చిన సందర్భంగా 'విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్'వారు ఈ నవలను పునర్ముద్రిస్తున్నందుకు చాలా సంతోషంగా ఉంది.

సినీ పత్రికల్లో ఉద్యోగం చేస్తున్న రోజుల్లో చలనచిత్రరంగంలోని-వెలుగునీడలనూ, కష్టసుఖాలను, వడిదుడుకులను మొత్తానికి సినిమా వెనుక గల సినిమా చరిత్రను గూర్చి చాలా దగ్గరగా చూశాను, అందుకే ఆ ఇతివృత్తాన్ని ఎన్నుకొని 'పాకుడురాళ్ళు' నవలగా పాఠకులకందించాను.

ఒకప్పుడు ఈ నవల మన తెలుగు వాళ్ళకు మాత్రమే నచ్చి ఉండవచ్చు. ప్రస్తుతం అత్యున్నత జ్ఞానపీఠ పురస్కారం రావడంతో యావత్ భారతావనికే నచ్చినట్లైంది. ఇది మొదట్లో కృష్ణాపత్రికలో ధారావాహికంగా ప్రచురితమైనది. దీనిని మొదట శ్రీకమలా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ వారు 1978లో ప్రచురించారు. వారికి కృతజ్ఞతలు.

నా పుస్తకాలలో ఐదవ ముద్రణకు నోచుకున్న మొదటి గ్రంథం ఈ ''పాకుడురాళ్ళు'' నవల. ఈ ప్రచురణను ఈవిధంగా సుసాధ్యం చేసింది విశాలాంధ్ర ప్రచురణాలయం.

నా రచనలలో చాలా వాటిని విశాలాంధ్ర వారు ముద్రణ కల్పించి, పంపిణీ చేసి, ప్రచారం చేసినందుకు ఆనందంగా ఉంది. కాదు కాదు చాలా సంతోషంగా ఉంది. విశాలాంధ్ర లేకపోతే నేను లేను. వారికి నేను కృతజ్ఞుణ్ణి.

## తొలి ప్రచురణకు

### ఈ పుస్తకం...

చదివి ముగించిన తరువాత, తొలిగా నేను చేసిన పని గాఢంగా నిట్టూర్చడం. యధాలాపంగా చదవడం ప్రారంభించి, మరింత విడువలేక, పుస్తకం చివరికంటా పూర్తిచేసిన తరువాత గానీ సుఖంగా గాలిపీల్చలేకపోయాను. నిజానికీ నవలలోని కొన్ని భాగాలు అప్పుడప్పుడు 'కృష్ణాపత్రిక'లో చదివినవే! ఐనా మొత్తంగా కలిపి చదివినప్పుడు, నేను పొందిన ఆనందం వేరు.

మనలో చాలామందికి ఆధునిక నాగరికత ప్రసాదిస్తున్న సదుపాయాలను అనుభవించడమే తప్ప, వాటి వెనుక గల చరిత్ర తెలియదనుకుంటాను. రేడియో వాడుతున్న సామాన్య వ్యక్తికి 'మార్కోని' పడిన శ్రమ తెలియదు. తంత్రీ వార్తా ప్రసార సాధనాలను ఉపయోగించుకొంటున్న వ్యక్తికి, 'గ్రాహమ్‌బెల్'పడిన పాట్లు తెలియవు. అలాగే సినిమా చూస్తున్న ప్రేక్షకునికి, ఆ వెనుక జరిగే కథ కూడా తెలియదని అనుకోవచ్చు.

'పాకుడురాళ్ళు' ఒక నవలగా నాకు నచ్చడానికి కారణం, సినిమా వెనుక గల సినిమా చరిత్రను, రచయిత కథాత్మకంగా చిత్రించడమే కాదు; జరిగిన, జరుగుతున్న, జరగడానికి అవకాశాలున్న వేలాది సంఘటనలను మనోజ్ఞంగా తన రచనలో పొహళించడం కూడా కాదు; వీటన్నింటినీ మించి, వీటన్నింటి వెనుకా, రచయిత పడుతున్న మనోవేదన, వాటిని మార్చి తీరాలన్న అతని ప్రగాఢ వాంఛ నన్ను కదలించింది. నిత్యకల్యాణం పచ్చతోరణంగా భాసిస్తూ, వేలాదిమందిని తనవైపుకు ఆకర్షించే ఈ రంగంలో, పాతుకుపోయిన అవాంఛనీయమైన, శక్తులను గురించి రచయిత మనకు కనువిప్పు కలిగిస్తున్నాడు. చిరునవ్వుల వెనుక మణిగిపోయే ఆత్మఘోష, తళుకు చూపుల చాటున దాగిన కన్నీరు, తియ్యని మాటల మాటున పొంచున్న విషజ్వాలలు, మనకి ఈ నవలలో ప్రత్యక్షమౌతాయి.

'రచనల్లో వాస్తవికత ఉండాలి'అనేవారు. ఈనవలలోని వాస్తవికతను ఎంతవరకు అంగీకరిస్తారన్నదొక ప్రశ్న. ఎందుకిలా అంటున్నానంటే మనలో చాలామందికి, అసలైన వాస్తవి కత అవసరం లేదు. 'వాస్తవికత'అని మనలను భ్రమింపచేయగలదేదో మనకు కావాలి. అసలైన సిసలైన సత్యాన్ని మనం చూడనూ లేము, చూసి భరించనూ లేము.

ఈ సందర్భంలో అలెగ్జాండర్ కుప్రిన్‌ను వొకసారి జ్ఞాపకం చేస్తున్నాను. అతను వ్రాసిన 'యమకూపం' చదివినప్పుడు అందులోని సంఘటనలు, పాత్రలు, చాలాకాలం నాకు మనశ్శాంతి లేకుండా జేశాయి. హృదయం కన్నీటితో నిండిపోయింది. ఆ పాత్రల పట్ల అనంతమైన అనురాగంతో, సానుభూతితో మనం చలించిపోతాం. కుప్రిన్‌కు ముందు ఆ తరువాత కూడా ఆ నవలలో చిత్రించిన సంఘటనలూ, అలా బ్రతుకుతున్న వ్యక్తులూ వున్న మాట నిజమే. కానీ, కుప్రిన్ మాత్రమే ఆ జీవితాన్ని కథావస్తువుగా స్వీకరించి, లోకోత్తరమైన కళాఖండాన్ని సృష్టించగలిగాడు.

మిత్రులు శ్రీ భరద్వాజ కూడా, యీ నవల ద్వారా, అటువంటి విజయాన్నే సాధించారు. ఇందులోని కొన్ని సంఘటనలతో మనం యేకీభవించకపోవచ్చు. కానీ-ఈనాడీ రంగంలో అవి పేరుకుపోయి వున్నాయో, లేదో మనం చూడాలి. కారుచీకట్లలో మారుమూలల పడి ఉన్న వాస్తవికసంఘటనలు ఏర్చి, కూర్చి మన ముందుంచారు శ్రీ భరద్వాజ.

రచయిత నిజాయితీ, బాధ్యతా ఇలాంటి ఘట్టాలలోనే బైటపడుతుంది. సమకాలీన సమాజానికి కోపం వస్తుందని భయపడి చేతులు ముడుచుకు కూచున్న రచయిత, సంఘం పట్ల తనకున్న బాధ్యతను విస్మరించాడన్నమాట. ఉత్తమరచయిత లెవ్వరూ అలాచేయరు, చేయలేరు కూడాను. వీరేశలింగం పంతులుగారూ, గురజాడ అప్పారావుగారూ, గిడుగు రామమూర్తి పంతులుగారూ, త్రిపురనేని రామస్వామి చౌదరిగారూ, గుడిపాటి వెంకట చలంగారూ-సమకాలీన సమాజాన్ని చూసి భయపడి ఉన్నట్లయితే, తెలుగుజాతి ఇప్పుడేస్థితిలో ఉండేదీ మనం ఊహించను కూడా లేము.

చెప్పవచ్చిందేమిటంటే 'పాకుడురాళ్ళు' నవలలోని కొన్ని సంఘటనలు, సన్నివేశాలు, సామాన్యపాఠకునికి చాలా కొత్తగా కనిపిస్తాయి. వాటిని అభివ్యక్తం చేయడంలో రచయిత ప్రదర్శించిన చొరవ, తెగువ అభినందనీయమైనవి. 'దారుణా ఖండల శస్త్ర తుల్యము'లైన వాక్యాలతో శ్రీభరద్వాజ ఆయా ఘట్టాలను చిత్రించిన విధానం అపూర్వంగా ఉన్నది. తను చెప్పదలచుకున్నదేదో బలంగా చెప్పగల బహుకొద్దిమంది రచయితలలో భరద్వాజ వొకరు. ఆయన విమర్శ, వ్యక్తిగతంగా ఉండదు. ఆ వ్యక్తుల తాలూకు సమాజమూ, అందులోని వాతావరణమూ, ఆయన విమర్శకు గురి అవుతాయి.

అట్టడుగు నుండి జీవితం ప్రారంభించి ఆకాశమంత ఎత్తుకు ఎదిగిన ప్రతిభాశాలిని మంజరి. నీగ్రో బానిసగా జన్మించి, అమెరికా చరిత్రనే మార్చివేసిన 'జార్జి వాషింగ్‌టన్ కార్వర్', మామూలు కార్మికుడుగా బ్రతుకు ప్రారంభించి, కార్లసామ్రాజ్యాధిపతిగా పేరు సంపాదించిన 'వాల్టన్ పెర్సీ క్రిజ్లర్', మట్టిలో పుట్టి, మణి మందిరాలలో నివసించిన 'మార్లిన్ మన్రో'-వీరందరూ అనుసరించిన మార్గాలనే మంజరి కూడా అవలంబించి తమ ధ్యేయాన్ని సాధించుకోవడానికి నిరంతర కృషి, అవకాశాలను సద్వినియోగం చేసుకోవడమూ, వారి విజయాలకు కారణాలు. మంజరి కూడా ఈ రెండు సూత్రాలనూ అక్షరాలా పాటించింది. గుంటూరు గుడిసెల్లో తిరిగి, బొంబాయిలోని చలువరాతి మందిరం చేరిన ఈ మధ్యకాలంలో-మనకొక విచిత్రమైన చలనచిత్ర ప్రపంచాన్ని చూపించింది.

సినిమారంగం ఆధారంగా, తెలుగులో చాలా చిన్న కథలొచ్చాయి గానీ, పెద్దనవలా రూపంలో రావడం మాత్రం ఇదే ప్రథమం. ఆ గౌరవం శ్రీ భరద్వాజకు లభించినందుకు, అతన్ని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

**బుద్ధపూర్ణిమ-విశ్వావసు**

**- అలపాటి వెంకట్రామయ్య.**

## తొలిప్రచురణకు

### స్నేహాంజలి

ఇరవై అయిదు సంవత్సరాల కిందటి మాట. అప్పట్లో గుంటూరు జిల్లాలోని తాటికొండ గ్రామంలో-'బాలభారతీ నాట్యమండలి' పేరుతో నాటకసంఘం ఒకటుండేది. అందులో నేనూ, నా మిత్రుడు పందిటి రామచంద్రరావూ, సభ్యులం. ఈ సంఘం వారు చాలా నాటకాలాడారు; 'భక్తశ్రీయాళ', 'సరోజముఖి', 'గయోపాఖ్యానం', 'తులాభారం', 'చింతామణి', 'ఉద్యోగ విజయాలు'-ఇలా ఎన్నో నాటకాలు, తాడికొండలోనూ ఆచుట్టుపక్కలా ప్రదర్శించాము.

ఆ నాటకాల్లోని స్త్రీ వేషాలను మొగవాళ్ళే వేస్తుండేవారు. మా రామచంద్రరావు అందులో ప్రసిద్ధుడు. తొలిగా స్త్రీ వేషాలకు స్త్రీలే వేయాలన్న సూచన చేసింది మా కంపెనీ హీరో అప్పయ్యగారు. ఆ సూచన మేరకు మా రామచంద్రరావు గుంటూరు నుండి వొక 'నటి'ని తీసుకొచ్చాడు. ఆ తరువాత కొద్దికాలానికే కంపెనీ మూతపడిపోయింది.

తిరిగి దాన్ని పునరుద్ధరించినవారు, మిత్రులు శ్రీకొల్లూరి వెంకటేశ్వర్లుగారూ, శ్రీ బి.వీరయ్యగారూను. యువజనుల్లోని ఉత్సాహోద్వేగాలు వృథా కాకూడదనీ, సమాజాభ్యు దయానికి తోడుపడాలన్న ఉద్దేశంతో, సాంఘిక నాటకాలు ప్రదర్శించవలసిందనీ అని వారు మమ్మల్ని ప్రోత్సహించారు. ఒకటి రెండేళ్ళపాటు గావును రకరకాల సాంఘిక నాటకాలను దూరప్రాంతాలకు కూడా వెళ్ళి మేము ప్రదర్శించాం.

ఈ ఇద్దరు మిత్రుల అండదండలూ, మాకు అనుక్షణం ఉండేవి.

1944 ప్రాంతాలలో నేను రచనలు చేయడం ప్రారంభించాను. నా ముఖ్య శ్రోత కొల్లూరి వెంకటేశ్వర్లుగారు. కథ వినిపించి 'ఎలా ఉంది?' అని అడిగినప్పుడు, నవ్వుతూ నా తప్పులను వేలెత్తి చూపించేవారాయన. తాడికొండలో ఉన్నప్పుడు నేను వ్రాసిన చాలా కథలు, ముందుగా చదివిన వారు వెంకటేశ్వర్లుగారే; ఆనాటి, వారి నిశిత విమర్శ నా అభివృద్ధికి చాలా తోడుపడింది. ఆ తరువాత నేను పొట్టచేతపట్టుకొని, తాడికొండ వదిలాను. 'కొల్లూరి' ఇతర వ్యాపకాల్లో మునిగిపోయారు.

ఇరవై సంవత్సరాల తరువాత, గుంటూరులో కలుసుకొన్నప్పుడు మళ్లీ ఆ వెనుకటి ఆప్యాయతా, ఆదరణా నేననుభవించాను. ఈ మధ్యకాలంలో నేనూ, వారూ కూడా చాలా మారిపోయాం. కానీ మా స్నేహం మాత్రం చెక్కుచెదరకుండా అలానే ఉన్నది.

'పాకుడురాళ్ళు మీకు అంకితమిస్తున్నాను' అన్నప్పుడు-

'ఎందుకోయ్ ఇదంతా?'అన్నారాయన నవ్వుతూ

'ఇంతకన్నా మన స్నేహానికి గుర్తుగా నేనివ్వగలిగిందేమీ లేదు' అన్నాను.

నవ్వుతూ భుజం తట్టారు శ్రీకొల్లూరి.

ఆ సౌజన్యమూర్తికి మిత్రునిగా నేనిది వారికి అంకితమిస్తున్నాను.

1978 -భరద్వాజ.

**(ఈ నవలకు, నేను పెట్టిన శీర్షిక'మాయ జలతారు'అని ఆ పేరును 'పాకుడురాళ్ళు'గా మార్చినవారు మిత్రులు శ్రీ శ్రీలా వీర్రాజుగారు. -భరద్వాజ.)**

# మాధవరావు చెప్పిన కథ...

ఇది మంజరి కథ కాదు. నా సొంత గొడవ. మీకు పత్రికలు చదివే అలవాటున్నదా? పదిహేను సంవత్సరాల క్రిందట నవ్యాంధ్ర కళామండలిని గురించి పత్రికల్లో చదివే వుంటారు. బహుశా మీకు జ్ఞాపకం వుండదనుకుంటాను. రేపెప్పుడన్నా ఏ మహానుభావుడన్నా అవతరించి 'ఆంధ్ర నాటక రంగ క్రమానుగతాభివృద్ధి'ని గురించి వ్యాసం రాయడమే జరిగితే, అందులో నవ్యాంధ్ర కళామండలిని గురించి తప్పకుండా పేర్కొని తీరాలి. ఎందుకంటే, అటు పాతకాలపు నాటకాలకు ఇటు కొత్తరకం నాటకాలకు, మధ్యసమయంలో ఈ మండలి అవతరించింది. పాతనాటకాల మీద జనానికి మోజు తగ్గిపోయింది, కొత్త నాటకాలంటే, నమ్మకం కుదరలేదు, అదీ పరిస్థితి.

నాకేమో నాటకాలంటే ఆపేక్ష ఉన్నమాట నిజమే! ఎంతకాలమని శ్రీకృష్ణరాయబారం, పాండవోద్యోగ విజయాలు, గయోపాఖ్యానం, సారంగధర ఆడుకుంటూ సమాజాలు చాలా ఉన్నాయి. వాళ్లను కాదని మా నాటకాలు చూడ్డానికి జనం రాలేదంటే, అది అక్షరాలా మాతప్పే.

మా ఊళ్లో ఉన్న కవిని పట్టుకొని కొత్తనాటకం ఒకటి రాసి పెట్టమన్నాం. అతగాడేమో, నావల్లకాదన్నాడు. నాటకం రాయడం అట్టే కష్టం కాదనీ, ప్రయత్నిస్తే రాయగలవనీ, అతనికి నచ్చచెప్పాం. అప్పటికి 'సరే' నన్నాడు గానీ, చివరకు వేసిన గొంగడి మాత్రం కదల్లేదు.

'అది గాదురా అబ్బిగా! కథ మేమే యిచ్చాం గదా! ఒక కథానాయకుడు, కథానాయకి ఉండాలి. వీరిద్దరి కులాలు వేరు వేరు. కథానాయకుడు, భూస్వామి కొడుకు, ఆ భూస్వామి పరమనీచుడు. జీతగాళ్లను అస్తమానం దోచుకుతింటూ ఉంటాడు. వారి శ్రమను పీల్చుకుని మేడలు కట్టేసిన బాపతు. దొంగ లెక్కలు రాయడంలో మేటి. కూలీలకు సరిగా డబ్బివ్వడు. అతని భార్య మహాలక్ష్మిలాంటిది. బ్రాహ్మణులయందు భక్తిన్నీ, పేదలయందు ఆదరాభిమానములున్నూ కలిగిన మహాసాధ్వి. భర్తమాటను కాదని ఎరుగని ఇల్లాలు. ఆమెకు వెంకటేశ్వరస్వామి వారి దయవల్ల ఒక్కడంటే ఒక్కడే కొడుకు పుడతాడు. వాడే మన కథానాయకుడు. చిన్నతనం నుండీ మనవాడు మాంచి తెలివైనవాడు. చకచకా పై చదువులలో కొచ్చేస్తాడు. ఒకరోజున పట్నం నుండి ఇంటికొస్తూ వొస్తూ, పొలాల మధ్య, నెత్తిమీద దుత్త పెట్టుకొస్తున్న ఓ అమ్మాయిని చూస్తాడు. ఈ అమ్మాయే కథానాయిక. ఇది మొదటి అంకం. ముందు ఇంతవరకూ డైలాగ్స్ పడేయ్. ఆ తరువాత సంగతి చూసుకొందాం' అని సలహా ఇచ్చాను కవికి.

ఇద్దరం కూచుని నాలుగురోజుల పాటు తంటాలు పడి, ఇంతవరకూ సంభాషణలు రాసిపారేశాం. తెర యెత్తగానే, కథానాయకుని తండ్రి, పెట్టీ బూర్జువా వేషంలో అటూఇటూ కోపంగా తిరుగుతుంటాడు. మీసాలు మెలేస్తూ ఉంటాడు. మధ్య మధ్య సైడ్ వింగ్‌లోకి చూస్తూ కోపంగా మాట్లాడుతుంటాడు. క్రమంగా నలుగురైదుగురు కూలీలు రావడం, వాళ్లు కూలీ అడగడం, మనవాడు దొంగలెక్కలు చూపడం, వాళ్లు కాదనడం, నానాగొడవ జరగడం. కోపంతో మనవాడు, తెరలోపలికి వెళ్లగానే అటునించి కథానాయకుని తల్లి, మహాసాధ్వి రావడం, కూలీలందరూ, 'భూదేవి, మహాలక్ష్మి, శాంతమ్మ, బంగారుతల్లి' అంటూ దణ్ణాలు పెట్టడం, ఆమె కూలీల మాటలనే మనస్సాక్షిగా నమ్మి, వారికి రావలసిన లెక్క ప్రకారం కూలి డబ్బులిచ్చి పంపేయడం, ఆఖర్న 'అబ్బాయింకా రాలేదే' అనడంతో తెరపడుతుంది.

రెండవ రంగంలో, కథానాయకుడు వాసు. కథానాయిక సుమతి దోవలో ఎదురౌతారు. ఆ పిల్లను చూసీ చూడడంతోనే వాసు ప్రేమించేస్తాడు. బూర్జువా కుర్రవాడు అంత పని చేశాక, నేను మాత్రం ఊరుకుంటానా అన్న ధోరణిలో సుమతి అంతకు రెండింత లెక్కువగా ప్రేమించేస్తుంది. ఆ పిల్ల, ఆ పిల్లవాడికి సూట్‌కేస్ అందిస్తుంది. ఆ పిల్లవాడు ఆ పిల్లనెత్తిన దుత్తపెడతాడు. ఆ చిన్నవాడటూ, ఈ చిన్నదిటూ వెళ్లిపోతారు. కర్టెన్‌డౌన్!

ఇంతవరకూ భేషుగ్గానే ఉందనుకోవోయ్! ఆ తరువాత కథ నేంచేసేటట్టు? అన్నాడు మాకవి.

'ఇంకా ఏం చెయ్యడమేమిటి? తండ్రీ కొడుకుల మధ్య వచ్చేసీనులో ఘర్షణ తీసుకురావాలి. తండ్రి యాభైవేల కట్నం, పాతికెకరాల మాగాణీ, ఓ మోటారు  కారు, అదనంగా ఇంకో మోటారు సైకిలూ-కాక-పై చదువులకు ఇంగ్లండు పంపించే ఏర్పాటు మీద ఓ సంబంధం మాట్లాడుకొచ్చాడు. వాసు వొప్పుకోడు, తన హృదయం ఏనాడో ఇంకొకరికిచ్చేశా నంటాడు. ఇచ్చిందాన్ని తీసుకోవడం తన వల్ల కాదంటాడు. లౌక్యం తెలిసిన తండ్రి, అప్పటి కూరుకుని, ఆ తరువాత వేగుమనుషుల్ని పెట్టి అసలు సంగతి కూపీ తీయిస్తాడు. సుమతి దీనికి ప్రధాన కారకురాలని తెలిసిపోయింది. సుమతి తండ్రి తనకు ఆరువందలు బాకీ ఉన్నాడు. అదిప్పుడు కట్టమని వాసుతండ్రి నిక్కచ్చివేశాడు. ఈలోగా అతను ఇంకో కూలీ భార్యను తప్పుడు మాటలనడంతో కూలీలందరూ సమ్మెచేస్తారు. ఆ సమ్మెకు వాసు నాయకుడు. వాసు తండ్రి బస్తీ నుంచి గూండాలను పిలిపించుకొచ్చాడు. వాళ్లు గ్రామాన్నంతా అల్లకల్లోలం చేస్తూ ఉంటారు. ప్రజలందరూ వాసు తండ్రికి వ్యతిరేకంగా, ఐక్యంగా నిలబడతారు. కర్రవెళ్లి గొడ్డలితో చేరడంతో వాసు తండ్రి చేయగలిగిందేమీ లేకపోయింది. చివరికి వాసుకూ, సుమతికీ పెళ్లవడంతో నాటకం క్లోజ్'.

రాతపనులు పూర్తయ్యేసరికే రెండు మాసాలు పట్టింది. ఆ తరువాత ఊళ్లో  ఉన్న కుర్రకారుని పోగేసి నాటకం చదివి వినిపించాను. అందరూ బాగానే ఉందన్నారు. కాని, నామమాత్రం సంతృప్తికరంగా లేదు. ఎందుకంటే, నాటకమయ్యేలోగా  ఎనిమిదిసార్లు తెరపడుతుంది. ఇన్ని రంగాలుండకూడదని నా ఉద్దేశం! కొన్ని కొన్ని సీన్లు పావుగంటను మించి ఉండవు. అటువంటివి వెంటవెంటనే మూడుసీన్లున్నాయి. ప్రతి పావుగంటకూ తెరపడి లేస్తూ ఉంటే, చూసేవాడి ప్రాణం విలవిలలాడిపోదా మరి! అదీగాక, మూడుగంటల సేపు నడిచే నాటకంలో, ఒక్క పద్యం లేదు. కనీసం ఒక్క పాట కూడా లేదు. వంద పద్యాలకు వొక్కటి తక్కువైనా ఒప్పుకోని ప్రేక్షకుల ముందుకు, అసలు పద్యమనేదే లేని నాటకం తీసుకెడితే చూస్తారా?

ఈసారి నేనే కూచుని నాటకాన్నంతా తిరగరాశాను. మళ్లా కొత్త నాటకం రాసినంత పనయింది! మొత్తం నాటకాన్ని నాలుగు సీన్లలోకి కుదించాను. తెరపడి, తిరిగి లేవడానికి మధ్యకాలంలో, అయిదారు నిమిషాల కన్నా వ్యవధి ఉండకుండా చూశాను. అంటే రంగస్థలంలో పెద్దమార్పులంటూ ఏమీ  ఉండకూడదన్నమాట!

కవినిపట్టుకొని పదిపద్యాలూ నాలుగు పాటలూ రాయించాను. మా వాళ్లందర్నీ పిలిచి, మరోసారి వినిపించాను. 'బ్రహ్మాండం' అన్నారందరూ.

మొదటి నాటకమూ బాగుండి, ఇదీ బాగుండే పక్షంలో మా సమాజానికి అసలు 'బాగు' అంటే ఏమిటో తెలియదేమోననిపించింది. ఏమైనా ఉన్న మనుషులు వీరు.  నాటకాలాడదలుచుకుంటే వీరితో ఆడాలి లేదా మానుకోవాలి. మరోదారి లేనే లేదు.

ఇంతవరకూ జరిగింది వొకెత్తు, ఇక ముందు జరగవలసినది మరొకెత్తు . అంతకు ముందు,

మాలో ఎవరికీ నాటకానుభవం లేనేలేదు. అథవా ఉండడమంటూ జరిగితే- అంతో ఇంతో నాకే ఉంది. సూర్యనారాయణ మేష్టారి దగ్గర చదువుకునేటప్పుడు 'భక్త శ్రీయాళ' 'సతీ అనసూయ'-'ధృవవిజయం'-'రామవనవాసం' వగైరా నాటకాలను ఆడినమాట నిజమే? ఎప్పుడో పదిహేనేళ్ల క్రిందట ఆడిన నాటకాల తాలూకు జ్ఞాపకాలు కూడా నాకంతగా ఉపయోగపడలేదు.

ఆ రోజుల్లో రంగులక్కూడా మా దగ్గర డబ్బులుండేవి కావు. కాకిచిప్పలు కాల్చి, వేడివేడిగా ఉన్నప్పుడే నీళ్లు చల్లి, మెత్తగా నూరేవాళ్లం. ఆ చూర్ణాన్ని వాజ్‌లైన్‌లోగానీ, కొబ్బరినూనెలోగానీ కలిపి ముఖాలకు పూసుకొనేవాళ్లం. వెంకట్రామయ్య మాకు మేకప్ చేసేవాడు. విగ్గులను కూడా మేమే తయారుచేసుకొన్నాం. జనపనారను సన్నగా పాయలు పాయలుగా తీసి, సిరాలో ముంచి ఎండబెట్టి, ఆ పీచుల్నే మడిచి, విగ్గుల కింద మార్చుకునేవాళ్లం! తెరలకు బదులు దుప్పట్లు వాడేవాళ్లం! ఏదో అయిందనిపించి, చూసేవాళ్ల చేత, మెప్పులు కూడా పుచ్చుకొనేవాళ్లం!

కానీ అవన్నీ ఇప్పుడెలా కుదురుతాయి? ఆ అనుభవాలు ఈ నాటక ప్రదర్శనలో ఎందుకూ పనికిరావని. నాకు బాగా తెలుసు. కాకపోతే, ఆ విధంగా నాటకాలాడవలసిన పరిస్థితే కలిగితే అంతకన్నా మానుకోవడమే ఉత్తమం! నాటకం ఆడితే బ్రహ్మాండంగా ఆడాలి. లేదా తోకముడుచుక్కూచోవాలి. అంతే!!

'ఇంతాచేసి, ఇప్పుడిలా నీళ్లుకారిపోవడం నాకేమీ బావుండలేదు. మనకేం కావాలో నువ్వు చెప్పు వాటిని సాధించడం నాకు విడిచిపెట్టు'- అన్నాడు రామచంద్రం.

వాడు మాట జారడేగాని, అన్న తరువాత నిలబెట్టుకొంటాడని నాకు తెలుసు.

'చిన్నికన్నడూ! నాటకం అద్భుతంగా తయారయింది. పేరు కూడా పెట్టేశాను'.

'ఏం పేరు?' అన్నాడు రామచంద్రం.

'ప్రజావిజయం' మరింక నువ్వు పేచీపెట్టకు. అన్ని సంగతులూ, ఆలోచించాకనే ఈపేరు ఖాయం చేశాను అన్నాను.

'అయితే ఇంకేంరా! నాటకం ఎప్పుడేద్దామంటావ్? ఓనెలరోజులు ముందు నుండి మంచి పబ్లిసిటీ ఇవ్వాలి. గుంటూర్లో నాకు తెలిసిన ప్రెస్సొకటి ఉంది. వాళ్లనడిగి నోటీసులు కొట్టించేస్తాను. మన వాళ్లందర్నీ వెంటేసుకొని, చుట్టుప్రక్కల ఊళ్లలో తడికలు కట్టేస్తాను. గోడలమీద రాయిస్తాను. సరా?' అన్నాడు వాడు చిటికెలు వేస్తూ.

వాడి తొందరపాటు చూస్తుంటే నాటకం, మరో పదిరోజుల్లో ఆడకపోతే, ప్రాణాలు తినేస్తాడేమోననిపించింది.

'అదికాదురా నీ బండపడ! ఇంతవరకూమనం, పోర్షన్లు రాసుకోవడమే కాలేదు. ఈపనికావడానికి ముందు, ఎవరెవరు, ఏ వేషాలు వేయాలో అనుకోవాలి. అథమపక్షం పాతికముప్పయ్ రిహార్సల్సన్నా పడాలి. ఇవన్నీ ముందు సక్రమంగా జరగాలి గదా!' అన్నాను.

వాడూ 'జరగవలసిందేనని వొప్పుకొన్నాడు. ఈరాత్రే అందరం కలుసుకొందామనీ, ఎవరెవరు ఏం చదవాల్సిందీ నిర్ణయిద్దామనీ వాడన్నాడు. ఎవరింట్లో కలుసుకొందామన్నాను. వాడు కాస్సేపు ఆలోచించి 'బళ్లో కలుసుకొందా'మన్నాడు. నాకూ ఆ సూచన బాగానే నచ్చింది. నెలరోజుల పాటు ఏకధాటిగా జరిగే రిహార్సల్స్‌కు బడికన్నా అనువైన చోటు లేదు.

ఒ గంట అటూఇటూగా అందరూ వచ్చారు. అనవసరమే అయినా, నాటకంలోని పాత్రల్ని వోసారి చెప్పి, ఎవరెవరు ఏయే వేషాలు వేస్తే బావుంటుందో తేల్చండన్నాను. రభస మెల్లగా

ప్రారంభమయింది. ఉన్న పదిమందికీ మంచి వేషాలే కావలసి వచ్చాయి. చిల్లర వేషాలకు మనుషులే దొరకలేదు.

'అబ్బాయిలూ! ఇలా అయితే మనం వొక్కనాటికీ నాటకం ఆడలేం. మనందరి ఉద్దేశమూ, నాటకం బాగా ఉండటమే గానీ, ఏ వెంకయ్యో, పుల్లయ్యో గ్రాండ్‌గా నటించటం కాదు. నాటకం బాగా ఉండేందుకు -అందులో ఉన్నవారందరూ కలిసికట్టుగా పనిచెయ్యాలి. ఎవరి దారిన వారు పెడలాగితే, నాటకం-కుక్కలు చింపిన విస్తరిలాగా తయారవుతుంది! ఆ తరువాత మీ ఇష్టం!'' అన్నాను.

తెగిందాకా పురిపెట్టడం మంచిది కాదనుకొన్నారో ఏమో ఇష్టమున్నా లేకపోయినా, అందరూ మెదలకుండా ఊరుకొన్నారు. ఇప్పుడు వేషాలు పంచవలసిన బాధ్యత నామీద పడింది. ఇలాంటి సందర్భాల్లో బరువంతా ఏవొక్కడి నెత్తినో ఉండటం మంచిది కాదని నాకు తెలుసు. అందుకని, నేను రామచంద్రాన్ని గూడా సాయం తీసుకొన్నాను.

వాసుగా కోటేశ్వరరావు, వాసు తండ్రిగా నేను, సుమతిగా రామచంద్రం, సుమతి తండ్రిగా నాగభూషణం, వాసు తల్లిగా నరసింహారావు చదవాలనుకొన్నాం. శ్రీరాములు హార్మోనిస్టుగా పనిచేస్తానన్నాడు. నన్ను డైరెక్టు చెయ్యమన్నారు. వారం రోజుల్లోగా పోర్షన్లు రాసుకోవడమే కాకుండా కంఠతా కూడా రావాలన్నాను. వచ్చే బుధవారం నుండి, ప్రతిరోజూ రిహార్సల్స్ ఉంటాయనీ, ఏ పరిస్థితిలోనూ, వాటిని దాటేయడానికి చూడకూడదనీ అనుకున్నాం. అందరం సరేనంటే సరేననుకొన్నాం. అప్పటికో గండం గడిచింది!

''నాటకం గొప్పగా వెయ్యొచ్చురా బ్రదర్! నేను చెబుతున్నాను చూడు! వేలు కురుస్తాయనుకో!'' అన్నాడు రామచంద్రం.

''నీనోటి చలవ వలన అంతపనీ జరగాల్నే గానీ- మన సూరిగాడికి తప్పకుండా ఏమన్నా ముట్టచెబుదాం. వాడిచేత నాటకం రాయించుకొన్నా. చిల్లికానీ ఇవ్వలేదు. వాడైనా అడిగిన పాపాన పోలేదనుకో. ''నాలుగు డబ్బులొస్తే-నిన్ను అన్యాయం చెయ్యనురా బాబిగా'' అని చెప్పా. ''సరే'' అన్నాడు. మనమెంత గింజుకు చచ్చినా, నాటకంలో పసలేకపోతే ఇట్టే నీళ్లు కారిపోతుంది. ఏమంటావ్?'' అన్నాను.

వాడేమీ అనలేదు.

''ప్రజా విజయం'' రిహార్సల్స్ అనుకొన్న రోజున కాకుండా మూడోరోజున మొదలయ్యాయి. సరిగ్గా పోర్షన్లు రాకపోవడం వల్లా వచ్చినవారికైనా, ఏ డైలాగ్ తరువాత ఏ డైలాగ్ అనాలో తెలియకపోవడం వల్లా, ఒక్క సీనన్నా జరగలేదు. పోర్షన్లు రానివాళ్లమీద రామచంద్రం కేకలేశాడు.

''అనుకొన్న పన్లు అనుకొన్నట్టుగా ఠంచన్‌గా జరగాలోయ్! వారం రోజులకల్లా పోర్షన్లు రావాలంటే, వచ్చితీరాల్సిందే. అంత ఖచ్చితంగా ఉంటే తప్ప పనులు కావు'' అన్నాడు రామచంద్రం.

కోటేశ్వరరావుకు మనవాడి ధోరణి నచ్చినట్లుగా లేదు.

''నీకంటే -సంపాయించి పెట్టే బాబుగాడొకడున్నాడు గనక గడుస్తుంది. మరి మా సంగతేమిటి? పగలల్లా ఏదో పనిచేసుకోవాలి. నాటకాలాడటమే మన వృత్తికాదుగా!'' అన్నాడు కోటేశ్వరరావు.

''ఇంతవరకూ కాని మాట నిజమే గానీ, ఇక ముందు కాగూడదనేదేమీ లేదుగా!''అన్నాడు రామచంద్రం.

''ఇకముందెప్పుడో, ఏదో వొరుగుతుందని ఇప్పట్నించే మాడిచావడం నావల్లకాదు. పోర్షన్లు

వొచ్చిన్నాటికే వస్తుంది. నన్ను సతాయిస్తే లాభం లేదు. మీకిష్టం లేకపోతే, నన్ను తొలగించండి'' అన్నాడు కోటేశ్వర్రావు.

''నీ ముష్టిబెదరింపుల కిక్కడ జడుసుకొనేవాళ్లెవరూ లేరు. నువ్వు లేకపోయినా నాటకం పడుతుంది. బహుళా గొప్పగా కూడా ఉంటుందేమో! నీలాంటి తోకపీకుడుగాళ్ల వల్ల ఎప్పుడూ ప్రమాదమే!'' అన్నాడు రామచంద్రం కాస్త గొంతు పెంచి.

కోటేశ్వర్రావు పోవడానికి లేచాడు. నేను సర్దిచెప్పినా ఉపయోగం లేకపోయింది. కోటికాస్త మెత్తబడేవేళకు చంద్రంగాడు పేట్రేగిపోవడం సాగించాడు. ఈ ఇద్దరిలో ఎవరో వొక్కరుండాలే తప్ప, ఇద్దరూ సమాజంలో ఉండటం సాధ్యం కాదని కాప్పుడే అనిపించింది. కోటిని వొదులుకొని,, రామచంద్రాన్ని సమాజంలో ఉండమన్నాను. ఆ రోజున నేను తీసుకొన్న ఈనిర్ణయం వల్ల భవిష్యత్తులో ఊహాతీతమైన మార్పులు జరుగుతాయని ఎవ్వరూ అనుకోలేదు. నేనూ అనుకోలేదు. పదేళ్ల తరువాత నేనూ కోటీ గుంటూర్లో ''దేవకన్య'' సినిమా చూస్తున్నప్పుడు ఈ మాటే అనుకొన్నాం.

ఈ గొడవ ఇంతటితో ఆగిపోలేదు. కోటేశ్వరరావు, ఆ క్షణం నుండే మాసమాజం మీద కత్తిగట్టాడు. మాకు పోటీగా ఇంకో సమాజాన్ని ఏర్పాటు చేశాడు. దానికి వాడే డైరెక్టర్. గుంటూరు వెళ్లి పాతిక నాటకాలు కొనుక్కొచ్చాట్ట. వారం రోజుల పాటు వాటినన్నింటినీ చదివాట్ట. అందులోంచి మాంఛి నాటకాన్నొకదాన్ని ఎన్నికచేసి, పోర్షన్లు కూడా తనేరాసి సిద్ధంగా ఉంచాట్ట. ఈ సంగతులన్నీ ఎప్పటికప్పుడు మాకు తెలుస్తూనే ఉన్నాయ్. అయినా వాణ్ణి ఆపటానికి నేను ప్రయత్నం చేయలేదు.

''ఇప్పుడేమంటావురా?'' అన్నాను రామచంద్రంతో.

''వాడు నాటకం వేసినప్పుడు చూస్తాను. వాడి ముఖంకాదూ! వాడేమిటీ? నాటకం వేయడమేమిట్రా?'' అన్నాడు రామచంద్రం.

కోటేశ్వరరావు నాటకం వేయలేడన్న అనుమానం- అనుమానమేమిటి గట్టి నమ్మకమే- రామచంద్రానికి ఎందుక్కలిగిందో నాకైతే తెలీదు. వాడా నమ్మకంలో ఉంటుండగానే జరగవలసిన పనులన్నీ జరుగుతున్నాయి. కోటిగాడి సమాజం వాళ్లు జోరుగా రిహార్సల్స్ వేస్తున్నారని కూడా నాకు తెలిసింది. సంక్రాంతి నాటికి, ఆరునూరైనా నూరుఆరైనా సరే నాటకం వేసితీరతారన్నట్టు నాకు తెలిసింది. పనీపాటా మానేసి వాడీపనిలోనే ఉంటున్నాడన్నారు.

''దీన్ని బట్టి చూస్తే వాడెంత తుచ్ఛుడో తెలిసిపోవటం లేదా? పోర్షను రాలేదేమని మనమడిగితే అలా సమాధానం చెప్పిన పక్షిగాడు, ఇప్పుడీ పనంతా ఎలా చేస్తున్నాట్ట?'' అన్నాడు రామచంద్రం.

''అదా మనకిప్పుడు ముఖ్యవిషయం? దీన్ని చర్చిస్తూ కూచుంటే పుణ్యకాలం కాస్తా దాటిపోతుంది. మనం వాడికన్నా ముందుగా నాటకం ఆడాలి. ఇప్పటికే మన సమాజంలోంచి ముగ్గురు జారుకున్నారు. మరో వారం రోజు లాగితే, ఉన్న నలుగురూ పోతారు. అప్పుడు నువ్వూ నేనూ తప్ప మిగిలేదెవరూ ఉండరు''. అని విసుక్కొన్నాను రామచంద్రం మీద.

అప్పటికి గానీ వాడికి వేడి పుట్టలేదు. జారిపోయినవాళ్లను తిరిగి లాక్కొచ్చాడు. తను హీరోవేషం వేస్తానన్నాడు. హీరోయిన్‌గా గుంటూరు నుంచి ఎవర్నన్నా కొట్టుకొద్దామన్నాడు. అవసరమైతే, తను నాలుగైదొందలు పెట్టుకుంటానన్నాడు. బ్రహ్మాండం తలకిందులైనా సరే-ఇది జరిగి తీరుతుందన్నాడు.

రామచంద్రం మాటలపోగు కాదని నాకు తెలుసు. వాడు అన్నమాటను అక్షరాలా నిలబెట్టుకున్నాడు.

మేము గుంటూరు నుంచి ఓ అమ్మాయిని తీసుకురావటానికి నిశ్చయించుకొన్నామన్న సంగతి

కోటి ముఠాకు తెలిసింది. వాళ్లూ ఇంకో అమ్మాయిని తీసుకొస్తామన్నారు. కానీ ఆ పని జరగలేదు. ఆ సమాజానికి డబ్బులేదు. మాకుంది. ఉన్నదంటే రామచంద్రంగాడిచ్చాడు. కోటిముఠా మీద కోపమే లేకపోతే, వాడినించిపైసా రాలడానికి నల్లమేక తెగాల్సిందే!

ఓ రోజు సాయంత్రం ఆరుగంటలకు రామచంద్రం, మా ఇంటికొచ్చాడు. వాడివెనకాల పదిహేను, పదహారేళ్లమ్మాయొకతున్నది. ఆపిల్లకు వెనగ్గా నలభైఏళ్ల 'అమ్మాయి' ఇంకోతున్నది.

''మంగమ్మరా!'' అంటూ ఆపిల్లను-చిన్నపిల్లను-పరిచయం చేశాడు రామచంద్రం. ''ఈవిడ నాగమణి-బళ్ళారి రాఘవాచారి ట్రూపులో పనిచేసిందట. ప్రస్తుతం గుంటూర్లో ఉంటుంది. మంగమ్మకు-''

మంగమ్మ ''నమస్తే'' అన్నది. నాగమణి ''నమస్తే'' అనడమే కాకుండా, ఆ కాసేపట్లోనూ, ఓ లవ్ సీనులో నాయకి చేసినంత అభినయం చేసింది. అయిదారుసార్లు కళ్లు టపటపలాడించి, రెండుమూడుసార్లు పమిటెను విదిలించి వేసుకుని, మరో రెండుసార్లు కుచ్చెళ్లు దులుపుకుని, అప్పుడు తీరిగ్గా నవ్వింది.

''సోడా దొరుకుతుందా బాబూ!'' అన్నది నాగమణి.

''ఈ వెధవ్వూళ్లో సోడా ఉండ''దన్నాడు రామచంద్రం.

నాగమణి ఏమనుకుందో ఏమోగానీ పైకి మాత్రం ''పోన్లెండి'' అన్నది.

మనిషి ముఖం చూడగానే, ఆ వ్యక్తి గుణగణాలన్నీ ఇట్టే తెలుసుకోవచ్చుననడంలో నాకు నమ్మకం లేదు. సంవత్సరాల తరబడి కలిసిమెలిసి ఉండే భార్యాభర్తలు చావబొయ్యే నాటిక్కూడా ఒకరికొకరు అర్థంకాని సందర్భాలు నాకుతెలుసు కాని, నాగమణిని గురించి, నాకప్పటికప్పుడే కొన్ని అభిప్రాయాలేర్పడ్డాయి. ఆ తరువాత జరిగిన సంఘటనలు, నాకేర్పడిన అభిప్రాయాలను బలపరిచాయేగానీ, రహితం చెయ్యలేదు.

మనం అడిగినా అడగకపోయినా, నాగమణి తన అనుభవాలన్నింటినీ చెప్పుకొస్తుంది.

''ఒకసారి చిట్టివలసలో చింతామణి వేస్తున్నాం బాబూ! రాఘవాచారి గారు భవానీశంకరుడు, పెద్దిబొట్ల బిల్వమంగళుడు. రాజమండ్రి శాస్త్రిగారు సెట్టిగా వేశారు. మేం నాటకం వేస్తున్నామని తెలిసి విజయనగరం మహారాజావారు సకుటుంబంగా వచ్చారు. నాటకం మధ్యలోనే కలగజేసుకుని నన్ను గురించి చిన్న ఉపన్యాసం కూడా ఇచ్చారు. ఆ తరువాత విజయనగరం పిలిపించుకున్నారు. నన్ను దివాణంలో ఉండిపొమ్మన్నారు. నేనే ఒప్పుకోలేదు'' అనేది నాగమణి.

''తుమిడాం కుమార్రాజా వారు చేటంత వెండిపళ్లెంలో, ఇంతెత్తున రూపాయలు పోసి దానిమీద కాశీపట్టుచీర కప్పి నాకు పంపించారు. వాటిని తెచ్చినవాణ్ణి, పంపినవాణ్ణి కూడా ముఖం వాచేలాగా చీవాట్లు వేసి పంపించాను''.

''ఒకసారి స్థానం వారు నా వేషం చూసి, దంగైపోయారు. మాధవపెద్ది వెంకట్రామయ్యగారి నడగండి-కావలిస్తే. చింతలపూడి రాణీగారు తిమ్మాజీ, కౌసల్యాదేవిగారు తనతో కబుర్లు చెబుతూ కూచోమని, నెలకు రెండొందలిస్తాననీ స్వయంగా గుంటూరొచ్చి అడిగిన సంగతి అందరికీ తెలుసు, కానీ నేనొప్పుకోలేదు. బరోడా దివాన్, బావాజీ రావుగారు నాకోసం గుంటూరు ప్రత్యేకంగా వారం రోజుల పాటు ఉండిపోయారు. ఏమిటోలెండి, ఆరోజులే వేరు!!''

మధ్యలో నేను కలగజేసుకోకపోతే ఈ ప్రవాహం ఆగేటట్టు కనపడలేదు. ఏదో పనున్న వాడిలాగా, అవతలికెళ్లి రామచంద్రాన్ని గట్టిగా కేకవేశాను.

“ఈ మంథర్నెందుకు తెచ్చావురా బాబూ! నాకు తల్లోల నాదు పుట్టుకొస్తున్నది. దీన్ని భరించడం కష్టమే!” అన్నాను.

“ నాలుగైదు సార్లు ఈవిడా వెంట వస్తుంది. వయసులో ఉన్న పిల్లను ఒంటరిగా మనవెంట పంపడానికి భయపడింది! మనమీద నమ్మకం కలగాలి. కలిగేలాగా మనం ప్రయత్నించాలి.

“నువ్వు తొందరపడి మంగమ్మను ఏమన్నా చేసేవు! కాస్తవోపిక పట్టు. అన్ని విషయాలు నేను చూసుకొంటాను. అది సరేగానీ వొరే! మంగమ్మెలా ఉందంటావ్?” అన్నాడు మళ్లీ రామచంద్రం.

ఆ మాటలంటున్నప్పుడు, వాడు బుసలు కొట్టడం నేను గ్రహించాను.

“చూడ్డానికి బాగానే ఉందే?” అన్నాను.

“బాగానే” అంటావేమిట్రా చిట్టితండ్రీ! పచ్చి కొబ్బరిముక్కలాగా లేదుట్రా! ఇంకా వ్యవహారంలోకి దిగినట్లు లేదు. అయినా ఈ ముండల్నెవరు నమ్మొచ్చాడుగానీ...అబ్బిగా, చవగ్గా కొట్టుకొచ్చావనుకో! నెలకు పది రిహార్సల్స్ చొప్పున, రెండు మాసాలు రావాలి. రానూపోనూ ఖర్చులు మనమే భరిస్తున్నాం. నాటకానికి యాభై చొప్పున, ఎన్నాడితే అన్ని యాభైలిస్తున్నాం. ఇంకా కాంట్రాక్టు రాసుకోలేదన్న మాటేగానీ అనుకొన్న షరతులివి. మరి నీ ఉద్దేశమేమిటి?” అన్నాడు రామచంద్రం.

“అంత డబ్బు మనం పెట్టుకోగలమట్రా?” అన్నాను వాడితో.

వాడోసారి కళ్లెగరేసి, కుచ్చెళ్లతో ముఖమంతా తుడుచుకొన్నాడు.

“చూద్దాం-సమాజం భరించలేకపోతే, నేనే పెట్టుకుంటాను. నువ్వు డబ్బు ముఖమే చూస్తున్నావు గానీ, ఆర్టిస్టుని చూస్తున్నట్టు లేదు. మంగమ్మ ముడిరత్నం లాంటిది. దాన్ని సానబెట్టి ఎలా మెరిపిస్తానో చూస్తుండు” అన్నాడు రామచంద్రం.

ఈ దశలో వాణ్ణి కాదన్నా ప్రయోజనముండదు. కనుక నేనా మాటనలేదు. అదీగాక డబ్బు పెట్టుకునేది వాడుగాని నేను కాదు. మధ్యలో నాదేం పోయింది కనక, వాడి మనస్సు నొప్పించడానికి!

“అయితే ఓపని మాత్రం చెయ్యరా బాబూ! ఈమంథరను తీసుకురాకు. తెచ్చినా దాన్ని కూడా నీతోనే ఉంచుకో. నామీదికి తోలావంటే నేను భరించలేను” అన్నాను.

ఆ రాత్రి మా రిహార్సల్స్ రూము జనంతో కిటకిటలాడిపోయింది.

అందరూ పోర్షన్లు చూస్తూనే రిహార్సల్ చేశారు. రామచంద్రం పని ఊపిరి తిరక్కుండా ఉంది. తమ హీరోనన్న సంగతిని మరచిపోయి వాడే మిగతా వారిని డైరెక్టు చెయ్యడం ప్రారంభించాడు. మంగమ్మ తనను గమనిస్తునదనుకొన్నప్పుడు మనవాడు మరికొంత గొంతు పెంచేవాడు. కసురుకొనేవాడు. చిత్రమేమిటంటే వాణ్ణెవ్వరూ అదుపులో ఉంచడానికి చూళ్లేదు. రాత్రిపన్నెండు గంటల కల్లా రిహార్సల్ పూర్తయింది.

జనమింకా వెళ్లలేదు. మా జీతగాడు ఓచెంప నించి చాపలు చుట్టుకొస్తున్నాడు. మంగమ్మ, నాగమణి, బడి వరండాలో కొచ్చారు. నలభై యాభై మంది కుర్రకారు పెద్దవాళ్లుకూడా వాళ్లను చుట్టేశారు.

“వెళ్లండ్రా బాబూ! మా ముఖానేమన్నా  కోతిలాడుతున్నయ్యా?” అన్నది నాగమణి.

“యహ పదండశ” అన్నారెవరో.

“ఇల్లాగయితే మాకు చాలా కష్టమండీ! మా అమ్మాయి రాదు. ఈగల్లా ముసురుకుంటే ఎట్లాగండీ?” అన్నది నాగమణి.

“ఓరి వెంకటేశ్వర్లూ! ఇక పోండిరా వెధవల్లారా!” అని కేకపెట్టాడు రామచంద్రం. “ఆడదాని

ముఖం ఎరగనట్లు అట్లా చూస్తారేమిట్రా?''

''ఆడదాని ముఖం ఎరక్క కాదు, నాటకాలాడే దాని ముఖం మనవాళ్లు చూడటం ఇదేగా మొదలు? నాలుగైదు రిహార్సల్స్ కిల్లాగే వస్తారు. వీరిని కసురుకోకు. రేపు మన నాటకానికి డబ్బివ్వలసింది. వీళ్లే!'' అన్నాను.

నాగమణి నాలుగైదు రిహార్సల్స్ కొచ్చింది. వచ్చినప్పుడల్లా మా ఇంట్లోనే దిగేది. ఒకసారి నాతోబాటు పొలం కూడా వచ్చింది. జొన్నచేలు,నిలువుటెత్తున్న పెరిగి 'జుయ్' మంటున్నాయి. ఊచబియ్యం కొట్టిచ్చాను. అరడజను ఏపుదోసకాయలు కోసిచ్చాను. ఇంతసేపూ నాగమణి ఏదో మాట్లాడుతూనే ఉంది.

''నేనో ఇబ్బందిలో ఇరుక్కొన్నానండీ!'' అన్నదావిడ రెప్పలు టపటపలాడిస్తూ చెప్పమన్నాను.

''నాకో రెండొందలుకావాలి. ప్రాణం మీది కొచ్చింది. మళ్లా మీ డబ్బు ముద్దరసుద్దిగా చెల్లుగడతాను. మీ రుణాను పోనులెండి. నేనున్నాను. చేతిలో పిల్ల ఉంది. ఎలాగైనా తీర్చుకోగలం. ఈ మాట అడగడానికే మిమ్మల్ని పొలం తీసుకొచ్చాను'' అన్నది నాగమణి.

అప్పుడు నేనేమన్నా వ్యవహారం బెడిసికొట్టేలాగా ఉంది.

''చూద్దాం'' అన్నాను.

''అలా అంటే కాదు. మీరు నాకు ప్రామిస్ చెయ్యాలి. అందాగా వదల్ను''.

ఆ తరువాత ఏం జరిగిందన్నది అంత ముఖ్యం కాదుగానీ, నేను మాత్రం రెండొందలూ నాగమణి కిచ్చాను.

''ఇలా ఇచ్చానని మంగమ్మతో అనకండి. మీరూ అనరనుకోండి. అయినా జాగ్రత్తకోసం చెబుతున్నా'' అన్నది నాగమణి నా వెనగ్గావొచ్చి, నన్ను అనుకొని నిలబడుతూ, నేనేమన్నా అంటానేమోనని కాస్సేపలానే ఉంది. రెండుమూడు సార్లు నాగమణి చేతులు కదలడం కూడా నేను చూశాను. నేను పర స్త్రీ పరాజ్ముఖుణ్ణి కాదు గానీ, నాగమణిని చూస్తే నాకెందుకో చెప్పరానంత భయం మాత్రం కలిగింది.

నాలుగైదు వారాల పాటు నాగమణి కూడా మా వూరొచ్చింది. పేరేమో మంగమ్మకు తోడుగా ఉండటం, కానీ ఆవిడ ఆ పని కూడా చేస్తున్నట్టు లేదు. కంటిక్కాస్త నదరుగా కనిపించిన ప్రతివాడితోనూ తనను గురించీ, తన ప్రతిభను గురించీ వైనవైనాలుగా చెప్పుకునేది. అవతలివాడు వింటే సరేసరి, లేదా మంగమ్మను గురించి చెప్పుకొచ్చేది.

ఒకసారి మంగమ్మను మా దగ్గర వొదిలి ఇప్పుడే వొస్తానని వెళ్లిన వెళ్లడం, మొన్నాడు ఉదయానిగ్గానీ నాగమణి రాలేదు. ఎక్కడికెళ్లానని నేనడగనూ లేదు, ఆవిడ చెప్పనూలేదు. రెండు రోజుల తరువాత భూషయ్యగారి పెద్దరామయ్య కనిపించి, నాగమణిని గురించి వాకబు చేశాడు. విచారించగా తేలిందేమిటంటే నాగమణి మాయమైన రోజున పెదరాయమ్యగాడు ఇంట్లో పడుకోలేదు. గొడ్లకాడి చిన్నాణ్ణి వాముల దగ్గరికి పంపించి, తను సావిట్లో పడుకొన్నాట్ట. పెదరామయ్య పెళ్లానికి ఈ సంగతి తెలిసి నన్నూ మా సమాజాన్నీ దుమ్మెత్తి పోస్తోందిట!

నాగమణి మూలంగా ఇటువంటి చెడ్డపేరు కలగడం నాకిష్టం లేదు. నాగమణి మహాపతివ్రత అన్న అభిప్రాయం నాకేనాడూ లేదు గానీ. ఇలా అచ్చుబోసినవతుగా తిరుగుతుందని కూడా నేననుకోలేదు. ఈ మాటే నేను రామచంద్రానితో అన్నప్పుడు వాడు కాసేపు నన్ను చిల్లులుపడేట్టు చూసి, ఆ తరువాత పెదవి విరుస్తూ నవ్వాడు. ''పెదరామయ్య మీద నీకు అసూయగా ఉంది

కాదుట్రా?'' అన్నాడు వాడు.

మొదట ఆ ప్రశ్న నాకు బొత్తిగా అర్థం కాలేదు. తీరా అర్థమయ్యాక రామచంద్రం అంతమాట నన్నన్నందుకు విచారం కలిగింది.

''అటువంటి దేమీ లేదురా! నా బాధ నాగమణి నాకు దక్కలేదనీ కాదు, పెదరామయ్యకు దక్కిందనీ కాదు. ఈ దౌర్భాగ్యురాలి మూలంగా వెధవ మాటలన్నీ పడాలిసొచ్చిందే అని బాధపడుతున్నాను. ఆడదంటే నాకు అయిష్టమనిగాదు గానీ,'' ఆ తరువాత నేను వాక్యం పూర్తి చెయ్యకుండానే వాడు వెళ్లిపోయాడు...

ఒకసారి మంగమ్మ ఒక్కతే రిహార్సల్స్ కొచ్చింది. ఎప్పుడూ కుందనం బొమ్మలా పకపకలాడుతూ ఉండే మంగమ్మ, ఆ రోజున మబ్బు కమ్మినట్టుగా ఉంది. ''ఏం జరిగిం''దని వొకటి రెండు సార్లడిగాను. ''ఏంలే''దని ఒకసారీ, ఒంట్లో బాగుండలేదని మరోసారీ చెప్పింది. అప్పటికి నేనూ ఊరుకొన్నాను. అసలు సంగతి రిహార్సల్స్ అయిన తరువాత గానీ బైటపడలేదు.

అందరూ ఇళ్లకెడుతున్నారు. మరో రెండుమూడు రిహార్సల్స్ తరువాత నాటకం వేయాలనీ, ఈలోగా మిగతా ఏర్పాట్లన్నీ చేసుకోవాలనీ రామచంద్రం తన సహజధోరణిలో చెప్పుకొచ్చాడు. నాటకం సక్సెస్ కావడం ఖాయమేనన్నాడు. మంగమ్మ కళ్లు చెదరేలాగ యాక్టు చేసిందన్నాడు. ఆవిడ ఉన్నంతకాలమూ, మన సమాజానికేమీ ఢోకా లేదన్నాడు.

''ఇన్నాళ్లు జరిగినంత పకడ్బందీగా ఇంకో రెండు రిహార్సల్స్ జరిగితే చాలు, నాటకం గుమ్మెత్తిపోతుంది!'' అన్నాడు వాడు, మంగమ్మ కేసి తిరిగి అదోలా నవ్వుతూ.

మంగమ్మ కూడా నవ్వింది. కానీ అది నవ్వులాగా లేదు.

రాను రాను రామచంద్రం నాకు అర్థంగాకుండా పోతున్నాడేమోననిపించింది. ఎందుకంటున్నానంటే, ఎంతో ఉద్వేగంగా నటించవలసిన రెండు సీన్సులోనూ మంగమ్మ కొయ్యబొమ్మలాగా నటించింది. ఎంతో సున్నితంగా భావాలను పలికించగల ఆ ముఖంలో ఆనాడు ఒక్క భావమూ ప్రస్ఫుటం కాలేదు. డైలాగ్స్ తప్పుపోకుండా చిలకలాగా వొప్పగించిందే కానీ అందులోని జీవాన్ని కంఠంలో పలికించలేపోయింది. అయినా రామచంద్రం మంగమ్మను ఎత్తేస్తున్నాడు. అంటే -దీని వెక ఇంకేదో గ్రంథమున్నదన్నమాట!

''మంగమ్మ మా ఇంట్లో పడుకొంటుంది లేరా!'' అన్నాడు రామచంద్రం.

మంగమ్మ ఓసారి రామచంద్రం కేసి ఆపాదమస్తకం చూసి సన్నగా నిట్టూర్చింది. ఆ తరువాత రెండు చేతులతోనూ కణతలు నొక్కుకొంటూ-

''అంత దూరం నేను రాలేను మాష్టారూ! ఈ పూట డైరెక్టరు గారింట్లో పడుకుంటాను'' అన్నదావిడ.

రామచంద్రం క్షణకాలం చకితుడయ్యాడు. వాడు మంగమ్మను మింగేసేలాగా చూశాడు.

''నాకీ పూట వొంట్లో బావుండలేదండీ! కడుపులో దేవినట్లుగా ఉంది. కళ్లు తిరుగుతున్నాయి. అయినా రిహార్సల్స్ ఆగిపోతుందేమోనని వచ్చాను'' అన్నది మంగమ్మ.

''నాగమణి రాలేదేం?'' అన్నాను నేను.

''రాలేదు'' అన్నది మంగమ్మ.

ఆ రాత్రి చాలా పొద్దుపోయిందాకా నేనూ,మంగమ్మా మాట్లాడుతూనే ఉన్నాము. మధ్యలో రెండుమూడుసార్లు లేచి, లేచినప్పుడల్లా గొణిగి, గొణుగుడు అయిన తరువాత కాండ్రించి ఉమ్మి,

ముసుగు పెట్టుకుని పడుకుంది మా ఆవిడ.

"చాలాకాలం నుండి నిన్నో సంగతి అడగాలనుకొంటున్నాను. నాగమణి నీకేమవుతుంది?" అన్నాను.

మంగమ్మ చాలా తెలివిగా ఎదురుప్రశ్న వేసింది-"మీరేమనుకొంటున్నారు?" అని.

"నేనేమీ అనుకోలేదు" అన్నాను.

"పోనీ ఎవరన్నా ఏమనుకోవచ్చునో చెప్పండి?" అన్నది మంగమ్మ.

"తల్లేమోననుకుంటారు."

మంగమ్మ కాసేపు మాట్లాడలేదు.

ఆ నిశ్శబ్దాన్ని నేను భరించలేక "నిద్రా?" అన్నాను.

"కాదు- ఈ రాత్రి నిద్రపట్టదనుకొంటాను" అన్నది మంగమ్మ మంచం మీద లేచికూచుంటూ. "ఏమిటో మాష్టారూ! నా అంత దిక్కుమాలిన ముండను నేనేగానీ, మరొకరుంటారనుకోను. నాగమణి నాకేమవుతుందో నాకే తెలీదు. కాని తల్లినని చెప్పుకొంటుంది".

"మీ అమ్మకాదా?"

మంగమ్మ బాధను అణచుకొంటూ నవ్వింది.

"మీరేమన్నా డబ్బిచ్చారా?" అన్నది మంగమ్మ. నేనడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పకుండా.

"ఇచ్చాను".

మంగమ్మ కాస్సేపు తలవంచుకుని నేలమీద, బొటనవేలితో గీతలు గీస్తూ కూచుంది.

"ఎప్పుడిస్తానన్నదండీ?"

బాకీని తీర్చే విధానం గురించి నాగమణి నాతో అన్న మాటలన్నీ జ్ఞాపకానికొచ్చాయి. 'నేనున్నాను. పిల్ల ఉంది. ఎలాగైనా మీ బాకీ తీర్చుకొంటానుగా' -అన్న మాటలు, అప్పటి నాగమణి ప్రవర్తనా స్మృతిపథంలో మెదిలి శరీరం గరిపొడిచింది.

"మీరు చెప్పకపోయినా నాకు తెలుసు. నా దగ్గర దాచకండి! నన్ను ఆశ చూపించి మీ నుండి డబ్బు గుంజింది కదండీ?" అన్నది మంగమ్మ.

నా ప్రాణం విలవిలలాడిపోయింది. ఈ మాటలు మా ఆవిడ విన్నదేమోనని నా భయం! నేను నాగమణికి డబ్బిచ్చిన సంగతి ఇంట్లో తెలీదు. ఎరువులకోసమని డబ్బడిగి పుచ్చుకొన్నాను. అదృష్టవశాత్తు ఆవిడ కీ మాటలేమీ వినిపించలేదు. బతికిపొయ్యాను.

"లేదు నేనేమీ ఇవ్వలేదు. కాని డబ్బు కావాలని రెండు మూడు రోజులు నా ప్రాణం తీసింది. నా దగ్గర లేదని తెగేసి చెప్పాను" అన్నాను.

"మీ అంత అనుభవం నాకు లేకపోయినా నాగమణిని గురించి నాకు తెలిసినంతగా మీకెవ్వరికీ తెలియదని మాత్రం ఖచ్చితంగా చెప్పగలను. మా అమ్మకు డబ్బే ప్రధానం. డబ్బుకోసం ఏం చెయ్యడానికయినా రెడీయే! మీరు డబ్బిచ్చినట్టు నాతో అనలేదు గానీ ఇచ్చారని నాకు గట్టి నమ్మకం ఉంది. మీరు బుకాయించకండి మాష్టారూ! మీతో చనువుగా ఉండమనీ, చెప్పినట్లు చెయ్యమనీ, ఏమడిగినా 'కాదు' అనొద్దనీ చెప్పింది. నిన్న రామచంద్రంగారొచ్చారు. అమ్మతో ఏదో మాట్లాడారు. మధ్యాహ్నం నన్ను కారెక్కిస్తున్నప్పుడు రామచంద్రం గారింటి దగ్గర పడుకోమని చెప్పింది. అంతకు ముందొకసారి ఎవరో పెదరామయ్యగారట- ఈ వూరేనటగా- ఆయన్ని ఉబకేసింది. ఆయనకి డబ్బంటే లక్ష్యం లేదన్నది. నేనంటే ఆ పెదరామయ్యగారికి చాలా ఇష్టమట. నేనెవరితోనన్నా మాట్లాడానంటే

'ఉన్నవాడేనా?' అంటుంది. ఇంతకన్నా మా అమ్మను గురించి ఏం చెప్పమంటారు?''

ఆరోజును నేనెప్పుడూ మర్చిపోలేను. మంగమ్మ ఎటువంటి దుర్భర పరిస్థితుల్లో జీవిస్తోందో తెలిశాక, నా కసలు జీవితం మీదనే అసహ్యమేసింది. మంగమ్మనెలాగైనా ఆ వాతావరణం నుండి తప్పించాలనుకొన్నాను. కాని ఏమి చెయ్యాలో తోచింది కాదు. నేను రామచంద్రాన్ని సలహా అడిగాను. వాడు నే చెప్పిందంతా విని, విశాలంగా నవ్వేశాడు.

''మొత్తానికి వలలో బాగా చిక్కడిపోయావురా బావా! నాటకాల్లో తిరిగేదాని మాటలు నమ్ముకొని, నువ్వు కొంపాగోడీ వొదిలి దాంతో ఊరేగుతానంటున్నావంటే నిన్నేమనాలో బోధపడ్డంలేదు. దాన్ని నువ్వు ఉద్ధరించేదేమిటి? మనలాంటి సన్యాసుల్ని వందమందిని ఆవిడే ఉద్ధరిస్తుంది. నీకంత మోజుగా ఉంటే, ఇంత డబ్బు ముఖానపడేయ్. చక్కా అనుభవించు. అంతేగానీ దిక్కుమాలిన ఆలోచనలు చేశావంటే మక్కెలిరగదంతాను జాగ్రత్త!''

ఎంతో సదుద్దేశంతో ప్రారంభమైన మా సమాజం, చివరికీ దశకు చేరకున్నందుకు నాకే ఆశ్చర్యమనిపించింది. దీనిక్కారణం కూడా నేను కనిపెట్టాను. నాటకరంగం ఇచ్చే వాతావరణాన్ని కాముక స్థాయిలోకి దిగజార్చడం వల్లనే ఇటువంటి అనర్థకాలు దాపరిస్తున్నాయి. మా సమాజంలో ఈ తరహా సంఘటనలు జరగకుండా చూడటం చాలా అవసరమనిపించింది. అయితే మనుషుల్ని ఇనపగొలుసులతో బంధించలేము. అత్యాచారాలు జరిగినా, సాధ్యమైనంత తక్కువగా జరగడానికి నేను సూచించిన నిబంధనలు తోడుపడ్డాయి.

చచ్చీ చెడీ శాయం గల విన్నపాలన్నట్లుగా, అనుకొన్న వేళకు నాటకం వేశాము. మేమాశించిన దానికన్నా అద్భుతమైన విజయం మాకు లభించింది. రామచంద్రం, క్రిష్ణమూర్తి అద్భుతమైన పబ్లిసిటీ ఇచ్చారు. మంగమ్మను 'నూతనతార'గా వర్ణించారు. చుట్టుప్రక్కల పది పదిహేను గ్రామాల నుండి కూడా జనం నాటకం చూడ్డానికి వచ్చారు.

అసలు 'పస' కన్నా ప్రచారం ఎక్కువ ఉండడం వల్ల, కలిగే ప్రయోజనమేమిటో తొలిసారిగా నాకనుభవంలో కొచ్చింది. రామచంద్రం, మంగమ్మ ఎన్నడూ లేనంత ఉద్వేగంగా నటించారు. వేషంలో ఉన్న మంగమ్మను చూసి జనం దిమ్మతిరిగి పోయారనడం అబద్ధం కాదు. హీరో తండ్రిని పట్టుకుని మంగమ్మ దులిపేసిన ఘట్టంలో హాలు హాలంతా కరతాళ ధ్వనులతో బద్దలైపోతుందేమోననిపించింది. నాటకం అయిపోయిన తరువాత కూడా, జనం హాలును వదల్లేదు. కొంతమంది మంగమ్మను స్టేజిమీదికి తీసుకురమ్మన్నారు కూడా.

ఆ పని చెయ్యొచ్చుగానీ, అప్పటికే మంగమ్మ వేషం విప్పేసే ప్రయత్నంలో ఉంది. ముఖం నిండా కొబ్బరినూనె పాముకొంది. రంగులన్నీ కలగలసి పోయి, ముఖం చిన్నసైజు పిశాచి ముఖంలాగా ఉంది.

నేనే స్టేజి మీదకెళ్లి, అసలు విషయాన్ని తెలియచేశాను. మరో వారం రోజుల్లో రామవరంలో ఇదే నాటకం ఆడబోతున్నామనీ, ఇప్పటిలాగా, అప్పుడూ మీరందరూ మమ్మల్ని ఆదరించాలనీ, ఓ చిన్న తరహా ఉపన్యాసం కూడా ఇచ్చాను. అందరూ వెళ్లిన తరువాత కోటేశ్వరరావు నాదగ్గర కొచ్చి, అమాంతం కావలించుకొన్నాడు.

''నేనేమోననుకొన్నాను గానీ, నాటకం బ్రహ్మాండంగా ఉన్నదోయ్! ఇంతటితో నీకూ నాకూ దోస్త్'' అన్నాడు భుజం మీద తడుతూ. రామచంద్రం ఏమీ మాట్లాడలేదు గానీ, కోటిగాడి కేసి కోరచూపులు చూశాడు.

తొలిప్రయత్నం విజయవంతం కావడానికి గల కారణాలను బేరీజు వేస్తున్నప్పుడు, రామచంద్రం ఎక్కువ మార్కుల్ని మంగమ్మకిచ్చాడు. ఆవిడ లేకపోతే మన నాటకం మట్టిలో కలిసిపోయేదన్నాడు. నేనూ, కోటి వాడి వాదనను వొప్పుకోలేదు.

''మంగమ్మ కాదు సరిగదా, ఆవిడ్ను పుట్టించిన బ్రహ్మదేవుడు కూడా నాటకాన్ని రక్తి కట్టించలేడు'' అన్నాడు కోటేశ్వర్రావు.

''ఇదంతా నీ నాటకంలోని ప్రతిభేనంటావా?'' అన్నాడు రామచంద్రం నావేపు చూసి నవ్వుతూ.

''నా నాటకమనే కాదు- జీవితానికి దగ్గరగా వచ్చిన ఏ నాటకమన్నా, మంచి నటకుల చేతిలో పడితే రక్తికడుతుంది. దానికొక్కటే ఉదాహరణ. కన్యాశుల్కం ఉన్నదనుకో, ఆ నాటకాన్ని, ఎంత చాతగానివాళ్లు వేసినా రక్తికడుతుంది. మనం ధ్వంసం చేయాలన్నా చెయ్యలేము. గిరీశం, మధురవాణి, రామప్పంతులు, వెంకటేశం, అగ్నిహెూత్రావధాన్లు, బుచ్చమ్మ-వీళ్లందరూ మనలోంచి పాత్రలుగా వచ్చినవాళ్లే! అందుకే మనం ఉన్నంతకాలం అదీ ఉంటుంది'' అన్నాను.

''అయితే మనం కన్యాశుల్కమే వేద్దాం!'' అన్నాడు రామచంద్రం.

''ముందు ఈ నాటకం సంగతేదో చూద్దాం. రామవరంలో వెయ్యాలనుకొంటున్నాం గదా! అప్పుడు మరికొన్ని తప్పుల్ని మనం దిద్దుకోవాలి'' అన్నాను.

''ఛస్తే మార్చకూడదు. నాటకం రక్తికట్టదు'' అన్నాడు రామచంద్రం, నేను తప్పులేమిటో చెప్పకముందే!

''అదిగాదురా నీయమ్మ కడుపు కాలిపోను. మామూలువాళ్లు కనుక్కోలేని తప్పులు, మొన్న మనం ఎన్నో చేశాం. వాటిని సరిదిద్దుకోకపోతే ఎలా? స్టేజిమీద హీరో హీరోయిన్లు కులాసాగా మాట్లాడుకొంటూ ఉంటే మన బలరామయ్య ఆ మాటలు వినపడకుండా, హార్మోనియంతో ముంచెత్తాడు. హీరో తన తండ్రికి ఎదురు తిరిగి ప్రజల పక్షాన నిలబడే ఘట్టమిది. నాటకానికి ఆయువుపట్టులాంటి ఆ సంభాషణలు, జనానికి వినపడకపోతే ఎలా? తండ్రీ కొడుకూ ఘర్షణ పడుతున్నప్పుడు, మనవాడు 'మాండ్' రాగం వాయించాడు. అప్పుడు ఏ 'శ్రీరాగం' అన్నా వాయిస్తే బావుంటుంది. స్టేజీ మీదకు నలుగురుకన్నా మించి రాకూడదు. ఒకేసారి ఒకరి కన్నా మించి మాట్లాడటం సాధ్యం కాదు. అలాంటప్పుడు మిగతా వారు దిమ్మల్లాగా నుంచోకుండా, సంభాషణలకు అనుగుణంగా భావప్రకటన చెయ్యాలి. మొన్న అలా జరగలేదు. ఇవన్నీ తప్పులా-కాదా?'' అని నిగ్గతీసి అడిగాను రామచంద్రాన్ని.

''మరి జనం బాగానే ఉందన్నారు గదరా!'' అన్నాడు వాడు తలగోక్కుంటూ.

''ఇంతకన్నా ముదనష్టపు నాటకాలాడినప్పుడు కూడా జనం చూశారు. అందుకని అవే మనం ఆడటం లేదుగా? ఈ లోపాలు కూడా లేనప్పుడు, ఇంతకన్నా మన నాటకాలను జనం మెచ్చుకోవచ్చు, ఏమంటావ్?'' అన్నాను.

రెండో ప్రదర్శన రామవరంలో జరిగింది. అనుకోనంతగా జనం వచ్చారు. గల్లాపెట్టె ఈసారి బాగా బరువెక్కింది.

ఇదే నాటకాన్ని ఆ చుట్టుపక్కల గ్రామాల్లోనయితేనేం, దూరగ్రామాల్లోనయితేనేం, యాభయ్యారు సార్లు వేశాం. అన్నీ గల్లాపెట్టెలు నింపకపోయినా, ఏ ప్రదర్శనమూ ఫెయిల్ కాలేదు.

కోటేశ్వరరావు ఇంకో సూచన చేశాడు. అది నాకెంతో నచ్చింది. వాడన్నట్టుగా లింగోలింగో మంటూ వొక్క నాటకాన్ని పట్టుకుని పాకులాడటం కన్నా రెండుమూడు నాటకాలు నేర్చుకుని

ఉంటే మంచిది గదా? ఎవరికి ఏది కావాలంటే, దాన్నే వేసి రావచ్చు. ఈ మాటే నేనన్నప్పుడు రామచంద్రం కూడా అక్కడే ఉన్నాడు.

"అంటే మనం కిరాయి నాటకాలాడటమనేగా అర్థం?" అన్నాడు వాడు.

"నాకర్థంకాలేదు" అన్నాడు కోటి.

"మనం డబ్బుకోసం నాటకాలాడబోతున్నామని దానికర్థం" అన్నాడు రామచంద్రం చురచురగా చూస్తూ.

"అది తప్పని నాకు తెలీదే!" అన వ్యంగ్యం ఏడిచాడు కోటి.

రామచంద్రానికి మండిపోయింది.

"నీకు తెలుస్తుందని నేనూ అనుకోలేదు గానీ, ఆ దశకు మనం రావటమంటే అసలీ సమాజాన్ని మనం ప్రారంభించిన నాటి ఉద్దేశాలే మార్చుకొన్నామన్నమాట అవున్రా?" అన్నాడు వాడు నావేపు చూస్తూ.

"ఇందులో ఉద్దేశాలు మార్చుకోవడమన్న ప్రసక్తే లేదు. నువ్వన్నట్టుగా మనం మంచి నాటకాలనే రాయించుకొందాం. వాటినే ఆడదాం. అందువల్లనే తగినంత రాబడి ఉన్నపుడు మనకభ్యంతరం ఉండనవసరం లేదు. ఏమంటావ్?" అన్నాను.

"ఏదో యాడవండిరా!" అన్నాడు రామచంద్రం.

కవిని పిలిపించి, మరో మూడు నాటకాలు రాయమని చెప్పాం. లోగడ నాటకానికి అతనికిరావలసిన డబ్బేదో ముట్టచెప్పాం. నాటకం ఎలా ఉండవలసిందీ, ఎన్ని పాత్రలుండవలసిందీ ఎన్ని సీనులుండవలసిందీ కూడా చెప్పాం. లోగడ అనుభవం ఉన్నది గనుక, ఈసారి నాటక రచన అంత కష్టం గాదని కూడా చెప్పాం.



# 2

కొత్త నాటకం "మళ్లీ పెళ్లి" తయారవుతున్నా రోజుల్లోనే చిన్న కలవరం తలెత్తింది. ఇది మంగమ్మను గురించిన కలవరం. ఆ పిల్ల దాదాపుగా మా సమాజంతోనే ఉండిపోయింది. ఎప్పుడోగాని గుంటూరు వెళ్లేది కాదు. అదీ నాగమణి ప్రాణాలు తోడేస్తూంటే పోయేది.

మంగమ్మ పేరు,ఇతర నాటక సమాజాల క్కూడా తెలిసింది. కొంతమంది ఎక్కువ డబ్బిస్తామని నాగమణితో బేరాలు సాగించారు.

"మాదేముంది నాయనా! మాకు వారు చుట్టాలుకాదు. మీరు పరాయివారూ కాదు. అలాగే పంపుతాను" అనేదిట.

కాని మంగమ్మనడిగితే, ఈ పిల్లవొప్పుకొనేది కాదు. ఎంత హీనంగా చూచుకొన్నా సంవత్సరం పాటు మాతో కలిసిమెలిసి వున్న మనిషాయె. మా లోటుపాట్లు, బలహీనతలు, మంచితనాలు మంగమ్మకు తెలిసినట్టే, ఆవిడను గురించి మాకూ తెలుసు. ఈ పరస్పర అవగాహన వల్లనే మా సమాజం ఓ కుటుంబంలాగా పొరెపెచ్చెం లేకుండా ఉండగలుగుతోంది.

"ఈ ముండకు డబ్బుయాస తప్ప మరోస్మరణ లేదు. ఎవడు డబ్బిస్తే వాడే దానికి దేవుడు"అని తిట్టిపోసేది మంగమ్మ.

ప్రస్తుతం దేశంలో మా సమాజానికున్న పేరు ప్రతిష్టల దృష్ట్యా మరో అమ్మాయిని మా సమాజంలోకి తీసుకురావడం ఏమీ కష్టంకాదు. కానీ ఆ మహాతల్లి వెంట ఎన్ని సమస్యలుంటాయో

మాకు తెలియదాయె! వాటిని దిద్దుకోలేక సతమతం కావడం కన్నా ఈవిడతోనే సర్దుబాట్లు చేసుకుంటే పోతుందని నా ఏడుపు.

మంగమ్మ పేరు వాడవాడలా పాకడం కూడా ఆవిడ కంఠం మీదికే తెచ్చింది. కీర్తి పెరగడంతో బాటుగా ఆవిడను 'ప్రేమించేవారు' కూడా పెరిగిపోయారు. ఈ సజ్జంతా నాగమణి చుట్టూ చేరి పొగవేస్తుండేవారు. నాగమణికి శివమెత్తడమన్నది క్షణాలమీద పని. ఏదో వంకతో మంగమ్మను గుంటూరు పట్టుకెళ్లి, రెండ్రోజుల తర్వాత తిరిగి పంపుతుండేది నాగమణి. ఈ రెండు రోజులకే పదిరోజులు లంఖణం చేసినదానిలా జోగులుకొడుతూ వచ్చేది మంగమ్మ. ఏం జరిగిందో మాకు తెలుసు గనక ఎవ్వరమూ మంగమ్మను కారణం అడిగేవాళ్లం కాదు. అప్పుడప్పుడు రామచంద్రం గాడే ఎగతాళి చేస్తూ ఉండేవాడు.

"మహాతల్లి మంగమ్మ గారు జాగారం చేసినట్లుందోయ్!" అనేవాడు రామచంద్రం.

మంగమ్మ చాలా తాపీగా నవ్వేది.

ఒకసారి కొత్తనాటకం తాలూకు రిహార్సల్ వేస్తున్నాం. నాగమణి అట్టహాసంగా వచ్చింది. మంగమ్మను పంపించమని అడిగింది. రామచంద్రం వీలుకాదన్నాడు. నాగమణి అంతంత మాత్రం మాటలకు వినేరకం కాదాయె, గొంతు పెంచి అరవసాగింది.

"నీకు పదినిమిషాలు టైమిస్తున్నాను, ఈలోగా నువ్వీ వూరు దాటిపోవాలి. లేకపోతే-"

"తలకొట్టి మొలేస్తావా ఏందయ్యా?" అన్నది నాగమణి.

"ఇంకా మొలెయ్యడం దేనికి? నీలాంటి పాపిష్టిముండలు మళ్లీ పుట్టుకురావడానికా? నిన్ను తలగొట్టి పాతేస్తాను. నీ బాబుగా డెవడడ్డమొస్తాడో చూస్తాను. నీ పిచ్చివేషాలు నాదగ్గర పనిచెయ్యవు" అన్నాడు రామచంద్రం ఇంతెత్తున మండిపడుతూ.

నాగమణి సీదాగా చప్పబడిపోయింది.

"సంపాయించుకునే వయస్సిదేనయ్యా బాబూ! మరో పదేళ్లుపోతే ఎవరూ వాసనన్నా చూడరు. మీరు ఇవ్వనూ ఇవ్వక, ఇచ్చే మారాజును ఇవ్వకుండానూ చేస్తే ఆనక దానిగతేంగానూ?" అన్నది నాగమణి.

"మంగమ్మకు జరుగుబాటుకేం కొదవలేదే?" అన్నాడు రామచంద్రం.

పదిమంది ముందూ సిగ్గూ, శరమూ లేకుండా జరిగిపోతున్న ఈ సంభాషణ వింటుంటే నాకే వాంతి వచ్చినట్లయింది. నాగమణిని చాటుకి పిలిచి, అంతవరకూ మంగమ్మకు రావలసిన డబ్బేతో లెక్కచూసి ఇచ్చాను.

"మొగాడివంటే నువ్వేనయ్యా మొగాడివి ఏమందు వేశావో గానీ మా మంగమ్మను గుప్పిట్లో ఇరికించుకున్నావయ్యా! ఆ భడవా కూడా నువ్వంటే పడిచస్తుందనుకో. ఆ మందేదో నాకూ చెబుతూ పాతపార్టీలనన్నా తెచ్చుకుంటాను!" అన్నది నాగమణి, నా రెండు బుగ్గలనూ అరచేతుల్తో అదుముతూ.

డబ్బిచ్చి వచ్చాక మంగమ్మ నన్నుచాటుకు పిలిచి, బావురుమని ఏడిచింది. సంగతేమిటని అడిగాను.

"అనవసరంగా మీరు లొంగిపోయారు. నాకోసం ఇలా ఎన్నిసార్లని ఇస్తాను? నేను చచ్చిందాకా అది వదలదు. నన్ను పంపెయ్యకూడదా;" అన్నది మంగమ్మ.

"పంపితే?" అన్నాను.

"దాని దాహం తీరేదాకా డబ్బు సంపాదించి ఆ తరువాత రోగాలతో పుచ్చి చచ్చిపోతాను.

దమయంతి అలాగే చచ్చిపోయింది. అరుంధతి చావడానికి సిద్ధంగా ఉంది. ఎంతమందిని ఈ గానుగలో వేసిపిండిందో తెలీదు. కిందటిసారి వెళ్లినప్పుడు, మరో కొత్తపిల్ల కనిపించింది'' అన్నది మంగమ్మ.

''వీళ్లందరూ ఎలా దొరుకుతారు?'' అనడిగాను.

''కూటికి గతిలేక కొంతమంది దీని కొంపకొస్తారు. ఇంకొంతమంది ఉంటారు- వారు ఎక్కడో పుడతారు. ఈ వాతావరణంలో పెరిగి, ఇందులోనే ఉండిపోతారు. దిక్కూ మొక్కూ లేక, పిల్లల్ని పోషించలేనివారు పాతిక్కో, పరక్కో, పిల్లల్ని అమ్ముకొంటారు. వాళ్లనికొని, ఈరకంగా డబ్బు సంపాదిస్తుంది''.

''నాటకాల్లో వేశానంటుందేం మరి? అదంతా నిజమేనా?'' అన్నాను నేను.

''ఇది వరకు సంగతి నాకు తెలీదు. తెలిసాక నాటకాలాడ్డం నే నెరుగను. ఇంతకన్నా బ్రహ్మాండమైన నాటకాలింకేమి ఆడాలి మేష్టారూ?'' అన్నది మంగమ్మ.

ఆ మాటలంటున్నప్పటి మంగమ్మరూపం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. తొలిసారిగా మంగమ్మ చేతిని పట్టుకుని ఆవిడకు హామీనిచ్చాను.

''ఆరునూరైనా, హరిబ్రహ్మాదులడ్డం వచ్చినా నిన్నా నాగమణికి అప్పగించడం అబద్ధం. నీకు మంచి భవష్యత్తున్నది. దానికి ఇప్పుడే పునాదులు పడుతున్నాయి. నువ్వు ప్రతి వెధవ దత్తినీ తీర్చే బొమ్మవు కావడం నాకిష్టం లేదు'' అన్నాను.

మంగమ్మ కళ్లు కృతజ్ఞతతో నిండిపోయాయి. వంగి నమస్కరించబోయింది. నేనే పక్కకు తప్పుకున్నాను.

''మళ్లీ పెళ్లి'' నాటకం, ఆ రోజుల్లో గొప్ప తుపానును లేవగొట్టిందనడంలో సందేహం లేదు. వీరేశలింగం గారు అంతకు ముందెప్పుడో విధవా వివాహాలు ప్రారంభించినప్పటికీ, ఆ ఉద్యమం మేధావులను దాటి ముందుకు సాగలేదు. మా సమాజం వీరేశలింగం గారి ఆశయాలను ప్రజల్లోకి తీసుకెళ్లగలిగింది. అందులోనే కన్యాశుల్క నిరసనా, అంతర్వర్ణ వివాహాలు, సహపంక్తి భోజనాలు వగైరా అంశాలన్నీ చేర్చాము. ఈ నాటకానికి కావలసిన కథావస్తువును వీరేశలింగం గారి ప్రహసనాల నుండీ, గురజాడ వారి కన్యాశుల్కం నుండీ, చలంగారి కథల నుండీ స్వీకరించాం. వీరందరి ఆశయాలకూ మా నాటకం గమ్యస్థలం వంటిది. మూడుగంటల నాటకాన్ని, మూడంటే మూడే మూడు రంగాలలోకి కుదించి పారేశాం. డైలాగ్స్, చాలా పవర్‌ఫుల్‌గా కన్విన్సింగ్‌గా ఉన్నాయి. రిహార్సల్స్ చూసినవారు ''అద్భుతం'' అన్నారు.

ఒకసారి మావూరు అయ్యదేవర కాళేశ్వరరావుగారూ, దరిశి చెంచయ్యగారూ వచ్చారు. సంఘ సంస్కర్తలైన వీరిద్దరినీ మా రిహార్సల్స చూడవలసిందిగా ఆహ్వానించాను. వితంతువుగా మంగమ్మ నటన, ఆనాడు పరాకోటినందుకొంది. కాళేశ్వరరావుగారు.

''మీలాంటి వారు ముందుకొస్తే తప్ప ఈ సమాజం బాగుపడదు. లక్ష ఉపన్యాసాలు చెయ్యలేని పనిని, ఈ వొక్క నాటకం చేస్తుంది'' అన్నారు చెంచయ్యగారు.

''మళ్లీపెళ్లి'' ప్రదర్శనం మొదటిసారిగా మా గ్రామంలోనే ఏర్పాటు చేశాం. ప్రజలమీద ఈ నాటక ప్రభావమేమిటో చూడందే పొరుగూళ్లు వెళ్లడం నాకిష్టం లేదు. ఈ నాటకం ప్రతిపాదించే సిద్ధాంతాలు న్యాయమైనప్పటికీ, ప్రజలకు కొత్త. కులమతాల ప్రభావం అతిదారుణంగా ఉన్నరోజులవి. విధవా వివాహాలు సిద్ధాంతరీత్యానే తప్ప అంతగా ఆచరణలో లేనిరోజులవి. వాటిని వ్యతిరేకించడ

మంటే-దాదాపుగా మొత్తం సమాజాన్నే వ్యతిరేకించడమన్నమాటే. సంఘానికి ఇష్టంలేని పనులు చేస్తూ, ఆ సంఘం చేతనే మెప్పు పొందాలనుకోవడం అజ్ఞానమో కాదో నేను చెప్పలేను గానీ, సాహసం మాత్రం అవుతుంది.

ఈ నాటకాన్ని గురించి అనుకూల ప్రచారం కన్నా వ్యతిరేక ప్రచారమే ఎక్కువగా జరిగింది. కొంతమంది, పనిమాలా నాటకాన్ని అల్లరి చెయ్యడానికే వస్తున్నారని మాకు తెలిసింది. మేమూ అందుకు తగిన బందోబస్తు చేశాం. ఏ కొంటె వెధవన్నా నోరెత్తితే వెంటనే వాడి పీక నులిమెయ్యమని రామచంద్రం హుకుం జారీచేశాడు. నాటకంలో మేము మంచివనుకొన్న సీన్లొచ్చినప్పుడు, చప్పట్లు కొట్టమన్నాం. కొన్ని కొన్ని పాటలకు వన్సుమోర్‌లు కొట్టడానికి ప్రత్యేకంగా కొందరిని ఏర్పాటు చేశాడు కోటేశ్వరరావు.

స్థూలంగా పని పంపిణీ జరిగిపోయింది. ఎలాంటి అల్లరీ జరక్కుండా చూడటం చప్పట్లను, వన్స్‌మోర్లను సరఫరా చేయడం కోటిగాడి వంతు. నాటకం అమోఘంగా వేయడం మా వంతు.

తొమ్మిదింటికి ప్రారంభం కావలసిన నాటకానికి, ఏడున్నరకే జనం పిక్కట బిర్రుగా వచ్చారు. ఎనిమిదయ్యేసరికల్లా రామచంద్రం హారతి కర్పూరం వెలిగించాడు. బలరామయ్య ఓసారి హార్మోనియానికి దణ్ణంపెట్టి "పరబ్రహ్మ" వాయించాడు. క్రిష్టమూర్తి తెర లాగాడు.

అరవయ్యేళ్ల ముసలివాడుగా నాగభూషణం, నాలుగో పెళ్లికోసం పురుషోత్తంగారింటికొచ్చాడు. ఆయనగారు నాలుగువేల శుల్కం పుచ్చుకుని పధ్నాలుగేళ్ల మంగమ్మను, నాలుగో పెళ్లాంగా అమ్మడానికి సిద్ధపడతాడు. బేరసారాలన్నీ అయిపోయాక, రంగం మీద మంగమ్మ ఒక్కతే ఉంది. పావుగంటసేపు ఏకధాటిగా ఉపన్యాసం ఇచ్చింది. కరుణరసప్లావితమైన ఆ ఉపన్యాసం, అప్పటి మంగమ్మ నటనా ప్రేక్షకులను మంత్రముగ్ధులను చేసివైచాయి. మా నాటకంలోని తొలిగండం ఇదే! దీన్ని దాటితే, మిగతా వాటిని దాటినట్లే లెక్క. ఏదో కొంపమునుగుతుందనుకొన్నాం గానీ ఏమీ జరగలేదు. అల్లరి చెయ్యడానికొచ్చినవారు కూడా కిక్కురుమనలేదు. మంత్రించినట్లు కూర్చుండిపొయ్యాను. ఈ మంత్రశక్తి సడలిపోకముందే రామచంద్రం రెండవరంగాన్ని ప్రారంభించాడు. వాడు విధవరాలైన మంగమ్మను ప్రేమించాడు. కానీ వారిద్దరి కులాలువొకటి కాదు. మంగమ్మ ఈడుగలవారందరూ పిల్లలతో కళకళలాడుతూ ఉంటే మంగమ్మ రాసివోసిన దుఃఖంలా జీవిస్తోంది. రామచంద్రం కృత్రిమమైన కులమత వ్యవస్థలను దుయ్యపడతాడు. స్త్రీ పునర్వివాహాలు శాస్త్రసమ్మతమేనంటాడు.

వేదాంత దృష్టితో చూచినా, స్త్రీ పునర్వివాహాలు భారతీయ సంప్రదాయాలకు అనుగుణమైనవే నంటాడు. గుణం ప్రధానంగానీ, కులం ప్రధానం కాదు. తక్కువ కులంలో పుట్టిన ఎందరో మహానుభావులు, తమ ప్రవర్తన చేతా, గుణగణ సంపద చేతా, మహర్షులైనారంటాడు. మంగమ్మ తండ్రి, అతని వాదనలు అంగీకరిస్తాడు. కానీ పెళ్లి తను చెయ్యననీ, ఇద్దరూ ఏదన్నా దూరదేశం వెళ్లి అక్కడ పెళ్లి చేసుకోండని సలహా ఇస్తాడు.

"మీరూ ఆడపిల్లల తండ్రులయితే తప్ప నా బాధ మీకర్థం కాదు. మీ కూతురే, ఇలా బాల్యవితంతువైతే, మీరేం చేస్తారో నేను అదే చేశాను" అంటాడు ఆఖర్న.

ఈ సీను రక్తికట్టిందంటే, రక్తికట్టడం కాదు. అంతకన్నా ఏమనవలసిందీ నాకు తోచలేదు. అల్లరి చెయ్యాలనుకొన్నవారూ, వన్స్‌మోర్లు కొట్టాలనుకున్నవారు కూడా ఆరెండుపన్లు చెయ్యడమూ మరచిపోయారు. అంతకన్నా మా విజయానికి మరో ఉదాహరణ అనవసరం!

పేరు ప్రతిష్టలతో బాటుగా, ఆర్థికస్థితిగతులు కూడా మా సమాజానికి సమృద్ధిగా ఉన్నాయి. స్వంతంగా మేమే తెరలూ, రంగులూ కొనుక్కున్నాం. భావనారాయణకు మేకప్ నేర్పించాం. కోటేశ్వరరావు పబ్లిసిటీ కాంట్రాక్టులు, హాలు ఇతర ఏర్పాట్లు చూస్తున్నాడు. రామచంద్రం హీరోగా మంచి పేరు తెచ్చుకొన్నాడు. హీరోయినంటే మంగమ్మ పేరు చెప్పాకనే ఇంకోరిపేరు చెప్పాలన్న స్థితి వొచ్చింది.

చెబితే మీరు అబద్ధమనుకొంటారు గానీ, ఆరోజుల్లో మా సమాజం ఆంధ్రదేశంలోని అన్ని ముఖ్య కేంద్రాలలోనూ నాటకాలాడింది. పెద్దపెద్ద నటీనటులందరూ మా నాటకాలు చూసి ఆనందించారు. కొంతమంది మా సమాజంలోకి వచ్చి చేరారు.

నాటక కళ శక్తిసామర్థ్యాలేమిటో "మళ్లీ పెళ్లి" ప్రదర్శనం తరువాత మాకర్థమయింది. ఈ రంగం ద్వారా సంఘ సంస్కరణ కార్యక్రమాన్ని ఎంతో ముందుకు తీసుకెళ్లవచ్చుననిపించింది. మరికొన్ని కొత్తనాటకాలు రాయిండి ఆడాలని కూడా మేమనుకొన్నాం.

ఈలోగా మంగమ్మ వ్యవహారాన్ని నేనూ రామచంద్రమూ కలసి తేల్చివేశాం. నాగమణికి అయిదువేల రూపాయిలిచ్చి, మంగమ్మను శాశ్వతంగా ఆవిడ చెరనుండి తప్పించేశాం. నాగమణి లబ్బుమని ఏడుస్తూ వెళ్లిపోయింది.

"సగం పీడా వొదిలింది!" అన్నాడు రామచంద్రం.

"సగమే ఖర్మ, పూర్తి పీడాయే వదిలింది. ఈ రుణం ఎలా తీర్చుకోవాలో తెలియకుండా ఉంది" అన్నది మంగమ్మ.

"ఎలా తీర్చుకోవలసిందీ నేను చెబుతాలే పద!" అన్నాడు రామచంద్రం.

రమారమిగా ఆరేళ్లపాటు మా సమాజం ఆమోఘంగా నాటకాలాడింది. అనేక పోటీల్లో పాల్గొని బహుమతులందుకొంది. మా సమాజంలో ఉన్న కొంతమంది ఎటెటో వెళ్లిపోయారు. ఊరూరా కొత్త కొత్త సమాజాలు వెలిశాయి. అఖిల భారత స్థాయిలో ప్రజా నాట్యమండలి ఏర్పాటయింది. దాని శాఖలు గ్రామ గ్రామానా వెలిశాయి. తక్షణ సమస్యలను నాటకాలుగా, నాటికలుగా మలచి ఈ నాట్యమండలులు ప్రదర్శించసాగాయి. ఉత్సాహవంతులైన యువతీయువకులెందరో ఈ సంఘాల్లో చేరుతున్నారు. వారిలో మరుగునపడి ఉన్న కళాతృష్ణను ఈ సంఘాలు తీర్చుతున్నాయి.

మా సమాజ సభ్యులలో కూడా మునుపున్నంత ఉత్సాహం కనిపించడం లేదు. బహుశా-వయస్సు కొంతవరకూ కారణమనుకొంటాను. కాలంతో బాటు ముందుకెళ్లగల చొరవా, తెగింపూ తగ్గిపోయాయి. "నటన" అనేది యాంత్రికస్థాయికి దిగిపోయింది. కొత్తదనం కోసం రాత్రింబవళ్లు తపస్సు చేసిన రోజులకూ, ఈరోజులకూ ఎంత తేడా ఉంది!

మా ప్రధాన కార్యాలయాన్ని గుంటూరుకు మార్చాక మరెన్నో మార్పులు కలిగాయి. ఉన్నవారిలో కొంతమంది ఎక్కువ కిరాయికి, ఇతర సమాజాల్లోకి వెళ్లిపోయారు. ఒకరిద్దరు సినిమాల మీది ఆశతో మద్రాసు వెళ్లారు. ముగ్గురు వ్యాపారంలోకి దిగారు. రాగాపోగా మిగిలిన వాళ్లం నేనూ, రామచంద్రం, మంగమ్మా మాత్రమే!

గడచిన కాలమంతా జ్ఞాపకమొస్తే మనస్సంతా అదోలా అయిపోతుంది. ఏ ఉద్దేశంతో ఈ సమాజాన్ని ప్రారంభించామో, అది కొంతవరకూ నెరవేరింది. ప్రాచీన నాటక పద్ధతికి, ఆధునిక విధానానికీ మధ్య వంతెనలాగా మా సమాజం పనిచేసింది. ఇప్పుడు దాని అవసరం లేదు. ఇక ముందు కూడా రాదు. ఇప్పుడు దీనికున్న స్థానం, ఒక జ్ఞాపకానికున్న స్థానం కన్నా పెద్దదేమీ కాదు.

ఈ వంతెన మీదుగా దాటిపోయిన ప్రయాణీకులకు, బహుశా దీని విషయం జ్ఞాపకం ఉండకపోవచ్చు కూడాను. దీని ఉనికి- ఈరోజున కేవలం నిష్ప్రయోజనం!

జనవరి 4వతేదీననుకొంటాను. రామచంద్రం వొచ్చి ఇస్సుమంటూ కుర్చీలో జారగిలబడ్డాడు. మంగమ్మ రెండోఆట సినిమాకెళ్లింది. ఆఫీసులో మేమిద్దరం తప్ప మరో పురుగులేదు.

"అయిపోయిందిరా!" అన్నాడు రామచంద్రం.

వాడిగొంతు విచారంతో పూడుకుపోవడం నేను గమనించాను.

"ఇంటాయనతో చెప్పేశాను. మనం యెప్పుడు ఖాళీచేసినా తన కభ్యంతరం లేదన్నాడు" అన్నాడు వాడు.

మా సమాజానికివన్నీ అంత్యక్రియలన్నమాట! మరో రెండు మూడురోజుల్లో శాశ్వతంగా ఇది భూస్థాపితమయిపోతుందన్న మాట! ఒకప్పుడు ఆంధ్ర దేశాన్నంతా ఉర్రూతలూపిన ప్రఖ్యాత నాటక సమాజమొకటి ఉన్నదనే విషయం కేవలం ఓ స్మృతి క్రిందనే ఉండిపోతుందన్నమాట!

శరీరమంతా, ఎవరో నలిపివేస్తున్నట్లుగా గిజగిజలాడిపోయాను. రామచంద్రం ముఖం చూడటానికి భయం వేసింది. బలవంతాన లేచి, మారిహార్సల్స్ రూంలోకెళ్లాను. గది బావురుమంటోంది. కొన్ని వందలసార్లు మేమీ గదిలో రిహార్సల్స్ చేసి వుంటాము. గదిగోడలకు ప్రాణాలుండటమే జరిగితే, మా డైలాగ్సన్నీ వాటికీ కంఠతా వచ్చి ఉంటాయనుకొంటాను. మాటలు,పాటలు, అభినందనలు, అభిశంసనలు, చిరాకులు, కోపతాపాలతో ఈ గది నిండిపోయి ఉంటుంది. ఇప్పటికీ, ఆగదిలో ఏదో నాటకం రిహార్సల్ జరుగుతున్నట్లూ, ఆ మూలగా మంగమ్మ నిలబడి సంభాషణలు చెబుతున్నట్లు, బ్రహ్మానందం ఈ ప్రక్కన కూచుని హార్మోనియం వాయిస్తున్నట్టు ఫీలయ్యాను. ఆ శబ్దాలన్నీ వొక్కసారి చెవుల్లో గింగురుమని మోతపెట్టాయి.

ప్రక్క గదిలోంచి ఎవరో సన్నగా ఏడవటం వినిపించింది. రామచంద్రం ఓదార్పు మాటలు కూడా నేను విన్నాను.

"ఎందుకలా చంటిపిల్లలా ఏడుస్తావ్? ఏడ్చి నువ్వు సాధించేదేమిటి గనక?" అంటున్నాడు వాడు.

మంగమ్మనేదో వాడు వోదారుస్తున్నాడు గానీ, వాడికీ దుఃఖం పుక్కిలింతలవుతున్నదని తెలిసిపోతూనే ఉంది.

"నువ్వు సినిమాకు వెళ్లలేదా?" అన్నాను మంగమ్మతో, విషయం తప్పించుదామని.

మంగమ్మ తల అడ్డంగా తిప్పింది.

"ఈ దిగులు మరచిపోదామనే వెళ్లాను మేష్టారూ! అంతమందిలో ఉన్నా ఒంటరిగా ఉన్నట్లనిపించింది. సినిమా చూడలేకపోయాను. వచ్చేశాను" అన్నది మంగమ్మ.

ఆవిడ కళ్లు కెంపుల్లాగా మెరిసిపోతున్నాయి. అనేకసార్లు రంగస్థలం మీద మంగమ్మ ఏడవటం నాకు తెలుసు. ఆవిడ ఏడవటమే కాకుండా, వేలాది ప్రేక్షకుల కళ్లను నీటితో నింపగలిగేది మంగమ్మ. కానీ ఇంతలా హృదయం తరుక్కుపోయేలా మంగమ్మ విచారించిన జ్ఞాపకం నాకు లేదు.

"నీకేవమ్మా! భగవంతుడు ఇంత అందమిచ్చాడు. నటించే శక్తినిచ్చాడు. ఏ సమాజంలో చేరుతానన్నా కళ్లకద్దుకుని తీసుకుంటారు. నువ్వు విచారించడంలో అర్థం లేదు" అన్నాడు రామచంద్రం.

మంగమ్మ ఓ క్షణం నాకేసి, రామచంద్రం కేసి చూసింది. ఆ తరువాత చాలాసేపటిగ్గాని

ఆవిడ సన్నగా నవ్వలేదు.

"ఎలా బ్రతకడమన్న భయం నాకులేదు మాస్టారూ?" అన్నది మంగమ్మ. పైట చెంగుతో కళ్లనద్దుకొంటూ "ఇంతకాలం పుట్టింట్లో ఉన్నాను, ఇప్పుడు..." అన్నది.

"మేమయినా నిన్ను అన్యాయంగా వెళ్లమనడం లేదుగా, మధ్యాహ్నం నేనూ, వాడూ ఆలోచించాం. నీకో అయిదువందలిద్దామనుకొన్నాం. ఆ డబ్బు,నీకు జీవితాంతం సరిపోతుందని కాదు గానీ, వెంటనే కాళ్లు విరగదొక్కుకుని చావకుండా, కాస్తంత ఆధరువుగా ఉంటుంది. భగవంతుడు దయవల్ల ఈలోగా నీకెక్కడన్నా ఛాన్స్ దొరికితే సరేసరి! లేదా మే మెటుగూడీ ఉండనే ఉన్నాం. ఓ కార్టు ముక్క రాసిపడెయ్. వాడో నేనో వస్తాం. అంతదాకా దేనికనుకుంటే, నువ్వే వచ్చెయ్. నువ్వు పస్తులుంటుంటే, మేము చూస్తూ ఉండం గదా!" అన్నాడు రామచంద్రం.

మంగమ్మ మరోసారి బావురుమన్నది.

"ఈ రుణం నేనెలా తీర్చుకోను?" అన్నది బెక్కుతూ.

మంగమ్మలోని అసలు మనిషిని అప్పుడే చూస్తున్నాననిపించింది నాకు.

రామచంద్రం ఫక్కున నవ్వాడు.

"మరింక ఆ వివరాలన్నీ నన్నడక్కు. అప్పుగా మేమివ్వని మాట నిజమే గానీ, మరీ అంత నిస్వార్థంగా ఇస్తున్నామనీ అనుకోకు. రేపు నువ్వో గొప్ప-పెద్ద-బ్రహ్మాండమైన స్టార్‌వయితే-మేం ఫిలిం ప్రొడ్యూసర్లమయితే పదివేలు తక్కువ తీసుకుని, మా పిక్చర్‌లో వేషం వేద్దువుగాని. సరా?" అన్నాడు రామచంద్రం.

"నా ముఖానికి అంత రాత కూడానా మేష్టారూ!"అన్నది మంగమ్మ.

"అదేం?" అన్నాను నేను.

"ఆ అదృష్టజాతకులు వేరు!" అన్నదావిడ.

"అదృష్టమంటే, నీకంతా తెలిసిపోయినట్లు మాట్లాడకు. నువ్వో గొప్ప హీరోయిన్‌వవుతావని కాదు. అయ్యే అవకాశాలున్నాయా, లేవా అన్నదే ముఖ్యం. నీకున్న వాటిల్లో శతాంశం అవకాశాలు లేనివారు సినిమాల్లో వెలిగిపోతున్నారు. కాలం కలిసి వస్తే నువ్వూ అలా కావచ్చు. కాగూడదనే నిబంధనేమీ లేదు మరి!" అన్నాడు రామచంద్రం.

మంగమ్మ ఇంకేమీ మాట్లాడలేదు.

రామచంద్రం, మంగమ్మ వేపు కన్నార్పకుండా చూస్తూ "అప్పుడు మేమొస్తే నువ్వసలు మాట్లాడవనుకొంటాను!" అన్నాడు నవ్వి.

"ఈ పూట నామీద పట్టించారేమిటీ రథం?" అన్నది మంగమ్మ. "అంత దశ ఈ దిక్కూ మొక్కూ లేనిదానికి పట్టాలేగానీ, మాట్లాడకపోయినా మీరేమీ అనుకోరు. ఏంచేతంటే-"

"వింటున్నాను" అన్నాడు రామచంద్రం.

"నామీద మీకంత అభిమానం గనక" అని వాక్యం పూర్తి చేసిందావిడ.

"మీరు రూపాయికి వొకవేపే చూస్తున్నారు. రెండోవేపు చూడ్డంలేదు. ఆ వేపున చాలా పిచ్చిగీతలున్నాయి".

"అంటే-మళ్లీ నాగమణి దగ్గరకెళ్లడమేనా?" అన్నాను నేను.

మంగమ్మ పలకలేదు.

"అంతదాకా వస్తే, నువ్వు దాని కొంపకెళ్లే బదులు, నా దగ్గరకే రా, మా ఆవిడతో బాటు

నువ్వూ ఉందువుగాని'' అన్నాడు రామచంద్రం.

''అప్పుడు నీకు పోటీగా నేనొకణ్ణుంటానని మరచిపోకు. మనిద్దర్లో ఎవరి దగ్గర ఉండాలో తేల్చవలసింది మంగమ్మే!'' అన్నాను నేను.

''ఇద్దరి దగ్గరా ఉంటుంది. తప్పేం! ద్రౌపది అయిదుగురితో కాపరం చేసింది. మంగమ్మ ఇద్దరితో చేస్తూంది. ఏవఁమ్మా-అంతేనా?'' అన్నాడు రామచంద్రం.

మంగమ్మ సిగ్గుపడటానికి బదులు పగలబడి నవ్వింది. అంతేగాని ఏ సంగతీ తేల్చి చెప్పలేదు. అలా-అసలు విషయాన్ని మరుగున ఉంచి, ఉంచిదన్న స్పృహ ఇవతలివాడికి కలగనీయకుండా మేనేజ్ చేయడం మంగమ్మకు చక్కగా తెలుసు. ఆవిడకోసం నేను ఆరాటపడిన ఘడియలు లేకపోలేదు. నేనిలా ఆరాటపడుతున్నట్లు ఆవిడకూ తెలుసు. కానీ తెలిసినట్టు బయటపడేది కాదు. పడకపోగా యథాశక్తి ఇంకో రెండు సమిధలు, ఆ అగ్నిలో వేసి మరీ పోయేది. తనకోసం ఇద్దరు మొగాళ్లు తక్కిసమక్కిసలాడుతున్నారని తెలిసినప్పుడు స్త్రీ ప్రవర్తన ఎలా ఉండేదీ మంగమ్మను చూస్తే తెలుస్తుంది. ఆవిడ అటు రామచంద్రాన్ని, ఇటు నన్నూ కూడా ఆకట్టుకోగలిగింది. ఐతే ఆ సున్నితమైన బంధనాలు మాకు చాలాకాలం దాకా తెలియరాలేదు.

మంగమ్మను నేను ప్రేమించాననడం అబద్ధం. 'ప్రేమ' అన్న ముక్కకు నాకుండే అర్థాలేవో నాకున్నాయి.

మంగమ్మ మీది వాంఛను 'దత్తి' అంటే సరిపోతుందనుకొంటాను. అదీ కొత్తలో సంగతి. మంగమ్మ మాలో వొకతెగా అయిపోయినాక-ఆవిడ్ని చూస్తే ఏ ఉద్రేకమూ కలగడం మానేసింది. ఆవిడకోసం అర్రులు చాపేవాళ్లను చూస్తుంటే నా కొక్కోసారి నవ్వు కూడా వొచ్చేది.

మంగమ్మ రేపేమవుతుందన్న దుగ్ధ నాకు లేదు. ఆవిడకు బ్రతకడం చాతవును. అందులోనూ బ్రహ్మాండంగా బ్రతగ్గలదు. చిన్నప్పణ్ణించీ మంగమ్మ పెరిగిన వాతావరణం అటువంటిది! అయితే రామచంద్రానికీ అభిప్రాయాల్లేవు. వాడు మంగమ్మను వదలలేడు. మంగమ్మ శరీరమంటే...ఈ క్షణానికీ వాడికి వల్లమాలిన అభిమానముంది. మంగమ్మ అనే ఆవిడ,ఈ సమాజంలోకి రావడమంటూ జరక్కపోతే, రామచంద్రం అన్ని వేలరూపాయలు నాటకాలకోసం ఖర్చుపెట్టి ఉంటాననడం అబద్ధం. ఈ పెట్టుబడి ద్వారా వాడు నష్టపోయిందేమీ లేదు. మంచినటుడన్న పేరుతో బాటు మంగమ్మ కూడా దొరికింది. వాళ్లిద్దరూ ఇప్పుడు అంటున్నాం.

వాడికీ మంగమ్మకూ సరసం సాగుతున్నదని పసిగట్టినప్పుడే నేను రంగం నుంచి తప్పుకొన్నాను. ఇందుకు రామచంద్రం కన్నా, మంగమ్మే ఎక్కువ సంతోషించి ఉంటుంది. రామచంద్రం ఎంత త్వరగా అతుక్కుంటాడో, అంతకన్నా రెట్టింపు వేగంతో ఊడిపోతాడు. పట్టిన పట్టు విడిచిపెట్టడం వాడి స్వభావికే విరుద్ధం. ఈ మనస్తత్వం మంగమ్మ లాటివాళ్లకు పనికొస్తుంది. నాకన్నా రామచంద్రం వల్లనే తన కెక్కువ ఉపయోగాలున్నాయని మంగమ్మ భావించిందంటే అందులో తప్పేమీ లేదు. సమాజానికి ఆయువుపట్టు వాడే కదా! కేవలం స్నేహరీత్యానే వాడు నాపెద్దరికాన్ని అంటగట్టాడు. నా మాటను వాడెన్నడూ కాదనలేదు. వాణ్ణి కాదని నేను చేసిన పనులు చాలా ఉన్నాయి. అవన్నీ వాడు సహించాడంటే, తనకన్నా నేను బాగా ఆలోచించగలనన్న నమ్మకం ఉండటమే. తాత్కాలికమైన ఉద్రేకాలకు లొంగి, దీర్ఘకాలిక ప్రయోజనాలను వదులుకోవడంలో నాకు అర్థం కనిపించలేదు. మంగమ్మకోసం, నేను వాడితో ధారాళంగా దెబ్బలాడగలను. అందువల్ల ప్రయోజనమేమీ లేదు. వాడు కూడా ఆవిడలో నాకు భాగమివ్వడానికి సంకోచించడని నాకు తెలుసు. తన శరీరం ఎరగా

చూపి,తనక్కావలసిన పనులన్నీ నా చేత సులభంగా చేయించుకోవచ్చునన్న అభిప్రాయం మంగమ్మకు కలిగినరోజు, ఆవిణ్ణి నేను అదుపులో ఉంచడం కల్ల. సగం అందుకే నేను ఆవిడ ప్రలోభాలకి లొంగలేదు. ఈ నిగ్రహం వల్ల నేను అద్భుతమైన ఫలితాలను సాధించాను. నేనంటే మా సమాజంలో వారందరికీ చచ్చేంత భయంగా ఉండేది. వాళ్ల తప్పులను, పొరపాట్లను, నేను తీవ్రంగా విమర్శించేవాణ్ణి. సరిదిద్దేవాణ్ణి. ఎవ్వరూ కిక్కురుమనేవాళ్లు కాదు. నేనూ నలుగురితో పాటు నారాయణవతుగా ఉంటే ఈ సమాజం ఇన్నేళ్లపాటు ఉండేది కాదు, ఇంత కట్టుదిట్టంగా పనిచేసేదీకాదు.

ఏది ఏమైతేనేం గానీ ఇవన్నీ గత సంఘటనలే అయిపోయాయి. వాటి ప్రభావం మా జీవితాల మీద ఎలా పనిచేసిందన్న ప్రశ్నకు ఇప్పుడప్పుడే సమాధానం చెప్పడం కష్టం. అయినా ఇది లాభనష్టాలు బేరీజు వేసుకునే సమయం కాదు. లాభంగాని, నష్టంగాని భరించక తప్పేదీలేదు. అయితే ఒక్క సంతృప్తి మాత్రం దక్కింది. మేము సమాజాన్ని ప్రారంభించిన ఆశయాలు చాలా మేరకు నెరవేరాయి. ఈ ఫలితాలు సాధించడం కోసం మేమెన్ని బాధలు పడ్డామన్నది వేరు విషయం. ఏ ఫలితం రావాలన్నా ఎంతో కొంత శ్రమపడకుండా వస్తుందన్న నమ్మకం నాకు లేదు. అలా వచ్చిన ఫలితం కష్టపడి సాధించిన విజయమిచ్చే ఆనందమిస్తుందనీ నేననుకోను.

ఆ మరునాడు మంగమ్మకు అయిదొందల రూపాయలిచ్చాను. ఆవిడ వాటికేసి ఓసారి చూసి, అలానే గుప్పెట్లో పెట్టుకుంది. ఆవిడ కళ్లల్లో మరోసారి నీళ్లు తిరిగాయి.

"నన్ను మర్చిపోతారా?" అన్నది మంగమ్మ వంగి నాకు దణ్ణం పెడుతూ.

"నువ్వేమనుకొంటున్నావ్" అన్నాడు రామచంద్రం.

ఈసారి మంగమ్మ నాకేసి శూన్యంగా చూసింది.

"ఏదో కొంపమునిగినట్టు బాధపడవలసిన అవసరం లేదు. నువ్వూమేమూ ఇంతటితో తెగతెంపులు చేసుకోవడం లేదు. మనమందరం కలిసి పనిచేసే అవకాశం మళ్లా రావచ్చు. అంతదాకా ఇది ఆటవిడుపు లాంటిది. గుంటూరుకూ,మా ఊరుకూ పదిమైళ్లలోపు దూరం ఎప్పుడు రావాలనుకుంటే అప్పుడే రావచ్చు. అర్థరూపాయి దూరంలో ఉన్నాం" అన్నాను.

ముగ్గురం వీడి చీడీల దాకా వచ్చాం. ప్రాణం ఉండబట్టక నేనువోసారి వెనక్కు తిరిగిచూశాను. ఇంటి యజమాని తాలూకు మనుషులు, ఇప్పటికప్పుడే ఇంటిని ఆక్రమించుకునే ప్రయత్నంలో ఉ
[illegible]

"వస్తాను" అంటూ నేను బయలుదేరాను.

"నువ్వు పదరా! నాక్కాస్తంత పనుంది. అది చూసుకుని, సాయంత్రం బస్సుకొస్తాను" అన్నాడు రామచంద్రం.

"ఉంటాను మేష్టారూ!" అన్నది మంగమ్మ ఏడుపును దిగమింగుకుంటూ ఏమనడానికీ నాకు మాట పెగిరి రాలేదు. తలొంచుకుని వీధి చివరిదాకా వచ్చేశాను. కాళ్లు ముందుకు సాగుతున్నయ్యన్నమాటేగానీ, ప్రాణాలన్నీ మా ఆఫీసు చుట్టూరా తిరుగుతూనే ఉన్నాయి.

వీధి చివర రిక్షా ఎక్కుతూ, ఇంకోసారి వెనక్కు తిరిగిచూశాను. రామచంద్రం తలొంచుకుని విసవిసా నడిచిపోతున్నాడు. మంగమ్మ మాత్రం చేసంచీ పట్టుకొని నిర్జీవంగా ఒక్కతే ఆఫీసు మెట్ల దిగువన నిలబడి ఉంది. దూరం నుంచి చూసినవారికి అక్కడో విగ్రహమున్నదనిపిస్తుంది గానీ, మనిషి నిలబడి ఉన్నదని మాత్రం అనిపించదు.

**(మాధవరావు కథ సమాప్తం)**

# 3

కొన్ని నిముషాల పాటు మంగమ్మ అలానే నిలబడిపోయింది. అది రోడ్డనిగానీ, తను బొమ్మలాగా నిలబడిపోయాననిగానీ మంగమ్మకు తెలీదు. చేతిలో సంచి అలానే ఉంది. ఇంకా ఎంతసేపలా ఉండేదో తెలీదు. ఓ పొడుగాటి నల్లటి కారొకటి దాదాపుగా ఆవిడమీద పడబోయినంత దగ్గరగా వచ్చి, చటుక్కున ఆగి, చెవులు గింగుర్లెత్తేలా అరవసాగింది.

"ఏవఁమ్మా! బతకాలని లేదా?" అన్నాడు డ్రైవరు, సైడులోంచి తల ఇవతలికి చూస్తూ.

వెనుకసీట్లో వేళ్లనిండా ఉంగరాలున్న ఆసామీ కూచుని ఉన్నాడు. ఎదర అద్దంలోంచి అతను మంగమ్మను చూశాడు. ఎక్కడో చూసిన మొఖం లాగా ఉంది. కానీ ఎక్కడ చూసిందీ చప్పున గుర్తుకు రాలేదు. అతనికి గుర్తుకొచ్చేలోగా మంగమ్మ అక్కడలేదు. ఆ సరికే ఆవిడ వీధి మలుపు తిరిగింది.

" ఆ పోయినావిడ నాటకాల్లో వేషాలేస్తుంది గదట్రా?" అన్నాడు ఉంగరాల మనిషి మంగమ్మ వెళ్లినవేపుగా చూస్తూ.

డ్రైవరు సన్నగా ఏదో గొణిగాడు.

-చాలా సేపటి వరకూ మంగమ్మ అలా నడుస్తూనే ఉంది. ఆవిడకో గమ్యమంటూ లేదు. దాదాపుగా, పిచ్చిదానిలాగా, పదకొండు గంటల వరకూ తిరుగుతూనే ఉంది. దోవలో చాలామంది ఆవిణ్ణి పలకరించారు. వారికేమని సమాధానం చెప్పిందీ మంగమ్మకు జ్ఞాపకం లేదు. ఒకరిద్దరు కొంటె వెధవలు, లోగడ ఆవిడాడిన నాటకాల్లోని  డైలాగుల్ని ఆవిడ వెనక బిగ్గరగా అరిచారు. మరొకప్పుడైతే ఆ డైలాగులు విని ఆవిడ తప్పకుండా సంతోషించి ఉండేది.

మధ్యాహ్నం మూడు గంటలకు హొటల్లో ఓ గది అద్దెకు తీసుకుంది. ఆదరా బాదరా ఇన్ని చన్నీళ్లు మీద దిమ్మరించుకుంది. పలచని చీర కట్టుకుని, మంచంమీదకి వాలింది. కొంత భారం తీరినట్లనిపించింది మంగమ్మకు. అంతవరకు ఆవిడ పచ్చిమంచినీళ్లయినా తీసుకోలేదు. తీసుకోవాలని కూడా ఆవిడకు అనిపించలేదు.

ఒక్కసారి మంచం మీంచి లేచికూచుంది. కిటికీలోంచి రోడ్డు, దానికవతలగా షాపులు, అందులో వొచ్చేపోయే జనం-తోపులాట, రకరకాలధ్వనులు-అందరూ ఏదో పనిలో మునిగితేలుతున్నారు.

వారందరికీ ఏవో ఆశలున్నాయి. ఏవో చేయాలన్న ప్రేరేపణలున్నాయి. వాటితో పోలిస్తే, తను రాయికన్నా అధ్వాన్నమనిపించింది మంగమ్మకు. తనకిప్పుడున్నదేమిటి? ఈప్రశ్నకు సమాధానం చెప్పుకోలేక మంగమ్మ గిజగిజలాడిపోయింది.

ఎలా గడవడమన్న భయం తనకు లేదు. రామచంద్రం గారన్నట్లు భగవంతుడు తనకింత అందమిచ్చాడు. వయసిచ్చాడు. ఈ రెండింటికీ మాంచి విలువున్న సంగతి తనకు తెలుసు. తనీ రోజున మళ్లీ, కాస్త కాలుజారితే తన్ను అందలాల్లో ఊరేగించేవారున్నారు. తన్ను పూలతో పూజించేవారున్నారు. తను మహాపతివ్రత కాదుగానీ, మరీ బజారుసరుక్కూడా కాదు. రోజుకో మగాడితో గడపడంలోని అసహ్యం,జుగుప్స బయటివారికి తెలీదు. తనా వాతావరణంలో పెరిగింది. కొంతకాలం ఆ బతుకు బతికింది. ఆ అనుభవాలను తలచుకుంటే వొంటిమీద తేళ్లు జెర్రెలు పాకినట్లుంటుంది తనకు. ఇప్పటికయినా మించిపోయిందేమీ లేదు. తనే క్షణాన నాగమణి దగ్గరకెళ్లినా ఆవిడ ఎగిరి గంతేస్తుంది. తనమీద వేలకు వేలు వ్యాపారం చేస్తానని నాగమణి ఏనాడో అన్నది. ఇప్పుడా అవకాశం

మరింత పెరిగిందేగానీ, తరగలేదు.

మామూలు రోజుల్లోనే తనంటే జనంపడి చచ్చేవారు. ఆ హెూటలు-దాని పేరేమిటో తనకిప్పుడు జ్ఞాపకం లేదు. ఆ ప్రొప్రయిటరు తనకోసం అంగలార్చాడు. వాడిదగ్గర వంద రూపాయలు పుచ్చుకుని, రాత్రికి తనగదిలోకి పంపించింది నాగమణి. మగవాళ్ల మీద అసహ్యం కలగడానికి అదే ప్రారంభం. ఆ కామేశ్వరరావు చూడడానికి ఎంత అందంగా ఉంటాడో లోపలంత వికారంగా ఉంటాడు. అతనన్న మాటలు, చేసినపనులు, తమ జన్మజన్మాలక్కూడా మరిచిపోలేదు. వాడు తాగడమే కాకుండా, తన్ను కూడా తాగమని బలవంతం చేశాడు. చేతులు రెండూ పైకెత్తించి వొళ్లు చీరుకుపోయేలాగా చూసేవాడు. అలా చూస్తూ చూస్తూ వాడు చేసిన పని -జ్ఞాపకం రాకుండా ఉంటే ఎంత బావుణ్ణు.

ఎంతమంది మనుషులు? ఎన్నిరకాల మనుషులు? ఏ ఇద్దరికీ సంబంధాలుండవు. ఏ ఇద్దరికీ పోలికలుండవు. మెరకవీధికొచ్చేసరికి ఇట్టే చిత్రంగా మారిపోతారు. వాడెవడో ఉండాలి-రాజేశ్వరరావుట, పెద్దపొగాకు వ్యాపారం చేస్తాట్ట. కూలీలకు సరిగ్గా కూలీ డబ్బులివ్వ కుండా నానాహింసలూ పెడతాట్ట. వాడిదగ్గర తను నాలుగొందలు కొట్టేసింది.

రాజమణి అంటూ ఉండేది-''ఎక్కడన్నా ఇల్లు చూసుకుని నువ్వూ నేనూ ఉందాం పదవే! ఇద్దరం తలుచుకొన్నామంటే ఈ టౌనంగా పూడ్చిపారేస్తాం'' అని.

తనకా వృత్తి మీద ఎంత అసహ్యమో రాజమణికి తెలీదు. కానీ తనా అసహ్యాన్ని బయటకు కక్కలేదు. అందువల్ల ప్రయోజనమేమీ లేదని తనకు తెలుసు.

''పోలీసు ఇన్‌స్పెక్టర్ కరీం నాకు తెలుసు. గాడిద కొడుకు, నేను కనబడితే చాలు, వళ్లు మర్చిపోతాడు. అవసరమయితే మనకే ఇబ్బంది రాకుండా చూడమని వాడితో చెబుతాను, నీ అంత చాకచక్యంగా డబ్బు పిండలేకపోయినా, నచ్చిన ఖాతాలను మాత్రం పోగొట్టను లేవే'' అనేది రాజమణి.

దానికీ వాతావరణంలోంచి రావాలని లేదు. రామచంద్రం మాధవరావులు రాకపోతే ఏమయ్యేదో తను చెప్పలేదు గానీ వారు రావడంతో తన బతుకులో, ఓ గొప్పమార్పు వచ్చింది. ఆ ఊబిలోంచి తను బయటపడింది. ఇంతకు ముందుదాకా రాజవిలాసంగా రోజులు గడిచిపోయాయి. ఇంతకాలం తర్వాత మళ్లా మొదటి ప్రశ్న ఆవిడముందుకొచ్చింది. దానికిప్పుడు తను విధిగా జవాడు చెప్పుకోవాలి.

''కాఫీ తాగుతారా అమ్మా?'' తలుపు వోరగా నించుని సర్వర్ అడిగాడు.

''ఊఁ!''

''టిఫిన్ కూడా తీసుకురమ్మంటారా?'' అన్నాడు వాడు.

''ఊఁ!''

''ఏం తీసుకురమ్మంటారు?''

ఈసారి 'ఆఁ'-'ఊఁ'లతో జవాబు చెప్పేందుకు లేదు. అంచేత-

''ఏదోటి తీసుకురా!'' అన్నది మంగమ్మ, సర్వర్‌కేసి తిరిగి.

వాడు మంగమ్మ కేసే చూస్తున్నాడు. వాడి కళ్లు తళతళలాడుతున్నాయి. దాహం గొన్నవాడిలాగా పెదవులు తడుపుకొంటున్నాడు. ఈ లక్షణాలను ప్రదర్శించే మగవాడు లోలోపల ఏమనుకొనేది మంగమ్మకు అనుభవమే! ఆ సంగతి మనస్సులో మెదలగనే 'ఓరి వెధవా!' అనుకొన్నది మంగమ్మ.

''వెళ్లవోయ్! త్వరగా కాఫీపట్రా'' అన్నది మంగమ్మ విసుగు నటిస్తూ.

సర్వర్ తలదించుకుని వెళ్లిపోయాడు. వాడు వెళ్లాక మంగమ్మ తనలో తనే నవ్వుకొంది. ఆ

నవ్వు నవ్వులాగా లేదు-ఏడవలేక నవ్వినట్లుంది.

సర్వర్ కాఫీతో బాటు ఫలహారం కూడా తెచ్చి బల్లమీద ఉంచి, ఎడంగా నిలబడ్డాడు.

“నీ కిక్కడేమిస్తారోయ్” అన్నది మంగమ్మ చేతులు కడుక్కొంటూ.

వాడో క్షణం తటపటాయించి ‘నూటయాభై’ అన్నాడు. అది అబద్ధమని తెలిసిపోతూనే ఉంది. ఆ మాట ముఖం మీదనే అనేయడం మంగమ్మ కిష్టంలేదు.

“ఊఁ!” అన్నది మంగమ్మ. “సంసారం లేనివాణ్ణి, వొంటరిగాణ్ణీ. ఎక్కడి తొక్కిడిగా సరిపోతాయి” అన్నాడు వాడు. మంగమ్మను మింగేసేలా చూస్తూ. “సుఖపడు నాయనా!” అనుకొంది మంగమ్మ, ఆ విషయమే నిజం కావాలని లోలోపల కోరుకుంటూ.

ఆవిడ తిన్నదాకా ఉండి, పళ్ళాలూ కప్పులూ తనే పట్టుకెళ్ళాడు. వెడుతూ వెడుతూ మరోసారి మంగమ్మ కేసి తిరిగి, అదోలాగా కళ్ళు తిప్పాడు.

“ఓరి నా బిడ్డా!” అనుకొంది మంగమ్మ నవ్వి. ఆవిడ కెందుకో, వొక్కసారి నాగమణిని చూడాలనిపించింది. గబగబా స్నానం చేసింది మళ్ళీ. ఉన్నవాటిల్లోకల్లా మంచి చీర తీసి కట్టుకొంది. పట్టు జాకెట్టు తొడుక్కొంది. రెండు జడలు వేసుకొంది. ఓ జడ ముందుకు, మరోటి వెనక్కు సర్దుకొంది. ముంగురులను కొద్దిగా రేపుకొంది. అయిదారు వెంట్రుకలను మెలితిప్పి ఎడం కనుబొమ్మ మీదుగా జిగురుతో అంటించుకొంది. ఇంత స్నో పట్టించి, కొద్దిగా సెంటు రాచుకొని, ప్లాస్టిక్ చే సంచిని వూపుకొంటూ వీధిలో కొచ్చింది.

వెనకనుంచి ఎవరో ‘మంగమ్మరా! నాటకాల్లో వేషాలేస్తుందే, అదీ!’ అంటున్నారు.

పోతున్న రిక్షాను ఆపి, చెంగున ఎక్కి కూచుంది.

“నాగమణి ఇంటికి పోనివ్వవోయ్! కోళ్ళగూడెం పక్కకి” అన్నది మంగమ్మ.

“హైసా” అని నవ్వి, గంటను మోగించాడు రిక్షావాడు.

నున్నని తారురోడ్డు మీదుగా రిక్షాచక్రాలు ‘రఁయ్’ మని జారిపోతున్నాయి. ఆ చక్రాల లాగే మంగమ్మ ఆలోచనలు కూడా తిరుగుతున్నాయి. రిక్షావాడు, మధ్య మధ్య గంటను మోగించుతూ, కుదుపులు వచ్చిన చోట వేగాన్ని తగ్గిస్తూ ఉత్సాహంగా తొక్కుతున్నాడు. ఇటువంటి బాడుగుల వల్ల కలిగే లాభమేమిటో వాడికి బాగా తెలుసు.

మంగమ్మ మనస్సు మనస్సులో లేదు. అదిప్పుడో ఇసుళ్ళపుట్టలాగా ఉంది. తనిప్పుడు నాగమణి ఇంటికి ఎందుకు వెడుతున్నదో తెలీదు. తిరిగి పూర్వపు జీవితంలో అడుగు పెట్టాలన్న ఉద్దేశమా? అదెంతమాత్రం లేదు. ఆ వృత్తి వల్ల అర్థికమైన బాధలంటూ ఉండనిమాట నిజమే గానీ, బతుకంటే డబ్బు ఒక్కటే కాదుగదా! ఈ నాటకాల గొడవతో, తనీ ఊబి నుండి బయటికి రాకపోతే, అదే పరమార్ధమనుకొనేదేమో మరి! అంతకన్నా మంచి బతుకు కొన్నేళ్ళపాటు బతికింది. ఈ క్రొత్త బతుకులో డబ్బూ, కీర్తి కూడా లభించాయి. ఇప్పుడు తిరిగి ఆ మురికి కూపంలోకి వెళ్ళడంలో అర్థం లేదు.

మరో అరగంటకల్లా నాలుగైదు గొందులు తిరిగి ఓ పాతరకం పెంకుటింటి ముందు రిక్షా ఆగింది.

“దిగండి!” అన్నాడు రిక్షావాడు వచ్చే నవ్వును ఆపుకొంటూ.

మంగమ్మ హఠాత్తుగా మేలుకున్నదానిలాగా ఉలిక్కిపడింది. ఎదురుగా నాగమణి ఇల్లు. లోపలి నుంచి ఒకటి రెండు ముఖాలు తొంగిచూసి పక్కకు తప్పుకొన్నాయి. మంగమ్మ ఓ రూపాయి నోటు

రిక్షావాడి కిచ్చి చిల్లరకోసం ఎదురు చూడకుండానే లోపలికొచ్చింది. వీధిలో ఉండగా, తొంగి చూసిన రెండు ముఖాలు మంగమ్మను ఎగాదిగా చూస్తున్నాయి.

"అమ్మలేదూ?" అన్నది మంగమ్మ ఆ కొత్తముఖాల కేసి తిరిగి, పరిశీలనగా చూస్తూ.

"ఎవరు?" అన్నది వాళ్ళల్లో చిన్నావిడ, మంగమ్మను ఎగాదిగా చూస్తూ.

మంగమ్మ ఏ జవాబూ చెప్పలేదు. ఆ ఇంటినంతా కళ్ళతో వెదికింది. ఇల్లు లోగడలా లేదు. గోడలకు మంచి మంచి రంగులతో బాటుగా అందమైన పటాలు కూడా ఉన్నాయి. హాలు మధ్య సోఫాలు, ఓ మూలగా రేడియో గ్రాం, ఇంకో ప్రక్కన పుస్తకాలు, పత్రికలు, ఎదురుగా ఉన్న బీరువాలో పింగాణి సామాను, నేలమీద మెత్తని తివాచీ-తనుగానీ పొరబాటు పడలేదుగదా అనుకొంది మంగమ్మ. ఆవిడ నోటినుండి మాట వచ్చేలోగానే మరో అరడజను మంది అమ్మాయిలు చుట్టూ ఉన్న గదుల్లోంచి మధ్య హాలులో కొచ్చారు. వారందరూ మంగమ్మకు కొత్తవారే.

"మీరు మంగమ్మగారే కదూ?" అన్నదో అమ్మాయి, కళ్ళు ఇంత చేసుకొని మంగమ్మ కేసి అప్యాయంగా చూస్తూ.

"ఆఁ"

"వస్తా" అంటూ ఆ పిల్ల లేడిలాగా దూసుకుపోయింది లోపలకు.

"కూచోండి, అక్కయ్య ఇప్పుడే వస్తుంది" అన్నదింకో అమ్మాయి, కుర్చీని మంగమ్మ నించున్న చోటుకు జరుపుతూ.

మిగిలినవాళ్ళు మంగమ్మను చూస్తూ ఏమిటేమిటో గుసగుసలాడుకొంటున్నారు. ఒకటి రెండు నిమిషాల్లోనే ఇందాక లేడిలాగా దూసుకుపోయిన పిల్ల, అంత వేగంగానూ, మళ్ళా హాల్లోకి వచ్చింది. ఆ పిల్ల వెనకనే మరో ఆవిడ నెత్తినిండా ముసుగు వేసికొని, నడకా పరుగూ కాకుండా వచ్చింది. వస్తూనే రెండు చేతులు చాపి 'మంగమ్మో!' అంటూ కావలించుకుంది. ఆ గొంతు విన్నాకగానీ రాజమణిని గుర్తుపట్టలేకపోయింది మంగమ్మ. రాజమణి బొమ్మ మన స్సులో మెరవడంతోనే ఎవరో పట్టకారుతో నరాలను మెలిపెట్టి లాగినట్లనిపించింది మంగమ్మకు. ఉవ్వెత్తున లేచి తన సర్వశక్తులతోటి రాజమణిని తనలోకి హత్తుకుంది. ఇద్దరి కళ్లూ నీటితో నిండిపోయాయి. చాలాసేపటి వరకూ ఇద్దరూ అలానే ఉండిపోయారు.

లేడిలాగా లోపలికి పరుగెత్తుకుపోయిన వాసంతి ముఖం ఎందుకో మబ్బు కమ్మినట్లయిపోయింది. మిగతావాళ్లు ఏమిచెయ్యడానికి తోచక అలానే నిశ్చేష్టులయి చూస్తున్నారు.

"చాలా చిక్కిపోయావు రాజ్యం!" అన్నది మంగమ్మ. ముందుగా తనే కౌగిలిని విడిపించుకుంటూ.

రాజమణి మాట్లాడలేదు. ఆవిడ చేతులు పూచిక పుల్లల్లాగా విడిపోయాయి.

"కాఫీ పట్టుకురండ్రరా!" అని ఎదురుగా నుంచున్న పిల్లకు చెప్పి, "రా లోపలికి పోదాం" అన్నది రాజమణి.

"వొద్దు. ఇక్కడే కూచుందాం" అన్నది మంగమ్మ, లోపలి గదిలో జరిగే వ్యవహారాలన్నీ జ్ఞాపకం వచ్చి.

"పర్వాలేదు లేవే, రా. ఇప్పటికప్పుడే వ్యాపారం మొదలవదులే" అన్నది రాజమణి నీరసంగా నవ్వుతూ.

మంగమ్మ తన పాత స్నేహితురాలికేసి చూసింది. బుగ్గలు లోపలికి పీక్కుపోయాయి. ముందు

వరసన రెండు పళ్లు లేవు. నోటిపక్కగా రెండు చారికలు, ముసలితనాన్ని ముందుకు లాక్కుపోతున్నట్లున్నాయి. కళ్ల కింది లోతులు నల్లగా కప్పేశాయి. వార్ధక్యాన్ని అలంకారాలతో కప్పాలన్న వ్యర్థ ప్రయత్నాలన్నీ రాజమణి ముఖంలో కానవస్తున్నాయి.

ఆవిడ మంగమ్మ చెయ్యి పట్టుకుని లోపలికి నడిపిస్తూ ఉంది. ఆ వరండాలో అడుగులు వేస్తూనే మంగమ్మ వణికిపోయింది. ఆ గదులన్నీ తనకు పరిచితమైనవే. వాటిల్లో తాను నెలలకు నెలలు గడిపింది. ఇప్పటికీ ఏ గదిలో ఏమి జరిగిందీ మంగమ్మకు జ్ఞాపకం ఉంది.

"లోగడ నువ్వుండే గదిలో ఇప్పుడు వసంత అనే పిల్ల ఉంటోందే. నువ్వు చూశావుగా, సన్నగా, పొడుగ్గా ఉంటుందే అదే" అన్నది రాజమణి.

మంగమ్మ మాట్లాడలేదు.

"దానికీ, నీ అంతపేరు తెచ్చుకోవాలని ఉంది. ఎంత బాగా పాడుతుందని! ఒక్కసారి సినిమా చూసిందంటే చాలు. ఆ పాటలన్నీ ఇట్టే నోటికి పట్టేసుకొంటుంది. ఉన్నవాళ్లందరిలోకి దానికే కాస్తంత గిరాకీ ఉంది. ఆ శకుంతల ఉంది చూశావూ. మాలావు దొంగది. మాటలతో మనిషిని మైదుపుచ్చి అవతలకు పంపుతుంది... ఏమిటే నువ్వు, చెప్పేది వింటున్నట్టా లేదా?" అన్నది రాజమణి, స్నేహితురాలికేసి తిరిగి చూస్తూ.

"అవును గానీ, నాగమణి కనిపించదేం?"

"నీకింకా తెలియదా?" అన్నది రాజమణి. "అది ఇంటిని విడిచిపెట్టి రెండేళ్లయింది. ఇప్పుడు ఆ మూలెక్కడో ఇంకో ఇల్లు తీసుకుని ఉంటోంది".

ఇద్దరూ రాజమణి గదిలో కూచున్నారు. వసంత రెండు కప్పులతో కాఫీ తెచ్చి బల్లమీద పెట్టింది. ఆ బల్లమీద రకరకాల మందుసీసాలు, ఒక ఔన్సుగ్లాసు ఉన్నాయి. ఓమూలగా ధర్మామీటర్ కూడా ఉంది.

"ఏమిటే ఇదంతా?" అన్నది మంగమ్మ.

రాజమణి మాట్లాడలేదు. మెల్లగా జాకెట్ గుండీలు విప్పి పొట్టను చూపించింది. రూపాయి కాసంత మచ్చలు నెత్తుర్లోడుస్తూ కనిపించాయి.

"ఇదంతా ఆ బద్మాష్ చేశాడు. వాడేదో వొరగపెడతాడనుకుని రానిచ్చాను. శరీరం కుళ్లిపోయింది. అంతదాకా అది చేస్తా, ఇది చేస్తానన్నవాడు జబ్బు కనిపించగానే రావడం మానేశాడు. ఆఖరికి వాణ్ణి ధ్వంసం చేసిందాకా నేనూ వదల్లేదనుకో, కాని ఏం లాభం మంగమ్మా! వాడు హాయిగా చచ్చాడు. నేను బతికుండి కూడా, చావు బాధ పడుతున్నాను" అన్నది రాజమణి.

"ముందు కాఫీ తాగు. తరువాత మాట్లాడుకొందాం" అన్నది మంగమ్మ. రాజమణి దృష్టిని మార్చేస్తూ రాజమణి నిశ్శబ్దంగా కాఫీ తాగింది.

"నాకూ నాగమణికీ వీడిదగ్గరే చెడిపోయిందే! నువ్వు అదృష్టవంతురాలివి, తొందరగా బయటపడ్డావ్! నువ్వు పోయినప్పటి నుంచీ నాగమణి మరింత కట్టుదిట్టం చెయ్యడం సాగించింది. ఆ భడవ ముండకు పాపపుణ్యాలు, దయాదాక్షిణ్యాలు అసలే లేకుండా పోయాయి. కానీ కోసం ప్రాణాలు తియ్యమంటే, అది నిస్సంకోచంగా తీసేస్తుంది. డబ్బు, డబ్బు, డబ్బు-అపరిమితమైన డబ్బు దాహం దానికి పట్టుకొంది. ఇవతలి మనుషులు ఏమవుతారన్న ఆలోచన దానికి లేదు. ముండ-ఇప్పుడు కటికపస్తులు చేస్తోంది" అని కాఫీ కప్పు బల్లమీద పెట్టింది రాజమణి.

"దానిగుణం నాకు తెలుసు" అన్నది మంగమ్మ.

"ఓసి పిచ్చిముఖందానా, నువ్విక్కడ ఉన్నప్పుడు ఆవిడ దేవతకదుటే!"

"అదీ ఇంట్లోంచిపోవడమెందుకొచ్చిందీ?" అన్నది మంగమ్మ.

వాసంతి కాఫీకప్పులు పట్టుకెళ్లి ఓ సిగరెట్ పెట్టా, అగ్గిపెట్టా తెచ్చింది. రాజమణి ఓ సిగరెట్ వెలిగించి గుండెల నిండుగా పొగ పీల్చి వదిలింది.

"నువ్వేమార్కు కాలుస్తావే?" అన్నది రాజమణి.

"ఏదీ వొద్దు".

రాజమణి నవ్వింది, చిటికెనవేలితో సుతారంగా సిగరెట్ నుసి రాల్చుతూ, మంగమ్మ కేసి చూసింది.

"అసలేం జరిగిందంటే...-" అంటూ ప్రారంభించింది రాజమణి. "నెల్లూరు నించి ఇద్దరు ఆసాములొచ్చారు. అబ్దుల్లా-నీకు జ్ఞాపకం ఉన్నాడా?"

"ఓ-వాడింకా బేరాలు కుదురుస్తూనే ఉన్నాడా? పాపం, వాడికో కూతురుండాలి గదూ?" అన్నది మంగమ్మ.

"ఉంది ఉంది, దానిపేరు కుతుబ్, దానికి పెళ్లయింది. ఆ మొగుడో లత్కోరు వెధవ, రెండేళ్లు దాన్ని నానాబాధలూ పెట్టి చచ్చాడు. అప్పటికి కుతుబ్‌కో కూతురు. అది కూడా ఇప్పుడు, ఈ పేటలోనే ఉంది. మరేం చస్తుందా? కూతుర్ని, వందరూపాయలకు ఎవరికో అమ్ముకొంది. అబ్దుల్లాగాడు కూతుర్ని అడ్డంపెట్టుకొని బతుకుతున్నాడు. వాణ్ణి-దేవుడు కూడా బాగు చెయ్యలేడనుకోవే మంగమ్మ!సరే-ఎంతవరకొచ్చానూ? ఆఁ అవునా? ఆ అబ్దుల్లాగాడు నెల్లూరు ఆసాముల్ని మనింటికి పట్టుకొచ్చాడు. ఇద్దరూ పిడిరాళ్లున్నట్లు ఉన్నారనుకో. వాళ్లు మైకా బిజినెస్ చేస్తారట. నాగమణితో మాట్లాడి నన్ను కుదుర్చుకొన్నారు. నాకెందులో ఆ పూట మనస్సు బాగాలేదు. అంతకు ముందు నాలుగైదు రోజుల పాటు జ్వరం కూడా తగిలింది. నన్నడిగితే కాదన్నాను గదా అని, ఆ ఆసాములు, "నువ్వే కావాలం"టూ పట్టుబట్టారు. పదిరూపాయల నోట్ల కట్ట నాగమణి మీదికి విసిరేశారు. డబ్బుచూడడంతోనే దానికి మతితప్పిపోయింది. "మీరు భోంచేసి రండి నాయనా! మిగతా సంగతులు మీకెందుకు, నేను చూసుకొంటానుగా!" అంటూ నాగమణి వాళ్లను సాగనంపింది.

"నాగమణి మీద, అదివరకెన్నడూ రానంత కోసం వచ్చిందే మంగమ్మా! చెడామడా తిట్టాను, అదీ తిట్టింది. నేనూ తిరగబడ్డాను. అది నన్ను గొడ్డును బాదినట్టు బాదింది. వొళ్లంతా వాచిపోయింది. నాకైతే తెలీదు గాని, ఆ రోజంతా నేను పిచ్చిపిచ్చిగా అరిచానుట- బృంద చెప్పింది. అసలీ నాగమణికి మనమీద ఎవరు అధికారమిచ్చారో తెలీదు. మనం సంపాదిస్తున్నాం, ఆ సంపాదనంతా అది కాజేస్తోంది. మనకు తిండి గుడ్డా ఏడుస్తూ ఇస్తోంది. మన సంపాదన మనకే ఎందుకు ఉండకూడదనిపించింది. అందర్నీ కూడగట్టుకొన్నాను. అందరూ నన్నే సైడ్ చేశారు. దాన్ని జుట్టుపట్టుకొని బయటికి లాగాం. ఈలోగా ఇన్‌స్పెక్టర్‌కు కబురుచేశాను. అతగాడొచ్చి, నాగమణిని అరెస్టు చేసి పట్టుకెళ్లాడు. దాంతో మా పీడా వదలిపోయింది. దానికి రెండు మాసాలో, ఏమో శిక్ష కూడా పడింది. జైల్ నుంచి వచ్చాక, అది మళ్లా వచ్చింది. గడప మీద కాలుపెడితే తంతానని చెప్పాను. బెదిరించింది, బామాలింది, కాళ్లమీద పడి ఏడిచింది".

"పోనీ, రానివ్వకపోయావుటే?" అన్నది మంగమ్మ.

"దాన్నా? నా గొంతులో ఊపిరుండగా, మళ్లా ఈ కొంపలోకి రానిస్తానుటే పిచ్చిదానా! సాగినంతకాలం, దాని అధికారం సాగింది. మనుషుల్ని గానుగలో వేసి పిండి డబ్బు సంపాదించింది.

ఎంతమంది కుళ్లి, పురుగులు పడి చచ్చారో నీకు తెలీదా? దాన్ని పాపమన్నవాళ్లకు పురుగులు పడతాయి'' అన్నది రాజమణి.

''ఇప్పుడేం చేస్తోంది?''

''కొంతకాలం పాటు మళ్లా వ్యాపారం చెయ్యాలని చూసింది. అది సాగలేదు. చెవుల పోగులమ్మి వేరుశనక్కాయలు, శనగగుగ్గిళ్లు చేసింది. అదీ సాగడం లేదు. ఇప్పుడు ఎవరన్నా పెడితే ఇంత తింటుంది. లేదా పస్తులుంటుంది''.

''అక్కా!'' అంటూ వసంత వచ్చింది.

ఆ పిల్లను చూసింది మంగమ్మ. తెలివైనముఖం, ఇంకా నలిగిపోని పువ్వులాగా నవనవలాడుతూ ఉంది.

''ఏమిటమ్మా?'' అన్నది రాజమణి.

''ఆ మంగళగిరివాళ్లొచ్చారు'' అన్నది వసంత ముఖం అదోలాగా పెట్టి.

''నీ ఇష్టం మరి'' అన్నది రాజమణి.

''ఈ పూట-వొద్దులే అక్కా! శకుంతల సరేనన్నది. వాళ్లు నేనే కావాలంటున్నారు, చచ్చినాళ్లు''.

''ఇప్పుడేవస్తానుండవే!'' అంటూ రాజమణి వెళ్లిపోయింది.

''నీదేవూరమ్మాయ్?'' అన్నది మంగమ్మ, వసంతను కూచోమంటూ చేత్తో సైగచేసి.

''ఏలూరు''.

''నువ్వు బాగా పాడతావటగా!''

వసంత నవ్వింది.

మంగమ్మ ఇంకేదో అడగబోయింది. అంతలోనే రాజమణి ధుమధుమలాడుతూ వచ్చింది.

''ఏమిటే, ఆ కోపం?'' అన్నది మంగమ్మ నవ్వుతూ.

''ఏం మనుషులే వీళ్లు? దత్తి తీర్చుకోవడానికి ఎవరైతేనేమిటిట? ఆ సన్నాసులకు వసంత తప్ప ఇంకెవ్వరూ పనికిరారుట''.

''వొంట్లో బావోలేదా?'' అన్నది మంగమ్మ మెల్లగా వసంత తల నిమురుతూ.

''అది కాదే! మునుపోసారి, యాభై రూపాయలిచ్చి, ఈపిచ్చిముండను, వాళ్లగదికే పట్టుకెళ్లారు. ఈ ఇద్దరూ గాక, అక్కడింకో ఇద్దరున్నారుట. తెల్లవార్లూ దాన్ని చావచితకగొట్టి పంపించారు. బిడ్డ-నాలుగురోజుల దాకా మనిషి కాలేదనుకో మంగమ్మా! ముష్టి డబ్బును, మనం ఎంత చూశాం కాదూ! వేలు సంపాదించి, వేలు ఖర్చు పెట్టాం! ఈ లుచ్చాగాళ్ళిచ్చే యాభై రూపాయల కోసం ముఖం వాచి కూచున్నామా? పొమ్మని చెప్పేశాను. సిగ్గులేని వెధవలు పోరుగదా! కావలిస్తే ఇంకో పాతిక పుచ్చుకోమన్నారు. ఆ పిల్ల మందు తింటోందని చెప్పొచ్చాను. పోతామన్నారు. మరి పొయ్యారో లేదో తెలీదు'' అన్నది రాజమణి.

''మరి నేను వెడతానోయ్!'' అని మంగమ్మ లేవబోయింది.

రాజమణి రెండు చేతులూ మంగమ్మ భుజాల మీద వేసి నొక్కింది.

''ఈ పూట పోవడానికి వీల్లేదు. ఎన్నేళ్ల తరవాతనో వచ్చావు. ఈ వొక్క రాత్రీ నాతో ఉండిపోవాలి. పొయ్యావంటే నామీద వొట్టే!'' అన్నది రాజమణి. ఆ ఆప్యాయతకు మంగమ్మ కరిగిపోయింది.

''నేనుంటే నీకు అడ్డం కాదు గదా?'' అన్నది మంగమ్మ నవ్వుతూ.

''పత్తిత్తులాగా మాట్లాడకోయ్. నీగ్గూడా ఏమన్నా బేరం మాట్లాడమంటావా?'' అన్నది రాజమణి,

లుంగలు తిరిగేదాకా నవ్వుతూ.

మంగమ్మ కూడా నవ్వింది.

''మనమంటే ఢక్కామొక్కీలు తిన్నవాళ్లం-ఫర్వాలేదు గానీ, ఈ వసంతలాంటివాళ్లు ఈ వృత్తికే పనికిరారే మంగమ్మా! నా దగ్గరే డబ్బుంటే, ఎవణ్ణన్నా మంచివాణ్ణి చూసి పెళ్లిచేద్దును. నువ్వు వినలేదు గాని మంగమ్మా! ఎంత బాగా పాడుతుందని! పైన పొయ్యే పక్షులు ఆగి ఆలకిస్తాయనుకోవే! ఈ పాడుముండా వ్యాపారంలోంచి దాన్ని కాస్త పైకి లాగానో- నీ మేలు జన్మ జన్మాలకూ మరచి పోననుకో. మీ నాటకాల్లోకి ఆడవాళ్లు కావాలిగా! కాస్త-మరి ఆ రామచంద్రంగారికో, మాధవరావుగారికో చెప్పరాదుటే!'' అన్నది రాజమణి.

మంగమ్మ సన్నగా నిట్టూర్చింది.

ఆవులిస్తే పేగులు లెక్కపెట్టే రాజమణి, ఏదో జరిగిందని వెంటనే పసిగట్టింది.

''నువ్విపుడా నాటకాల కంపెనీలో లేవా?'' అన్నది రాజమణి.

ఆవిడ గుండెలు దడదడలాడాయి.

''లేను. ఆ కంపెనీని ఎత్తేశారు''.

నెత్తిమీద ఎవరో అణచిపెట్టినట్లుగా రాజమణి నీరసంగా కుర్చీలోకి జారిపోయింది. ఆవిడ నోట మాట రాలేదు. కళ్లల్లో మాత్రం నీళ్లు ఊరాయి.

''ఇప్పుడేమయిందనే ఆ విచారం?'' అన్నది మంగమ్మ.

''ఈ కూపంలోంచి నువ్వన్నా బయటపడ్డావనుకున్నాను. తిరిగి ఇక్కడికి వచ్చావన్నా మాట! ఏం బతుకుల్లే మనవి మంగమ్మా! ఛాఛా!...'' అన్నది రాజమణి.

మంగమ్మ ఏమీ మాట్లాడలేదు.

''అయితే నువ్విపుడేం చేద్దామనుకుంటున్నావే?'' అన్నది రాజమణి కన్నీళ్లు తుడుచుకుంటూ.

''ఇంతవరకూ ఏమీ అనుకోలేదు''.

''అందాకా నాదగ్గరే ఉండవే! భగవంతుడి దయవల్ల వ్యాపారం బాగానే సాగుతోంది. ఉన్నంతలోనే ఇద్దరం తిందాం! నేను తిని, నిన్ను పస్తుంచుతానన్న మాట కల్ల. ఉంటే ఇద్దరం తిందాం. లేకపోతే ఇద్దరం పస్తులుందాం, సరేనా!'' అన్నది రాజమణి.

ఈ మాటలు మంగమ్మ మీద బాగా పనిచేశాయి. ఆవిడ హఠాత్తుగా రాజమణిని కావలించుకుని ''నువ్వెంత మంచిదానివే రాజ్యం!'' అన్నది, ఏడుపుతో పూడుకుపోయిన గొంతును సవరించుకొంటూ.

క్రమక్రమంగా గదుల్లో సందడులెక్కువవుతున్నాయి. రేడియోలో లత కంఠం కమ్మగా వినిపిస్తోంది. మంగమ్మ ముఖంలో సన్నగా చిరునవ్వు వెలుగుతోంది. వసంత లేడిపిల్లలా అటూ ఇటూ గెంతుతోంది.

''మరి నేను వెడతాను'' అన్నది మంగమ్మ.

''అంతేగానీ ఉండవన్నమాట!'' అన్నది రాజమణి.

''నువ్వలా నిష్ఠూరాలాడకే రాజ్యం! నువ్వు నాకు కొత్తదానికి గనకనా, ఇంతసేపు బతిమిలాడించుకోవడానికి? మళ్లా వస్తానుగా!'' అన్నది మంగమ్మ.

''సరే నీ ఇష్టం!'' అన్నది రాజమణి నీరసంగా లేచి నిలబడుతూ. 'రేపు ఉదయం రావే ఇద్దరం ఇక్కడే భోంచేద్దాం. పనికూడా లేదుగా!'' అన్నది రాజమణి.

“అలాగే”నంటూ మంగమ్మ లేచింది.

వసంత ఓసారి నవ్వి, మంగమ్మ వెనకాలే బయలుదేరింది.

“నీ పాట వినడం పడలేదు వసంతా! రేపొస్తాను. తప్పకుండా నీ పాట వింటాను. నాకు చేతనయిన సహాయం నీకు చేస్తాను”.

వసంత కళ్లు మిలమిల్లాడాయి.

మంగమ్మ చుట్టూ చాలామంది అమ్మాయిలు చేరారు. మధ్య హాలులోకి వచ్చేసరికి అక్కడ అయిదారుగురు మొగవాళ్లు కూచుని ఉన్నారు. ఎంతో ఖరీదైన గుడ్డలు వేసుకొన్నారు. ఒకతను రూపాయల నోట్లకట్టలుపైకి కనిపించేలాగా జేబులో పెట్టుకొన్నాడు. ఆయన మంగమ్మను చూస్తూనే కళ్లింత చేసుకొన్నాడు. ఓసారి వొళ్లంతా కుదుపుకొని, మంగమ్మను చూపులతో తడివి, పెదిమలు తడిచేసుకొన్నాడు.

“నిన్నెక్కణ్ణో చూశాను” అన్నాడతను మంగమ్మను చూపులతో కట్టేస్తూ.

వాడి అభినయాన్ని చూసిన తరువాత, కాస్సేపు ఏడిపించాలనిపించింది మంగమ్మకు.

నవ్వుతూ, అతనికి తగిలేంత దగ్గరగా వచ్చింది. ఉత్తినే పమిట సరిచేసుకొంది. సిగ్గుపడుతున్నట్లుగా తలను దించుకుని గబగబ బయటకొచ్చింది.

రాజమణి, వసంత లోలోపల చచ్చేట్టు నవ్వుకొన్నారు. అతగాడు కుర్చీలో ఉక్కిరిబిక్కిరయిపోతున్నాడు.

“అలాచేశావేం?” అన్నది రాజమణి

“తప్పా?” అన్నది మంగమ్మ.

రాజమణి ఇంకేమీ మాట్లాడలేదు. ముగ్గురు ఆడవాళ్లు వీధిలోకొచ్చాక, దూరంగా ఉన్న రిక్షావాడొకడు గంట మోగించుకొంటూ చీడీల దగ్గరకు బండిని తీసుకొచ్చాడు.

మంగమ్మ ఎక్కి కూచుంది.

రిక్షావాడు టాపు వేయబోతున్నాడు.

“అక్కర్లేదు లేవోయ్...వీలుంటే రేపొస్తాను రాజ్యం! వస్తానమ్మా వసంతా!...పోనియ్యవోయ్” అన్నది మంగమ్మ.

రెండు ఫర్లాంగులొచ్చాక గానీ మంగమ్మకు, నాగమణి సంగతి జ్ఞాపకం రాలేదు. “ముసలితొక్కు ఎలా ఉందో చూదామా” అనిపించింది మంగమ్మకు. కాని తనకు సరైన ఎడ్రస్ తెలియదు. ఈ చీకట్లో ఆ ఇల్లు వెదుక్కుంటూ తిరగడం కన్నా రేపు వెడితేనే బావుంటుంద౯నుకొంది. రిక్షాను సరాసరి హొటలుకు పోనివ్వమంది. దోవలో ఆవిడకు ఎన్నో సంఘటనలు గుర్తుకొచ్చాయి. మాధవరావు, రామచంద్రం, నాగభూషణం, చలపతి, నాటకాలు, చప్పట్లు, జనం గోల-వీటన్నింటి మధ్యా తను ఏకాంతంగా ఉండగలగటం! ఎవరో చీకట్లో తనను దాచుకొంటూ వెళ్లడం జ్ఞాపకం వచ్చి నవ్వుకొంది మంగమ్మ.

సరిగ్గా అన్నం తినబుద్ధి కాలేదు. అటూ ఇటూ కెలికి కంచంలోనే చేయి కడుక్కొంది. మధ్యాహ్నం తనకు కాఫీ తీసుకొచ్చిన సర్వరే, ఈ పూటా భోజనం పట్టుకొచ్చాడు. వాణ్ని రవంతసేపు మాటల్లోకి దించి ఏడిపిందామనిపించింది మంగమ్మకు.

“నువ్వెప్పటిదాకా పనిచేస్తావయ్యా,” అన్నది మంగమ్మ పమిటతో మూతి తుడుచుకుంటూ.

“టైం లిమిట్ లేదు. ఎప్పుడు మానుకున్నా, మన్నెవరూ అడగరు” అన్నాడు వాడు.

“నన్నెప్పుడన్నా చూశావా?”

“చాలాసార్లు చూశాను. నీ నాటకం ఉన్నరోజు, నేను హాజరుకాకుండా ఉన్నదొక్కటీ లేదు”.

“ఏ నాటకం నీకు బాగుంది?” అన్నది మంగమ్మ కుర్చీలో కూచుంటూ.

అతనింకా నిలబడే ఉన్నాడు.

“ముందుకూచో-” అన్నదావిడ.

అతను కుర్చీని మంగమ్మకు దగ్గరగా లాక్కుని కూచున్నాడు. మంగమ్మ అతనికేసే చూస్తోంది. అతని ముఖంలో బ్రహ్మాండమైన సంతృప్తి వెలుగుతోంది.

అతను చెబుతున్న మాటలు విని మంగమ్మ ఆశ్చర్యపోయింది. అయిదారు నాటకాల్లో ఆవిడన్న సంభాషణలన్నీ అతడు పొల్లుపోకుండా చెప్పాడు.

“అంటే నన్ను చాలా కాలం నుండీ ఎరుగుదునన్నమాట?”

అతను తలెగరేశాడు.

“నీకు నచ్చిన సీనొకటి చెప్పు”.

అతను కొద్దిసేపు మంగమ్మను కళ్లార్పకుండా చూసి, “అన్నీ నాకు నచ్చాయి. నువ్వంటే నాకు చాలా ఇష్టం!” అనేశాడు.

“ఈ చిట్టితండ్రి క్లైమాక్సు కొచ్చాడు” అనుకొంది మంగమ్మ. అతన్ని నిరుత్సాహపరచడం ఆవిడకిష్టం లేదు. ఇంకా రెచ్చగొట్టి ఏడిపించాలనిపించింది.

“థాంక్స్! చాలా నిర్మొహమాటంగా చెప్పావు. నీలాగా కుండబద్దలు కొట్టినట్లు చెప్పేవాళ్లంటే నాకు చాలా ఇష్టమే!” అన్నది మంగమ్మ.

ఆ మానవుడు నిలువుగా కరిగిపోయాడు.

అతను వెళ్లిపోయాక, మంగమ్మ మంచంమీద పడి, పొట్ట చెక్కలయ్యేలా నవ్వుకొంది. రాజమణి ఇంట్లో తనకు తటస్థపడ్డ పెద్దమనిషిగానీ, ఈ సర్వర్‌గానీ ఈ రాత్రి నిద్రపోతారన్న నమ్మకం ఆవిడకు లేదు. అలా వాళ్లను బాధించి, వేధించి వదలాలన్న ఉద్దేశంతోనే తను అలా అన్నది. ఈ రాత్రల్లా వాళ్లు తనను గురించి ఆలోచిస్తూ ఉంటారు. కలలు గంటూనే ఉంటారు. తనకోసం ఆరాటపడుతూనే ఉంటారు. అందువల్ల తనకేం ఒరిగిందని కాదు, వాళ్లు బాధపడితే తనకంతే చాలు...

మంగమ్మ ఆలోచనలతో వాళ్లను నిద్రపట్టినా పట్టకపోయినా, ఆవిడకు మాత్రం వీళ్ల ఆలోచనలతో కునుకుపట్టలేదు. మధ్యమధ్య వసంత, రాజమణి జ్ఞాపకం రాసాగారు. రాజమణిని తలుచుకున్నప్పుడల్లా మంగమ్మ చలించిపోయేది. తానా ఊబి నుండి బయటపడబట్టిగానీ, లేకపోతే తనూ అలానే తయారయి ఉండేది. మళ్లా ఆ మురికికూపంలోకి వెళ్లడమన్నది జరగదు. కానీ వెళ్లక చేసేదేమిటో మంగమ్మకూ పాలుపోలేదు.

ఏంచేసేదో ఏమో తెలియదు గానీ, ఆ తెల్లవారే చలపతిగారు కనిపించారు. ఆయన కూగా లోగడ మంగమ్మతో పాటు పనిచేసినవాడే! రెండేళ్లపాటు, రకరకాల నాటకాల్లో రకరకాల వేషాలు వేశాడు. ఆ తరువాత సమాజంలో పేచీలు వచ్చి మద్రాసు వెళ్లిపోయాడు. ఏవో సినిమాల్లో చిన్న చిన్న వేషాలు వేస్తున్నాడని కొంతకాలం అనుకొన్నారు. అతకు మించి చలపతిని గురించిన సమాచారమేమీ తెలియదు.

“నీకోసం నిన్నల్లా తిరిగీతిరిగీ చచ్చాను మంగమ్మా! ఇవ్వాళ కూడా నువ్వు కనిపించ పోయినట్లయితే, ఈ రాత్రి బండికి పట్నం చెక్కేసేవాణ్ణి. ముందుగా నేను స్నానం చెయ్యాలి. గుడ్డలు

విడవాలి, మండే పొట్టకింద మేత పడెయ్యాలి. ఆ తరువాత గానీ, నేనేమీ మాట్లాడలేను. నువ్వసలు కనిపించవనుకొన్నాను. అవతల వాళ్లకేం చెప్పడమా అని మల్లగుల్లాలు పడుతున్నాననుకో. భగవంతుడి దయవల్ల నీదర్శనమయింది. అదే పదివేలు...ఈ హోటల్లో వేణ్ణీళ్లుంటాయా? పోన్లే ముందు ఏదో రకంగా స్నానం చెయ్యనివ్వు'' అంటూనే చలపతి బాత్‌రూంలో కెళ్లాడు.

మంగమ్మకు ఒక్కమాటా అర్థంకాలేదు. ఆవిడ సన్నగా నిట్టూర్చి సర్వర్‌తో టిఫెనూ, కాఫీ తీసుకురమ్మంది. వాడోసారి మంగమ్మ కేసి, కొత్తగా అక్కడ కనిపించిన బెడ్డింగ్ కేసి చూసి వెళ్లిపోయాడు.

''నేనేమో ననుకొన్నాను గానీ, గుంటూర్లో కూడా ఈ మధ్య కాఫీ చాలా బాగా చేస్తున్నారే!'' అన్నాడు చలపతి కాఫీ చప్పరిస్తూ.

మంగమ్మ పలకలేదు.

''మీ సమాజం ఎత్తేశారటగా?'' అన్నాడు చలపతి.

''ఔ''నన్నట్టుగా తలాడించింది మంగమ్మ.

''అప్పుడప్పుడు పత్రికల్లో మీ సమాజం గురించి చదవడం తప్ప నాకే సంగతీ తెలీదు. అసలు తెలుసుకునేంత తీరుబాటు కూడా లేదనుకో...ఆ రోజుల్లో ఎంత బాగా నడిచేది సమాజం? అవునుగానీ మంగమ్మా! అసలు ఎందుకు ఎత్తేశారో ఏమిటో చెప్పావు గాదే!'' అన్నాడు చలపతి, సుతారంగా సిగరెట్ అంటిస్తూ.

''పెద్దకారణాలేమీ లేవనుకోండి. రామచంద్రం గారూ మాధవరావుగారూ వేరే పన్లు చూసుకొంటామన్నారు. అసలు కథానాయకులే వారాయె, ఆ ఇద్దరూ తొలగడంతో సమాజం మూతపడిపోయింది'' అన్నది మంగమ్మ.

''అయితే ఇప్పుడు నువ్వేం చేదామనుకొన్నావ్?'' అన్నాడు చలపతి.

''ఇంకా ఏమీ అనుకోలేదు. ఏదో వొకటి చెయ్యాలి గదా మరి... మీరేం చేస్తున్నట్టు?'' అన్నది మంగమ్మ.

''నా సంగతి ఇప్పుడప్పుడే అడక్కు. చెప్పవలసింది చాలా ఉంది. ఒక్క ముక్కలో చెప్పాలంటే సినిమాల్లో వేషాలేస్తున్నాను. రెండుమూడు పిక్చర్లు చేతిలో ఉన్నాయి. రెండూ మంచి వేషాలే! ఇవి రిలీజయితేనే గానీ, నా జాతకం తిరగదు. అంతదాకా ఊరికే ఉండడమెందుకని, నేనే సొంతంగా సినిమా తీద్దామనుకొంటున్నాను. పాత స్టార్సుతో తీసే ఉద్దేశం నాకు లేదు. వాళ్లు కాల్‌షీట్లూ ఇవ్వరు, డబ్బుకూ ఆగరు. వేలకు వేలు వాళ్లమీద ఖర్చు చేసేంత డబ్బు నా దగ్గర లేదు. అంతా రెండు మూడు లక్షల్లో అయిపోవాలి. మరీ కొత్తవాళ్లను తీసుకురావడం నా వల్లకాదు. పాతవాళ్లతో బాధలు పడలేం. అంచేత, బాగా నాటకానుభవం ఉన్నవాళ్లను పెట్టుకొంటే సులభంగా తేలిపోతుందనుకున్నాను. బండెక్కి నీదగ్గర కొచ్చాను'' అన్నాడు చలపతి.

హఠాత్తుగా మంగమ్మకో సందేహం కలిగింది. తనీ హోటల్లో ఉంటున్నట్టు చలపతికి ఎవరు చెప్పారు? ఆ మాటే అడిగింది. చలపతి నవ్వాడు.

''మీ సమాజం ఆఫీసుకు వెళ్లాను. రెండు రోజుల కిందటే ఖాళీ చేసినట్టు చెప్పారు. ''మంగమ్మ ఎక్కడుండేదీ తెలుసా?'' అన్నాను. ఎవడో రిక్షావాడు నిన్ను రాజమణి ఇంటి దగ్గర దించాట్టగా-వాడు చెప్పాడు. రాత్రి రాజమణి ఇంటికెళ్లి వాకబు చేశాను. నువ్వీ హోటల్లో ఉంటున్నట్టు చెప్పారు వాళ్లు'' అన్నాడు చలపతి.

మంగమ్మ మనస్సిప్పుడు శూన్యంగా ఉంది. అందులో వొక్క ఆలోచనా లేదు.

"నేనయినా నీకు పెద్ద పెద్ద ఆశలేమీ చూపించడం లేదు మంగమ్మా! నేను బాగుపడదామని, ఓ పెద్ద ప్రయత్నం ప్రారంభించాను. అయితే, ఇది కేవలం నావొక్కడి వల్లనే కాదు. పదిమంది సహకారమూ కావాలి. ముఖ్యంగా నీలాంటి వారు గట్టిగా పూనుకోవాలి. నాకు లాభిస్తే అందులో నీకు భాగం ఉండకుండాపోదు. నష్టపోతే, నువ్వేమీ చెల్లించనవసరం లేదు. పిక్చరయిందాకా, అన్ని ఖర్చులూ నేనే పెట్టుకుంటాను. నెలకు మూడొందలో, నాలుగొందలో ఇచ్చుకుంటాను. నాపిక్చర్‌లో పనిచేస్తున్నావు గదాని-ఇంకో దాంట్లో ఛాన్స్ వొస్తే మానుకోనవసరం లేదు. అసలు నేను- పది కంపెనీలకు నిన్ను పరిచయం చేస్తాను. ఇప్పుడు మద్రాసు ప్రొడ్యూసర్లు కొత్త ముఖాలకోసం వాచిపోతున్నారు. పాతవాళ్లతో చిత్రహింసలన్నా పడతారు గానీ, కొత్తవాళ్లకోసం ప్రయత్నం చెయ్యరు. నీలాంటి వాళ్లు-పైగా బోలెడంత నాటకాల అనుభవం ఉన్నవాళ్లు-కనబడితే ఎత్తుకుపోతారనుకో" అన్నాడు చలపతి.

"ఎక్కడికీ,ఎందుకూ?" అన్నది మంగమ్మ పగలబడి నవ్వుతూ.

చలపతి కూడా నవ్వాడు.

"ఇక్కడ నీకేమన్నా కమిట్‌మెంట్స్ ఉన్నయ్యా?" అన్నాడు చలపతి.

మంగమ్మ పెదవి విరిచింది.

"ఈ పోజులో రెండు క్లోజప్‌లిస్తే జనం విరగబడి ఛస్తారనుకో మంగమ్మా. నీది బ్రహ్మాండమైన ఫోటోజెనిక్ ఫేస్. రకరకాల భావాలను ఈజీగా ఎక్స్‌ప్రెస్ చెయ్యగలవు. నీకు గొప్ప ఫ్యూచరుంది. నువ్వు సినిమాల్లో రాణించకపోవడమంటూ జరగదు. ఖర్మకాలి అటువంటిదే జరిగితే, అది సినిమా ఇండ్రస్టీ కాదన్నమాట! దాన్ని కట్టగట్టి బంగాళాఖాతంలో పారెయ్యొచ్చు" అన్నాడు చలపతి.

"ఇన్నిటికీ నన్నేం చెయ్యమంటారో మీరు చెప్పనేలేదు".

చలపతి చిటికెవేసి సిగరెట్ నుసి రాల్చుతూ, కాళ్లు సుతారంగా ఊపాడు; ఆ తరువాత సన్నగా పొడిదగ్గు దగ్గాడు.

"ఇంతసేపూ నేను వాగిందంతా విని కూడా మళ్లా అలా అడుగుతావేం? ఇంకోసా నానోట విందామనేనా? నీకయినా ఇక్కడ జంఝాటం ఏమీలేదు గదా! నిశ్చింతగా రావచ్చునే!".

"నాకు జంఝాటం లేదని మీకెలా తెలుసు?" అన్నది మంగమ్మ.

"పెళ్లిగాని చేసుకున్నావా?" అన్నాడు చలపతి ఉలిక్కిపడి. అతని ముఖం అప్పుడే రంగు మారిపోయింది.

"పెళ్లయినవాళ్లు సినిమాకు పనికిరారా?" అన్నది మంగమ్మ.

"పనికిరారని ఎక్కడా లేదు. ఇప్పుడున్న చాలామందికి పెళ్లిళ్లయ్యాయి. వాళ్లందరూ సినిమాల్లో పనిచేస్తూనే ఉన్నారు. అయితే వాళ్లకు 'వోర్పు' కావాలి. వోర్పు! ఇంతకాలం నాటకాల్లో ఉన్న మనిషిని చేసుకున్నాడంటే ఆయనగారికి చాలా వోర్పు ఉండి ఉండాలి మరి; ఇన్నిటికీ ఆయనేడీ?"

చలపతి తనన్నమాటను నమ్మే ఇదంతా అంటున్నాడో, అభినయమో మంగమ్మకు అర్థం కాలేదు.

"మీరే"- అని ఓ క్షణమాగి "వెదికిపెట్టండి" అన్నది.

చలపతి బల్లమీద గుద్ది పకపకా నవ్వాడు.

"చంపేశావ్ మంగమ్మా! నిజంగా నువ్వు పెళ్లాడేశావేమోననుకొన్నాను. అప్పుడు నా బాధలు రెట్టింపయ్యేవి. నిన్నొప్పించడం వొకవంతు, నీ మొగుణ్ణి నొప్పించడం మరో వంతు. కవిత్వం భాషలో

చెప్పాలంటే 'నువ్వొక స్వేచ్ఛా విహంగమవు'' అన్నాడు చలపతి నవ్వుతూ. 'మరి ఇవ్వాళ బయల్దేరదామా?''

''నన్నింకా ఆలోచించుకోనివ్వండి మరి!'' అన్నది మంగమ్మ.

''సరే ఆలోచించుకో, నేను సాయంత్రం వస్తాను. అప్పటికి ఏ సంగతీ నాకు చెప్పు. నన్నడిగితే, ఈ ఛాన్స్ వొదులుకోవడం మంచిదికాదంటాను. నువ్వయినా, మళ్లా ఏదో వొ డ్రామా కంపెనీలో చేరవలసిందే గదా! డ్రామాలకన్నా సినిమాలు ఎన్నోరెట్లు మంచివి. సినిమా ఇచ్చినంత డబ్బు నాటకం నీకేనాడూ ఇవ్వలేదు. డబ్బొక్కటే కాదు, సినిమా వల్ల దొరికే కీర్తిలో, నాటకం ఇచ్చేదెంత భాగం? నీకెప్పుడు ఇష్టం లేకపోతే అప్పుడే రావచ్చు. నువ్వు నాటకాలు వెయ్యడానికయినా, మద్రాసులో ఉన్న అవకాశాలు ఇక్కడేవీ? ఇవన్నీ ఆలోచించుకొని ఉండు, నేను మళ్లా వస్తాను'' అని చలపతి లేచాడు.

''నీకు డబ్బేమన్నా కావాలా?'' అన్నాడు పోతున్నవాడల్లా వెనక్కు తిరిగి.

''కావాలంటే మాత్రం మీరిస్తారా?''

''ఇస్తాను...ఇంద...ఈ నాలుగొందలూ ఉంచుకో'' అంటూ నాలుగువంద రూపాయల నోట్లు తీసి మంగమ్మ మీదికి విసిరేశాడు చలపతి. ఆ బొత్తిలో అటువంటి నోట్లు ఇంకా చాలా ఉన్నాయి.

''డబ్బుతో నన్ను కట్టేస్తున్నారు''.

''అసలు ఈ ప్రపంచాన్నే డబ్బు కట్టేస్తున్నది'' అంటూ చలపతి వెళ్లిపోయాడు.

మంగమ్మ ఆ నోట్లకేసి చూసింది. మడిచి నిశ్శబ్దంగా చేసంచిలో దాచుకొంది.

ఆవిడ మనస్సులో రకరకాల ఊహలు తలెత్తాయి. రంగురంగుల బొమ్మలు కళ్లముందు మెదిలి అంతలో మసకమసకలో కలిసిపోతున్నాయి. ఆ ఊహలకొక రూపం లేదు. ఆ బొమ్మలకు స్పష్టతా లేదు. మంగమ్మ కావాలనుకొన్నవీ, అవసరం అనుకొన్నవీ కూడా ఆ బొమ్మల వరుసల్లో ఉన్నాయి.

''ఇప్పుడేమిటి చెయ్యడం?'' అని ఆలోచించింది మంగమ్మ.

ఏం చెయ్యవలసిందీ, ఆవిడకు పాలుపోలేదు. గదికి తాళం వేసి, రాజమణి ఇంటికి బయలుదేరింది. రాత్రిళ్లు రంగరంగ వైభవంగాఉండే ఆ ఇల్లు యీ వేళప్పుడు నిర్జీవంగా నిశ్శబ్దంగా ఉంది. తలుపులు తీసి ఉన్నాయిగానీ, హాల్లో ఎవ్వరూ లేరు. మంగమ్మ ఓ నిమిషం అలానే ఉండిపోయింది. ఆ నిశ్శబ్దాన్ని తొలుచుకుంటూ సన్నని మూలుగు ఎక్కడ నుండో వినిపిస్తోంది.

'పాపం!' అనుకొంది మంగమ్మ.

ఆవిడ నాలుగడుగులు వేసింది. ప్రక్కనే ఉన్న గదుల్లో, ఆదమరచి నిద్రపోతున్న 'అమ్మాయిలు' కనిపించారు.

వాళ్లను చూస్తూంటే మంగమ్మకు గుడ్లగూబలు జ్ఞాపకం వచ్చాయి. గుడ్లగూబ కూడా పగలంతా నిద్రపోయి, రాత్రిళ్లు సంచారం బయలుదేరుతాయట. వీరూ అంతే రాత్రల్లా జీవిస్తారు. పగలు చనిపోతారు. నిజానికి పగలే జీవిస్తున్నారనాలేమో!

''ఎవరూ వచ్చింది!''

మంగమ్మ ఆలోచనల్లోంచి బయటికొచ్చింది. అది రాజమణి గొంతు.

''నేనే రాజ్యం!''

ఓ క్షణం నిశ్శబ్దం తర్వాత, ''మంగమ్మా! రావే!''అన్నది రాజమణి.

- మంగమ్మ గదిలోకి వచ్చేసరికి, రాజమణి నడిమంచం మీద కూచొని వంటినిండా శాలువా కప్పుకొని ఉంది. బల్లమీద, సగం తిన్న బత్తాయి కాయ మీద, ఒకటి రెండు ఈగలు వాలుతున్నాయి. గ్లాసు అడుగున గడ్డగట్టిన మందు, ఘాటుగా వాసన వేస్తోంది.

"ఉదయం నుంచీ నీకోసం చూస్తున్నాను. ఇంతవరకూ భోజనం చెయ్యలేదు. మరీ కడుపులో మండినట్లుగ ఉంటేనూ, ఇంతకు ముందే కాస్త బత్తాయిరసం తాగాను. ఈ మందులు తాగలేక నా ప్రాణాలు పోతున్నాయే మంగమ్మా!ఎక్కడెక్కడి డబ్బూ మందుల కొట్టవాళ్ల బొందమీద పోస్తున్నాను" అన్నది రాజమణి.

మంగమ్మ నిశ్శబ్దంగా కూచుంది.

"ఏమే, వింటున్నావా?" అన్నది రాజమణి.

"ఆఁ"

"నిన్ననెవరో చలపతిట,నువ్విక్కడున్నావా అంటూ వచ్చాడు. ఎందుకన్నాను. ఎందుకో చెప్పలేదు. కాని, చాలా అవసరం పనిబడిందన్నాడు. ముందుగా నీ ఎడ్రస్ చెప్పడం మానేద్దామనుకున్నాను. అక్కడకొచ్చి నీ ప్రాణాలు తోడేస్తాడేమోనని నా భయం! జిడ్డులాగ పట్టుకొని వదిలాడు కాదు. సరే ఏదయితే అదే అవుతుందని చెప్పేశాను. నువ్వయినా అంత తెలివి తక్కువదానికి కాదుగదా! వచ్చాడా వాడు?" అన్నది రాజమణి.

"ఆఁ"

రాజమణి మాట్లాడలేదు. కాస్సేపున్నాక, సన్నగా నవ్వింది.

"ఏమిటే?" అన్నది మంగమ్మ.

"ఏం మనుషులమే మనం! వొద్దోయ్ బాబూ అంటున్నా ఈ మొగాళ్లు వినిపించుకోరు. ముఖాన కుక్కల కన్నా హీనంగా వెంటపడుతుంటారు. రాత్రిమట్టుకు రాత్రి ఏం జరిగిందో తెలుసా?" అన్నది రాజమణి నీరసంగా నవ్వుతూ, "నువ్వు వెళ్లేటప్పుడు ఉంగరాల వాడొకడు హాల్లో ఉన్నాడు చూడు! వాణ్ణి నువ్వు రాచుకొంటూ కూడా పొయ్యావేమో, ఆపిచ్చి తండ్రి విరహంలో పడిపోయాడు. నిన్ను పిలిపించమన్నాడు. అది రాదయ్యా బాబూ అంటే వినిపించుకోడు. ఆఖరికి, ఆ గాడిదకొడుకును హడలగొట్టేసి పంపించాను...నీ ఆరోగ్యం బాగోలేదన్నాను. "వంటిమీద పుళ్లు కనిపించలేదా?" అన్నాను. "పోయి పోయి నిప్పుల కుంపట్లో దూకుతావుటయ్యా?" అన్నాను. ఆ వరహాల తండ్రికి పూనకం తగ్గిపోయింది. వాడట్లా వెళ్లాడో లేదో, ఈ చలపతిగాడొచ్చాడు. నాగుండెల్లో గుండెల్లేవు చెప్పొద్దూ, ఆ శుండాల్ గాడే, వీణ్ణి పంపించాడేమోననిపించిందది. ఎంత మెలిపెట్టినా అసలు సంగతి చెప్పడే! రాత్రి...ఏమన్నా గోల జరిగిందాయేమే?"

'లే'దన్నట్లుగా తల తిప్పింది మంగమ్మ.

"రక్షించావు పో. ఇప్పటిదాకా, నా మనస్సు మనస్సులో లేదనుకో మంగమ్మా! "అయ్యో భగవంతుడా ఈ ఉప్పలాయం వచ్చి పడిందేమిట్రా?" అని ప్రాణం ఉడ్డుకుడిచిపోయిందనుకో. రాత్రంతా సరిగ్గా నిద్ర కూడా పట్టలేదు. దానికి తోడు ఉదయమనగా వస్తానన్న దానివి ఇంతవరకూ రాకపోతివి. నేనా-రాలేను. ఎవర్నన్నా పంపుదామా-ఎవర్ని పంపించేది చెప్పు. అప్పటికీ వసంత, నే వెళ్లిరానా? అన్నది. నేనే వద్దన్నాను. సరేలే పద, ముందు భోజనం చేద్దాం" అన్నది రాజమణి.

అప్పుడే వసంత కూడా తూలుకొంటూ గదిలో కొచ్చింది.

"నీ పేరు వసంతా, వాసంతీయా?" అన్నది మంగమ్మ.

ఆ పిల్ల మత్తుగా నవ్వింది.

"అలా ఉందేం?" అన్నది మంగమ్మ, రాజమణికేసి తిరిగి.

"ఎవడోగన్నాయ్ నిన్న క్లబ్బులో బాగా గెలిచాట్ట. రెండు సీసాలు పట్టుకొచ్చాడు. గుప్పెడు నోట్లు దానిమీద చల్లిపారేశాడు, ఈ పిచ్చిముండకు 'మందు' వాడడం చాతకాదు. వద్దన్నా వినిపించుకోకుండా దానినోట గుమ్మరించాడు. ఊసినంత ఊసినా, అంతో యింతో లోపలికి జారిందేమో మరి! ఇట్లా తయారయింది. ఏమే! కాస్త నెమ్మదిగా ఉందా?" అన్నది రాజమణి.

వసంత "ఉన్న"దన్నట్టు తలాడించింది.

"అయితే మా ఇద్దరికీ అన్నం పెట్టు...మంగమ్మా! నువ్వొస్తావని కార్జం తెప్పించాను. కోడిగుడ్లు కూర ఉంది. బిరియానీ చేయించాను. చాలా-ఇంకేమన్నా కావాలా?"

"నేను మాంసం తినను" అన్నది మంగమ్మ.

"అదేమిటే నీ బొందబెట్ట. నీ పాటు అలవాట్లెప్పట్నించి? మాంసం లేకపోతే - ఆ తిండి తింటేనేం, గడ్డితింటేనేం?" అన్నది రాజమణి.

"ఇప్పుడేం? మానేసి చాలారోజులయింది. మా నాటకం కంపెనీలో వాళ్లెవ్వరూ మాంసం తినరు. తినకూడదని వో నియమం. మానేశాను" అన్నది మంగమ్మ.

"మళ్లీ ఈ పూట నుంచి ప్రారంభించరాదా యేం? మనం చేసే ఛండాలప్పనులన్నీ పొట్టకోసమేనాయె! ఆపొట్టను నాయగట్టుకొని మనం సంపాదించేదేమిటే నీ తలకాయ్!...పదవే వసంతా! దానిక్కూడా కార్జం పడేయ్" అంటూనే రాజమణి లేచింది.

మంగమ్మకు అన్నం సరిగ్గా తినబుద్ధి కాలేదు. ఆ కూరలు చూస్తే అసహ్యం వెయ్యలేదన్న మాటే గానీ, ఆ వాసనకు కడుపులో దేవినట్లుగా ఉంది. ముక్కలన్నీ ఏరి పక్కన బెట్టింది మంగమ్మ.

"కారం మెతుకులు తిని,ఏం వేషాలేస్తావే నువ్వు?" అంటూ రాజమణి, ఆ ముక్కలన్నీ తనే తీసుకొంది.

మంగమ్మ ప్రాణం తెరిపినపడినట్లయింది. ఇంత చారు పోసుకుని రెండుముద్దలు నంజింది. అప్పుడే చలపతి వచ్చిన విషయంకూడా రాజమణి చెవినేసింది.

"నువ్వేమన్నావే?" అన్నది రాజమణి.

"ఏమనమంటావ్?" అన్నది మంగమ్మ.

"ఇంకేమాటా వాడికి చెప్పలేదన్న మాటేనా?"

మంగమ్మ తలూపింది.

"నిక్షేపంగా వొప్పేసుకో" అన్నది రాజమణి.

"నేననేదేమిటంటే రాజ్యం"- అని మంగమ్మ ఏదో చెప్పబోయింది.

"నువ్వేమీ అనక్కర్లేదు. అన్నా నేను వినను. ఈదిక్కుమాలిన నాటకాల కంపెనీల్ని నమ్ముకొని ఎంతకాలం ఉంటావే? ఈమాత్రం జీతం డబ్బులు నీకు సినిమాల్లో గిట్టనప్పుడు చూచుకొందాం. సరేనా?"

"నువ్వన్నది రైటేననుకోవే రాజ్యం! కానీ, మధ్యలో వీడు ముంచితే గతేమిటి? అక్కడ మనకు అమ్మానాన్నా-ఎవరున్నారని? పుసపుసా పోయిందోయ్, వచ్చిందోయ్ అనిపించుకోవటం నాకిష్టం లేదు రాజ్యం! వాడేమో, కళ్లు తిరిగిపోయే కబుర్లు చెబుతున్నాడు. నాకేమీ తోచక నీదగ్గరకొచ్చాను. నువ్వేం చెయ్యమంటే అది చేస్తాను" అన్నది మంగమ్మ.

''నా ఉద్దేశమేదో ముందుగానే చెప్పానమ్మాయ్! దానికిక ఢోకా లేదు. వాడెవడో ముంచితే గతేమిటంటావ్. అదేపని ఇక్కడ జరిగితే నువ్వేం చేస్తావని నే నడుగుతున్నాను. మద్రాసుకూ, గుంటూరుకూ, మహాయితే రెండొందల మైళ్లుంటుందేమో; కాదూ కూడదంటే రెండొందల యాభై వేసుకో. పది రూపాయలు నీవి కాదనుకుంటే ఇక్కడకొచ్చి పడతావ్! భగవంతుడిచ్చిన ఆయువు సరిగ్గా ఉంటే, నువ్విక్కడికే రావచ్చు, నాకే అటువంటి ఛాన్స్ వస్తే, కుండా, చట్టీ సర్దుకొని ఎప్పుడో పీఠం ఎత్తేసేదాన్ని'' అన్నది రాజమణి.

మంగమ్మ కంచంలో చెయ్యి కడుక్కొంది.

''ఇదేం తిండే నీ తలకాయ్. మజ్జిగచుక్కన్నా వేసుకోవేం?'' అన్నది రాజమణి.

''నాకసలు ఆకలిగా లేదు'' అన్నది మంగమ్మ పమిటచెంగుకు కుడిచెయ్యి తుడుచుకుంటూ.

''సినిమా ఛాన్స్ వొచ్చేసరికి ఆకలి కూడా చచ్చిందన్నమాట!'' అన్నది రాజమణి నవ్వుతూ.

వసంత కూడా నవ్వింది.

''ఈ పూట చలపతి మళ్లా వస్తాడు. అసలీ వేళకు వచ్చాడేమో కూడా. అతని ధోరణిని బట్టి చూస్తే తక్షణం మద్రాసు వెళ్లాలిసొచ్చేటట్లుంది. నాకేమో గుండెలు పింజెం పింజెమంటున్నాయి. అక్కడంతా అరవమేళమట. ఎట్లా ఉంటుందో ఏం పాడో! నువ్వేమో వెళ్లు వెళ్లమని తరుముతుంటివి'' అన్నది మంగమ్మ.

''అరవ మేళమయినా, ఇంకో మేళమయినా, మనుషులందరూ వొక్కటేనే పిచ్చిదానా! అక్కడ మాత్రం మనలాంటి వాళ్లుండరా? సినిమా అంటేనే డబ్బు. డబ్బంటేనే ప్రపంచం. మనమీ గొడవలన్నీ ఎందుకు పడుతున్నాం?- డబ్బుకోసం-మరి నువ్వేదో నీతులు చెపుతున్నావే!'' అన్నది రాజమణి.

''మిమ్మల్నందర్నీ వొదిలి వెళ్లాలంటే-'' అని నసిగింది మంగమ్మ.

రాజమణి కింది పెదవి బిగబట్టి, మంగమ్మను అనుమానంగా చూసింది.

''ఇన్నేళ్లపాటు మమ్మల్నొదిలి నాటకాల్లో ఉండగా లేనిది, ఇప్పుడు మద్రాసు పోవడానికేం? మేమయినా నిన్ను పొమ్మంటున్నాం గానీ, పట్టుకుని వేళ్లాడటం లేదుగా! మేముండి నిన్నుద్ధరిస్తున్నదేమన్నా ఉంటే, అదో దోవ. అదేమీ లేదాయె. మరి నీగుంజాట నెందుకో నాకు తెలియడం లేదు'' అన్నది రాజమణి.

మంగమ్మ మాట్లాడలేదు.

''ఈ పూటే వెడతావా?''

''చలపతిగారు తొందరపెడుతున్నారు''.

''మంచిది. క్షేమాన వెళ్లి లాభాన తిరిగిరావే! ఎప్పుడన్నా వొ ఉత్తరం ముక్క రాస్తుండు. వెళ్లగానే నీ ఎడ్రస్ రాయి ముందు. అన్నీ సరిగ్గా ఉంటే సరేసరి. లేదో-నాకో కార్డు రాసిన పడేయ్. అంతో ఇంతో పంపుతాను. లేదో-నువ్వు బాగుపడ్డావేననుకో, నేనెప్పుడన్నా వొస్తే ఇన్ని మెతుకులు వెయ్యి చాలు...''

మంగమ్మ సన్నగా నిట్టూరుస్తూ రాజమణిని కౌగలించుకొంది. రాజమణి స్నేహితురాలి బుగ్గలు సున్నితంగా కొరికి ''అబ్బ, ఎంత రుచిగా ఉన్నాయే!'' అంటూ లొట్టలు వేసింది.

మంగమ్మ బదులుచెప్పడానికి ముందుకు వంగింది. కానీ, అప్పటికే రాజమణి పక్కకు వెళ్లిపోయింది. వసంత మాత్రం ఎదురుగా ఉంది.

''ఏఁవఁమ్మాయ్! నీపాట వినడం పడనేలేదు. ఇప్పుడు విన్నా నా మనసుకెక్కదు. నేను వెళ్లగానే

ఎటుగూడి జాబు రాస్తాను. నా పరిస్థితి బాగా ఉంటే నువ్వొచ్చేద్దువుగాని, ఇంద- ఈవంద రూపాయలూ ఉంచుకో'' అంటూ చలపతి ఇచ్చిననోట్లలో వొకదాన్ని వసంతకిచ్చింది.

''నాకొద్దక్కయా!'' అన్నది వసంత-రాజమణికేసి చూస్తూ.

''తీసుకోవే! అది ప్రేమతో యిస్తున్నానంటే వొద్దంటావే, తప్పమ్మా అలా అనకూడదు''.

వసంత సిగ్గుపడుతూనే ఆ నోటు తీసుకొంది.

మంగమ్మ రాజమణినీ, వసంతనూ మరోసారి కళ్లనిండుగా చూసి, బయలుదేరింది. ఆవిడకిప్పుడు శరీరం గాలిలో తేలుతున్నట్లుగా ఉంది.

# 4

మద్రాసును చూస్తూనే మంగమ్మ ఆశ్చర్యపోయింది. ముఖ్యంగా అక్కడి భవనాలూ, కార్లూ,మనుషుల ఫ్యాషన్లూ ఆవిణ్ణి చకితం చేశాయి. ''మద్రాసు డబ్బంతా రాళ్లు, సిమెంటులోనూ, కారుల్లోనూ చేరిపోయింది'' అనుకొన్నదావిడ. ప్రతిదానికేసీ కళ్లింత చేసుకుని మంగమ్మ చూడటాన్ని చలపతి గమనించాడు.

''ఎలా ఉంది మద్రాసు?'' అన్నాడు చలపతి, టాక్సీలో మంగమ్మ మీదికి బాగా వొరుగుతూ.

మంగమ్మ కొంచెం పక్కకు జరిగింది.

''ఎలా ఉంది? బాగానే ఉంది మరి'' అన్నది పొడిపొడిగా.

''ఈ క్షణం నుండీ నువ్విక్కడే ఉండబోతున్నావు. ఇదే నీ నివాసం. ఇక్కడే నీకు పేరు ప్రతిష్టలు రావాలి. ఇక్కడే నీకు లక్షలకు లక్షలు సంపాదించాలి. ఈ రోడ్లమీదనే నీవు 'ప్లిమత్' కారులో తిరగబోతున్నావు...''అన్నాడు చలపతి.

మంగమ్మ ఏమీ మాట్లాడలేదు. అద్దంలోంచి ఎదురుగా కనిపిస్తున్న సినిమా బానర్ కేసి చూస్తోంది. అయిదడుగుల పొడవు, మూడడుగుల వెడల్పూ ఉన్న ఆ పోస్టర్ మీద ఒకే ఒక ముఖం-సినిమా తార ముఖం- నవ్వులు కురిపిస్తూ కనిపిస్తోంది. పది పదిహేను మంది కుర్రవాళ్లు ఆ పోస్టరు ముందు నిలబడి అదేపనిగా ఆ బొమ్మకేసి చూస్తున్నారు.

''ఆవిడ నళినీకుమారి'' అన్నాడు చలపతి సిగరెట్ వెలిగిస్తూ, ''మొన్నమొన్నటివరకూ, చిన్నచిన్న వేషాలు వేస్తుండేది. రెండు మూడు వేషాలు నేనే రికమండ్ చేసి ఇప్పించాను. వాటివల్ల ఆవిడకు నాలుగు డబ్బులు గిడితే గిట్టాయేమోగానీ, గుర్తింపు రాలేదు. ఇదికాదనుకొని, ఒక ప్రొడ్యూసర్‌కు చెప్పి మంచి వేషం, దాదాపు హీరోయిన్ లాంటి వేషం యిప్పించాను. ఝామ్మన్ని అందుకొంది. ఇప్పుడావిడ రేటు పదిహేనువేలు...వింటున్నావా?'' అన్నాడు చలపతి.

కారు మూల తిరుగుతూ సర్రని శబ్దం చేసింది. మంగమ్మ మీదికి మరోసారి చలపతి పూర్తిగా వొరిగిపోయాడు. వొరిగాక-

చలపతి ఓసారి మంగమ్మకేసి చూసి రవంత ఇటుగా జరిగి కూచున్నాడు.

కారు వేగం తగ్గింది.

డ్రైవరు అరవంలో ఏదో అడిగాడు.

''కోడంబాకం పోనివ్వు. నటేశ పిళ్లే స్ట్రీట్, నెంబరు 192'' అన్నాడు చలపతి.

మంగమ్మ వచ్చే నవ్వును ఆపుకోవడం చలపతి గ్రహించాడు. ''ఏమిటిట?'' అన్నాడు.

''ఏంలే''దన్నట్లుగా మంగమ్మ పెదవి విరిచింది.

''బ్యూటీఫుల్ మంగమ్మా! నా దగ్గర కెమెరా లేదుగానీ ఉంటేనా? ఈ పోజ్‌ను శ్నాప్‌చేద్దును. ఇలా ఇంత అందం-పెదవి విరిచి,-ఏం లేదు, ఉన్నా నీతో చెప్పను. అది చెప్పడానికి వీల్లేని విషయం కనుక నన్ను పదేపదే అడక్కు, -అన్న భావాలను వొక్క పెదవి విరుపులో చూపెట్టగలిగిన వాళ్లెంతమంది ఉన్నారంటావ్, నన్నడిగితే వొక్కరూ లేరంటాను. అంచేతే నీకు ఈ ఇండస్ట్రీలో వల్లమాలిన, కట్టుకుపోయినంత ఫ్యూచరున్నదని నేను మొత్తుకోవడం'' అన్నాడు చలపతి.

మంగమ్మకీ ధోరణి నమ్మదగిందిగా లేదు. తనేదో మామూలుగా-మామూలుగా కాదు-చలపతితో మాట్లాడటం ఇష్టంలేకనే పెదవి విరిచింది. అందులో వీడంటున్నన్ని అర్థాలున్నాయని-ఉంటాయని గానీ తనకు తెలీదు. మరి చలపతి తన్నెందుకిలా ఆకాశాన్నికెత్తుతున్నట్లు?

''ఇన్నిటికీ నా ప్రశ్నకు నువ్వు సమాధానం చెప్పనే లేదు మంగమ్మా!'' అన్నాడు చలపతి.

మంగమ్మకు -సిటీని చూడాలన్న ఆకాంక్ష ముందు- ఈ దిక్కుమాలిన చెత్తవాగుడుకు జవాబు చెప్పాలన్న ఆలోచనే రాలేదు. తనింకా సమాధానం చెబుతానన్న ఆశతో చలపతి చూస్తున్నాడని మంగమ్మ అనుకొంది. చిత్రమేమిటంటే అతనడిగినదేమిటో మంగమ్మకు జ్ఞాపకం రాలేదు-అదే చలపతితో అన్నది.

''వండర్‌ఫుల్! నువ్వు ఆశ్చర్యాన్ని ఎంత అద్భుతంగా ఎక్స్‌ప్రెస్ చేస్తావు మంగమ్మా!'' అని ఓ పావునిమిషం అలాగే మింగబోతున్నవాడిగాలా చూశాడు చలపతి. ఆ తరువాత తన పెదవిని మునిపళ్ల మధ్య చేర్చాడు. కాళ్లు సున్నితంగా ఊపుతూ ''అదే, నళినీ కుమారి గురించి. ఇప్పుడావిడ పదిహేను వేలు తీసుకొంటుందన్నాను గదూ?'' అన్నాడు.

''అన్నారా?'' అన్నది మంగమ్మ.

నిజానికావిడకు ఈ ప్రశ్నకు జవాడు తెలుసుకోవాలని లేదు. అంచేత దాన్ని తేల్చిపారేసింది.

''అన్నాను. నీ ఉద్దేశం, ఆపదిహేనువేలూ దేనికిస్తున్నారని?'' అన్నాడు చలపతి. ఆవిడ ఎందుకైనా మంచిదని ఓ నవ్వు గిరాటెట్టి, దానికి అనుబంధంగా నీ సిగ్గుముక్కను విసిరేసి, కళ్లు కొసల్నించి చలపతిని చూసి 'డ్రైవరున్నా'డన్నట్టుగా తలతోనే సైగచేసింది.

ఈ దెబ్బతో చలపతి చిత్తుచిత్తయిపోయాడు. వాడు కాస్సేపటికి తమాయించుకొని 'బ్రేవో బ్రేవో' అని లోపలనుకోవాలనునిపైకే అనేశాడు. ఈసమాధానం మంగమ్మ నుండి రావడం కోసమే ఇంతసేపణ్ణించి చలపతి తంటాలుపడుతున్నాడు. మంగమ్మ మహాపతివ్రతన్న నమ్మకం అతనికి లేనిమాట నిజమేగానీ తను చెప్పినట్లల్లా వింటుందో లేదో కూడా తెలియాలి గదా! అలా విన్నప్పుడే తనీ మద్రాసులో ఉండి చక్రం తిప్పగలుగుతాడు. కర్మకాలి మంగమ్మ పెంకిఘట మయిందో, ఆట కుదేలయిందన్న మాటే!

టాక్సీ 192వ ఇంటిముందు ఆగింది. చలపతి దిగాడు. ఆతరువాత మంగమ్మ కూడా దిగింది.

చలపతి టాక్సీకి డబ్బులిచ్చి పంపేశాడు. ఆ ఇంటిని చూస్తేనే మంగమ్మకు అనేక సందేహాలు పుట్టుకొచ్చాడు. ఆవి రెండు మూడు రోజుల నుండీ ఊహిస్తున్న ఇల్లువేరు. ఆ ఇల్లు చాలా పెద్దది. ముందు భాగాన అర ఎకరం ఖాళీ స్థలం. అందులో రకరకాల పూలమొక్కలు. ఓ మూలగా రెండు మూడు అశోకవృక్షాలు. పెద్దబాల్కనీ, స్థంభాల నల్లుకొని సన్నజాజితీగలు, రోడ్డుమీంచి గడపలదాకా నాపరాళ్లబాట, హాల్లోసోఫాసెట్లు, గోడలకు పటాలు, ఓ పక్కన కారు షెడ్డు, కాకీదుస్తుల్లో డ్రైవరూ, నలుగురైదుగురు నౌకర్లు, టెలిఫోను, వంటమనిషి, పై అంతస్తులో కిటికీలకు సిల్కుతెరలు-ఇలాంటివి చాలా ఆలోచించింది. చలపతి సామాన్యుడు కాడాయె. సినిమాలో యాక్టు చేసేవాళ్ల దగ్గరే బోలెడంత

డబ్బున్నప్పుడు, సినిమా తీసే వాళ్ల దగ్గర అంతకు పదిరెట్లు డబ్బు ఉండాలని మంగమ్మ అంచనా. అంత డబ్బున్నవాడు, ఓ సాదా ఇంట్లో ఉంటాడని ఎవరు మాత్రం ఊహిస్తారు గనుక.

అయితే తన అసంతృప్తిని మంగమ్మ బైటపడనివ్వలేదు. లోలోపలే భద్రంగా దాచుకొంది. మద్రాసు చేరిన వెంటనే తనకిలాంటి అనుభవం ఎదురయినందుకు మంగమ్మ కొంచెం బాధపడింది కూడా.

''ప్రస్తుతానికి మన ఇల్లు ఇదే!'' అన్నాడు చలపతి.

మంగమ్మ ఉలిక్కిపడింది. కర్మకాలి తన ఆలోచనలుగానీ అతనికి తెలిసిపోయాయేమోనని గిజగిజలాడిపోయింది. ఓసారి చలపతికేసి చూసి తలవంచుకుంది. చలపతి ఈ విషయాన్ని ఇంతటితో వదిలిపెడితే బావుండుననిపించింది మంగమ్మకు. కానీ మనవాడు వదిలే ధోరణిలో లేడు.

''కాఫీ తెప్పిస్తున్నాను. నువ్వీలోగా స్నానం చెయ్యి. అదే బాత్‌రూం. తాయారు గంగాళంలో నీళ్లు పెట్టే వుంటుంది. అది నీ గది, ఇది నా గది. ప్రస్తుతానికి ఒక్కటే మంచం ఉంది. నువ్వు మరోటి కావాలని పట్టుబడితే తప్ప, మంచం తెప్పించవలసిన అవసరం లేదు'' అన్నాడు చలపతి నవ్వుతూ.

మంచాల ప్రసక్తినెందుకు తీసుకువచ్చిందీ మంగమ్మకు తెలుసు. అయినా అతన్ని కాసేపు ఏడిపించి వదలాలనిపించింది.

''ఉన్నదొక్కటే మంచమంటుంటిరి. ఇద్దరం మనుషులముంటిమి. ఇంకోటి తెప్పించకపోతే ఎలా? మీరో నేనో కింద పడుకోవాలి మరి! నాకు కింద పడుకోవడం అలవాటు లేదు. మీకున్నదేమో నాకు తెలీదు'' అన్నది మంగమ్మ.

చలపతి ఏం చెబుతాడో కూడా ఆలోచించకుండానే ఆవిడ బాత్‌రూంలోకెళ్లింది. చల్లని నీళ్లు వంటిమీద పడగానే శరీరానికి కొత్తశక్తి వచ్చినట్లనిపించింది. ఓ గంటసేపు అలాగే గంగాళంలో కూచుండిపోతే ఎంత బావుండును?

ఆవిడ చీరకట్టుకుని వచ్చేసరికి చలపతి స్నానానికి సిద్ధమయ్యాడు. ''నేనేమో అనుకొన్నానుగాని,నువ్వు అసాధ్యురాలివి మంగమ్మా! ఉండు. నే వచ్చి గట్టి సమాధానం చెబుతాను'' అంటూనే చలపతి వెళ్లిపోయాడు.

ఈలోగా మంగమ్మ కాఫీ కప్పుల్లోకి సర్దింది. తాయారు క్యారియర్ దొడ్లోకి పట్టుకెళ్లింది. వెడుతూ వెడుతూ అది చూసిన చూపు చాలా చిత్రమనిపించింది మంగమ్మకు. కానీ ఆచూపులో ఏమున్నదీ మంగమ్మకు అంతుబట్టలేదు.

''కాఫీ బావుందా?'' అన్నాడు చలపతి వస్తూనే. ''అదేమిటి? నువ్వింకా తాగలేదా ఏం?''

మంగమ్మ పెదవి విరిచింది.

''అలాంటి పట్టింపులు పట్టుక్కూచుంటే ఎలా? నువ్వు తాగెయ్యకపోయావా?'' అన్నాడు చలపతి.

''పెద్దలు, మీరు ముందు కానివ్వండి'' అన్నది మంగమ్మ వినయంగా, చలపతి కూచున్నాక ''ఇందాక మీరెదో గట్టి సమాధానం చెబుతామన్నారు గదూ?'' అని జ్ఞాపకం చేసింది.

''ఏది? ఓహెూ, అదా?'' అన్నాడు చలపతి ఫకాలుమని నవ్వుతూ. ''కింద పడుకోవడం అలవాడు లేదంటేను-నాకేవో సంగతులు జ్ఞాపకం వచ్చాయిలే! మరేం లేదు''.

చలపతి తనను ఎటు డ్రైవ్ చేస్తున్నదీ మంగమ్మ తెలుసుకొంది. ఆవిడకు చెప్పరానంత అసహ్యం కూడా వేసింది. ఆ రంధి తప్ప బతుకులో మరో వ్యాపకం లేనివాడికి మల్లే అస్తమానూ అవే కబుర్లయితే

ఎంత అసహ్యం? మంగమ్మ ధోరణిని సున్నితంగా మార్చేసింది. ''ఈ ఊరు చాలా పెద్దదా?అనడిగింది కప్పు బల్లమీద పెడుతూ.

''ఊరేమిటి నీ తలకాయ్! ఇది మహాపట్నం. మనవాళ్లు కథల్లో చెబుతారే పన్నెండామడపట్నమని-అలాంటిదనుకో. మనమున్నది కోడంబాకం. సినిమావాళ్లు ఎక్కువ మంది ఇక్కడే ఉంటారు. ఇదోకొన. ఈ చుట్టుపక్కల చాలా స్టూడియోలున్నాయి. అందులో రేయింబవళు ్ల షూటింగులు జరుగుతుంటాయి. నువ్వెప్పుడన్నా బీచ్ చూశావా?''అన్నాడు చలపతి.

''అంటే?'' అన్నది మంగమ్మ అమాయకంగా పోజుపెట్టి.

''ఓసి పిచ్చిదానా!'' అన్నాడు చలపతి. ''సముద్రతీరం! అబ్బో అబ్బో! అక్కడకు కొన్నివేలమంది జనం వస్తారు. సాయంత్రం మనం కూడా వెడదాం. బీచ్‌కెళ్లే స్వాతంత్ర్యం నీకు ఎక్కువకాలం ఉ ంటుందనుకోను''.

''అదేం?'' అన్నది మంగమ్మ.

''రేపు నువ్వు పది సినిమాల్లో బుక్కయితే కాల్‌షీట్లు సర్దలేకనే చస్తావు గదా! షికార్లకు టైమెక్కడుంటుంది, మంగమ్మా! అదీగాక బీచ్‌కెడితే జనం నిన్ను బతకనిస్తారా? చుట్టేసెయ్యారూ!'' అన్నాడు చలపతి.

''ఎప్పటిమాటో లెండి. ఈలోగా మనం హాయిగా తిరగడానికేం?'' అన్నది మంగమ్మ.

చలపతి ఓ సిగరెట్ అంటించి గట్టిగా పొగపీల్చి ఆ పొగతోనే అగ్గిపుల్లను ఆర్పేసి, ఆరిపోయిన అగ్గిపుల్లను సుతారంగా దూరానికి గిరాటెట్టాడు.

''అదంతా ముడియాద్ మంగమ్మా! మనం తిరగటానికి టైమేదీ? రేపట్నించి మనకు ఊపిరి తిరగని పనులుంటాయి. అవి చూసుకోవాలి'' అన్నాడు చలపతి.

మంగమ్మ మాట్లాడకుండా లేచి లోపలికి వెళ్లిపోయింది.

అతడన్నట్లుగా ఆ మొన్నాటినుండీ ఊపిరి తిరగని పనులంటూ ఏమీలేవు. ఉదయం కాఫీతాగి చలపతి ఎక్కడికో వెళ్లేవాడు. ఒక్కోరోజున మధ్యాహ్నం భోజనానికి వచ్చేవాడు. మరోరోజున సాయంత్రం వచ్చేవాడు. ఇద్దరూ కలిసి ఎటన్నా షికారు వెడుతుండేవాళ్లు. వారంరోజుల పాటు మంగమ్మ సిటీ అంతా చూసింది. ''జూ'' చూసినప్పుడూ, ''మ్యూజియం'' చూసినప్పుడూ మంగమ్మ తనను తాను మరచిపోయింది. ఇన్ని లక్షల రూపాయలు ఖర్చుపెట్టి వీటిని ఏర్పాటుచెయ్యడమెందుకో ఆవిడకు అర్థం కాలేదు. దీన్ని గురించి ఒకటిరెండు సార్లు చలపతిని అడుగుదామనుకొందిగానీ, అడగలేదు. ఏదో సమాధానం చెప్పడని కాదు, ఆ ధోరణిలో పడితే అతన్ని మళ్లించడం కష్టమని ఆవిడ భయం.

''ఊరంటే ఇదే ఊరు. బతుకంటే ఇదే బతుకు'' అనుకొంది మంగమ్మ.

విశాలంగా నున్నగావున్న రోడ్లు, వాటిమీద చిత్తవత్తుగా ప్రవాహం వతుగా పోయే కార్లు, రోడ్లకు రెండుపక్కలా ఉన్న షాపులు, అందులోని సామాను, కందిరీగలతుట్టెల్లా ముసిరే జనం. విద్యుద్దీపాలు, సినిమా హాల్సు-ఓహ్ ఎంత బావున్నాయి!

తొలిసారిగా బీచ్ చూచినప్పుడు, మంగమ్మ మనస్సంతా అలుక్కుపోయినట్లయింది. రోడ్డుదిగి, ఇసుకలో కూరుకుపోతున్న పాదాలను రవంత బలంతో పెకలించుకొంటూ నడవటం ఓ వింత అనుభవం. వందగజాలు నడిచాక తనో మైలుదూరంలో నడిచాననుకొంది మంగమ్మ. సముద్రం

మీది నుంచి ఉప్పెనిగాని బలంగా వెనక్కి నెడుతోంటే, పమిట చెంగు తొలక్కుండా వీపు వెనగ్గా తిప్పి రెండో కొసను కుచ్చెళ్ల దగ్గర దోపుకుని, ముందుకు నడుస్తుంటే, చీరంతా వెనకు నొక్కుకొని, కాళ్లు గుండ్రంగా కనిపిస్తుంటే మంగమ్మ సిగ్గుపడింది.

చలపతి ఆవిడ పక్కనే నడుస్తూ మధ్యమధ్య తగుల్తూ, ఏవో కబుర్లు చెబుతున్నాడు. దూరంగా, ఆకాశం వంగి సముద్రంతో ఏవో రహస్యాలు చెబుతున్నట్లుగా ఉంది. ఎడంవైపున నల్లని పొగచారా, ఆ చారకో కొసను మసమసగ్గా ఓడా కనిపించాయి. కుడివేపున చిన్నచిన్న పడవలు, ఇంకా దూరంగా ఇసకమీదనే బెస్తవాళ్ల గుడిసెలు,వాటి వెనక మళ్ళా ఎత్తయిన భవనాలు, వెనక రోడ్డుమీద పాముల్లా పారిపోతున్న కార్లు, జనసముద్రం, అందులో రకరకాల దుస్తులు-ఏదో కొత్త ప్రపంచంలోకి వచ్చినట్లనిపించింది మంగమ్మకు.

నిలువెత్తు కెరటాలు లేచి, వొడ్డుమీద విరుచుకుపడి, దాన్ని నురుగుతో అలికి, ఎవరో తరుముతున్నట్లు సముద్రంలోకి పారిపోవడాన్ని ఎన్నిసార్లు చూసినా తనివితీరదనిపించింది మంగమ్మకు.

‘‘ఇలా ఈ సముద్రం పొంతనే, ఓ చిన్న ఇల్లుకట్టుకుని, అందులో ఒంటరిగా ఉంటే ఎంత బావుండును?’’ అనుకొంది మంగమ్మ.

అప్పటికప్పుడే ఆవిడ మనస్సులో ఓ చిన్న డాబా, దానిగోడ నానుకొని సముద్రమూ, సముద్రం వేపుకున్న కిటికీకి దగ్గరగా మెత్తని కుర్చీ వేసుకొని, అందులో తను కూచోవడం, దూరంగా నౌకల రాకపోకలు, సముద్రంలోంచి అగ్నిజ్వాలలు ఎగిసినట్లు, ఉషఃకాలపు అరుణారుణ మేఘశకల సముదాయం, అలలమీద పడిన సూర్యకాంతి ముక్కలయి నీటిలో కరిగిపోవడం, తాను పండుముదుసలి కావడం, ఎవరికోసమో ఎదురుచూస్తూ కూచోవడం- ఆ వ్యక్తి అలలమీదుగా నడిచి తన దగ్గర కొస్తున్నాడన్న భ్రమ...

అన్నింటినీ ఛిద్రం చేస్తూ ‘‘ఇవిగో మంగమ్మా! వేరుశనక్కాయలు, తినవూ?’’ అన్నాడు చలపతి.

లిఫ్టునుంచి కిందికి దిగుతున్నప్పుడు కలిగే భావంలాంటిదేదో మంగమ్మలో మెసిలి, నిట్టూర్చింది. ఈకొద్దిక్షణాల్లో తను చూసిన కొత్త ప్రపంచానికి వేరుశనక్కాయలకూ మధ్య ఎంత వ్యత్యాసం ఉంది! వేరుశనక్కాయలు వాస్తవం. ఆ ప్రపంచం కల్పన! ఐతేనేం,ఎంత హాయిగా ఉంది ప్రాణానికా కల్పన!!

‘‘మరి పోదామా?’’ అన్నాడు చలపతి ఆవిడ సమాధానానికి ఎదురుచూడకుండానే.

అయిష్టంగానే మంగమ్మా లేచింది.

మధ్యలో ఉడ్‌లాండ్స్‌లో భోజనం చేసుకొని ఇంటికొచ్చేసరికి తొమ్మిదయింది. భోజనం చేస్తున్నప్పుడు, చాలామంది చలపతిని పలకరించారు. కొంతమంది ముందుగా దణ్ణాలుపెట్టి, ఏమీ అడగకుండానే పోయారు. వారిలో చాలామందిని తనెక్కడో చూసింది. ఎక్కడ చూసిందో, ఎప్పుడు చూసిందో జ్ఞాపకం రావడం లేదు. ఈ ఆలోచనలతోనే మంగమ్మ బుర్రంతా నిండిపోయింది.

‘‘ఏమిటి ఆలోచిస్తున్నావ్?’’ అన్నాడు చలపతి. కిటికీ కింద వరస తలుపులు వేసేస్తూ.

మంగమ్మ ఇంకా మధ్య హాల్లోనే కూచుని ఉంది. ‘‘ఏంలే’’దన్నట్లుగా పెదవి విరిచింది.

చలపతి గట్టిగా నిట్టూర్పు విడిచాడు.

‘‘నాకేసి అలా చూడవద్దని ఇదివరకు రెండుమూడుసార్లు గట్టిగా చెప్పాను. నేనెందుకు చెప్పానో నీకర్థమయినట్టులేదు’’ అన్నాడు చలపతి.

మంగమ్మకు అర్థంకాలేదనుకోవడంలో అర్థంలేదు.

''ఓరి వీడికడుపుడక! ఈ పూట పూనకం పూనిందల్లే ఉందే!'' అనుకొన్నది మంగమ్మ.

చలపతి ముఖం అర్చుకుపోయేలాగా మంగమ్మ సమాధానం చెప్పగలదు. కానీ అలాచెప్పడం వల్ల కలిగే లాభమేమీ లేదు. ఇప్పుడు తన జీవితం, చలపతి మీద ఆధారపడి ఉన్నది. వీడేదో ఉద్ధరిస్తాడన్న ఆశ-నమ్మకం కాదు-కేవలం ఆశ-తనకున్నది. అదేదో గట్టిగా తేలిందాకా, తనీ ఆధారాన్ని వదలడం మంచిది కాదని మంగమ్మ ఎప్పుడో అనుకొంది. ఆవిడ రాజమణితో మాట్లాడినప్పుడు, ఈ సంగతులన్నీ రాజమణి చూసినట్టుగా చెప్పింది. అది చెప్పిన సంగతులన్నీ వొక్కటొక్కటిగా నిజమవుతున్నాయ్! రాజమణి అనుభవం, తనకెంతగానో ఉపయోగపడుతోంది.

''మాట్లాడవేం?'' అన్నాడు చలపతి, ఈసారి మంగమ్మకు వెనగ్గా వచ్చి నించుని.

అతని చేతులు, కుర్చీమీదినించి మెల్లిగా మంగమ్మ భుజాలను తాకుతున్నాయి. ఆ వేళ్లు భయంతో వణుకుతున్నాయని మంగమ్మ గ్రహించింది. అతన్ని రెచ్చగొట్టి పిచ్చికుక్కను చేయాలన్న సరదా కలిగింది. ఆ పిచ్చిమైకంలో పడినప్పుడు చలపతి ఎలా ప్రవర్తిస్తాడో చూడాలని మంగమ్మ కుతూహలం.

కుర్చీలోంచి కదలకుండానే, మెడ మాత్రం వెనక్కు వంచింది మంగమ్మ. బంగారపు శంఖంలాగా, మిలమిలా మెరిసిపోతోంది గొంతు. ఆ శంఖం మీద సోగగావున్న ముఖం సన్ననిపెదవులు, చిన్ని నొక్కుతో,కొద్దిగా వంగిన గడ్డం, నవ్వినప్పుడు సొట్టలుపడే నున్నని చెక్కిళ్లు మనిషి గుండెల్లోకి చొచ్చుకెళ్లి, రహస్యాలను వెదికి తీసుకురాగల తెలివైన కళ్లు, వొత్తుగా నల్లగా మెరిసే జుట్టూ చలపతిని నిలవనీయలేదు.

అతని కళ్లల్లో ఎరుపుజీరలు చోటు చేసుకొంటున్నాయి. కోరిక నరనరాన పాకి రక్తంలో కలిసి, శరీరాన్ని సంచలింపచేస్తోంది. అతని ఊర్పులు నులివెచ్చగా మంగమ్మ చెంపల్ని తాకుతున్నాయి.

''ఏమిటమ్మాయిది?'' అన్నది మంగమ్మ. సన్నగా నవ్వుతూ, అతని కళ్లల్లో కళ్లుంచి చూస్తూ. ఆమె భుజంమీది చలపతి వేళ్లు, భయంతో కిందికి జారుతున్నాయి. మంగమ్మ అతని చేతుల్ని పట్టుకుని మెత్తగా నొక్కింది. చలపతి నిలువునా చలించిపోయాడు.

''నీకు నిద్రొస్తోందా?'' అన్నాడు చలపతి ఆవిడచేతులు వదలకుండానే.

'ఊఁహు'అన్నది మంగమ్మ నవ్వునాపుకొంటూ.

''అబద్ధాలాడకు. నాకు తెలుసు. నీకు నిద్రొస్తోంది. వెళ్లిపడుకో''అన్నాడు చలపతి పొడిపొడిగా.

అతని గొంతు తడారిపోయింది!

''నాకు నిద్రరావడం లేదు'' అన్నది మంగమ్మ. కళ్లుచికిలించి చలపతికేసి చూస్తూ. ''మీరెందుకు నిద్రపొమ్మంటున్నదీ నాకు తెలీదనుకొన్నారా?'' అన్నది.

''నిజంగానే తెలియదు. ఎందుకు పొమ్మంటున్నానుట?''

''ఎందుకా;'' అని, ఓ క్షణమాగి, రెండుచేతుల్లోనూ ముఖం దాచుకొంది మంగమ్మ. ''పొండిబాబూ! నేను చెప్పను. నన్ను ముట్టుకోకండి. నామీదినించి చేతులు తియ్యండీ ముందు'' అన్నది ఆ ప్రయత్నమేమీ చెయ్యకుండానే.

''చచ్చిపొమ్మన్నా పోతానుగానీ, ఆ పనిమాత్రం నావల్లకాదు'' అన్నాడు చలపతి.

''ఏమిటమ్మా ఆ మాటలు? ఇప్పుడు చావులెందుకు చెప్పు?'' అన్నది మంగమ్మ గారాలుపోతూ.

చలపతి చెప్పలేదు. అతని నరనరమూ బిరుసెక్కి బాధపెడుతున్నది. రక్తం గోళ్లచివళ్లకొచ్చి వేళ్లు చిమచిమలాడుతున్నాయి.

"అబ్బ! ఇంత చలిలో, ఇలా బయట కూచోవడం ఇబ్బందిగా లేదూ? లోపలకొచ్చి కూచోరాదూ?" అన్నాడు చలపతి కుర్చీలోంచి మంగమ్మను కదుపుతూ.

"ఇబ్బందేననుకోండి. ఓ షరతుమీదయితే లోపలకొస్తాను".

"చెప్పు"

"తరువాత మాట తిరిగితే నేను వొప్పుకోను సుమా! ముందుగానే చెబుతున్నాను. ఏమిటంటే-మీరు బుద్ధిమంతుడైన పిల్లకాయలాగా, చెప్పిన మాట వింటానంటే వస్తాను. కొంటెవేషాలు వేశారంటే ఈ వరండాలోకొచ్చి పడుకుంటాను. మీకిష్టమేనా?" అన్నది మంగమ్మ.

చలపతి చూపులు ఆమె పమిట వెనక వెదుకుతున్నాయి.

"నువ్వింత మొండిదానివేం మంగమ్మా?" అన్నాడు చలపతి.

"నాసంగతి తరువాత చెబుతాను. ముందు నీ సంగతి చెప్పండి".

"నన్ను చంపుతున్నావు పో" అన్నాడు చలపతి. 'సరే నీయిష్టం'.

మంగమ్మ లోపలికొచ్చింది. ఆ వెంటనే చలపతి కూడా వచ్చాడు. వస్తూనే తలుపుకు గడియవేశాడు.

"ఇవ్వేళ మీరు కిందపడుకోండి. ఈ నాలుగైదురోజుల్నించీ చాపమీద పడుకొంటే, వొళ్లంతా విరగ్గొట్టినట్టుగా ఉంది" అన్నది మంగమ్మ.

చలపతి మాట్లాడలేదు.

"కింద పడుకోవడం నాకలవాటు లేదని వెనక మీకోసారి చెప్పాను...అయ్యో రామా! ఎందుకలా నవ్వుతారు...మీరలా ప్రతిదానికీ పెడర్థాలు తీస్తే నేనసలు మీతో మాట్లాడనే మాట్లాడను. పొండి బాబూ! నాకు ఏమంచమూ వద్దు. మీరూ వద్దు. నేనే వెళ్లి కింద పడుకొంటాను" అన్నది మంగమ్మ.

మంచంమీద కూచున్నదల్లా ఛటాలున లేచి తన గదిలోకొచ్చింది. రాత్రి పడుకొన్న పక్క, నలిగి అలాగే పడి ఉంది. దాన్నోసారి దులుపుకొని వేసుకొందామనుకొంది. దుప్పటి దులిపి వేస్తున్నప్పుడు, మంగమ్మ వెనక్కు తిరిగి చూసింది. చలపతి నించుని ఉన్నాడు. అతని కళ్లు తాగినవాడి కళ్లులాగా ఉన్నాయి.

"మళ్లా ఇక్కడికొచ్చారేం? నన్నీ రాత్రి నిద్రపోనివ్వరా ఏం?" అన్నది మంగమ్మ.

"ఊఁహు".

"ఆ పప్పులేం మనదగ్గర ఉడకవు సార్! మర్యాదగా వెళ్ళి నిద్రపోండి...ముందా చెయ్యి అక్కణ్ణించి తీసెయ్యండి" అన్నది మంగమ్మ.

"అంతేనా?" అన్నాడు చలపతి.

"మీరు మాట తప్పారు. నన్ను ముట్టుకోనని ముట్టుకున్నారు. నేనిక గదిలో పడుకోను. ఉండండి. నన్ను పక్క చుట్ట వరండాలోకి తీసుకెళ్లనివ్వండి...అరె! అలా అడ్డందూరతారేం?" అన్నది మంగమ్మ నవ్వి.

"నేనూ వరండాలోనే పడుకుంటాను పదా" అన్నాడు చలపతి.

మంగమ్మ సగం వేసిన పక్కమీద కూచుంది. గడ్డాన్ని మోకాళ్ల మీద ఆనించింది. రెండు చేతులూ కాళ్లకు చుట్టవేసి, చలపతికేసి చూస్తూ కూచుంది.

“నే నెక్కడికెడితే అక్కడికే వస్తారన్నమాట!” అన్నది మంగమ్మ.

చలపతి “ఆఁ” అన్నాడు.

“మీరీపూట ఇలా మొండికెత్తారేమిటి?” అన్నది మంగమ్మ.

చలపతి కూడా, ఆవిడ పక్కనే కూచున్నాడు. మంగమ్మ ముఖాన్ని తనవైపు తిప్పుకున్నాడు.

“ఏమిటి చెప్పండి?” అన్నది మంగమ్మ.

“నన్నలా కొంచెంసేపు నీ ముఖం కేసి చూడనివ్వు మంగమ్మా!”

“ముఖం మాత్రమే చూసి వెడతానంటే, చూడనిస్తాను. కానీ మీరలా వెళ్లరుగదా!... అదుగో, ముందా చెయ్యి అక్కణ్ణించి తీసెయ్యండి బాబూ, మీరసలే కైపులో ఉన్నారు. ఇలా మరో పదినిమిషాలు తాకనిచ్చానంటే- ఆతరువాత మిమ్మల్నాపడం బ్రహ్మవల్ల కూడా కాదు. అంచేత-నేను వెళ్లేమో మంచం మీద బబ్బుంటాను. వింటున్నారా?...మీరిల్లాగే, ఇక్కడే నిద్రపోవలయునని నేను కోరుచున్నాను”.

మంగమ్మ ఛటాలున లేచి నాలుగడుగులు వేసింది. ఠక్కున ఆగిపోయింది. ఆవిడ పమిట చెంగు చలపతి చేతుల్లో ఉండిపోయింది. మరో అడుగు కూడా పడకుండా చలపతి ఆవిణ్ణి ఆలింగనం చేసుకొన్నాడు. అతనిలోంచి తనలోకి నిప్పు చినుకు దూకుతున్నట్లనిపించింది మంగమ్మకు. ఇక తను చలపతిని నిగ్రహించలేదు. తనేం చెప్పినా అతను వినేదశలో లేడు. అయినా మరో చిన్న తమాషా చేదామనుకొంది మంగమ్మ.

“అబ్బబ్బా!...అంత లైటేమిటండీ?” అన్నది మంగమ్మ.

చలపతి లైటు ఆర్పేశాడు. ఆకుపచ్చని డిమ్మర్ కాంతి గదిలో పలచగా పరుచుకొంది. చలపతి ఓ నిమిషం పాటు మంగమ్మను నిలువునా చూశాడు.

“అలా చూస్తారేం?” అన్నది మంగమ్మ మెల్లిగా.

“నమిలి మింగితే రేపటికి ఉండవనిగానీ, లేకపోతే అమాంతం తినేసి ఉందును?” అన్నాడు చలపతి.

మంగమ్మ ఏమీ మాట్లాడలేదు. చలపతి ఆవిడ పెదవుల కోసం వెదుకుకొంటూ “ఎంత బావున్నావమ్మా నువ్వు!” అన్నాడు.

ఛటుక్కున ఆవిడకు రామచంద్రం జ్ఞాపకం వచ్చాడు. అతను కూడా మొదటిసారి తను రిహార్సల్ రూంలో కలుసుకొన్నప్పుడు ఈ మాటే అన్నాడు. ఈ జ్ఞాపకం ఆవిడ మనస్సంతా దిగులుతో నిండిపోయింది. శరీరంలోంచి శక్తి జారిపోయిందనిపించింది. చలపతికివేమీ తెలియవు. వేటకుక్కలాగా మంగమ్మను తనకేసి పొదువుకొన్నాడు. ఆవిడ కూడా రబ్బరుబొమ్మలాగా అతనిచేతుల్లో ఆడింది.

ఆవిడకు మెలకువ వచ్చేసరికి ఎంత రాత్రయిందో తెలీదు. తెలుసుకోవాలంటే లేచి వెళ్లి, అలమరా తలుపు తెరచి చూచి రావాలి. ఆ పని చేయబుద్ధి కాలేదు. ఆ పక్కమీద పడుకొంటే గండుచీమల పుట్టమీద పడుకొన్నట్లుగా ఉంది మంగమ్మకు. మెల్లిగా లేచివెళ్లి తన పక్కమీద పడుకొంది. అక్కణ్ణుంచి చూస్తే చలపతి కనిపిస్తున్నాడు. కాస్సేపు అతని ముఖం వైపే చూసింది. తనకోసం ఆ శరీరం పడిన యాతను తలచుకొని, తనలో తనే నవ్వుకొంది.

“నువ్వంటే నాకు చాలా ఇష్టం మంగమ్మా!” అన్నాడు ఇందాక.

“కావాలంటే నీకోసం చచ్చిపొమ్మన్నా చచ్చిపోతాను” అన్నాడు.

ఇటువంటి మాటలూ, ఇవే మాటలూ, తనిప్పటికి లక్షా తొంభైసార్లు విన్నది. తన దగ్గరకొచ్చిన

ప్రతి వెధవ సన్యాసీ ఈ మాటలన్నాడు. ఇకముందు రాబొయ్యేవాళ్లు కూడా అంటారు. అవన్నీ పచ్చి అబద్ధాలనీ వాళ్లకూ తనకూ తెలుసు. నమ్మమన్నట్లుగా వాళ్లంటారు. నమ్మనట్లుగా తనూ మాట్లాడుతుంది. ఈ జీవితనాటకంలో, ఈ డైలాగు తప్పకుండా ఉండాల్సిందే!

అలాకాకుండా-ఒక్కసారిగా మనస్సులో ఉన్నదంతా కక్కెయ్యాలనిపిస్తుంది అప్పుడప్పుడు. కాని ఆ పని చెయ్యలేదు. ఇక ముందు కూడా చెయ్యబోదు.

తనెన్నో ఆశలు మూటగట్టుకొని ఇక్కడికొచ్చింది. మూట విప్పినప్పుడు అందులో వజ్రాలు, కెంపులు మెరవాలిగానీ,రాళ్లు రప్పలుండకూడదు. ఏమి ఉంటాయో ఇప్పుడే తన చెప్పలేదు కూడాను....

"నేను చాలా అమాయకురాలనని చలపతి ఉద్దేశం. ఇందాక "నిన్ను నేను జయించాను కాదూ?" అన్నాడు వాడు. అందులో వాడు జయించిందేమిటో తనకు బోధపళ్ళేదు. నాలుగురోజుల తరువాతగానీ, తనను తాకటానికి గుండెలేనివాడు, తనను జయించాననడంలో అర్థం లేదు. తను చలపతికి లొంగిపోవలసి వస్తుందని ఇవ్వాళనుకోవడమేం ఖర్మ-వాడితో మద్రాసు బండెక్కినప్పుడే అనుకొంది. ఈ ముష్టిపనికోసం నాలుగు రోజులు పస్తాయించాడన్నప్పుడే వాడంటే ఏమిటో తనకు తెలిసిపోయింది. ముందు ముందు అవసరాలకు పనికొచ్చే మనిషి గనక, కాస్సేపు నాటకం ఆడాలిసొచ్చింది. ఇదంతా నిజమేనని చలపతి నమ్మి వుంటే-వీడూ అందరిలాంటివాడే! నమ్మకపోతే మాత్రం, తను జాగ్రత్తగా ఉండటం అవసరం!

ఎక్కడో గడియారం రెండు గంటలు కొట్టింది. మంగమ్మ మెడదాకా దుప్పటి కప్పుకుని ఓసారి కళ్లు గట్టిగా నులుముకుని పడుకొంది. బుర్రలో రకరకాల ఆలోచనలు మోసులెత్తి క్రమంగా మసకలో కలిసిపోతున్నాయి. వాటికొక రూపంలేదు. ఒక వరుసలేదు. కళ్లు బరువుతో వాలిపోతున్నాయి. కప్పుకొన్న దుప్పటి మాగుడువాసన కొడుతోంది. దుప్పటి తీస్తే చలి. కాళ్లు చేతులు ముణగదీసుకుని కళ్లు మూసుకొంది. అయిదారు నిమిషాలు గడిచాయో లేదో, చలపతి అక్కడికొచ్చాడు; ఆవిడ పక్కనే పడుకుని, నడుంమీద చెయ్యివేశాడు.

"ఇక్కడి కొచ్చావేం?" అన్నాడు మెల్లిగా.

మంగమ్మ శరీరం అసహ్యంతో జలదరించిపోయింది.

"నేనూ ఇక్కడే పడుకొంటాను" అన్నాడు చలపతి.

అతను మాట్లాడుతుంటే పుల్లని వాసన వస్తోంది.

"ఎలాగైనా చావు" అనుకొంది మంగమ్మ లోలోపల.

"ఇటు తిరగవా మంగూ?" అన్నాడు చలపతి.

"పరమేశ్వరా!" అనుకొంది మంగమ్మా. ఈ వెధవ మళ్లా తయారయ్యాడు. తప్పదు".

"నిద్రపోతున్నప్పుడు నువ్వెంత బావుంటావని?" అన్నాడు చలపతి.

"ఓ పదినిమిషాల్లో వీడు వొదిలిపోతే బావుణ్ణు, సుఖంగా కడుపులో కాళ్లెట్టుకుని పడుకోవచ్చు" అనుకొంది మంగమ్మ.

సాధ్యమైనంత త్వరలో చలపతిని వదిలించుకోవాలనుకొంది.

"మీరిక్కడికొస్తారని నాకూ తెలుసు. ఇంత "ప్రేమ" నామీద ఉన్నవాళ్లూ ఈ నాలుగు రోజులూ ఎలా నిద్రపోగలిగారో నాకు తెలియకుండా వుంది. మీరు నమ్మండి నమ్మకపోండి గానీ నాకు మాత్రం నిద్రపట్టలేదు. ఒట్టువేసి చెబుతున్నా...అబ్బా అలా చంపేయకండి! మీకు పుణ్యం వుంటుంది" అన్నది మంగమ్మ అతన్ని రెచ్చగొట్టే సదభిప్రాయంతో.

చలపతి మరోసారి వేటకుక్కలా మారిపోయాడు.

"ఇక హాయిగా నిద్రపోవచ్చు" అనుకొంది మంగమ్మ ఆవలిస్తూ.

ఈసారి ఆవిడబుర్రలో ఏ ఆలోచనలూ లేవు. ఓనిమిషం పాటు అంటూ ఇటూ మసిలి గాఢంగా నిద్రపోయింది.

ఆ మొన్నాడు మధ్యాహ్నం దాకా మంగమ్మకు బద్ధకంగానే ఉంది. తాయారు కేరియర్‌లో భోజనం తెచ్చి పెట్టింది. చలపతి ఉదయమే వెళ్లాడు. మధ్యాహ్నం తాను రాననీ భోంచెయ్యమనీ మంగమ్మతో చెప్పనే చెప్పాడు.

ఓసారి బరువుగా ఒళ్లు విరుచుకుని, అనవసరంగా ఆవలించి చిటిక వేసింది. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. పక్కింట్లోంచి ఏదో పాట సన్నగా ఓ నిమిషం పాటు వినిపించి ఆగిపోయింది. కాసేపు కబుర్లు చెప్పుకోడానికి ఎవరన్నా ఉంటే బావుండుననిపించింది మంగమ్మకు. ఇరుగు పొరుగు వారెవరో ఇంతవరకూ ఆవిడకూ తెలీదు. చలపతి వెళ్లిపోయాడు. తాయారైనా మరో పావుగంటలో వెడుతుంది. సాయంత్రం దాకా తనొక్కతీ బిక్కుబిక్కుమంటూ కూచోవాలి.

పోతున్న తాయారును వెనక్కు పిలిచింది మంగమ్మ.

"ఏందమ్మాయిగారూ!" అన్నది తాయారు, గోదావరి జిల్లా యాసతో.

తనిన్ని రోజుల నుండీ తాయారు మాటలు వింటున్నా ఆవిడది గోదావరిజిల్లా అయివుంటుందని మంగమ్మ అనుకోలేదు.

"నువ్వు తొందరగా ఇంటికెళ్లాలా? అసలు మీ ఇల్లెక్కడ తాయారూ?" అడిగింది మంగమ్మ.

"ఇక్కడేనమ్మా, సీతారాం స్టూడియోస్ వెనకాతల ఉంటున్నాను" అంది తాయారమ్మ.

ఆ మాటలంటున్నప్పుడు తాయారు మాటలు తొట్రుపడటం మంగమ్మ గమనించింది.

"తొందరపనులేమీ లేకపోతే కూచో తాయారూ! ఒక్కదాన్ని నాకేమీ తోచకుండా ఉంది. ఏదో మాట్లాడుతూ కాలక్షేపం చెయ్యొచ్చు. ఇద్దరంకలిసే భోంచేద్దాం" అన్నది మంగమ్మ,

తాయారు గేటుకు గడియపెట్టి వచ్చి కూచుంది. తీరా కూచున్నాక ఏం మాట్లాడవలసిందీ మంగమ్మకు తోచలేదు. ముందు-చలపతిని గురించి అడుగుదామా? అనుకొంది. కాని, అందువల్ల లేనిపోని రగడ చాలా జరగవచ్చునన్న అనుమానంతో అడగడం మానివేసింది. చలపతిని గురించి తనకన్నా తాయారుకు ఎక్కువ తెలిసుంటే తప్ప, లేకపోతే తన ప్రశ్న వల్ల ప్రయోజనమేమీ ఉండదు. అదీగాక అలా అడగడం వల్ల, తనకూ చలపతికీ అట్టే మంచి సంబంధాలు లేవని తాయారు అనుకొన్నా అనుకోవచ్చు. అసలిన్ని గొడవలు తెచ్చుకోవడమెందుకుట?

"నువ్వెంత కాలం నుండీ ఇక్కడ పనిచేస్తున్నావు తాయారూ?" అన్నది మంగమ్మ.

"అయిదారు మాసాలయిందండి!" అన్నది తాయారు.

"అంతకుముందే చేస్తుండేదానివి?" అన్నది మంగమ్మ.

తాయారు మాట్లాడలేదు.

"నీకు ఇష్టం లేకపోతే చెప్పకు. నేనయినా సరదాకు అడిగాను గానీ" అన్నది మంగమ్మ.

"ఎందుకులెండమ్మగారూ! నాదంతా అడవిగోడు. చెట్టొగ్గేసిన పిట్టలాగయింది నా బతుకు. ఎంతమంది చెప్పినా యినుకొన్నానుగాదు. మూరగంతో ఇటెల్లిపోయొచ్చేశాను. నా మదం భగవంతుడే అణిచేసినాడు" అన్నది తాయారు.

ఆవిడ గొంతు దుఃఖంతో పూర్తిగా పూడుకుపోయింది. ఆపుకొందామన్నా ఆగకుండా కన్నీళు

్లు పార్లిపోయాయి. మంగమ్మకు ఆశ్చర్యమూ, అంతకన్నా విచారమూ కలిగాయి. పైకి ఎంతో ప్రశాంతంగా కనిపించే తాయారు లోలోపల కార్చిచ్చులున్నట్లనిపించిందామెకు.

"నిన్ను నొప్పించానేమోనమ్మా! పాడు సంగతులు పోనివ్వు. ఇంకేమన్నా మాట్లాడు కొందాం-అన్నట్లు అడగడం మరిచాను, మీ ఆయన ఏం చేస్తుంటాడు?" అంది మంగమ్మ.

ఈ ప్రశ్నతో తాయారు దుఃఖం కట్టలు తెంచుకుంది. పమిటచెంగును ఉండలాగా చుట్టి నోట పెట్టుకుని కుళ్ళికుళ్లి ఏడ్చింది. అవాంఛనీయమైన సంఘటనేదో జరిగి ఉంటుందనేది ఖాయమనుకొన్నది మంగమ్మ. అదేమిటో తెలుసుకోవాలని ఆవిడ ఆకాంక్ష. కానీ అడిగితేనే బావురుమంటున్న తాయారు ఉండి అదేమిటో తెలుసుకోవడం ఎలా?

"మీదీ ప్రాంతం కాదా తాయారూ?"

తలతోనే 'కా'దన్నది తాయారు.

"గుంటూరు జిల్లానా?"

"కాదండీ! రాజమంద్రం?" అన్నది తాయారు. "దానవాయి పేటలో ఉండేవాళ్లమండీ; మా అయ్యా, అమ్మా ఇప్పటికీ ఆడనే ఉంటున్నారండీ!"

"మరింకేం? ఇక్కడ ఆ పనీ ఈ పనీ చేసుకుంటూ, అయిదుకూ పదికీ అవస్థ పడకపోతే హాయిగా మీ అమ్మానాన్నా దగ్గరికి పోరాదూ?"

తాయారు కాస్సేపు మెదలకుండా ఊరుకొంది.

"వాళ్ల మీద గానీ అలిగివచ్చావా?" అనడిగింది మంగమ్మ. "పోనీ-ఆయనుంటే-అతనేమంటాడుట?"

"అందరూ ఉన్నారమ్మగారూ! పున్నెం చేసుకుని పుట్టినోరు. అల్లకేం సలక్షణంగా ఉన్నారు. ఏపాపం చేసుకొన్నానో తెలీదమ్మగారూ- ఈ మురికికూపంలోకొచ్చి పడ్డాను. ఇంటి దగ్గర ఎవరికీ తెలియకుండా రైలెక్కి వొచ్చేశానండీ!" అన్నది తాయారు.

తరువాత అన్ని సంగతులూ వరుసగా చెప్పుకొచ్చింది.

తాయారు మొగుడు కిళ్లీకొట్టు పెట్టుకొన్నాడు. రోజుకు డెబ్బయ్, ఎనభై రూపాయల దాకా అమ్మకాలు ఉంటూ ఉండేవి. మొగుడేదన్నా పనిమీద కెళ్లినప్పుడు తాయారే కొట్లో కూచుంటుండేది. ఆవిడ మొగుడు తాయారుకు వ్యాపారంలోని లగువుబిగువులన్నీ చెప్పాడు.

ఆవిడ కొట్లో కూచోవడంతో, అమ్మకాలు బాగా పెరగసాగాయి. తాయారు జగన్మోహిని కాకపోవచ్చుగానీ, కురూపి కూడా కాదు. ఏ మగవాణ్ణయినా ఇట్టే కట్టివేసుకోగల అందమైన కళ్లను భగవంతుడామెకు ఇచ్చాడు. పైగా ఇంత ఎర్రతోలు కూడా ప్రసాదించాడు. ఆవిడ చూపులకోసమే జనం విరగబడిపోయేవారు. తాయారుకివన్నీ మొదట్లో తెలీదు.

వీళ్ల కిళ్లీకొట్టు ఓ సినిమా హాలుకు ఎదురుగ్గా వుంది. ఇంకో పక్కగా పెద్ద హొటలుంది. పగలల్లా హొటల్ అమ్మకాలుండేవి. రాత్రిళ్లు సినిమా అమ్మకాలుండేవి. భార్యాభర్తలిద్దరూ వంతుల ప్రకారం కూచుని వ్యాపారం చూసుకొంటూ ఉండేవారు.

ఒకసారి ఏదో కొత్తసినిమా ఆ హాల్లోకొచ్చింది. ఆరువారాలైనా జనం విరగబడి చూస్తునే ఉన్నారు. ఆ సినిమా వెంట ఒక రిప్రజెంటేటివ్ వచ్చాడు. అతడు సన్నగా, పొడుగ్గా, తెల్లగా ఉన్నాడు. మంచి మాటకారి అతను. అస్తమానం కొట్టు దగ్గరే ఉండేవాడు. రెండు మూడు సార్లు తాయారుకు ఉత్తినే సినిమా కూడా చూపించాడు.

"అదే నా కొంపతీసిందమ్మగారూ! ఆ మాయసచ్చినోడి మాటల్లో పడ్డాను. అరచేతిలో వైకుంఠం చూపించేసినాడండీ! నన్ను స్టార్‌ని చేస్తానన్నాడు. సొంతంగా సినిమా తీస్తానన్నాడు. దొంగసచ్చినదాన్ని అన్నీ నమ్మాను. ఇంట్లో వున్న నగా నట్రా బోర్లించేసుకుని వాడితో పట్నం వచ్చాను. వారంరోజులకల్లా మా అయ్యా, అమ్మా వచ్చారు. నాలుగురోజులపాటు నన్ను బతిమాలారు. నేను రానంటే రానన్నాను. మా అమ్మ మరీమరీ ఏడిచిందండీ! వెళ్లబుద్ధి కాలేదు. వాళ్ళెళ్ళిపోయారు. నాలుగైదు మాసాలు, ఇదిగో అదిగో అంటూ నన్ను బులిపించాడు వాడు.  ఉన్న సొమ్మంతా ఖర్చయిపోయింది తిండి కూడా కటకటపడ్డాను. వాడు చెప్పకుండా వెళ్లిపోయాడు" అన్నది తాయారు.

మంగమ్మ గుండె గుభిల్లుమన్నది.

"పోనీ నువ్వెక్కడన్నా ప్రయత్నం చెయ్యకపోయావా?" అన్నది మంగమ్మ.

"తిరిగానమ్మా! కడుపునాయగట్టుకుని అన్ని కంపెనీల చుట్టూ తిరిగాను. ఇదిగో అదిగో ననడమేగానీ, ఏమీ లాభం లేకపోయింది. ఆఖరికి ఎక్‌స్ట్రా వేషాలక్కూడా సిద్ధపడ్డాను. అదీ అంతంత మాత్రంగానే ఉంది. రోజల్లా స్టూడియో లోపల పడిగాపులు గాస్తే అయిదారు రూపాయలన్నా దొరుకవమ్మా! అవన్నా వెంటనే చేతులల్లో పడవు. ఆ ముష్టి అయిదు రూపాయలకోసం కంట్రాక్టరు చుట్టూ తిరగాలి. వాడు రేపురా, మాపురా అంటూ మాసాలకొద్దీ తిప్పుతాడు. పాటికి పదిసార్లడిగితే 'ట్రబుల్‌సమ్ ఆర్టిస్టు' అని టాంటాం కొట్టి ఇంకోసారి పిలవడు. అడక్కపోతే అసలే వసూలుకాదు. ఎప్పటికొప్పటికి వస్తుందిగదాని సరిపెట్టుకోడా నికీల్లేదు. సంవత్సరానికి అయిదారు చిన్నవేషాలు దొరికితే అక్కడికి అదృష్టమేననుకోవాలి. ఆ డబ్బులోనూ, రూపాయికి పావలాలు కమీషనుపోను, మిగతావి చేతికి వస్తాయి. ఈ వేషాలకయినా వొళ్లొప్పగించాల్సిందేనమ్మా! నాకు రోత పుట్టింది. ఫీల్డును వొగ్గేసినా, పనిచేసుకు బతుకుతున్నాను. నా ప్రాణానికి హాయిగా ఉంది!" అన్నది తాయారు.

మంగమ్మకు చలిజ్వరం కమ్ముకొచ్చినట్లయింది. చెవుల్లో సన్నని రొద ప్రారంభమయింది. తల చిటపటలాడిపోయింది. ఏదో మైకం కమ్మినదానిలాగా కుర్చీలో అలానే కళ్లుమూసుకుని ఉండిపోయింది.

"ఏందమ్మా!" అన్నది తాయారు.

మంగమ్మకా మాటలు వినిపించాయో లేదోగానీ, ఆవిడ మాత్రం ఏమీ పలకలేదు. మూసుకొన్న కనురెప్పలు తడితడిగాఉండటం తాయారు చూసింది.

"ఎంత మంచితల్లో!" అనుకొన్నది తాయారు,పమిటతో మంగమ్మకు మెల్లిగా విసురుతూ.

చాలాసేపటిగ్గానీ మంగమ్మ తిరిగి మామూలుస్థితికి రాలేకపోయింది. ఆవిడ మనసిప్పుడు కందిరీగల తుట్టెలా వుంది. రకరకాల భయాలు మోసులెత్తి తక్కిన భవిష్యత్తు కూడా తాయారు చెప్పనట్టుగానే తయారు కాబోతున్నట్లూ మంగమ్మ కనిపించింది. హఠాత్తుగా ఆవిడకు-చలపతి తనను మోసం చేశాడన్న ఊహతట్టి గిజగిజలాడిపోయింది. తను తిండికీ గుడ్డకూ ముఖం వాచి, బస్సుగ్గూడా డబ్బుల్లేక, కాలినడకన సినిమా కంపెనీల చుట్టూ తిరిగినట్లూ, వాళ్లు 'అదిగో-ఇదిగో' అంటూ తిప్పినట్లూ, చివరికి ఏ గతీలేక, తిరిగి గుంటూరు చేరుకొన్నట్టూ- ఓ చిన్న 'చలనచిత్రం' మనోవీధిలో మెరిసి మాయమయింది.

"జరగదు-జరగదు-అలా ఎన్నటికీ జరుగదు" అన్నది మంగమ్మ.

"ఏందమ్మాయిగారూ! మీలో మీరే ఏదో అనుకుంటున్నారు?" అన్నది తాయారు.

తను లోపల అనుకొన్నవన్నీ-పైకే అనేస్తున్నట్లు మంగమ్మకింకా తెలీదు.

“తరువాత?” అని అడిగింది మంగమ్మ.

ఏం తరువాతనో తాయారుకర్థంకాలేదు. అది కొంతసేపు మంగమ్మకేసి అదేపనిగా చూసి తలదించుకొంది.

“ఇలా ఎంతకాలం గడుపుతావు తాయారూ?” అన్నది మంగమ్మ.

“ఏం చెయ్యనమ్మా! ఎరెక్కరెక్క ఈగోతిలో కొచ్చిపడ్డాను. తిరిగి బయటికెళ్ళడం తెలవదు. ఓపికున్నంత కాలం, రెక్కలమీద బతుకుతా. సచ్చినాననుకోండి. ఏ ధర్మప్రభువో అవతల కీచ్చేస్తాడుగానీ శవాన్ని ఉంచుకోడుగందా!” అన్నది తాయారు.

తాయారు నడిగి ఇంకా చాలా సంగతులు తెలుసుకోవాలనుకొంది మంగమ్మ. కానీ అడగబోయేసరికి ఒక్కటీ జ్ఞప్తికి రాలేదు. మంగమ్మ వోసారి లోపలికెళ్ళి తిరిగి వచ్చి తాయారు చేతిలో పాతిక రూపాయలు పెడుతూ “నీకు అవసరమైనపుడు నన్నడుగుతుండు. నేనిల్లా యిచ్చానని చలపతితో అనబోకు”అన్నది.

తాయారు కళ్లు మిలమిలలాడాయి. అది మరోసారి దణ్ణం పెట్టి వెళ్లిపోయింది. మంగమ్మ వీధి తలుపు దగ్గరగా వేసింది. పక్క యింట్లోంచి పెద్దగా నవ్వులు, కేకలు వినిపిస్తున్నాయి. మునిగాళ్లమీద నిలబడి ఓసారి పిట్టగోడమీదుగా, ఆ ఇంటివేపు చూసింది. అయిదారుగురు మగవాళ్ళు, ఆడవాళ్లు కలిసి పేకాడుతున్నారు. గదిలో ఓ మూలగా నల్లని సీసాలు, గ్లాసులు కనిపించాయి. ఓ ప్రబుద్ధుడు కిటికీలోంచి మంగమ్మను చూసి, గట్టిగా ఈలవేశాడు. మరొకరెవరో ‘కొత్తపిట్టరా!’అనడం కూడా మంగమ్మకు వినిపించింది. ఆవిడ చకచకా లోపలికొచ్చి మంచం మీద పడుకొంది. డాబాకమ్ములకు బూజు వేళ్లాడుతుంటే కాస్సేపు చూసింది. ఓ పిచ్చిక కిచకిచ లాడుతూ గదంతా తిరిగి, కిటికీలోంచి వెళ్లిపోయింది. రాత్రి పక్కమీద నలిగిపోయిన ‘చిత్రభూమి’ పత్రిక తీసింది. దాన్నిండా రకరకాల బొమ్మలున్నాయి. వాటి కింద ఏవేవో రాశారు. ఆ బొమ్మలుగానీ, రాతలుగానీ ఆవిడ మనస్సుకెక్కలేదు. చెరుపుదామన్నా చెరక్కుండా, తాయారు చెప్పిన సంఘటనలు కళ్లముందు కదులుతున్నాయి. ఓసారి గట్టిగా కళ్లు నులుముకొని, ఉత్తినే ఆవలించి, కళ్లు విరుచుకొంది. శరీరాన్ని ఏదో బరువు అణచివేస్తున్నట్లనిపించింది. కళ్లుమూసుకొంది. అలానే సాయంత్రందాకా నిద్రపోయింది.

ఆరుగంటలకు చలపతి వచ్చాడు. వస్తూ వస్తూ మరెవర్నో వెంటబెట్టుకొచ్చాడు. ఆ రెండో గొంతు కాస్తంత బొంగురుగా వుంది. “ముసలి వేషాలకయితే బాగా పనికొస్తాడు” అనుకొంది మంగమ్మ.

“ మీరిలా దయచెయ్యండీ! నేను యిప్పుడే ఆవిణ్ణి తీసుకొస్తాను”-అది చలపతి గొంతు.

మంగమ్మ గొంతు సరిచేసుకొంది.

చలపతి లోపలికొచ్చి, మంగమ్మ వోసారి చూశాడు. ఆవిడింకా నిద్రమత్తులో జోగుతూ వుంది.

“నేననుకొంటూనే వున్నాను...మరీ నీకింత నిద్రదయ్యం పట్టిందేమిటి మంగమ్మా! రాత్రింబవల్లలా ఏకీకాకీన నువ్వెలా నిద్రపోగలుగుతున్నావో తెలీదు...త్వరగా తయారవు. అవతల ఆయనగారు కూచుని ఉన్నారు. మాగొప్ప చెయ్యిలే. మాట అన్నాడంటే జరిగి తీరవలసిందే! దానికిక తిరుగులేదు. ఊఁ-కానియ్” అంటూనే చలపతి తిరిగి వసారాలోకి వెళ్లిపోయాడు.

ఓసారి గట్టిగా నిట్టూర్చింది మంగమ్మ.

పావుగంటకల్లా జగన్మోహినిగా తయారయింది. ఈలోగా రెండు మూడు సార్లు లోపలికొచ్చాడు చలపతి. ఓసారి ఆవిడ జాకెట్ తొడుక్కొంటోంది.

“నేను సాయం చెయ్యనా?” అన్నాడు చలపతి దగ్గరగా వస్తూ.

"ఇప్పుడొద్దులెండి"అన్నది మంగమ్మ పైకి నవ్వేస్తూ.

"మరెప్పుడుటా?" అన్నాడు చలపతి.

"నేను చెబుతానుగా! మీరు వెళ్లి కూచోండి. ఈలోగా-చీరె కూడా మార్చేసుకొస్తాను... ఊఁ-వెళ్లండి మరి...మీరున్నకొద్దీ ఆలస్యమే-అలా గంట్లు పడేలా చూస్తారేం....వారు వెళ్లిపొయ్యాక మనిద్దరమేగా వుంటాం...అప్పుడు...."

చలపతి ఓసారి ఆవిడ ముఖాన్ని వాసన చూసి "త్వరగా రావాలి మరి. పంతులుగారు ఎదురు చూస్తున్నారు" అన్నాడు బిగ్గరగా

"ఫర్వాలేదు లెండి. అమ్మాయిగార్ని తొందరపెట్టకండి" అన్నారా పంతులుగారు బయటనించే.

మరో అయిదునిమిషాలకల్లా మంగమ్మ తలుపు పక్కన నుంచుంది.

చలపతి ఓసారి తలుపుకేసి చూసి "ఇలా రా మరి, అక్కడ నుంచుంటావేం? పర్వాలేదులే రా. మన గురువుగారే" అన్నాడు.

"ఈ అభినయం చెయ్యలేక చచ్చిపోతున్నాను బాబూ!" అనుకొంది మంగమ్మ.

తరువాత, తలొంచుకుని సిగ్గుపడుతూ వెళ్లి ముళ్లమీద కూచున్నట్లుగా, వొళ్లంతా ముడుచుకుని, కుర్చీమీద కూచుంది.

"నమస్కారమండీ!" అన్నది మంగమ్మ చాలా సున్నితంగా.

"ఇష్టార్థ సిద్ధిరస్తు" అని దీవించారు పంతులుగారు.

"పరబ్రహ్మ శాస్త్రిగారని-మనం రోజూ చెప్పుకొంటున్నాం చూడూ మంగమ్మా! వీరే ఆయనగారు. "తీసుకురా తీసుకురా" అని రోజూ నా ప్రాణాలు తోడేస్తుంటివి. ఇవ్వాళగానీ గురువుగారికి వీలు చిక్కింది కాదు. వీరి వాక్కు దేవవాక్కనుకో. అన్ని విషయాల్లోనూ ఆరితేరిన ఉద్దండులు" అని పరిచయం చేశాడు చలపతి.

ఇవన్నీ ఎంత అబద్ధమో మంగమ్మకొక్కదానికే తెలుసు.

"చాలా సంతోషమండీ! మిమ్మల్ని గురించి నేను గుంటూరులో వున్నప్పుడే విన్నాను... చలపతిగారు నాకు రాసే ఉత్తరాల్లో మిమ్మల్ని గురించి తప్పకుండా రాసేవారు. ఈ నాటికి మీ దర్శనం చేసుకోగలిగాను. చాలా సంతోషం" అని మంగమ్మ కూడా మరో రెండుముక్కలు జమచేసింది.

ఆవిడ సమయస్ఫూర్తికి చలపతి ముగ్ధుడయ్యాడు.

"సరే-అసలు సంగతికొద్దాం పంతులుగారూ! ఈ అమ్మాయి పేరు మంగమ్మ. అలివేలు మంగతాయారు పేరు కలిసొచ్చేలాగా "మంగమ్మ" అని పెట్టారు. ప్రస్తుతం సినిమా ఫీల్డులో కొచ్చింది. నా శిష్యురాలనుకోండి. మీరోసారి ఈవిడను చూసి- ఫ్యూచర్ ఎలా ఉండేదీ చెప్పాలి" అన్నాడు చలపతి.

"అయ్యయ్యో ఎంతమాటన్నారు? మీరు ఆజ్ఞాపించడం నేను కాదనడమూనా? అమ్మాయిగారి ముఖం చూస్తూనే నేను సమస్త విషయాలున్నూ స్థూలంగా గ్రహించాననుకోండి. ఓహోహో! బ్రహ్మాండమైన భవిష్యత్తు. జగజ్జేగీయమానమైనటువంటి కీర్తిప్రతిష్టలు అమ్మాయిగారికి లభిస్తాయి. దానికి ఢోకాలేదు. అయ్యా...పోతే...చూడమ్మా! మీ చేతులిలా వొక్కసారి చూపండి!" అన్నాడు పరబ్రహ్మశాస్త్రిగారు.

శాస్త్రిగారి వాగ్ధోరణి చూసి మంగమ్మ విస్తుపోయింది. అప్రయత్నంగా రెండు చేతులూ ముందుకు చాపింది. శాస్త్రిగారోసారి కళ్లజోడు సవరించుకుని మంగమ్మ చేతుల్ని పెన్సిల్‌తో తాకుతూ,

మధ్యమధ్య ఆలోచిస్తూ, ఆలోచనకూ, ఆలోచనకూ మధ్య తలపంకిస్తూ, కళ్లెగరేయడం సాగించాడు. ఈ మూకాభినయానికి అర్థం తెలిసినవాడిలాగా చలపతి కూడా తలూపుతున్నాడు. మంగమ్మకు మాత్రం ఏమీ బోధపడలేదు.

పరబ్రహ్మశాస్త్రిగారు. వీభూతిపండును మంగమ్మ చేతులకు రాశారు. వేళ్లను పక్కలకూ, ముందుకూ, వెనక్కూ వంచమన్నారు. మణికట్టు దగ్గర గీతలను మునివేళ్ల మీదున్న చక్రాలను పరిశీలించారు. ఆ తరువాత కాగితం మీద నలుచదరంగా గళ్ళుగీసి రవి, శుక్ర, గురు, శని అంటూ రాశారు. పావుగంట తరువాత శాస్త్రిగారి ముఖం విప్పారింది.

''చూడండి అమ్మాయిగారూ! తమ దగ్గర జాతకం లేదుగదండి అమ్మా! ...పోన్లెండి గానీ....మీకొచ్చిన ఢోకాలేదు. ప్రస్తుతం కొద్దికాలం పాటు...''

''అంటేనండీ?'' అని ప్రశ్నించాడు చలపతి.

''అనగా-మూడు నాలుగు మాసాల పాటు, గ్రహవీక్షణం అంత బాగాలేదు. అక్కణ్ణుంచీ శని తొలగిపోతాడు. ఇహ అమ్మాయిగారి పేరు ''మ''కారంతోనే ప్రారంభం కావలసి వుంది. అదిన్నీ కాకుండా వీరిపేరు మూడంటే మూడే మూడు అక్షరాలను మించకూడదు. తద్విధంగా మీరు గనక మార్పులు చేసుకొన్న పక్షాన -గ్రహబలం ఆమోఘంగా ఉంటుంది. తమరు కూడా సావధానంగా ఆలోచించుకోవచ్చు'' అన్నారు శాస్త్రిగారు.

''మూడక్షరాలని మీరనడంలోనే బ్యూటీ వుంది శాస్త్రిగారూ! ఇవ్వాళ ఫైల్లో వున్న స్టార్స్ పేర్లన్నీ మూడక్షరాల్లోనే వున్నాయి. మరి మూడు లోకాలు స్వర్గం, మర్త్యం, పాతాళం, ముగ్గురు దేవుళ్లు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, మూడు కాలాలు-తెలుగులో ఏమంటారోగానీ, ఇంగ్లీషులో పాస్టు, ప్రజెంట్, ఫ్యూచర్ అంటారు. మన దేవతలు కూడా మూడుకోట్లమందే గదండీ! అంచేత ''మూడు'' అన్నదానికి చాలా ప్రాముఖ్యమున్నదంటారు. అంతేనా?'' అన్నాడు చలపతి కళ్లు చికిలిస్తూ.

తన ప్రతిభను మంగమ్మ గ్రహించాలని గావును-పదేపదే ఆవిడవైపు చూడసాగాడు. చలపతిని నిరుత్సాహపరచడం బొత్తిగా ఇష్టంలేని మంగమ్మ తన ఆశ్చర్యాన్ని బహుసమర్థంగా నటించింది. పరబ్రహ్మశాస్త్రిగారు కూడా ఆశ్చర్యపడినట్లు కనిపించారు.

''చిత్తం చిత్తం, మీరు బాగా సెలవిచ్చారు...తమకింత చొరవ వున్నదని నాకు తెలీదు సుమాండీ! చలపతిగారంటే సినిమా వ్యవహారాల్లో ఉద్దండులనుకొన్నానుగానీ, సాహిత్య రంగంలోనూ ప్రవేశమంటుందనుకోలేదు. అయ్యబాబో! మీతో జాగ్రత్తగా ఉండాలండోయ్! మీరు పైకి కనిపిస్తున్నదానికి నాలుగురెట్లకు పైగా లోపలున్నారు. నేను ముఖప్రీతికోసం అనేవాణ్ణి కాదన్న విషయం తమకు తెలుసు...అయ్యా...అదీ సంగతి'' అన్నారు పరబ్రహ్మశాస్త్రిగారు.

చలపతి పూర్తిగా చిత్తయిపోయాడు.

''ఏదో తమదయలెండి'' అన్నాడు చలపతి. కాళ్లు ఊపుకొంటూ ''మరి-ఆ పని కూడా మీచేతులమీదుగానే పూర్తికానివ్వండి. ''మ''కారంతో ప్రారంభమయ్యే మూడక్షరాల పేరు కూడా మనమిప్పుడు అనుకొందాం. దానికోసం ఇంకో సిటింగ్ దేనికండీ అనవసరంగానూ?'' అన్నాడు.

''ఓ! దానికేం? అలాగే!'' అన్నారు పరబ్రహ్మశాస్త్రిగారు. కాస్సేపు ఆలోచించి ''మాలతి''-''మాధవి''-''మంజుల''-''మోహిని''-''మోహన''-''మీనాక్షి''-''మంజూష''-''మేనక''-'
'మేదిని''-''మేకల''-''మాణిక్యం''-''మల్లిక''-ఇలాంటివి చాలా వున్నాయనుకోండి మరి-ఇంకా ఆలోచిద్దాం'' అన్నారాయన, ఈ పేర్లేవీ మంగమ్మకు నచ్చలేదని గ్రహించి.

“పేరు మార్చుకోవడం అవసరమంటారా శాస్త్రిగారూ?” అన్నది మంగమ్మ.

ఆ మాటలు వింటూనే చలపతి లబలబలాడిపోయాడు.

“ఇంకా నయం-మంచిదానివేనే! శాస్త్రిగారు తోచక చెప్పారంటావా ఏమిటి? వారన్న వాక్కు వేదవాక్కు. తప్పకుండా మార్చుకోవాలి. లేకపోతే మనకు ఫ్యూచరే లేదు. సరా?” అని కోప్పడ్డాడు చలపతి.

“బాగా సెలవిచ్చారు...పేరు మార్చుకోవడమే మంచిదండీ అమ్మాయిగారూ! నన్ను గురించి నేను చెప్పుకోకూడదనుకోండి-అయినా అవసరం వచ్చింది గనక తమకు మనవి చేసుకొంటున్నాను. ఇందాక మన అబ్బాయిగారన్నట్లుగా మూడక్షరాల పేర్లున్నవారే యీరోజున బాగా పైల్లోకొచ్చారు. ఈసంగతి తమరు చూస్తూనే వున్నారు. ఆ పేర్లన్నీ నేను పెట్టినవేనను కోండి...తమకు చెప్పిన విధంగానే వారికిన్నీ నేను చెప్పాను. పది సినిమాలు చప్పు చప్పున దొరకడమున్నూ, ఇంత ఆర్జించుకోవడమున్నూ జరిగింది” అన్నారు శాస్త్రి.

మంగమ్మ ఆలోచించింది. ఇప్పుడు శాస్త్రిగారు చెప్పిన పేర్లు మంచివి కావని కాదు గానీ, ఇంతకన్నా మంచిపేర్లు తడితే బావుంటుందని మంగమ్మ ఉద్దేశం. లోగడ తను వేసిన నాటకాలన్నీ జ్ఞాపకం చేసుకొంది. ఓ నాటకంలో “మంజరి” పాత్ర కూడా తను ధరించింది. విజయనగరంలో ఆ నాటకం ఆడినరోజు, తనకో వెండిషీల్డు ఇచ్చారు కూడాను. అప్పుడే రామచంద్రం గారు నవ్వుతూ “చచ్చీచెడీ నాటకం తయారుచేసింది నేనూ, బహుమతులు అందుకోడం నువ్వూనా?” అని కూడా అన్నారు. ఆ పేరు-ఆలోచిస్తే బాగాను వుంది గదూ!

ఏమయితే అదే అవుతుందని మంగమ్మ ఆ పేరు కాస్తా బయటపెట్టింది. శాస్త్రిగారు ఉబ్బితబ్బిబ్బయిపొయ్యారు.

“ఓహో!హో! వజ్రప్పలుకులాంటి పేరండీ అమ్మాయిగారూ అది! బహుభేషుగ్గానూ, కమనీయంగానూ వుంది. ఇందులో మకారం తరువాత పూర్ణానుస్వారం రావడమే కాకుండా, జకార రకారములు కూడా వున్నాయి. మ అక్షరం మంగళప్రదం. పూర్ణానుస్వారం వున్నదంటే, అది సూర్యభగవానుడనుకోండి. అంటే-అమ్మాయిగారి భవిష్యత్తు, మంగళప్రదంగా సూర్యభగవానుడున్నంతకాలం వుంటుందన్నమాట. ‘జరి’ అన్న అక్షరాలున్నాయి చూశారూ! అవి-మీరు అందుకోబోతున్న వేగాన్ని సూచిస్తున్నాయి. మనం మామూలుగా అంటుంటాం చూడండి ఏదీ-“జరజరా పాకడం”-“జరజర పోవడం” అని వేగంలోని -ధ్వన్యనుకరణాన్ని ఆ రెండక్షరాలూ తెలియచేస్తున్నాయన్నమాట. కాబట్టి అమ్మాయిగారన్నట్లుగా “మంజరి” అన్న పేరు అన్ని విధాలా మహోత్తమంగా వుంది...” అన్నారు పరబ్రహ్మశాస్త్రిగారు.

“అయితే గురువుగారూ! మీరు “జర”లో వేగం వుందన్నారు సరే, కానీ యిక్కడ “జరి” అని వస్తున్నది గదా! ఎలానంటారు?” అన్నాడు చలపతి.

“అబ్బాయిగారు ఎంత సున్నితంగా ఆలోచిస్తున్నారో, మీరు గమనించారా అమ్మాయి గారూ!” అన్నారు పరబ్రహ్మశాస్త్రి. “మర్రి-మర్రాకు, కర్రి-కర్రావు” అయినట్లుగానే “జరజర” కూడా ముందు మాటలో చేరినప్పుడు “జరిజరి” అవుతుందని పెద్దలు చెప్పుకొచ్చారు. మర్రిలోని “రి”కారం, ఆకు దగ్గర కొచ్చేసరికి “ర”కారంలాగా మారిపోయింది చూడండి. ఆవిధంగానే “మంజరి” అన్న పదంలోనూ జరిగింది. ఇహ మీరీ పేరును మారుస్తానంటే నేను మాత్రం ఒప్పుకోను”.

“ఇదే ఖాయం చేదామంటారా?” అన్నాడు చలపతి.

“మనోజయంతు మాండవ్యః-కానివ్వండి” అన్నారు పరబ్రహ్మశాస్త్రి.

“అయితే ఇదే ఖాయం” అన్నాడు చలపతి.

“తథాస్తు, ఇష్టార్థసిద్ధిరస్తు. శీఘ్రమే, చలనచిత్రరంగ ప్రవేశ ప్రాప్తిరస్తు-కీర్తి, ప్రతిష్ట, ఆర్థికాది శుభప్రాప్తిరస్తు” అని దీవించారు శాస్త్రిగారు.

మంగమ్మ మనస్సిప్పుడు తేలిగ్గా వుంది. రెక్కలు తొడుక్కొని విశాల వినీల విహాయన వీధుల్లో అలవోకగా తేలిపోతున్న అనుభూతికి లోనయింది.

“బావుంది-మరి నాకు సెలవిప్పిస్తే వెళ్ళొస్తాను” అని దీవించారు శాస్త్రిగారు.

చలపతి, మంగమ్మ లోపలికొచ్చారు. ఓ గాజుపళ్ళెంలో ఆకులు, అరడజను, అరటిపళ్ళూ, అర్థనూటపదహార్లూ వుంచి, “శాస్త్రిగారికిచ్చిరా!” అన్నాడు చలపతి.

ఆవిడ వెంటనే అతనూ బయటికొచ్చాడు.

శాస్త్రిగారు పళ్లెంలోని నోట్లకేసి ఓసారి చూసి “అబ్బాయిగారు నన్ను చిన్నచూపు చూశారు. నూటపదహార్లకు తక్కువ పుచ్చుకున్న చెయ్యికాదు నాది” అన్నాడు.

“ఈసారికిలా వెళ్ళనివ్వండి. మీ నోటివాక్యాన-మంగ-అదేమాటొస్తుంది నాకు-అలవాటు చొప్పున-మంజరికి రెండు చిన్నవేషాలు దొరకనివ్వండి. మీకు పట్టుబట్టలు పెట్టుకుంటాం” అన్నాడు చలపతి.

“తమ దయ” అంటూనే శాస్త్రిగారు వాటిని సంచిలో వేసుకొన్నారు. “ఇలా తక్కువ పుచ్చుకొన్నట్లు, పొరబాటునైనా ఎక్కడా అనకండి. నా రేటు పడిపోతుంది. తమకీ వ్యవహారాలు తెలియనివి కాదనుకోండి...మరి సెలవు...వస్తాను” అని బయలుదేరారు శాస్త్రి.

మంగమ్మ అక్కడే నిలబడి దణ్ణం పెట్టంది. చలపతి శాస్త్రిని పంపించడానికి ఆయన వెనకనే బయలుదేరాడు. వారిద్దర్నీ చూస్తూ స్తంభానికానుకొని అలానే నిలబడిపోయింది మంగమ్మ.

# 5

ప్రతి సంఘటనకూ ఏదేదో కారణం ఉందన్నమాట నిజమే గానీ, అన్నిటికీ సరైన కారణాలను మనం చెప్పుకోగలమా? ఏనాటికీ కాదు. అలా మనం కారణాలు మనకు నచ్చిన కారణాలలను చెప్పుకోలేకపోయినప్పుడే-“విధి” ప్రసక్తి వస్తుంది.

చలపతి ఇతర విషయాల్లో ఎలాంటివాడైనా మంగమ్మపరంగా-కాదు-మంజరి పరంగా-చాలా నిజాయితీగా పనిచేశాడు. చేస్తున్నాడు. ఈ పనివల్ల వెంనే ఫలితాలు కనిపించవేమని మంజరిగోల. ఆవిడామాట నేరుగా చలపతితో అనలేదు. సూటీపోటీగా ఇదే అర్థం వచ్చే పదాలను విరివిగా వాడేసింది.

“మీరన్నమాట నిజమేననుకోండి. బోలెడన్ని వ్యాపకాల్లో పడి, మీరు అసలు విషయం మరిచిపోయారేమోనని జ్ఞాపకం చేశానంతే! అదేదో ఫిలింకంపెనీ కెడతామన్నారు గదా! వాళ్లేమన్నారేమిటి?” అన్నది మంజరి వొకసారి.

“వాళ్ళా? చూస్తామన్నారు” అన్నాడు చలపతి సాదాగా.

చలపతి ఏదో చెప్పకుండా దాచిపెడుతున్నాడని మంజరి పసిగట్టింది. అయితే నువ్విలా అబద్ధాలాడకయ్యా!” అని అతని ముఖాన్నే తకీమని అడగలేదు.

మంజరి అనుమానం నిజమే! పరబ్రహ్మశాస్త్రిగారిచ్చిన ప్రోత్సాహంతో ఆ మొన్నాటి నుండీ చలపతి కంపెనీల చుట్టూ తిరగడం ప్రారంభించాడు. ఆ సరికే చాలా కంపెనీల వారికి చలపతి తనవెంట ఓ పిట్టను పట్టుకొచ్చాడన్న సంగతి తెలిసిపోయింది. కానీ వారిలో చాలామందికి ఆ "పిట్ట" ఎలా వుంటుందో తెలీదు. మంజరిని సరాసరిగా, కంపెనీల చుట్టూ తిప్పడం కన్నా, ఆవిణ్ణి గురించి ముందుగా కొంత ప్రచారం చేసి, ఆ తరువాతనే ఈ కార్యక్రమంలోకి దిగుదామని చలపతి ఉద్దేశం. ప్రస్తుతం అతనా వ్యాపకంలోనే ఉన్నాడు.

"మీరేదో కొత్తగా వో పిక్చర్ ప్రారంభించారుటగా? కథ బ్రహ్మాండంగా ఉందని పాండీబజార్‌లో అనుకొంటున్నార్లెండి...నాకు మొదట్నుంచీ మీ కంపెనీ అంటే అదే నమ్మకం. మీరే పిక్చర్ తీసినా, ఏదో వో కొత్తదనం లేకుండా తియ్యరు. ఎక్స్‌పెరిమెంట్ చెయ్యడం మీ హాబీ కదా! మీరేననుకొంటాను మనోరమను ఇంట్రొడ్యూస్ చేసింది-మొదట్లో అందరూ మీ పిక్చర్ ఫ్లాప్ అవుతుందనుకున్నారు. అదే బాక్సాఫీస్ హిట్ అయికూచుంది.... మరేంలేదులెండి.. ."మంజరి" అని వో యంగ్ బ్యూటిఫుల్ యాక్ట్రెస్ వచ్చింది. చాలాకాలం పాటు నాటకాల్లో వున్నది. అవసరానికి మించిన అనుభవం వున్న పెర్సన్. నైస్ పర్సనాలిటీ, వాయిస్, కల్చర్ విషయం అమోఘం. మీ క్రొత్త పిక్చర్‌కి కావాలంటే-ఓసారి ట్రయ్‌చెయ్యకూడదూ?"

ఈ ధోరణిలో మంజరిని గురించి అన్ని కంపెనీ దగ్గరా కేన్వాస్ ప్రారంభించాడు చలపతి.

అతనికి మొదట్నించీ ప్రచారం మీద అచంచలమైన విశ్వాసం ఉన్నది. తగినంత పబ్లిసిటీ లేనిదే ఎవ్వరూ పైకి రాలేరని తెలుసు. దీనికి అనేక మార్గాలున్నాయి.

మంజరిని గురించి పత్రికల్లో రాయించాలి. ముఖ్యంగా సినీమా పత్రికల్లో ఆవిడ బొమ్మలు వేయించడమే కాకుండా, కొన్ని వ్యాసాలు కూడా పడేటట్టు చూడు. సహృదయులైన సినీ జర్నలిస్టులు కొందరు ఈ పనిని తమ బాధ్యతగా భావించి చేస్తారు. కొంతమందికి అంతో ఇంతో "తైలం" ముట్టచెప్పందే పనికాదు. దానిక్కూడా...చలపతి సిద్ధపడ్డాడు.

మరో మార్గమేమిటంటే-లాబీవర్గాల్లో మంజరిని పరిచయం చేయడం లాబీవర్గాలనబడే వాటికి, అటు ప్రొడ్యూసర్ల దగ్గరా, ఇటు డిస్ట్రిబ్యూటర్ల దగ్గరా కొంత పలుకుబడి వుంటుంది. వీరికి నటులు, నటీమణులు, పత్రికల వారూ కూడా బాగా పరిచమయి ఉంటారు. ఈ బాపతు జనానికి అట్టే పనిపాటలుండవు. తమక్కావలసిన వారిని గురించి అన్ని వార్తలు సృష్టించి ప్రచారం చేస్తుంటారు. ప్రచారం వొక్కోసారి తారాస్థాయినందుకోవటం కూడా కద్దు. వీరి సాయంపొందాలనుకున్నాడు చలపతి.

"రేపూ, ఎల్లుండీ మనకు పెద్ద ప్రోగ్రాములున్నాయి. కాస్త జాగ్రత్తగా ఉండాలి" అన్నాడు చలపతి.

ఏమిటన్నట్లు చూసింది మంజరి.

"పత్రికల వాళ్ళను రేపు పిలిచాను. ఇవ్వాళల్లా ఆ పనితోనే సరిపోయింది. వాళ్ళకో చిన్న పార్టీ కూడా ఎరేంజ్ చేశాను"అన్నాడతను.

"అయితే వంటకాలేం చెయ్యమంటారు? నాకయితే వంట చాతకాదు. చాతనయినట్లు చేస్తాను" అన్నది మంజరి.

చలపతి బోళాగా నవ్వాడు.

"పత్రికల వాళ్లతో వ్యవహారం భారీగా వుండాలి. ఉడిపి కెఫిటేరియాలో ఆర్డరిచ్చేశాను. సాయంత్రం మూడింటికల్లా వాళ్ల వాన్ వొస్తుంది. నాలుగులోగా ఫంక్షన్ ముగిసిపోతుంది" అన్నాడు చలపతి.

మంజరి అయోమయంగా చూసింది.

“నీకింకా అర్థంకాలేదు గదూ?” అని నవ్వాడు చలపతి. “పత్రికల వాళ్ళకు మనం అంటే -నువ్వన్నమాట-పార్టీఇస్తున్నావ్! వాళ్లు నిన్నేవో ప్రశ్నలడుగుతారు. నీకు తోచిన సమాధానాలు చెబుతావు. అవన్నీ వాళ్ల పత్రికల్లో వేసుకొంటారు. నీ బొమ్మలు కూడా వేస్తారు”.

“అప్పుడేనా?” అన్నది మంజరి.

“అసలు జర్నలిస్టుల సాయం మనక్కావలసిందిప్పుడే! పది పత్రికలు కూడబలుక్కొని వో మాటమీద నిలబడ్డాయంటే, ఆకాశాన పొయ్యే దేవుడైనా నేలమీదకు దిగిరావల్సిందే! నువ్వొకదాని వున్నావనీ, సినిమాకు బ్రహ్మాండంగా పనికొస్తావనీ, ఇండస్ట్రీలలోని వారికి తెలియాలి. పబ్లిక్కూ తెలియాలి. ఈ పని జర్నలిస్టులు చేసి పెడతారు. కాబట్టే వాళ్ళతో మనం చనువుగా వుండటం అవసరమని నేననడం” అన్నాడు చలపతి.

‘చనువు’ అన్న మాట దగ్గర మంజరి ముఖం చిట్లించుకొంది. ఈ మాట వెనక ఉన్న సంఘటనలేవో ఆవిడకు తెలుసు.

“సర్వేశ్వరా!” అనుకొంది మంజరి చిన్నగా నిట్టూరుస్తూ.

ఓ అరగంట అటూఇటూగా జర్నలిస్టులందరూ వచ్చారు. కొందరు కెమేరాలు కూడా పట్టుకొచ్చారు. ఎందుకైనా మంచిదని, చలపతి ముందగానే ఓ ఫొటోగ్రాఫర్‌ని పిలిపించాడు.

మధ్య హాల్లో కుర్చీలు వరుసగా వేశారు. అందరూ కూచున్నాక, అర్థంలేని సంభాషణ ప్రారంభమయింది. కొంతమంది జర్నలిస్టులు, ఏడెనిమిదేళ్ళ కిందటి సంగతులు ఎత్తుకొని బిగ్గరగా మాట్లాడుతున్నారు.

“కళ్యాణిని మొదటిసారిగా నాపత్రికలో పరిచయంచేశాను. అయిదారు ఆర్టికల్స్ కూడా పబ్లిష్ చేసినట్లు జ్ఞాపకం. తకీమని నాయుడుగారు బుక్ చేశారు. చిన్నవేషమేననుకోండి- ముందుగా ఇంత షూటింగ్ దొరికింది. కవితోటీ, డైరెక్టర్‌తోటి మాట్లాడి, ఆ వేషానికే మాంఛి ప్రామినెన్స్ ఉండేలా చేశాను. కళ్యాణి తారాజువ్వలా పైకొచ్చింది” అన్నాడొకాయన.

“రజనీకుమారి కూడా చాలా లక్కీగా పైకొచ్చింది గదుటయ్యా! నాలుగుసార్లు ఆవిడ బొమ్మను ముఖచిత్రంగా వేశాను. ఆరుమాసాలు తిరక్కుంగా బుక్కింగ్స్ కాళ్ళముందు కొచ్చిపడ్డాయి” అన్నాడింకో జర్నలిస్టు.

“దానికి మీకేమాత్రం ముట్టిందో కూడా చెప్పరేం?” అని ఎవరో అన్నారు సన్నగా.

కానీ ఆ గోలలో ఎవరూ దాన్ని వినిపించుకోలేదు.

“ఏమయ్యా చలపతీ! ఇంకా ఎంతసేపు కూచోవాలి?” అన్నారెవరో.

“వస్తున్నాను, వన్‌మినిట్” అన్నాడు చలపతి హడావుడిగా అటూఇటూ తిరుగుతూ.

సంభాషణ షూటింగుల మీదికి మళ్ళింది.

“ప్రసన్నా ఫిలింస్‌వారు అంతఃపురం సెట్ వేశారోయ్! మార్వెలెస్సనుకో. ఆ వొకదానికే డెబ్బయివేల పైచిలుకు అయిందట. శర్మ బ్రదర్స్ దగ్గరుండి డిజైన్ చేశారు. బ్యూటీఫుల్” అన్నాడొకాయన.

ఈయన జర్నలిస్టు మాత్రమే కాదు, లాబీ వర్గాలలో కూడా ఉంటూ వుంటాడు.

“హీరో రావు ఈ సీనులో అద్భుతంగా యాక్టు చేసి పారేశాడు. పిక్చర్ మొత్తానికి అదే హైలెట్. అతని కెరీర్‌లో అంత సూపర్బ్‌గా యాక్టు చేసిన ఇన్సిడెంట్ మరోటి లేదు. కెమెరామెన్ మిత్రా కూడా చాలానైస్‌గా షూట్ చేశాడు” అని కలిపాడు ఆయన.

“ఇప్పుడు రావుగారికి ఎన్ని పిచ్చర్లున్నాయేమిటి?” అన్నాడింకో జర్నలిస్టు.

“లేకేం?” తెలుగు పిక్చర్స్ పద్దెనిమిద్దాకా వున్నాయి. నటరాజా మూవీస్‌వారు టామిల్ పిక్చర్లో బుక్ చేశారు నిన్ననే. సిటీ కలెక్షనంతా యిస్తామన్నారు. బోంబేవారు ఆయన ప్రాణాలు తోడేస్తున్నారు రమ్మనమని. కానీ ఆంధ్ర కళామతల్లి సేవను వొదులుకోవడం వారికిష్టం లేదు. అంచేతే రానన్నారు. వారికున్న ఆంధ్రాభిమానం ఎవరికయ్యా మనవాళ్ళలో ఉంది?”

ఒకరిద్దరు గుసగుసలాడుకోవడం గమనించాడు గానీ, మనవాడు తన ధోరణిని మానుకోలేదు.

“రోజుకు 20గంటలు పనిచేసినా వారికి తెమలడం లేదు. కొత్త కంపెనీల వారికి మరో మూడేళ్ళదాకా కాల్‌షీట్స్ ఇవ్వలేమని చెబుతున్నారు. అయినా ప్రొడ్యూసర్స్ ఆయన్ని వదలడం లేదు. పైగా బోలెడంత ప్రెషర్ తీసుకొస్తున్నాడు. ఈ మధ్య ఏం జరిగిందో తెలుసా? ఓ ప్రొడ్యూసరు-రావుగారు స్టూడియో కెళ్లాక వచ్చాడు. అమాంతం వాళ్లమ్మ కాళ్లమీద పడ్డాడు. మీరు ఎలాగైనా చెప్పి రావుగార్ని మా పిక్చర్లో వేషం వెయ్యమని చెప్పాలంటూ గోలకెత్తాడు. పాపం! ఆ ముసలమ్మకీ గొడవలేమీ తెలియవాయె. “సరేలే నాయనా! అలాగే చెబుతా”నంది.
రావుగారొచ్చి ఈ సంగత్తెలుసుకొని చాలా విచారించాడండీ! కాని మాట తిరగలేదు. ఆరోగ్యాన్ని కూడా లెక్కచేయకుండా పనిచేసే ఆర్టిస్టు ఇంకోరున్నారా?”

“చలపతిగారూ! సారిడాన్ ఉంటే సప్లయి చేస్తారూ?” అన్నాడింకో జర్నలిస్టు.

ఈయన మూర్తిగారి మనిషి.

అందరూ గొల్లున నవ్వేశారు.

మరో పదినిమిషాలకల్లా ఉడిపి కెఫిటేరియావారు సర్వీస్ చేశారు. ఈలోగా మంజరి కూడా అక్కడికొచ్చి కూచుంది.

ఈ పూట మంజరి జగన్మోహనంగా తయారయింది. ఓ మేకప్‌మాన్‌ని పిలిచి చలపతి ఆవిణ్ణలా తయారుచేశాడు. దాదాపు మూడుగంటలగ్గానీ మంజరి మేకప్ పూర్తికాలేదు.

చలపతి ఎంత నూరిపోసినా మంజరిలో ఏమూలనో చెప్పరాని భయం తారట్లాడుతూనే వుంది. పదిమంది మగవాళ్ళ మధ్య తిరగడం వేరూ, వాళ్లు వేసే సవాలక్ష జనమేజయ ప్రశ్నలకు సమాధానం ఇవ్వడం వేరూనూ.

అందరూ సిగరెట్లు కాలుస్తున్నప్పుడు, చలపతి అసలు విషయంలోకొచ్చాడు.

“మంజరి పేరు మీకు కొత్త కావచ్చు, కానీ మన ప్రాంతంలో ఈపేరు చాలా పాతబడి పోయింది. ఓ దశాబ్దం పాటు నాటకరంగాన్ని ఉర్రూతలూపింది. అనేకచోట్ల ఈ అమ్మాయికి సన్మానాలు జరిగాయి. ఎందరో ఎన్నో యోగ్యతా పత్రాలిచ్చారు. వెండితెరకు పరిచయం చేద్దామన్న సదభిప్రాయంతో, యీమెను నేనిక్కడకు తీసుకొచ్చాను. అదే-రెండేళ్ళపాటు ఈమెను విడిచిపెట్టడానికి ఆ నాటక సమాజం వాళ్ళు ససేమీ వీలుకాదన్నారు. వాళ్ళతో దాదాపు యుద్ధం చేసి పట్టుకొచ్చాను. మనమందరమూ సాహిత్య, కళారంగాల్లో పనిచేస్తున్న వాళ్ళమే గనుక అందులలోని సాధకబాధకాలు మనకు క్షుణ్ణంగా తెలుసు. మీరు చేతనైనంత సాయం చెయ్యాలనీ, చెయ్యగలరనీ ఆశిస్తున్నాను”. అని ఓ చిన్న ఉపన్యాసం ఇచ్చాడు చలపతి.

ఆసరికే అతనికి చిరుచెమటలు పోశాయి.

పత్రికలవాళ్ళు తలోవిధంగానూ అనుకొన్నారు. కొంతమంది చిలిపివాళ్ళు ఆమాటల్ని పైకి అనేశారు కూడాను.

“అబ్బాయీ! ఈ ఫీల్డులో పైకిరావాలంటే వొబ్లయిజింగ్ నేచర్ ఉండటం ముఖ్యం. అలా ఒప్పేసుకొంటూ కొంతకాలం “కృషి” చెయ్యాలి. అప్పటిగ్గానీ ఛాన్సులు రావు. నేను చెయ్యగలిగిందేదో తప్పకుండా చేస్తా”అన్నాడొక కుర్రాడు.

అతని చేతిలో “కొరడా” అనే పత్రిక ఉంది. అతను వచ్చినప్పటి నుంచీ మంజరిని అదేపనిగా చూస్తున్నాడు. మంజరి అతన్ని నిరుత్సాహపరచడం యిష్టం లేక రెండుమూడు సార్లు దొంగచూపులు చూసి, ఓసారీ నవ్వీనవ్వనట్లుగా నవ్వి, యధోచితంగా నటించింది. ఆ దెబ్బతో ఆ కుర్రాడు గుమ్మయిపోయాడు.

చెప్పవలసినవన్నీ చలపతే చెప్పడం చేత మంజరి పని తేలికయింది. ఆవిణ్ణి ఎవ్వరూ ఏ ప్రశ్నలూ అడగలేదు. రకరకాల పోజుల్లో నిలబెట్టి, ఓ డజను శ్నాప్స్ తీసుకొన్నాడొకాయన. చలపతి తీసుకొచ్చిన ఫొటోగ్రాఫర్ చాలా ఫొటోలు తీశాడు.

“రెండుమూడు రోజుల్లో కాపీలు తయారవుతాయి. అవన్నీ నేనే స్వయంగా మీకు అందజేస్తాను. మీరు మాత్రం నా యందూ ఆవిడయందూ దయ వుంచి తగిన పబ్లిసిటి ఇప్పించండి. మీ రుణం వుంచుకోను” అన్నాడు చలపతి.

మంజరికి, వీరందర్నీ పరిచయం చేశాడు చలపతి. “కొరడా” పత్రిక అతను పోతూ పోతూ మంజరికేసి తిరిగి, ఓకన్ను సగందాకా మూసి తెరచి నవ్వి మరీ వెళ్ళాడు.

మంజరి తనలో తను నవ్వుకొంది.

# 6

రెండు మూడు వారాల తరువాత గానీ ఈ సమావేశ ఫలితాలు కనిపించలేదు. ఈ పది-పదిహేను రోజుల పాటూ చలపతి, కాలుగాలిన పిల్లిలాగా పత్రికా కార్యాలయాల చుట్టూ తిరుగుతూనే వున్నాడు. వారికి మంజరిని గురించి నూరిపోస్తూనే వున్నాడు.

“అనవసరంగా మళ్లీ మీరు వెళ్ళడం దేనికండీ? బోలెడంత డబ్బుపోసి, మొన్నపార్టీ కూడా ఇస్తిమి. చెప్పవలసిందంతా అప్పుడే చెబితిమి. కాళ్ళకు బలపాలు కట్టుకొని పదేపదే తిరగటం దేనికట?” అన్నది మంజరి. సానుభూతి చూపిస్తున్నందుకు చలపతి లోలోపల చాలా సంతోషించినటువంటివాడయినాడు. అతనా ఉత్సాహాన్ని బయటపడనీయకుండా-ఓ చిన్న నవ్వు మాత్రం నవ్వాడు.

“మీకు ఇంట్లో కూచుంటే తోచదా?” అని కూడా మంజరి అన్నది.

చలపతి ఈ మాటతో ముగ్ధుడయిపోయాడు.

“అదికాదు మంజరీ! ఈ పత్రికల వాళ్ళ వ్యవహారం నీకు తెలీదు. వీరిలో చాలామంది ఉత్తములేననడంలో సందేహం లేదు. వారి మంచితనాన్ని మనక్కావలసిన విధంగా వాడుకోవాలి. వారితో కలిపిమెలిసి ఉన్నప్పుడే అది సాధ్యం” అన్నాడు చలపతి.

మంజరికేమీ అర్థంకాలేదు. అసలు అర్థం చేసుకోవాలని కూడా ఆవిడ అభిమతం కాదు.

“ఉదయమే వెడతారు. రాత్రి యెప్పటికోగాని రారు. ఒక్కదాన్నీ బిక్కుబిక్కుమంటూ కూచోవాలి. నాతో ఉండటం విసుగెత్తి పోయి, మీరిలా పారిపోతున్నారేమోనని నా అనుమానం” అన్నది మంజరి, దిగులుగా మొఖంపెట్టి.

ఈ మహాస్త్రం-చలపతి మీద దివ్యంగా పనిచేసింది. అతను మంజరి దగ్గరిగా వచ్చి, మెత్తగా ఆవిణ్ణి కావలించుకొని, బుగ్గలు వాసన చూసి వదిలేశాడు!

"అది కాదమ్మడూ! నీకు లోకానుభవం లేదు. చెప్పినా నీకర్థం కాదు. నిన్నో స్టార్‌ని చేసిందాకా నాకు నిద్రాహారాలు ఇమడవు. ఈ విషయమయి నన్ను మాటిమాటికి అడక్కు. నువ్వా మనస్సులో ఏమీ ఉంచుకోకు. పది కంపెనీల్లో నీకు బుకింగ్ దొరికాక, నేనిక నిశ్చింతగా ఉండగలుగుతాను. అందాకా-నేనిలా పనిచేయవలసిందే" అన్నాడు చలపతి.

"ఎంత మంచివారండీ మీరు?" అన్నది మంజరి, దాదాపుగా పరవశత్వం చెందిన ధోరణిలో.

చలపతి ఏమీ అనలేదు. గబగబా గుడ్డలేసుకొని వెళ్లిపోయాడు.

అతను వెళ్ళాక మంజరి హాయిగా నవ్వుకొంది.

"ఈ దెబ్బతో చలపతి చిత్తయిపోవాలి. ఇక తాత్సారం అన్నమాటే ఉండదు" అనుకొంది మంజరి.

ఆవిడ మనస్సే రెండు వారాలపాటూ చాలా ఆరాటపడిపోయింది. ఈ వచ్చిన పత్రికల వాళ్లందరూ తన బొమ్మలనెలా వేస్తారో, ఏమని వేస్తారో చూడాలని ఆవిడనుకున్నది. అనుకొన్నవి అనుకొన్నట్టుగా జరిగితే-"ఇంత భారీ ఎత్తున పబ్లిసిటీ జరగడం ఇదే మొదటిసారి" అనుకొన్నదావిడ.

పత్రికలవాళ్ళతో "నేస్తం" కలుపుతూనే అటు లాబీవర్గాలతో కూడా చేతులు కలిపాడు చలపతి. రావుగారి వర్గంతోనూ, మూర్తిగారి వర్గంతోనూ మంజరి గురించి చెప్పాడు. ఒక గ్రూపువారితో చెప్పినట్లు ఇంకో ముఠావారితో అతను చెప్పలేదు.

"మన రావుగారు, కట్టుగుడ్డలతో మద్రాసు రావడం నాకు తెలుసు. ఆయన్ను చూస్తూనే మహానటుడనుకొన్నాను. ఆంధ్ర చలన చిత్రాకాశంలో, చండభాస్కరునిలాగా ప్రకాశిస్తాడను కొన్నాను. నేననుకొన్నంతా అయింది. గత 20సంవత్సరాల నుండీ ఏకైక కథానాయకుడిలాగా నిలచిపోయాడు. వందసినిమాల్లో జయప్రదంగా నటించాడు. ఆయనగారు మన సినీ పరిశ్రమను ఉద్ధరించడానికి జన్మించిన అవతార పురుషుడేగానీ, మరొకటి కాదు. ఈరోజున రావుగారికున్న పలుకుబడి అమోఘం. ఆయన మాటను కాదనగల దమ్ములున్న వాడెవ్వడూ లేడు. మా మంజరి, రావుగారి సహాయం కోరుతూ ఉంది. ఆయనగారు, ఏ కంపెనీకి ఫోను చేసినా, ఓ చిన్నవేషం దొరుకుతుంది. ఆ వేషంలో రాణించడానికి, మంజరి శాయశక్తులా కృషిచేస్తుంది. నాదీపూచీ, మీరు చెయ్యవలసిందల్లా-మంజరిని గురించి, రావుగారితో నాలుగు మంచి ముక్కలనడం" అన్నాడు చలపతి.

గతనాలుగురోజుల నుండీ చలపతి డబ్బుతో ఖర్చులు వెళ్ళమారుస్తున్న రావుగారి లాబీమనుషులు, చలపతి విన్నపాన్ని మన్నించడమే కాకుండా, చేతనైనంత సాయం కూడా చేస్తామన్నారు.

"సగం పని తీరింది" అనుకొన్నాడు చలపతి.

మూర్తిగారి మనుషులతోనూ, అతను ఇదే పంపిణీ మీద మాట్లాడాడు.

"మూర్తిగారంటే మొదట్లోనాకు సదభిప్రాయం లేదు. అప్పటికే రావుగారు మద్రాసులో పాతుకుపోయారు. ఈ పోటీలో ఎలా నెగ్గుకొస్తారా అనుకొన్నాను. భగవంతుడు ఆయన్ను దయగా చూశాడు. రెండేళ్ళలో రావును తన్ని పారేసి చుక్కల్లోకి చేరిపోయాడు. మూర్తిగారు కాదన్న తరువాతగానీ, రావుగార్ని ప్రొడ్యూసర్లు బుక్ చెయ్యటం లేదు... ఎంతమందికి ఎన్ని విధాలుగా మూర్తిగారు సాయం చేసిందీ నాకు తెలుసు. ఆయనది దయా హృదయం ఎక్కడ టాలెంట్ ఉన్నా, ఇట్టే పసిగడతారు.

నేనంటున్నదేమిటంటే-మంజరి టాలెంటున్న ఆర్టిస్ట్. ఒక్క అవకాశాన్ని మూర్తిగారు యిప్పించితే చాలు. వారు చెబితే కాదనే కంపెనీలుంటాయని నేననుకోను'' అన్నాడు చలపతి.

మూర్తిగారిని పొగిడినందుక్కాదుగానీ, రావుగారిని చులకన చేసినందుకు ఈ వర్గం వారు చాలా సంతోషించారు. చేయగలిగినంతా చేస్తామన్నారు. వారందరికీ, యధాశక్తి కానుకలు సమర్పించుకొని, వారిని సంతోషతరంగిత స్వాంతులను చేశాడు చలపతి.

తను చెయ్యగలిగినంతా చేశానని చలపతి తృప్తిపడి ఊరుకోలేదు. నిజానికి కార్యక్రమం ఇప్పుడే ప్రారంభమయింది. దీని మంచిచెడ్డలు చూసుకొనిగానీ తను భవిష్యత్కార్యక్రమాలను నిర్ణయించకూడదు. సినిమా రంగంలో పైకి రావడానికి శాశ్వతమైన మార్గమంటూ ఏదీలేదు. ఎప్పటికప్పుడు వాతావరణానికి అనుగుణంగా మార్చుకుంటూ ప్లాన్లు వేసుకోవాలి. అలా వేసుకోనివాడు మట్టిగొట్టుకుపోతాడు. తనా విషయంలో గడితేరినవాణ్ణని చలపతి నమ్మకం.

❦❦❦❦❦❦❦❦

పదిన్నరకల్లా భోజనం చేసి, పదకొండింటిదాకా మంచం మీద పొర్లి, అప్పటికీ ఏమీ తోచకపోవటం చేత, తాయారును పిలిచి ఓ కవరు తెప్పించింది మంజరి.

హఠాత్తుగా ఆవిడకు రాజమణి, వసంతా, కోటేశ్వరరావు, రామచంద్రం, మాధవరావూ కలగాపులగంగా జ్ఞాపకం వచ్చారు. ఈ జ్ఞాపకాలతో ఈ రోజల్లా మంజరి కాలక్షేపం చేయవచ్చు. కానీ రాజమణి ఆరోగ్యం ఎలా ఉందో కనుక్కోవడం ముఖ్యమనుకుంది.

ఎలా వుత్తరం ప్రారంభించాలో మంజరికి చప్పున తట్టలేదు. నాలుగైదు పంక్తులు రాసి కొట్టిపారేసింది. ఆఖరికి, ఎలాంటి సంబోధనా లేకుండానే మొదలెట్టింది.

"-నేనిక్కడ క్షేమంగా ఉన్నాను. నువ్వెలా ఉన్నావో నాకు తెలీదు. వసంత ఎలా ఉంది? అన్నట్టు నాకో విషయం స్పష్టంగా రాయి రాజమణీ! అ పిల్లపేరు వాసంతియా వసంతా? నాకిప్పటికీ, ఆరెండు పేర్లూ తికమకగానే ఉంటాయి. మీరిద్దరూ ఆ కూపంలోంచి ఎప్పుడు బయటపడతారో నాకు తోచకుండా వుంది. వసంతను-మరీ నలగ్గొట్టకు. నాక్కొంచెం స్థిమితం చిక్కగానే మిమ్మల్ని పిలిపించుకొందామని సంకల్పం. భగవంతుడేం చేస్తాడో తెలీదు.

"నా విషయం ఇంకా అయోమయంగానే వుంది. చలపతిగారు నాకు బొత్తిగా అర్థం కాకుండా ఉన్నాడు. ఒక్కోసారి ఆయన మాటలు నాకు బోధపడవు. నన్ను నిజంగానే పైకి తీసుకురావాలనుకుంటున్నాడో, లేక దాని వెనుక అతని స్వార్థమేదన్నా ఉన్నదో నాకు తెలీదు. ఉత్తి పుణ్యానికి నామీద అంత అభిమానం ఆయనగారి కెందుక్కలగాలో తెలీదు. ఆ మాటకొస్తే, ఎవ్వరికైనా, ఇంకోరిమీద నిష్కారణంగా ప్రేమాభిమానాలు పుట్టుకొస్తాయా? చలపతి 'ముంగిరకం'గాడని, నాకెందుకో మొదట్నించి అనిపిస్తూనే ఉంది. అతని లోపల ఏమున్నదో నేను తెలుసుకోలేకపోతున్నాను.

"మొన్నీ మధ్య ఏం జరిగిందనుకున్నావ్ రాజమణీ! ఎవడో వెంకటేశ్వర్లుట- ఓ కంపెనీలో మేనేజరుగా ఉంటున్నాట్ట. ప్రొడ్యూసరుకు తోడల్లుడుట. చలపతి వాణ్ణి పట్టుకొచ్చాడు. ఆడవాళ్లను గురించి నా ఎదటనే సిగ్గులేకుండా మాట్లాడుకొన్నారు. నేను సిగ్గుతో చచ్చిపొయ్యా నని కాదు. ఈ దశలో నేను సిగ్గుపడతానని కూడా నువ్వనుకోవని నాకు తెలుసు. ఉన్నట్లే వుండి ఇప్పుడే వస్తానని చలపతి మాయమయ్యాడు. ఆ పట్టు పట్టు రాత్రి పన్నెండు దాటాకగానీ చలపతి రాలేదు. వచ్చాక చాలా ఆత్రంగా 'ఏం జరిగిందేమిటి? ఏమన్నాడేమిటి? అన్నాడు. ఆ క్షణాన చలపతిని చూస్తుంటే

చెప్పరాని అసహ్యం వేసిందంది.. నాకూ ఆ వెంకటేశ్వర్లకూ లంకె కలపాలని అతగాడి అభిప్రాయమనుకుంటాను. పోనీ ఆ విషయం నాతో ముందుగా చెబితే, నేనూ కాదనేదాన్ని గాదు. నేను తనకేమవుతానని చలపతి ప్రచారం చేసుకొన్నదీ తెలిస్తే- ఆదోవ వేరు. తన భార్యనని చెప్పుకుంటున్నాడో, మేనకోడల్నంటున్నాడో, మరదలంటున్నాడో-నాకు తెలీదాయె. ఇంటికి వచ్చిన ప్రతి వెధవనూ 'మన ప్రాణమిత్రుడు-ఆప్తుడు-సహృదయుడు' అంటూ నాకు పరిచయం చేస్తాడాయె. వాళ్ళందరితోనూ, నేను ఎకఎకలు పకపకలుగా వుంటే-వీడు అసూయపడి ఛస్తాడేమోనని, అదో భయం. పతివ్రతలాగా నటిస్తేనేమో 'ఏమిటా వెధవ బిర్ర బిగింపూ నువ్వూనూ! సోషల్‌గా మూవ్ కావాలి గానీ, మడి గట్టుక్కూచుంటే లాభం లేదు' అని హితబోధ చేస్తున్నాడు.

"ప్రస్తుతం నేనీ ఇరకాటంలో వున్నాను. ఇంతవరకూ ఓ దారీ తెన్నూ కనిపించటం లేదు. నన్నేం చెయ్యమంటావు? మళ్ళా గుంటూరు వచ్చెయ్యనా? కొంతకాలం ఆగి చూడమంటావా? అన్నట్టు ఈసారి రాసే జాబులో నాగమణి గురించి తప్పకుండా రాయి. రామచంద్రం, కోటేశ్వరరావు, మాధవరావుగార్లు ఎప్పుడైనా కనిపిస్తున్నారా? నీ ఎడ్రస్ వారికి తెలుసు. వస్తే నేనిలా వున్నానని వాళ్ళకు చెప్పు. నా అంతట నేను జాబు రాయడం బాగా వుండదు. అడిగితే నా ఎడ్రస్ కూడా యివ్వు. జవాబు వెంటనే రాయి. వసంతకు-అదే వాసంతికి నా ముద్దులు. ఈసారన్నా ఆ పిల్ల పేరేమిటి ఖచ్చితంగా రాస్తావు కదూ?

ఉంటాను
ముద్దులతో,
నీ మంజరి

"ఇంకో సంగతి రాయడం మరచిపోయాను. ఓ శాస్త్రిగారు నా పేరు మార్చుకోవలసిందని సలహా ఇవ్వడం చేత 'మంగమ్మ'ను కాస్తా 'మంజరి'గా మార్చేసుకొన్నాను. ఇహ నుంచీ నాకు రాసే జాబుల్లో ఈ పేరే వాడగలవని ఆశించుతున్నాను.

సెలవు, మంజరి"

ఉత్తరమంతా పూర్తిచేశాక, మరోసారి చదువుకొంది. నాలుగైదుచోట్ల తప్పులు కనిపిస్తే సరిదిద్దింది. రెండుచోట్ల-ఒకచోట వుండవలసిన సున్నాలు మరోచోట వున్నాయి. ఈ ఉత్తరం రాయడానికి దాదాపుగా ఓ గంటసేపు పట్టింది మంజరికి. తిమ్మిరెక్కిన వేళ్ళను విరుచుకొని, ఉత్తరాన్ని తాయారుకిచ్చి పోస్టు చేయమన్నది. ఇలా జాబు రాసినట్టు చలపతికి చెప్పవద్దని కూడా అన్నది.

సాయంత్రానికల్లా అలసిసొలసి చలపతి ఇంటికొచ్చాడు. మనిషి రవంత చిరాకుగా కూడా ఉ న్నాడు.

"ఎవరన్నా వస్తామన్నారా?" అన్నది మంజరి తన సహజ ధోరణిలో.

చలపతి విసుగ్గా చూశాడు. అతనికి కోపం వచ్చిందని మంజరి గ్రహించింది.

"మరీ అలసిపోయినట్టు కనిపిస్తున్నారు. ముందు వెళ్ళి స్నానం చేయండి. ఈలోగా నేను కాఫీ తెప్పిస్తాను" అన్నది మంజరి అతన్ని బలవంతపెడుతూ. "పాపిష్టిదాన్ని, నా వల్ల ఎన్ని ఇబ్బందులు పడుతున్నారండీ మీరు? సుఖాన వుండే ప్రాణాన్ని దుఃఖాన పెట్టుకొంటున్నారు. మీరనవసరంగా హైరాన పడకండి. అయినప్పటికే అవుతుంది. అసలు కానేకాదనుకోండి. విచారమే లేదు. ఎందుకొచ్చిన లాయలాసా ఇదంతా?"

మంజరి చల్లిన పన్నీటిజల్లులు చలపతీ మీద బాగా పనిచేశాయి. అతను సన్నగా నవ్వుతూ, "నాకా మాత్రం తెలీదా మంజరీ? ఓ పనిని సాధించాలనుకొన్నప్పుడు మధ్యలో ఎదురయ్యే అడ్డంకులను లక్ష్యం చెయ్యకూడదు. అలా చేస్తే మనమొక్క అంగుళం కూడా ముందు కెళ్ళలేము" అన్నాడు.

మంజరి మరో అయిదార్లుసార్లు ఆ మాటనే తిప్పి తిప్పి వల్లించాకగానీ, చలపతి పూర్తిగా కోలుకోలేదు.

"అమ్మయ్య! ఈపూటకు గండం గడిచింది" అనుకొంది మంజరి.

తాయారు గంగాళంలో నీళ్ళు నింపింది. చలపతి స్నానం చెయ్యడానికి లోపలికెళ్లాడు. మంజరి కూడా లోపలికెళ్ళడానికి ఓ అడుగు వేసింది. ఎవరో వీధి తలుపు తీసుకొని వస్తున్నారు.

అతన్నెక్కడో చూసిన జ్ఞాపకం మంజరి మనస్సులో కదిలింది కానీ వివరాలు మాత్రం గుర్తుకు రావడం లేదు, ఆ కుర్రాడు మంజరిని చూసి నిండుగా నవ్వుతూ "ఇంట్లో ఎవ్వరూ లేరా?" అన్నాడు, కూర్చోమని అనకముందే కుర్చీలో కూచుంటూ.

"ఉన్నారు" అన్నది మంజరి అతని చొరవకు ఆశ్చర్యపోతూ.

"అయితే ఓసారిలా రమ్మనండి!" అన్నాడతను సిగరెట్ అంటించి.

మంజరి గదిలో కొచ్చింది. ఆ సరికే చలపతి స్నానం చేసి, లుంగీ కట్టుకొంటున్నాడు. తలుపు సందులోంచి సిగరెట్ పొగ లోపలికి రావడం చూసి "ఎవరన్నా వచ్చారేమిటి?" అన్నాడు.

"అవు"నన్నట్లు తలాడించింది మంజరి. వచ్చినతన్ని తలుపు పక్కనించి చూసి, నీరైపొయ్యాడు చలపతి. ఆ అదుటును లోలోపల అణుచుకొంటూ, సాధ్యమైనంత వరకూ మామూలుగా ఉండటానికి ప్రయత్నించాడు చలపతి.

"అయ్యయ్యా! నమస్కారం! మీరు వచ్చారేమోనని ఇంతకు ముందే కనుక్కొన్నాను. నిన్నా మొన్నా కూడా నాకోసం కబురుచేశారుటగా! ఏమిటి విశేషం?" అన్నాడు చలపతి నక్కవినయాలు పోతూ.

"మీతో పనుండి...ఆవిడకేమీ పనిలేకపోతే, ఇక్కడకొచ్చి కూచోమనండి" అన్నాడతను.

వాళ్ళిద్దరూ ఏం చెప్పుకొనేదీ వినాలని మంజిరికీ ఉంది. ఆ కుర్రవెధవను చూడగానే, అంతకట్టు చలపతి ఎందుకు దిమ్మరపొయ్యాడో ఆవిడకు తెలీదు.

"మంజూ! మనశర్మగారొచ్చారోయ్! 'కొరడా' పత్రిక ఎడిటర్‌గారు. నిన్న కూడా మనం వీరి పత్రికను గురించి చెప్పుకొన్నాం గదూ". అని కేకేశాడు చలపతి.

మంజరి నవ్వుకొంటూ వచ్చి కూచుంది. అసలా పత్రిక పేరు వింటేనే ఆవిడకు నవ్వుగా ఉంది. దానికితోడు ఆ ఎడిటర్ కూడా కొరడా పుల్లలాగా సన్నగా, పొడుగ్గా వుంటాడు. మొన్నీ మధ్య జరిగిన పత్రికల వాళ్ళ పార్టీలో తనకేసి మింగేలా చూసినవాడు వీడేనని అప్పటిగ్గానీ మంజరికి రూఢీకాలేదు.

"మంజరిని గురించి నేను వ్యాసం రాసుకొచ్చాను" అన్నాడు శర్మ.

చలపతి ముఖం విప్పారింది. మంజరి కళ్ళు మిలమిలలాడాయి.

"రేపే ప్రెస్‌కిస్తున్నాను. అచ్చవబొయ్యేముందు మీకోసారి వినిపించడం మంచిదన్న ఉద్దేశంతో ఇలా వచ్చాను. విన్నాక మీ అభిప్రాయం చెప్పండి. అవసరమైతే, ఇంకేమన్నా మార్కులు చేసుకొందాం" అన్నాడు శర్మ.

"అయ్యయ్యో! ఎంతమాటన్నారు? మీరు రాయడమూ, దానికింకా మార్పులుండటమూనా? ఖర్మకాలి మీరీ మద్రాసులో ఉండిపోయారు గానీ, ఏ హిందీ ప్రాంతంలోనో పుడితే -గిరీశం అన్నట్టు

సురేంద్రనాథ్ బెనర్జీ అంత గొప్పవారయిపోయేవారు. ఇప్పటికయినా మించిపోయింది లేదు. ఈ దిక్కుమాలిన మద్రాసు విడిచిపెట్టి చక్కా ఏం బొంబాయో, కలకత్తాకో వెళ్ళగూడదా-అని!''.

కాలుస్తున్న సిగరెట్‌ను కుర్చీకోడుకి రుద్ది ఆర్పేసి, జేబులోంచి కాగితాలకట్ట తీశాడు శర్మ.

మెల్లిగా గొంతు సరిచేసుకొన్నాడు. మంజరీ, చలపతీ ఓసారి సర్దుకుని కూచున్నాడు.

''ఈ వ్యాసానికి మార్వెలెస్ హెడ్డింగ్ పెడదామనుకొంటున్నాను. ఒకటేమో 'ఆంధ్ర చలన చిత్రాకాశంలో నూతన తార ఉదయించింది'' అని 64 పాయింట్ టైపులో బేనర్ హెడ్డింగ్ పెడదామని నా ఉద్దేశం. లేదా 'సినిమా రంగంలో నూతన శకోదయం, నవరసాలనూ రసభరితంగా నొప్పించగల నూతన నటి మంజరి' అని ఉంచుదాం. ఈవిడ బొమ్మలను రకరకాల మేకప్పులల్లో మనకోసం ప్రత్యేకంగా తీయించి, గుండెలదిరిపోయేలా కింద కాప్షన్స్ ఇచ్చేదాం. ఏమంటారు?'' అన్నాడు శర్మ.

మంజరి నిజంగా పొంగిపోయింది. శర్మకేసి నిండుగా చూసి, చలపతికీ కనిపించకుండా ఓ చిన్న నవ్వు శర్మకిచ్చింది కూడాను.

చలపతి మామూలు ధోరణిలోనే మాట్లాడేస్తున్నాడు.

''మీకు మేం చెప్పేదేమిటి శర్మగారూ! పత్రికా ప్రపంచంలో మీరో ధ్రువతారలాంటివారు. కానివ్వండి'' అన్నాడు చలపతి, వ్యాసం కేసి వేలుచూపుతూ.

శర్మ చదవడం ప్రారంభించాడు.

''మన సినిమా పరిశ్రమ ఇంకా గుంటపూలు పూయడానికీ, కొత్త పెట్టుబడులు ఈ పరిశ్రమలోకి రాకపోవడానికి కారణం ఏమిటి? ప్రేక్షకులు పాతమొఖాలను చూసి చూసి విసుగెత్తిపోయారు. పాత తారలకు డిస్ట్రిబ్యూటర్ల దగ్గరా, ప్రొడ్యూసర్ల దగ్గరా పలుకుబడి ఉండటం వల్ల, కొత్తనారు రాలేకపోతున్నారు. ఓ సినిమా తియ్యడానికయ్యే ఖర్చులో అయిదింట మూడువంతులు తారలే దిగమింగుతున్నారు. బెంగాల్ పరిశ్రమ అలాకాదు. ప్రతి చిత్రంలోనూ బెంగాలీ దర్శకులు, నిర్మాతలు కొత్తవారిని ప్రవేశపెడుతున్నారు. దానివల్ల కొత్త, పాత తారల మధ్య పోటీ ఎక్కువయి, పాతవారు కూడా మామూలు రేటుకే రావడమూ, ప్రేక్షకులకు కొత్తముఖాలు పరిచయం కావడమూ జరుగుతోంది.

''పది పదిహేను సంవత్సరాలుగా వివిధ కేంద్రాలలో, రకరకాల నాటకాలు ప్రదర్శించి, విశేషమైన అనుభవం పొందిన నటీనటులనేకమంది ఉన్నారు. అటువంటి వారిలో మణిపూస వంటిది 'మంజరి'. ఈమె నటించిన అనేక నాటకాలను ఈ వ్యాసకర్త చూశాడు. ఆమె నటనా వైదుష్యానికి ముగ్ధుడయ్యాడు. ఏ రసాన్నయినా, కళారుచిరంగా వొప్పించగల నేర్పు మంజరిలో ఉన్నది. ఆమె కంఠంలోని మాధుర్యం అలాంటిది. వీటన్నిటికీ తోడుగా ఈమె శరీర సౌష్ఠవం మన పరిశ్రమకొక 'ఎస్సెట్'. లోకంలోని అందాన్నంతా పుణికిపుచ్చుకొన్నదేమోననిపిస్తుంది మంజరి. విశాలమైన నేత్రాలతో, ఫొటోజెనిక్ ముఖంతో, సంభాషణలను భావగర్భితంగా అనడంలో, సంవేదనలను అభివ్యక్తీకరించడంలో మంజరి అసమాన ప్రజ్ఞాధురీణ. మహత్తరమైన ఈ కానుకను, సినిమా పరిశ్రమకు శ్రీ చలపతి గారు సమర్పిస్తున్నారు. లోగడ-మంజరిని సినిమాలలోకి ఆహ్వానించి విఫలులైన ప్రొడ్యూసర్లు కొందరు, ఇప్పుడామె చుట్టూ బుకింగ్స్ కోసం తిరుగుతున్నారు. ఒకరిద్దరు పెద్దనిర్మాతలు కథలు పుచ్చుకొని మంజరి ఇంటిచుట్టూ ప్రదక్షిణం చేయడం ఈ రచయితకు తెలుసు. ఇంతవరకూ నాటకరంగానికే పరిమితమయివున్న మంజరి కళాప్రతిభలు ఇప్పుడు సినిమారంగానికి కూడా విస్తరించడం మన అదృష్టం. కొద్దిరోజులలోనే ఈ విదుషీమణి నటనా వైద్యుష్యాన్ని ఆంధ్ర ప్రేక్షకులు

చూడబోతున్నారు. పురుషులను కవ్వించి, వారిలోని శృంగార వాంఛలకు ఉద్దీపనం కలుగచేయగల ఈ అపురూప సౌందర్యరాశిని, అపర దేవతా సుందరిని మీరందరూ త్వరలోనే చూడబోతున్నారు.

''ఈ చిరంజీవి భవిష్యత్తు శోభావహం కావాలని 'కొరడా' పత్రిక మనసారా వాంఛిస్తోంది'' అని ముగించాడు శర్మ.

చలపతి తన్మయుడయిపోయాడు. మంజరి మనస్సంతా మబ్బులమీద తేలిపోతున్నట్లుగా ఉంది.

''చాలా సంతోషం శర్మగారూ! మా గురించి ఎంతో శ్రమ తీసుకొన్నారు. ఈ రుణాన్ని తీర్చుకోవడం ఒకంతటట సాధ్యం కాదు'' అన్నాడు చలపతి.

ఈలోగా శర్మ రెండో జేబులోంచి మరికొన్ని కాగితాలు తీశాడు.

''ఈ వ్యాసం రెండవ భాగమాండీ?'' అన్నది మంజరి.

శర్మ ఓసారి మంజరి కేసి, చలపతికేసి పరిశీలనగా చూశాడు. అతని కళ్ళు పదేపదే చలిస్తున్నాయి.

''కాదనుకోండి. మీరు దీన్నికూడా వినడం మంచిది'' అన్నాడు శర్మ.

''అవసరం లేదు శర్మాజీ! అన్నమంతా పట్టుకు చూడాలా? నాకింక చదివి వినిపించకండి! మీకేది ఇష్టమని తోస్తే అదిచెయ్యండి-సరా?'' అన్నాడు చలపతి, ఇంకోమాట ఇక వినిపించుకునే వినిపించుకోనట్లుగా.

''అలాకాదు-ముఖ్యంగా ఇది మీరు వినడం అవసరం. ఆనక నన్ను నెపపడితే లాభం లేదు'' అని బలవంతం చేశాడు శర్మ.

''పోనీ విందామండీ! శర్మగారు అంతగా చెబుతుంటే వినకపోవడం ధర్మం కాదు'' అన్నది మంజరి.

శర్మ మరోసారి ఆ ఇద్దరి కేసి చూసి చదవడం మొదలెట్టాడు.

''సినిమా పరిశ్రమ ఈనాడున్నంత విపత్కర పరిస్థితిలో మున్నెన్నడూ లేదనడం అతిశయోక్తి కానేరదు. ప్రభుత్వం ఈ పరిశ్రమ మీద మోయలేనన్ని పన్నులు విధించింది. ఇదిగాక, ముడిఫిలిం దిగుమతులను ఘోరంగా తగ్గించి పారవేసింది. దీనికి కారణాలు లేకపోలేదు. కేవలం ఫిలిం దిగుమతుల కోసమే మన విదేశమారక ద్రవ్యమంతా ఖర్చుచేయమనడం న్యాయం కాదు. ప్రస్తుతం ఉన్న పరిమితమైన కోటాతోనే మనం సరిపెట్టుకోవాలి. అలా జరగాలంటే- పాత నటీనటులనే ఈ పరిశ్రమ ఆశ్రయించక తప్పదు.

''విశేషానుభవం ఉన్న పాత తారలు దర్శకుడు చెప్పిన భావాన్ని సులభంగా అర్థం చేసుకొని అంతకన్నా సులభంగా నటిస్తారు. ఒకటి రెండు ''టేక్''ల కన్నా ఎక్కువ అవసరం లేదు. కొత్తవారితో అలా కాదు. ముడిఫిలింను కొత్తవారు అప్పడాలు తిన్నట్టు తినేస్తారు. అదీగాక-కొత్తముఖాలున్నప్పుడు డబ్బు పెట్టుబడి పెట్టడానిక్కూడా డిస్ట్రిబ్యూటరు జంకుతాడు. డిస్ట్రిబ్యూటరు సహకారం లేకుండా సినిమా తియ్యగల ప్రొడ్యూసర్లు మనకెందరున్నారు? కొత్తవారిమీద లక్షలకు లక్షలు డబ్బు పెట్టుబడి పెట్టగలిగిన వారెంతమంది? ఈప్రశ్నలకు మనం సమాధానం చెప్పుకోగలగాలి. ప్రొడ్యూసర్లను, డైరెక్టర్లను దుయ్యబట్టడమే కాదు, వారి సాధక బాధకాలను కూడా మనం ఆలోచించాలి.

''ఈ మధ్యనే ''మంజరి'' అన్న కొత్తముఖం మద్రాసుకు వచ్చిందని విని, ఆవిణ్ణి ''కొరడా'' పాఠకులకు పరిచయం చేయాలన్న ఉత్సాహంతో సంపాదకుడు ఆవిడింటికి వెళ్ళాడు. ఆ కొత్త ముఖాన్ని చూస్తూనే సంపాదకుడు నీరుగారిపోయాడు. చాలా కాలం నుండి ఈ పరిశ్రమనే

అంటిపెట్టుకొన్న ఒక ప్రబుద్ధుడు, ఆమెకు లేనిపోని ఆశలు కల్పించి తీసుకువచ్చి నట్లుగా తెలిసింది. తాను దూరడానికి కంతలేదుగానీ, మెడకొక డోలన్నట్లుగా ఆ ప్రబుద్ధుడు వ్యవహరిస్తున్నాడు. పైగా, ఆ మనిషిని గురించి కాన్వాస్ చేస్తున్నట్లు పది కంపెనీల చుట్టూ తిరుగుతున్నట్లూ భోగట్టా అందింది. మంజరికి నాటకానుభవం ఉన్నదని అతనంటున్నాడు. ఆ పేరుగల "నటి" ఉన్నదాఖలా లేదు. మరో సంగతేమిటంటే, నాటకాల్లో చిల్లర మల్లర వేషాలు వేసిన ప్రతివారూ సినిమాల్లో రాణించగలమనుకోవడం భ్రమ. మంజరి రూపురేఖలుగానీ, శరీర సౌష్ఠవం గానీ సినిమాకు బొత్తిగా పనికిరావు. కనీసం డబ్బింగ్ చిత్రాలలో గొంతు ఎరువిచ్చి బతకడానికి కూడా అవకాశం లేదు. కర్ణకఠోరమైన ఆ గొంతు, ఆడరాక్షసి వేషాలకు తప్ప పనికిరాదు. ఈమెకు సినిమా పరిశ్రమ ఏవిధంగా ఆశ్రయమిస్తుందో చూద్దాం. నాటకాల్లో వేషాలు వేయడానికి ముందుగా, ఈవిడ గుంటూర్లో ఉండేదిట. ఈ ఆడ(పిల్ల) రాక్షసి సమగ్ర చరిత్ర కోసం, పాఠకులు వచ్చే సంచికను చూడవచ్చు. "కొరడా" ప్రత్యేక విలేఖరి ఈ సమాచారం సేకరించడం కోసం అహోరాత్రాలు శ్రమపడుతున్నాడు. ఇటువంటి విషయాలలో పాఠకులను ఏనాడూ నిరుత్సాహపరచని "కొరడా" ఈ సందర్భంలోనూ, తన సంప్రదాయాన్ని నిలబెట్టుకొంటుందని మేము హామీ ఇస్తున్నాం".

శర్మ వ్యాసం చదవడం ఆపి జేబుగుడ్డతో ముఖం తుడుచుకున్నాడు.

చలపతి ముఖంలో గోటిగాటుకు నెత్తురుబొట్టులేదు. మంజరి పాలిపోయింది. ఆవిడ కళ్లల్లో నీళ్లు తిరిగాయి. పెదవులు వొణికిపోతున్నాయి. స్థిరంగా కూచోను కూడా కూచోలేకపోయింది.

"ఇలా మీరు గమ్మున కూచుంటే లాభం లేదు. ఏ సంగతీ వెంటనే చెప్పండి!" అన్నాడు శర్మ లేచి వెళ్ళే ప్రయత్నం చేస్తూ.

"మీ ఉద్దేశమేమిటో నాకు తెలియలేదు. నన్నేం చెయ్యమంటారో చెప్పండి!" అన్నాడు చలపతి వణికిపోతూ.

శర్మ ఓ క్షణం ఆలోచించి సన్నగా నవ్వాడు.

"రెండో వ్యాసం వెయ్యమంటే ఫ్రీగా వేస్తాను. మొదటిది పబ్లిష్ చెయ్యాలంటే ప్రెస్‌బిల్ మీరిచ్చుకోవాలి. ఏది వెయ్యమంటే అదే వేస్తాను" అన్నాడు శర్మ, మంజరిని చూసి నవ్వుతూ.

మంజరికి డోకు వచ్చినంత పనైంది.

"పెద్దలు మీరెలా చెబితే అలానే చేస్తాను. ప్రెస్‌బిల్ ఏమాత్రం అవుతుందంటారు?" అన్నాడు చలపతి.

"మన దగ్గర ఇప్పుడు అంత డబ్బు ఉన్నదా మరి?"

చలపతి ఓసారి ముఖమంతా గట్టిగా రుద్దుకొన్నాడు. కళ్ళు మూసుకొని కుర్చీలో జారగిలబడ్డాడు.

"ఉన్నా లేకపోయినా, వీడి బాధ వొదిలించుకోక తప్పదు. జెర్రిపోతులాంటి వెధవతో యాగీపడటమంటే ఏమిటో నీకింకా తెలీదు" అన్నాడు చలపతి.

ఆ తరువాత హఠాత్తుగా లేచి గుడ్డలు వేసుకొని ప్రయాణమయ్యాడు.

"మళ్ళా ఎప్పటికొస్తారండీ?" అన్నది మంజరి బిక్కుబిక్కుగా. "మరీ పొద్దుపోతే తాయారునన్నా ఉంచుకొందామని అడుగుతున్నాను".

"తాయారును పంపించేసెయ్. నేను సాధ్యమైనంత తొందర్లోనే వస్తాను. రావడం ఆలస్యమయితే బెంబేలు పడకు. నాకోసం ఎవరన్నా వస్తారేమో! వాళ్ళను మర్యాద చెయ్యి. ముంగిముశానంలాగా కూచోకు. మనింటికొచ్చేవారు మన క్షేమం కోరేవారు కదా! వారితో కలుపుగోలుతనంగా ఉండడంలో

తప్పేమీ లేదు....మరి నేను వెళ్ళొస్తాను...తాయారును పంపేయడం మరచిపోకు'' అన్నాడు చలపతి.

అతను వెళ్లిపోయిన చాలాసేపటిగ్గానీ, అతనేమన్నదీ మంజరికి అర్థంకాలేదు. తీరా అర్థమయ్యాక శోష వచ్చినదానిలాగా మంచం మీద కూలబడిందావిడ.

''ఇదేదో పద్మవ్యూహంలాగా ఉంది. ఏదీ నాకు తెలియడం లేదు'' అనుకొన్నది మంజరి.

తాయారును ఉంచడమో, పంపడమో మంజరి తేల్చుకోలేకపోయింది. చలపతి పాటికి పదిసార్లు పంపించమని చెప్పాడు, అంటే, తాయారు ఉండటం వల్ల, అడ్డిపోయేదేదో ఉంటుందన్నమాట! అదేమిటయి ఉంటుందో మంజరికి ఛటుక్కున తట్టలేదు.

''ఏదో ఒకటి నా పీకలమీదికి తెస్తూనే ఉంటాడు. ఏమనడానికి లేకుండానూ చేస్తాడు'' అనుకుంది మంజరి.

తాయారు తన పనులన్నీ చకాచకా పూర్తిచేసుకొంది. తడిచేతిని పమిటకు తుడుచుకొంటూ ''వెళ్ళొస్తానండమ్మాయిగోరూ!'' అన్నది.

''అదేం?'' అన్నది మంజరి లాంఛనంగా.

''ఇంటికాడ శానపనులొగ్గేసినానండీ! ఇయ్యాల అయ్యన్నీపూరితి చేసుకొందామని పోతుండానండీ!'' అన్నది తాయారు.

దాని కళ్ళు నవ్వుతున్నట్లు తోచింది మంజరికి. అయినా, కూపీ లాగుదామన్న ఉద్దేశంతో ''ఎన్నడూ లేనిది ఇవ్వాళే నీకు పనులొచ్చాయా తాయారూ? ఆయనగారు బజారుకెళ్ళారు. ఎప్పుడొస్తారో ఏమిటో తెలీదు. ఒంటరిగా, బిక్కుబిక్కుమంటూ ఉండాలంటే భయంగా వుంది. పోనీ, వారొచ్చిందాకా ఉండగూడదుటే?'' అన్నది మంజరి.

తాయారు మింటబెట్టిన దీపం. దానిముందీ వసవసలేమీ పనికిరావు. ఆవిడ కళ్ళముందు ఇటువంటి వారెందరో దాటిపొయ్యారు. ఆవిడ లోలోపల నవ్వుకొంటూ, సాధ్యమైనంతవరకూ నవ్వును కప్పిపుచ్చుకొంటూ, 'కాదుకూడదు, పోవా'లని బలవంతపెట్టింది.

''అంతగా అవసరమయితే, ఈ వీధి కొసకొచ్చి కేక పెట్టండమ్మగారూ! నేను లగెత్తుకొస్తాను.... లేదా...నాపన్లు అయ్యాక వోసారి మళ్ళొస్తాను. అయ్యగారొస్తే సరేసరి, లేదా, ఆ పాట్నే తొంగుంటాను'' అంటూనే అది వెళ్ళిపోయింది.

మంజరికో క్షణం అయోమయంగా అనిపించింది. అన్ని సంగతులూ, అందరకూ తెలిసిపోతున్నాయనీ, ఒక్క తనకు మాత్రమే ఏ సంగతీ తెలియడం లేదనీ, ఆవిడ వ్యధ చెందింది.

తాయారు వెళ్ళిన పదినిమిషాలకల్లా, ఓనల్లని కారు- ఏది ముక్కో ఏది ముఖమో, తెలీని కారొచ్చి వాకిటి ముందు ఆగింది.

అందులోంచి వెంకటేశ్వర్లు దిగిందాకా, ఆ కారు తమ యింటి కోసమే వచ్చినట్లు మంజరి అనుకోలేదు. అతను నవ్వుకొంటూ దిగాడు. మంజరిని చూసి కళ్ళెగరేశాడు. సన్నగా ఈల కూడా వేశాడు.

మంజరి గుండెలు గతుక్కుమన్నాయి. మొన్నటి కన్నా ఈసారి చాలా చొరవగా వెంకటేశ్వర్లు వచ్చి కూచున్నాడు. మొన్న సరిగ్గా పలకనందుకే చలపతి చాలా చిరాకు పడ్డాడు. ఈసారి తనలా ప్రవర్తిస్తే అతను క్షమించడేమోననిపించింది. ఇలా మాటిమాటికీ చలపతికి కోపం తెప్పించటం భావ్యం కాదని కూడా మంజరికి తెలుసు. కానీ, చలపతి ప్రవర్తన చూస్తుంటే, తనకు కోపమే కాదు, చెప్పరానంత అసహ్యం కూడా వేస్తోంది. అయితే, తన అసహ్యాన్ని బయటపెట్టడానికి వీల్లేదు. కుక్కిన

పేనులాగా భరించవలసిందే!

అతనితో ఏదో విధంగా మాట్లాడాలనుకొంది. కానీ, సంభాషణ ఎలా ప్రారంభించాలో మంజరికి తోచలేదు. బహుశా వెంకటేశ్వర్లు కూడా, ఇదే స్థితిలో ఉన్నాడేమో, తలొంచుకొని, కుర్చీలో కాళ్ళూపుతూ కూర్చున్నాడు.

"వారు బజారుకెళ్లారండి! రావడానికి చాలాసేపు పడుతుందనుకొంటాను" అన్నది మంజరి, గడపకు అటో కాలూ, ఇటో కాలూ వేసి నిలబడి.

"నాకు తెలుసు. ఇప్పుడాయన మా ఆఫీసుకొచ్చాడు. మా అన్నయ్యతో నీ బుకింగ్స్‌ను గురించి మాట్లాడుతున్నాడు" అన్నాడు వెంకటేశ్వర్లు.

మంజరికి లోలోపల చలపతి మీద కృతజ్ఞతాభావం మోసులెత్తింది.

వెంకటేశ్వర్లు ఓసారి మంజరిని ఎగాదిగా చూసి, సన్నగా నవ్వేశాడు.

"చూడమ్మాయ్! నీ వయస్సెంత?" అన్నాడతను, మంజరి ఇబ్బందిగా ఫీలయ్యే చోట్లను చూపులతో తడుముతో.

అంత చిరాకులోనూ మంజరికి నవ్వొచ్చింది. ఆ వెంటనే,మరో బ్రహ్మాండమైన ఆలోచన కూడా వచ్చింది. "తనీ మాటమీదనే, వెంకటేశ్వర్లుతో సంభాషణనెందుకు పెంచకూడదు?" ఈ ఆలోచన రాగానే,కలలోంచి తేరుకున్నదానిలాగా, ఓసారి గట్టిగా నవ్వి, చేతులు రెండూ వెనక్కు చేర్చి వొళ్ళు విరుచుకొని, కుర్చీలో వెంకటేశ్వర్లు కెదురుగా కూచుంది. అతని కళ్ళు, తోడేలు కళ్ళలా మకమకలాడుతుండటం ఆవిడ గమనించింది.

"ఏం మట్లాడవేం మంజరీ?" అన్నాడు వెంకటేశ్వర్లు.

"మీరేమనుకొంటున్నారో చెప్పండి!" అన్నది మంజరి, సిగ్గుపడుతున్నదానిలాగా.

"నేనా?" అని కాస్సేపు మంజరిని ఎగాదిగా చూశాడు వెంకటేశ్వర్లు. అతని చూపులు ఉన్నతోన్నత ప్రదేశాల మీద కాస్సేపు తచ్చాడి, చటుక్కున లోయలోకి జారి, అక్కడే ఆగిపోయాయి. "నేనూ-పాతిక ముప్పయ్ దాకా ఉంటాయనుకొంటున్నాను" అని నవ్వి, కన్ను మలిపాడు.

మంజరి అయిదారు నిమిషాలపాటు విరగబడి నవ్వింది. ఆ తరువాత, తను బాగా నవ్వానని కూడా అనుకొంది.

"మంచివారేనండి! నా వయస్సు చెప్పమంటుంటే, మా అమ్మ వయస్సు చెబుతారేమిటి మీరు?" అన్నది కళ్ళు చికిలించి, ఓసారి అనవసరంగా భుజాలు కుదుపుకుంటూ.

వెంకటేశ్వర్లు కూడా నవ్వాడు.

"పోనీ,నువ్వు చెప్పరాదూ?" అన్నాడతను, కాళ్ళు బల్లమీదుగా చాపుతూ.

"నాకు పాతికేళ్ళుంటాయన్న నమ్మకం మీకేర్పడ్డాక, నేనెంత చెప్పినా అది అబద్ధంగానే ఉంటుంది" అన్నది మంజరి.

"నాది నమ్మకం కాదు-కేవలం ఊహ. నువ్వబద్ధం చెబుతావన్న ఆలోచన నాకు లేనేలేదు...ఊఁ...నువ్వే చెప్పు మరి!" అన్నాడతను.

"నాకా?" అని ఓనిమిషం ఆలోచించింది మంజరి. ఆ తరువాత గోముగా నవ్వుతూ, "ఆడదాన్ని వయస్సూ, మగవాణ్ణి సంపాదనా అడక్కూడదుగదండీ?" అన్నది మంజరి.

"అయితే ఆ నియమాన్ని నేను ముందుకాదంటాను. నాకు డెబ్బయ్యకరాల మాగాణి భట్ల పెనుమర్రు దగ్గరుంది. పార్వతీ పరమేశ్వర రైస్‌మిల్లులో పదకొండణాల వాటా వుంది. రెండు కమీషను

కొట్లున్నాయి. నా తమ్ముడి పేరన ఎరువుల వ్యాపారం చేస్తున్నాను. దానాదీనా సాలుకు ఓ లకారం కళ్ళ చూస్తుంటాను. కొంపదీసి ఏ ఇన్‌కంటాక్సువాడికన్నా చెప్పేవు-నా పుఠమారిందన్నమాటే. అసలీ డబ్బును పన్నులకింద గవర్నమెంటుకు కట్టడం నాకిష్టం లేదు. అందుకే సినిమా తియ్యాలని సంకల్పించుకున్నాను. మా షడ్డకుడున్నాడే రామబ్రహ్మం- వాడికీలైన్లో తెలిసిన వాళ్లున్నారు. ఓ సినిమా తీద్దామన్నాడు, సరేనన్నాను. ఓ లక్షసరిపోతా యన్నాడు. ఎందుకైనా మంచిదని రెండు లక్షలు బ్యాంకులో వేసుక్కూచున్నాను. ఇంతవరకూ మాంఛి కథ దొరకలేదు. ఏదో వో కథను ఎన్నుకొని, నాలుగు మాసాల్లో సినిమా తీసిపారేసి బెజవాడ వెళ్ళాలి. ఈ రెండు లక్షలు పోతాయన్న దిగులు నాకు లేదు. సినిమా వాళ్లు నా డబ్బు తినకపోతే గవర్నమెంటు తింటుంది. అంతే తేడా! నాది కానపుడు, ఏమైనా నాకు దిగుల్లేదు గనక, నేను పట్టించుకోవడం లేదు. అమ్మాయీ, ఇదీ నా సంగతి'' అన్నాడు వెంకటేశ్వర్లు.

''మీ కంపెనీ పేరు నోట్లో ఆడతా ఉందండి! ఏమిటన్నారూ అది?'' అన్నది మంజరి.

''నవకళా చిత్రాలయ అని పేరుపెట్టాం''.

''బ్యూటిఫుల్! చాలా బావుంది'' అన్నది మంజరి.

ఆ సరికే వెంకటేశ్వర్లు కాళ్ళు,మంజరి కాళ్ళను తాకుతున్నాయి. ఆవిడ కాళ్ళను వెనక్కు తీసుకోలేదు సరిగదా, మరికొంచెం ముందుకు జరిపి వెంకటేశ్వర్లుకు ఆ కాళ్ళతోనే జవాబు చెప్పసాగింది.

''ఇందాకనే, ఓ కవి నాకో కథ చెప్పాడు-బావుంది. అందులో ఓ పదహారేళ్ళమ్మాయి, భర్తను కోల్పోయి, అనేక సాహసకార్యాలు చేశాక తిరిగి మొగుణ్ని కలుసుకొంటుంది. ఆ కథ వింటున్నంతసేపూ నువ్వే నా కళ్ళముందున్నావు. ఇంతకుముందు చలపతిగారు మా ఆఫీసుకొచ్చినప్పుడు ఆ ముక్కే ఆయనతో అన్నాను. 'కథ చెప్పి మంజరి అభిప్రాయం కనుక్కో'మన్నాడు. నేనిలా వచ్చాను. నీకా వేషం నచ్చినట్లేనా?'' అన్నాడు వెంకటేశ్వర్లు.

మంజరి ఓసారి ఓరకంటితో అతనికేసి చూసి, సిగ్గుపడి తలవొంచుకుంది.

''వండర్‌ఫుల్, వండర్‌ఫుల్! ఇంత గొప్పగా ఎక్స్‌ప్రెషన్ ఇస్తున్నావు కదా? ఇంతవరకూ ఏ ప్రొడ్యూసరూ నిన్నెందుకు ఎగరేసుకుపోలేదా అని! నిన్ను తొలిసారిగా సెల్యులాయిడ్‌లో కెక్కిస్తున్న కీర్తి నాకు దక్కాలని దేవుడు రాస్తే, ఒకళ్ళు చేసేదేమిటి గానీ-నువ్వుకాస్త మేకప్ అవరాదూ త్వరగా?''.

''ఇలా మీకు బావుండలేదా?'' అన్నది మంజరి.

ఆ మాటతో వెంకటేశ్వర్లు చిత్తు చిత్తయిపోయాడు. అతనోసారి బాధగా వొళ్ళు విరుచుకొని ''అందుగ్గాదు. మణిని మసిపాతలో కట్టారనే నా బాధ'' అన్నాడు.

''మణి అందం పూర్తిగా చూడాలంటే దానిచుట్టూ మసిపాతలున్నప్పుడు ఎలా వీలవుతుందండీ?'' అన్నది మంజరి.

ఈ దెబ్బతో వెంకటేశ్వర్లు గో(హా)విందా!

''మీ ఇల్లు చూపించావు గాదే? ఇదేనా మర్యాద! రేపు మా ఆఫీసుకొచ్చినప్పుడు, నిన్నిలానే ఆఫీసు నుంచి బయటకు పంపేస్తే నువ్వేమనుకొంటావ్?'' అన్నాడు వెంకటేశ్వర్లు.

''అలా పంపించక లోపలకు లాక్కుపోయి, తలుపులు వేసేస్తామంటారా ఏమిటి?'' అన్నదావిడ.

''నువ్వు నన్ను నిలువునా కాల్చేస్తున్నావ్ మంజరీ! అప్పుడేప్పుడో తలుపులు వేయటం కాదు-''

''కొంపముంచారు. ఉండండి బాబూ! మీలాంటి వాళ్ళతో వొంటరిగా ఉండడం ఎంత

ప్రమాదమో! నేను లోపలకన్నా వెడతాను''.

మంజరి లేచి గదిలోకొచ్చింది. ఆమె వెనకనే వెంకటేశ్వర్లు కూడా వచ్చాడు. వస్తూనే తలుపులు రెండూ, దగ్గరకు నొక్కి గడియపెట్టాడు.

''మీ దౌర్జన్యమేమిటో నాకు బోధపడకుండా ఉంది. ఎవరిచ్చిన చనువండీ ఇది?'' అన్నది మంజరి.

''కోపాన్ని ఎంత బాగా ఎక్స్‌ప్రెస్ చేస్తావోయ్ నువ్వు! ఏదీ అలానే ఓ చిన్న నవ్వు కూడా పారేయ్ చూద్దాం'' అన్నాడు వెంకటేశ్వర్లు.

''ఊఁహు, నేన్నవ్వను'' అంటూనే మంజరి ముఖాన్ని రెండు చేతులతోనూ కప్పుకొని నేలమీద కూచుండిపోయింది.

ఆ తరువాత ఏం జరిగేదీ మంజరికి తెలుసు. అనేక వందలసార్లు ఇటువంటి సీనుల్లో అత్యద్భుతంగా నటించిన అనుభవం వృధా కాలేదు. వెంకటేశ్వర్లు తోడేలులాగా, ఆమె దగ్గరకు చేరి రెండు చేతులతోనూ, ఆలింగనం చేసుకొన్నాడు.

''నన్ను తాకకండి...దూరంగా ఉండండి...ఎవరన్నా చూస్తారండీ స్వామీ! కనీసం తలుపులన్నా వెయ్యనిస్తారా?''

వీటివేటికీ వెంకటేశ్వర్లు సమాధానమివ్వలేదు. తన శక్తినంతా చేతుల్లోకి తీసుకొని ఆమెను నిలుచోబెట్టాడు. ముఖాన్నించి ఆవిడ చేతుల్ని తీసిపారేశాడు. ఓ అడుగుఎడంగా నిలబడి, చూపులతోనే ఆవిణ్ణి తినేశాడు.

''అలా చూడకండి. మీకు పుణ్యముంటుంది. నన్నెందుకింకా పిచ్చిదాన్ని చేస్తారు బాబూ?'' అన్నది మంజరి.

ఆ క్షణాన తను తాను కాకుండాపోయాడు వెంకటేశ్వర్లు. అతనిలోని మృగాలు నిద్రలేచి వళ్ళు విరుచుకొని గాండ్రించాయి. మంజరిని నిలువునా ఆలింగనం చేసుకొని తనకేసి హత్తుకొన్నాడు. వెచ్చగా ఆత్రంగా, వెదుకులాడే అతని పెదవులకు మంజరి పెదవులు తారసిల్లాయి.

''అబ్బ! చంపేస్తున్నారు!'' అన్నది మంజరి, అతనిలో కణకణలాడుతున్న నిప్పును మరికాస్త ఎగసనదోస్తూ. వెంకటేశ్వర్లు మాట్లాడలేదు. ఆమెను తనమీదకు పొదువుకొని గట్టిగా నిట్టూర్చాడు.

...విశ్వాన్ని జయించిన వీరునిలాగా వెంకటేశ్వర్లు నవ్వుకుంటూ కూర్చున్నాడు. అతని చూపుల్లో ఇంకా తీరని దాహం దోబూచులాడుతూ వుంది...కుర్చీలో కూచుని సిగరెట్ పొగ ఉంగరాల కింద వూదుతూ కాళ్లాడిస్తున్నాడు.

మంజరి ఎంతో బాధను అభినయించింది. మంచం దిగి, రెండడుగులు వేసి తూలిపడింది. జారిపోయిన చీరెకుచ్చిళ్ళను అటూఇటూ సర్దుకొంది. గోళ్ళతో జుత్తును సరిచేసుకుంది. అనవసరంగా జాకెట్ గుండీలను చూసుకొంది. తిరిగి మంచం మీదనే కూచుంది.

''అలా వున్నావేం?'' అన్నాడు వెంకటేశ్వర్లు, కోప్రొడ్యూసర్ కమ్ నవకళాచిత్రాలయ మేనేజర్.

''ఎలా వున్నానేం? పాపమని! పోదురూ! ఇహనుంచీ మీతో నేను మాట్లాడను'' అన్నది మంజరి ముద్దులుకుడుస్తూ.

''నేనేం చేశానని అంత కోపం?''అన్నాడు వెంకటేశ్వర్లు కుర్చీలోంచి లేస్తూ.

''మళ్లా లేవకండి బాబూ!'' అన్నది మంజరి రెండు చేతులూ జోడిస్తూ.

ఈ మందులెలా పనిచేస్తాయో మంజరికి తెలుసు. అదే మందు వెంకటేశ్వర్లు మీదా వాడి

చూసింది. వాడిన మరుక్షణమే అతనికి పూనకమూ కలిగింది.

“నువ్వేదో ఆరిందావనుకొన్నాను గానీ ఇంత కసుగాయనుకోలేదు. ఒకసారేం జరిగిందో తెలుసా? పెద్దాపురం వెళ్లాను. అక్కడ సరసీరుహనుని-నువ్వు వింటున్నట్లు లేదు గదూ?”

“ఆఁ...”అని ఉలిక్కిపడి, “ఏమిటి మళ్ళా చెప్పండి” అన్నది మంజరి.

“అదెప్పుడయినా చెబుతాను గానీ, ముందు నువ్వాలోచిస్తున్నదేమిటో బయటపెట్టరాదూ?” అన్నాడతను.

మంజరి ఏ నిమిషం పాటు ఆలోచించింది. ఆ తరువాత గట్టిగా నిట్టూరుస్తూ పెదవి విరిచి, ఓసారి కళ్ళు నులుముకొని, “ఏమిటన్నారు? మీరేదో చెబుతూ, చెబుతూ మధ్యలో ఆపేశారేం?” అన్నది.

వెంకటేశ్వర్లు, తాపీగా మంజరి పక్కనే కూచున్నాడు. ఆవిడ భుజంమీదుగా చేతులువేసి, మంజరి ముఖాన్ని తనకేసి తిప్పుకొని కళ్లలోకి సూటిగా చూస్తూ “ఏమిటి మంజరీ ఆ పరధ్యానం? నాతో చెప్పరాదా? వీలుంటే నేను తప్పకుండా సాయం చేస్తాను గదా?” అన్నాడు.

“అబ్బే, ఏం లేదండీ!” అన్నది మంజరి, అచ్చంగా సినిమాలో హీరోయిన్‌లాగా.

“బ్యూటిఫుల్, మంజరీ! నాకిప్పటికీ అర్థంకానిదేమిటంటే, ఈ సినిమా మనుషులకు చెవులే తప్ప కళ్లెందుకు లేవా అని! ఇంత బ్రహ్మాండంగా, గ్రేటా గార్బోలాగా భావాలు పలికిస్తావు గదా, నీ కెందుకింకా సినిమా ఛాన్స్ రాలేదో బోధపడదు. ఇప్పుడు నువ్వన్న డైలాగునే, రేపు నువ్వు క్లోజప్పులో అంటే ఆడిటోరియమ్ హాహాకారాలు చేస్తుంది గానీ మానుతుందా? ‘అబ్బే, ఏం లేదండీ’ అనడంలో ఎన్ని రకాల మాడ్యులేషన్స్ ఎక్స్‌ప్రెస్ చేశావో నీకు తెలీదు. ఈఫీల్డులో పడి కొట్టుకుంటున్నవాణ్ణి గనక, నేనిట్టే గ్రాస్ప్ చేశాను. మార్వెలెస్ మంజరీ! ఫ్యూచర్ సినీవరల్డంతా నీ పాదాలమీద పడిగాపులు పడకపోతే మాచెవ్వు తెగ్గోసుకుంటాను” అన్నాడు వెంకటేశ్వర్లు.

“మీరు మనుషుల్ని ఉబ్బేసి పబ్బం బాగా గడుపుకొంటారనుకొంటా”అన్నది మంజరి.

ఆ తరువాత ముఖం చిట్లించి కోపం అభినయిస్తూ “అబ్బా, ఏమిటా చిలిపి మాటలు! ఎప్పుడూ అదే యావయితే ఎలా స్వామీ? మీతో వేగడం బహుకష్టం. నా విన్నపమేమనగా, మీకూ, మీ స్నేహితునికి గుడ్‌బై. దయచేసి రేపటి నుండి నన్నిలా వేధించకండి!” అన్నది మంజరి.

“అది నా యిష్టం!” అన్నాడు వెంకటేశ్వర్లు, ఆవిడ చెక్కిళ్ళనోసారి మృదువుగా తాకుతూ.

“ఇందాక మీరో ప్రశ్నకు సమాధానం చెప్పకుండా తప్పుకొన్నారు. ఇప్పుడలా వొదల్ను. నిజంగా ప్రమాణం చేసి చెప్పండి. నేను మీ కళ్లకు...”

వెంకటేశ్వర్లు ఓ క్షణం ఆలోచించి “ఓహో అదా! ఇప్పుడు చెప్పనా నీ వయస్సెంతో” అన్నాడు.

“పాతికేళ్ళు” అన్నది మంజరి, చిరుకోపంగా అతనికేసి చూస్తూ.

“కాదమ్మడూ! నేను సరదాగా అన్నాను, అంత కోపమయితే ఎలా? నీకే పాతికుంటే నాకు అరవైదాకా ఉండాలి. నిజంగా నీ వయస్సెంతో చెప్పాలంటే... ఉండు చెబుతాను...అరె, అలా జరిగిపోతే చెప్పడం నావల్ల కాదు...” అన్నాడు వెంకటేశ్వర్లు.

“ఒద్దులెండి, మీరు చెప్పావద్దు, నేను వినావద్దు...”

మాట సగంలోనే ఆగిపోయింది. మిగతా వాక్యాన్ని వెంకటేశ్వర్లు పెదవులు నొక్కేశాయి. మంజరి మరోసారి గాఢంగా నిట్టూర్చింది. గట్టిగా కళ్లుమూసుకుంది. కనురెప్పలను తొలగదోసుకుంటూ, నీటిపొరలు వెలికురికాయి. ఆవిడ హృదయం అవమానంతో, బాధతో, అసహ్యంతో నిండిపోయి,

కుతకుతలాడసాగింది. ఆ పొంగులన్నీ కన్నీళ్లుగా దుఃఖంగా మారి వెలువడుతున్నాయి. వెంకటేశ్వర్లు వున్నాడో, లేదో... అతనేం చేస్తున్నాడో కూడా కొన్ని క్షణాలదాకా ఆవిడకు తెలియలేదు.

వెంకటేశ్వర్లుకు తెలివొచ్చేసరికి మంజరి నడిమంచం మీద కూచుని వుండి, తలను మోకాలి మీద ఆనించి ఎటో చూస్తోంది. ఆ చూపుల్లో ఏ భావమూ లేదు. ఆ ముఖంలో ఏ ఆలోచనా లేదు.

"హెవెన్స్, హెవెన్స్! ఇలాంటి పోజులో ఓ నిముషం పాటు నువ్వు కనిపించావంటే, బాక్సాఫీస్ బద్దలయిపోతుంది మంజరీ! చూస్తున్న నాకే గుండెలవిసిపోతున్నాయంటే, పబ్లిక్‌సంగతి అడక్కు మరి! అంటే-చలపతి నిన్ను గురించి చెప్పిందంతా నిజమేనన్న మాట! నువ్వేదో నాటకాల్లో వేషాలేశావంటే-అందరి మాదిరేననుకొన్నాను గాని, ఇంతగా నివురుగప్పిన నిప్పువనుకోలేదు సుమా! ఏది ఏమైనప్పటికీ డియర్! నా ఫస్టు పిక్చర్లో నువ్వు హీరోయిన్‌గా వుండి తీరాలి. నీకా వుద్దేశం లేకపోతే యిప్పుడే చెప్పు, కుండా చట్టీ చంకన పెట్టుకొని బెజవాడ చేరుకుంటాను. ఏమిటలా నవ్వుతావ్? నామాటల మీద నమ్మకం లేదా?" అన్నాడు వెంకటేశ్వర్లు.

"అందుక్కాదండీ! మీపాండిత్యాన్ని చూసి నవ్వొచ్చింది"అన్నది మంజరి.

"నాకీ వెధవ తెలుగంటే పరమ అసహ్యం. నన్నడిగితే మన తెలుగు అండర్ డెవ్‌లప్డ్ లాంగ్వేజ్ అంటాను. అందుకే మా రామబ్రహ్మంగాడితో తెలుగులో సినిమా తియ్యొద్దురా నాపా అన్నాను. వాడు వినిపించుకొన్నాడు కాదు. సరే, అదీ వొకందుకు మంచిదే అయింది" అని నవ్వాడు వెంకటేశ్వర్లు.

"ఎందుకుట!"

"వాడికా పట్టుదలే లేకపోతే నేనీ ఫీల్డులోకి వచ్చేవాణ్ణి కాదు; నిన్ను చూచేవాణ్ణీ కాదు....కానీ, నా జీవితం హెూల్ మొత్తం మీద యింత హాయిగా గడిచిపోయిన రాత్రి ఇదేననుకో మంజరి! నేను ఏకపత్నీవ్రతుణ్ణని నీతో అనలేదని నా నమ్మకం. అని వుంటే ఉపసంహరించుకొంటున్నాను. ఒక్క ముక్కలో చెప్పనా మరి! నువ్వు మనిషివి కాదు- అంతే!"

"రాక్షసిని!" అన్నది మంజరి కూడా నవ్వి.

"కాదమ్మడూ! నువ్వు దేవకన్యవు. అప్సరసవు. నేనిందాకనే అనుకొన్నాను. సోషల్ పిక్చర్ డ్రాప్‌చేసి ఓ ఫోక్ లోర్ తీదామని! సోషల్లో దేవకన్యలూ, అప్సరసలూ రావడానికి లేదాయె..."

మధ్యలోనే మంజరి ఫకాలుమని నవ్వేసింది. "ఊఁ...ఆగారేం; చూసి-చూశాక ఏం చేస్తారేమిటి?"

"అదిప్పుడే చెప్పను. ఇన్నిటికీ, నువ్వేదో నాదగ్గర దాస్తున్నావమ్మోయ్. అదేమిటో చెబితే తప్ప వీల్లేదు" అన్నాడు వెంకటేశ్వర్లు ఎంతో ఆప్తుడులాగా.

"చలపతి మీతో అనలేదా?" అన్న ముక్క నోటిదాకా వచ్చింది. అదృష్టవశాత్తూ బయటపళ్లేదుగానీ, లేకపోతే కొంపలంటుకొనేవే!

"చెప్పనా?" అన్నాడు గోముగా లాలిస్తూ.

" ఆ ముక్క చెప్పాక, ఇంకా నా ముఖం మీరు చూస్తారా! నా సమస్యకన్నా, నాకు మీరే ముఖ్యం. పదికాలాలపాటు మన స్నేహం వర్థిల్లడం కన్నా నాకేమీ అవసరం లేదు. మరింక నన్ను గుచ్చి గుచ్చి అడక్కండి!".

వెంకటేశ్వర్లు ఈసారి నిజంగానే బాధపడ్డాడు.

"అదిగాదమ్మాయ్! నామీద ఆమాత్రం విశ్వాసం వున్నప్పుడు చెప్పడానికేం? నేను పరాయివాణ్ణి గనకనా, ఏమన్నా అనుకోవడానికి? ఆ పని నావల్ల కూడా కానిదయితే, ఎవరివల్లవుతుందో

తెలుసుకొందాం. పూర్తిచేదాం. సరేనా?''

తనకింత డబ్బు కావాలని ఎలా ఆడగడమో మంజరికి ఛట్టున తట్టలేదు. ఆ అలవాటు తప్పిపోయి కూడా చాలా సంవత్సరాలయింది. లోగడ తను వృత్తిలో ఉన్నప్పుడు, చిల్లరగా తప్ప, పెద్ద మొత్తాలెప్పుడూ పుచ్చుకోలేదు. ఇప్పుడు ఏకతాకీన అయిదువందలు కావాలని ఎలా అడగడం?

''ఊఁ...వెళ్ళేలోగా చెబుతానుగానీ, హీరోయిన్‌కు ఏమాత్రం ఖర్చు పెట్టదలచారు?'' అన్నది మంజరి.

''అది మనిషిని బట్టి వుంటుంది!''

''అయ్యబాబోయ్! ఎంత అసాధ్యులండీ! మాట మాత్రం దాటనివ్వరు...పోనీ నాకయితే ఎంతిస్తారు. చెప్పండి''.

''నువ్వడిగినంత!'' అన్నాడు వెంకటేశ్వర్లు.

''నేనొక లక్షరూపాయలడుగుతాను, ఇస్తారేమిటి?'' అన్నది మంజరి హాస్యంగా.

వెంకటేశ్వర్లు ఓ నిమిషం ఆలోచించి, కళ్లు టపటపలాడిస్తూ ''ఆఁ అలాగే ఇస్తాను. నువ్వీ సినిమా గొడవలు మానేసి అచ్చంగా నాతోనే ఉండిపోతావా?'' అన్నాడు.

హఠాత్తుగా మంజరి మంచం మీంది లేచి, వెంకటేశ్వర్లును కావిలించుకొని, ఊపిరి తిరక్కుండా ముద్దులు పెట్టుకొంది.

''ఎంత మంచివారండీ మీరు! మీరో ముష్టి లక్షరూపాయలిస్తేనేనా, నేను ఉండటం! నాకవేమీ వద్దు, మీ అభిమానం చాలు. అదే నాకు పదికొండల పెట్టు. మీరు మాత్రం నన్ను చెయ్యొదలకండి. మీనీడన నిశ్చింతగా ఉంటాను'' అన్నది మంజరి అతని చేతిని తన చేతిలోకి తీసుకొంటూ.

''నెవర్ నెవర్'' అన్నాడు వెంకటేశ్వర్లు, ఆవిడ చేతిమీద తన చేతిని వేస్తూ.

రెండు మూడునిమిషాల పాటు ఎవ్వరూ పలకలేదు.

గడియారం అయిదుగంటలు కొట్టింది. మరోసారి వెంకటేశ్వర్లు చేతిని గట్టిగా నొక్కి విడిచింది మంజరి.

''మిమ్మల్ని వెళ్లమనడానికే నోరు రావడం లేదు. చలపతిగాని వస్తే బావుండదు... సాయంత్రం మీరోసారి రాగూడదూ? పోనీ -నన్ను గానీ మీ ఆఫీసుకు రమ్మంటారా?''అన్నది మంజరి.

''ఈ రెండూ వద్దు, హాయిగా ఏ హొటల్‌కయినా వెడదాం...సరేనా?''

''మళ్ళా నన్ను వెంటనే పంపేస్తారు గదూ?'' అన్నది మంజరి, అతనికేసి చిలిపిగా చూస్తూ.

'చూదాం' అన్నాడు వెంకటేశ్వర్లు. ''ఏదో అనబోయి మానేసినట్లున్నావ్ ఏమిటి విశేషం?''

''ఏం లేదుగానీ....''

ఆపైమాట మంజరి అనలేకపోయింది. వెంటనే బయటపడితే, తన విలువ పడిపోతుందదేమోనని ఆవిడ భయం! అనకుండా ఉంటే చలపతి ఊరుకోడు, ఒకవేళ అతనూరుకొన్నా, ఆ శర్మ ఊరుకోడు. ఇవాళ సాయంత్రంలోగా, శర్మగారికి ఐదువందలు కట్టనన్నా కట్టాలి; లేదా- ఆ రెండో వ్యాసం అచ్చుకావడానికి వొప్పుకోనన్నా వొప్పుకోవాలి.

# 7

"ఇంతకన్నా మంచిగుడ్డలు నీకు లేవా?" అన్నాడు వెంకటేశ్వర్లు,మంజరి కట్టుకొన్న వాయిల్ చీరకేసి చూస్తూ.

"నేను లక్షాధికారిననుకొన్నారా?"

"నిన్నటి వరకూ కాదు, ఈ క్షణం నుండీ నీకే లోటూ లేదు" అన్నాడు లాల్చీ జేబులోంచి పర్సుతీస్తూ.

మంజరి హాయిగా నిట్టూర్చింది. ఓసారి రెండు కణతలూ గట్టిగా నొక్కుకొని చేతివేళ్లు విరుచుకొంది.

వెంకటేశ్వర్లు పర్సులోంచి ఇన్ని వందల రూపాయల నోట్లు తీసి మంజరికివ్వబోయాడు. ఆవిడ ఓ అడుగు వెనక్కు వేసి నిలుచుంది.

"ఇంద, ప్రస్తుతానికి నీ దగ్గరుంచు. కావాలన్నపుపడల్లా అడుగుతుండు. దిక్కుమాలిన మొహమాటాలు పెట్టుకోకు. అయినా నా దగ్గర నీకు మొహమాటమేమిటమ్మడూ! చాలా? ఇంకా కావాలా?" అన్నాడు వెంకటేశ్వర్లు.

మంజరి పలకలేదు. ఆవిడ పొడిపొడిగా వున్న కళ్లను పమిటతో వొత్తుకుంటూ, "నాకేమీ వద్దు, ఏమీ వద్దు, నన్నిలా బాధపెట్టకండి! నేను డబ్బు మనిషిని కాను" అన్నది కంపిస్తున్న గొంతుతో.

వెంకటేశ్వర్లు ఆమె దగ్గరగా వచ్చి వోదార్చాడు.

"పిచ్చిదానా! మనుషుల్ని గురించి నాతో మాట్లాడకు. నువ్వెటువంటిదానివో చూస్తూనే గ్రహించాను. అన్నమంతా పట్టి చూడఖ్ఖర్లేదు. ఇంద-తీసుకో, మరి-నేను వెళ్లిరానా? సాయంత్రం తప్పకుండా, నిన్ను పికప్ చేసికెడతాను. ఈలోగా ఆ సినిమా కథ సంగతి చూడాలి మరి! మా సన్యాసి సోషలో అంటూ ఏడుస్తున్నాడు. నీకోసమని ఫోక్ లోర్ తియ్యమంటాను. లేకపోతే నా భాగం నేను తీసేసుకొని సొంతకంపెనీ పెట్టుకొందాం. నువ్వోసారి మధ్యాహ్నం పూట...అలా మౌంట్‌రోడ్ కెళ్లి నీకేం కావాలో పర్చేజ్ చెయ్యి, ఇంకేమన్నా తక్కువపడితే నేను చెక్కిస్తాను. టా...టా....బై....బై".

వెంకటేశ్వర్లు ఊగుతూ వెళ్లిపోయాడు. అతను వెళ్లిందాకా అటువేపే చూసి ఆతరువాత రెండు తలుపులకూ గడియబెట్టింది మంజరి. చేతిలో అతనిచ్చిన వందరూపాయల నోట్లు పెళపెళమంటున్నాయి. ఓసారి గది నాలుగుపక్కలా చూసి, కుర్చీలో కూచుని నోట్లు లెక్కించింది. పదిహేడున్నాయి.

పదిహేడువందల రూపాయలు!

మంజరి కళ్లు మిలమిలలాడాయి

తన జీవితంలో తనదిగా వున్న పెద్దమొత్తం ఇదే! ఇంతవరకూ ఇన్ని వందల రూపాయలను ఒక్కసారిగా తను చూడలేదు. అథవా చూసినా, అవి తనవిగావు. ఇప్పుడీ డబ్బంతా తనదే! వీటిని తనేం చేసినా చేసుకోవచ్చు.

మంజరి మరోసారి ఆ నోట్లను లెక్కబెట్టి, అలమారలో వుంచింది. వాటిమీద, పాతపత్రిక పరిచి, గాలికి లేవకుండా స్నోసీసా బరువు పెట్టింది. సీసాకింది అప్పుడెప్పుడో తెప్పించిన కవరు కనిపించడంతో, మంజరికి రాజమణి జ్ఞాపకం వచ్చింది; తను రాజమణికి ఉత్తరం రాసి చాలా రోజులయింది. ఇంతవరకూ జవాబు రాలేదు. రాజమణి సాచివేత మనిషి కాదు. అందులోనే తనంటే దానికి అమితమైన వాత్సల్యం! రాజమణి ఆర్యోగం బాగోలేదేమో! ఏదన్నా ఊరికిగానీ వెళ్ళిందేమో!

మంజరి ఏ నిర్ణయానికి రాలేకపోయింది. ఆ అనిశ్చితస్థితికి ఆవిడ మనసు చిరచిరలాడిపోయింది. మంచంమీద వెల్లికితలా పడుకొని, దిండును ఎదురురొమ్ములమీద వుంచుకొంది! కళ్లు భగ్గున మండిపోతున్నాయి. ఇసకపోసినట్లు గరగరలాడిపోతున్నాయి. ఓసారి గట్టిగా కళ్లు నులుముకొంది. పక్కకు తిరిగి అద్దంలో, తన బొమ్మను చూసుకొంది. కళ్లు పీక్కుపోయాయి. కింది పెదవి, ఓ పక్కగా చీరుకుపోయింది. తలంతా ఈతపొదలా ఇంతెత్తున రేగి ఉంది.

ఆ బొమ్మను చూసి తనలో తనే నవ్వుకొంది మంజరి. పెదవి చీరుకపోయిన చోట నాలుకతో తడిచేసుకొంది.

"పదిహేడు వందల రూపాయలు!" అన్నది మంజరి బొమ్మకేసి నిదానంగా చూస్తూ.

ఆ మాటలు తను అంటున్నట్టుగా లేవు. ఎవరో తన వెనక నుండి అంటున్నట్లుగా ఫీలయింది మంజరి. ఓసారి ఛటుక్కున వెనక్కు తిరిగి చూసింది. గది తలుపును ఎవరో తడుతున్న చప్పుడు వినిపించింది.

మంజరి ఆలోచనలన్నీ వొట్టుపెట్టినట్లుగా ఒక్కసారిగా ఆగిపోయాయి. ఆ వెంటనే లోలోపల సన్నని భయం కూడా పొడచూపింది. ఆ తలుపు కొడుతున్నది చలపతేమోనన్న అనుమానం మంజరిని చిరాకు పరిచింది.

ఈలోగా మరోసారి తలుపు చప్పుడయింది.

'ఎవరది?' అన్నది మంజరి మంచం మీద నుండి లేవకుండానే!

"నేనేనండమ్మా! తాయారును".

మంజరి సన్నగా నిట్టూర్చి లేచి వెళ్లి తలుపుతీసింది. తనను చూడగానే తాయారు నవ్వుతుందని మంజరి అనుకొంది. కానీ ఆవిడలాంటి పనేదీ చెయ్యలేదు. మామూలుగా ఇంటిపని చేసుకుపోతూ ఉంది.

తనిప్పుడు మౌనంగా ఉండటం మంచిది కాదనీ, రాత్రి తాయారు ఎందుకు పడుకోలేదో అడగటం అవసరమని మంజరికి తోచింది. తాయారును పిలిచి అదే విషయం అడిగింది.

"ఊరికేనండమ్మగారూ!" అన్నది తాయారు.

"ఇదివరకు అడిగినప్పుడల్లా పడుకొనేదానివి గదా! రాత్రి మానేశావేం?" అన్నది మంజరి.

వెంకటేశ్వర్లు రాక విషయం తాయారుకు తెలుసునో లేదో మంజరికి స్పష్టపడాలిప్పుడు.

"ఏం లేదండీ! అవకాడ నాకు శానాపన్లుండాయండీ! మా వూర్నుండొచ్చారండీ జనం! మా సుట్టాలు కూడా ఉన్నారండి! సూటింగ్ సూత్తామంటే రాత్రి తీసికెల్లినానుండీ!"

మంజరి మనస్సు తేలికపడ్డది.

"రాత్రి అయ్యగారు, నాకు టూడియోలో అవుపించారండీ! ఆయన గారి పక్కనే ఇంకెరెవరో బంగారం కళ్లజోడాయన ఉన్నారండీ! ఆయనగారి పేరు రామబ్రెమ్మంగారట. ఇద్దరూ శానాసేపు మాట్లాడుకుంటూ కూచున్నారు. నాపానమంతా మీకాడనే ఉన్నదనుకోండ వ్మాయిగోరూ! అయ్యగారేమో, ఈడ ఉన్నారాయె; నేనెమో టూడియో కొస్తినాయె; ఇంటికాడ మీరొక్కరే ఉంటిరాయె! ఏందా యిదంతా అనిపించి పానం పింజం పింజం అన్నదండీ!"

మంజరి ఊఁకొడుతున్నదన్నమాటేగానీ ఆలోచనలన్నీ చలపతి చుట్టూ తిరుగుతున్నాయి.

"రాత్రి సరిగ్గా నిదరపోయారా అమ్మగారూ?" అన్నది తాయారు.

మంజరి ఉలిక్కిపడి "ఆఁ" అన్నది.

తాయారు నమ్మినట్టు లేదు.

''నాకాడ దాస్తున్నారా అమ్మాయిగారూ! రాత్తిరల్లా మీకు నిదురలేదు. కళ్లు సూసుకోండి-జ్యోతులకకుమల్లే ఎర్రగా వున్నాయి. మడిసి-నలిగిపోయినా, రండమ్మాయిగారూ! ఒక్కరేత్తిరిలో సగం తీసిపోయినారు. బయపడ్డారేందండీ?''

''ఆఁ'' అన్నది మంజరి. మరేమనడానికీ పాలుపోక, ''ఒక్కదాన్ని పడుకోవటం అలవాటు లేదు. అందులోనూ కొత్త. తలుపులన్నీ వేసేసుకొన్నాను. అయినా భయం తీరింది కాదు'' అన్నది.

తాయారు ఓక్షణం మంజరిని ఎగాదిగా చూసి తనలో తాను నవ్వుకొంది.

ఎనిమిది గంటలకల్లా చలపతి కార్లో దిగాడు. మంజరి గుండెలు గుబగుబలాడాయి. సన్నని కలవరం కూడా కలిగింది. కుర్చీలో కూచున్నదల్లా లేచి లోపలి గదిలోకొచ్చింది. చలపతి సరాసరి గదిలోకే వచ్చాడు. మంజరి ప్రాణాలు నిలువునా పైకెగిరిపోయాయి. తనేదో మహాపరాధం చేసినట్లూ, అది కాస్తా తెలిసిపోయినట్లూ ఆమె భయపడింది. ఇప్పుడో, మరుక్షణమో చలపతి తనను తీవ్రంగా దండిస్తాడని కూడా మంజరి భయపడింది. రానున్న సంక్షోభాన్ని ఎదుర్కోవడానికి సిద్ధపడుతున్నదానిమల్లే గొంతు సరిచేసుకుని, వోమూలగా వెళ్లి నిలబడింది మంజరి...

చలపతి కాలుస్తున్న సిగరెట్‌ను కిటికీలోగుండా అవతలకు విసిరేసి కుర్చీలో కూర్చున్నాడు. లాల్చీ చేతులు సగందాకా మడిచి, అరచేతులతో ముఖమంతా రుద్దుకొన్నాడు.

''ఇక ప్రారంభమవుతుంది''అనుకొన్నది మంజరి.

''రాత్రి వో పొరపాటు జరిగింది మంజరీ!'' అన్నాడు చలపతి చేతివేళ్ళు మొటిమలు విరుచుకొంటూ.

మంజరి బిక్కచచ్చిపోయినది.

''ఏమి''టని కూడా అడగలేకపోయింది.

''బాలాజీ మూవిటోన్ వారి షూటింగ్ కెళ్ళాను రామబ్రహ్మంగారు కూడా వచ్చార్లే. నళిని చాలా అద్భుతంగా నటించింది. బ్రహ్మాండమైన సెట్ వేశారు. పెద్దకొండ, కొండమీంచి ఓ సెలయేరు, దానివొడ్డున చిన్న కుటీరం, అందులో హీరో, హీరోయిన్లు ఫస్టు మీటింగ్...రావుగారు హీరో... ట్రమెండస్‌గా యాక్టు చేశారు. పిక్చర్ మొత్తంమీద అదే హైలెట్ అంటున్నారు... మేమసలు షూటింగ్ కెళ్ళాలనుకోలేదు. రామబ్రహ్మంగారితో మాట్లాడాక, ఇంటికెడతానన్నాను. ఆయన నన్ను కదలనిచ్చాడు కాదు. సరాసరి స్టూడియోకు తీసుకెళ్లాడు. కాదంటే బావుండదని 'సరే'నన్నాను. ఆ సంగతి ఏమాత్రం ముందు తెలిసినా, నిన్నూ తీసుకుపోదును...రావుగారితో పరిచయం ఉండటం చాలా అవసరం. ఆయన నిన్ను గురించి అడిగారు కూడాను...'' అన్నాడు చలపతి.

మంజరి ప్రాణం రెక్కొంది.

ఓసారి కళ్లు టపటపలాడించి ''ఏమన్నారండీ?'' అన్నది.

చలపతి చిరునవ్వు నవ్వాడు.

''ఏమంటారే పిచ్చిదానా! మనం ఎలాంటి అస్త్రం విసిరామంటావ్? బ్రహ్మాభేద్యమనుకో మంజరీ! రావుగారి మనుషులమీద మనం ఖర్చు చేసింది వృధాకాలేదు. నిన్ను గురించి ఆయన దగ్గర నుంచి ప్రచారం చేశారు. లేకపోతే పనిమాలా నన్నడగలవసిన అవకాశం ఆయనకేముందీ? 'వీలున్నప్పుడు ఆమెగారినోసారి కనిపించమనండి, అవకాశం వచ్చినప్పుడు, నేను తప్పకుండా చెబుతా'నన్నారు. లీడింగ్ హీరో ఆ మాత్రం భరవాసా యిచ్చాడంటే - నీ రొట్టె విరిగి నేతిలో పడ్డదన్నమాటే!'' అన్నాడు

చలపతి.

మంజరి మనస్ఫూర్తిగా మురిసిపోయింది.

"నన్ను గురించి మీరు చాలా శ్రమపడుతున్నారండీ! ఈరుణం ఎలా తీర్చుకోవాలో నాకు తోచకుండా ఉన్నది " అన్నది.

చలపతి సన్నగా నవ్వాడు.

'నువ్వా ధోరణి విడిచిపెట్టాలమ్మాయ్! నువ్వేదో పరాయిదానివయినట్లు మాట్లాడకు. ఇది ఇంకోరికోసం నేను చెయ్యడం లేదు. మనకోసం మనమే చేసుకొంటున్నాం. ఇందువల్ల వచ్చే లాభనష్టాలు మనవేగానీ, మూడోవాడికి దీనితో సంబంధం లేదు. కనక పదేపదే నువ్వు నాకు కృతజ్ఞతలు చెప్పడమూ, నేను వాటిని స్వీకరిస్తూ ఉండటమూ కుదరదు. సరా?" అన్నాడు చలపతి.

మంజరికి మాటల్లో చాలా అర్థాలు కనిపించాయి. ఇది ఎవరో ఇద్దరు భాగస్తుల మధ్య జరిగిన సంభాషణ తంతుగా ఉన్నది గానీ ఇద్దరు సన్నిహితుల మధ్య మాటల్లాగా లేవు. అంటే-చలపతి తనతో సగభాగానికొస్తున్నాడా?

"ఏమిటా పరధ్యాన్నం?"

మంజరి తేరుకుని "ఏమిలే"దన్నది.

"లేకపోతే నాకు స్నానానికి నీళ్ళు తోడరాదా?కళ్ళు భగ్గున మండిపోతున్నాయి. కాస్తంత కునుకుతీదామనుకొంటున్నాను.." అన్నాడు చలపతి.

మంజరి తాయారును పిలిచి చెప్పింది. చలపతి స్నానం చేసి వచ్చేలోగా కాఫీ కప్పుల్లోకి సర్దింది. చలపతి గళ్లలుంగీ చుట్టుకొని భుజం మీద తడితువ్వాలేసుకొని ఓ గుక్క కాఫీ తాగి కప్పును బల్లమీద పెట్టేశాడు.

"నళిని ఇంత చప్పున పైకొస్తుందనుకోలేదు మంజరీ! మొదట్లో ప్రొడ్యూసర్ల దగ్గరకు తీసుకెళ్లినప్పుడు ఎక్స్ట్రా వేషానిక్కూడా పనికిరాదన్నారు. ఆ పిల్ల తిరిగి వెళ్లిపోతానంది, నేనే ఆగమన్నాను. ఆ తరువాత దశ అందుకొంది. ఇవ్వాళ దాని రేటు పాతికవేలు. పదిహేను వేలు బ్లాక్ పుచ్చుకొంటుంది. ఈ ఇండస్ట్రీలో ఎంత ఇన్ఫ్లూయన్స్ ఉన్నదంటే-ఆవిడ మాట శిలాక్షరం. ఫలానా హీరోతో యాక్టు చెయ్యనంటే వాడిపని గోవిందా. ఫలానా కెమెరామెన్ ఉంటే తప్ప నేను సంతకం చెయ్యనంటే చచ్చినట్టుగా వాణ్ణి బుక్ చెయ్యవలసిందే! ఆవిడ మాటకు తిరుగులేదు. ఒకప్పుడూ ఎందుకూ పనికిరాదనుకొన్న అమ్మాయి చుట్టూ ఇవ్వాళ ప్రొడ్యూసర్లు డిస్ట్రిబ్యూటర్లు ఈగలు ముసిరినట్లు ముసురుతున్నారు" అన్నాడు చలపతి.

మంజరి తను లోగడ చూసిన సినిమాల్లోని నళిని రూపం జ్ఞప్తికొచ్చింది.

"ఆవిడ మీకంత బాగా తెలుసునంటున్నారు గదా! నా గురించి అడిగి చూడకపొయ్యారా. ఏదన్నా సాయం చేస్తుందేమో! అందులోనూ మీ మాటమీద గురికూడా ఉన్నదంటుంటిరి! అలా చేస్తే బావుండదూ?" అని సలహా ఇచ్చింది మంజరి.

"ఈ ఫీల్డులో అదల్లా ముడియాద్. నళిని తెలివితక్కువదయితే తప్ప, ఇలాంటి పనిచేయదు. తను ఎంత అవస్థపడి పైకి వచ్చిందీ ఆవిడ మరచిపోయి వుండదు. అలాగే మరొకరు రావడం ఆవిడకు గిట్టదు".

"ఎందుకనీ?" అన్నది మంజరి, ఆవిడ మనస్తత్వాన్ని అర్థం చేసుకోలేక.

"అదంతే! మరొకరు పోటీగా వస్తే, ఆవిడ రేటు పడిపోతుంది. పలుకుబడి తగ్గిపోతుంది. చేతులారా దోవనబోయే తద్దినాన్ని నెత్తినెవ్వరూ ఎక్కించుకోరు. సాయం చెయ్యడం మాట దేవుడెరుగు, కనీసం అడ్డుపుల్లలు వెయ్యకపోతే అంతే చాలు" అన్నాడు చలపతి.

మంజరికిదంతా అగమ్యగోచరంగా ఉంది.

"అయితే కొత్తవాళ్లొచ్చే మార్గమే లేదంటారా?"

"ఉంది. నేను చెబుతున్నదదే! ఓ ప్రొడ్యూసరో, డిస్ట్రిబ్యూటరో, కనీసం పలుకుబడి వున్న ఆర్టిస్టో మనల్ని సపోర్టు చేస్తుంటే తప్ప, మనకు బుకింగ్స్ రావు. వీళ్లందరికీ ఈ పరిశ్రమ మీద పలుకుబడి ఉంది. కాబట్టి వీళ్లందరితోనూ మనం మంచిగా ఉండాలి. వీళ్లను చాటుగా కూడా మాట అనకూడదు. 'అందరూ ఉత్తములే' అంటూ ఉండాలి. అన్నిటికన్నా ముఖ్యం- వాళ్లన్నమాటకల్లా తలూపుతూ ఉండాలి. దిక్కుమాలిన కుశంకలన్నీ పెట్టుకొంటే మట్టిగొట్టుకు పోతాం. ఇందులో పాపపుణ్యాల ప్రసక్తి లేదు. పాపమేమిటి, పుణ్యమేమిటి? డబ్బు లేకపోవడం పాపం. అది ఉండటం పుణ్యం. ఇంతకు మించిన సత్యం, నీకు ఏడేడు పధ్నాలుగులోకాల్లోనూ దొరకదు. పుణ్యవంతులు సుఖపడాలి కదా! ఈరోజున సుఖపడుతున్నవారెవరు? డబ్బున్నవాళ్లు అంటే వాళ్లు పుణ్యవంతులన్న మాటే! వారది సంపాదించిన మార్గం, అందుకే చేసిన పనులూ మంచివన్న మాటే! కాబట్టే వారిదగ్గర డబ్బు మూలుగుతూ ఉంటుంది. వాళ్లు సుఖపడుతూ ఉంటారు. దీన్ని చాతకాని సన్యాసులు వొప్పుకోరు. పాపమనీ, అన్యాయమనీ, అధర్మమనీ గొణుగుతూ ఉంటారు. తమ అసమర్థతను నొప్పుకోరు. ఈ మాటల వెనక తమ తెలివితక్కువను కప్పిపెట్టుకుంటూ వుంటారు. ఫలితమేమిటయ్యా అంటే, దరిద్ర్యంతో లుకలుకలాడిపోవడం, కాబట్టి నేను చెబుతున్నదేమిటంటే..."

చలపతి గొంతు పొడారిపోయి దగ్గు వచ్చింది. మంజరి కూజాలోంచి వో గ్లాసునీరు బల్లమీద ఉంచింది. చలపతి వో గుటకవేసి కాసిన్ని నీళ్లను జేబుగుడ్డమీద చిలకరించి కళ్లు తుడుచుకున్నాడు. తడి జేబుగుడ్డను, కుర్చీచేతిమీద ఆరవేశాడు.

"ఏం చెబుతున్నానూ?" అన్నాడు చలపతి. తనెక్కడ ఆపిందీ తెలీక.

"నేను చెబుతున్నదేమింటే-అన్నారు".

"ఏమిటంటే మంజరీ! ఒక పనిని మొదలెట్టకుండానే ఉండాలిగానీ, తీరా ప్రారంభించాక కుశంకలన్నీ పెట్టుకొని వ్యవహారాన్ని చేతులారా పాడుచేసుకోకూడదు. నువ్వింకా చిన్నదానివి. నాటకానుభవం ఉన్నదేమోగానీ అదిక్కడ దమ్మిడీకి కూడా పనికిరాదు. ఈలోకమే వేరు. పది మంది మనుషులు మన చేతుల్లో ఉండాలి. ఉండాలంటే వారి అవసరాలేమిటో మనం తీరుస్తూ ఉండవలసిందే! ఆ అవసరాలేమిటో అడక్కు. అవెలాంటివైనా మనం వొబ్లైజ్ చెయ్యాల్సిందే! అలాచెయ్యగలవారే పైకొస్తారు. నిష్ఠలూ, నియమాలూ పెట్టుకొందామంటే కుదరదు"అన్నాడు చలపతి.

హఠాత్తుగా మంజరికో అనుమానం కలిగింది. తనుగానీ పొరపాటున ఏదన్నా కానిమాట అన్నదా? ఆ ముక్కే చలపతిని అడిగేసింది.

"నో నో-నువ్వన్నావని గాదోయ్, పొరబాటున అంటావేమోనని నా భయం ఇప్పుడిప్పుడే వాతావరణం మనకు అనుకూలంగా మారుతూ ఉంది. రావుగారి మనుషులూ, మూర్తిగారి మనుషులూ నిన్ను గురించి ప్రచారం ముమ్మరం చేశారు. రేపో మాపో పత్రికల్లో నిన్ను గురించి వ్యాసాలూ నీ ఫొటోలూ వస్తాయి. ఇప్పుడికప్పుడే ఓ ఫిలిం కంపెనీ; అదే-మన వెంకటేశ్వర్లు గారిది మనచేతుల్లో కొచ్చింది. రావుగారికి నువ్వంటే మంచి అభిప్రాయం ఉంది. పది కంపెనీల్లో నీ పేరు వినపడుతూ

ఉంది. నువ్వు పైకి రావడానికి ఇదే గుడ్‌ఛాన్స్. ఇటువంటప్పుడే నువ్వు రవ్వంత నాక్‌గా మెలగాలి. ఔబ్‌లైజింగ్‌గా, ఔబిడియంట్‌గా ఉండాలి. నాలుగు పిక్చర్స్‌లో నాలుగు మంచిరోల్సు దొరికి, వాటిని నువ్వు జస్టిఫై చేశావో, నీ దివిటీ జేగీయమానంగా వెలిగిందన్న మాటే! అప్పుడు నీకిన్ని ఇబ్బందులుండవు; వాళ్ల వీళ్ల దయాధర్మాల కోసం నువ్వు దేబిరించనవసరం లేదు. నీకోసం, వీళ్లంతా చుట్టూ మూగుతారు. అప్పుడు చేయవలసిన పనులు వేరు. అప్పుడు మాట్లాడే ధోరణి వేరు. ఆ టైం వొచ్చినప్పుడు నేనే చెబుతాను. ప్రస్తుతం నువ్వు చెయ్యవలసిందల్లా, నేను జెప్పినట్లు వినడం, చెయ్యమన్నది చెయ్యడం. నువ్వీ వాతావరణానికి తగిన వ్యక్తివని నాకు తెలుసు...అవును గానీ మంజరీ! అసలీ విషయం ఎందుకొచ్చిందీపూట?'' అన్నాడు చలపతి.

మంజరికి బొత్తిగా జ్ఞాపకం లేదు.

''పోన్లేగానీ- ఆగూట్లో సిగరెట్ పెట్టి ఉంది, తెచ్చిపెట్టు''.

మంజరి సిగరెట్ తెచ్చి అతనినోటికందించి తనే వెలిగించింది.

చలపతి గట్టిగా రెండు గుక్కలు పొగతాగి, చిటికె వేసి సిగరెట్ నుసి రాల్చేశాడు.

''ఓ పనిచేద్దాం. మళ్లా ఆ శర్మగాడు మనకొంపకు రావడం నాకిష్టం లేదు. నేనెవెళ్లి వాడి మొహాన అయిదొందలూ పడేసి వస్తాను. వాడసలే తిక్కరాముడు. వస్తూ వస్తూ కొత్త ఫర్నీచర్ కూడా పట్టుకొస్తాను. ఈ దిక్కుమాలిన కుర్చీల్లో కూచోడమంటే చిరాకెత్తుకొస్తున్నది. అవును గదూ?''

మంజరి గుండెల్లో సన్నని కలవరం బయలుదేరింది. వెంకటేశ్వర్లు తనకు డబ్బిచ్చి పోయినట్లు చలపతికి యెలా తెలిసిందో మంజరికీ బోధపడలేదు. మెల్లగా లేచి వెళ్లి అలమారలోంచి పదిహేడు వందల రూపాయల నోట్లు తెచ్చి చలపతి చేతిలో ఉంచింది. చలపతి వాటినోసారి లెక్కించి చూశాడు.

''ఈపూటకు వెయ్యి చాలు. మిగతావి ఇంట్లో ఉంచు. వీలుంటే వెంటనే వస్తాను-లేదా అటునుంచి అటే రావుగారి దగ్గరకెడతాను. ఈపూట వారికి కాల్‌షీట్ లేదు. నాకోసం నువ్వు కనిపెట్టుకొని ఉండకు. డూప్లికేట్ కీ నా దగ్గరుంది గనక పర్వాలేదు''.

పదినిమిషాల్లో డ్రెస్ చేసుకొని చలపతి వెళ్లిపోయాడు. మంజరి రెండు కణతలూ నొక్కసారి గట్టిగా నొక్కుకుని కుర్చీలో కూచుంది.

'పోస్టు'

మనుషులొచ్చిందాకా ఆగకుండానే కాకీగుడ్డలవాడు దబ్‌ని ఓ కట్టపడేసి సైకిలెక్కి వెళ్లిపోయాడు. ఈలోగా తాయారు వెళ్లి దాన్ని తీసుకొచ్చింది.

''ఇదేదో పత్రికండీ అమ్మాయిగారూ!'' అన్నది తాయారు.

ఆ మాట వినగానే మంజరిలోకి కొత్త చైతన్యం వచ్చినట్లయింది. చేతులు గజగజ లాడాయి. వణుకుతున్న వేళ్లతో రేపర్ చించి, వంగిన మధ్యభాగాన్ని సరిచేసి ఒక్కో పేజీయే తిప్పసాగింది. మొదటి నాలుగు పేజీల్లోనూ తయారవుతున్న సినిమాలనీ, ఆడుతున్న సినిమాలవీ ప్రకటనలున్నాయి. ఆ తరువాత ఏవో వార్తలూ, విశేషాలూ, సినిమా తారల బొమ్మలూ, వాటికింద వ్యాఖ్యలూ ఉన్నాయి. ఆమె వేళ్లు గబగబా పేజీలను తిప్పేస్తున్నాయి. మధ్యపేజీలో పేజీకి మధ్యగా మంజరి బొమ్మ ఉంది. మంజరి మెదడులో దీపం వెలిగినట్లయింది. పదేపదే ఆ బొమ్మకేసి రెప్పార్పకుండా చూసింది. మెల్లగా ఆమె చూపులు పక్కలకు మళ్లాయి. ఆ బొమ్మకింద సంపాదకుడు వ్యాఖ్య రాశాడు.

"వైజయంతం నుండి దిగివచ్చిన అందాలకాణాచి మంజరి. ఆంధ్ర చలనచిత్ర రంగంలో అవతరించిన వినూత్న విశిష్ట తారామణి".

ఈ వాక్యాల్లో మంజరికి కొన్ని పదాలు అర్థం కాలేదు. "వైజయంతం" "కాణాచి" అంటే ఏమిటి? తనను తిడుతున్నట్లా,? పొగడుతున్నట్లా?

బొమ్మకు పై భాగాన పెద్ద అక్షరాల్లో "మకరంద మంజూష వంటి మంజరి రాక సినిమా పరిశ్రమ కొక వెలుగురేక" అని అచ్చేశారు. దానికింద చిన్న అక్షరాల్లో "రచన సత్యవాది" అని ఉంది. బొమ్మకు రెండువైపులా వ్యాసం ఉంది. ఆ వ్యాసాన్ని వొక్కసారిగా చదవలేకపోయింది మంజరి. నాలుగు పంక్తులు చదివాక మళ్లీ బొమ్మను చూసేది; పై హెడ్డింగూ, కింద వ్యాఖ్యా చదివేది; తిరిగి వ్యాసం చదవబొయ్యేసరికి-ఇందాక ఎంతవరకు చదివిందీ గుర్తు ఉండేది కాదు. అందుకని మళ్లా మొదటి నుండీ ప్రారంభించేది.

ఈపద్ధతిమీద మంజరి ఈ వ్యాసం పూర్తిగా చదివేసరికి రెండుగంటలసేపు పట్టింది. అందులోని కొన్ని పేరాలను పదేపదే చదువుకొంది మంజరి. ఆ పేరాలలోని విషయం ఆమెకు పూర్తిగా అర్థమైంది. అందుచేత హాయిగా ఆనందించగలిగింది.

"మంజరి అన్నపేరు గల అందాలరాశి మద్రాసు వచ్చిందని విని పత్రికాధర్మంగా ఆమె ఇంటికెళ్లాను. ఆమెతో దాదాపుగా రెండుగంటలసేపు గడిపాను...మంజరి విద్యావతి. ఆంధ్రసాహిత్యంలోని అనుపానులన్నీ ఆ చిన్నారికి కరతలామలకాలు. అభినయశాస్త్రం ఆవిడకు అభిమాన విషయం. వివిధ రసాలను పోషించడంలోని మెలకువలను ఆమె ఆకళించుకొంది. సంభాషణా చాతుర్యమంటే ఏమిటో మంజరి నుండి తెలుసుకోవాలనడం అతిశయోక్తి కాదు. గొప్పసంస్కారం కలిగిన ఈ వ్యక్తి చిత్రపరిశ్రమలోకి రావడం ఈ పరిశ్రమ చేసుకొన్నా పుణ్యమనడంలో తప్పులేదు"

మరో పేరా-

'  "మంజరి అప్సరాంగన అన్నా చాలదేమోననుకొంటాను. దివినుండి భువికి దిగి వచ్చిన శంపాలతికలాగా, పాలరాతిబొమ్మలా, మహాశిల్పి తీర్చిదిద్దిన స్వర్ణప్రతిమలా ఉంటుంది. మగువలను కూడా మోహింపచేయగల ఈ జగన్మోహిని త్వరలోనే వెండితెరమీద దర్శనమీయబోతూ ఉంది".

ఇటువంటి పంక్తులు వ్యాసంలో చాలా ఉన్నాయి.

మంజరి ఆకలిమాట కూడా మరచిపోయింది. ఆవిడకళ్లు కాంతితో మిలమిలలాడి పోతున్నాయి. ఉత్సాహం ఉవ్వెత్తుగా పొంగులు వారుతోంది. కన్నార్పకుండా తన బొమ్మకేసి మళ్ళా మళ్లా చూసుకొంటూ ఏవో లోకాలకు తేలిపోయింది.

❦❦❦❦❦❦❦❦

అనుకొన్న విధంగా ఆరుగంటలకల్లా వెంకటేశ్వర్లు కార్లో వచ్చాడు. అతన్ని చూసిందాకా మంజరికి, ఈ ప్రోగ్రాం సంగతి జ్ఞాపకమే రాలేదు. వెంకటేశ్వర్లు దొరబాబులా తయారయ్యాడు. మనిషి అల్లంత దూరాన ఉండగానే సెంటువాసన గుప్పుమంటోంది.

మంజరిని చూస్తూనే అతను నవ్వేశాడు. కొంపదీసి మంజరి ఇవ్వాళ ప్రోగ్రాం కాస్తా కాన్సిల్ చేస్తుందేమోనని అతని భయం.

మంజరి యథాశక్తి నవ్వింది. పత్రికలో తనను గురించి వ్యాసం వచ్చిన సంగతి వెంకటేశ్వర్లుకు చెప్పాలని ఆరాటపడింది. కానీ తనంతట తానే చెప్పడం బావుంటుందా? అథవా చెప్పినా సమయంగాని

సమయంలో చెప్పడం మంచిదా? తనీ రంధిలో పడి ప్రోగ్రాం విషయం మరచిపోయానంటే వెంకటేశ్వర్లు నొచ్చుకోకుండా ఉంటాడా?ఈ సందేహాలన్నీ మంజరికి తోచాయి. ఆవిడేమాటా మాట్లాడకముందే వెంకటేశ్వర్లు తొందరచెయ్యసాగాడు.

''నే వచ్చేసరికి నువ్వు రెడీగా ఉంటాననుకొన్నాను. నీ ధోరణి చూస్తే అలాలేదు. చలపతిగాడేమన్నా గొడవ చేశాడా? డొక్క చీరేస్తానని చెప్పు వెధవను... నువ్వింకా షాపింగ్‌కు వెళ్లినట్టు లేదు. అవునా? ఎందుకనిట?'' అన్నాడు వెంకటేశ్వర్లు.

''వెళ్లలేదని కలగన్నారా?'' అన్నది మంజరి.

''పిచ్చిదానా! ఇంతోసిదానికి కలలు కూడా కనాలా? నువ్వు షాపింగుకే వెళితే ఇంతదాకా నీ పర్చేజెస్ నాకు చూపకుండా ఉంటావా? ఉండవని నాకు తెలుసు''.

తనెట్లా ప్రవర్తిస్తే వెంకటేశ్వర్లు సంతోషిస్తాడో మంజరికి చూచాయగా తెలిసింది. అతడంటే తను వెర్రెత్తి పోతుంటుందని వెంకటేశ్వర్లు భ్రమపడుతున్నాడు. వెధవను పడనివ్వు. తనందుకు ఎంతమాత్రం బాధ్యురాలు కాదు. ఇప్పుడు తనేమని జవాబు చెప్పడం? సగం డబ్బు చలపతి పట్టుకెళ్ళాడనడం భావ్యం కాదు. ఈ సంబంధం చలపతికి కూడా తెలుసుననీ, అతని ఆమోదంతోనే, తనిందుకు వొప్పుకొన్నదనీ తెలియడంలో స్వారస్యం లేదు. ఇందువల్ల చలపతి స్థాయి పడిపోవడమే కాదు-తన స్థితి కూడా అదే మేరకు దిగజారిపోతుంది. చలపతి అనేవాడు ఉన్నా లేకున్నా తను వెంకటేశ్వర్లు కోసం తహతహలాడిపోవడం ఖాయమన్న భావం అతనికి కలగడమే ముఖ్యం. ఇందువల్ల తనకెన్నో ప్రయోజనాలున్నాయి.

''నాతోగానీ మాట్లాడకూడదనుకొన్నావా ఏమిటోయ్?'' అన్నాడు వెంకటేశ్వర్లు.

అతని ఉంగరాల మీద సాయంత్రపు నీరెండపడి జిగజిగమని మెరిసిపోతున్నాయని.

'ఈ మాత్రం మీకు తెలియకపోతుందా అనుకొన్నానుగానీ, మరేం లేదు. చలపతి మాట్లాడవద్దంటే మానుకొనే స్థితిలోనే నన్నుంచారా? ఏం మాయచేశారో గానీ, ఒక్క రాత్రిలో నన్ను పూర్తిగా ఆకట్టుకొన్నారు. చలపతిగారే కాదు, వారి హరబ్రహ్మాదులొచ్చినా నన్ను మార్చలేదు. అదిగాదండీ! నన్నొక్కదాన్నీ షాపింగుకు వెళ్లమన్నారు గదా, నేనలా వెడతానని మీరనుకొన్నారా? మీరు పక్కన లేకుండా నేనిక ఏ పనీ చెయ్యదల్చలేదు. పదేపదే ఈ విషయంలో నన్నింత బాధపెట్టకండి. మీరెప్పుడొస్తే అప్పుడే కొనుక్కొందాం. రావడానికి మీకు అవకాశం లేకపోతే కొనడమే మానేదాం. ఇంతలో ముంచుకుపోయిందేమిటిట?'' అన్నది మంజరి. అతని ముఖాన్ని జాగ్రత్తగా గమనిస్తూ.

వెంకటేశ్వర్లు పూర్తిగా కరిగిపోయాడు. గభాలున కుర్చీలోంచి లేచి గడపలో నుంచున్న మంజరిని తోసుకుంటూ గదిలోకొచ్చి ఆవిణ్ణి కౌగిలించుకొని వదిలేశాడు.

''లేడికి లేచిందే ప్రయాణమటండీ? దేనికైనా వేళాపాళా అంటూ ఉంది గదా!...మీరో పదినిముషాల పాటు అలా వరండాలో కూచోండి. ఈలోగా నేను చీరె మార్చుకుని వచ్చేస్తాను''.

వెంకటేశ్వర్లు అక్కణ్ణించి కదిలే ప్రయత్నమన్నా చెయ్యలేదు.

''వెళ్లరా?''

''ప్చ''

''అయితే నేనిలానే వచ్చేస్తాను''అన్నది మంజరి కళ్లింత చేసుకొని.

''నువ్వెలా వచ్చినా నాకభ్యంతరం లేదు. నాక్కావలసింది నువ్వుగానీ నీ డ్రెస్‌కాదు''.

''మీతో నేను వాదించలేను బాబూ. పదినిముషాలంటే, వొట్టుపెట్టినట్టు పదే నిముషాలు...ప్లీజ్!''

వెంకటేశ్వర్లు నవ్వుకొంటూ ఇవతలకొచ్చాడు. పదినిముషాలకు లోపుగానే మంజరి మేకప్ అయివచ్చింది.

"నన్నిప్పుడే నమిలేస్తారా?"

వెంకటేశ్వర్లు లేచి నిలుచున్నాడు.

"పదండి, తాళం వేసి వస్తున్నాను".

ఏడుగంటలకల్లా కారు మౌంట్‌రోడ్డు మీద పాములా జారిపోతోంది. వెంకటేశ్వర్లే డ్రైవ్ చేస్తున్నాడు. మంజరి అతని పక్కనే కూచున్నది. అతనేదో చెప్పుకుపోతున్నాడు. ఆవిడ వింటున్నట్టు లేదు.

ఓ పెద్దషాపు ముందు కారాగింది. ఉయ్యాలలాగా రెండు మూడుసార్లు పైకీ కిందికీ ఊగింది కారు.

"ఊఁ దిగు మరి!" అన్నాడు వెంకటేశ్వర్లు.

మంజరి చిరునవ్వుతో పైట సరిచేసుకొంటూ, సీటుమీద తలుపుదాకా జరిగి ఓ కాలు కిందబెట్టి ఛటుక్కున నోటికి చెయ్యడ్డం పెట్టుకొని చాపిన కాలును లోపలికి తీసుకొంటూ, "ఇప్పుడు కాదు-పోదాం పదండి" అన్నది దీనంగా.

"ఏం?" అన్నాడు వెంకటేశ్వర్లు దిమ్మరపోయి.

"నాఖర్మ కాలి, అన్నీ వొక్కసారే వనగూడాయి. మీ మాటల సందట్లో పడి బాగ్ తీసుకురావడం మరచిపోయాను. డబ్బంతా అందులోనే ఉండిపోయింది".

వెంకటేశ్వర్లు నిర్లక్ష్యంగా నవ్వాడు.

"ఓస్. ఇంతోసి దానికేనా నొచ్చుకోవడం? ఫర్వాలేదులే, నాదగ్గరుంది".

మంజరి తటపటాయించినట్టు ఓ నిముషం అభినయించింది. వెంకటేశ్వర్లు ఆవిడ చెయ్యి పుచ్చుకొని కారులోంచి దించాడు. వాకిట్లో పొడవాంటి తలగుడ్డ చుట్టుకున్న దర్వాన్ ముందుగా సలాం చేసి ఆ తర్వాత తలుపుతీసి, వారు లోపలికొచ్చాక అటుతిరిగి నవ్వుకున్నాడు.

వీళ్ళను చూస్తూనే చాలాకాలం నుండీ ఎరిగున్న మాదిరిగా నలుగురైదుగురు వ్యక్తులు రకరకాల నమస్కారాలు చేసి ఇంగ్లీషు పద్ధతితో ఆహ్వానించారు.

అటువంటి సమయాల్లో యేం చెయ్యాల్లో మంజరికి తెలీదు. తిరిగి తను దణ్ణం బెట్టాలా? వెంకటేశ్వర్లు పెట్టలేదు. తలతోటీ, పెదవులతోటీ చేసి చేయనట్టు నమస్కారమంటున్నాడని తను అనుకొంది. ఇవి చాలా ప్రమాదకరమైన ఘట్టాలనీ, తను వెంకటేశ్వర్లును గమనించడమే తప్ప గత్యంతరం లేదనీ మంజరి నిశ్చయించుకొంది.

"శారీస్" అన్నాడు వెంకటేశ్వర్లు ఓ సిగరెట్ అంటించి.

"వన్ మినిట్".

ఓ యాభైరకాల చీరెలు వారి ముందు పరిచారు. వాటిని చూసి మంజరి దిమ్మెరపోయింది. ఇన్ని రకాల చీరలను ఆవిడింతకు ముందెన్నడూ చూడలేదు.

"చూడు మంజరీ. నీ కేవేం కావాలో సెలక్టు చేసుకో. మనం తొందరగ తెమలాలి".

మంజరికి వాటన్నింటిని కొనెయ్యాలని ఉంది. దేని అందం దానిదే! దేని ప్రత్యేకత దానిదే! ఒకదానికీ, మరొదానికీ పోలికే లేదు. నిజంగా మంచి గుడ్డలను ఎన్నుకోవడం చాలా కష్టమనుకొంది మంజరి.

"మీరూ చూడండి"అన్నది మంజరి మెల్లగా.

"నో, నో! ఆ రెస్పాన్స్‌బిలిటీ నామీదుంచకు. నచ్చిన వాటిని సెలెక్టు చేసుకోవడం నీ వంతు. బిల్ ఇచ్చేయడం నా వంతు" అన్నాడు వెంకటేశ్వర్లు నవ్వుతూ.

అతను మంజరిని రాచుకొంటూ నిలబడ్డాడు. ఆవిడ ఏదో మిష మీద అవతలికి జరిగితే తనూ జరుగుతున్నాడు.

అరగంటకల్లా మూడు చీరెలను, మరో అయిదురకాల జాకెట్ గుడ్డలను సెలక్టుచేసింది మంజరి.

"వెరీ లో పర్చేజింగ్ మేడమ్!" అన్నాడు సేల్సుమాన్.

వెంకటేశ్వర్లు ఏడువందల రూపాయల నోట్లిచ్చి కొద్దిగా చిల్లర నోట్లు తీసుకొని "వుయ్ మేక్‌యె మూవ్" అన్నాడు.

దర్వాన్ మెట్లు చివరదాకా వచ్చి సలాం చేసి నిలుచున్నాడు.

"ఏందబ్బీ?" అన్నది మంజరి.

వెంకటేశ్వర్లు ఓ రూపాయనోటు వాడిమీదికి విసిరేసి, కారును స్టార్ట్‌చేశాడు.

"చీరెలు నచ్చాయి గదూ?" అన్నది మంజరి, పొట్లాంకేసి మరోసారి సంతృప్తిగా చూసుకొంటూ.

వెంకటేశ్వర్లు మాట్లాడలేదు. పోలీస్ సిగ్నల్ కేసి కన్నార్పకుండా చూస్తున్నాడు.

"ఇంటికేనాపోవడం?" అన్నది మంజరి, పళ్ళుబిగబట్టి వెంకటేశ్వర్లును రాచుకునేలాగా దగ్గరకు జరుగుతూ.

"ఇంటికే. ఈలోగా వోసారి హొటల్ కెడదాం".

కారు సర్రున వలయంగా తిరిగి గేటుదగ్గర ఉయ్యాలలూగి ఓ పెద్ద తోటలోకొచ్చింది. అక్కడ చెట్లకన్నా కార్లెక్కువగా ఉన్నాయి. దీపాల కాంతిపడి రోడ్డంతా మిలమిలలాడిపోతోంది. వెంకటేశ్వర్లు తన కారు నోమూలగా ఆపాడు.

మంజరి వయ్యారంగా కారు దిగింది.

"కాటేజ్ నెంబర్ ఫిఫ్టీన్" అన్నాడు వెంకటేశ్వర్లు ఓ సూట్‌వాలాతో.

అతనొకసారి చేతిలో వున్న నోట్‌బుక్‌ను కిందికి మీదికి చూసి "తమపేరు వెంకటేశ్వర్లుగారాండి?" అని అడిగి సమాధానం వినకుండానే చెట్ల మధ్యగా తీసుకెళ్ళి చిన్న ఇంటి ముందాగాడు.

"ఇప్పుడే బోయ్‌ను పంపిస్తాను. మీ టేబిల్ మీద మెమోకార్డ్ ఉంది. ఏంకావాలో ఫోన్ చెయ్యండి. ఇవ్వాళ ఉదయమే ఫారిన్ స్టఫ్ తెప్పించాను. వెరీ లిమిటెడ్ స్టాక్".

ఇంగ్లీషు అసలేమీ రాకపోతే లాభం లేదని మంజరి నిర్ణయించుకొంది.

"ఈ వూళ్లో ఎక్కడ చూసినా ఇంగ్లీషు ధారాళంగా మాట్లాడేస్తున్నారు. వారేమంటున్నారో తెలుసుకొని జవాబులియ్యకపోతే గొడ్డును చూసినట్టు చూస్తారు. ఇంగ్లీషు రాకపోతే ఇక్కడ నెగ్గుకురావడం కష్టం" అనుకొన్నది మంజరి.

"అలా బెదిరిన గొడ్డులా అన్నిటికేసీ ముఖమింత చేసుకొని చూడకూడదు. చూశామంటే మనల్ని గమార్లకింది జమకట్టేస్తారు. ప్రతిదాన్నీ చాలా నిర్లక్ష్యంగా చూస్తుండాలి. ముఖ్యంగా డబ్బు విషయంలో వెనకా ముందూ చూడకూడదు. ముందు నువ్వు కూచో" అన్నాడు వెంకటేశ్వర్లు.

మంజరి సోఫామీద జాగ్రత్తగా కూచుంది.

''అలా కాదోయ్, జార్లబడి కూచోవాలి. సుతారంగా కాళ్లూపుతుండాలి. చేతుల్ని ఎప్పుడోగానీ కదిలించకూడదు. ఎటో చూస్తూ సమాధానాలివ్వాలి. మధ్యమధ్య గడియారం కేసి చూసుకొంటూ ఉండాలి. అన్నట్టు నీకువాచ్‌లేదు కదూ? రేపొకటి కొందాం. మోచేతుల దాకా ఈ గాజులుండకూడదు. కుడిచేతిలో డైమండ్ బాంగిల్ చాలు. ఎడం చేతికి చిన్నవాచ్. ఈ రావలపాడు ఆకుచెప్పులు చెత్తకుండీలోకి గిరాటెట్టు. నాలుగైదు జతల హైహీల్ శాండిల్సు కొందాం''.

ఇంకెంతసేపు చెప్పేవాడోగానీ బాయ్ వచ్చి సలాం చేసి నిలుచున్నాడు.

''త్రీ డాగర్స్ హాఫ్ బాటిల్, బన్, బట్టర్, జామ్, అయిస్ సోడా, చికెన్ బిరియానీ''.

అతను వొంగి అలానే రెండడుగులు వెనక్కు వేసి వెళ్లిపోయాడు.

''ఇక్కడింత చల్లగా ఉందేం?'' అన్నది మంజరి.

''ఎయిర్‌కండిషన్డు కాటేజ్!''

''అంటే?'' అందామనుకొంది మంజరి. కానీ అనలేదు. ఆ మాట అంటే తనను మరింత వెర్రిబాగులదానికింద జమకడతాడేమోనని మంజరి అనుమానించింది. వెంకటేశ్వర్లే కాదు- ఎవరైనా సరే-తనకేమీ తెలియదనీ, తనో ఎద్దు మొద్దు స్వరూపమనీ అనుకోవడం మంజరి కిష్టంలేదు. అందుకని ఎయిర్ కండిషన్డ్ కాటేజ్ అంటే తెలిసిపోయినదానిలాగా ''అలాగా, నేనూ అదే అనుకొన్నానులెండి'' అన్నది మంజరి.

వెంకటేశ్వర్లు కాలుస్తున్న సిగరెట్‌కే మరో కొత్త సిగరెట్ అంటించాడు. అతన్ని మూడ్స్‌లోకి లాగాలనుకొంది మంజరి.

''మనమిక్కడ కెందుకొచ్చినట్లో చెప్పారు కాదేం?'' అన్నది నవ్వును పెదవులదాటి రానివ్వకుండా.

''తెలీదా?''

''ఉఁహు?''మీరు చెప్పండి నాకెలా తెలుస్తుందీ?'' అన్నది మంజరి.

''ఇప్పుడప్పుడే చెప్పను. ముందో చుక్క వేసుకోవాలి. కాస్త మేతపడాలి. అప్పుడడుగు తప్పకుండా చెబుతాను...'

''ఇంతోసిదానికి ఇక్కడదాకా రావాలా? ఈ గదుల్లో తప్ప మరెక్కడా కూచోరాదా?-ఆ గదిలో మంచం కూడా వుందే!''

వెంకటేశ్వర్లు ఏం చెప్పేవాడో గానీ, అంతలోనే బోయ్ ఓ పెద్ద ట్రేలో బుట్టెడు సరంజామా తెచ్చి బల్లమీద ఉంచిపోయాడు. అతని వెనకనే వెంకటేశ్వర్లు కూడా వెళ్ళి, తలుపుకు గడియ బిగించేశాడు.

''అదేం?'' అన్నది మంజరి, అమాయకంగా ముఖం పెట్టి.

''వన్‌మినిట్'' అంటూ వెంకటేశ్వర్లు, సీసాలోంచి నురగలు కక్కుతున్న ద్రవపదార్థాన్ని గ్లాసుల్లోకి కొద్దిగా వొంపాడు. మిగతా ఖాళీని సోడాతో నింపేశాడు. తనొకటి తీసుకొన్నాడు. మంజరికేసి చిరునవ్వు నవ్వుతూ చూసి ''ఊఁ'' అన్నాడు, తీసుకోమని సైగచేస్తూ.

''నాకొద్దు బాబూ! సయించదు''అన్నది మంజరి, ముక్కును చిట్లిస్తూ.

''నాన్సెన్స్! సయించకపోవడంలో అర్థంలేదు. అసలిందుకే నిన్నిక్కడకు తీసుకొచ్చింది. మనం రోజూ తినేతిండి, ఇక్కడే తినక్కర్లేదు. ఊఁ...ప్లీజ్'' అన్నాడు వెంకటేశ్వర్లు.

''నాకా వాసన గిట్టదండీ బాబూ! చూశారా-అప్పుడే కడుపులో తిప్పుతోంది. అబ్బ!'' అంటూ ముక్కు మూసుకొంది మంజరి.

వెంకటేశ్వర్లుకు నిజంగా కోపమేవచ్చిందో, లేక కోపం వచ్చినట్లు అభినయించాడో తెలీదు గానీ, ఠపీమని గ్లాసును బల్లమీద పడేసి లేచి నిలుచున్నాడు.

''అయితే వెడదాం పద! లే మరి!!'' అన్నాడు పెద్దగా.

మంజరి గుండెలు అదిరిపోయాయి. వెంకటేశ్వర్లుకు నిజంగా కోపం వచ్చిందనే నమ్మింది. ఇతని మీదనే తన భవిష్యత్తంతా ఆధారపడి వుంది. ఇతను చేయి జారవిడిస్తే- ఒక్కడుగు తను ముందుకెళ్ళలేదు. అంటే-తనిప్పుడు-ఆ పాడువాసనగొట్టే నీళ్ళు తాగడమో, తాగకపోవడమో అన్నదానిమీద, తన బ్రతుకంతా ఆధారపడి ఉండటం దురదృష్టకరం. నిజంగా-ఎంత స్వల్ప విషయాల మీద మానవుల జీవితాలు ఆధారపడి వుంటాయో చూస్తుంటే అమితాశ్చర్యంగా వుంటుంది.

''లేవనుగూడా లేవవన్న మాట. అయితే నేను వెడుతున్నాను''.

''నేను లేవనన్నానా? అవసరమయితే మీరే వచ్చి-ప్లీజ్! కొంచెం చేయూత నివ్వకూడదూ?'' అన్నది మంజరి, అతన్ని నిండారా చూస్తూ.

మంజరి చూపుల్లో ఓ విచిత్రమైన శక్తి వుంది. అవసరాన్ని బట్టి ఆ శక్తి రకరకాల రూపాలు ధరిస్తూ వుంటుంది. అది స్వతహాగా ఆమెలో ఉన్నది కాదు. తన పరిసరాల నుండి సంతరించు కొన్నదాశక్తి. ఒక్కొక్కసారది యమపాశంలా మారుతుంది. ఇంకోసారి వ్యక్తిలోని ఇంద్రియ వాంఛలను రెక్కొడుతుంది. మరోసారి ఎదుటివారిని నిరుత్తరులను చేస్తుంది. కొన్ని సమయాలలో కన్నీరు కార్పిస్తే, మరికొన్ని సమయాలలో తూష్ణీంభావాన్ని అభివ్యక్తం చేస్తుంది. ఆ శక్తి ఎప్పుడూ ఆమె స్వాధీనంలోనే ఉంటుంది. ఏ అవతారం ఎత్తమంటే ఆ అవతారం ఎత్తుతుంది. ఏం పనిచెయ్యమంటే గుట్టుచప్పుడు కాకుండా ఆ పనిచేస్తుంది.

మంజరి ఇప్పుడా శక్తిని అవాగాహన చేసింది.

''వెంకటేశ్వర్లుగాడి కోపం తగ్గించు'' అన్నది మంజరి.

మరుక్షణంలోనే అతనికోపం కాస్తా దిగజారిపోయింది.

''అతన్ని నాదగ్గరకు లాక్కురా'' అన్నది మంజరి.

వెంకటేశ్వర్లు అడుగులో అడుగు వేసుకొంటూ దగ్గరగా వచ్చాడు.

మంజరి పకపకమని నవ్వింది. ఆ నవ్వుతోనే సుడులు తిరిగిపోయింది. వెంకటేశ్వర్లు అయోమయంగా ఆమె సోఫా ముందు నిలబడి వున్నాడు. అప్రయత్నంగా కుడిచేయి ముందుకు చాపాడు. మంజరి నవ్వును అన్వయించుకొంటూ, అతని చేతిని పట్టుకొని ఓ లాగు లాగి, ఆ ఊపుతో తను లేచి వెళ్ళి, అతని గుండెల మీద పడి, అతన్ని చిన్నగా చుంబించింది.

''అంత కోపమయితే ఎలానండీ? నేను సరదాకోసం సయించదన్నాను. కోపమొస్తే మీరెలా వుంటారో చూదామని బుద్ధిపట్టింది. క్షణంలో కోపం తెప్పించాను...ఎంత బావున్నారని? బాబూ, మీకో నమస్కారం! అనవసరంగా మీరు కోపగించుకొని, నా ముందు నిలబడకండి. అప్పుడు నేనేమన్నా చేస్తే నాది పూచీలేదు. ''అయ్యో మంజరిలా వెర్రెత్తిపోయి నామీద పడిపోయిందేమిటా'' అని మీరనుకొన్నా లాభం లేదు; అన్నా లాభం లేదు. ఊఁ గో(అ)న్ రెడీ'' అన్నది మంజరి, అతన్ని గూడుతో ఓ పోటు పొడిచి.

వెంకటేశ్వర్లు అప్పటిగ్గానీ తేరుకోలేదు. ముందుగా తనోగుక్కతాగి, నాలుకతో పెదవులు తడుపుకొంటూ అదే గ్లాసును మంజరి కందించాడు. ఆవిడ శరీరమంతా గరిపొడిచింది. ఘాటైన మద్యపు వాసనతో తలతిరిగిపోయినట్లయింది. కానీ తాగకుండా వుండేందుకు వీల్లేదు. ఇప్పటికే ఈ వెధవ నానాయాగీ చేశాడు. దాన్ని సర్దుకోవడానికి తాతలు దిగిరావలసి వచ్చింది. ఇప్పుడేమిటి చేయడం?

"ఊఁ-హావిట్!" అన్నాడు వెంకటేశ్వర్లు గ్లాసును మంజరి పెదవులకానించి.

తనకే ఇంగ్లీషు వచ్చి వుంటే, ఎంచక్కగా వుండేది. ఏదో, "బాస్, పీస్, కాస్" మంటూ మాట్లాడేది. ఇంగ్లీషు రాకపోవడం ఎంత ప్రమాదం!

వెంకటేశ్వర్లు, ఈలోగా మరో గుక్కతాగి, సోఫాలో కూచున్నాడు. మంజరిని తన పక్కగా కూచోబెట్టుకున్నాడు. దాదాపు-బలవంతంగా ఆమెచేత రెండు గుటకలు తాగించాడు. ఆవిడ పెదవులంటిన చోటనే, తనూ పెదవులుంచి, గ్లాసు మొత్తం ఖాళీ చేశాడు. ఆ తరువాత ఇన్ని జీడిపప్పులు తీసుకుని కసాబిసా నమిలాడు. కాసిని పప్పులు మంజరిచేత కూడా తినిపించాడు.

"ఇందులో వున్న గమ్మత్తే యిది మంజరీ! ఎంత పుచ్చుకో, మనిషికేమీ డేంజర్ వుండదు. మధ్యమధ్య ముక్క కూడా పడుతుండాలి. అందుకే పెద్దవాళ్ళు "చుక్కా, ముక్కా-అక్కాచెల్లెళ్లు" అన్నారు. మరో ట్రిప్ కానిద్దామా?"

మంజరి కతని మాటలయితే వినపడుతున్నాయి. అర్థం కూడా అవుతున్నాయి. కానీ, జవాబే చెప్పబుద్ధి కావడం లేదు. మాటలు వొకదానితో మరొకటి కలిసిపోయి, మెలికల గొలుసులాగా తయారయిపోతున్నట్లనిపించింది. అప్పుడు తనా చిక్కుముడిని విప్పలేనని కూడా అనిపించింది.

"ఎలా వుంది?" అన్నాడు వెంకటేశ్వర్లు, గ్లాసులోకి మళ్లా వొంపుతూ.

మంజరి నవ్వింది. తను నవ్వుతున్నానని కూడా అనుకొంది.

"మరింకేం? మందు ఇప్పుడిప్పుడే పనిచేస్తోందన్నమాట! ఫారెన్ లిక్కర్స్ బ్రహ్మాండంగా ఉంటాయనుకో డార్లింగ్! మరింత నాటు సరుకు సంగతి, నాముందనకు. మరో రెండు డోసులే. రెండంటే రెండే రెండు వేసికొను చూడు-స్వర్గం నీముందుండపోతే అప్పుడడుగు. ఊఁ...కమాన్!"

ఈసారి మంజరి శరీరం ఆవిడ స్వాధీనంలో లేదు. అతను గ్లాసందిస్తే ఖాళీ చేసిందాకా వదల్లేదు. పేగులు భగ్గున మండిపోతుంటే, ఇన్ని జీడిపప్పులు గబగబా నమిలింది. తరువాత మాంసం ముక్కలు పక్కకు నెట్టి, ఇంత బిరియానీ కూడా తిన్నది. ఆ మసాలా వాసన శరీరమంతటా పాకి పేరుకుపోయినట్లనిపించింది మంజరికి.

"ఇంకోసారి-ఆఁ-వెయ్యనా?" అన్నాడు వెంకటేశ్వర్లు.

అతని చేతులు గాలిలో తేలిపోతున్నాయి. గ్లాసును రెండు చేతులతోనూ పట్టుకొన్నాడు.

"నన్నిక వొదిలిపెళ్టండి. మీకు దండం పెడతాను" అన్నది మంజరి, సోఫాలో జారగిలబడి.

"దట్సాల్. నువ్విక ఆగలేవు" అన్నాడు వెంకటేశ్వర్లు నవ్వుతూ.

"అతను నవ్వుతున్నాడు" అనుకొంది మంజరి.

"పోనీ, నువ్వో పనిచెయ్యిడార్లింగ్! వెళ్ళి ఆ మంచం మీద పడుకో. పది నిమిషాల్లో నేనూ వచ్చేస్తాను".

మంజరికామాటలన్నీ వినిపించాయి. కానీ లేవలేకపోయింది. ఎవరో తనలో నుంచి బరువునంతా తీసేసినట్లూ, తను దూదికన్నా తేలికగా అక్కడెక్కడికో తేలిపోతున్నట్లూ అనిపించింది.

''ఇంతటితో ఈ పీడ వదలిపోతే బావుణ్ణు! కానీ వీడు వదలడు'' అనుకొంది మంజరి.

గాలి బిగబట్టి, బలాన్నంతా కూడదీసుకుని సోఫాలోంచి లేచింది.

ఆ ఊపుకు చుట్టూ వున్న వస్తువులన్నీ కిందికి దిగజారాపోయినట్లయింది. అడుగులు వేస్తుంటే, ఎవరో వెనకనించి తోస్తున్నట్లుగా వుండి, తిరిగిచూసింది మంజరి. వెంకటేశ్వర్లు సీసాను ఖాళీ చేస్తున్నాడు. మరోచెంప దున్నపోతు నెమరువేస్తున్నట్లుగా చారెడు వెడల్పున దవడలను, పెద్ద చప్పుడుతో కదిలిస్తున్నాడు.

'దున్నపోతు, దున్నపోతు' అని గొణిగింది మంజరి.

ఎటూ తూలకుండా, సరాసరి మంచం దగ్గర కెళ్ళి, వొక్కసారిగా వాలిపోయింది. మెత్తని మబ్బుల్లో పడుకొన్నట్లుగా వుంది. మంజరి బరువుకు మంచం పైకీ కిందకీ ఊగి సర్దుకొంది. తల దగ్గర ఆకు పచ్చదీపం మందంగా వెలుగుతోంటే, దాన్నోసారి చూపి, శరీరాన్ని మంచం మధ్యకు చేర్చింది మంజరి. ఆమెకు సమానస్థాయిలో చుట్టూ వున్న పరుపు కూడా కప్పుకుపోయింది. ఆవిడ ఎటు దొర్లితే అటుగా మంచమంతా వొరిగిపోతున్నదనిపించింది.

'ఎంతబావుందీ మంచం!'

తరువాత ఏమనుకొన్నదీ మంజరికి జ్ఞాపకం లేదు. కానీ ఏదో జరుగుతున్నదనిపించింది. ఆవిడకు పరిసరాలన్నీ అలుక్కుపోయి కనిపించసాగాయి. తన శరీరాన్ని ఎవరో సాగదీస్తున్నట్లూ, విరిచేస్తున్నట్లూ లీలగా జ్ఞాపకం! నిజంగా ఆ నిమిషాన ఏం జరిగిందో ఆ తరువాత కూడా మంజరికి తెలీదు. అది తెలిసిన వ్యక్తి వొక్కడే! అతనెటుగూడీ ఆ విషయం మంజరికి చెప్పడు. చెప్పమని ఆవిడ కూడా అడగదు.

-కలలోంచి తేరుకున్నట్లుగా, అట్టడుగు నీళ్ళ నుంచి పైకి తేలుతున్నట్లుగా, మంజరికి స్పృహ రాసాగింది. తన నోరు తనకే అసహ్యం వేసి, మెడతిప్పి, కాండ్రించి గోడమీద ఉమ్మివేసింది. తనమీదకు బరువుగా వాలిపోయిన శరీరాన్ని బలవంతంగా పక్కకు తొలగించి లేచికూచున్నది. చేతులు గాలిలోకి ఝాడించింది. మెడ అటుఇటూ తిప్పి విరుచుకొంది. అలవాటు చొప్పున జాకెట్ గుండీలు సర్దుకొనబోయింది. ఓ క్షణం-రిచ్చపడి-వెంటనే వెంకటేశ్వర్లు కేసి అసహ్యంగా చూసి చప్పున మంచం దిగిపోయింది.

'అడవిదున్న' అనుకొంది మంజరి.

ఆవిడ కళ్ళు మెరమెరలాడుతున్నాయి. కడుపులో కవ్వంబెట్టి చిలుకుతున్నట్టుగా వుంది. తేన్పు వచ్చినప్పుడల్లా, దుర్గంధపూరితమైన వాయువు వెలువడి ఆమె తల తిరిగిపోతూ వుంది. సోఫాలో జారగిలపడి కూచుంది. బల్లమీద ఇందాకటి గ్లాసులు, సీసాలు కనిపించాయి. బల్లచుట్టూ మెతుకులు, ఎముకల ముక్కలు చిందరవందరగా పడిపోయి వున్నాయి. మంజరి శరీరం రోమాంచితమయింది. ఓ గ్లాసును విసురుగా గోడకేసి కొట్టింది. పెళ్ళుమని చప్పుడుతో అది ముక్కలు ముక్కలయి, గాజు పెంకులు అంతటా చిందిపడ్డాయి.

''ఏమిటది?'' అన్నాడు వెంకటేశ్వర్లు. ఓ చేతిమీద లేచికూచుని ''గ్లాసు పగిలిందేం?'' అన్నాడు.

మంజరి మాట్లాడలేదు.

''చెయ్యిగానీ తగిలిందా?''

''ఊఁ''

''టైమెంత?'' అంటూనే వెంకటేశ్వర్లు తన వాచీని చూసుకొని 'అబ్బో' అన్నాడు.

''ఎంత?''

''ఒకటిన్నర''

''అబ్బా!''

అతను లేచాడు. చన్నీళ్లలో జేబుగుడ్డను తడిసి, ముఖమంతా తుడుచుకొన్నాడు. రెండు మూడు దఫాలు పుక్కిలించాడు. మంజరిని కూడా అలా చెయ్యమన్నాడు. ఫోన్‌చేసి బోయ్‌తో రెండు స్ట్రాంగ్ టీ, బిల్లూ పంపమన్నాడు.

మళ్ళా నిశ్శబ్దం.

దూరంగా వున్న కాటేజీల నుండి అప్పుడప్పుడు నవ్వులు, సోడాలు కొట్టిన చప్పుళ్లు, ఇంగ్లీషు మాటలు సన్నని సంగీతంతో కలిసి వినిపిస్తున్నాయి. మంజరికి మాట్లాడేందుకు కారణం దొరికింది.

''తెల్లవార్లూ, ఇక్కడ ఇలానే జరుగుతుంటుందా?'' అన్నది మంజరి.

''ఆఁ! రాత్రింబవళ్ళూ యీ హొటల్ ఇంత బిజీగానూ వుంటుంది. మనమంటే పెందరాడే పోతున్నాం గానీ-అలా కాదులే మంజరీ! మరోసారి మనం కంప్లీట్‌గా ఓ రాత్రల్లా ఎంజాయ్ చేద్దాం'.

బోయ్ టీ కప్పులు, బిల్లూ ఓ ట్రేలో పెట్టుకొచ్చాడు. బిల్లు డెబ్భై రెండు రూపాయల చిల్లరయింది. వెంకటేశ్వర్లు డెబ్భయ్యయిదు రూపాయలిచ్చి 'టేకిట్' అన్నాడు.

''థాంక్యూ సార్, థాంక్యూ మేడమ్!''

''నో మెన్షన్'' అన్నాడు వెంకటేశ్వర్లు.

మంజరికి 'నో' అన్న అక్షరం మాత్రమే వినిపించింది. మిగతావి వినపడలేదు. అందుకని తను కూడా 'నో' అన్న ముక్కను పెద్దగా అని; మిగతా వాటిని దాదాపు ఏమీ వినిపించకుండా గొణిగింది.

కారు దగ్గరకు రావడం కష్టమయిపోయింది. వెంకటేశ్వర్లు ఆమె నడుం చుట్టూ చెయ్యివేసి, మధ్యమధ్య వేళ్లతో పొట్టమీద కితకితలు పెడుతూ కారు దగ్గరకు తీసుకొచ్చాడు. చాలాసేపు ఆరుబయట ఉండడం చేత కారు స్టార్టు కాలేదు.

''ఏమయింది?'' అన్నది మంజరి.

వెంకటేశ్వర్లు పలకలేదు. మరోసారి ట్రయ్ చేశాడు. కాసేపు ఇంజన్ గిర్ గిర్‌మని రొదపెట్టి, స్టార్టయింది. చల్లనిగాలి ముఖానికి తగిలాక, ప్రాణం తేరుకున్నట్లుగా వుంది మంజరికి. వెంకటేశ్వర్లు కారును విపరీతమైన వేగంతో నడుపుతున్నాడు.

''నిన్నింటి దగ్గర దిగబెట్టనా?'' అన్నాడు వెంకటేశ్వర్లు గేరు మారుస్తూ.

''మరెక్కడికన్నా పట్టుకుపోతారా?''

అతను నవ్వాడు.

''అడవిదున్న నవ్వే!'' అనుకొంది మంజరి.

ఇంటికి చేరేసరికి రెండు గంటలయింది. దూరంగా సినిమా స్టూడియోల నుండి. ఏదో పాట ముక్కలు ముక్కలుగా వినపడుతోంది. అది మినహాయిస్తే అంతటా ఘనీభవించిన నిశ్శబ్దం.

అతను చీరెల పొట్లం అందించి, చేయి చాపాడు. మంజరి తన చేతినందించింది. వేళ్ళు నలిగిపోయే ఓసారి గట్టిగా నొక్కి, అరచేతిలో గీరి మరీ నవ్వాడు వెంకటేశ్వర్లు. మువ్వలు కదలినట్లు నవ్వింది మంజరి.

కారెళ్ళిపోయింది.

"అమ్మయ్య! పీడా వదిలింది" అనుకొన్నది మంజరి. "అంతా అడవిదున్న తంతు. ఈ వేళ్ళు మరో వారం రోజులదాకా ఎందుకు పనికిరావు".

వరండాలలో కొచ్చేసరికి "అమ్మగారూ!" అంటూ తాయారు లేచి కూచున్నది.

మంజరి ప్రాణం గతుక్కుమన్నది. లోపల చలపతి ఉంటే-

తాయారు లైటు వేసింది.

"అయ్యగారు సందకాడ వోపాలి వొచ్చెల్లినారండీ! మళ్లా షూటింగ్‌కి ఎల్తామన్నారండీ! పొద్దుట గానీ తిరిగి రామన్నారండీ!"

"బతికించాడు" అనుకొంది మంజరి.

తలుపులు తీసుకుని గదిలోకొచ్చింది. వడగాల్పులల మధ్య వున్నట్లు ఫీలయ్యింది మంజరి. చీరెల పొట్లాలు కుర్చీలోకి గిరాటెట్టి మంచంమీద పడుకొంది. కాళ్ల జోడు కూడా విడువలేదు.

"అన్నంతినరా అమ్మాయిగారూ?" అన్నది తాయారు ఆవలిస్తూ.

"వొద్దే. ఆకలిగా లేదు".

తాయారు ఇంకోసారి ఆవలించింది. మంజరి కాలిజోళ్ళను విప్పి మూలగా ఉంచి, మెడదాకా దుప్పటి కప్పిందామె.

"తలపేసుకోండమ్మాయిగారూ! నేనింటికెడతాను".

"వొద్దులే తాయారూ! ఈరాత్రి నువ్వు కూడా ఇక్కడే పడుకో. నాకీ పూట భయం భయంగా ఉంది. తలుపులన్నీ గట్టిగా వేసెయ్యి".

తాయారు గోడపక్కగా చెంగుపరుచుకొని పడుకొంది. మంజరికి సరిగ్గా పక్క కుదర్లేదు. కాటేజ్‌లో మంచానికీ, దీనికీ తావిళ్ళు వేసి చూసింది. ఆ మంచం తనెటు దొర్లితే అటే వొంగింది. ఈ దిక్కుమాలిన మంచం పక్కలన్నీ వొరుకుపోతోంది. తన దగ్గర కాస్త డబ్బు చేరగానే,ముందా మంచం కొనాలి. తరువాత అటువంటి గది నొక్కదాన్ని-ఎప్పుడూ చల్లగా ఉండే గదిని -ఏర్పాటు చేసుకోవాలి. దానికెంత డబ్బవుతుందో ఏమిటో...

గది జ్ఞాపకం రాగానే, ఇందాక ఆ గదిలో జరిగిన సంగతులు కూడా జ్ఞాపకం వచ్చి చలించిపోయింది మంజరి. వాటిని మరిచిపోవాలనీ, పక్కకు నెట్టాలనీ చూసినకొందికీ, మనసు ఆ సంఘటనల చుట్టూనే తిరగసాగింది.

"తాయారూ!"

"అమ్మా!"

"నీకేమీ భయంగాలేదూ?" అన్నది మంజరి.

"ఎందుకమ్మా భయం?"

మంజరి మరేమీ మాట్లాడలేదు. పక్కమీద సరిగ్గా పడుకోలేకపోయింది. వంటి నిండా చిరుచెమట పోసింది. కడుపులో మందర పర్వతం తిరుగుతున్నట్లుగా వుంది. పుల్లటి నీళ్లు గుండెలదాకా పొంగుకొస్తున్నాయి. దవడల క్రింద నీరు వూరి నోరంతా నిండుతోంది. కాళ్ళూ, చేతులూ నమలుతున్నాయి. కళ్లు మూసుకుపోతున్నాయి. చేపలాగా విలవిలలాడిపోతూ వుంది.

"ఏందండి అమ్మాయిగారూ?" అంటూ తాయారు, మంచం మీద కూచుని, మంజరి వొళ్లు తాకి చూసింది. "జరం కూడా లేదండీ!"

"జరం కాదే!" అన్నది మంజరి.

తను చేసిన 'పాడుపని' చెప్పడానికి మంజరి సిగ్గుపడింది. అలానే మరో పావుగంట గిజగిజలాడాక, భొళ్లుమని వాంతి చేసుకొన్నది. పేగులన్నీ ముక్కలు ముక్కలయి పడిపోతున్నాయేమోననిపించింది. కాసిని చల్లని నీరు పుక్కిలించి, మరికాసిని తాగి, నిండా దుప్పటి కప్పుకొని పడుకొంది మంజరి.

"అదంతా బాగుచేసి నువ్వు నా దగ్గరే పడుకో తాయారూ!" అన్నది మంజరి.

"ఎందుకు లేండమ్మాయిగారూ!"

"నువ్వలా కాదనకు, చెప్పినట్లల్లా విను".

తాయారింకేమీ అనలేదు. మంచం చుట్టూ శుభ్రం చేసి, తడిచేతులు పమిటచెంగుకు తుడుచుకొంటూ, మంచం దగ్గరే తారట్లాడుతోంది తాయారు. మంజరి మేలుకొంటే, మంచం మీద పడుకొందామనీ, నిద్రపోతే కింద పడుకొందామనీ తాయారు ఉద్దేశం.

మంజరి, ఓ పక్కగా జరిగి, "ఊఁ ఇలావచ్చి పడుకో!" అన్నది.

తాయారు భయపడుతూ భయపడుతూనే, వద్దు వద్దంటూనే మంచంమీద కూచుంది. తాయారు చెయ్యిపుచ్చుకొని తన సరసనే పడుకోబెట్టుకొంది మంజరి. దాన్ని గాఢంగా కావలించుకొని కన్నుమూసింది. దాని గుండెల్లో తలదాచుకుని నిశ్శబ్దంగా రోదించింది.

యథార్థమైన సానుభూతికోసం మానవాత్మ ఎంతగా క్షోభించిపోతుందో అప్పుడుగానీ మంజరికి అవగాహన కాలేదు.

ఇది జరిగిన రెండురోజులకల్లా నవకళా చిత్రాలయా వారి కార్యాలయంలో పెద్ద గొడవ జరిగింది. ఆఫీసులోని సిబ్బంది యెటు చెప్పడానికి లేక ఉడ్డుగుడిచి చచ్చిపోయారు.

వెంకటేశ్వర్లుగారు మంజరికిచ్చిన వాగ్దానం ప్రకారం జానపద చిత్రం తియ్యవలసిందేనని పట్టుపట్టారు. రామబ్రహ్మంగారు దీనికిససేమీ వొప్పుకోమన్నాడు.

"ఎందుకనిట? ఫోక్ లోర్ చేసిన పాపమేమిటి? సోషల్ చేసుకొన్న పుణ్యమేమిటి?" అని నిగ్గతీశాడు వెంకటేశ్వర్లు.

"ఇందులో పాపపుణ్యాల సంగతి కాదుగా నేనంటూంట? చేతి చమురు వొదిలించు కోవడానికి ఏ పిక్చరయినా వొకటే! నేననేదేమిటంటే-సోషలయితే కొద్దిలో తేలిపోతుందని, అదే ఫోక్ పిక్చరయితే రెండు సెట్లకు కూడా మన డబ్బు చాలదు. మనమా సంగతి కూడా చూడాలిగా?" అన్నాడు రామబ్రహ్మంగారు.

ఈ వాదన వెంకటేశ్వర్లు గారికేమాత్రం రుచించలేదు. రామబ్రహ్మంగారిని నిలువునా చీల్చేసి, అడ్డంగా పాతేశాడు.

రామబ్రహ్మంగారేమీ మాట్లాడకపోవడం చూసి ఆఫీసులోని సిబ్బందికి గాలి ఎటు మళ్లుతున్నదో బోధపడిపోయింది. అనేక సినిమా కంపెనీల్లో పనిచేసి అపారమైన అనుభవాన్ని సంపాదించిన తారకం గారు ఈ సువర్ణావకాశాన్ని సద్వినియోగం చేసుకున్న వారయినారు.

"చిన్నయ్యగారు చెప్పిన మాట కూడా మనం ఆలోచించవలసిందేనండీ! మనకు సిసిల్‌బి.డి. మిల్లీ ఆదర్శంగానీ ఆకాయ పోకాయ వెధవలు మన ఛాయలకు రావడానికి లేదు" అన్నాడు తారకం.

"ఈ మిల్లీగాడెవడయ్యా? మనకాడ ఉద్యోగం గానీ కావాలిట్నా? ప్రస్తుతం ఖాళీలేమీ లేవని చెప్పు. ఏరా వెంకటేశ్వర్లూ! అవసరమయితే ఈ మిల్లీగాడి యవారం మనం తరువాత చూసుకొందాం.

సరేనా!'' అన్నాడు రామబ్రహ్మం.

''అల్లాగేనండి! సిసిల్ బి.డి. మిల్లీకి కూడా మనం ఓ జాబ్ పారెయ్యగలమనుకోండి; మీరన్నట్టుగా-అంతగా అవసరపడ్డప్పుడే చూసుకొందాం. మీకు తెలియంది లేదనుకోండి. ఆ మధ్య నేను అమెరికా వెళ్లినప్పుడో ఫ్రెండ్‌ను కలుసుకొన్నాను. వాడు మిల్లీని కలుసుకొని మాట్లాడాడంట. అతని ధ్యేయం ఏమిటంటే ''కోటి డాలర్లు ఖర్చు చెయ్యి-పదికోట్ల డాలర్లు సంపాదించు'' అని అంటే మరేంలేదు. రూపాయి పారేసి పదిరూపాయలు తీసుకురావడమట! ఈ ప్రపంచం మొత్తం మీద- ఏదేశంలోనైనా సరే-అతని పిక్చర్ కాదన్న మొనగాడు లేడు. మరో రెండేళ్ళకు డి.మిల్లీ పిక్చరొస్తోందంటే ఇప్పణ్ణించే థియేటర్ల దగ్గర జనం క్యూలలో నిలబడతారు. ఎందుకని? అతని ప్రొడక్షన్ వాల్యూ అటువంటిది! కళ్లు చెదిరిపోయే సెట్టింగ్స్, టెర్రిబుల్ ఫైటింగ్స్, హార్స్ రేసెస్, ట్రిక్ ఫొటోగ్రఫీ, డ్రీమ్ సీక్వెన్సెస్, ఓహ్ రక్తాన్ని అలా-అలా గడ్డకట్టించేస్తాడు. కాబట్టే ఫ్రం మాస్ టు క్లాస్, అతని సినిమాలంటే గంగవెర్రులెత్తడం-అఁహ, ఈ సంగతులన్నీ మీకు తెలుసుననుకోండి. ఏదో సమయానికి జ్ఞాపకం వస్తేను చెప్పా'' అన్నాడు తారకం.

''నాకు తెలియకడుగుతానుతారకంగారూ! ఇవన్నీ ఉంటే డబ్బులొస్తాయంటారా!'' అన్నాడు రామబ్రహ్మం.

''ఇంకా మెల్లిగా అంటారేమిటి బ్రహ్మంగారూ! అసలా తరహా పిక్చర్ సక్సెస్ కావడానికి ఈ మసాలా ఉండడమే కారణం! లేకపోతే ఏమున్నదని జనం విరగబడుతున్నారంటారు?'' అన్నాడు తారకం.

''ఏం చచ్చారో నాకు తెలియదు. మనక్కావలసిందల్లా లాభాలు. ఏమేం పెడితే డబ్బొస్తుందో అవన్నీ పెట్టండి. ఇప్పుడు మీరు-మిల్లీగాడి ఆటల్లో ఉంటుంటాయన్నారు చూడండి అయిదారు గమ్మత్తులేమిటో- అవన్నీ మనదాంట్లోనూ ఉంచండి. ఏమిటిట వాడి ఘనం! అతని ముఖానే పొద్దుపొడిచిందా ఏమిటి?'' అన్నారు రామబ్రహ్మంగారు.

ఆయనగారికి కోపం రగిలిపోయింది. ఈ మాటలంటున్నప్పుడు కనీసం పదిసార్లయినా బల్ల మీద బాది ఉంటారు.

''బ్రేవో, బ్రేవో'' అన్నాడు వెంకటేశ్వర్లు

''అయితే మనం సోషల్ ఐడియా మార్చుకోవాల్సిందేనండీ! ఎంచాతంటే బ్రహంగారూ! సాంఘిక చిత్రంలో, సెట్టింగ్సుకి అట్టే ప్రాముఖ్యం లేదు. మహావేస్తే రెండుమూడు మేడలేస్తాం. రైలు ప్రయాణం, ఆసుపత్రి సీను, కాలేజి, బృందావన్ గార్డెన్సు, ఓ చిన్న డాన్సు-ఫినిష్, ఇంతకన్నా మనం చెయ్యడానికేమి ఉండదు. ఈ సరంజామా అంతా ప్రతి సోషల్ పిక్చర్‌లోనూ ఉంటూనే ఉంది గనక దీన్ని చూసి జనం మెచ్చుకొంటారనుకోవడం అబద్ధం - ఏం వెంకటేశ్వర్లు గారూ! మీ అభిప్రాయమేమిటి ?'' అన్నాడు తారకం.

వెంకటేశ్వర్లుగారి ఉద్దేశం పూర్తిగా తెలుసుకోందే, తను సోషల్ పిక్చర్ను గురించి మరీ అంత తీసికట్టుగా మాట్లాడ్డం ప్రమాదమని తారకంగారికి తోచింది.

''క్వైట్‌రైట్, ప్రొసీడ్'' అన్నాడు వెంకటేశ్వర్లు గారు, సిగరెట్ అంటించి తారకంగారు గొంతు సవరించుకొని మళ్ళా ప్రారంభించారు. ఈలోగా బాయ్‌ని పిలిచి, అందరికీ కాఫీలు తెమ్మన్నాడు.

''ఫోక్‌లోర్ సంగతి అలా కాదు'' అంటూ ప్రారంభించారు తారకం గారు.

''అందులో- మామూలు మనిషి ఊహించడానిగ్గూడాలేని చిత్ర విచిత్రాలు ఎన్నో పెడతాం.

మాయాలూ, మంత్రాలు పెడతాం. బోలెడంత ట్రిక్ ఫోటోగ్రఫీ పెడతాం. పది సీక్వెన్సుల్లో పదిరకాల డాన్సులు పెడతాం. ఇందులో అవసరమనుకొంటే -అనుకోవమేమిటి లెండి- హీరోకూ హీరోయిన్‌కూ, చెరో డ్రీమ్‌సీనూ పెడతాం. విలన్ ఉన్నాడు చూడండి, వాడి దగ్గర 'జగదేక సుందరి' నొకదాన్ని చెఱలో ఉంచి, దాన్ని మనం హీరో చేత విడిపించేస్తాం. కామిడియన్‌కు వల్లమాలిన స్కోప్ అట్టే పెడతాం. అధమపక్షం అరడజను కత్తి యుద్ధాలయినా మనం ఉంచుకోవచ్చు. పాముల చేత, సింహాల చేత, ఏనుగుల చేత బోలెడంత పని తీసుకోవచ్చు. ఇన్ని పనులు మనం చేసుకోడానికి ఫోక్‌పిక్చర్లో తప్ప స్కోప్ ఉండదు. ఆ తరువాత మీ యిష్టం'' అన్నాడు తారకం.

''మీరు చెప్పిందాంట్లో దేవకన్యలు ఎక్కడా రాలేదు!'' అన్నాడు వెంకటేశ్వర్లు

తారకంగారు, ఓ క్షణం పెదవి కొరుక్కొని, కళ్లు చికిలించి ఆలోచించి, చిన్న చిటిక వేసి, సుతారంగా నవ్వేశాడు.

''అయ్యబాబోయ్! మీతో మాట్లాడ్డం చాలా కష్టమండోయ్! మరింత కీన్‌గా అబ్జర్వ్ చేస్తున్నారని నేననుకోలేదు సుమా!'' అన్నాడు బట్టతలను అరచేత్తో రుద్దుకుంటూ.

వెంకటేశ్వర్లుగారు, హుందాగా నవ్వి, 'చూశావా' అన్నట్టు, రామబ్రహ్మంగారి కేసి చూశాడు. 'చూశాను' అన్నట్టుగా ఆయన తల తాటించాడు.

''చిన్నయ్యగారన్నట్లుగా మన పిక్చర్‌లో దేవకన్యలు ఉండి తీరవలసిందే! ఇందువల్ల మనకో సౌలభ్యం ఉంది. దేవలోకం సెట్టు మీద, మాంచి పగడ్బందిగా వున్న గ్రూపు డాన్సులు రెండు తగిలించొచ్చు. అదీగాక - డ్రెసెస్-దేవకన్యల డ్రెసెస్ -అప్‌టుడేట్‌గా తయారు చేయించి, సెక్సప్పీల్ ఎక్స్‌పోజ్ చేయించొచ్చు. వరసాగ్గా ఓ యాభై మంది అమ్మాయిలకు పమిటలు తీసేసి, ఇంతింత బ్రేసియర్స్ తగిలించి, తొడలు కనిపించే పావడాలు కట్టించి, రాక్ ఎన్ రోల్ డాన్సు పెట్టామనుకొండి. హాలు గుమ్మయిపోతుంది. అవసరమనుకొంటే దేవలోకం సీన్లన్నీ కలర్‌లో తీసేద్దాం. ఇంగ్లాండ్‌లో మన శిష్యుడొకడున్నాడుళ్ళెండి - వాడికి ఫిలిం పంపించేసి, 'అబ్బిగా, దీన్ని కలర్‌లోకి ట్రాన్స్‌ఫర్ చేయించి వెంటనే పంపించవోయ్' అని ఓ కార్డు రాసి పారేదాం. అలాగే -''

ఈలోగా బాయ్ కాఫీలు, వక్కపొడి పొట్లాలు, సిగరెట్ పెట్టెలు తెచ్చి పడేశాడు. తారకంగారు 'అలాగే' అన్న వాక్యాన్ని పూర్తి చెయ్యడానికే అవకాశం లేకపోయింది.

రామబ్రహ్మంగారు కాఫీకప్పు బల్లమీద ఉంచి, చేబ్రోలు పొగాక్కాడ పాయ తీస్తూ ''అయితే మనం ఫోక్‌లోర్ తియ్యడానికి రెడీయేగా ?'' అన్నాడు. అందరికేసి చూస్తూ

''ఇంకా రెడీ ఏమిట్రా నా తలకాయ. మనం అదే తీస్తాం. అది తప్ప ఇంకోటి తియ్యం. ఫోక్‌లోర్ మనం తియ్యకపోతే, తట్టా బుట్టా చంకన వేసుకొని 'జై పరమేశ్వరా' అందాం పద'' అన్నాడు వెంకటేశ్వర్లు.

''మన మొచ్చింది సినిమా తియ్యడానికేగాని, ఓ పదివేలు తగలేసుకొని పోవడానికి కాదు'' అని ఉద్ఘాటించారు రామబ్రహ్మంగారు. ''అయితే సరేనండీ! ఇదే ఖాయం ముందో కథ చూడండి. ఎవరెవర్ని బుక్ చెయ్యాలో కూడా ఇప్పుడే అనుకొంటే, తీరిపోలా?''

''తీరిపోతుందనుకోండి. కానీ, చేత కథలేందే మనం ఎంతమందిని బుక్ చేసుకోవడం. ముందీవిషయం పూర్తి కానివ్వండి, నా దగ్గర రెండు మూడు కథలున్నాయి. వాటిని వినిపిస్తాను. నచ్చితే సరే సరి. లేదా, ఇద్దరు ముగ్గురు కవులకు కబురెడతాను. ఇందులో బాక్సాఫీస్‌రైటర్స్ ఉన్నారు. వాళ్ళతో కాస్త పేచీ. కాలికేస్తే మెడకూ మెడకేస్తే కాలికి తగులుకొంటారు. డబ్బంతా ముందుగానే

పిండేసుకొని, కథను కాస్తా మరో కంపెనీకి అమ్మేస్తుంటారు. వారికి పేరయితే ఉంది మరి! మనకు పేరే ముఖ్యమనుకొంటే, ఈ అవస్థలన్నీ పడాలి. కాదయ్యా పేరులో ఏముంది గనుక, ముష్టి పేరు; కథే మంచిది కావాలనుకుంటే, నా దగ్గరే వున్నాయి. వీటిని మించిన కథలు ఇండియా మొత్తం మీద మీరు సంపాదించలేరని నేను పూచీ ఇస్తాను'' అన్నాడు తారకం.

''అలాగేనండి! ఎవరికయినా మనం డబ్బిచ్చి తీసుకొంటున్నాం గానీ, మహదానం అడగడం లేదు గదా! ఇంకెవరికో పారేసే చెక్కు మీకే ఇస్తాం. మీరే కథను రాసుకురండి. రెండు మూడు రోజుల్లో స్టోరీ మీద కూచుందాం'' అన్నాడు వెంకటేశ్వర్లు.

''అలాగేనండీ! ఓ నెలరోజుల్లో మనం స్టోరీ డిస్కషన్ పూర్తి చేసుకొంటే, ఆ తరువాత స్క్రీన్‌ప్లే రాయడానికి ఇంకో మూడు మాసాలయినా కావలిసొస్తుంది. ఈలోగా మనం కాస్టింగ్, స్టూడియో, డైరక్టర్, మ్యూజిక్, డాన్సుడైరక్టర్, కెమెరామెన్, పబ్లిసిటీ - చాలా చూసుకోవాలి. మనం మీనవేశాలు లెక్కిస్తూ కూచుంటే లాభం లేదు. యూనిట్ మొత్తం, పాదరసంలా పనిచేసినప్పుడే ఇది సాధ్యమవుతుంది'' అన్నాడు తారకం.

''అలాగే చేద్దాం. అసలలాగే చెయ్యాలికూడాను'' అన్నాడు వెంకటేశ్వర్లు.

ఎవ్వరూ ఏమీ అనలేదు.

తారకంగారు గొంతు సవరించుకొని, ఒకటి రెండుసార్లు ఏదో మాట్లాడబోయి, మానేశాడు.

''ఏమిటండీ?'' అన్నాడు రామబ్రహ్మం.

''అబ్బే! మరేం లేదనుకోండి, నేనేమో, రెండు మూడు మాసాల నుండి మన కంపెనీలోనే ఉంటున్నాను. ఏదో ఖర్చుల కోసం, అడపా దడపా తీసుకోవడం తప్ప ''ఇంత'' అని ఓ ఏర్పాటేమీ లేదు. నాకైనా ఉత్సాహంగా పనిచెయ్యడానికి, ఓ అంకె అంటూ తెలిస్తే బావుంటుంది. మురబ్బీగా నేను మాత్రం ఎంత కాలమని ఉండగలను చెప్పండి?'' అన్నాడు తారకం.

''మీరేదో వాడుకొంటూనే ఉన్నారు గదా?'' అన్నాడు రామబ్రహ్మం

''పిట్ట బెదిరినట్లుగా, పదీపరకా తీసుకొంటున్నానని నేనే చెప్పాను గదండీ!'' అన్నాడు తారకం.

''అంటే -ఇప్పుడది చాలదన్నమాట! అవునా?'' అన్నాడు వెంకటేశ్వర్లు.

''చిన్నయ్యగారు నా మనస్సును ఇట్టే కనిపెట్టేశారు. చిత్తం చిత్తం. నా అభిప్రాయం అదేనండీ!'' అన్నాడు తారకం.

''ఏమివ్వమంటారో చెప్పండి! పోనీ నెలకో వంద చాల్తాయా?'' అన్నాడు. రామబ్రహ్మం.

తారకం పకపక నవ్వాడు.

''ఇహ మన మీ సంగతిని గురించి మాట్లాడ్డం మానేదాం. నాకు సెలవిప్పించండి. అవతల మూడు నాలుగు కంపెనీలవాళ్ళు నా ప్రాణాలు తోడేస్తున్నారు. వాళ్ళందర్నీ కాదని ముష్టి వందరూపాయల కోసం, ఇక్కడ పని చెయ్యడంలో అర్థం లేదు. మరి నేను వెళ్ళిరానా?'' అంటూ తారకం లేచి నిలబడ్డాడు.

రామబ్రహ్మం నీళ్ళు నములుతూంటే వెంకటేశ్వర్లు కూచోమని తారకంగారికి ఆదేశించి, వెళ్ళమన్నట్లుగా రామబ్రహ్మంగారికి సైగ చేసి ఈ రెండు పనులూ జరిగాక, గొంతు తగ్గించి అసలు విషయం బయట పెట్టాడు.

"మీరలా కోప్పడుతుంటే ఏం లాభం తారకంగారూ? మాకు మీ సర్వీస్ కావాలి. మీకు మా డబ్బు కావాలి. ఇలాంటి కంపెనీలు మీకు బోలెడున్నాయి. మీలాంటివారు, మాకూ దొరుకుతారు మరో చిన్న సంగతి. మిమల్ని బొట్టూ, కాటుకా పెట్టి పిలిచి, మా కంపెనీలో పని చెయ్యమని మేమడగలేదు. మీ అంతట మీరే వచ్చారు. కూచుని పోతున్నారు. మీరింతవరకూ మాకు చేసిందేమీ లేదు. ఏమన్నా పనంటూ ఉంటే - ఈ రోజు నుండే మొదలవుతున్నది. మీరు వెడతానంటే వెళ్ళండి. ఉండదల్చుకొంటే ఉండండి. వందగదూ మా బ్రహ్మం ఇస్తానన్నది? మరో యాభై తీసుకొండి;కాదూ, చాలదంటారా ? ప్రొడక్షన్ బిగినయ్యాక, ఇంకో యాభై కలిపి తీసుకోండి. మళ్ళా నాతో ఈ సంగతి చెప్పనవసరం లేదు. మీరే సంగతి సాయంత్రంలోగా నాకు తెలియచేస్తే సంతోషం" అన్నాడు వెంకటేశ్వర్లు.

వ్యవహారం ఏ దశ కొచ్చిందీ తారకంగారు క్షణంలో గ్రహించారు. అయన విశాలంగా నవ్వుతూ "మీ రిన్నిసార్లు చెప్పాలా బాబూ! మీ మాట నెప్పుడన్నా కాదన్నానా? మీరలా సెలవిచ్చాక, ఆరు నూరయినా, నూరు అరయినా, అల్లాగా జరిగిపోవలసిందే తప్ప మాట తిరగడానికే లేదు. మీ ఇష్టం వచ్చినట్లే కానివ్వండి. రేపు మన పిక్చర్ సక్సెస్ అయి, భగవంతుడి దయ వల్ల, పది లక్షలు రావాలేగానీ, మిమల్ని డిమాండ్ చేసయినా, పదివేలు నజరానాగా పుచ్చుకోకుండా మానతానా?" అన్నాడు.

"గుడ్ గుడ్. తప్పకుండాను. నన్నడిగితే, లాభంలో పది పర్సెంట్ తిరుపతి వెంకన్నకూ, మరో పది పర్సెంట్ మన స్టాఫ్‌కూ ఎలాట్ చెయ్యాలంటాను. స్టార్సులో ముఖ్యులైనవారికి కార్లు కూడా ప్రెజెంట్ చేదామని ఉంది. సరేలెండి. మన దగ్గర బోలెడన్ని ప్లాన్స్ ఉన్నాయి. మెల్లిగా చూదాం. మరి మీరు అలాగే వెళ్ళిరండి" అన్నాడు వెంకటేశ్వర్లు.

తారకం గడపదాటుతుండగానే ప్రక్క గదిలోంచి రామబ్రహ్మం గారొచ్చారు.

"ఏమన్నాడ్రా?" అన్నాడు రామబ్రహ్మం.

"ఆఁవాడి మొఖం. వాడనేదేమిటిగానీ, మరీ నీకింత మతిలేకుండా పోయిందేమిటా అని? తారకంగాడు. అసాధ్యుడు, అన్ని విషయాలు, అంతో ఇంతో తెలిసినవాడు. ఈ ఇండస్ట్రీలో బాగా నలిగినవాడు. మన కనేక విధాలుగా పనికొస్తాడు. వంద రూపాయలిస్తానంటే ఎలా? ప్రొడక్షన్ టైంలో ఆడవాచాకిరీ ఎంతుంటుందో నీకో ఐడియా లేదనుకుంటాను. అదంతా ఈ తారకంగాడే చూచుకొంటాడు. నీ కెందుకురా, నువ్విలా చూస్తూ ఉండు. ఈ ఇండస్ట్రీ మొత్తాన్నీ అలా చిటికెడు వేలిమీద తిప్పేస్తాను. నాక్కావలసిందల్లా మధ్య మధ్య నువ్వు అడ్డుపుల్లలు వెయ్యకుండా ఉండటం" అన్నాడు వెంకటేశ్వర్లు.

"సరే, ఏదోటి ఏడుద్దాంలే పద" అన్నాడు రామబ్రహ్మం విసుగ్గా.

"ఇతగాడంత విసుగు పడటానికి కారణమేమిటా?" అనుకున్నాడు వెంకటేశ్వర్లు.

ఆయన కేకారణమూ తగల్లేదు.

"ఆఁ పోనిస్తూ, ఈ బ్రహ్మంగాడు లేకపోయినా నేను పిక్చర్ తియ్యడం ఖాయం. ఏదో తోడల్లుడు గదాని పస్తాయిస్తున్నానుగానీ, వీడు లేనంత మాత్రాన అడ్డిపోయేదేమీ వుండదు" అని కూడా వెంకటేశ్వర్లు అనుకొన్నాడు.

ఆ తరువాత అతనికి మంజరి జ్ఞాపకం వచ్చింది. ఆ రాత్రి యింటి దగ్గర దిగవిడచి వచ్చాక, మళ్ళా అటుకేసి పోవడానిగూడా వీలు చిక్కలేదు. ఇవ్వాళో రేపో మంజరిని కలుసుకోవాలి.

మంజరిని గురించిన ఆలోచనలు రాగానే వెంకటేశ్వర్లు తన్మయుడయిపోయాడు. మంజరి గొప్ప అందగత్తె కాదు; మగవాణ్ణి సుఖపెట్టడంలో బ్రహ్మాండమైన నేర్పు కూడా ఉంది. తను మంజరి అంటే అల్లాడిపోవడానిక్కారణం ఆ నేర్పే! అందుకోసమే ఆవిడ మీద తను వందలు ఖర్చు చేశాడు. మరిన్ని వందలు ఖర్చు చెయ్యడానిక్కూడా తను సిద్ధంగా ఉన్నాడు. రేపో మాపో మంజరి గొప్ప స్టార్ కావడం ఖాయం. ఆ రోజున, పాతిక్కూ, పరక్కూ యాక్ట్ చెయ్యమంటే వొప్పుకుంటుందా మరి? తనేమో, తన శేషజీవితాన్ని, చిత్రకళామతల్లి అర్చనలో గడిపేందుకు నిశ్చయించుకొన్నాడాయె. ఇప్పుడే ఆవిడతో మంచిగా ఉంటే-ఇది రేపు అక్కరకొస్తుంది. తనింత డబ్బు మంజరి మీద ఖర్చు చేయడానిక్కారణం కూడా ఇదే! ఈసంగతి- డబ్బు ఖర్చు సంగతి, రామబ్రహ్మానికి తెలుసునో, లేదో తనకు తెలీదు. తెలిసినా, తెలియకపోయినా తను మంజరిని వదలడం కల్లోనిమాట!

సరిగ్గా ఆ సమయంలోనే, మంజరి, చలపతి వసారాలో కూచుని నవకళా చిత్రాలయను గురించి మాట్లాడుకొంటున్నారు.

‘‘వెంకటేశ్వర్లుగారింకేమన్నా అన్నారా?’’ అన్నాడు చలపతి.

‘‘లేదు. పర్స్ ఇంటిదగ్గర మరిచిపోయి వచ్చాననన్నాను. ఫర్వాలేదన్నాడు. ఏమన్నా అరుస్తాడేమోనని భయపడ్డానుగానీ, ఏమీ అనలేదు’’ అన్నది మంజరి.

చలపతి తృప్తిగా నిట్టూర్చాడు.

‘‘ఏమీ అనడులే! అతని ధోరణే వేరు. అన్నట్లు చెప్పడం మరిచాను. శర్మగారు నీ బొమ్మను కవరు పేజీమీద ట్రయ్‌కలర్లో వేస్తున్నారు. అయిదువందలూ చేతులో పడ్డాకనే స్ట్రెయిక్ ఆర్డరు వేశాడు. లోపల కూడా, నాలుగైదు చోట్ల నీ బ్లాక్సు వేశాడు. దగ్గర కూచుని, లోగడ మనం నిన్న వ్యాసాన్ని మళ్ళా రికాస్ట్ చేయించాను. సెంట్రల్ పేజీలో, నీ ఫుల్ పిక్చరు చేయించాను. చుట్టూ సెకండ్ కలర్లో బాక్స్ ఉంటుంది. మొత్తానికి, తింటే తిన్నాడు గానీ-బ్యూటీఫుల్‌గా వేస్తున్నాడోయ్!’’ అన్నాడు చలపతి.

‘‘ఎవరా వచ్చేది?’’ అన్నది మంజరి దూరం నుండే దణ్ణం పెడుతున్న ఓ బట్టతల మనిషిని చూపిస్తూ. ‘‘నేను లోపలికెళ్ళనా?’’.

‘‘అవసరం లేదు కూర్చో’’ అన్నాడు చలపతి మంజరితో ‘‘నమస్కారం తారకంగారూ!దయచెయ్యండి!’’ అంటే తారకాన్ని ఆహ్వానించాడు.

‘‘ఇస్సో’’ అంటూ కుర్చీలో కూచుని బట్టతలమీది చెమటను, వేలితో తీసి ధారగా, కిందకు వేస్తూ, మంజరికేసి తిరిగి ‘‘నమస్కారం అమ్మాయిగారూ!’’ అన్నాడు తారకం.

మంజరి కూడా సుతారంగా నమస్కరించింది. ఆ పైన ఏం చెయ్యాలో ఆవిడకు తోచలేదు.

‘‘నన్ను మీరెరుగరు లెండి’’ అంటూ ప్రారంభించాడు తారకం. ‘‘నే నీ ఇండస్ట్రీకి పాతవాణ్ణి. మన చలపతిగారిక్కూడా ఆ సంగతి తెలుసు. చలపతిగారంటే నివురుగప్పిన నిప్పులాంటివారు. రాత బయటపడక వారిలా వున్నారుగానీ, ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ కూడా వీరిముందు పనికిరారు. మా గొప్ప బుర్ర. ఏదయితే నేం గానీ వారి జాతకం, నా జాతకం వొక్కలాగే ఉన్నాయి. కళారంగాన్ని వదులుకోలేక అలానే తంటాలు పడుతున్నాను. మిమ్మల్ని గురించి చలపతిగారు నాతో కూడా చెప్పారు. మీ దయవల్ల పది కంపెనీల్లో ఇంత పేరున్న వాణ్ణి గనక, అన్ని చోట్లా మీ గురించి చెప్పుకొచ్చాను. రెండు మూడు కంపెనీలు నాకు మాటిచ్చాయి. ఈనెలాఖరులోగా మీకా కంపెనీల్లో వేషాలు రావడం ఖాయం’’.

‘‘చాలా సంతోషమండీ!’’ అన్నది మంజరి. అన్నాక చలపతికేసి చూసింది. అతగాడు ‘‘ఇకచాలు’’

అన్నట్లుగా తలపంకించాడు.

“ఇంకో ముఖ్యమైన సంగతి మీ చెవిని వేతామని ఇలా పనిమాలా వచ్చాను. నవకళా చిత్రాలయ వారు సోషల్ తియ్యడం ఆపుచేసి, ఫోక్‌లోర్ తియ్యడానికి నిశ్చయించారు. ఉదయం నుండీ వారితో హెూరాహెూరీగా వాదించాను. రామబ్రహ్మంగారు ససేమీ వీల్లేదన్నారనుకోండి-”.

“వెంకటేశ్వర్లుగారేమన్నారండీ?” అన్నది మంజరి ఆత్రంగా.

“అదే చెప్పుకొస్తున్నా తల్లీ! మనిషంటే వారినే చెప్పుకోవాలండీ! ఆయనగారు జానపదం తప్ప మరోటి తీయడానికే వీలుపడదన్నాడండీ! కథ కూడా నన్నే చూడమన్నారు” అన్నాడు తారకం.

అంతవరకూ, మౌనంగా కూచున్న చలపతి వొక్కసారిగా ఉలిక్కిపడ్డాడు. కుర్చీలో అటూ,ఇటూ మసలి, మళ్ళా కూచున్నాడు. సిగరెట్ వెలిగించి గట్టిగా పొగలాగి, చిటికవేసి, సిగరెట్ నుసిని రాల్చేశాడు.

“మరి మీరు కథేమన్నా ఆలోచించారా?” అన్నాడు చలపతి.

“ఇదివరకూ నా దగ్గర రెండు కథలున్నాయి, వాటినే ఇద్దామనుకొంటున్నాను” అన్నాడు తారకం.

చలపతి కొద్దిక్షణాల పాటు ఏమీ మాట్లాడలేదు. తరువాత తారకం కేసి తిరిగి మెల్లిగా “ఓ పని చెయ్యండి తారకంగారూ! మంజరి మీ పేరు పదికాలాల పాటు చెప్పుకొంటుంది. మనందరం కలిసి సాయం చేస్తే గానీ మంజరిలాంటి కొత్త ఆర్టిస్టులు పైకిరారు...మరేం లేదు. ఆ కథను ముందుగా నాకొకసారి చూపించండి. లేదా, ఓ కారెక్టరుకు మాంఛి ప్రామినెన్స్ ఉండేలా చూడండి. వాంప్‌టచెస్ ఉండకూడదు. ఆడిటోరియం సింపతీని గెయిన్ చెయ్యాలంటే పాథటిక్ రోల్ ఉండాల్సిందే! వాంప్ మీద సానుభూతి రాదు, రాకూడదు” అన్నాడు చలపతి.

“చూదాం” అన్నాడు తారకం.

ఈలోగా చలలపతి మంజరికి సౌంజ్ఞ చేశాడు. మంజరి ప్రారంభించింది.

“మరేం లేదు తారకంగారూ! మా వారన్నట్లుగా, వాంప్ కారెక్టర్ ప్రజల్నించి మెప్పుల్ని పొందలేదు. నేను అన్నిరకాల వేషాలూ వేసిందాన్ని గనక చెబుతున్నాను. ముందస్తిగానే నాలుగు మంచి వేషాలు దొరికితే పదిమందికి తెలిసివస్తుందని నా ఆశ. ఇప్పుడప్పుడే హీరోయిన్ వేషం నాకివ్వరనుకోండి, మరీ అంత హీనంగా ఉండే వేషాన్ని కూడా నే వెయ్యదలుచుకోలేదు” అన్నది.

“అలాగేనమ్మాయిగారూ! మీరిన్నిసార్లు చెప్పాలా?” అంటూ తారకం లేచి నాలుగడుగులు వేసినవాడల్లా-గిరుక్కున వెనక్కు తిరిగొచ్చి “ఇన్నిటికి అసలు విషయం అడగడమే మరిచిపోయాను. నాకో పాతిక రూపాయలుంటే సర్దండి. రేపో ఎల్లుండో కంపెనీలో అడిగి ఇచ్చేస్తాను” అన్నాడు.

మంజరి చలపతికేసి చూసింది.

“అలాగేనండీ! తప్పకుండా పట్టుకెళ్ళండి. ఇది తిరిగి మీరివ్వనవసరం లేదు. మీరు ఇంకోలా అనుకోకండి... చూడు మంజరీ! నా జేబులో ఉండాలి చూసి, కవిగారికో పాతిక రూపాయలట ఇవ్వు” అన్నాడు చలపతి.

మంజరి గదిలో కొచ్చి చలపతి జేబులు వెదికింది. అందులో సిగరెట్ల నుండి రాలిన పొగాకు పొడి, ఆరణాలన్నర చిల్లరా తప్ప మరేమీ లేవు.

“ఓరి నీ బడాయి బండలుకానూ! వందలేవో జేబులో ఉన్నట్లే మాట్లాడావే” అనుకొన్నది మంజరి.

తరువాత ఒక పెట్టెలోంచి పాతికరూపాయలు ఎంచి తారకంగారి చేతికిచ్చి నమస్కరించింది.

“శుభం అమ్మాయిగారూ! నేను వస్తాను. నాలుగైదు రోజుల్లో కథను మార్చి తీసుకొస్తాన్లెండి. నా చేతిలో ఉన్నంతవరకూ ఫర్వాలేదు. ఆ పైన భగవంతుడి దయ” అన్నాడు తారకం.

అతను వీధిలోకెళ్ళిపోయాక మంజరి సన్నగా నిట్టూర్చింది.

చలపతి ఓసారి మెటికలు విరుచుకొని తనలో తనే నవ్వుకొన్నాడు.

"ఏమిటి?" అన్నట్టు చూసింది మంజరి.

"ఏం లేదు. నేనోసారి రావుగారి దగ్గరకెళ్ళొస్తాను. నిన్నాయనకు పరిచయం చేయడం అవసరం. వారే నీ ప్రసక్తి తీసుకొచ్చారు ఈ మధ్య. నేనలా వెళ్లొస్తాను...వెడుతూ వెడుతూ వోసారి వెంకటేశ్వర్లు గారికి కనిపించి మరీ పోతాను" అన్నాడు చలపతి.

మంజరి పలకలేదు.

చలపతి పది నిమిషాల్లో తయారయ్యాడు. మెట్లుదిగి నాలుగడుగులు వేసిన వాడల్లా ఆగి వెనక్కు తిరిగాడు.

"మొన్నామధ్య ఫర్నిచర్ కోసమని కొంత డబ్బు తీసుకొన్నాను. తీరా కొనబోయేసరికి నాకో అనుమానమొచ్చింది. ఉన్న డబ్బంతా కుర్చీలకూ, బల్లలకూ తగలేస్తే మనం తరువాత అవస్థపడాలి. పోనీ ఫర్నిచరే కొందామని నువ్వంటే కొనేస్తాను. నన్నేం చెయ్యమంటావోయ్?" అన్నాడు చలపతి.

"ఇలాంటి విషయాలూ నన్నడగాలా? మీకేది మంచిదని తోస్తే అదే చేయండి. నాకిందతా గొడవ గొడవగా ఉంది"అన్నది మంజరి పొడిపొడిగా.

"దట్సాల్" అన్నాడు చలపతి.

అతను వెళ్ళాక కళ్ళు రెండూ గట్టిగా నులుముకొంది. తలలో సన్నని నొప్పి లోపల గుబులు గుబులులగా ఉంది.

'రాను రాను చలపతి నాకు మరీ అర్థంకాకుండా పోతున్నాడు' అనుకొంది మంజరి.

ఇలా అనుకొందుకు తగిన కారణాలు కూడా ఆవిడ దగ్గర సిద్ధంగా వున్నాయి.

తను మద్రాసులో అడుగుపెట్టడానికి ముందు చలపతి తనతో అన్నవాటికీ తనిక్కడ చూస్తున్నవాటికీ ఎక్కడా పొంతనలేదు. తనో పిక్చర్ తీస్తున్నాననీ, సరైన హీరోయిన్ లేక బాధపడుతున్నావనీ చెప్పి తీసుకొచ్చాడు. ఎరిగినవాడవటం వల్లా, తనకిష్టం లేకపోయినా రాజమణి ప్రోత్సహించడం వల్లా మద్రాసు వచ్చింది. నిజానికి తను రాగానే చలపతి షూటింగ్ ప్రారంభించవలసింది. అతనా ప్రసక్తే తీసుకురావడం లేదు తను అడగనూ లేదు. అంటే సినిమా కంపెనీ శుద్ధ అబద్ధమన్నమాట!

అయితే చలపతి ఉద్దేశమేమిటి?

అతనికి తన నుండి కావలసిందేమిటి? తనతో సుఖించడమే ఐతే దానికిన్ని అబద్ధాలాడవలసిన అవసరం లేదు. ఈ మద్రాసు దాకా పట్టుకురావలసిన అవసరమూ లేదు. ఆ కాస్త కక్కుర్తి అక్కడే వెళ్ళమార్చుకొని రావచ్చు. అలా కాకుండా తనను పనిమాలా మద్రాసుకు తీసుకొచ్చాడు. తనకోసం అంతోఇంతో ఖర్చుచేశాడు. పదికంపెనీల చుట్టూ కాలుకాలిన పిల్లిలాగా తిరిగాడు. ఇంకా తిరుగుతున్నాడు. పత్రికల్లో తనకు చచ్చేంత పబ్లిసిటీ యిప్పించాడు. నవకళా చిత్రాలయ వారిని తనకు పరిచయం చేసిందీ ఆయనే! ఇదంతా కేవలం నిస్స్వార్థంతోనే జరిగిందని తను అనుకోలేదు. తన ఆలోచనలకు అందనంత దూరంలో, చలపతి ప్రయోజనం వున్నది. అదేమిటో తెలిసిపోతే తనకింత ఆందోళలన వుండదనుకొన్నది మంజరి.

పోతూ పోతూ చలపతి అన్న మాటలు చెవుల్లో గింగురుమంటున్నాయి. ఫర్నీచర్ కోసం డబ్బంతా ఖర్చు చేస్తే అవతల ఇబ్బంది పడాల్సి వస్తుందట. "మరి కొనమంటావా?" అని అడగటం దేనికిట?

డబ్బయిపోతే మళ్ళా వెంకటేశ్వర్లు నుండి పుచ్చుకోమని సూచిస్తున్నాడా? బహుశా అదే అయి ఉంటుంది. వెడుతూ వెడుతూ నవకళా చిత్రాలయ ఆఫీసుకు కూడా ఓసారి పోతానన్నాడు. తనిట్లా రావుగారి దగ్గరకెడుతున్నాననీ, తను రావడానికి చాలా ఆలస్యం కావచ్చుననీ వెంకటేశ్వర్లుకు మాటల సందర్భంలో చెబుతాడు. అంటే లైన్ క్లియరన్న సంగతి ఆ అడవిదున్నకు తెలియజేయడన్న మాట! వాడినడిగి తను మళ్లీ డబ్బు పిండాలి. ఆ డబ్బును మళ్లీ ఖర్చు చేయాలి. అదయిపోయాక, ఇంకోసారి అడవిదున్న నుండి కొంత సొమ్ము కొట్టేయ్యాలి. ఇలాఎంతకాలం తను జరిపేటట్టు?

అదృష్టవశాత్తూ తనకు భగవంతుడు అందమిచ్చాడని మంజరి భావించింది. నాగమణి ధర్మమా అంటూ అందాన్ని రూపాయల్లోకి మార్చుకోవడం తనకు చాలాకాలం కిందటనే తెలుసు. మనిషిని చూడంగానే వాడి తరమా తనకు ఇట్టే తెలిసిపోతుంది. వెంకటేశ్వర్లును తను అర్థం చేసుకొంది. వాడికి పిచ్చెత్తించాలంటే నిమిషాలమీద పని! కానీ తన తెలివితేటలేవీ చలపతి దగ్గర పనికిరావడం లేదు. అంటే- తనకన్నా చలపతి-ఈ సినిమా మనిషి-అసాధ్యుడనే గదా అర్థం!

వెంకటేశ్వర్లును చూస్తే తనకెంత అసహ్యమో తనకూ, ఆ పరమేశ్వరునికీ మాత్రమే తెలుసు. తన అవసరాలు ఆ అడవిదున్నకు తెలీకపోవచ్చుగానీ, వాడి అవసరాలు తనకు క్షుణ్ణంగా తెలుసు. వాడికి తన అందం కావాలి. తన శరీరమిచ్చే సుఖం కావాలి. డబ్బుంది గనక వెధవ దగ్గర, పారేసి కొనుక్కోమను; తన అభ్యంతరం చెప్పదు. లోగడ ఎందరో తన దగ్గరా సుఖాన్ని కొనుక్కొన్నారు. అలాంటి బోడి వెధవల్లో వీడొకడూ!

కానీ వెంకటేశ్వర్లు అంతటితో పోడు. ''నిన్ను ప్రేమించా''నంటాడు. ''నువ్వులేందే బతకలే''నంటాడు. ''నీకోసం ఏం కావాలన్నా చేస్తా''నంటాడు. ఈ మాటలు వినీవినీ తనకు రోతేసిపోయింది. పది రూపాయలిచ్చే ప్రతి చవట సన్యాసీ ప్రేమిస్తున్నానంటుంటే, ఆ మొఖం మీద లాగి తన్నాలనిపిస్తుంది! ఒకసారి -నాగమణి దగ్గర ఉన్నప్పుడేనేమో-దాదాపు అంతపనీ జరిగింది. వాడెవడో ఇటువంటి చెత్తాకానీ వాగుడు వాగుతున్నాడు. మంచంమీంచి కిందికి దొర్లించి తను బయటకొచ్చేసింది. వాడు లబ్బుమంటుంటే అందరూ మూగారు. నాగమణి తనను చచ్చేట్టు కొట్టను కూడా కొట్టింది. ప్రాణం తీసినా తనిక గదిలో కెళ్ళనంది. అప్పుడు మణిమాలను గావును-తనకు బదులుగా నాగమణి వాడికి అప్పచెప్పింది!

ఆలోచిస్తుంటే, వాడికీ ఈ వెంకటేశ్వర్లుకూ భేదమేమీ మంజరికి కనుపించలేదు. వాణ్ణి తను మంచం మీది నుండి దొర్లించేస్తే ఈ అడవిదున్నను మంచం మీదికి ఆహ్వానిస్తోంది. అంతే భేదం!

మంజరికి చిరు చెమటలు పోశాయి సరిగ్గా కూచోలేకపోయింది. లోపలా, బైటా అసంతృప్తి మకమకలాడిపోతూ వుంది. కాస్సేపు నిద్రన్నా పోదామని లేచేసరికి, తాయారు ఓ ఉత్తరం పట్టుకొని వస్తూ కనిపించింది.

''ఎక్కణ్ణించే?'' అన్నది మంజరి.

''నాకెట్టా తెలుసుద్దమ్మాయిగారూ!''

కవరుమీద తన పేరే వుంది! చించి చూసింది. అది రాజమణి రాయించిన ఉత్తరం!

''కాబొయ్యే సినిమాస్టార్‌కు, రాజమణి నమస్కారాలు!'' అంటూ ఉత్తరం ప్రారంభమయింది.

''నీ ఉత్తరం అందింది, నిన్ను గురించి పత్రికల్లో వచ్చే సంగతులు కూడా వసంత చదివి చెప్పింది. ఆ పిల్ల పేరు ''వాసంతి'' కాదు ''వసంత''. నువ్వేదో అసంతృప్తితో ఉన్నావని రాశావు. మళ్ళా గుంటూరు వచ్చేస్తావని రాశావు. మేమిక్కడ సుఖంగా ఉన్నామని నీ భ్రమ. ''వ్యాపారం''

మందగించిపోయింది. ఎక్కువమందికి జీవనం గడవటమే కష్టంగా ఉంది. కనుక నువ్వు రావాకు. వసంత నిన్ను తల్చుకోని రోజులేదు. దాని పాట నీవు వినలేదు గానీ, అద్భుతంగా పాడ్తుంది. నీకన్నా అందకత్తెకూడాను. అదిక్కడ ధ్వంసమైపోతూ ఉంది. దాన్ని నీదగ్గరకు పంపుతాను. డబ్బుకూ ఆడదానికీ లొంగని శక్తి లేనేలేదని నా నమ్మకం. నీ దగ్గర డబ్బులేకపోవచ్చుగానీ; అందం, వయస్సు ఉన్నాయి. ఈ రెండింటితోనూ నువ్వు జయించుకు రావచ్చు. ఆ పని నువ్వు చేయలేకపోతే, నువ్వెందుకూ పనికిరాని చవట పెద్దమ్మవన్నమాట! నీకు చేదోడు వాదోడుగా ఉంటుంది. వసంతను పంపనా? అది నీకన్న తెలివిగలది. నీకు సాయపడుతుంది. ఇక నా ఆరోగ్యం సంగతి, మందులు తింటున్నాను. వ్యాధి పెరగడం లేదు కానీ, కనీసం తగ్గను కూడా తగ్గడం లేదు. నీకేమన్నా కావలిస్తే నాకు రాయి. నీ దగ్గరుంటే పంపించు. నీ బొమ్మను తెరమీద చూడాలని మనస్సు ఆరాటపడిపోతూ ఉంది. మొట్టమొదటిసారిగా, నువ్వు కాళ్లూ చేతులు ఆడిస్తూ, తెరమీద కదులుతుంటే, మాట్లాడుతుంటే, చూడాలనీ, చూసి చచ్చిపోదామనీ ఉంది. నువ్వు పిచ్చిపిచ్చి ఆలోచనలు మానేసి, సినిమా వేషాలకోసం ప్రయత్నించు. ఏవో పనికిరాని ఆలోచనలు పెట్టుకొని బతుకును పాడుచేసుకోకు, నా హితబోధ నీకు ముందు ముందుగానీ అర్థంకాదు. వసంత నీ బొమ్మలు పడిన పత్రికలన్నీ కొని దాచుకొంది. తన బొమ్మ కూడా పత్రికలో చూసుకోవాలని దాని ఆరాటం! చలపతిగారు కులాసాగా వున్నారా? అన్నట్టు చెప్పడం మరచాను. వారం రోజుల కిందట రామచంద్రంగారు వచ్చారు. నీ సంగతి చెప్పాను. మాధవరావుగారు, కొంత పొలం అమ్మేసి నాటకాలకయిన బాకీని తీర్చేశారట! రామచంద్రంగారు అవకాశం చూచుకొని మద్రాసు వస్తారట. మన "అమ్మ" నాగమణి క్షేమం. ఆ దొంగముండ నానా బాధలూ పడుతోంది. అదింకా అవస్థలు పడి చావాలని నా కోరిక. జవాబు రాయి...".

ఉత్తరం చదవడానికి మంజరికి చాలాసేపు పట్టింది. ఒక్కోచోట, చదవడం ఆపి, ఆలోచిస్తూ కూచునేది. నాగమణి, వసంత, రామచంద్రరావు పేర్లు వచ్చినచోట వారితోడి సంఘటనలు జ్ఞప్తికొచ్చి, కళ్ళు నీటితో నిండిపోయాయి.

"ఇంతమంది ఆప్తులను వదులుకొని నేనెందుకు మద్రాసు వచ్చినట్లు, వచ్చి నేను సాధించేదేమిటి?" అని వాపోయింది మంజరి.

"ఏటుందండమ్మాయిగారూ ఆ ఉత్తరంలో?" అన్నది తాయారు.

మంజరి ధోరణి చూస్తుంటే, ఆ జాబులో ఏదో చెడ్డవార్తలున్నాయని తాయారుకు అనుమానం వేసింది.

"ఏమీ లేదు తాయారూ! గుంటూర్లో మా అక్కయ్య ఉందిలే, అది రాసింది".

"అంతా కులాసాగా ఉన్నారా అమ్మాయిగారూ?" అన్నది తాయారు.

"ఆఁ" అని మాత్రమే అన్నది మంజరి.

తాయారు అక్కడో క్షణం కూడా ఉండలేదు. మంజరి "మూడ్స్"బావులేవని తాయారు ఇట్టే. తెలుసుకొంది. అందుకని పనివంకబెట్టుకొని అవతలికి వెళ్లిపోయింది.

ఆ రాత్రి చలపతి రాలేదు. అదృష్టవశాత్తూ వెంకటేశ్వర్లు కూడా రాలేదు. రాకుండే ఉంటే బావుండునని మంజరి వేయిమంది దేవుళ్ళకు మొక్కుకొంది. పనంతా అయ్యాక తాయారు పోతానంటే మంజరి పడుకోమన్నది. కానీ తాయరు వినలేదు. తన కవతల చాలా పనులున్నా యన్నది. అవసరమైతే పొద్దుటే వస్తానన్నది. ఎంత గుచ్చిగుచ్చి అడిగినా, ఆ పనులేమిటో తాయారు నుంచి చెప్పించనే లేకపోయింది మంజరి.

ఆ రాత్రి చాలాసేపటి దాకా ఆవిడకు నిద్రపట్టలేదు. రకరకాల ఆలోచనలతో మనస్సంతా ఇసుళ్ళపుట్టలా అయిపోయింది.

''సులభంగా నిద్రపడితే బావుండును''అని చాలాసార్లు అనుకొంది మంజరి.

తీరానిద్రపట్టబోయేసరికి, తెల్లవారడానికి ఎంతో టైంలేదు.

❦❦❦❦❦❦❦❦

చలపతి ఉదయం ఎనిమిది గంటలకు ఇంటికొచ్చాడు. వస్తూనే హాయిగా నవ్వాడు. ఎంతో ఉత్సాహంగానూ కనిపించాడు.

మంజరిని చూస్తూనే చలపతి సగం తగ్గాడు. ఆవిడింకా నిద్రమత్తు నుండిపూర్తిగా కోలుకోలేదు. కళ్లు ఎర్రగా వాచిపోయి ఉన్నాయి. జుట్టంతా చిందరవందరగా ఉంది.

''అలా ఉన్నావేం మంజూ?'' అన్నాడు చలపతి. ''రాత్రల్లా నిద్రపోనట్లుందేం? వెంకటేశ్వర్లుగారు కూడా నాతోనే ఉన్నారు ఇప్పటిదాకా. నాకోసం ఇంకెవరన్నా వచ్చారా?''

మంజరి ప్రాణం చివుక్కుమంది!

అసలు విషయం చెప్పడం ఇష్టంలేక, మాటను తప్పించేసింది.

''ముందు నాకో మాటివ్వాలి మీరు. ఇలా నన్ను వొంటరిగా వొదిలి రాత్రులకు రాత్రులు మీరు మాయమయిపోతుంటే, నేనేంగావాలని మీ ఉద్దేశం? పగలల్లా ఎక్కడ తిరిగినా....కనీసం ఆ తాయారన్నా పడుకొంటుందంటే...అదీ వీలుకాదన్నది''అన్నది మంజరి.

చలపతి మనస్సు కరిగిపోయినవాడులాగా అభినయించాడు.

''ఓసి వెర్రిదానా! ఈమాత్రం దానికి ఇంత బేజారయితే ఎలా? నేనేమన్నా తమాషాకు తిరుగుతున్నాననుకొన్నావా? అవతల నాకు బోలెడన్ని పనులున్నాయి...రాత్రిరావుగాన్ని కలుసుకొన్నాను...''

''ఏమన్నారు?'' అన్నది మంజరి.

చలపతి చిరునవ్వు నవ్వాడు.

''నీ జాతకం బ్రహ్మాండమయింది మంజరీ! పరబ్రహ్మశాస్త్రిగారు చెప్పినంతా జరుగుతోంది. వారికి నీ సంగతంతా చెప్పాను. ''అలాగే చూదాం'' అన్నారు మామూలుగా. ''ఆ అమ్మాయి మీ దర్శనం చేసుకోవాలని ఆరాటపడిపోతూ ఉంది సార్! ఒక్కసారి అప్పాయింట్ మెంట్ ఇప్పించ''మన్నాను. ముందుగా టైంలేదని గొణుగుతూనే చివరికి, ఈరోజు సాయంత్రం రమ్మన్నాడు. వారిచేత ఆ మాట తీసుకొని, నవకళాచిత్రాలయ కెళ్లాను. తెల్లవారుజాముదాకా మేమిద్దరమూ కథను గురించే మాట్లాడుకొన్నాం. ఆయన ఫోక్ పిక్చర్ తీయడానికి రెడీగానే ఉన్నాడు. రావుగారికి ఫోక్ హీరోగా బోలెడంత పేరుంది. ప్రొడ్యూసర్ మనవాడే గనక,నువ్వు హీరోయిన్ కాక తప్పదు. తొలిసారిగానే, రావుగారి ప్రక్కన హీరోయిన్ ఛాన్సు దొరకడమంటే, నీ అదృష్టం పండిందన్న మాటే! రేపణ్ణించీ, నీ గుమ్మం ముందు ఎన్ని గొర్రెలు క్యూలో నిలబడతాయో నీవు వూహించలేవు''అన్నాడు చలపతి.

ఇప్పటికప్పుడే పొద్దుగూకితే బావుండుననిపించింది మంజరికి. ఆవిడకున్న బద్ధకమంతా వదలిపోయింది. గబగబా స్నానం ఏసి బట్టలు మార్చుకొచ్చింది.

''నేనన్ని ఏర్పాట్లూ చేశాను'' అన్నాడు చలపతి కాఫీ చప్పరిస్తూ.

మంజరికి అర్థంగాలేదు.

''మొట్టమొదటిసారిగా నిన్ను చూడటం గనక, వారికి నీమీద మంచి అభిప్రాయం కలగాలి''.

''నాకేదో భయంగా ఉన్నదండీ!'' అన్నది మంజరి.

''ఫర్వాలేదు. నేను నీ కన్నీ విడమరిచి చెబుతాను. నామాట ప్రకారం నడుచుకో. నువ్వు వొడ్డెక్కుతావు. మనం కారుమీద పోతున్నాం. వెంకటేశ్వర్లుగారిని కారడిగాను. వారూ ఇస్తామన్నారు. వెంకటేశ్వర్లుకు రావుగార్ని హీరోగా బుక్‌చేదామని ఉంది. రావుగారికేమో ఇప్పటికే పదిహేను పిక్చర్లున్నాయి. తీరా అడిగితే వీలుపడదంటాడేమోనని వెంకటేశ్వర్లు భయం. కానీ రావుగారలా అనరు. ఆ మాటకొస్తే ఏ యాక్టరూ అనడు. వేలకు వేలు డబ్బొస్తుంటే చేదా వద్దనేందుకు? మరెందుకంటున్నారంటే డిమాండ్ పెరిగేందుకు. ''నా వల్ల కాదయ్యా బాబూ!'' అని వారం పాటు తిప్పించుకొని ఇంకో పదివేలు ఎక్కువ గుంజి వేషాలు వేసేస్తారు. రేపునీకూ పేరొచ్చి నీకూ డిమాండ్ పెరిగితే నువ్వూ ఇలానే అనాలి. అప్పుడు నేను చూసుకొంటాననుకో... చెప్పవచ్చిందేమిటంటే మంజూ! నువ్వు ఫలానా కంపెనీ వారి కారులో వచ్చానని రావుగారికి తెలియడం ముఖ్యం. మంజరి మరీ అంత దిక్కులేని మనిషి కాదనీ, ఆవిడ వెనక వో కంపెనీ ఉన్నదనీ రావుగారికి, తెలిస్తే నీ విలువ తప్పకుండా పెరుగుతుంది. నీ ద్వారా ఆ కంపెనీలో వేషం సంపాదించవలసిన అవసరం రావుగారికి లేదనుకో. కనీసం ఆయన్ను గురించి నాలుగు మంచి మాటలన్నా చెబుతావు గదా! ఆ ఆశతోనైనా వారు నిన్ను మర్యాదగా చూస్తారు. నీకు సాయం చేస్తారు''అన్నాడు చలపతి.

ఇందులో యిన్ని గుంటచిక్కులున్నాయని మంజరికి తెలీనే తెలీదు. ఆవిడ ఆశ్చర్యపోయి కళ్ళింతచేసుకొని చలపతి కేసి చూసింది.

''ఇన్నిటికీ నన్నేం చెయ్యమంటారో మీరు చెప్పనే లేదు'' అన్నది.

''వస్తున్నాను'' అంటూ ప్రారంభించాడు చలపతి. ''నిన్ను రావుగారి పెర్సనల్ రూములోకి తీసుకుపోతాను. ''వారే రావుగారు'' అని నేనక్కడ అనడం బావుండదు. తనను గురించి మూడున్నరకోట్ల మంది ఆంధ్రులకూ క్షుణ్ణంగా తెలుసునన్న భ్రమ ప్రతి సినిమా వాడికి ఉన్నట్లే, ఆయనకూ ఉంది. ఆయన్ను చూస్తూనే నువ్వు నమస్కారం పెట్టేయాలి. ఆయన కూచోమంటాడు''.

''కూచోమంటే కూచోనుటండీ మీ పిచ్చిగానీ, ఆ మాత్రం తెలీదా నాకు?'' అన్నది మంజరి.

చలపతి రెండు చేతులతోనూ తలపట్టుకొన్నాడు. మళ్ళా ఏదో కొంపమునిగిందనుకొన్నది మంజరి.

''నువ్వా వెధవపని చేస్తావని నాకు తెలుసు. చెయ్యకూడదనే నేను చెబుతూంట. ఆయన్ని చూసి దిమ్మరపోయినట్లు కనిపించాలి. కన్నార్పకుండా చూడాలి. నాలుగైదుసార్లు కూచోకూచోమని అనిపించుకొన్నాక, ''ఫర్వాలేదు, ఫర్వాలేదు, నేనిలా నిలబడతాన్లెండి'' అంటూనే కూచోవాలి. ''మిమ్మల్ని చూడటం వల్ల నా జన్మ ధన్యమయిం''దన్న ధోరణిలో మాట్లాడాలి. ఆ ధోరణిలోనే అనాలి గానీ, అవే మాటలు అనకు. రావుగారు కాలాంతకుడు. ఆవలిస్తే పేగులు లెక్కించే రకం. ఆయనతో మాట్లాడటమంటే కత్తులమీద నడిచినట్లుగా ఉంటుంది. మనిషిలో లోతులేదు. లోతు ఉన్నట్లుగా కనిపిస్తాడు. నటుడు గనక మరింత సహజంగా నటిస్తాడు. ఆయన ఏకపత్నీ వ్రతుడు కాదు-మంచి రసికుడు. సౌందర్యాన్ని ఆరాధించే తత్వం. ఆయనకు నచ్చావో నీ చక్రం తిరిగిందన్న మాటే!'' అన్నాడు చలపతి.

''మీరు పక్కనే ఉంటారు గనక, నెగ్గుకొస్తాన్లెండి ఫర్వాలేదు'' అన్నది మంజరి, తనకు తాను ధైర్యం చెప్పుకొంటూ.

“నో...నో” అనేశాడు చలపతి. “మహా ఉంటే పదినిమిషాలుంటానేమో! తరువాత నేను బయటికొచ్చేస్తాను. అరగంటో, ముప్పావు గంటో, గంటో ఉండిరా. ఒక్కటే గుర్తు. మాంఛిపట్టులో నేను ముందుగా జేబు తడుముకొని అగ్గిపెట్టె చప్పుడు చేస్తాను సిగరెట్ కాల్చుకునేందుకు వెళ్ళాడని రావుగారనుకొంటారు. నీకా చప్పుడే సిగ్నల్” అన్నాడు చలపతి.

“ఇంకేమన్నా జరుగుతుందేమోనండీ!” అన్నది మంజరి.

చలపతికి మండిపోయింది.

“అయితే వెళ్లి గంగలో దూకు. ఇహ నావల్ల కాదు” అన్నాడతను.

మంజరి చిన్నపోయింది.

“అదిగాదే పెద్దమ్మా! చిలక్కు చెప్పినట్లు ఇన్ని చెప్పినా నీకర్థం కాకపోతే నువ్వెలా పైకొస్తావాని? ఆయనగానీ రాక్షసుడా- నీ ప్రానాలు తీసెయ్యడానికి? అయితే అవుతుంది; కాకపోతే కాదు. యింతలో కొంపలు మునిగిపోవు”.

మంజరి పలకలేదు.

“సాయంత్రం మూడున్నరా నాలుగింటికల్లా నటేశాన్ని రమ్మన్నాను. ఇందాకనే నీ ఫొటో చూపించానతనికి. నీకు సరిపడే మేకప్ సామానుతో వస్తాడు. చక్కా మేకప్ కావాలి. చూచేసరికి కళ్ళు చెదిరిపోవాలి. ఎల్లోరా హెయిర్ స్టయిల్ ఎప్లయి చేయడంలో నటేశం అసాధ్యుడు. అన్నట్టు ఇంకో సంగతమ్మాయ్! రావుకు స్ట్రాంగ్ సెంట్సు పనికిరావు. డిమ్ వెరైటీస్ వాడాలి. అవీ ఆయనే తెస్తానన్నాడు. ఈలోగా నువ్వు స్నానం చేసి రెడీ ఉండాలి. నిద్రపోవాకు, కళ్ళు వాచిపోతాయి. నీకు విడిగా లిప్‌స్టిక్ బావుండదు. తాంబూల వేసుకొని నోరు శుభ్రం చేసుకో...ఇదంతా నీకు కొత్తగనక చెబుతున్నాను”.

నాలుగు లోపుగా నటేశం వచ్చాడు. భుజాలమీద పడే పెద్దజుట్టు, తాంబూల చర్వణంతో గారపట్టిన పళ్లూ, తెల్లలుంగీమీద గ్లాస్కోలాల్చీ, మెళ్ళో సన్నని బంగారుగొలుసూ, చడావులూ-చూడ్డానికి చిత్రంగా ఉన్నాడతను.

“వణక్కం మాయీ, వణక్కం” అన్నాడు నటేశం మంజరిని చూస్తూనే.

“తెలుగు స్టారేనయ్యా! ఇంకా అరవం రాదు” అన్నాడు చలపతి నవ్వి.

“అట్లానా!” అన్నాడు నటేశం.

ఆ తరువాత తలపంకిసూ, “రొంబా బ్యూటీఫుల్ ఫేస్‌కట్ సామీ! టెర్రిబుల్ ఫోటోజెనిక్ ఫేస్‌దా, నానుదా వత్తన్నాను సమచ్చరం యింద మాదిరి మేకప్ చేస్తా ఉంటిమి. ఈ తల్లిదా మూణుమణిసి నిక్కాయం సొల్లుదును. వండ్రఫుల్ సామీ!” అన్నాడు నటేశం.

అతనంటున్నది అర్థమయి కాదు గానీ, ఆ ధోరణికి మంజరి నవ్వుకొంది.

“నువ్వు తొందరగా కానివ్వు నటేశం, నేనీలోగా కారు పట్టుకొచ్చేస్తాను” అని లేచాడు చలపతి.

“కట్టాయం సేస్తేను సామీ! అంగ వా అమ్మా! రూమ్‌కు రా!” అని లోపలికొచ్చాడు నటేశం.

“వీడేమన్నా అఘాయిత్యం చేస్తాడేమో”నని మంజరికి అనుమానం వేసింది. చలపతేమో ఆ సరికే వెళ్లిపోయాడు. ఇప్పుడు భయపడినా ప్రయోజనం లేదని తెలిపోయింది. ఆనిశ్చయమయ్యా “ఆఁ-చేస్తే చెయ్యనిద్దూ, ఇంతలో ముంచుకు పోయిందేమిటి గనక?” అనుకొంది మంజరి.

అదృష్టవశాత్తూ నటేశం ఏ అఘాయిత్యమూ చెయ్యలేదు. పెట్టెలోంచి రకరకాల డబ్బీలూ, పౌడర్లూ, ట్యూబులూ, సెంట్లూ, బ్రష్షులూ తీశాడు. ముందుగా ముఖాన్ని నీటితో కడిగి, ఆ తరువాత

మేకప్ చేశాడు. కనుబొమలు దిద్దాడు. కనురెప్పలు దిద్దాడు. అందంగా కాటుక తీర్చాడు. రెండు, మూడు సవరాలు చేర్చి అద్భుతంగా జుట్టు ముడివేశాడు. మాయముత్యాల దండను తల్లో అమర్చాడు. కణతల మీది నుంచి కొద్ది జుట్టును చెంపలమీదికి జార్చి, వంకీగా మెలితిప్పి, అది మళ్లీ గాలికి లేవకుండా జిగురుతో అంటించాడు. మంజరి నుదురు మరీ విశాలం. అంచేత జుట్టును నుదురు కప్పడిపోయేలాగా, ముందుగా దువ్వాడు. కసిన్ని వెంట్రుకలు పొరబాటున మొహం మీద పడ్డాయన్న భ్రమ కలిగేలా ఏర్పాటు చేశాడు. జుత్తు ముడిమీద బంగారు రంగులీనే పువ్వులు తాపిన గుడ్డను పిన్నులతో గుచ్చాడు. దూరంనుంచి చూస్తుంటే, మంజరి జుత్తు ముడిమీద మిణుగురులు ఎగురుతున్నాయేమోననిపిస్తుంది.

"చీరెకట్టుకుర"మ్మన్నాడు నటేశం.

ఆవిడ వచ్చాక పెదవి విరిచేశాడు.

"అదిదా సరిగ్గా లేదు మేడమ్! నేనుదా సరిచేస్తున్నా?" అన్నాడు నటేశం.

"కొంప మునిగింది" అనుకొన్నది మంజరి. "ఏదయితే అదే అవుతుంది" అని ధైర్యం కూడా చెప్పుకొంది. ఈలోగా చలపతి కారు తీసుకొచ్చాడు. మంజరి హాయిగా ఊపిరి పీల్చుకొంది.

"ఇంకా కాలేదా?" అని మంజరికేసి తిరిగి, చీరె కట్టును చూసి పకపకా నవ్వాడు చలపతి. "అచ్చమైన పల్లెటూరిదానిలాగా వున్నావు. నువ్వు గడ్డిమోపులు మొయ్యడానికి పోవడం లేదు. ఏమిటా చీరకట్టుకోవడం? నటేశం, తొరగా చూడు నాయనా".

నటేశం అద్భుతంగా చీరె కట్టాడు. చీరె అంచులు నేలకు జీరాడుతున్నాయి. దాదాపు మోకాళ్ళ దిగువదాకా పమిట జారి ఉన్నది. ఉన్నంతలో పెద్దసైజు బ్రేసరీస్ వేసుకోమన్నాడు చలపతి. దానిమీద బాడి, ఆపైన పలచని జాకెట్టు వేసుకొంది. వస్తూవస్తూ ఓ చెమ్కీ బుట్టలాంటిది తీసుకొచ్చాడు చలపతి. హైహీల్స్ బూట్స్ వేసుకోమన్నాడు.

అంతా తయారయ్యాక ముందో అద్దం, వెనకో అద్దం పెట్టి "చూసుకోం"డన్నాడు నటేశం.

"బ్యూటిఫుల్" అన్నాడు చలపతి.

అతను మరోమాట లేకుండా పదిరూపాయలు నటేశం చేతిలో వుంచి, "చాలా తక్కువే ననుకో! ఇంకా పనేమీ కాలేదు. కాస్త తాళితే ఈవారా, ఆవారా కలిపి నేను ముట్టచెబుతాను. నీ చేయి మంచిది. నాకు తెలుసు. నువ్వు తొలిసారిగా మేకప్ చేసినవారందరూ చుక్కల్లోకెక్కారు. అంచేతా మా వాళ్లకు నీచేత చేయించాను. మళ్లా కలుస్తాను గదూ!" అని పంపించేశాడు.

"ఈ కాస్సేపుకూ పదిరూపాయలా?" అన్నది మంజరి కళ్ళు చికిలిస్తూ.

"నువ్వు డబ్బు మొహమే చూశావు గానీ, నువ్వెంత బావుందీ చూసుకోలేదు. అవతల రావుగారికి అప్పాయింట్‌మెంట్ ఇవ్వకుండా ఉన్నట్లయితే నిన్నిప్పుడు అమాంతం నమిలి మింగేసి ఉందును" అన్నాడు చలపతి పళ్ళు కొరుక్కుంటూ.

"పోనీ మింగేయండి" అన్నది మంజరి కూడా వాతావరణాన్ని అనుకూలంగా మార్చడానికి ప్రయత్నిస్తూ.

"అనే ఉందిగానీ, మళ్ళా మేకప్ పాడయిపోదూ? అందుకూ నా భయం! సరే నువ్వింకా సెంట్సు రాసుకోనేలేదు...లైట్‌గా, చాలా లైట్‌గా ఉండాలి. పీనాసిగుణం కట్టేసి, కాస్త వళ్లంతా పట్టించుకో. వళ్లంతా అంటే-అర్థమయిందిగా-పోనీ నేను పుయ్యనేమిటీ?" అంటూ దగ్గరగా వచ్చాడు చలపతి.

మంజరి నవ్వుతూనే అవతలకెళ్ళింది. ఆవిడ తిరిగొచ్చేసరికి చలపతి తిరుపతి వేంకటేశ్వరస్వామి పటం ముందు నిలబడి దణ్ణం పెడుతున్నాడు. రెండు మూడు నిమిషాలయ్యాక చెంపలు వేసుకొని ఇవతలగా వచ్చి నిలబడటమే కాకుండా, మంజరిని కూడా దణ్ణం పెట్టమన్నాడు.

వారు బయలుదేరేసరికి ఆరుగంటలు కావస్తోంది. తాయారును ఇంట్లో ఉంచి, ఎవరు వచ్చినా కూచోమన్నారని చెప్పి, స్టీరింగ్ దగ్గర కూచున్నాడు చలపతి. మంజరి రెండోవేపు నుండి తలుపు తీసుకుని అతని పక్కన కూచోబోయింది.

"నీ కీ మాత్రం కూడా తెలియదేం మంజరీ! నువ్వొంటరిగా వెనకనే కూచోవాలి. నీ పక్కన ఎవ్వరూ ఉండకూడదు. అది నీ డిగ్నిటీకి లోపం. దయచేసి నువ్వలా వెనక్కూచో"అని సలహా ఇచ్చాడు చలపతి.

కారు బయలుదేరాక చలపతి అడిగాడు- "వెంకన్నకు ఏమని దణ్ణం పెట్టుకున్నావు మంజరీ?" అని.

మంజరి గుండెలు గతుక్కుమన్నాయి. నిజానికి కీవిడ ఏమనుకొనీ దణ్ణం పెట్టలేదు. ఊరికే నమస్కారం చేసింది. ఆ మాట పైకి చెప్పేస్తే చలపతి చంపేలాగా కనిపిస్తున్నాడు. అందుకని-

"మీరేమనుకున్నారో ముందు చెప్పండి మరి!" అన్నది మంజరి.

"మన ప్రయత్నం సఫలమైతే మొదటిబుకింగ్‌లో వచ్చేదాంట్లో సగం నీకిస్తాను".

"నాకా?" అన్నది మంజరి నవ్వి.

"నీక్కాదోయ్! వెంకన్నకు-" అన్నాడు చలపతి కూడా నవ్వుతూ, "ఇస్తాననీ-వింటున్నావా, ఇద్దరమూ వచ్చి స్వయంగా దర్శనం చేసుకొంటామనీ మొక్కుకొన్నాను. మరి నువ్వో...".

"డబ్బు సంగతి అనుకోలేదు. దర్శనం చేసుకొంటానని మాత్రం మొక్కు కొన్నాను" అని అబద్ధమాడేసింది మంజరి.

"నిజంగా మంజరీ! తిరుపతి వెంకన్న నమ్మినవాళ్లను చెడగొట్టడు. కృష్ణా సినీమూవీస్ వారి పిక్చరు డబ్బు లేక నాలుగేళ్ళు మూలపడిపోయింది. నేనే వెళ్ళి ఈ సలహా ఇచ్చాను. నాలుగోనాటికి కృష్ణా జిల్లా నుంచి ఓ ఆసామి వచ్చి నాలుగు లక్షలు పెట్టి డబ్బాలు బైటికి లాగాడు. ప్రీవ్యూ ఇచ్చాం. నాలుగోనాటికి పెట్టెలు తిరిగొస్తాయన్నారు. పత్రికల వాళ్ళు కూడా చీల్చిపారేశారు. ఆ డిస్ట్రిబ్యూటర్ లబోమని గోల. డబ్బు పెట్టిన ఆసామి జబ్బుచేసి ఆసుపత్రిలో చేరాడు. ఆఖరుకు ఆఫీసుకొచ్చిన ఉత్తరాలు చూసే దిక్కు కూడా లేదు. ఏమిటి చేయటం? పరబ్రహ్మశాస్త్రి గారిని సలహా అడిగాను. ఆయనగారు స్వామివారి సన్నిధిన డబ్బాలకు అభిషేకం చేయించమన్నాడు. బలవంతాన ఆ పని చేయించాను. థియేటర్లలకు పిక్చర్ పంపించింది కూడా నేను! ఓ వారం రోజులు కలెక్షన్స్ చాలా డల్‌గా వున్నాయి. ఇహ ఆ తరువాత స్పీడ్ అందుకొన్నదనుకో మంజరీ! జనం వేలంవెర్రిగా చూశారు. ఊళ్ళనించి బళ్లు కట్టుకొచ్చి మరీ చూశారు. ఇరవై నాలుగు సెంటర్స్‌లో శతదినోత్సవాలు చేసుకొన్నది డిస్ట్రిబ్యూటర్సు వాటా పోను, కంపెనీకి తొమ్మిది లక్షలు లాభం వచ్చింది. ఆ దెబ్బతో వాళ్లు ఒకేసారి రెండు పిక్చర్సు ప్రారంభించారు. దేవుణ్ణి మరచిపోయారు. తమ పిక్చర్లో స్టార్ వాల్యూ ఉంది గనకనే పోయిందన్నారు".

"డబ్బాలు అభిషేకం చేయించగనే వొరుగుతుందనుకోవడం అబద్ధమన్నారు. నేను చెప్పినా వినలేదు. 'అనుభవిస్తార్లే' అనుకొన్నాను. ఏడాది తిరక్కముందే మొత్తం ఆరిపోయారు. ఆఫీసు బిల్డింగుకు మూడు మాసాల అద్దె బకాయిపడి చెల్లించలేక ఇంటాయనకు కుర్చీలూ, బల్లలూ

అప్పగించేశారు. కాబట్టి-ఆ అహం మనిషికి పనికిరాదు. సినిమా వాళ్ళకు అసలే ఉండకూడదు'' అన్నాడు చలపతి.

ఈ విషయాలేవీ మంజరికి రుచించడం లేదు. ఆవిడ మనస్సంతా రావుగారి చుట్టూ తిరుగుతూ ఉంది. అతన్ని చాలా సార్లు తెరమీద చూసింది. చూసినప్పుడేమనిపించిందో తనకిప్పుడు జ్ఞాపకం లేదు. కానీ ఈ మనిషిని ఇహ ముందు ముందు తను కలుసుకొనవలసి వస్తుందని మాత్రం అనుకోలేదు. అప్పటికి తనింకా నాటకాల కంపెనీలోకి కూడా రాలేదు. నాగమణి దగ్గర 'వ్యాపారం'లో ఉన్నది.

"నే చెప్పింది విన్నావా?'' అని మరోసారి జ్ఞాపకం చేశాడు చలపతి.

"ఆఁ ఆఁ, వింటూనే ఉన్నాను. దాన్ని గురించే ఆలోచిస్తున్నాను. కొన్ని కొన్ని విషయాలు ఎంత చిత్రంగా ఉంటాయో మరి!'' అన్నది మంజరి.

ఈ మాదిరి అభినందన వాక్యాలు ఏ సందర్భానికయినా వర్తిస్తాయి. ఎదుటమనిషి చెబుతున్నదేమిటో మనం వినిపించుకోనప్పుడూ ఆ విషయాన్ని గురించే మన అభిప్రాయాన్ని ఆమనిషి అడిగినప్పుడూ ఈ తరహా అభినందన తక్కున సరిపోతుందని మంజరికి తెలుసు. అందుకే ఆ వాక్యాలు చక్కగా వల్లించి చలపతిని నిరుత్తరుణ్ణి చేసేసింది మంజరి.

"అదిగో! ఆ మూలమీదుగా తోట కనిపిస్తున్నది చూశావా?''

"ఆఁ'' అన్నది మంజరి.

"అది రావుగారిల్లు. ఇంకో రెండు మూడు నిమిషాలు-నేను కారు మెల్లగా నడుపుతాను గానీ, ఈలోగా నువ్వోసారి మేకప్ చెరిగిపోయిందేమో చూసుకో!''అన్నాడు చలపతి.

మరో రెండునిమిషాల కల్లా కారు ఓ పెద్ద తోటలో గుండా పరుగెత్తి పోర్టికోలో కొచ్చి ఆగింది.

ఆ క్షణాన మంజరి అనుభూతులెలా వున్నాయో మనం తెలుసుకొనేందుకు, ఆ దరిమిలా ఆవిడ ఇచ్చిన ఇంటర్వ్యూ చూడటం అవసరం. అందులో మంజరి ఇలా చెప్పింది-

"నాలుగు సంవత్సరాల నాటి సంగతిది. అప్పటికి నేనింకా చలన చిత్రరంగంలోకి అడుగుపెట్టలేదు. ఆ కళామతల్లి చల్లని దృక్కులు నామీద ప్రసరించలేదు. ఏదో పనిమీద మద్రాసు వచ్చాను. వచ్చాను గదాని నా అభిమాన నటీనటులను వొకసారి చూడాలని నిశ్చయించుకొన్నాను. చాలామంది షూటింగ్స్‌లో ఉండడం వల్ల ఎక్కువసేపు వారితో గడిపేందుకు అవకాశం కలగలేదు. ముందుగా టెలిఫోన్ చేసి తేదీ, టైమూ నిర్ణయించుకొన్నాక శ్రీరావుగారిని నేను కలుసుకొన్నాను. వారు నా అభిమాన నటులు. నా చిన్నతనంలో శ్రీరావుగారు నటించిన యెన్నో సినిమాలు చూశాను. సినిమాల్లో వారు చేసే సాహసకృత్యాలు నన్ను ముగ్ధురాలిని చేశాయి. ఆ రోజుల్లోనూ, ఆ తరువాతనూ...నేను వారిప్రక్క హీరోయిన్‌గా నటించవలసి వస్తుందని కలలో గూడా అనుకోలేదు. నేనింత దాన్నయ్యానంటే పరిశ్రమలోని పెద్దలు, నిర్మాతలు, దర్శకులు, సహనటులు, ముఖ్యంగా ప్రేక్షకులు నాపట్ల చూపించిన ఆదరాభిమానాలే కారణం. ఈ అభివృద్ధికి పరోక్షంగా సాయం చేసినవారు శ్రీరావుగారు, వారికి నేను ఆజన్మాంతం కృతజ్ఞతాబద్ధురాలిని''.

రావుగారిని చూసినపుడు మీరేం ఫీలయ్యారండీ?'' అని అడిగాడు పత్రికా విలేఖరి.

"నా ఆరాధ్య దైవాన్ని ప్రత్యక్షంగా చూడబోతున్నానన్న ఉత్సాహం నాలో ఉరకలు వేసింది. అడుగులు తడబడ్డాయి. మాట పెగిలిరాలేదు. గొంతుక పొడారిపోయింది. గుండెల్లో భయమూ, ఉద్వేగమూ పెనవేసుకుపోయాయి. ఆంధ్రచలనచిత్ర రంగంలో ఒక ధ్రువతారగా వెలిగిపోతున్న ఒక కళామూర్తిని దర్శించనున్నాననే గాఢమైన సంతృప్తితో బాటు చెప్పరాని భయం కూడా నన్ను

ఆవేశించింది. ఆనాటి నా అనుభూతులను నేను మాటల్లో వ్యక్తం చేయలేక పోతున్నాను. మన్నించాలి. నన్నడిగితే రావుగారొక కళాద్రష్ట. కళాస్రష్ట. చిత్రకళామతల్లి దశాబ్దాలుగా నోచిన నోములు ఫలించి శ్రీరావుగారి లాగా మూర్తీభవించినాయనుకొంటాను. వారు నన్ను ఆప్యాయంగా ఆహ్వానించారు. అంతకన్నా ఆప్యాయంగా ఆదరించారు. అరవిడిచి  మాట్లాడారు. నా యోగక్షేమాలు అడిగి తెలుసుకొన్నాను. అంతక్రితమే నన్ను గురించి వారు విన్నారట. నా నాటకాలు మాత్రం ఏమీ చూడలేదుట...'.

'మీలాంటి విదుషీమణులు, కళాభిమానులు ఈరంగంలోకి విరివిగా రావాలి. మాలాంటి వారు తప్పుకోవాలి. మీ కళాకృషిని సినిమారంగానికి కూడా విస్తరింపచేయవలసిందిగా నేను కోరతున్నాను'' అన్నారు రావుగారు.

'అంతవరకూ, సినిమాల్లోకి రావాలన్న ఆలోచన కూడా లేని నేను వారలా అనడంతో ఆలోచించుకోవాలనిపించింది. అందరూ అనుకొంటున్న మాటలను శ్రీరావుగారితో చెప్పాను. వారు హృదయపూర్వకంగా నవ్వారు.

''ఈ పరిశ్రమ విషయం తెలియని వారు అలానే అంటుంటారు. మీవంటి సమర్థులు ఈ రంగంలోకి రావాలేగాని తప్పకుండా ప్రోత్సాహం లభిస్తుంది' అన్నారు శ్రీరావుగారు.

'ఆ తరువాత వారన్నమాటలు అక్షరాలా నిజమయ్యాయి. వారి ద్వారా నేను యెంతో అభివృద్ధిని పొందాను. అభినయంలోని అతి సున్నితమయిన విషయాలను వారు నాకు ఓపికగా బోధించారు. సంభాషణలను ఉచ్ఛరించడంలోని సులువులు, భావాలను పలికించడంలోని రీతులు-ఇవి వారే నాకు ప్రసాదించారు. దాదాపుగా వొకటిన్నర సంవత్సరాల కఠిన శిక్షణా నంతరం శ్రీరావుగారు నన్ను చలనచిత్ర కళామతల్లి పాదారవిందాలకు అంకితం చేశారు. ఆనాటి నుండి నేటిదాకా, నేను దేవిని అర్చిస్తూనే ఉన్నాను. ఇంతవరకూ నేను నాలుగు చిత్రాల్లో శ్రీరావుగారి ప్రక్కన హీరోయిన్‌గా నటించాను. నేనెలా నటించింది చెప్పవలసినవారు సహృదయులైన పత్రికలవారూ, ప్రేక్షకులూను' అని చెప్పింది మంజరి.

లోగుట్టు తెలిసినవారు ఇదంతా నిజమనుకోవచ్చు. జరిగిందేమిటంటే రావుగారు ఆమెను ఆహ్వానించడమయితే చేశారు గానీ, తాను మాత్రం ఏ ముక్కా 'కమిట్' కాలేదు. మంజరి యోగక్షేమాలడగటం, చలపతిని కుశల ప్రశ్నలు వేయడం వరకూ నిజమే.

''మిమ్మల్ని గురించి చలపతిగారు నాతో చాలాసార్లు చెప్పారు. నాకు బొత్తిగా టైం లేకుండా ఉంది. ఇప్పుడయినా నాకు తీరుబడి లేదు. వొంట్లో బావుండలేదని సెక్రటరీతో చెప్పేశాను...నాసినిమాలు మీరేమేం చూశారండీ?'' అన్నాడు రావు.

ఆ ప్రశ్న వింటూనే మంజరి బిత్తరపోయింది.

ఏం చెప్పాలో తోచక ఓ నిమిషం పాటు గిజగిజలాడింది.

చలపతి పరిస్థితిని అర్థం చేసుకొని చటుక్కున రంగంలోకి దూకాడు.

''అలా విడమరిచి చెప్పడం కష్టంలెండి బాబుగారూ! మీరు యాక్ట్ చేసిన అన్ని సినిమాలు మంజరి చూసింది. చిన్నప్పట్నించి దానికి సినిమాలంటే వల్లమాలిని పిచ్చి. ఒకసారి ఏం జరిగిందంటేనండీ-మీరున్న పిక్చర్ గుంటూర్లో రిలీజయింది. నెలరోజులక్కూడా టిక్కెట్లు అందడం లేదు. ముఖ్యంగా మీరు తాగుబోతుగా చేసిన యాక్షన్ జనాన్ని పట్టేసింది. పనీపాటా లేని కుర్రకారంతా పెందరాడే బుకింగ్స్ దగ్గర చేరి పాతికేసి టిక్కెట్లు కొనేసి, బ్లాక్‌లో అమ్ముకొని వేలు సంపాదించారు.

మా కిష్టుడూ అలా బాగుపడ్డవాడేననుకోండి. ఆ సినిమా చూడాలని దీనికి పట్టుకొంది. టిక్కెట్లు దొరకడం లేదని చెప్పినా వినలేదు. ఆఖరుకు మాతో చెప్పకుండా గుంటూరు వచ్చేసింది. మా బావగారేమో లబ్బుమని గోల. ఆయన బావులూ చెరువులూ వెదుకుతుంటే, నేను ఓ యాభై పుచ్చుకొని గుంటూరొచ్చాను. అదెక్కడుండేదీ నాకు తెలుసు గదా! హాల్లో పట్టేశాను. వరసగ్గా వారం రోజులుండి రోజా రెండాటలూ చూశాక గానీ అది నిద్రపోయింది కాదు...మీ ఫొటో పత్రికల్లో కనబడితే చాలునండీ, అంతమేరా కత్తిరించేసి దాచుకొంటూ ఉండేది. అనగూడదు గానీ రావుగారూ! మీకు పెళ్ళే కాకుండా వుంటే మా మంజరి తనను పెళ్లాడమంటూ మీ వాకిటి ముందర సత్యాగ్రహం చేసేదనుకోండి. ఇదీ దాని వ్యవహారం. ఏం మంజరీ! అలా సిగ్గుపడతావేం? ఇదినిజమా కాదా?'' అన్నాడు చలపతి.

ఇంతసేపూ ఏమనవలసిందీ తోచక కొట్టుమిట్టాడుతున్న మంజరికి కాస్త తెరిపి ఇచ్చినట్లయింది. తనిప్పుడు సిగ్గుపడాలని చలపతి భావం. ''పోనీ అలాగే చేదాం తప్పేం'' అనుకొన్నది మంజరి. అనుకొని-

''పోండి బాబూ! మీరిద్దరూ కలిసి నన్ను వెర్రిబాగులదాన్ని చేసేస్తున్నారు'' అన్నది సిగ్గునభినయిస్తూ.

రావుగారు కూడా సంతృప్తిగా నవ్వినట్లు అభినయించారు.

''అంతేకాదండీ! మూడు నాలుగేళ్ల కిందట మీకు ఉత్తరాలు కూడా రాసిందండీ! మీరో ఫొటో మీద సంతకం చేసి ఈవిడకు పంపించారు. దాన్ని చక్కా తన ఫొటోలో ఇన్సర్ట్ చేసి ఫ్రేం కట్టించేసుకొంది..ఇన్నిటికి అసలు సంగతి మీకు చెప్పనే లేదు. మంజరి నాకు కాస్త దూరంగా బంధువు. మా పెదతాతగారి మనుమరాలు. వరుసకు మరదలవుతుంది. వీళ్లది సాహిత్యం లోనూ, కళల్లోనూ బాగా పేరు పొందిన వంశం. వీళ్ల నాన్నగారు బ్రహ్మాండంగా నాటకాలు ఆడించారు. ఆ లక్షణాలు దీనికీ అబ్బాయి. చాలా సంవత్సరాల పాటు అనేక రకాల నాటకాలు వేసింది. చాలా కప్పులు సంపాదించింది. మా మంజరికి సినిమాల్లోకి రావాలనీ అట్టే లేదనుకోండి. నేను బలవంతాన ఫీల్డులోకి లాక్కొచ్చాను. మీలాంటి వారు సాయపడతారన్న నమ్మకం నాకుంది గనుకనే నేనా ధైర్యంచేశాను...నాపనేదో అయిపోయింది. తెచ్చి మీకప్పగించాను. ఇహ మీరూ మీరూ ఏమనుకొంటారో అనుకోండి, నాకేమీ సంబంధం లేదు'' అని చేతులు దులుపుకొన్నాడు చలపతి.

''వెరీగుడ్ వెరీగుడ్...తప్పకుండా చూదాం. కానీ -పాపం-అనుకొన్నంతగా ప్రాస్పర్ కావటం కష్టం...''

చలపతి-లోగడ అనుకొన్న సంకేతం ప్రకారం పొడిదగ్గు దగ్గి అగ్గిపెట్టె చప్పుడు చేశాడు. ఇహ తను ఎలర్ట్‌గా ఉండాలనుకొంది మంజరి. చలపతి ఏదో పనున్నవాడిలా అవతలకు వెళ్లిపోయాడు. గదిలో రావుగానూ, మంజరీ తప్ప మరో ప్రాణి లేదు. కింది నుంచి ప్రతి పదేసి నిమిషాలకూ ఫోన్ మోగడమూ, సెక్రటరీ ఏదో అస్పష్టంగా అనడమూ వినిపిస్తోంది.

''ఆఁ...ఇంకేమిటండీ సంగతులు...వచ్చాక ఎవర్నినయినా చూశారా?....మూర్తిగారిని కలుసుకోవడం కూడా అవసరమే! వారూ లీడింగ్ యాక్టరే! చాలా మంచివారు. చేతనయినంత సహాయం చెయ్యగలవారు. మీరో మాటు వారిని చూడ్డం అవసరమనుకొంటారు'' అన్నాడు రావుగారు.

ఆయనామాట ఎందుకన్నదీ మంజరికీ ఇట్టే తెలిసిపోయింది. వారిద్దరి మధ్యా పచ్చిగడ్డి కూడా భగ్గుమంటోందన్న విషయం ఆవిడకు ఎప్పుడో తెలుసు. తన ఉద్దేశం గ్రహించేందుకే రావుగారీ

ప్రస్తావన తెచ్చారన్న నిర్ణయానికి మంజరి తక్షణమే వచ్చేసింది.

"నా కా వుద్దేశం లేదండీ! సినిమా ఫీల్డన్నా వదిలేస్తాను గానీ, మూర్తిగారిని మాత్రం నే చూడను. అసలాయనంటేనే నాకు గిట్టదు. వెనక అండదండలున్నాయి గనక నెట్టుకొస్తున్నాడు గానీ, లేకపోతే ఆయనకు బుకింగ్స్ కూడా రావని నానమ్మకం. ఆయనగారు సహాయం చేస్తాడో లేదో నాకు తెలీదనుకోండి. చేసినా పుచ్చుకొనేందుకు నాకిష్టం ఏదు. కానయినా సినిమాల్లో చేరిపోవాలని లేనే లేదు. ముఖ్యంగా మిమ్మల్ని చూదామని పనిమాలా వచ్చాను. మా చలపతిగారికి మీరంటే వల్లమాలిన గురి. మీరు పూనుకొంటే పది కంపెనీలతో మాట్లాడి, నాకు వేషాలిప్పింగలరని చెప్పారు. మీరు మహానటులనీ కళాప్రపూర్ణులనీ నాకు తెలుసుగానీ, పరిశ్రమలో ఇంత పలుకుబడి ఉన్నదని తెలీదు....అదీగాక చాలామంది ఈ ఇండస్ట్రీలోని వారు కూడా మీ ఆశీర్వాదం పొందితే చాలునని చెప్పారు. ఆ ఉద్దేశంతోనే వచ్చాను. మరోసారి మూర్తిగా ప్రస్తావన నాదగ్గర తీసుకురాకండి" అన్నది మంజరి.

రావుగారేమీ మాట్లాడలేదు.

"మీరు ఎవర్ని కలుసుకున్నారో చెబితే, వారిని నేనూ ఓ మాట చెబుతాను..." అన్నాడు రావుగారు.

ఏం చెప్పవలసిందీ మంజరికి తోచలేదు. ఎవరెవర్నీ తను కలుసుకోలేదు. కనీసం వాళ్ల పేర్లయినా తనకు సరిగ్గా రావు. కల్పించే చెప్పొచ్చు-కానీ రావుగారు ఫోన్‌చేసి కనుక్కొంటే తమ అభాసుపాలు గావాలిసొస్తుంది. ఆదిలోనే తనమీద బాడ్ ఇంప్రెషన్ కలిగించుకోవడం యేమాత్రం భావ్యం కాదు. ఇప్పుడేమిటి చేయడం?

"పోనీ ఆలోచించుకొని తరువాతనే చెప్పండి...మరో సంగతి...ముందుగా మీకు పెద్దవేషాలు దొరకవు. కాస్త ఫుటింగ్ దొరికిందాకా దొరికిన వేషాలేవో చేస్తూ ఉండాలి. హీరోయిన్‌గా మీరెంతవరకూ పనికొస్తారో నేను చెప్పలేను".

మంజరి గుండె గతుక్కుమంది.

"అదంతా మీ దయ. నేను మీదాన్ని. నన్నేం చెయ్యమంటే అదే చేస్తాను. ఏ క్షణాన రమ్మన్నా వస్తాను. మీలాంటి కళామూర్తుల పాదసేవచేసే భాగ్యం నాకింత లభిస్తే అదే పదివేలు.... మీరు మనస్ఫూర్తిగా నన్ను దాసీవేషం వేయమన్నా వేస్తాను. మీకు లేని అభ్యంతరం నాకూ లేదు. మీకు ఇవ్వాళ తీరుబాటే గదా! ఏదన్నా హొటల్ కెడదాం పదండి. అక్కడ మనం ఇంకా స్వేచ్ఛగా మాట్లాడుకోవచ్చు. నేనో విషయం చెప్పడం ఆలస్యమైంది. నవకళా చిత్రాలయవారు మా చలపతిగారికీ తెలుసు. వారికీ, మా నాన్నగారికీ బాగా పరిచయం. ఆ కంపెనీవారు నాకో వేషం ఇస్తామన్నారు. కథ తయారవుతూ ఉంది" అని కూడా వో ముక్క కలిపింది మంజరి.

"అలాగా!" అన్నారు రావుగారు. ఆయనలోని సంచలనాన్ని మంజరి గమనించి 'మందు పనిచేసింది' అనుకొన్నది.

"ఇంకా ఎవర్నీ బుక్‌చేయలేదేమో! ఒకవేళ చేసినా మీకా సంగతి తెలిసే అవకాశం లేదనుకోండి..." అని మధ్యలోనే ఆపేశాడు రావుగారు.

"కథ పూర్తికానిదే బుకింగ్స్ విషయం ఆలోచించమన్నారు వారు. వెంకటేశ్వర్లుగారు, రామబ్రహ్మంగారు నాకు తెలిసినవారు గనక ఆ కంపెనీ విషయాలేవీ నా దగ్గర దాచుకోరు. మాంఛి ఫోక్‌లోర్ కథకోసం చూస్తున్నారు. ఇంకా కొంతకాలం పట్టేలా వుంది" అన్నది మంజరి.

రావుగారు ఓ నిముషం పాటు ఏదో ఆలోచించి ఆ తరువాత సన్నగా నవ్వి అంతకన్నా సన్నగా

నిట్టూర్చారు.

"ఏదో లెండి, ఆరోజులే వేరు. ఏడెనిమిదేళ్ళ కిందటి దాకా నాకు అచ్చంగా ఫోక్ లోర్ పిక్చర్సే వచ్చేవి. ఇప్పుడన్నీ సాంఘికాలే. మళ్ళా మన కంపెనీవారి ప్రవేశంతో కథం ఫోక్‌లోర్ వేలో పోతుందనుకొంటాను. ఇప్పుడెవరన్నా మాంచి జానపద చిత్రం తీస్తే బావుణ్ణనీ, అందులో హీరోగా వేద్దామనీ, చాలాసార్లు అనుకొన్నాను....కానీ....నిజంగా నాకు క్షణం తీరుబాటు లేదు. ప్రొడ్యూసర్లు, డిస్ట్రిబ్యూటర్లు నా ప్రాణాలు తోడేస్తున్నారు. అయినా సరే....జానపద చిత్రమంటే నాకు ప్రాణం లేచొచ్చినట్లుగా ఉంటుంది. నన్ను నటుణ్ణిగా నిలబెట్టినవి ఆ సినిమాలే! అసలీ దిక్కుమాలిన సాంఘికాలకన్న ఆకథలే హాయిగా వుంటాయి. మనవాళ్ళు మళ్ళా జానపదం తీస్తున్నారని మీరనేటప్పటికి-ఈ సంగతులన్నీ గుర్తుకొచ్చాయి. నేనుఏదో లాగున కాల్‌షీట్సు ఎడ్జెస్టు చేసుకొంటాను. మరి త్వరగా కథ తెములుచ్చుకోమనండి" అన్నాడు రావుగారు.

రావుగారి అభిప్రాయం మంజరికి అవగాహనయింది. తన భావాలను ఎంత జాగ్రత్తగా ఆయన బయటబెట్టాడో చూస్తే ఆవిడకు ఆశ్చర్యం వేసింది.

"అలాగేనండీ! వారికింకా బుకింగ్సును గురించి ఆలోచించే తీరికే లేదు. నేను తప్పకుండా చెబుతాను..."

రావుగారు లేచి నుంచున్నారు.

మంజరి లేవక తప్పలేదు.

"లోపలికెళ్ళి కాఫీ పంపిస్తాను. ఈలోగా డ్రైవరొస్తారు. మిమ్మల్ని ఇంటిదగ్గర దిగబెట్టి రమ్మని చెబుతాను. మీరు సరాసరి ఇంటికే వెడతారా?" అన్నాడు రావుగారు.

"ఇల్లా?" అని ఓ క్షణం ఆగిపోయింది మంజరి. "నేనడిగినదానికి మీరు సమాధానం చెప్పనేలేదు. అలా ఏదన్నా హెూటల్‌కెళ్ళి ఓ గంట కులాసాగా గడిపేద్దాం. మళ్ళా మిమ్మల్ని పువ్వుల్లో బెట్టి తీసుకొచ్చి ఇక్కడ దించేస్తాను. ...ప్లీజ్...నేనిలా లేకిగా అడుగుతున్నానని మీరనుకొన్నా మా బాగే నాకు మీరు ముఖ్యం గానీ, ఇతరులేమనుకొంటారన్నది ముఖ్యంగాదు"అన్నది మంజరి.

"ఎక్స్‌క్యూజ్‌మి మంజరీ! మరోసారి మనం తప్పకుండా వెడదాం. ఓ గంటేం ఖర్మ! ఓ రాత్రల్లా ఉండిపోదాం కూడానూ...ఇంతకు ముందు మనం కొత్తవాళ్లం. ఈ క్షణం నుండీ సహనటులం. ఇలాంటి సమావేశాలు కొన్నివేలు జరగవలసి ఉంది. వన్‌సెకండ్. నేను కాఫీని, డ్రైవర్ని పంపుతాను...నేనే వద్దనుగానీ...అవతల అర్జంటుగా చూచుకోవలసిన పనులుండిపోయాయి..."

"నేనూ కారు తీసుకొచ్చాను. మరి నాకు సెలవు" అన్నది మంజరి రెండు చేతులూ జోడించి.

"అయ్యయ్యో! అదేమిటమ్మా! ఇక్కడకొస్తే నేను కారివ్వననుకొన్నావా?అసలు నాకు కారే లేదనుకొన్నావా? ఇహ ముందెప్పుడూ అలా చెయ్యకండి".

ఇద్దరూ పోర్టికోలోకొచ్చారు.

చలపతి మంజరి కారులో ఎక్కిందాకా ఉండి, తలుపులు జాగ్రత్తగా వేసి, రావుగారితో షేక్‌హాండ్ చేసి కారును స్టార్ట్ చేశాడు. మంజరి, రావు ఒకరినొకరు చూసుకున్నారు. హాయిగా నవ్వుకొన్నారు. కానీ ఆ నవ్వులో ఏదో లోపించింది. అదేమిటో వారిద్దరిలో ఏ ఒక్కరికీ తెలీదు.

అనుకొన్న రోజు తారకంగారు కథను తీసుకురాలేదు. ఆయనొస్తాడనీ, కథ వినిపిస్తాడనీ, అందులో తనవేషం ఎలా ఉంటుందో విని ఆనందింతామనీ మంజరి మురిసిపోయింది. అప్పటికీ ఉండబట్టలేక చలపతిని పాటికి పదిసార్లు కదిలించి చూసింది కూడాను.

చలపతి చాలా ఓపిగ్గా ''అలానే చూద్దాం''- ''వెళ్లి కనుక్కొంటారు'' -'రెండు మూడు రోజుల్లో వచ్చేస్తాను''లాంటి సమాధానాలు చెప్పుకొంటూ వచ్చాడు గానీ, ఇవేవీ మంజరికి నచ్చలేదు.

''అనుకొన్నపని అనుకొన్న వేళకు జరగాలి గాని, ఇంతింతేసి ఆలస్యాలయితే ఎలానండీ?'' అన్నది మంజరి.

చలపతి పూర్తిగా సహనాన్ని కోల్పోయాడు.

''అమ్మాయీ! వెనకటికో సామెతుంది-నీకూ తెలుసుననుకొంటాను. ''నక్క పుట్టి నాలుగు రోజులు కాలేదట-ఇంత గొప్ప గాలివాన నా జన్మలో ఎరగనన్నదట! నీకెన్నోసార్లు చెప్పాను, నీ కామెంట్సు దేన్ని గురించినయినా పాస్ చెయ్యొద్దని. నామాటంటే నీకు లక్ష్యం లేదా? అప్పుడే అన్ని విషయాలూ తెలిసిపోయాయనుకొంటున్నావా? నీకు తెలీనందుకు నాకు బాధలేదు;కనీసం చెబితేనన్నా గ్రహింపు లేకపోతే ఎలా?'' అని మండిపడ్డాడు.

మంజరి ఖిన్నురాలయింది.

''నేను మాత్రం కానిమాటలేమన్నానండీ?'' అన్నది బితుకుబితుగ్గా.

రెండుమూడు నిమిషాలు ఏమీ అనలేదు గానీ, తరువాత ఫక్కున నవ్వుతూ మంజరి భుజం మీద చెయ్యివేసి ''కోపం వచ్చిందా?'' అన్నాడు చలపతి.

మంజరి పలకలేదు.

''ఇక్కడ వ్యవహారాలన్నీ ఇలాగే ఉంటాయి మంజరీ! ముష్టికథను రాయడానికి ఇన్ని రోజులు అవసరం లేనేలేదు. పట్టుమని కూచుంటే నాల్గైదు రోజులు చాలు. కానీ అంత తొందరగా ఏ కవీ రాయడు. అథవా రాశాడో వారి పురమారిందన్న మాటే!'' అన్నాడు చలపతి.

మంజరి కళ్ళింత చేసుకుని చూసింది.

''ఇక్కడున్న చిత్రమే ఇదీ! సినిమా కథంటే-అథమపక్షం అయిదారు మాసాలపాటు నలగాలి. కవిగారు రాసింది రాసినట్టుగానే తీయడం ఎప్పుడూ జరగదు. డైరెక్టరూ, ప్రొడ్యూసరూ, డిస్ట్రిబ్యూటరూ, కెమెరామెన్ కథను చచ్చేట్టు మారుస్తారు. ఒక్కోసారి హీరో, హీరోయిన్లు కూడా కథను మారుస్తూ ఉంటారు. సెన్సార్‌కు వెళ్లబోయేనాటికి కవి రాసిందానికి, తయారయిందానికీ ఎక్కడా పోలికలుండవు''.

మంజరికి ఎందుకనో నవ్వొచ్చింది.

''అయితే నేను కూడా కథను మార్చమంటూ అడగొచ్చునన్న మాట!'' అన్నదావిడ ఈ విషయం నమ్మనట్లుగా.

'ఆఁ' అన్నాడు చలపతి. ''కానీ, ముందుగా నువ్వు హీరోయిన్‌ని కావాలి గదా! నీకోసం జనం విరగబడతారన్న నమ్మకం ప్రొడ్యూసర్‌కు కలగాలి గదా! నువ్వంటే బాక్సాఫీస్ బ్రేక్ అవుతుందని డిస్ట్రిబ్యూటర్ అనుకోవాలి గదా! ఆరోజున నువ్వేం చెప్పు-అది వేదవాక్య మయిపోతుంది. అదో ఫార్ములా కింద ఫారమయిపోతుంది. సాధారణంగా ఇలాంటి విషయాలు పత్రికల కెక్కవనుకో. కంపెనీ మనదే అయితే మనం న్యూస్‌గా కూడా వేయించొచ్చు. అయితే ఆ స్థాయికి నువ్వు రావాలంటే అందిన వేషాలేస్తూ, అందరికీ అణకువగా ఉండాల్సిందే!''అన్నాడు చలపతి.

''ఇంకా అణకువేమిటి నా బొంద''అనుకుంది మంజరి.

పదిహేనురోజుల తరువాత తారకంగారు కథను పట్టుకొచ్చారు. కథంటే ఎంత ఉంటుందోననుకొంది మంజరి. ఆయన చేతులలో అయిదారు అరఠావులకన్నా ఎక్కువ లేవు.

“ఓ చిన్న రహస్యం” అన్నాడు తారకం తాపీగా కుర్చీలో కూచుంటూ.

చలపతి ముందుకు వంగాడు.

“ఈ కథనింకా వెంకటేశ్వర్లుగారికి చూపించలేదు. ముందుగా మనలో మనం ఓ నిర్ణయానికొచ్చాక, కథలో మార్పులూ, చేర్పులూ చేసుకొన్నాక, ఫైనల్‌గా వారికి చూపిద్దాం. నేనిలా ముందుగా మీకు వినిపించానని అనకండి” అన్నాడు తారకం.

హఠాత్తుగా చలపతి లేచి, తారకంగారి రెండు చేతులూ పుచ్చుకొని గుండెలకు హత్తుకొన్నాడు.

“మా మీద మీలో ఎంత అభిమానం ఉందో ఇప్పటికి గాని నేను తెలుసుకోలేక పోయాను తారకంగారూ! ఈ రుణం ఎలా తీర్చుకోవాలో నాకు తెలియడం లేదు” అన్నాడు సన్నగా నిట్టూరుస్తూ. “నవ్విన నాపచేనే పండిందన్నట్లుగా, మాకు కాస్త కాలూనడానికి అవకాశం దొరకనివ్వండి. మీరు మన కంపెనీకే వచ్చేద్దురు గానీ...ఏం మంజరీ! తారకంగారంటున్న మాట విన్నావా? వెంకటేశ్వర్లు మనకు తెలిసినవాడు. తారకంగారు మనకు పరమాప్తులు. కనకనే కంపెనీకన్న ముందుగా మనకు కథ చెప్పేస్తున్నారు. నీక్కావలసిన విధంగా కారెక్టర్ని మార్పించుకోవచ్చు... ఆ వెంకటేశ్వర్లు అడుగుతాడేమో వొకవేళ...నీకేమీ తెలీనట్టే వుండు...సరేనా?”

“ఎంతమాటండీ! ఇంత అభిమానంతో మీరీ సాయం నాకు చేస్తూంటే నేను మరోలా అనుకోగలనా?”.

“నాక్కావలసిందదే నమ్మాయిగారూ!” అన్నాడు తారకం.

తాయారు అందరికీ కాఫీలిచ్చింది.

తారకంగారు కథ చదవడం ప్రారంభించారు. ఉపోద్ఘాతంగా-

“ఇదే ఫైనల్ కాదు. ముందు మనం రఫ్‌గా అనుకొంటున్నాం. టోటల్ ప్లాట్ మనకు నచ్చితే సినేరియో రాసేస్తాను. కొసకు డైలాగ్సు చూచుకోవచ్చు” అన్నాడు.

“అలాగే బాబుగారూ!” అన్నది మంజరి.

తారకం గొంతు సవరించుకొని, కాగితాలనోసారి విదిలించి, కళ్లజోడును పై పంచితో తుడుచుకొన్నాడు.

## 8

మగధదేశాన్ని మాధవవర్మ అనే మహారాజు పరిపాలిస్తున్నాడు. అతని కొడుకు పేరు విజయవర్మ. మంత్రి బుద్ధిసాగరుడు. సేనాపతి శూరవర్మ. శూరవర్మ చాలా దుష్టుడు. రాజ్యంలోని బందిపోటుదొంగల ముఠాలతో అతనికి దగ్గర సంబంధాలున్నాయి. దొంగలముఠాలను అణచడానికి పంపబడిన సైన్యం ఏనాడూ గెలవలేదు. ఎందుకంటే, శూరవర్మ ముందుగానే వారికి సమాచారం అందిస్తూ ఉండేవాడు. ఈ రహస్యం తెలుసుకొన్న బుద్ధిసాగరుడు. స్వయంగా తానే ఒకసారి సైనికుల్ని తీసుకొని బయలుదేరాడు. శూరవర్మ ముఠావారు బుద్ధిసాగరుణ్ణి మధ్యలోనే పట్టుకొని బంధించి పారేశారు. ఆ తరువాత వారికి దొంగల వేషాలు వేసి శూరవర్మ రాజుగారికి అక్కడకు తీసుకొచ్చి, బుద్ధిసాగరుడే దొంగలనాయకుడన్న నమ్మకాన్ని రాజుగారికీ కలిగించాడు. రాజుగారు మంత్రికి ఉరిశిక్ష విధించబోయి, లోగడ మంత్రి చేసిన సేవను దృష్టిలో ఉంచుకొని దానిని కారాగార శిక్షగా మార్పు చేశాడు. సేనానాయకుని పరిపాలనలో రాజ్యం అల్లకల్లోలమైపోయింది. శూరవర్మ ప్రజలను క్రూరంగా అణచివేసి బందీలుగా ఉంచేశాడు. యువరాజు విజయవర్మకూ, శూరవర్మ కూతురు దేవసేనకూ సన్నిహిత సంబంధాలున్నాయి. వారిద్దరూ ప్రేమించుకున్నారు. దేవసేనకు తండ్రిలోని దుష్టగుణం

తెలీదు.

ఒకసారి బుద్ధిసాగరుడు నమ్మకస్తుడైన భటుని ద్వారా అన్ని విషయాలను విజయవర్మకు తెలియచేసి, శూరవర్మ రాచకుటుంబాన్ని హత్యచేసే ప్రయత్నంలో ఉన్నాడనీ, ఈ రాత్రే పారిపొమ్మనీ సలహానందించాడు. అర్థరాత్రివేళ మహారాజు, మహారాణి, విజయవర్మ రాజధానీ నగరం విడిచి అరణ్యభూములలో ప్రవేశించారు. రెండు రోజుల పాటు నిద్రాహారాలు మానేసి నడిచారు. ఒకరోజున మంచినీటికోసం వెళ్ళిన విజయవర్మ ఎంతకూ రాలేదు. వెదకబోయిన మహారాజు తిరిగివచ్చి చూసేసరికి అక్కడ మహారాణీ లేదు. అతను భ్రమించి అడవులు పట్టి తిరుగుతున్నాడు. మహారాణీని కోయలు బంధించి బానిసగా తీసుకెళ్ళారు.

దేవలోకంలో అప్సరాంగనలకు మయబ్రహ్మ ఒక విచిత్రమైన దర్పణాన్ని కానుకగా ఇచ్చాడు. అందులో ఏడేడు పద్నాలుగు లోకాల్లోని ఏ దృశ్యం కావాలన్నా చూడవచ్చు. అప్సర రాజపుత్రి తిలోత్తమ తన చెలికత్తెలతో సహా ఉద్యానవనం ప్రవేశించి ఆ విచిత్ర దర్పణోదంతాన్ని గురించి చెలికత్తెలకు వివరించగా, వారు అందులోని నిజానిజాలను గురించి రుజువు చేయమని అడిగారు. తిలోత్తమ అద్దం మీద తెరను తొలగించి ''లోకాలన్నింటిలోకీ మహావీరుడెవ్వడో చూడాలని ఉంది'' అంటుంది. సింహంతో హెూరాహెూరీగా పోరాడుతున్న విజయవర్మ అద్దంలో కనిపించాడు. ''ఈ లోకాలన్నిటిలోనూ అందగాడైన యువకుణ్ణి చూడాలని ఉంది'' అన్నది తిలోత్తమ. మళ్ళా విజయవర్మ చిత్రమే కనిపించింది. ''ఈ లోకాలన్నింటిలోనూ సుగుణవంతులైన వారిని చూడాలని ఉంది'' అన్నది తిలోత్తమ. ఈసారీ విజయవర్మే కనిపించాడు. మొదటి చూపులోనే తిలోత్తమ హృదయం విజయుని పట్ల లగ్నమయింది. ఆమె తన మనస్సును ఆ క్షణాన్నే విజయవర్మ పాదాంకితం చేసింది. ఆ తరువాత, చెలికత్తెను సంప్రదించి, తండ్రి అనుమతితో భూలోక సందర్శనార్థం బయలుదేరి, అరణ్యాల్లో వున్న విజయవర్మను కలుసుకొన్నది. తన మాయాజాలం చేత విజయవర్మలోని గతస్మృతులను తుడిచివేసి అతనిలో ప్రణయసల్లాపాలు కొనసాగిస్తూ కాలక్షేపం చెయ్యసాగింది. విజయవర్మ మీది మాయాజాలం ఉపసంహరింపబడగానే అతను తల్లితండ్రులను, తన పూర్వవైభవాన్ని తలచుకొని విలపించుతూ ఉండేవాడు.

ఇలా ఇక్కడ సాగుతూ ఉంది.

శూరవర్మ కూతురు దేవసేనకు తల్లిదండ్రులతో సహా యువరాజు మాయమయిన సంగతి తెలిసి ఎంతో ఖేదించింది. విచారించగా దీనికంతా కారణం తన తండ్రిగారేనని తేలింది. తండ్రితో సామోపాయం లాభం ఉండదని గ్రహించి దేవసేన తను కూడా మారువేషం ధరించి యువరాజు కోసం బయలుదేరి నానాబాధలు పడుతుంది. కొసకు యువరాజును కలుసుకుంది. వారిద్దరూ కలిసి ఉండగా చూచిన తిలోత్తమ తన మంత్రశక్తితో దేవసేనను అష్టకష్టాలు పాలు చేసింది. దేవసేనకోసం బయలుదేరిన సైనికులు ఆమె కనుపించక రాజధానీనగరం చేరుకున్నారు. దేవసేన అడవిలో మహారాజును కలుసుకుని, కోయలను ఆకట్టుకొని తండ్రి మీదకు యుద్ధకు చేయడానికి బయలుదేరింది. అక్కడే బానిసగా ఉన్న మహారాణిని కూడా వారు కలుసుకొంటారు. ఈలోగా తిలోత్తమ యువరాజు విచారం చూడలేక అతనికి తన నిజస్వరూపం చూపించి, తన శక్తులను అతనిలో ప్రవేశపెడుతుందది. విజయవర్మ సేనానిని సంహరించి, రాజ్యం ఆక్రమించుకొని, అటు దేవసేనను ఇటు తిలోత్తమను వివాహమాడి, ఆ ఇద్దరు సుందరాంగులతోనూ వైభవోపేతంగా రాజ్యపాలనం చేశాడు.

❧❧❧❧❧❧❧❧

తారకంగారు, కాగితాలు డ్రాయరుమీద పడేసి, వేళ్లు విరుచుకొన్నాడు.

"ఎలా ఉంది?" అన్నట్టు కళ్ళెగరేశాడాయన.

ఇందాకట్నించీ చాలా ఇబ్బందిగా ముఖంపెట్టిన మంజరి ఏదో చెప్పడానికి నోరు తెరిచిందో లేదో చలపతి దేవుడల్లే అడ్డుపడ్డాడు.

"బ్రహ్మాండంగా ఉంది తారకంగారూ! ఇలాంటి కథ ఇంతవరకూ స్క్రీన్ కాలేదు. ఇహ దేశంలో డబ్బంతా నవకళా చిత్రాలయ ఆఫీసులోకి చేరిందన్న మాటే!" అన్నాడు చలపతి. "ఓహో హో! బ్యూటిఫుల్ కంపోజిషన్. వండర్‌ఫుల్ సీన్స్, మార్వెలెస్ సబ్జెక్టు. నవకళా చిత్రాలయ వారికి మనం మాటిచ్చాంగానీ లేకపోతే, ఇంగ్లీషులోకి మార్చేసి, ఏ హాలీవుడ్‌కో పంపించేద్దును...కానీ ఏం లాభం. నేనాడినమాట తప్పేవాణ్ణి కాదాయె. చాటుమాటున గడ్డితినడం మీకూ నాకూ అలవాటు లేదాయె. థాంక్యూ సార్!".

కొన్ని క్షణాలదాకా ఈ ధోరణి మంజరికి అర్థంకానేలేదు. తనలాగే చలపతి కూడా ఈ కథను ఏవగించుకొంటాడని మంజరి ఉద్దేశం. కనీసం బాగులేదనైనా అంటాడనుకొన్నది. అదేదీ జరక్కపోగా చలపతి ఆకాశానికెత్తేస్తున్నాడు. ఇదంతా నిజమేనా?నిజమే అయితే చలపతి వెర్రివెధవన్నా కావాలి, కథల్ని గురించి ఏమీ తెలీకన్నా పోవాలి.

"ఏవండీ అమ్మాయిగారూ! ఎలా ఉంది?" అన్నాడు తారకంగారు.

"నీ మొఖంలా ఉంది" అందామనుకొన్నది మంజరి.

కానీ అనలేదు.

అనకపోగా, సన్నగా నవ్వి "ఏం చెప్పమంటారు? ఇలాంటి కథ ఇంతవరకూ నేను వినలేదు. మన్నించాలి. ఈ నిమిషంలో ఇంతకన్నా నేనేమీ చెప్పలేను" అన్నది మంజరి.

"గుడ్ గుడ్! కట్టుకుపోయినంత అనుభవం తగులడ్డవాణ్ణి, నేనే ఈ కథ విని దిమ్మెరపోయాను. మనస్సు నిండా ఈ సీన్సే నిండిపోయాయి. కొత్తదానిని నీకెలా ఉండేదీ నాకు తెలుసు" అన్నాడు చలపతి.

"మరే" అన్నది మంజరి సాధ్యమైనంత సాదాగా.

"నా కింక ఢోకా లేదు. అసలు మీరేమంటారోనని నేను బితుకు బితుకుమంటున్నాను..." అన్నాడు తారకం ఓ సిగరెట్ అంటించుకొంటూ. "ఇందులో -మనం డబ్బు పెట్టినకొందికీ అందం తీసుకురావచ్చు చలపతిగారూ! ఆ స్కోప్స్ నేను కావాలనే ఇన్‌సెర్టు చేశాను. మహారాజ భవనం ఉంది. కోర్టుసీన్ ఉంది. బ్రహ్మాండమైన ఉద్యానవనాలుంచాను. మైసూర్ వెళ్లి షూట్ చెయ్యొచ్చు. శూరవర్మ విలన్, ఆఖరికి కూతురు చేతుల్లో మరణించడం డ్రమెటిక్ ఎండింగ్. ప్రేమించినవాడికోసం స్త్రీ ఏ సాహసమైనా చేస్తుందని నిరూపించడమే కాకుండా, ధర్మం పట్ల దేవసేనకున్న గాఢమైన విశ్వాసం కూడా మనం తెలియచేస్తున్నాం. ఇహ దొంగల ముఠాలు. వారు దొంగతనం చేసే సీన్సు-ఫోర్తు క్లాసును సూదంటు రాయిలా గుంజేస్తాయి. వార్‌సీన్సు చాలా వున్నాయి. ఇకపోతే దేవలోకం సెట్సున్నాయి. మనం పెట్టే పిండీ కొద్దీ రొట్టె తయారవుతుందన్న మాట! ఎన్ని డాన్సులన్నా పెట్టుకోవచ్చు. తిలోత్తమ, విజయవర్మల లవ్‌సీనులున్నాయి. వీటిని డ్రీమ్ సీక్వెన్స్‌ల కింద తీసే స్కోప్ ఇచ్చాను. అటు దేవసేన, విజయవర్మల సీన్లున్నాయి. కోయగూడెం సెట్‌మీద గ్రూప్‌డాన్సులు ఎన్నయినా పెట్టుకోవచ్చు. పిక్చర్ మొత్తానికి హైలెట్ మాయాదర్పణం. దాన్ని ఆధారం చేసుకొని యెన్ని

వండర్సయినా క్రియేట్ చెయ్యొచ్చు. విజయవర్మకూ సింహానికీ యుద్ధం, తిలోత్తమా, విజయవర్మల స్విమ్మింగ్ సెల్యూలాయిడ్ కెక్కించడంతో మనమో న్యూ యీరాను స్టార్టు చేసినట్టే అవుతుంది'' అన్నాడు తారకం.

''నిజమేననుకోండి, మరి-మంజరి దేవకన్యగా ఉండాలనుకొంటున్నాం గదా- ఆ కారెక్టర్‌కే ఎక్కువ ప్రామినెన్సు ఉంటుందంటారా?'' అన్నాడు చలపతి.

''తప్పకుండానూ, మనం డెవలప్ చేసుకోవడటంలో ఉంటుందండీ అదంతా. దేవసేన హీరోయిన్ అన్నమాటే గానీ, పిక్చర్‌లో ఆవిడకున్న ప్రామినెన్సు ఏదీ? తిలోత్తమ రొమాంటిక్ రోల్, స్టోరీ యావత్తూ ఆ కారెక్టరు చుట్టూ తిరుగుతుంది. హీరో సక్సెస్ కావడానికి తిలోత్తమ ఉండి తీరాలి. అంటే దేవకన్య పాత్ర హీరో కన్నా గొప్పదన్న మాటేగా! కనీసం నాలుగుచోట్ల సాంగ్స్ ఉండొచ్చు. నన్నడిగితే దేవలోకం సీన్సూ, తిలోత్తమ లవ్‌సీన్సూ కలర్‌లో తీస్తే బావుంటుందంటాను''.

''నైస్ సజెషన్''అన్నాడు చలపతి. ''ఓ పనిచేదాం, మీరు సాయంత్రం ఆఫీసుకు రండి. రామబ్రహ్మం గారికీ, వెంకటేశ్వర్లుకూ వినిపిద్దాం. మీరొచ్చే వేళకు నేనక్కడే ఉంటాను''.

''ఇహ వెళ్లమని అర్థం'' అనుకొన్నాడు తారకం.

''మరి నాకు సెలవిప్పించండి...మీ డబ్బు ఇంకో వారం దాకా సర్దలేను అమ్మాయిగారూ! భగవంతుడు నాకు తెలివితేటలిచ్చాడు గానీ, డబ్బివ్వలేదు. నా ఖర్మం!'' అన్నారాయన.

''మీరలా మాటిమాటికి అనకండి మేష్టారూ! నా దగ్గరుంటే మీకటువంటి పాతికలు మరింకెన్నో యిచ్చి ఉందును. నాకా ప్రాప్తం లేదు...'' అని విచారాన్ని వ్యక్తం చేసింది మంజరి.

''అలా అనుకోకండమ్మాయిగారూ! మీకా అభిమానముండటమే పదివేలు. వెళ్ళొస్తాను...సాయంత్రం ఆఫీసులో కలుసుకొంటున్నాంగా!'' అన్నాడు తారకం.

''ఓ'' అన్నాడు చలపతి.

తారకం వెళ్లిపోయాడు. అతనటు వెళ్లగానే తెక్కట్లాడుతూ నవ్వుదామనిపించింది మంజరికి. కానీ చలపతి ముఖంచూసి ఆగిపోయింది.

కాస్సేపు ఎవ్వరూ పలకలేదు.

ఆ నిశ్శబ్దం మరీ భయంకరంగా తోచింది మంజరికి.

చలపతి కాలుస్తున్న సిగరెట్‌ను చిరాగ్గా గిరాటెట్టి, ఏదో గొణిగాడు.

''ఏమిటి?'' అన్నది మంజరి.

''ఈ తారకం-'' అని ఆగిపోయాడు చలపతి.

మంజరికి పచ్చి వెలగ సామెత జ్ఞాపకం వచ్చింది. ''ఈ తారకం'' అని ఆగిపోతే తనకేం తెలిసేడుస్తుంది? వాక్యం తరువాత ''చాలా గొప్పవాడు'' అని చేర్చినా సరిపోతుంది; ''ఉత్త చెవలవాజమ్మ'' అని చేర్చినా ఠక్కున అతుక్కుపోతుంది. చలపతి ఏమనబోయాడో ఎంత ఆలోచించినా మంజరికి తట్టలేదు.

''అవును, తారకంగారు'' అని మంజరి కూడా ఆగిపోయింది.

''ఉత్త పిచ్చివెధవ కాకపోతే-ఏమిటా దిక్కుమాలిన కథావాడూను? ఇంతోసిదానికి నెలరోజులు కావాలా?'' అని విసుక్కొన్నాడు చలపతి.

''మరే!'' అన్నది మంజరి

''నీకూ నచ్చలేదు కదూ?''

“అన్నిచోట్లా కాదనుకోండి-” అన్నది మంజరి చాలా జాగ్రత్తగా. తనిప్పుడు ప్రమాదకరమైన ప్రదేశంలో ఉన్నట్టు ఆవిడ గ్రహించింది. జాగ్రత్తగా అడుగువేయకపోతే ఏమందుగని పేలినా పేలవచ్చు.

“నాకొక్క ముక్క కూడా నచ్చలేదు” అన్నాడు చలపతి.

“నా ఆయుష్షు కూడా పోసుకొని బతకండి బాబూ!” అన్నది మంజరి. “తారకం గారి కథలోని సీన్సన్నీ నేనిదివరకు చూసిన సినిమాల్లోనే ఉన్నాయండీ! రాజులు, సేనానులు, దేవకన్యలు, డాన్సులు, కత్తియుద్ధాలు, మాయాజాలాలు...ప్రతి సినిమాలోనూ ఉంటూనే ఉండె. ఇహ ఈయన కొత్తగా రాసిందేముందండీ నా బొంద! ఈ ముక్కా ఆ ముక్కా తెచ్చి అతికించడమా?”

“నో నో నో...నీ ఇంటర్ప్రెటేషన్ తప్పు” అన్నాడు చలపతి.

మంజరి నిలువునా నీరైపోయింది.

“కథ బావులేదన్నావు-సరేననుకో. అది నేనూ వొప్పుకుంటాను. కానీ నా కారణాలు వేరు... నీ గొడవేమిటంటే; అన్ని సినిమాల్లోంచి కాస్త కాస్త ముక్కలు పోగుచేశాడని గదా! అంతవరకూ తారకం చాలా తెలివైనవాడేనంటారు. సక్సెస్ఫుల్ పిక్చర్లోని ఏ ఘట్టాలు జనానికి బాగా నచ్చాయో, ఓ లిస్టు రాసుకొని అవన్నీ మన పిక్చర్లోనూ వచ్చేలాగా స్టోరీ కంపోజ్ చేయడం చాలా అవసరమే! కానీ, ఆ కంపోజింగ్లో నావెల్టీ లేదు. ఈ సీన్సన్నీ ఉంటూనే, కంపోజిషన్లో కొత్తదనం కావాలి. బాక్సాఫీస్ ఫార్ములాను దాటి బ్రతికిన ప్రొడ్యూసర్ లేడు మంజరీ” అన్నాడు చలపతి.

మంజరి ముఖం వెలాతెలాపోయింది. అన్ని సీన్సూ ఉంటూనే కొత్తదనం రావడమంటే ఏమిటో ఆవిడకు బోధపడలేదు. కథలో కొత్తదనం రావాలంటే సంఘటనలు కూడా కొత్తవిగా ఉండాలని మాత్రమే ఆవిడకు తెలుసు. పాత సంఘటనలు విధిగా వుంచుతూ, కథారూపం కొత్తగా రావాలన్నదే ఆవిడకు అర్థంకాలేదు.

“ఇదేదో కొత్త పద్ధతి. నాకీ జన్మలో ఇది అలవాటు కాదు” అనుకొంది మంజరి. “వెంకటేశ్వర్లుగారు పుటుక్కున దీన్ని వొప్పేసుకొంటారేమో?” అని భయాన్ని వ్యక్తం చేసిందావిడ.

“సాధ్యమైనంత వరకూ కాకుండా చూస్తాను. ముందుగా వెళ్లి చెబుదాం. విన్నాడా సరేసరి! లేదా మట్టిగొట్టుకుపోతాడు. మధ్యలో మనకేం?” అన్నాడు చలపతి.

“అదేమిటండీ మరీను! వాళ్లకేమీ తెలీదనేగా మనం అనుకొంది. పొరబాటున వాళ్ళు తప్పటడుగు వేస్తే చూస్తూ చూస్తూఊరుకోవడం భావ్యమా? ఈ తుక్కు కథను పిక్చరైజ్ చేసి వాళ్ళు నాశనం కావడాన్ని మనమెట్లా వొప్పుకుంటాం?” అన్నది మంజరి.

చలపతి రుసరుసలాడిపోయాడు.

“నువ్వు సినిమాలో వేషాలకోసం వచ్చావా? లోకాన్ని ఉద్ధరించడానికొచ్చావా? సాంఘిక సేవ చెయ్యదల్చుకుంటే, ఈ ఫీల్డును వొదిలెయ్యి...వాడెవడో నాశనమయిపోతాడని గోలపెట్టకు. నాకామాత్రం తెలుసు” అన్నాడు చలపతి.

మంజరి కళ్ళనీళ్లు పర్యంతమయింది. గుడ్ల నీరు గుడ్లకక్కుకొంటూ లోపలికొచ్చింది. తలుపు పక్క నుండి ఈ గొడవంతా వింటున్న తాయారు “ఊరుకొండమ!” అని మంజరిని సముదాయించింది.

తను అల్లిన కథమీద తారకంగారికి బ్రహ్మాండమైన నమ్మకముందేమో మనకు తెలీదు. అతనా సాయంత్రం యెంతో ఉత్సాహంగా నవకళా చిత్రాలయ వారిక ఆఫీసుకొచ్చి దస్త్రం విప్పాడు. తారకం వచ్చిన పావుగంటకు చలపతి వచ్చాడు. కథ విన్న తరువాత రామబ్రహ్మంగారూ, వింటున్నప్పుడే వెంకటేశ్వర్లుగారూ చప్పరించేశారు.

‘‘ఇంతకన్నా మంచికథ మనకు దొరకని పక్షంలో మనం సినిమా ఆలోచనే మానుకొందాం!’’అన్నాడు రామబ్రహ్మంగారు.

తారకం ఆ మాట విని గతుక్కుమన్నాడుగానీ, ఆ ఉదుటున బైటపడనివ్వలేదు.

‘‘ఈ కథలో నావెల్టీ లేదు తారకంగారూ! మన ధ్యేయం మీకింకా బోధపడినట్లు లేదు. మాంఛి జానపద చిత్రం తీయడం. డబ్బు దోచుకోవడం మాత్రమే మన లక్ష్యం కాదు. అంతకన్నా ముఖ్యం, ప్రతి విషయంలోనూ ‘మనదీ’ అని స్పష్టంగా తెలిసివచ్చే ‘ఇంప్రెషన్’ ఒకటి కలిగించాలి. ఇప్పుడు మీరు చెప్పిన కథలో లోగడ వచ్చిన సినిమాల్లోని ఇన్సిడెంట్లన్నీ ఉన్నాయి. అవన్నీ డబ్బు తెచ్చిన మాట నిజమే! కానీ మన వొరిజినాలిటీ లేదు...ఏమండీ చలపతిగారూ! మీరేమంటారు?’’ అన్నాడు వెంకటేశ్వర్లు.

చలపతి ఓ నవ్వు నవ్వాడు.

అందులో తలావొక అర్థం గోచరించింది. అంతేగాని నోరుతెరిచి ‘ఇదేమీ’ అన్న ముక్క అనలేదు.

‘‘చిత్తం. ఆ అనుమానం నాకూ ఉన్నదనుకోండి. అయినా ఇదే ప్రారంభం గనుక, మనం అట్టే ఆందోళన పడనవసరం లేదు. ఇంకా నా దగ్గర కట్టుకుపోయినన్ని కథలున్నాయి. అవన్నీ మనం కూచుని డిస్కస్ చేద్దాం. వాటిల్లో మనకు నచ్చిన థీమ్ నెన్నుకొని స్క్రీన్‌కు ఎడాప్టు చేసుకొందాం. నాకు మరో అవకాశం ఇవ్వండి!’’ అన్నాడు తారకం.

‘‘ఇలా నీతోనే రోజులన్నీ గడిచిపోతే ఎలా? ఇప్పటికే చాలా ఆలస్యమయిపోయింది గదా! ఇంతవరకూ ‘హరివో’మ్మంటూ ప్రారంభమే లేదాయె. ఈ పంపిణీ మీద మనం ఎప్పటికి తేలేటట్టు?’’ అని విసుక్కున్నాడు రామబ్రహ్మం.

‘‘మనం రెడీగా ఉన్న మరోకథ నేదయినా పుచ్చుకొందామంటారా?’’ అన్నాడు చలపతి.

తారకం ముఖంమీద మబ్బులు కమ్మినట్లయింది. చలపతి ఆ సంగతి గ్రహించి అస్త్రం విసిరాడు.

‘‘తారకంగారు మనకు పెద్ద దక్షత. ఈ పరిశ్రమలోని లగువుబిగువులన్నీ వారికి క్షుణ్ణంగా తెలుసు. వారికథను అడ్డదిడ్డంగా మార్చడం నాకూ ఇష్టం లేదు. రామబ్రహ్మంగారేమో త్వరగా సినిమా లాగెయ్యాలనుకుంటున్నారు. అంచాత మనమో పని చేస్తే బావుంటుందనుకొంటాను. ముందుగా ఓ అయిదారువేలు పారేసి రెడీగా ఉన్న స్క్రిప్టు కొనేదాం. దీన్ని రిలీజ్ చేశాక మనం రవంత తాపీగా తారకంగారి కథను పిక్చరైజ్ చేయవచ్చును. ఈలోగా వారు మనక్కావలసిన విధంగా కథను తయారుచేస్తుంటారు. ఇది మంచి పద్ధతని నా అభిప్రాయం. మీరూ ఆలోచించి చెప్పండి’’ అన్నాడు చలపతి.

తారకంగారు ఏమీ అనలేకపోయారు. రామబ్రహ్మం గారికీ సూచన బాగా నచ్చింది.

‘‘అలానే కానివ్వండి బాబూ! ఆలూ లేదు, చూలూ లేదు, అబ్బాయి పేరు సోమలింగమన్నట్లుగా ఇప్పటికే వేలమీద డబ్బు నలిగింది. పిక్చర్ పూర్తయ్యేసరికి నాపొలమంతా అమ్మాలిసొచ్చేటట్టుంది!’’అని గొణుక్కున్నాడాయన.

తారకంగారూ చలపతిగారూ బయటికొచ్చాక ‘‘నన్ను మన్నించాలి తారకంగారూ! మీ మేలుకోరే యిలా చేశాను. మీకు కోపం రావడం సహజమేగానీ, నా అభిప్రాయం తెలిస్తే మీరలా అనుకోరు’’ అన్నాడు చలపతి.

తారకం ముఖం ఇంకా ముడుచుకొనే ఉంది.

“ఈ కథ రాయడం వల్ల- ఈ కంపెనీకివ్వడం వల్ల మీకు వొరిగేదేమన్నా ఉన్నదా? జీతంరాళు తప్ప, చిల్లికానీ ఇవ్వరు. కథ చూదామా-నభూతో నభవిష్యతి. ఇంత మంచి కథను ముష్టి నూట యాభై రూపాయల నెలజీతానికి మీరివ్వడంలో అర్థంలేదు. నేనింకో కంపెనీని మాట్లాడి ఉంచాను. కథను రెండు మూడు వేలకు అమ్మిపెట్టేపూచీ నాది. డైలాగ్స్, సాంగ్సు కూడా మీరే రాస్తానంటే వాటికి విడిగా మాట్లాడుకొందాం. ఈ వెధవలకు చివరా, మొదలూ తెలీదు. ఇంకో కథను-మామూలుదాన్ని-వీళ్లముఖాన కొడతాను, ఆ దెబ్బతో రోగం కుదురుతుంది” అని నచ్చజెప్పాడు చలపతి.

“మీ దయ-అంతకన్నా నేనేమీ అనలేను” అన్నాడు తారకం, సెలవు పుచ్చుకొని వెళ్లిపోతూ.

చలపతి ఆపట్టుపట్టు రాత్రి పదిగంటలదాకా తిరిగి, ‘శ్రీకాంత్’ను స్టూడియో గేటువద్ద కలుసుకొని, కారులోకి ఆహ్వానించి భుజంమీద చెయ్యి వేశాడు.

“ఈ మధ్య ఎక్కడా కనిపించటం లేదేం బ్రదర్?” అన్నాడు తనో సిగరెట్ వెలిగించి, శ్రీకాంత్‌కు ఇంకోటి ఆఫర్ చేస్తూ.

శ్రీకాంత్ సిగరెట్ తీసుకొని వెలిగించాడేగానీ, ఏమీ మాట్లాడలేదు.

“ఎక్కడన్నా కుదిరావా?”

“లేదు” అన్నాడు శ్రీకాంత్.

“ఆ మధ్య నువ్వేదోపిక్చర్‌లో ఓ చిన్న వేషమేదో వేస్తున్నావని విన్నాను..అవును గానీ భాయీ! నీ దగ్గర రెడీగా స్టోరీ ఏమైనా ఉన్నదా? కాష్ అండ్ కారీ బిజినెస్. కథ నచ్చిందంటే అయిదొందల రూపాయలు ఘల్లున చేతిలో పడతాయి. ఆలోచించుకో” అన్నాడు చలపతి.

“ఏమీ లేవండీ!” అన్నాడు శ్రీకాంత్ విచారంగా. “దివ్యమైన కథలు పట్టుకొని అయిదేళ్ళపాటు అన్ని కంపెనీల చుట్టూ తిరిగాను, అందరూ కథలు వినిపించుకొన్నారు. నా కథల్లోని సంఘటనలను పెట్టి సినిమాలు తీశారు. నా కథలే కాస్త అటూ ఇటూ మార్చిపిక్చర్లు తీశారు. నా పేరు లేదు-కనీసం నాకు పావలా డబ్బులు కూడా గిట్టలేదు. అవన్నీ పేరున్న రచయితల పేరుమీదుగా వచ్చాయి. మహాకవి మాధవశ్రీగారి దగ్గర అసిస్టెంటుగా ఉన్నాను. వారి పేరుమీదుగా వచ్చిన ‘రాసక్రీడ’ ‘మూడురాత్రులు’ పిక్చర్స్‌కు నేనే పనిచేశాను. కనీసం జీతం డబ్బులు కూడా అందలేదు. ఎప్పుడడిగినా లేదనేవాడు. కానీ చచ్చేట్లు తాగి రోడ్లమీద దొర్లడానికి డబ్బు ఉండేది. ఛాఛా! ఏం మనుషులండీ?” అన్నాడు శ్రీకాంత్.

ఈ కబుర్లేమీ చలపతిని కదిలించలేదు.

“అందుకని నేను మా వూరు వెడదామనుకొంటున్నాను”.

“మరి వెళ్ళలేదేం?” అన్నాడు చలపతి.

“డబ్బు లేదండీ! మొన్నోపిక్చర్లోల ఎక్స్ట్రా వేషం వేశానులెండి. పదిరూపాయలు రావాలి. వారం రోజుల ఎక్స్ట్రా కంట్రాక్టర్ ఇదిగో, అదిగో అని తిప్పితిప్పి చంపుతున్నాడు. అతనికోసమే గేటు దగ్గరున్నాను. నేను వెడితేగాని వాడు రాడు. వాడొస్తేగాని నేను కదల్ను. ఈ డబ్బు అందగానే బండెక్కేస్తాను. ఈ మద్రాసుకు ఇంతటితో గుడ్‌బై!” అన్నాడు శ్రీకాంత్.

“మళ్లా ఏదన్నా మంచి ఛాన్స్ నీకు దొరికిందనుకో. ఉండిపోగలవా?” అన్నాడు చలపతి.

అతను చెప్పే సమాధానం కోసం చలపతి చెవులురిక్కించాడు.

“నా కా అభిప్రాయం లేదండీ!”

“ఓరిపిచ్చివాడా! ఈ ఇండస్ట్రీని గురించి నీకేమీ తెలిసినట్లు లేదు. ఎవరిమీదోయ్ నీకోసం? ఇప్పుడు మహాకవులని పేరు తెచ్చుకొన్నవారందరూ ఈ బాధలన్నీ పడ్డవారే! నీ ముఖానే పొద్దు పొడిచిందనుకోకు. చాలాకాలం నుండీ నీకేదన్నా ఉపకారం చేదామనుకొంటున్నాను. ఆ అవకాశం యిప్పటికి దొరికింది. ఇంద-ఈ వంద రూపాయలూ దగ్గరుంచు. రేపు ఉదయానికి నీ దగ్గరున్న కథలన్నీ పట్టుకొని,నన్ను కలుసుకో, నాకు నచ్చిన కథేమన్నా దొరికిందంటే మిగతా నాలుగొందలూ ఆన్ ది స్పాట్ నీకు పే చేస్తాను. ఏ కథా నచ్చలేదనుకో, ఈ వందా నాకు తిరిగి ఇవ్వఖ్ఖర్లేదు” అని చలపతి పదిరూపాయల నోట్లు తీసి శ్రీకాంత్ జేబులో ఉంచాడు. “మరి నువ్వింక ఇక్కడే తాత్సారం చెయ్యకు. ఆ కంట్రాక్టరుగాడు నీకిక దొరకడు. ప్రొడ్యూసర్ డబ్బిచ్చాడో లేదో తెలీదు. ఇచ్చినా ఇటు రాడు. ఇవ్వకపోయినా రాడు. హాయిగా భోంచేసి నిద్రపో. ఉదయం మా ఇంటికి రా. నీకోసం కాఫీ కూడా తాగకుండా ఎదురుచూస్తుంటాను...నిన్ను రూం దగ్గర దిగబెట్టనా?”

శ్రీకాంత్ కళ్లు మిలమిలలాడాయి.

ముఖంలో ఆశారేఖలు మోసులెత్తాయి. నోట్లను జేబులో కుక్కుకొని సీటుకు జేరగిలబడ్డాడు. అతని కళ్లు నీటితో నిండిపోవడం చలపతి గమనించాడు.

ఉదయం శ్రీకాంత్‌ని చూస్తూనే “ఇతను రాత్రి నిద్రపోలేదు” అనుకొన్నాడు చలపతి. అతను కూచున్నాక మంజరిని పిలిచి పరిచయం చేశాడు.

“మీరు మంచిదనుకొన్న కథను వినిపించండి!” అన్నాడు చలపతి.

శ్రీకాంత్ కథ చదవడం ప్రారంభించాడు.

రాజా వరప్రసాదరామారావు బహద్దూర్‌గారు మంగళాపురం జమీందారు. చిన్ననాడే తల్లిదండ్రులు గతించారు. దివాన్ శర్మగారు, ఆ ఎస్టేటును ప్రాణపదంగా కాపాడుకొస్తున్నారు. రాజాగారు మొన్నటి వరకూ ఇంగ్లండులో చదువుకొన్నారు. ఎస్టేటుకు రాగానే, దివాన్‌గారు పెళ్లి విషయం ప్రస్తావించారు. తనకు కావలసిన కన్యను తనే వెదుక్కుంటానని, పుష్కలంగా డబ్బు,కారూ తీసుకొని రామారావు గారు బయలుదేరి, దేశమంతా తిరుగుతూ, వేసవినాటికి కాశ్మీర్ చేరుకొన్నారు. శ్రీనగర్ పరిసరాలలో స్కేటింగ్ చేస్తున్నప్పుడు వారికి తొలిసారిగా కళ్యాణి కనిపించింది.

కళ్యాణి భువనమోహనంగా ఉంటుంది. ఆధునిక నాగరికతకు ఆవిడ ఆటపట్టు. కళ్యాణి వెంట రాధమ్మ అని ఒక వయసు మళ్ళిన ఆవిడ ఉంది. కళ్యాణికి ఆవిడే బాడీగార్డు, సలహాదారు అన్నీనూ.

రాజా రామారావుగారు రాధమ్మద్వారా అన్ని వివరాలూ తెలుసుకొన్నాడు. కళ్యాణీ ‘బడేపురం’ జమీందారుగారి ఏక సంతానమనీ, తండ్రిగారు లేరనీ, తల్లిరోగిష్టి అని, కళ్యాణి బాగా చదువుకొన్నదనీ, ఇంకాపెళ్లికాలేదనీ, తగిన వరుడు లభిస్తే పెళ్లిచేసుకొంటుందనీ రాధమ్మ చెప్పింది. రామారావుగారు అదే రోజున కళ్యాణిని ఏకాంతంగా కలుసుకొని తన అభిప్రాయం తెలియజేశాడు. కళ్యాణి వొప్పుకుంది. దివాన్‌గారికి ఉత్తరం రాస్తూ పెళ్లికి బ్రహ్మాండంగా ఏర్పాటు చెయ్యమని రాజాగారు ఆదేశించారు.

మంగళాపురంలో రంగరంగ వైభవంగా వివాహం జరిగింది. ఆ పెళ్లికి కళ్యాణి తరపున రాధమ్మ తప్ప మరెవ్వరూ హాజరు కాలేదు. అందరూ లోలోపల అనుకున్నారే తప్ప, ఈమాట పైకి ఎవ్వరూ అనలేకపోయారు. రమారమిగా పాతికేవేల రూపాయలు ఈపెళ్లికి ఖర్చయ్యాయి.

మంగళాపురంలోని రాజాగారి దేవిడీ బ్రహ్మాండమయింది. చిన్నా,పెద్ద భవనాలు యాభైదాకా ఆ కోటలో వున్నాయి. పెద్దబిల్డింగులో కొన్ని డజన్ల విశాలమైన గదులున్నాయి. ఆ ఇంటి పెత్తనమంతా

కళ్యాణి చేతికొచ్చింది. కళ్యాణి రాధమ్మ చేతిలో కీలుబొమ్మ. ఆమెను చూచినప్పుడల్లా, ఆమెతో మాట్లాడినప్పుడల్లా కళ్యాణి భయపడుతూనే వుండేది.

కళ్యాణి ప్రోత్సాహం మీద రాజా రామారావుగారు కోటను అనుకోని వున్న కొండ అంచున కొత్తగా వొక బిల్డింగ్ కట్టించారు. దాన్ని నవనాగరికత ఉట్టిపడేలాగా అలంకరించారు. దూరంగా వున్న నదిని కలుపుతూ ఒక కాలువను తవ్వించారు. రాజా రామారావుగారు, కళ్యాణిగారు అప్పుడప్పుడు ఆ కాలువల ద్వారా, నదిలోకి పడవ షికారు వెళ్లుతుండేవారు. ఆ పరిసరాలలో పెద్ద కోటను కూడా వేయించారు రామారావు.

కళ్యాణి తరచుగా కాలువ వొడ్డున వున్న బిల్డింగులోనే వుండేది. తన అనుమతిలేనిదే అక్కడకు ఎవ్వరినీ రానిచ్చేది కాదు.

కళ్యాణి రాకతో ఖర్చులు పెరిగిపోయాయి. వేలాది రూపాయలు ఖర్చు రాయించి, కళ్యాణిపుచ్చుకొంటూ వుండేది. దివాన్ శర్మగారు ఒకసారి వివరాలనడిగి అవమానింపబడ్డారు. ఆయనగారు తనవారికి రహస్యంగా కళ్యాణి వెంట వుంచి, అసలు రహస్యాన్ని కనుక్కొన్నారు.

"బాబుగారూ! నా అనుమానం నిజమయింది. రాణీగారి దగ్గరకు రహస్యంగా ఎవరో వచ్చిపోతున్నారు. ఇది మన దివాణానికే అవమానం. నా బాధ్యతగనక చెప్పాను. తగిన చర్య తీసుకోండి"అని చెప్పాడు శర్మ.

రాజారామారావుగారు దివాన్‌గారి మాటలు మొదట నమ్మలేదు. కానీ, రహస్యంగా వచ్చిపోతున్నవాణ్ణి స్వయంగా చూశాక నమ్మకతప్పలేదు. అతను కళ్యాణిని కలుసుకొని అడిగాడు. అతను తనకు స్నేహితుడనీ, ఈ పెళ్లికాకముందు నుండి తను ఇద్దరకూ పరిచయం వున్నదనీ చెప్పింది. రామారావుగారు కొన్ని వేల రూపాయలిచ్చి, కళ్యాణికి వెళ్లమన్నాడు. తను వెళ్లనన్నది కళ్యాణి. ఆ రాత్రి తన స్నేహితుడు వస్తాడనీ, అతని అభిప్రాయం కూడా తెలుసుకొన్నాక తపే వెళ్లేదీ, లేనిదీ రేపు చెబుతాననీ ఆవిడన్నది. ఆ రాత్రి రాజుగారు, కాలువ ఒడ్డునున్న భవనం దగ్గర కొచ్చేసరికే ఒక భారీ విగ్రహం చకచకా కొండ దిగిపోవడం కనిపించింది. గదిలో నుండి కళ్యాణి నవ్వు వినిపించుతోంది. రామారావు గారు కోపంతో గదిలో కళ్యాణి మీదకు దూకబొయ్యేంతలో, ఎవరో అతని తలమీద బలంగా బాదారు. రామారావు స్మృతి తప్పి పడిపోయాడు.

అతను కళ్లు తెరచేసరికి కళ్యాణి చచ్చిపడి వుంది. ఆ శవాన్ని కొండ దిగువ లోయలో పూడ్చేసి, ఆ గదికి తాళం వేసి, అంతఃపురానికి వచ్చాడు. కళ్యాణి తరుచుగా డాక్టర్ దగ్గరకు వెళ్లడం రివాజు గనక ఈ రోజునా వెళ్లి వుంటుందని అందరూ అనుకొన్నారు. రామారావు గారికి మనశ్శాంతి నశించిపోయింది. మళ్లా దేశాటనం బయలుదేరారు.

రామయ్య చిన్నపాటి రైతు. అతనికొక కూతురున్నది. ఆమె పేరు శాంత. రామయ్య మంచాన పడ్డాడు. తన అవసాన కాలంలో కూతురును దగ్గరకు పిలచి, తన మరణానంతరం ఈగ్రామంలో వుండవద్దనీ, నీపినతల్లి దగ్గకు పొమ్మనీ, లోగడే తనావిడకు జాబు రాశాననిచెప్పి కన్నుమూశాడు.

శాంత పినతల్లి ఒక అడవిలోని సత్రంలో ఉంటోంది. పగలు కూడా ఆ దోవన ఎవ్వరూ వెళ్లరు. శాంత పినతండ్రి గజదొంగల నాయకుడు. అతనిచేతి కింద చాలా దొంగలముఠాలు న్నాయి. వారందరూ తస్కరించి తెచ్చిన డబ్బు సత్రం గదుల్లో మూలుగుతోంది. అక్కడ నియమాలు చాలా క్రూరంగా ఉంటాయి. ఒకానొక దొంగ తెలివిగా దొంగతనం చేయలేకపోయినందుకుగాను నాయకుడతన్ని స్తంభానికి కట్టి చనిపోయేదాకా కొరడాలతో బాధించాడు. ఒకమూల తుపాకులు,

కత్తులు, బల్లాలు పడివున్నాయి. శాంత పినతల్లికి వొక కన్నూ, కాలూ లేదు. ఒకసారి కోపం వచ్చి ఆవిడ భర్త కన్నును పెరికాడనీ, కాలు నరికేశాడనీ చెప్పుకొన్నదావిడ. దార్లు కాచీ, గ్రామాలమీద పడీ, ఆ దొంగలముఠా చేసే అఘాయిత్యాలను, హత్యలను శాంత చూడలేక తల్లడిల్లిపోతూ ఉంది.

అక్కడే శాంతకు సూరితో పరిచయమయింది. వాడో వెర్రిబాగుల నాగన్న. శాంతంటే పడి చచ్చేవాడు. శాంతను పెళ్లాడాలని వాడి తలంపు. శాంత పినతండ్రి కూడా దానికి వొప్పుకున్నాడు. తనా నరక కూపం నుండి బయటపడాలంటే సూరి తప్ప మరో గత్యంతరం లేదని శాంతకు తెలుసు. వాడితో నయగారాలు పలికి, ఒక వానరాత్రి, కిటికీలోగుండా తాడు సాయంతో కిందికి దిగి, కాపలావారి కంటపడకుండా, సూరికి కూడా చిక్కకుండా పారిపోయింది.

ఎడతెరిపిలేక, ధారాపాతంగా కురుస్తున్న వానలో, రోడ్డుకు వారగా చెట్లచాటున పడి పరుగెత్తుతున్న శాంతకు దూరంగా కారులైట్లు కనిపించాయి. శాంత చెట్టుచాటున నక్కింది. ఆ కారు వంతెన దాకా వచ్చి ఆగిపోయింది. శాంత వెనకగా వెళ్లి డిక్కీలో దాక్కున్నది. అలసిపోయిన శాంత అక్కడే పడి నిద్రపోయింది.

అది రాజారామారావుగారి కారు. కళ్యాణి మరణానంతరం మనస్సు వికలమై దేశసంచారం చేస్తున్నారు.ఉదయం డిక్కీలో ఉన్న శాంతను చూసి, ఆమె గాధ విని తనతోనే  ఉండమన్నాడు. శాంతతో కొంతకాలం అన్ని క్షేత్రాలూ తిరిగి, మంగళాపురం వచ్చాడు. ఈసారి జరిగిన పెళ్లి చాలా నిరాడంబరంగా వున్నది.

శాంతసహజంగా ఉత్తమురాలు. అమాయిక, కష్టాలో పుట్టి కష్టాల్లో పెరిగిన మనిషి. రాచమర్యాదలూ ఆమెకు తెలియవు. ప్రతి పనీ తనే స్వయంగా చేసుకోవడం ఆవిడకు అలవాటు. ఇక్కడ అది కుదరదు. దీనికి తోడుగా రాధమ్మ ఆమెను అనుక్షణం సూటీపోటీ మాటలతో గాయపరుస్తూ ఉండేది. రాజాగారికి పాతభార్య అంటేనే అభిమానమనీ, నువ్వంటే అసహ్యమనీ నూరిపోస్తూ ఉండేది. శాంత మనశ్శాంతి క్రమక్రమంగా క్షీణించసాగింది.

లోయకు దిగువగా రోడ్డువేసే ప్రయత్నంలో కళ్యాణి శవం బయటపడింది. ఆమె చేతినున్న ఉంగరం ఆధారంగా అధికారులు ఆమెను గుర్తించారు. రాజా రామారావుగారే హంతకుడని పోలీసులు అతన్ని అరెస్టు చేసి జైలుకు పంపించారు.

దివాన్ శర్మగారు శాంతను ఓదార్చి, కళ్యాణి తరచుగా ఏ డాక్టరు దగ్గర కెడుతుందో తెలుసుకొని, అతని నుండి ఆమె వ్యాధికి సంబంధించిన సర్టిఫికెట్టును సంపాదించి, కోర్టులో దాఖలు చేశాడు. కళ్యాణి పెట్టుకున్న నగలు కొన్నింటిని, శాంత తన పినతండ్రి దగ్గర చూసింది. ఆ సంగతి దివాన్ శర్మగారు పోలీసులకు తెలియచేసి, కళ్యాణిని నగలకోసం దొంగలముఠావారు చంపివుంటారనీ, ఆ ముఠా ఫలానాచోట వున్నదనీ రిపోర్టు చేశాడు. పోలీసులు మంది మార్బలంతో బయలుదేరారు. దోవచూపడానికి శాంత కూడా వారితో ప్రయాణమయింది.

ఈ సంగతి పోలీసులు అనుకొంటున్న మాటలద్వారా రామారావు విన్నాడు. శాంతకు ఏదన్నా ప్రమాదం జరుగుతుందేమోనన్న భయంతో జైలు నుండి తప్పుకొని అక్కడే వున్న పోలీసుకారులో సత్రంవేపుగా బయలుదేరాడు. ఖైదీ తప్పించుకెళ్ళిన సంగతి పోలీసులకు తెలిసి అతన్ని వెదుకుతూ అన్ని దిక్కులకూ బయలుదేరారు.

దొంగలముఠాకూ, పోలీసులకూ చాలాసేపు యుద్ధం జరిగింది. చాలామంది  చనిపోగా, మిగిలినవారు ఖైదీలుగా చిక్కారు. ఆసరికే అక్కడకు చేరిన రాజు రామారావును, అతనికోసం

వెదుక్కుంటూ వచ్చిన పోలీసులు కలుసుకొని, తిరిగి బంధించారు.

రామారావుగారు నిర్దోషులని రుజువు చేసే బాధ్యత శాంతమీద పడింది. ఆవిడ సూరిని కలుసుకొని అతన్ని బెల్లించి అన్ని వివరాలూ అడగ్గా, ఒకసారి తనొకముఠాతో కలిసిపోతున్నప్పుడు , కాలువ వొడ్డునున్న బిల్డింగులో లైట్లు వెలుగుతున్నాయని, అందమైన ఒక యువతీ మరో అజానుబాహుడైన వ్యక్తీ ఆ గదిలో ఉన్నారనీ, ఆ వ్యక్తి వెళ్లిపోయాక, ఇప్పుడు ఖైదులో వున్న రామారావు వచ్చాడనీ, తను రామారావును స్మృతి తప్పిపోయేలాగు కొట్టి, ఆ యువతి వంటిమీద నగలు ఊడతీస్తున్నప్పుడు ఆ పెనుగులాటలో ఆవిట బల్లకు తగిలి చనిపోయిందనీ, తను నగలు తీసుకొని వచ్చేశాననీ చెప్పాడు. ఈ సంగతులన్నీ టేప్‌మీద రికార్డు చేయబడ్డాయి. ఈ సాక్ష్యంతో రామారావు హంతకుడు కాడని జడ్జి తీర్పు చెబుతూ, జైలు నుండి పారిపోయినందుకూ, పోలీసు కారు అపహరించినందుకు మూడు మాసాలు శిక్షను విధించాడు.

పోలీసులు వాన్‌లో ఎక్కించి రామారావును తీసుకుపోతున్నప్పుడు, శాంత కళ్లనీళ్లు కళ్లకక్కు ఉంటూ ''మీరు త్వరగా రండి, మీకోసం వెయ్యికళ్లతో నిరీక్షిస్తూ వుంటాను'' అన్నది.

వాన్ వెళ్లిపోయింది.

❧❧❧❧❧❧❧❧

శ్రీకాంత్ చదవడం ఆపుచేశాడు. చలపతి అమాంతం అతన్ని ఆలింగనం చేసుకొన్నాడు.

''చాలారోజుల తరువాత నే వో మంచికథ విన్నాను. గొర్రెదాటు విధానం ఇందులో లేదు. నీ అదృష్టం బావుంటే ఇదే నిన్ను కీర్తి శిఖరాల మీద కూచోబెడుతుంది'' అన్నాడు చలపతి.

ఈ మాటలు నిజంగా ఫీలయి అంటున్నాడో, మెహర్బానీ కోసం అంటున్నాడో మంజరి తేల్చుకోలేకపోయింది.

''అయితే ఓ చిన్న సంగతి. దీన్ని నాకిచ్చినట్లుగా ఎక్కడా అనకు. నువ్వు రేపు సాయంత్రం కనిపించు. మిగతా డబ్బు ఇచ్చేస్తాను. దీన్ని పిక్చర్ తీయడమే జరిగితే, నీ పేరుతో బాటు మరోపేరు కూడా వుంటుంది టైటిల్స్‌లో, నీకేమన్నా అభ్యంతరమా?'' అన్నాడు చలపతి.

''అదెందుకండీ?'' అన్నాడు శ్రీకాంత్.

''మీతో వచ్చిన చావే ఇదీ! నీకెంత తెలివితేటలున్నా, నువ్వు రాశానంటే, ఏ ప్రోడ్యూసరూ డబ్బివ్వడు. ఏ డిస్ట్రిబ్యూటరూ ముందుకురాడు. అంచాత, బాక్సాఫీస్ రైటర్‌గా పేరున్న మరో మహాకవి పేరు కూడా నీ పేరుకు జోడిస్తాం. నీ డబ్బేదో నీకు ముందుగానే ముట్ట చెబుతున్నాంగా, ఇందులో నువ్వు బాధపడవలసిందేముందీ?'' అన్నాడు చలపతి కాస్త విసుగుపడుతూ.

''కష్టపడింది నేనేకదండీ?'' అని అడిగాడు శ్రీకాంత్.

''నేను మాత్రం కాదన్నానా? ఇన్నేళ్ళ నుంచీ నువ్వు కష్టపడుతూనే వున్నావు. ఏమన్నా లాభించిందా? ఆ వారంతా ఈ వొక్క పిక్చర్లోనే రావాలంటే ఎలా ? ముందుగా నీ పేరు పబ్లిక్‌లో కాస్త ప్రచారం కానివ్వు, ఆ తర్వాత నువ్వు బిర్ర బిగిసినా నీకోసం కంపెనీలు వస్తాయి''

శ్రీకాంత్ ఇంకేమి అనలేదు.

''మరి-మీకేమన్నా పనులుంటే చూచుకోండి...రేపు సాయంత్రం నన్ను కలుసుకోడం మర్చిపోరుగా!''

''లేదండీ!''

శ్రీకాంత్ గాలిలో తేలుతున్నట్లుగా వెళ్ళిపోయాడు.

“చాలా మంచి కథ మంజరీ ఇది! ఇందులో సినిమాక్కావలసిన హంగులన్నీ వున్నాయి. చెయ్యగలిగితే దీన్నో రత్నంలాగా తీర్చిదిద్దవచ్చు. చూస్తూవుండు-దీనిమీద నేను వేలు వసూలు చేసేస్తాను” అన్నాడు చలపతి.

మంజరి లోపల ఏమనుకొన్నా పైకి మాత్రం ఆనందించినదానిలా కనిపించింది.

“మన తెలుగుజాతిలో వున్న గొప్ప దౌర్భాగ్యమేమంటే, మన గొప్పదనం మనకు తెలియకపోవడం. ఇదో బెంగాలీ కథనో, మరాఠీ కథనో చెబుతే, మనవాళ్లు కళ్లుమూసుకొని వేలు గుమ్మరించేస్తారు. దీనిమీద ఎంత నాటకమైన ఆడవచ్చు. ఈవిధంగా వెలుగులోకి రాకుండా, ఎన్ని మాణిక్యాలు మూలబడి వున్నాయో తెలీదు మంజరీ!” అన్నాడు చలపతి.

మంజరి ఏమీ అనలేదు. సన్నగా నిట్టూర్చింది.

# 9

అటు వెంకటేశ్వర్లుగారూ, ఇటు రామబ్రహ్మంగారూ ఎంత తొందరపడ్డా లాభం లేకపోయింది. నాలుగైదు ముహుర్తాలు, మాంఛి ముహుర్తాలు పరబ్రహ్మశాస్త్రిగారు ఎన్నిక చేశారు.

“ఇవన్నీ చక్కని ముహుర్తాలండీ బాబయ్యగారూ! సమస్త గ్రహగతులున్నా ఉచ్ఛదశను సూచిస్తున్నాయి. ఈ ముహుర్తాల్లో ప్రారంభించబడిన ఏ కార్యములైనప్పటికిన్నీ దిగ్విజయం కావలసిందే తప్ప మరోలాగా అయేందుకు అవకాశమన్నది ఎంతమాత్రం లేదని నేను ఘంటాపథంగా చెప్పగలను”అన్నారు శాస్త్రిగారు.

“అంటే-ఇప్పటి నాపిక్చర్ బాక్సాఫీస్ హిట్ కాక తప్పదంటారు” అన్నాడు చలపతి.

అతను-నవకళా చిత్రాలయ సంస్థ తనదేనన్న ధోరణిలో మాట్లాడటం ప్రారంభించి చాలా రోజులయింది. కంపెనీ తనదేననీ, రామబ్రహ్మంగారు ఫైనాన్స్ చేస్తున్నారనీ, తను కూడా కొంత పెట్టుబడి పెడుతున్నాననీ కొందరి దగ్గర అన్నాడు.

పరబ్రహ్మశాస్త్రిగారు మరోమారు కాగితం మీద గళ్లుగీసి, వేళ్ల కణుపులు లెక్కించి, గట్టిగా నిట్టూర్చి, తలను అడ్డంగానూ, నిలువుగానూ, కదుపుతే...“ఊఁహ-తప్పదు బాబయ్యగారూ! హరిహరాదులు అడ్డువచ్చినా, ఈ పిక్చర్ బ్రహ్మాండంగా సక్సెక్ కాక తప్పదు. ఆ విషయం దాని మొఖాన స్పష్టంగా రాసి వుంది” అన్నారు.

“గుడ్, గుడ్” అన్నాడు చలపతి.

తరువాత, రామబ్రహ్మంగార్ని చాటుకు పిలిచి, ఓ పది నిముషాలు గుసగుసలాడాక, చిన్న పింగాణీ పళ్లెంలో, నూట పదహారు రూపాయలూ, వక్కాకులూ ఉంచి, వెంకటేశ్వర్లుగారిచేత శాస్త్రిగారి కిప్పించాడు చలపతి.

“శాస్త్రిగారూ! మీరు మరోలాగ అనుకోకండి. షూటింగ్ రోజుని మిమ్మల్ని మళ్లీ పిలుద్దాం అనుకొంటున్నాం. సంతోషించాలి మీరు. తప్పదు” అన్నాడు చలపతి.

శాస్త్రిగారు వాటిని స్వీకరించి నాలుగడుగులు వేయగానే, చలపతి ఆయన్ను కలుసుకున్నాడు.

“మంజరి విషయంలో మీకేమన్నా కొరత చేసి ఉంటే, ఈ రూపంలో దాన్ని తీర్చుకొన్నా ననుకోండి. మామూలుగా మీకు యాభై రూపాయలేగా రేటు! మళ్లా కలుసుకుందాం. మరి సెలవిప్పించండి!” అని శాస్త్రిగారికి సాగనంపాడు చలపతి.

చిత్రమేమిటంటే-ఆ ముహూర్తం కాదు సరిగదా, అలాంటివి మరో మూడు గడిచినా, నవకళా చిత్రాలయ వారు పనిని ప్రారంభించలేకపోయారు. వారికి నచ్చిన కథను తారకం తయారుచెయ్యనే లేదు. శ్రీకాంత్ కథను బేరంపెట్టి చూశాడు చలపతి. కాని నాలుగువేలకు ఆ కథను కొనడానికి, రామబ్రహ్మంగారి కిష్టంలేదు. మంజరి ద్వారా వెంకటేశ్వర్లకు చెప్పించు దామన్న ఆలోచన చలపతికి రాకపోలేదు. కానీ, వెంకటేశ్వర్లుగారిని ఇలాంటి చిన్నచిన్న విషయాలకు వాడుకోవడం భావ్యం కాదనిపించింది. అదీగాక శ్రీకాంత్ దగ్గర తను కొన్న కథ-చాలా మంచిది. దానికెప్పుడైనా మంచి ధర పలుకుతుంది. అలవసులవలకు దాన్ని వొదులుకోవడంలో అర్థంలేదు.

ఒక చెంప రామబ్రహ్మంగారు, కథో కథో అంటూ లబలబలాడిపోతున్నాడు. వెంకటేశ్వర్లుగారు కూడా ఈ మాటను చాలాసార్లు అన్నాడు. ''డబ్బేమో నీళ్లవంతుగా ఖర్చయిపోతున్నది. అందుకు నాకు బెంగలేదు. కానీ మనం చేసిందేమిటా అని? మా షడ్డకుడైనా ఎంతకాలమని వోపికపడతాడు? వాడు మఠం ఎత్తేద్దామంటున్నాడు. ఈలోగా మనమేదో వొకటి చెయ్యకపోతే, వాణ్ణి ఆపడం నావల్ల కాదు'' అని తేల్చేశాడు వెంకటేశ్వర్లు.

మంజరి ప్రాణం జివ్వుమనిపోయింది. చలపతి తన అంబులపొదిని విప్పి కూచున్నాడు.

''అయ్యా! నేనంటే మీకు కోపంగానీ, ఇంతవరకూ ఏ పనీ కాకపోవడానికి ఎవరు బాధ్యులంటారు? ఏదో వో దిక్కుమాలిన కథను తీసుకొని, బొమ్మలాగి అవతల పడేస్తామంటారా? రేపీపాటికి అన్ని ఏర్పాట్లు చేస్తాను. మీరు లక్షల పెట్టుబడి పెడుతున్నారు. ఆ డబ్బు తిరిగి రావాలా వద్దా? లాభాల సంగతి నాతో అనకండి-అయినప్పుడు మనం, కొంచెం భారీ ఎత్తునే ఆలోచించాలి. ఈ కాస్త ఖర్చుకే మనం జడుసుకొంటే-పిక్చర్ తియ్యనేలేము. నేను మాత్రం ఊరికే కూచున్నానా? కాకి తిరిగినట్టు, కథకోసం తిరుగుతున్నానా లేదా?'' అన్నాడు చలపతి.

వెంకటేశ్వర్లుతో ఇంత గట్టిగా చలపతి మాట్లాడతాడని మంజరి అనుకోలేదు. వాళ్ళిద్దరూ మాటామాటా అనుకొంటారేమోనని కూడా మంజరి భయపడింది. దీనికితోడు ఇంకో అనుమానమేమిటంటే- కాకి తిరిగినట్టు తిరిగినంత మాత్రాన ''కథ'' దొరుకుతుందా?

మంజరి ఆలోచనల్ని ఛిద్రం చేస్తూ వెంకటేశ్వర్లు మాట్లాడసాగాడు.

''అయితే ఇప్పుడేం చేదాం?'' అన్నాడతను, మంజరికేసి తిరిగి సన్నగా కన్ను మలుపుతూ!

''నేను రెండుమూడు రోజుల్లో ఓ కవిని పట్టుకొస్తానుండండి. అందరం కూచుని అప్పటి కప్పుడే తాడోపేడో తేల్చేద్దాం!'' అన్నాడు చలపతి.

ఈ మాటలు వెంకటేశ్వర్లు విన్నాడన్న నమ్మకం చలపతికి కలుగలేదు. మంజరీ, అతగాడూ కలిసి నేత్రావధానం ప్రారంభించారు. ఈ అభినయానికి పర్యవసానం చలపతి తెలుసు. అతను ఛటుక్కున లోపలికెళ్లి రెండుమూడు నిమిషాలయ్యాక, ''మంజరీ! నిన్న నేనిచ్చిన కాగితాలు ఎక్కడ పెట్టావోయ్?'' అని కేకేశాడు.

''నిన్న మీరు నాకే కాగితాలు ఇవ్వందే'' అన్నది మంజరి వసారాలోనించే.

''ఇచ్చాను, నీకు జ్ఞాపకం లేదేమో! ఓసారి వాటిని తీసివ్వు'' అన్నాడు చలపతి, ఈసారి కొంచెం కోపంగా.

''నాకు మీరివ్వనే లేదండీ!''

''అయితే, నేనే ఎక్కడో పెట్టి మరిచిపోయి ఉంటాను... ఇలా రారాదూ, ఈ పెట్టెలో ఉన్నాయేమో చూదాం''.

''ఏం కాగితాలండీ?'' అంటూ మంజరి లోపలి కొచ్చింది ''నిన్న మీరు కాగితాలె ప్పుడిచ్చారు?''

''ఈ మాత్రం జ్ఞానం లేకపోతే ఎలా మంజరీ? నిన్ను లోపలికి రప్పించడానికే అలా అన్నాను. నేను పిలవగానే లోపలికి రావాలి గానీ, యక్షప్రశ్నలన్నీ వేస్తూ కూచుంటావేం?'' అని రుస రుసలాడాడు చలపతి.

మంజరి ఏమీ అనలేదు.

''నిన్ననే బాంకు నుండి పదివేలు తెప్పించాడు వెంకటేశ్వర్లు. మనదగ్గరా నలభై, యాభయ్‌కన్నా ఎక్కువ లేవు. ఓ రెండు వేలు అడగరాదూ? అవసరమయితే, రేపు నీ కంట్రాక్టు మొత్తంలోంచి ఈ రెండువేలూ డెబిట్ చేసుకోమందాం!'' అన్నాడు చలపతి.

మంజరి ఓసారి చలపతికేసి చూసి తలవంచుకొంది.

''నీకేమన్నా అభ్యంతరమా?'' అన్నాడు చలపతి.

ఆ మాట బాణంలాగా తగిలింది మంజరికి. చలపతిమీద కోపమూ, అసహ్యమూ కూడా కలిగాయి.

''అలాగేలెండి! అడిగిచూస్తాను''అన్నది మంజరి.

చలపతి ఏదో అనబోయాడు; కానీ అనలేదు. హడావుడిగా బట్టలేసుకొని, అంతకన్నా హడావుడిగా వెళ్లిపోయాడు.

''నేను వెళ్ళొస్తానమ్మాయిగారూ!'' అన్నది తాయారు తలుపుపక్క నిలబడి.

''తొందరేం?''

''ఏదన్నా పనున్నదేమో వెళ్లనివ్వరాదా మంజరీ!'' అని ఓక్షణం ఆగి, ''సరే నవ్వా! వెళ్లు-'' అని తాయారుతో చెప్పి, ''మరి నేనూ ఆఫీసు కెడతాను'' అన్నాడు వెంకటేశ్వర్లు.

తాయారు వెళ్లిపోయింది.

మంజరి వచ్చే నవ్వును ఆపుకొంటున్నదానిలాగా, ''మరి-ఆఫీసుకు వెళ్ళాలి గావును, బయలుదేరండీ!''అన్నది.

''నేనుండటం నీకు కష్టంగా ఉన్నదా?'' అన్నాడు వెంకటేశ్వర్లు.

''ఆఁ'' అన్నది మంజరి ఫక్కున నవ్వేసి. ''మిమ్మల్ని నమ్మకూడదు. మీరు మామూలు మనుషులు కారు''.

''అబ్బబ్బబ్బా! నా ఆరోగ్యం ఏమీ బావోలేదు మంజరీ! ఉత్తినే దాహమవుతూ వుంటుంది. నిన్న డాక్టర్నడిగితే, ఏవో పిల్స్ రాసిచ్చాడు...కాసిని మంచినీళ్లు తెప్పించు''అన్నాడు వెంకటేశ్వరులు.

''పనిమనిషి కూడా వెళ్లింది. ఇహ నేనే తీసుకురావాలి''అంటూ లేచి రెండడుగులు వేసింది మంజరి.

అంతలోనే వెంకటేశ్వర్లు కూడా కుర్చీలోంచి లేచే ప్రయత్నం చేస్తున్నాడు.

మంజరి వెనక్కు తిరిగింది. ముసిముసిగా నవ్వుతూ, ''బాబూ! మీకు నమస్కారం, మీరక్కణ్ణించి కదలకండి, కదిలారంటే నేను మంచినీళ్లు తీసుకురాను'' అన్నది.

ఈ మాట ఎంత బలంగా పనిచేసేదీ మంజరికి క్షుణ్ణంగా తెలుసు. ఈ బాణం వదలి ఫలితంకోసం ఓక్షణం వెంకటేశ్వర్లుకేసి చూసిందావిడ. అతని కళ్లు మిలమిలలాడసాగాయి.

''నేను దయ్యాన్నా, భూతాన్నా మంజరీ!'' అన్నాడు వెంకటేశ్వర్లు కుర్చీలోంచి మెల్లగా లేస్తూ.

''రెండూనూ!'' అని మనసులో అనుకొన్నది మంజరి. తరువాత బుంగమూతి పెడుతూ,

“ఏమిటమ్మా ఆ మాటలు? నేను నవ్వుతూ అన్నదానికి అంతలా కోపగించుకోవాలా? ఐతే ఇహ అనన్లెండి” అన్నది రెండడుగులు లోపలికి వేస్తూ.

వెంకటేశ్వర్లు కూడా లోపలికొచ్చి తలుపులు మూశాడు.

“మీరిలాంటి వెకిలివేషాలు నాదగ్గర వెయ్యకండి. మర్యాదగా వసారాలో కూచోండి, నేను మంచినీళ్లు తెచ్చిస్తాను”

“అంత కోపమేం?”

“నేను మాట్లాడటం కూడా చాతకానిదాన్ని, నన్ను ముట్టుకోకండి మరి” అన్నది మంజరి, అతని చేతుల్నించి తప్పుకోవడానికి పెనుగులాడుతూ.

వెంకటేశ్వర్లు పెద్దగా నవ్వాడు.

“పిచ్చిదానా! ఈచేతుల్లోంచి తప్పుకొందామనే నీ ఉద్దేశం?” అన్నాడు వెంకటేశ్వర్లు. మంజరి పెదవులకోసం వెదుకుతూ “ఏం దాచుకొన్నావోయ్ ఇక్కడ? వీటికోసం నా ప్రాణాలివ్వమన్నా ఇచ్చేస్తాను” అన్నాడు.

“వేటికోసం?” అన్నది మంజరి ఏమీ తెలియనిదానిలా.

వెంకటేశ్వర్లు చూపులు ఆవిడ భుజాల మధ్య తారట్లాడాయి.

మంజరి సిగ్గుపడిపోయింది.

“అబ్బ! నన్ను వెళ్లనివ్వండి- అందులోనూ మందు కూడా వాడుతున్నామంటు న్నారు...నన్ను మంచినీళ్లు తీసుకురానివ్వరా ఏం?”

వెంకటేశ్వర్లు మాట్లాడలేదు.

“అందుకే మీరంటే భయం. ఇహ నాప్రాణాలు తీసేస్తారు... ఆయనేమో కొంపలంటుకుపోయినట్లు పరిగెడతారు. ఉన్న పనిమనిషిని కాస్తా మీరు పంపించేశారు... ఇందుకేవన్నమాట!”

“నేనంటే నీకు ఇష్టంలేదా మంజూ?” అన్నాడు వెంకటేశ్వర్లు.

“భగవంతుడు నాకు బలం ఇవ్వలేదుగానీ, ఇచ్చే వుంటే, మిమ్మల్ని కొరుక్కుతినేదాన్ని... అదుగో... ఆ పనే మీరు చెయ్యొద్దు...ముందు అక్కణ్ణించి చెయ్యి తియ్యండి....అసలే నాకు చక్కిలిగిలి...అయ్యో రామా! ఏం విరిచేస్తారండీ?”

వెంకటేశ్వర్లు పిచ్చికుక్కయిపోయాడు. అతన్ని ఇంకాస్సేపు ఏడిపించాలనిపించింది మంజరికి.

“ఉండండి చెబుతాను...ఎవరో వస్తున్నట్లుగా ఉంది....”

వెంకటేశ్వర్లు గభాలున మంజరిని వొదిలి, మూలగా నుంచున్నాడు. మంజరి పకపకా నవ్వుతూ, “ఏం ధైర్యమండీ బాబూ మీది!” అన్నది. “అవునుగానండీ, నేనిలా అడుగుతున్నానని, అనుకోకుండా ఉంటే-”

“ఏమిటది?” అన్నాడు వెంకటేశ్వర్లు.

మంజరి అతనికెదురుగా నుంచుని రెండు భుజాలమీదా చేతులు వేసింది. సన్నగా నవ్వుతూ, అతను మంజరి వీపు వెనకగా చేతులు కలిసి దగ్గరా తీసుకొన్నాడు.

“ఏమిటమ్మడూ అది?”

“నాకు సిగ్గుగా ఉంది బాబూ! విన్నా మీరు ఎగతాళి పట్టిస్తారు. పోన్లెండి... ఏమీలేదు” అన్నది మంజరి.

అతనోసారి మంజరి కళ్లల్లోకి మెత్తగా చూసి, ''ఎంత బావుంటాయి మంజూ, నీ కళ్ళు?'' అంటూ వాటిని మెల్లగా ముద్దుపెట్టుకొన్నాడు.

''ఇలా నన్ను రెచ్చగొట్టి చంపుతారు. అనేక నేనేమన్నా చేస్తే చేశానంటారు... ఏమో బాబూ! ఏ ముహుర్తాన నన్ను మాయచేసి వలలో వేసుకొన్నారోగానీ, నాకు నిద్రాహారాలు లేకుండా చేశారు...మీరూ, మీ ఆఫీసుపనులూ ఏ గంగలోనన్నా దూకండి. కనీసం రోజుకొక్క సారన్నా మీరు నాకు కనిపించాలి. లేదా కారు పంపండి, నేనన్నా మీకోసం వస్తాను'' అన్నది మంజరి.

''ఎందుకమ్మీ, నేనంటే అంత వెర్రి వ్యామోహం నీకు?'' అన్నాడతను.

''ఎందుకా?'' అని ఓనిమిషం పాటు ఆలోచించింది మంజరి. తరువాత తల అడ్డంగా తిప్పుతూ, కింది పెదవిని కొరుక్కుంటూ ''ఏమో! నాకు తెలీదు. నేను చెప్పలేను...మీరు నన్నేం చేశారో చెప్పరూ?'' అన్నది.

వెంకటేశ్వర్లు ఆమె చెక్కిళ్లను సున్నితంగా నిమిరాడు.

''నాకోసారి హంపీ చూడాలని ఉన్నది. హంపీలో పూర్వపురాజుల మేడలు ఉన్నాయిటగా?''

''అవునుట, చాలామంది వెడుతూ ఉంటారు...మనమూ వెడదామంటావా?''

''మనమూ-అంటే, మీరూ నేనే మాత్రమే వెళ్ళాలి. ఈ పాడు సజ్జునంతా వెంట తీసుకురాకండి. మనిద్దరమే వెళ్లి ఓ రాత్రల్లా అక్కడ ఉండి తిరిగివద్దాం....అయితే, ఆ సీసాలు మాత్రం వద్దు'' అన్నది మంజరి.

''అలాంటి చోట 'మందు'లేకపోతే మజాయే ఉండదు మంజరీ! ఈసారి వెరైటీ మారుద్దాం...అలాగే! ఎప్పుడు పోదాం?''

''మీ ఇష్టం! నేనెప్పుడూ రెడీయే'' అన్నది మంజరి.

''ఇప్పుడు కూడానా?'' అన్నాడు వెంకటేశ్వర్లు మెల్లిగా ఆమె చెవిలో.

''అబ్బబ్బా! మనిషి కనిపిస్తే మీరు బతకనివ్వరు. ఏం చంపుకు తింటారండీ!'' అన్నది మంజరి.

వెంకటేశ్వర్లు అన్నంతపనీ చేశాడు.

అతను చెప్పులు తొడుక్కొంటున్నాడు. మంజరి గోళ్లతో జుట్టు సరిచేసుకొంటూ ''చిన్నమాట'' అన్నది.

''అబ్బబ్బా! ఏం ప్రాణాలు తీస్తావు మంజరీ? అందుకే నువ్వంటే భయం!'' అంటూ లోపలికొచ్చాడు. ''ఏమిటి?''

''గుంటూరు నించి మా చెల్లెలు ఉత్తరం రాసింది. దానికేవో ఇబ్బందులొచ్చి పడ్డాయిట. రెండువేలుంటే సర్దమన్నది ఇంకో మూడు మాసాల్లో వారికి రావాలసిన డబ్బు వస్తుందిట. మనమేమన్నా పంపడానికి వీలుపడుతుందంటారా?'' అన్నది మంజరి.

''చూద్దాం'' అన్నాడతను.

''అలాగనకండి. ఇంకెక్కడా వీలుపడకనే అది నాకు రాసింది. కావాలంటే మీరు తరువాత చెల్లుబెట్టుకొందురుగానీ, ఖర్చురాసి ఇప్పించండి!''

''సరే సాయంత్రం నేను చలపతికిచ్చి పంపుతాను''.

''కొంపముంచారు. ఈ సంగతి ఆయనదాకా వెళ్లనివ్వకండి...అతనికా ఉత్తరం వచ్చినట్లే తెలీదు...మీరే స్వయంగా రండి...కాసేపు సరదాగా కూచుని మాట్లాడుకొందాం...''

''నేనొస్తే ఉత్తినే కూచోలేను'' అన్నాడు వెంకటేశ్వర్లు నవ్వుతూ.

"పోండిబాబూ! మీరెప్పుడూ-వస్తారుగా! మీకోసం ఎదురుచూస్తుంటాను...సినిమా చూసి ఎన్ని రోజులయిందో...మంచి పిక్చర్ కెడదాం".

"ఓ.కే"అని కేకేశాడు వెంకటేశ్వర్లు.

అతను వెళ్లిపోయాక, తలపట్టుకొని కుర్చీలో చేరగిలపడిపోయింది మంజరి.

వెంకటేశ్వర్లు అన్నమాట నిలబెట్టుకొన్నాడు. ఆ సాయంత్రం కాదు గానీ, ఆ మొన్నాడు అతను రెండువేల రూపాయలూ పట్టుకొచ్చి మంజరి చేతికిచ్చాడు. మంజరి ఆశ్చర్యపోయింద నడం చాలదిక్కడ? ఆ క్షణాన వెంకటేశ్వర్లు పట్ల ఆమెకు జాలి కూడా కలిగింది. తన మీద ఎంత ఆపేక్ష లేనిదే, రెండువేలు తెచ్చి తన చేతుల్లో పోస్తాడు? తనంటేపడి చచ్చేవాడికి తనేమిస్తున్న దిట? అందం సంగతి సరేసరి! ఒకప్పుడీ శరీరం అయిదుకూ, పదికీ కూడా అమ్ముడుపోయింది. మంజరి కనుకొలకుల్లో సన్నగా నీటిజీరలు ఏర్పడ్డాయి.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?" అన్నాడు వెంకటేశ్వర్లు,వేళ్లకున్న ఉంగరాలను తిప్పుకుంటూ.

"ఏం లేదు...మీకెలా కృతజ్ఞత చెప్పాలా అని ఆలోచిస్తున్నాను".

ఈ మాట మనస్ఫూర్తిగానే అన్నది మంజరి.

"ఆ పద్ధతి నేను చెబుతాను!" అంటూ కాలుస్తున్న సిగరెట్టుని దూరంగా గిరాటెట్టి దగ్గరగా వచ్చాడు వెంకటేశ్వర్లు.

మంజరి అలానే నిలబడింది.

అతను మంజరిని మెత్తగా ముద్దుపెట్టుకొని "నేనోమాట అంటాను. నువ్వేమీ అనుకోనంటే చెబుదామని ఉంది...మరి చెప్పనా?" అన్నాడు.

మంజరి చెప్పమన్నట్లు తలూపింది. ఆవిడ చేతిలో ఇరవై వందరూపాయలనోట్లు ఇంకా పెళపెళలాడుతూనే వున్నాయి.

"మనం హంపీ పోదామనుకున్నాం గదూ? ఆనాటికి మీ చెల్లెల్ని కూడా రమ్మను. ముగ్గురం కలిసివెడదాం. బ్రహ్మాండంగా అక్కడ ఎంజాయ్ చెయ్యొచ్చు....నీకేమన్నా అభ్యంతరమా? అసూయగానీ పడుతున్నావా?"

అంతవరకూ అతని పట్ల ఉన్న సదభిప్రాయం కాస్తా ఈ వాక్యాలతో సమూలంగా తుడిచి పెట్టుకుపోవడమే కాకుండా, వెంకటేశ్వర్లు మీద చెప్పరానంత అసహ్యం కూడా వేసింది. ఆ నోట్లు అతని ముఖాన గిరాటెట్టి మెడమీద చెయ్యివేసి వీధిలోకి పడనెట్టాలనిపించింది. అంతలోనే వెంకటేశ్వర్లు పగలబడి నవ్వాడు-

"మీ ఆడవాళ్లలో వున్న రోగమే ఇది! ఏమున్నా ఏం లేకపోయినా చచ్చినంత అసూయ మాత్రం ఉంటుంది... అవునుగానీ, మీచెల్లెలి పేరేమిటన్నావ్?"

"వసంత" అన్నది మంజరి.

"పేరు బాగానే వుంది...మరి...మనిషి ఎలా వుంటుందో తెలీదు....నీలాగానే ఉంటే వెరీగుడ్..అదయినా నువ్వొప్పుకుంటేనే సుమా!" అన్నాడు వెంకటేశ్వర్లు.

మంజరి ముభావంగా ఉండటం చూసి, ఆమెను కన్విన్స్ చెయ్యడానికి ప్రయత్నాలు ప్రారంభించాడు.

"మనం ఎంతకాలం బతుకుతామో మనకే తెలీదు మంజరి! ఉన్న నాలుగురోజులూ పైలాపచ్చీసుగా ఉండాలి. దిక్కుమాలిన కుశంకలన్నీ పెట్టుకొని జీవితంలోని కాస్త సుఖాన్ని

వదులుకోవడం నాకిష్టం లేదు. నామట్టుకు నాకు వెరైటీ కావాలి. గానుగెద్దులాగా నేను బతకలేను. నువ్వూ అలా వుండకు. అంచేత-నేననేదేమిటంటే ఈ డబ్బు వెంటనే వసంతకు పంపించు. ఆవిణ్ణి అక్కడ పనులు సర్దుకొన్ని రమ్మను. మనతో బాటే వుంటుంది. మనపిక్చర్‌లోనే ఆవిడకూ ఓ చిన్నవేషం ఇద్దాం''.

''అలాగే!'' అన్నది మంజరి

వెంకటేశ్వర్లు ఇదే పంపిణీ మీద ఇంకో అరగంటసేపు వాగివాగి వెళ్లిపోయాడు. మంజరి కుర్చీలోనే జారగిలబడి కళ్లు మూసుకొన్నది.

రెండు మూడు రోజులు చలపతి మాంఛి కథకోసం గాలించిన మాట నిజమే! కానీ అతనికి నచ్చిన కథంటూ ఏదీ కనిపించలేదు. మంచి దానికోసం చూస్తున్నామనీ, అటువంటి దేమీ దొరక్కపోతే శ్రీకాంత్ కథనే స్క్రీన్ చేస్తామనీ, ఫోక్‌లోర్ తీయాలనే అనుకొన్నప్పటికీ, సోషల్ కూడా మరీ అంత తీసికట్టు కాదనీ, రెండు మూడు మాసాల్లో పిక్చర్ రిలీజ్ చెయ్యాలనీ చలపతి చాలామందికి చెప్పుకొచ్చాడు. దీనివల్ల- నవకళా చిత్రాలయ వారికి ఇంకా సరైనకథ దొరకలేదన్నది రూఢీగా తేలిపోయింది. ఈ విషయం రుజువు చేసుకొన్నాక రఘురామాచార్లుగారు సరాసరిగా నవకళా చిత్రాలయ వారి ఆఫీసుకు పనిమాలా వచ్చి తనకు తాను పరిచయం చేసుకొన్నాడు.

రఘురామాచార్లు గారు పేరు మోసిన సినిమా కవి. మూకీల నాటి నుండీ ఆయనగారు ఈ పరిశ్రమలో వున్నారు. నూరు, నూట పాతిక చిత్రాలకు కథలు, సంభాషణలు, పాటలూ రాశారు. సినిమాలో ఏవేవి వుండాలో ఏయే పాళ్ళల్లో వుండాలో వారికి బాగా తెలుసు. పరమ బూతుపాటలూ, అంతకన్నా బూతు సంభాషణలలూ రాసి సెన్సార్ వారి కత్తెరపడకుండా చూడగలిగిన ప్రజ్ఞావంతులాయన. ఆయన పేరు చెబితే సినీసాహిత్యలోకం మోకరిల్లీ తీరవలసిందే! అటువంటి సినీమహాకవి తమ ఆఫీసు కొచ్చాడంటే మాటలా?

రామబ్రహ్మంగారు ఇదివరకే ఆచార్లవారి పేరు విని వున్నాడు. వారి దర్శనం మాత్రం కాలేదు. ఆ మాటే అన్నాడు కూడాను.

''ఎంత మాట! 'మన' ప్రాంతం నుండి మీరొచ్చారని యీ మధ్యనే నాకు తెలిసింది. చాలా సంతోషించాను. నిన్నా మొన్నా ఇక్కడికి వద్దామనుకొన్నానుగానీ తీరింది కాదు బాబూ! తలనిండా పనులున్నాయి. నేనా -వాళ్ళలాగా, వీళ్ళలాగా కుర్ర వెధవల చేత రాయించి, నా పేరు పెట్టుకోను. ప్రతి ముక్కా నేను స్వయంగా రాసుకోవాలి. అప్పటిగ్గానీ నాకు తృప్తి వుండదు'' అన్నారు. ఆచార్లుగారు.

రామబ్రహ్మంగారు 'ఊఁ' కొడుతున్నాడు.

''ఈ సంగతులన్నీ మీకు తెలీనివి కాదనుకోండి. సినిమా సక్సెస్ కావడమన్నది కేవలం కథ మీదనే ఆధారపడి వుంటుందండీ! అదే పునాది. స్టారుకాస్టు వున్న పిక్చర్స్ మట్టిగొట్టుకు పోవడానికి ఇదే కారణం. నే పనిచేసిన పిక్చర్లన్నీ ప్రొడ్యూసర్లకు లక్షలు తెచ్చి పెట్టాయి. నేను కథకూ, సంభాషణలకూ, పాటలకూ ప్రాముఖ్యమిస్తాను మీరా లక్షలు పోసి తియ్యబోతున్నారు- కాస్తలో లోపించకండి. మంచి కథ దొరికిందా గప్‌చిప్‌మని పుచ్చుకోండి. లేదా''

''ఓ పిక్చర్‌కు మీరేం తీసుకుంటారండీ?'' అన్నాడు రామబ్రహ్మం.

''పది బాబూ! ఆఫీసుకొచ్చినప్పుడల్లా కార్లో పెట్రోలు పోయించాలి. ఇక్కడ ఖర్చులు పెట్టుకోవాలి. ముందుగా సగం తీసుకొంటాను. పేపర్ వర్కంతా అయ్యాక మిగతా సగమూ తీసుకొంటాను''

అన్నాడు రఘురామాచార్లుగారు.

రామబ్రహ్మంగారి గుండె గభీలుమన్నది. ముష్టి మూడు గంటలసేపుండే సినిమా కథకు పదివేలా? పైగా పెట్రోలు ఖర్చులా?" "మా కంపెనీ అంత భరించలేదు లెండి" అన్నాడు రామబ్రహ్మం చల్లగా.

"నేనంత యివ్వమనలేదు బాబూ! నా రేటు అడిగారు గనక చెబుతున్నాను. మీరు కథ కోసం వెదుకుతున్నారని విని, ఇలా వచ్చాను. ఎందుకంటారు? నా కివ్వమని అడిగేందుకు కాదు, మీరా కొత్తవారు. కలం పట్టుకోవడం వచ్చిన ప్రతివాడూ, సినిమాకు రాస్తామంటూ బయలుదేరుతున్నాడు. వాళ్ళు పాతిక్కూ, యాభైకూ కథలిచ్చేస్తారు కూడాను. కానీ మీరా కథ మీద గుమ్మరించే లక్షల మాటేమిటంటున్నాను నేను డబ్బు మనిషిని కాను. భగవంతుడు నాకు తినా, కుడవా ఇచ్చాడు. నాకే దిగులూ లేదు కానీ మీలాంటి కొత్తవారు తెలియక ఇందులో పడిపోతూ వుంటే నేను చూస్తూ వూరుకోలేను. ఈ పరిశ్రమలోకి కొత్త పెట్టుబడులు రావాలి. కొత్త రక్తం రావాలి. మీరు కావాలంటే నా కథ నొకదాన్ని వూరికే యిస్తాను తీసుకోండి. బాగా వెళ్ళి నాలుగు డబ్బులొస్తే నాకివ్వండి. నష్టపొయ్యారనుకోండి - మిమ్మల్ని నేను దమ్మిడీ అడగను. నే నీమాట ఎంత భరవాసా మీద అన్నదీ మీరర్థం చేసుకొంటే నా కంతే చాలు" అన్నారు ఆచార్లుగారు.

రామబ్రహ్మంగారి కీ ఆలోచన బాగా నచ్చింది. ఓ కొత్తవాడిచేత పిక్చర్‌కు రాయించుకొని "ఎక్స్‌పెరిమెంట్" చేయడం కన్నా, పేరు ప్రతిష్టలున్న ఆచార్లు వారి చేతనే పని చేయించుకొంటే పోలా? అందులోనూ ఆయనగారు - సంభాషణలు, పాటలతో సహా రెడీగా వున్న స్క్రిప్ట్ యిస్తామంటున్నారు. పైగా చిల్లికానీ ఇవ్వడవసరంలేదంటున్నారు. ఇంతకన్నా తనక్కావలసిందేముందీ?

సంతోషాన్నంతా దాచుకొంటూ రామబ్రహ్మంగారు పొడి దగ్గు దగ్గారు.

"అలాగే బాబుగారు! మీలాంటివారు పనిమాలా ఇంత సాయం చేస్తామంటూ రావడమే గొప్ప విశేషం! రెండు మూడు రోజుల్లో మీకు తప్పకుండా కబురు చేస్తాం" అన్నాడు రామబ్రహ్మం.

"మీ నుంచి మాట తీసుకొన్నాకగానీ, నేను ఇంకోర్ని గురించి ఆలోచించను" అంటూ రఘురామాచార్లు వెళ్ళిపోయారు.

ఆచార్లవారి పాచిక అనేకచోట్ల పనిచేసినట్లే, రామబ్రహ్మం మీదా పనిచేసింది. అయితే ఆచార్లువారు పాచిక విసిరినట్లుగా రామబ్రహ్మంగారికి తెలీదు.

ఒకప్పుడు-సినిమా పరిశ్రమకు మకుటంలేని మహారాజుగా ఆచార్లుగారు వెలిగారు. సినిమాలు చూడటమంటేనే తప్పుగా భావించే రోజుల్లో ఆయన మాట చెల్లింది. రాను, రాను సినిమా కళాస్థాయి కోల్పోయి, పరిశ్రమ స్థాయిలోకి వచ్చాక, ఆచార్లు గారికి పోటీ ఎదురయింది. రఘురామాచార్ల కన్నా బాగా రాయగలిగిన వారు చాలామంది ఈ పరిశ్రమలోకి వచ్చారు. దీంతో లోగడ వారికున్న గిరాకీ చాలావరకూ తగ్గిపోయింది. రాతగాళ్ల మధ్య పోటీ నానాటికి పెరిగిపోసాగింది. దీనికి రఘురామాచార్లుగారో చిట్కా కనిపెట్టి, నానా చెఱలూపడి పేరులో కొచ్చిన రచయితలను కూడగట్టుకున్నారు. కొత్తవారిని రాకుండా చూడటం లక్ష్యంగా పెట్టుకొన్నారు. పొరబాటున ఎక్కడన్నా ఓ కొత్త రచయితలకు ఆధరువు దొరికితే, వీరు వెళ్లి దాన్ని కాస్త నిర్మూలించి వస్తూ వుంటారు. కొత్త వాళ్ల కిచ్చే డబ్బుకే తనూ రాస్తాననేవాడు. అనవసరంగా లక్షలు తీసుకెళ్లి గంగపాలు చెయ్యవద్దనేవాడు. ఎవరికయినా ఏమనిపిస్తుంది? పేరుప్రతిష్టలు లేని రచయితను పెట్టుకోవడం కన్నా అదే రేటుకు

రాస్తామంటున్న పాత రచయితను పెట్టుకోవడమే మంచిదనిపిస్తుంది. దీంతో కొత్తవాడికి స్థానమే లేకుండా పోతుంది. ఈవిధంగా రఘురామాచార్లుగారు నెట్టుకొస్తున్నారు. అదీగాక-ఆయనకు డిస్ట్రిబ్యూటర్ల దగ్గరా, నటీనటుల దగ్గర నుంచి పలుకుబడి ఉండేది. ఫలానావారు పిక్చర్‌కు బాగా రాస్తారని నటీనటులచేతా, డిస్ట్రిబ్యూటర్లచేతా ప్రొడ్యూసర్లకు చెప్పించేవారు. వీరి మనసులు నొప్పించడం ఇష్టంలేకా, ఇష్టమున్నా నొప్పించి సినిమా తీయడం అసాధ్యమని గ్రహింపుకొచ్చీ, చాలా కంపెనీలు వీరిచేతనే తమ సినిమాలకు మాటలూ, పాటలూ రాయించుకొన్నారు.

ఒకసారి ఏదో కంపెనీవారు 'పాదుకా పట్టాభిషేకం' సినిమా తీయాలనుకొన్నారు. శివరామబ్రహ్మంగారు ఇటువంటి కథలు రాయడంలో ఆరితేరినవారని పేరున్నది. 'పాదుకా పట్టాభిషేకం' లోనే వారు భరతుని కొక డ్రీమ్ సీక్వెన్సు పెట్టి అందులో దశావతారాలూ చూపించారు. ప్రొడ్యూసర్లు అన్నీ మాట్లాడుకొని, కవికీ, యాక్టర్సుకూ ఎడ్వాన్సులిచ్చి, డిస్ట్రిబ్యూటర్ దగ్గర కొచ్చారు. ఆ డిస్ట్రిబ్యూటర్ రఘురామాచార్ల గారికి స్నేహితుడు. తను అయిదారు లక్షల దాకా పెట్టుబడి పెడతాననీ, అయితే స్క్రిప్టు తన ఇష్టం వచ్చినట్లు మార్చాలనీ, తనకు నచ్చాలనీ అన్నాడు. తనకు నచ్చేలాగా రాయగలిగినవారు రఘురామాచార్లు గారొక్కరే నన్నాడు.

"మేము శివరామబ్రహ్మంగారికి నాలుగువేల ఎడ్వాన్సిచ్చాం. ఇప్పుడెలా మార్చడం?" అన్నారు ప్రొడ్యూసర్లు.

"అంతకన్నా నేను చెప్పగలిగిందేమీ లేదు. మీకలా ఇష్టమయితేనే మీ పిక్చర్ నాకివ్వండి. లేదో ఇంకో కంపెనీకి ఇచ్చుకోండి...అసలు నేనే ప్రొడక్షన్ ప్రారంభిద్దామనుకొంటున్నాను. నాకు పాదుకా పట్టాభిషేకమంటే స్పెషల్ ఇన్టరెస్టున్నది. ఆచార్ల వారి దగ్గర స్క్రిప్టు రెడీగా వున్నది. గట్టిగా పూనుకొంటే మూడుమాసాల్లో లాగి అవతల పారేస్తాను" అన్నాడు డిస్ట్రిబ్యూటరు.

అవతలివాళ్లు కుదేలయిపోయారు.

శివరామబ్రహ్మంగారికిచ్చిన నాలుగువేలు వదులుకొని రఘురామాచార్లుగారికి పదివేలిచ్చుకున్నారు. ఈ సంభాషణలు జరిగే శ్రీనాటికి ఆచార్ల వారి దగ్గర అసలు ఏ స్క్రిప్టూ లేదు. ఆ దరిమిలా ఆయనగారు ఈ పనిమీద కూచుని నెలరోజుల్లో పూర్తిచేశాడు. అటువంటి పలుకుబడి ఉన్నవాడాయన.

"ఇదిగో-అదుగో" అంటూనే రఘురామాచార్లుగారు మూడు నాలుగు మాసాలు రామబ్రహ్మంగార్నీ, వెంకటేశ్వర్లునూ తనచుట్టూ తిప్పుకొన్నాడు. ఈలోగా మూడునాలుగువేలు వారి నుండి పిండిపారేశాడు. తీరా ఆయన కథ పేనేనాటికి, నవకళా చిత్రాలయ సంస్థ సినిమా తీసే స్థితిలో లేకుండా పోయింది.

రామబ్రహ్మంగారూ, వెంకటేశ్వర్లుగారూ కుక్కలకన్నా అధ్వాన్నంగా పోట్లాడుకొన్నారు.

"నువ్వు నన్ను నిలువునా ధ్వంసం చేశావు నాడబ్బంతా ముండలకీ, తాగుడుకూ ఖర్చు చేశావు. చుట్టానివని నమ్మాను. నాకొంప ఆర్పావురా వెంకన్నా!" అని వాపోయాడు రామబ్రహ్మం.

వెంకటేశ్వర్లు మాట్లాడలేదు గానీ అతని తరపున చలపతి మాత్రం బాగా నోరు చేసుకొన్నాడు. "బాబూ! మీరు పెద్దవారనుకొన్నాను గాని, ఇంత బద్మాషులనుకోలేదు. మీరు అనవసరంగా మా ప్రొడ్యూసర్‌ని అనకండి. డబ్బు మీదేకాదు, మాదీ ఉంది. మా వాటా మా ఇష్టం వచ్చినట్లు ఖర్చు చేసుకొంటాం. అడగటానికి నువ్వెవరివట? నీకిష్టమైతే కంపెనీలో ఉండు. లేదా నీ భాగం వదులుకొని వెళ్లు. పిచ్చిపిచ్చిగా మాట్లాడకండి. నేనిక్కడ పుట్టి ఇక్కడేపెరిగినవాణ్ణి. మళ్ళా మీరు సెంట్రల్‌స్టేషన్

చూడరు. తరువాత మీ ఇష్టం. మీపెట్టా, బెడ్డింగు పట్టుకెళ్లి ఏ హొటల్లోనన్నా దిగండి....ఇంకోక్షణం మీరు మా ఆఫీసులో ఉండటానికి వీల్లేదు'' అన్నాడు చలపతి.

రామబ్రహ్మం నివ్వెరపోయాడు. చలపతి ఇంతలా మాట్లాడుతాడని ఆయన కలలో గూడా అనుకొని ఉండడు. వెంకటేశ్వర్లుగానీ చలపతిగాడి నోరు మూయిస్తాడేమోనని, ఓనిమిషం పాటు షడ్డకుని కేసి చూశాడు రామబ్రహ్మం. వెంకటేశ్వర్లు నిర్లిప్తంగా కూచుని ఉన్నాడు. రామబ్రహ్మం కళ్లు ఎఱ్రబడ్డాయి. ఇంకోమాట లేకుండా, ఉన్న చేసంచిలో గుడ్డలు సర్దుకొని, నిశ్శబ్దంగా వెళ్లిపోయాడు.

చకాచకా మెట్లు దిగుతున్న రామబ్రహ్మం కేసి చూసి తలదించుకొన్నాడు వెంకటేశ్వర్లు.

''ఏం తమ్ముడా! నేనలా అన్నందుకు నీకేమన్నా బాధగా ఉందా?'' అన్నాడు చలపతి.

''ఏం'' అన్నాడు వెంకటేశ్వవర్లు.

''నువ్వు ముభావంగా ఉంటేను''.

వెంకటేశ్వర్లు నవ్వాడు.

రామబ్రహ్మంగారు పోవడంతో కంపెనీ వ్యవహారాలు కుదుటపడతాయని చలపతి అంచనా. అతగాడికి వెంకటేశ్వర్లు మీద బ్రహ్మాండమైన నమ్మకమున్నది. మంజరి ద్వారా వెంకటేశ్వర్లు ఆస్తిపాస్తుల వివరాలన్నీ లోగడే తెలుసుకొన్నవాడు కావడం చేత నవకళా చిత్రాలయకు వెంకటేశ్వర్లును ఏకైక యజమానినిగా చేసి తను నాటకమాడుదామనుకొన్నాడు. అందుకే రామబ్రహ్మంగారిని అనరాని మాటలు కూడా అన్నాడు. కాని దానికి విరుద్ధంగా జరిగింది. వెంకటేశ్వర్లు పేదవాడని కాదుగానీ, అతను చెప్పుకొన్నంత ఉన్నవాడూ కాదు. రామబ్రహ్మం వెళ్లిపోయిన రెండోవారంలోనే, వాయిదా డబ్బు చెల్లించనందుగ్గాను, కంపెనీ వారొచ్చి కారును పట్టుకెళ్లారు. అసలే బాంకులో ఉన్న బాలెన్సు అంతంత మాత్రం. ఈలోగా, వెంకటేశ్వర్లు దాన్ని చుప్తాగా డ్రా చేసి పారేశాడు. ఓ నెలరోజులు టాక్సీమీద ఆఫీసుకి రాకపోకలు జరిగాయి. తరువాత అవీ తగ్గిపోయాయి.

నెలాఖరయ్యేసరికి, ఆఫీసుకు అద్దె, పనివాళ్ల జీతాలు కలిపి పన్నెండు వందలు ఇవ్వతేల్చారు. నవకళా చిత్రాలయవారు కంపెనీ ఎత్తేశారని పాండీ బజారంతా మోగిపోయింది.

''ఇప్పుడేం చేదాం?'' అన్నాడు వెంకటేశ్వర్లు కళ్లు నులుముకొంటూ.

''నా ఖర్మకాలి సమయానికి చిల్లికానీ లేకుండా పోయింది. నువ్వోపనిచెయ్యి తమ్ముడూ! ఇంతదాకా వచ్చి వెనక్కు తియ్యడం నాకే నామోషీగా ఉంది. మనం సినిమా తియ్యాల్సిందే! ఆ నిర్ణయానికి తిరుగులేదు. మీరు ఊరుకెళ్లి రండి. మా మరదల్నూ, పిల్లల్నూ చూసినట్లూ ఉంటుంది. అక్కడి వ్యవహారాలు చక్కబెట్టినట్లూ ఉంటుంది. ఓ వారం రోజులుండి మీరో యాభైకి తక్కువగాకుండా పట్టుకురండి. ఈలోగా నేనింకో భాగస్తుణ్ణి చూస్తాను. అంటే- మీ షడ్డకుళ్లాగా మడతపేచీల రకం కాదు. మనం చెప్పినట్టే వినేవాడే, మావాడే ఉన్నాళ్ళెండి. ఏమంటావు మంజరీ?'' అన్నాడు చలపతి.

''అదే బావుంది!'' అన్నది మంజరి.

''రైటేననుకో, నేనింటికి రాసిన జాబుకు జవాబు కూడా రాలేదు. అదొచ్చిందాకా నేను కదలడానిక్కూడా వీల్లేదు గదా!'' అన్నాడు వెంకటేశ్వర్లు.

''నేనూ అందుకే ఆందోళనపడుతున్నాను తమ్ముడూ! జవాబు రాలేదంటే అక్కడేదో ఇబ్బందులున్నాయనేగా అర్థం....నువ్వు మరోలా అనుకోకు, నా దగ్గరో పాతిక రూపాయలున్నాయి...ఫర్వాలేదు పట్టుకెళ్లు, తర్వాత చూసుకొందాం'' అన్నాడు చలపతి.

వెంకటేశ్వర్లు ఎటూ మాట్లాడలేకపోయాడు. అతనికి బాగా తాగి ఆదమరచి నిద్రపోవాలని ఉన్నది. కానీ అందుకు అవకాశం లేదు. చలపతి అతన్ని తొందరగా ప్రయాణం చేయించాడు. వెళ్ళేలోగా మంజరితో ఓ పావుగంటన్నా 'కాలక్షేపం' చేదామని వెంకటేశ్వర్లు కోరుకున్నాడు. చలపతి పడనిచ్చాడు కాడు. అతని రైలెక్కించి, ఆ రైలు కదిలిందాకా ఉండి మరీ ఇంటికొచ్చాడు చలపతి.

మంజరి ఒక్కర్తే బిక్కుబిక్కుమంటూ వసారాలో కూచున్నది.

"వెళ్ళారా?" అన్నది మంజరి.

ఆమె గొంతులోని బాధను చలపతి గుర్తించాడు. అయినా పైకి పొంగలేదు.

"ఆహా!" అంటూ కూచున్నాడు చలపతి. తరువాత తాపీగా సిగరెట్ వెలిగించి, గుప్పుమని ఇంటి కప్పుకేసి పొగ ఊది సన్నగా నవ్వాడు.

"మళ్ళీ ఎప్పుడొస్తానన్నారు?" అన్నది మంజరి.

"ఎక్కడికీ? మద్రాసుకా!" అని నవ్వాడు చలపతి. "పిచ్చిదానా! ఇంకా వెంకటేశ్వర్లు వస్తాడనేనా నీ నమ్మకం!"

"మరి?" అన్నది మంజరి బిత్తరపోతూ.

"అదంతే! అతనికి రాడు, రాలేడు. అద్దెకింద ఆఫీసులో ఉన్న ఫర్నీచరును తీసేసు కుంటారు ఇంటివాళ్ళు. పనివాళ్ళకు మాత్రం చేసిన చాకిరీ దండగవుతుంది. ఈ మొహాలు సినిమా తీసేవిగావని నాకెప్పుడో తెలుసు. అందుకనే నేను అందినంత వరకూ పిండుకోమన్నది. ఎందుకైనా మంచిదని, మనకు ఉపయోగపడేవాళ్ళందరికీ కంపెనీ చేత తృణమో, కణమో ఇప్పించాను. వాళ్ళందరూ మనకు తప్పకుండా సాయపడతారు" అన్నాడు చలపతి.

"ఆఁ నా బొందసాయం" అనుకొన్నది మంజరి నిట్టూరుస్తూ.

చలపతి విషయాన్ని ఇట్టే గ్రహించాడు.

"నువ్వలా ప్రతిదానికీ కుంగిపోతే నేను చెయ్యగలిగిందేమీ లేదు. దేనికైనా కాలం కలిసిరావాలి. మన ప్రయత్నమూ ఉండాలి. ప్రయత్నలోపమేమీ లేదు గదా! ఈ మెట్లన్నీ అందరూ ఎక్కవలసిందే! ఇంకొంత కాలం చూదాం. ఈలోగా ఏం జరిగినా జరగొచ్చు" అన్నాడు చలపతి.

మంజరికి ఈ శుష్కప్రియాలు వినే వోపిక లేకపోయింది. ఆవిడ లేచి ఇంట్లోకి వెడుతుంటే, చలపతి వెనకాతలే వచ్చి భుజం మీద చెయ్యివేసి తనవేపు తిప్పుకొన్నాడు. మంజరి అతని ముఖం కేసి చూసి, తలదించుకొన్నది.

"నాకదే పాలుపోవడం లేదు మంజరీ! నువ్వింత అందంగా ఉంటావు గదా, ఇంచక్కా భావాలను ఎక్స్‌ప్రెస్ చేస్తాటవు గదా, నీకెందుకు ఈ ఇండస్ట్రీలో స్థానం ఉండదా అని! తప్పకుండా ఉంటుంది- నీఅడుగులకు మడుగులొత్తే రోజులున్నాయి. నీ మాటమీద సినిమా పరిశ్రమ బాగోగులు ఆధారపడే రోజులున్నాయి. అయితే వాటికోసం నువ్వు కాస్త వోపికపట్టాలి. అంతే!" అన్నాడు చలపతి.

మంజరి మౌనంగా నవ్వింది.

"ఏమోబాబూ! నాకా గొడవలేమీ తెలీవు. సుఖంగా ఉన్నదాన్ని తెచ్చి ఇక్కడ పడేశారు. మీరనకముందు నాకీ సినిమాల ఆలోచనే లేదు. మీరు "సైఁ" అంటున్నారు గనక, నేనూ అంటున్నాను,. ఈరోజుతో, ఈప్రయత్నాలకు తెర దించేయండి. మంచిరోజు చూసుకొని గుంటూరు వెళ్లిపోదాం. మననాటకాలు మనకు ఉండనే ఉన్నాయి. మీకూ నాకూ పొట్ట జరక్కపోదు"అన్నది మంజరి.

“నేను వాజమ్మనని నువ్వనుకొంటే తప్ప ఈ మాటలని ఉండవు” అన్నాడు చలపతి.

మంజరి అతన్ని నిలువునా ఆలింగనం చేసుకొని, బరువంతా చలపతి మీద మోపుతూ “మీరలా పెడర్థాలు తీయకండి. నామనస్సేమీ బావోలేదు. తెలీక ఏమన్నా అని వుంటే మర్చిపోండి. ఈ పూట మీకేమీ పనుల్లేవుగా-ఉన్నా వాటికి ఎగనామం పెట్టేసెయ్యండి. కాళ్లు ముడుచుకొని, మీ పొట్టలో పడుకోవాలని ఉన్నది. హాయిగా నిద్రపోతే తప్ప నాకు కులాసాగా ఉండదు” అన్నది.

ఆ తెల్లవారి రావుగార్ని కలుసుకొన్నప్పుడు, చలపతి కొన్ని విషయాలు బయటపెట్టాడు.

“నిజంగా ఈ ఫీల్డంత ఛండాలపు ఫీల్డు ఇంకోకటి లేదు రావుగారూ! ఇదిగో పులంటే, అదేమ(్రా తోక-అంటారు. రామబ్రహ్మం గారితో పడక ఆయన్ను పంపించేశాం. ఇప్పుడు, కంపెనీ సోల్ ప్రొప్రయిటర్ వెంకటేశ్వర్లుగారే! నిన్ననే ఎడ్వొకేట్‌ను కన్సల్టు చేశాంలెండి. ఆయనగారు కంపెనీ పేరు కూడా మార్చమన్నాడు. లేకపోతే “నవకళా చిత్రాలయ” వారి లయబిలిటీస్ అన్నీ భరించాల్సొస్తుందన్నాడు. ఆలోచించి చెపుతామన్నాను. నాకేమో మనసులో ఒక పేరు మెదులుతూ ఉన్నదనుకోండి; మీ అనుమతి కూడా తీసుకుని ఆ పేరు కన్‌ఫరమ్ చేదామనుకొంటున్నాను. మీరుమాత్రం కాదనకండి” అన్నాడు చలపతి.

రావుగారు సినిమాటిక్‌గా నవ్వివూరుకొన్నారు.

“మీరంటే ఈ సినీలోకానికి దేవుళ్ళాంటివారు. మా మంజరికి దేవాది దేవుళ్ళాంటివారు. మీపేరు, మంజరిపేరు కలిసివచ్చేలాగా కంపెనీకి పేరు పెడదామని నా అభిప్రాయం. మీపేరులోని మొదటి అక్షరం మంజరి పేరులోని మొదటి అక్షరం చేర్చి “రామ ఫిలింస్” అంటే ఎలా ఉంటుంది?” అన్నాడు చలపతి.

“నేనేం చేశానని మీకింత అభిమానం చలపతిగారూ?” అన్నాడు రావు.

“ప్రత్యేకంగా నాకేదో చేశారనీ కాదు; చెయ్యమనీ కాదు. మీ వల్ల ఈ పరిశ్రమకు చాలా మేలు కలిగింది. నాకదే పదివేలు. ఇంతకన్నా మీకు నేను ఇంకోరూపంలో కృతజ్ఞతలు చెప్పుకోలేని స్థితిలో ఉన్నాను”.

“థాంక్స్” అన్నారు రావుగారు. తరువాత ఆపేరును కాగితం మీద రాశారు. ఒకటిరెండు సార్లు వినీవినపడనట్లుగా ఆపేరును ఉచ్ఛరించారు. మెల్లిగా తలపైకెత్తి “బావుందండీ! అలానే కానివ్వండి. కానీ, మీకభ్యంతరం లేకపోతే ఈరెండక్షరాలకూ ముందుగా “శ్రీ”ని చేర్చండి, అప్పుడు ఇంకా నిండుగా ఉంటుంది”, అన్నారు.

“గుడ్ గుడ్; వెరీగుడ్, వెరీ వెరీ నైస్ సజెషన్. “శ్రీరామఫిలింస్”- ఇదే పేరును ఖాయం చేస్తున్నాను. రెండు,మూడు రోజుల్లో కంపెనీని రిజిష్టరు చేయించేస్తాను. మా బాస్ నిన్ననే ఊరుకెళ్లాడు; ఈ దఫా, ఓలకారం బాంకులో లేనిదే పని ప్రారంభించం. అయితేనాదో చిన్న రిక్వెస్టున్నది. కంపెనీ తరపున, ముందుగానే మీకు డబ్బు ముట్టచెప్పే బాధ్యత నాది. మీరు మాత్రం శ్రమ అనుకోకుండా కాల్‌షీట్సు ఇప్పించాలి. మీ ప్రోగ్రాం ఇస్తే, మిగతా వారిది నేను ఎడ్జెస్టు చేసుకోమంటాను,” అని ప్రాధేయపడ్డాడు చలపతి.

“షూర్ షూర్, నేను తప్పకుండా చూస్తాను” అన్నాడు రావుగారు.

“మరి సెలవు” అంటూ చలపతి మేడమీంచి కిందికొచ్చి, రావుగారి పెర్సనల్ సెక్రటరీ ఎదురుగా

కూచుని, ఓ సిగరెట్ ఆఫర్ చేసి, అతను తీసుకొన్నాక, తనూ ఒకటి అంటించాడు.

''చెప్పండి''అన్నాడు పి.యస్.

''ఏం లేదు బ్రదర్! రావుగారితో కాస్త పనుండి వచ్చాను. నువ్వుకాస్త సాయంపడితివా, బండి లాగించేస్తాను. ఉన్న కీలకమంతా ఇప్పుడు నీ చేతుల్లోనే ఉన్నది''.

''మీకోసం...''

''నువ్వుఏమన్నా చేస్తావని నాకు తెలుసు బ్రదర్! మనవాడివి వున్నావనే నీదగ్గరకొచ్చాను. మా కంపెనీ పిక్చర్ ప్రారంభించడానికి ఇంకా అయిదారు మాసాలు పడుతుంది. మా మంజరికేమో పొద్దుపోవడం లేదు. ఈలోగా ఏదన్నా చిన్న వేషమన్నా వేస్తానంటూ కూచుంది. ముందుగా చిన్న వేషాలు వేస్తే అదే పేరు ఖాయమవుతుందంటే వినిపించుకోదు. నాకూ- ఓరకంగా ఆవిడ ప్రపోజల్ నచ్చింది. ఈలోగా ఆవిడకు కెమెరా ఫియర్ తీరితే, రాఫిలిం దుబారా తగ్గినా తగ్గినట్లే! ఏమంటావ్?'' అన్నాడు చలపతి.

''రైట్'' అన్నాడు పి.యస్.

''నువ్వు -రావుగారు యాక్ట్ చేస్తున్న పిక్చర్సులో ఎక్కడన్నా జాగా ఉన్నదేమో చూసిపెట్టు, మనవాళ్ల గొడవలు నీకు తెలీనివి కాదుగదా! మరో గంటకు సెన్సార్‌కు వెళ్లుతుందనగా కూడా, ఇంకా ఛేంజెస్ చేస్తూనే ఉంటారు. అలాంటివి బోలెడు ఉండే ఉంటాయి. కాస్త పుణ్యం కట్టుకో భాయీ! సాటి కులంవాణ్ణి. ఆమాత్రం అభిమానముంచు, నేనైనా మరిచిపోయేవాణ్ణి కాదులే!''

''ఇవ్వాళ టూ టు నైన్ కాల్‌షీట్ ఉంది. ఈ పిక్చర్ మొన్ననే ప్రారంభించారు. కొన్ని సీన్సు ఇంకా ఫైనలైజ్ కాలేదనుకుంటాను. అసిస్టెంటును కనుక్కొని రేపు చెబుతాను'' అన్నాడు పి.యస్.

''థాంక్స్'' అంటూ చలపతి వచ్చేశాడు.

రావుగారి పర్సనల్ సెక్రటరీ అన్నమాట నిలబెట్టుకొన్నాడు. స్టూడియో కెళ్లినప్పుడు మరచిపోకుండా అసిస్టెంట్ డైరెక్టర్‌ను అడిగాడు. ఇంకా నాలుగైదు వేషాలకు ఎవ్వర్నీ బుక్ చేయలేదని చెప్పాడు అసిస్టెంట్ డైరెక్టర్. అవి చిన్నవేషాలనీ, అవసరమైతే ఒకటి రెండు వేషాలను డెవలప్‌చేసి, వాటికి ఇంపార్టెన్స్ ఇప్పించవచ్చునని కూడా చెప్పాడు.

''అదయ్యా సంగతి'' అన్నాడు పి.యస్. ఆ తెల్లవారి చలపతితో.

''థాంక్యూ! మరి నేను వెడుతున్నాను. మళ్ళా కనిపిస్తాను'' అన్నాడు చలపతి.

తిన్నగా మంజరి దగ్గరకొచ్చి, ''నీ రొట్టె విరిగినేతిలో పడింది మంజరీ! మోహన్ మూవీస్‌వారి సోషల్ పిక్చర్లో నీకో వేషం దొరికింది. ఇవాళో, రేపో ఆ కంపెనీవారు నీకోసం వస్తారు'' అన్నాడు చలపతి.

''నిజంగానాండీ?'' అన్నది మంజరి.

''ఇహ నువ్వుసినిమాల్లో చేరతావో, గుంటూరు వెళ్లి నాటకాలు వేసుకుంటావో నీ ఇష్టం... ఇంతకాలానికి నీ అదృష్టం బైటపడింది. నిన్ను ఆపడం హరిహరబ్రహ్మాదుల వల్ల కూడా కాదు''.

''పోదురూ మీదంతా బడాయి''అన్నది మంజరి, అతని వీపు మీదుగా వంగి ముఖంలో ముఖం ఉంచుతూ.

''చూస్తావుగా!''

మంజరి శరీరమంతా గాలిలో తేలిపోతున్నట్లయింది.

మోహన్ మూవీస్ వారి పిక్చర్‌లో మంజరికి వేషం దొరకడానికి ముందుగా చలపతి ఇంకో

చిన్న నాటకం ఆడవలసి వచ్చింది. అతగాడు రావుగార్ని షూటింగ్ సమయంలో కలుసుకొని, మంజరి విషయం ప్రస్తావించాడు.

"ఈ పిక్చర్‌లో ఏవో రెండుమూడు చిన్నవేషాలున్నాయని ఇంకా ఫైనలైజ్ కాలేదని తెలిసింది. మీ ఫ్యాన్ మంజరి-మీరున్న పిక్చర్‌లో వుండాలని నా ప్రాణాలు తీసేస్తోంది రావుగారూ! ఆప్రొడ్యూసరేమో, మీరు ఊఁ అంటే తప్ప ఇచ్చేలా లేరు. మీరు చెప్పారని ఓ ముక్క ఆయనతో అనమంటే అంటాను. వెళ్లి చెప్పిరానా?" అన్నాడు చలపతి.

"ఇంకా ఎవర్నీ బుక్ చెయ్యకపోతే చెప్పొచ్చుననుకోండి. అయినా-మన పిక్చర్ ఉండనే ఉందిగా-ఈలోగా ఈ కక్కుర్తి దేనికా అని?"

రావుగారు "మన పిక్చర్ ఉన్నదిగా" అని ఎందుకన్నాడో చలపతి ఇట్టే పసిగట్టాడు. ఆయనగారూ-అసలు పిక్చర్ తీసేదీ లేనిదీ కనుక్కోవటం కోసమే ఈముక్క వాడాడని చలపతికి తెలుసు.

"బాగా అన్నారు. నేను నెత్తీ నోరు కొట్టుకొని మరీ చెప్పాను. తనకు భయం తీరడం కోసమన్నా వేషం వేస్తానన్నది. 'సరే'నన్నాను. పోనివ్వండీ-మనం మాత్రం ఆవిడ సరదా నెందుక్కాదనాలి?.... మన వెంకటేశ్వర్లుగారు జాబు రాశారు. పదిరోజుల్లో వచ్చేస్తున్నారుట. ఈలోగా ఆఫీసుకో మంచి బిల్డింగ్ చూడమన్నారు. మన ప్రయత్నాలన్నీ రావుగారితో చెప్పమనీ, వారి సహకారం తప్పకుండా పొందమనీ మరీమరీ రాశారు. కావాలంటే రావుగారికి ఓ పది పదిహేనుగాకా ముందుగానే సర్దుదామనీ రాశాడు. మిమ్మల్నడిగి జవాబు రాద్దామనుకొంటు న్నాను. మీరేం చెబితే అదే రాస్తాను"అన్నాడు చలపతి.

"ఐయాం నాట్ పర్టిక్యులర్ ఎబౌట్ మనీ మిస్టర్ చలపతీ!" అన్నాడు రావు. ట్రాలీమీద వెనక్కు నడుస్తున్న కెమెరాలను చూస్తూ "సర్లెండి. ఆలోచిద్దాం...మీరేదో పనిమీద వెళ్లొస్తాన న్నారుగా...పోయిరండి. ఆ ప్రొడ్యూసరు ఏమన్నదీ నాకు చెబితే- అవసరమయితే..." అన్నాడు.

"అలాగే".

కాల్‌షీట్ టైం అయిపోతున్నా నాలుగు నిమిషాల పిక్చరన్నా తీయనందుకు డైరెక్టర్ మీద రుసరుసలాడిపోతున్నాడు ప్రొడ్యూసరు. సరిగ్గా ఆ సమయంలో అక్కడికొచ్చాడు చలపతి. ప్రొడ్యూసరుకోసారి నమస్కరించి నుంచున్నాడు.

"ఏం బాబూ, ఏమిటి సంగతి?" అన్నాడు ప్రొడ్యూసరు రవంత చిరాగ్గా.

"ఇప్పుడే రావుగారితో మాట్లాడాను..." అని ప్రారంభించాడు చలపతి.

"అంతా చూస్తూనే వున్నాను నాయనా! గట్టిగా ఏమనడానికీ లేకుండా ఉంది. హీరోగారేమో నీతో హస్కువేసుక్కూచున్నాడు. హీరోయిన్‌కు అలసటొచ్చి కూచుండిపోయింది. వాళ్లను పిలిచే దమ్ములు మా డైరెక్టరుకు లేవు...చెప్పండి. ఏమిటి కథ? అన్నాడు ప్రొడ్యూసర్ మళ్ళా.

"మన పిక్చర్‌లో రెండుమూడు చిన్న చిన్న వేషాలేవో ఉన్నాయటగా! ఓ వేషానికి-కాస్తంత మంచి వేషానికి-వారికి తెలిసిన అమ్మాయిని తీసుకోమని మీతో చెప్పమన్నారు. ఆ పిల్లపేరు మంజరి. ఇందా- ఇదీ అడ్రసు. రేపు మీ ప్రొడక్షన్ మేనేజర్ని ఈ అడ్రసుకు పంపించండి"అని అడ్రసు కాగితం ఇచ్చాడు చలపతి.

"అలాగే బాబూ! తప్పకుండాను. హీరో చెప్పాక కూడా బుక్ చెయ్యకపోతే ఇహ జన్మలో ఈ పిక్చర్ పూర్తికాదు. అయితే చూడ్నాయనా! ఇదెవత్తె-మంజరినా-రావుగారికి-" అని ఆగిపోయాడు

ప్రొడ్యూసర్.

"మరేనండీ! ఏవో సంబంధాలుంటాయి. లేకపోతే వారు, పనిమాలా నన్ను పిలిచి చెప్పారు గదా? మీరు మాత్రం వారిమాటనెందుక్కాదనాలి? ఓ వేషం పారేయండి. ఎవర్నో ఒకర్ని బుక్ చేయక తప్పనపుడు, హీరో రికమెండ్ చేసిన కాండిడేట్‌నే బుక్ చేస్తేపోయె. ఆయనా సంతోషిస్తాడు; ఎప్పుడన్నా పీకలమీద కూచుంటే, ఇంకో నాలుగు కాల్‌షీట్లు ఇస్తాడు" అని సలహా ఇచ్చాడు చలపతి.

ఈ సలహా ప్రొడ్యూసర్‌కూ నచ్చింది. ప్రొడక్షన్ మేనేజర్ని పిలిచి 'రేపు ఈ ఎడ్రస్‌కెళ్ళి ఆవిణ్ణి తోలుకురావయ్యా పంతులూ!" అన్నాడు.

'ఓ.కె. సార్!" అన్నాడు ప్రొడక్షన్ మేనేజరు.

# 10

మంజరి జగన్మోహనంగా అలంకరించుకొని కుర్చీలో కూచున్నది.

చలపతి ఆవిడకు ఎదురుగా కూచున్నాడు. మంజరి మాటిమాటికీ గడియారం కేసీ, వీధికేసీ చూస్తున్నది.

"వస్తుంది. వస్తుంది. తప్పకుండా కారు వస్తుంది" అన్నాడు చలపతి సన్నగా నవ్వుతూ. "ఇప్పుడు నువ్వెంత అందంగా వున్నావంటే ప్రొడ్యూసరూ, డైరెక్టరూ ఉన్న హీరోయిన్ను పీకిపారేసి, ఇంతవరకూ తీసిన ఫిలిం తగలెట్టేసి, నిన్ను హీరోయిన్‌ని చేసి మళ్లా రీషూటింగ్ జరుపుతారేమోననిపిస్తోంది".

"మనుషుల్ని ఉబ్బెయ్యడం మీకు బాగా చాతవుద్ది" అన్నది మంజరి.

"అక్కడ కూడా 'అవుద్ది' 'పోద్ది' అనవాకు. అందంగా సున్నితంగా మాట్లాడాలి... అదుగో.. అప్పుడే నువ్వు ముఖం మాడ్చేస్తున్నావు. నీతో ఎలా వేగడం చెప్పు మంజరీ! నీకేమో ఇక్కడి సంగతిసందర్భాలు తెలియవాయె. చెబితేనేమో కోపమాయె. చెప్పకుండా తెలుసుకోవడం నీవల్ల కాదాయె...అవునా అమ్మాయీ! నువ్వు భయపడకు. లైట్లు, మైకు, మనుషులు, కెమెరా- ముందస్తిగా కాస్త గాభరాగా ఉంటుందనుకో. నిభాయించుకోవాలే. ఏవో నాలుగు రకాల స్టిల్స్ తీస్తారు".

"అంటే?" అన్నది మంజరి.

"అంటేనా?" అని ఆలోచించాడు చలపతి; ఆ విషయం ఎలా తెలియచెప్పాలో అతనికీ బోధపళ్ళేదు. "అంటే...మరేంలేదు. నాలుగైదు పోజుల్లో నిన్ను ఫోటో తీస్తారన్నమాట. నవ్వుతూ, ఆలోచిస్తూ, దిగులుపడుతూ, కోప్పడుతూ వున్నప్పుడు నువ్వెలా ఉండేదీ వాళ్లకు తెలియాలి గదూ మరి? అంచేత, అన్ని రకాల భావాలను చూపెట్టమంటారు. జాగ్రత్తగా యాక్ట్ చెయ్యాలి. మరేంలేదు ఆ భావాన్ని బాగా ఎక్స్‌ప్రెస్ చెయ్యాలన్నమాట. అలాగే రకరకాల డైలాగ్స్ అనిపిస్తారు. అవన్నీ రికార్డు చేసి వింటారు. వాటిని తప్పుల్లేకుండా, భావయుక్తంగా అనాలి. ఈ కాస్త గుడ్డూ గడిస్తే, దీన్నెమ్మ భయం తీరిపోయినట్లే. నేనూ ఉంటాననుకో...కానీ చెప్పొచ్చేదేమిటంటే-".

చలపతి వాక్యం పూర్తిచెయ్యకుండానే కారు వచ్చింది. మంజరి ముందుగా వెళ్లి కారులో కూచుంది. ఆ తరువాత చలపతి డ్రైవర్ ప్రక్కగా వచ్చి కూచున్నాడు. మంజరికి పాత సంఘటన గుర్తుకొచ్చింది. ఓసారి వెంకటేశ్వర్లు కూడా ఇలానే తనను కార్లో తీసుకెళ్లాడు. తరువాత హెూటలు కెళ్లడం, సీసాలు, వాసన...ఎంత కాదనుకొన్నా ఆలోచనలు అటునుంచి మళ్లనేలేదు. ఈ జ్ఞాపకాలతో

ఆవిడ మనస్సంతా అల్లకల్లోలమయిపోయింది. కారు దిగేసరికి ఆవిడ ముఖం ముడుచుకుపోయి వుండటాన్ని చలపతి గ్రహించాడు.

"ఏమిటి వ్యవహారం?" అన్నాడతను.

మంజరి మ్లానంగా నవ్వి ఊరుకొంది.

"ఇది పరీక్షా సమయం. నీ భవిష్యత్తు అటో యిటో తేలిపోయేదిప్పుడే! ఈ సమయంలో నువ్వు బెదిరిపోయావంటే, శాశ్వతంగా యీ రంగానికి తిలోదకాలిచ్చుకోవాలి. కాస్త కాన్షస్‌గా ఉండు!"

ఈ మాటలన్నీ అన్నాక, చలపతి కింకో భయం పట్టుకొన్నది. తను కాస్తంతను గంపంత చేసి మాట్లాడానేమోననిపించిందతనికి. అసలే బిక్కుబిక్కుమంటూ వున్న మంజరికి ధైర్యం చెప్పడం పోయి, తను మరింత బెదరగొట్టాడు. ఆ అదురుతో ఆవిడ టెస్టులన్నీ ధ్వంసం చేస్తే, ఫలితానికి తనే జవాబుదారీ అవుతాడు. తనకీ మాత్రం ఆలోచన ముందుగానే రానందుకు చలపతి నొచ్చుకున్నాడు కూడాను.

మంజరిలో తిరిగి ప్రాణప్రతిష్ఠ చేదామనుకొంటుండగానే ఓ బ్రహ్మాండమైన కారు రావడమూ, అందులోంచి ఓ అందాలచుక్క నేలమీదకు కాలు మోపడమూ జరిగింది. ఆ చుక్కను ఎక్కడో చూచిన గుర్తున్నది మంజరికి. ఆవిడ చుట్టూరా హేమాహేమీల్లాంటి జనం ముసిరి, వంగి వంగి దణ్ణాలు పెడుతున్నారు. ఆవిడ నవ్వుతో కనుసైగలతో, చేసైగలతో వినిపించీ వినిపించకుండా సమాధానాలు చెబుతోంది. ఆవిడ కేసి నోరింత చేసుకొని చూస్తోంది మంజరి.

"నీ పిక్చర్‌లో హీరోయిన్ యీవిడే మొదట్లో నీకు మల్లేనే బుకింగ్స్ లేక నానాబాధలూ పడింది. రెండుమూడుసార్లు నేను బస్సు టికెట్లు కొనిచ్చాను కూడాను. నాలుగేళ్లు తిరగలేదు. టాప్ రాంక్‌స్టారై కూచున్నది. ఇవ్వాళ ఆవిడ రేటు పాతికవేలు. రేపో ఎల్లుండో హిందీ ఫీల్డుకు ఎగబాకినా పాకొచ్చు. అంతా లక్ మంజరీ! మరేం లేదు..." అన్నాడు చలపతి.

తనో నాలుగేళ్లకు ఇలానే అవుతానని తోచి మంజరి మురిసిపోయింది. తనేనాడైనా అలాంటి కారును ఎరుగునా? తన చుట్టూ అంతమంది ఉద్దండ పిండాలు జీహుకుం అంటూ చుట్టేశారా?

హీరోయిన్ లోపలకెళ్లింది. ఆవిడతోబాటే భక్తకోటి కూడా లోపలికెళ్లింది. పావుగంట తరువాత గానీ, అసిస్టెంట్ డైరెక్టర్ జోగిసలాడుతూ రాలేదు.

"అడుగో వస్తున్నాడు' లేచి కాస్తంత వినయంగా..."రండి బాబూ రండి!" అన్నాడు చలపతి, నమస్కారం చేస్తూ.

మంజరి కూడా లేచింది

"ఈవిడే బాబూ మంజరి" అని పరిచయం చేశాడు చలపతి. "వీరే అసిస్టెంట్ డైరెక్టరుగారు. బ్రహ్మాండమైన బుర్ర. గొడ్డులాగా పనిచేస్తారు. కాని మనవాడికి సుడి సరిగా లేదు మంజరీ! అడవా చాకిరీ అంతా మనవాడి వంతు, కీర్తి డైరెక్టరుగారి వంతు...ఇలాఉంది ప్రపంచం! అలా చూస్తావేం మంజరీ? రాత్రి మనం అనుకొన్నది వీరిని గురించే!"

"అదేలెండి!" అన్నది మంజరి అసిస్టెంట్ డైరెక్టరును చూపులతో తడుపుతూ.

"దేనికైనా టైం రావాలి బ్రదర్, ఒక్క నాలుగుమాసాలు వోపిక పట్టు. మన కంపెనీలోకి వచ్చేద్దువుగాని. నువ్వు ప్రామిస్ చేస్తే డైరెక్టర్‌గా నీపేరే ఎనౌన్సు చేయిద్దాం. నీ ఖర్మకాలి నీకు పేరయితే లేదుగాని, తెలివితేటలున్నాయి. ఇంతకాలం నీ బుర్ర ఇతర్లకు కీర్తి సంపాదించి పెట్టింది. ఇహనన్నా

నీకోసం నువ్వేమన్నా చేసుకో'' అన్నాడు చలపతి.

అసిస్టెంటు కాసేపు తనలో తనే ఏదో గొణుక్కున్నాడు.

''అంతేనండి బాబూ అంతే!''ఆడపడుచు'' సినిమాకు నేనే వర్కు చేశాను. సెంచరీ కొట్టింది. ట్రోఫీలు, పూలహారాలు, సన్మానాలు, డైరెక్టరు కొట్టేశాడు. నా ముఖం చూసిననాడే లేడు. ఎవర్నని ఏం ప్రయోజనం?'' అన్నాడు అసిస్టెంట్.

''నువ్వా పిక్చర్ చూశావో లేదో గాని మంజూ, మార్వెలెస్ సీన్స్‌ను సెల్యులాయిడ్‌లో కెక్కించాడనుకో మనవాడు. బృందావన్ గార్డెన్సును బొచ్చెడంత మంది షూట్ చేశారు. మనవాడూ చేశాడు. డిఫరెన్సు చచ్చినంత ఉంది...బ్రదర్-ఆ సీన్‌లో, హీరోహీరోయిన్ల చేత వండర్‌ఫుల్ రొమాన్స్ చేయించానయ్యా! జనం వెర్రెత్తిపోయిందక్కడే!''

''ఆడపడుచు'' సినిమాను మంజరి కూడా చూసింది. సగంలోనే బోరెత్తి లేచి వచ్చింది. కాని, ఈ మాట తను అనడానికి లేదుగదా చచ్చి?

''సరేలే బ్రదర్, ఈవిడ మన కాండిడేట్! కాస్త గట్టెక్కించు. కెమెరామన్‌తోనూ, సౌండ్ ఇంజనీర్‌తోనూ ముందుగానే వో ముక్క చెప్పి వుంచు...ఇహ వెళ్లిరండి'' అన్నాడు చలపతి.

''మీరో?''అన్నట్టు చూసింది మంజరి.

''మనవాడేలే మంజరీ! ముందు మీరు పదండి, పదినిమిషాల్లో వస్తాను''.

చలపతి తనతో రాడని మంజరి రూఢయిపోయింది. ఆవిడకెందుకో కొద్దిగా భయం కూడా వేసింది. ముక్కు మొహం తెలీనివాడి వెంట, తనెక్కడికో వెళ్లిపోవడం -పాత అనుభవా లను జ్ఞాపకం చేసింది. ఒకసారి తను, ఓ ఆసామి వెంట చిన్న కార్లో కూచుని పత్తిపాడు దాకా వెళ్లింది....

మంజరి తిరిగొచ్చేసరికి పక్కా రెండు గంటలయింది. ముఖం నిండా, అక్కడక్కడా రంగుమరకలున్నాయి.

''ఇక వెడదాం!'' అన్నది మంజరి.

ఆవిడంత ఉత్సాహంగా లేదు.

''ఎందు''కని చలపతి అడగనూ లేదు, మంజరి చెప్పనూ లేదు. ఈసోదంతా ఎవరితో నన్నా చెప్పుకుందామని ఆవిడ హృదయం ఆరాటపడిపోయింది. ఆ క్షణాన ''తన మనిషి'' అని చెప్పుకోదగ్గ వారెవరూ మంజరికి కనిపించలేదు.

మూడోరోజుకు రిజల్టు తెలిశాయి. చావు కబురు చల్లగా అందించాడు అసిస్టెంట్. మంజరి కుప్పకూలిపోయింది.

''అప్పటికీ నేను ఒకటికి రెండుసార్లు చెప్పానండీ! ''సరే సరే''నంటూనే కెమెరామెన్ కొంపముంచేశాడు. సౌండ్ ఇంజనీర్ వాడికి వంతపాట పాడాడు. ఇహ నేను చెయ్యగలిగిందేమీ లేదు. మీరేమన్నా చూస్తే చూడండి!'' అన్నాడు అసిస్టెంట్.

టెస్టుకోసం తీసిన ఫొటోలను మంజరి కూడా చూసింది. అందులో ఉన్నది తనబొమ్మేగానీ తనకూ, ఆ బొమ్మకూ మధ్య ఎక్కడా పోలిక లేదు. అంత వికృతంగా తన ముఖం ఉండటమే నిజమయితే తను సినిమాకు కాదు గదా ఎందుకూ పనికిరాదు. ఉండవల సినంత అసహ్యంగానూ ఉన్నదా బొమ్మ.

''సరేలే బ్రదర్! వాళ్లను నేనోసారి చూస్తాను'' అన్నాడు చలపతి. అంటే అసిస్టెంట్‌ను ఇకపొమ్మని అర్థం.

అతను వెళ్లాక, చలపతి సన్నగా నవ్వాడు.

"నువ్వేమీ దిగులుపడకు మంజరీ! ఇలా జరుగుతోందని నాకు ముందుగానే తెలుసు. వాళ్లకేదో కావాలి. అందుకోసం ఇలా ఏడుస్తున్నారు. ఎంత అందమయిన వాళ్లనైనా అసహ్యంగా ఫోటోగ్రాఫ్‌చేసి, ఎందుకూ పనికిరారని రిపోర్టిస్తాడు కెమెరామెన్. ఎంత మంచి గొంతునైనా ఘోరంగా రికార్డు చేసి, కంఠం బాగులేదనిపిస్తాడు సౌండ్ ఇంజినీర్. వీళ్లిద్దరి దయా లేకపోతే, ప్రొడ్యూసర్ కాదు గదా, వాణ్ణి పుట్టించిన బ్రహ్మదేవుడు కూడా ఏమీ చెయ్యలేడు. అదీ అసలు కీలకం. నేనోసారి వాళ్లదగ్గర కెళ్లొస్తాను. మన దగ్గర డబ్బేమైనా ఉన్నదా?" అన్నాడు చలపతి.

"ఆఁ"

"రెండొందలివ్వు"

చలపతికున్న ఆత్మవిశ్వాసం మంజరిలేదు. ఈ ఘట్టంలో తనకు విజయం తప్పదని చలపతికి గట్టిగా తెలుసు. అతను చాలా ఉత్సాహంగా వారిని కలుసుకొని మాట్లాడాడు.

"అదృష్టవశాత్తూ మీరిద్దరూ ఒక్కచోటనే కనిపించారు" అంటూ ప్రారంభించాడు చలపతి. "ఈరోజుల్లో మనిషి మాటలకు బొత్తుగా విలువలేకుండా పోయింది బ్రదర్! ఎప్పుడో రావలసిన డబ్బు ఇవ్వాళే చేతికందింది. రేపు నాపిక్చర్‌కు మీరు పనిచేస్తే చేశారు, లేకపోతే లేదు. అందుకోసం నేనేమీ ఉచ్చు పన్నడం లేదు. మీకు అభ్యంతరం లేకపోతే, ఇవ్వాళ మీకో చిన్న పార్టీ యిద్దామని వుంది-మా మంజరి ఇస్తున్నదనుకోండి. పెద్ద అట్టహాసమేమీ లేదు. వెరీ సింపుల్! అందరం హెూటల్లో కలుసుకొందాం. ప్రోగ్రాంను ఛేంజ్ చెయ్యకండి!"

ఇంత గట్టిగానూ చెప్పిన చలపతి ఆ సమయానికి అయిపూ ఆనమాలూ లేకుండా పోయాడు. తను ఏమాత్రం వీలున్నా హెూటల్‌కొస్తాననీ, తను రాలేదన్న కారణంతో పార్టీని కాన్స్ చెయ్యవద్దనీ, బిల్లును నువ్వే చెల్లించమనీ మంజరికి పదేపదే చెప్పాడు.

"పోనీ మీరు కూడా ఉండరాదా?" అన్నది మంజరి.

చలపతి తారామండలానికి లేచాడు.

"నువ్వు దద్దమ్మవని పదేపదే రుజువు చేసుకోకు మంజరీ! నేను ఉండటానికేం ఉంటాను. కానీ అందువల్ల ఒరిగిందేమీ లేదు. నేను లేకపోవడమే మంచిది. ఆమాత్రం తెలీనవాణ్ణి కాదు గదా నేను...పిక్చరుకు వెంకటేశ్వర్లులాంటి ప్రొడ్యూసర్లతో చనువుగా ఉండటం ఎంత అవసరమో, వీళ్లతో ఉండటమూ అంతే అవసరం. నువ్వు మరీ అమాయికంగా కనిపించాలని చూడకు. మనుషుల్ని అంచనా వేయడంలో సాధారణంగా నేను పొరపడను. నా తృప్తికోసం నువ్వు పాకులాడకు. నీ అభివృద్ధికి చేయూతనిచ్చేవాళ్లున్నారు. ముందు వారితో మంచిగా వుండు...యిదంతా నీకోసమేగాని, నాకోసం గాదు".

అనుకొన్నవేళకు అందరూ హెూటల్లో కలుసుకొన్నారు.

మంజరి ఇంటికి తిరిగి వచ్చేసరికి, తెల్లవారుఝామున మూడుగంటలైంది. లోగడకన్నా ఈసారి ఆవిడ పుచ్చుకొన్న మోతాదు కొంచెం ఎక్కువే అయినా, యింటికొచ్చి వాంతి చేసు కోలేదు. చలపతి నిద్రకళ్లతో తలుపుతీసి, తిరిగి ముసుగుపెట్టుకు నిద్రపోయాడు. మంజరి కాలిజోళ్లన్నా తియ్యకుండా, మంచంమీద ముడుచుకుపడుకొని, పదినిమిషాల్లో నిద్రపోయింది.

- ఆ మొన్నాడు రాజమణికి ఉత్తరం రాసింది మంజరి. అప్పటికే చలపతి ఆ శుభవార్త కూడా తీసుకొచ్చాడు. తన ఫొటోలు చాలా అందంగా వున్నాయనీ, తన ముఖం స్క్రీన్స్‌కు బాగా నప్పుతుందనీ,

తన గొంతు మెలోడియస్‌గా వున్నదనీ, సమస్త రసాలను తన గొంతు నొప్పి వస్తుందనీ, వాళ్లిద్దరూ ప్రొడ్యూసర్‌కు రికమెండ్ చేశారట.

''ఇప్పుడే బండి కదిలింది. ఇకగాని స్పీడ్ అందుకోదు''అన్నాడు చలపతి. ''ప్రొడ్యూసర్‌తో మాట్లాడాను. ఆయన నీకో వేషం ఇవ్వడం ఖాయం. పనిలో పనిగా రావుగార్నీ, వారి పి.యస్.నూ చూసొచ్చాను. ఆయన మన పిక్చర్ కోసం ఎదురుచూస్తున్నాడు. పొరపాటునైనా నువ్వు మాట జారకు. వెంకటేశ్వర్లుగారు ఏనిమిషానైనా రావచ్చునని జెపుతూ వుండు. అంతకు మించి మాట్లాడకు...పోతే కవిగార్నీ దర్శించుకొచ్చాను. నీ కారెక్టరుకు రవ్వంతా ప్రామినెన్సు ఉండేలాగా చూడమన్నాను. ఇంపార్టెంట్ సీన్సులో నువ్వుండటమే కాదు, నీకు పది డైలాగ్సు ఉండాలి. పిక్చర్ మొత్తంమీద నాలుగైదు చోట్లన్నా నువ్వుక్లోజప్‌లో కనపడాలి. కెమెరామాన్‌తో నువ్వోసారి చెప్పిచూడు. నేనూ జ్ఞాపకం చేస్తాను. బహుశా ఎల్లుండి సెట్‌లో నువ్వుండాలనుకొంటాను. రావుగారూ ఉంటారు. ఆయన అసాధ్యుడు. చాలా పలుకుబడి గలిగినవాడు. అలాంటి వారి అండదండలు మనబోటి చిన్నవాళ్లకు అవసరం. ఆయన తలచుకొంటే, నిన్నేమైనా చేయగలడు. ఇహ-తలచుకొంటాడా, లేదా అనేది కేవలమూ నీమీదనే ఆధారపడి ఉంది''.

మంజరిలోని ప్రతీకణం, ఉద్వేగంతో నిండిపోయింది. తను చాలాకాలంనుండీ ఎదురుచూస్తున్న ఫలితం. ఈనాటికిగానీ చేతికందలేదు. దీనిక్కారణం ప్రధానంగా చలపతే! అనేక సందర్భాల్లో తను చలపతిని అసహ్యించుకొంది. మనిషిని తిట్టకూడని తిట్లు కూడా తిట్టింది. మానసికంగా చాలా వ్యధ చెందింది. ఒక దశలో చెప్పాచెయ్యకుండా రాజమణి దగ్గరకు వెళ్లిపోదామని కూడా అనుకొంది. కానీ అన్నింటినీ వోర్పుతో భరిస్తూ వచ్చింది. చలపతి తనకన్నా వోపిగ్గా కష్టపడ్డాడు. ఈ పరిశ్రమలో తనకో స్థానం సంపాదించి పెట్టాడు. తను ఏమిచ్చినా ఈ రుణం తీరదు. మంజరి హృదయం కృతజ్ఞతాభావంతో నిండిపోయింది.

''నాకోసం మీరుపడిన శ్రమకు విలువలేదు మేష్టారూ! రాతిని తెచ్చి రత్నాల సరసన వుంచారు. ఈ రుణం నేనెలా తీర్చుకోవాలో తెలీకుండా ఉంది'' అన్నది మంజరి.

''ఏమిస్తానంటావ్?'' అన్నాడు చలపతి.

మంజరి లేచి, అతని మెడచుట్టూ చేతులు పొదివి కావలించుకొన్నది.

''ఇవ్వడానికి నా దగ్గరేమీ లేదు. నేనే మీదాన్ని. ఇంతకన్నా గొప్పదేదయినా భగవంతుడు నాకిస్తే దాన్ని మనస్ఫూర్తిగా అర్పిస్తాను...'' అన్నది మంజరి ఆర్ద్రనయనాలతో.

ఆ క్షణాన మంజరిలో క్షుద్రమైన ఉద్రేకాలేవీ లేవు. అనేక సంవత్సరాల తరువాత, ఏ మాయపొరలూ కప్పని ఆంతర్యం నుండి ఆ మాటలు వెలువడ్డాయి. నిజంగా భగవంతుడే కనిపించి లోకోత్తరమైన వరమేదైనా మంజరికిచ్చి వుంటే, ఆవిడ హృదయపూర్వకంగా ఆ వరాన్ని చలపతి పాదాంకితం చేసి వుండేది. వివిధ ప్రభావాలకు అతీతంగా, నిజమైన మనిషిగా మంజరి కొన్ని క్షణాలపాటు జీవించింది.

## 11

డైరెక్టరు చెప్పవలసినన్నీ చెప్పాడు. అంతకుముందే అసిస్టెంట్ అనవలసిన రెండు డైలాగులూ పాతికసార్లన్నా ఆనిపించి ఉంటాడు. ఈలోగా చలపతి ఆవిడకు ధైర్యాన్ని సరఫరా చేస్తూనే ఉన్నాడు.

'రెడీ' అన్న కేకా, ఆ వెంటనే భూతనేత్రాల్లాంటి లైట్లు వెలగడమూ ఒక్కసారే జరిగాయి. 'సైలెన్స్' అన అసిస్టెంట్ నీరసంగా అరిచాడు. పాపం, అతనికి గత రెండు మాసాలనుండీ జీతం అందనేలేదట! అతని గొడవ అతనిదీ.

మంజరి కొద్దిగా వణికిపోయిన మాట నిజమే. ఆ క్షణాన ఆవిడకు ఎన్నో విషయాలు జ్ఞాపకమొచ్చాయి. అదీగాక, తన చుట్టూ చాలామంది హేమాహేమీలు నిలబడి వున్నారు. తను ఏంచెయ్యబోయి, ఏం చేస్తే ఎవరేమంటారో నన్న భయం. ఆవిణ్ణి కంపింపచేసింది. దీంతో ఆ షాట్ సరిగ్గా లేదు.

"రీటేక్" అన్నాడు దర్శకుడు.

మంజరి కథేమిటో బోధపళ్లేదు.

చలపతి దగ్గరికొచ్చి మెల్లగా "నువ్వు చాలా బాగా చేశావు మంజరీ! ఇంతకన్నా బాగా చేయడానికి అవకాశముందేమో డైరెక్టర్‌గారు చూడాలనుకొంటున్నారు. ఇప్పుడు చేసిన సీనే మళ్లీ తీస్తారు. ఈసారి నిర్భయంగా ఉండు. డైలాగ్ స్పష్టంగా అను. డైరెక్టర్‌గారు చూడాలను కొంటున్నారు. . డైలాగ్ స్పష్టంగా అను. డైరెక్టర్ ఎక్కడదాకా రమ్మంటే, అంతవరకే రావాలి. సరేనా!" అని దువ్వి వెళ్లిపోయాడు.

మళ్లీ లైట్లు వెలిగాయి. మళ్లీ రెడీ అన్న కేకా, సైలెన్స్ అన్న నీరసపు అరుపూ, కెమెరా కదలడమూ అంతా మామూలే! రెండు మూడు నిమిషాల తరువాత 'ఓకే' అని డైరెక్టరన్నాడు ఉత్సాహంగా. చలపతి మంజరిని పక్కకు తీసుకుపోయాడు. అతను ఎంతో ఉత్సాహంగా ఉన్నాడు.

"ఇహ మనం పోదామా?" అన్నది మంజరి.

"అప్పుడే! నువ్వింకా హీరోతో మాట్లాడనేలేదు. ఇంకాస్సేపు వుండాలి" అన్నాడు చలపతి.

ఇందాకణ్ణించీ తనను వేధిస్తున్న సందేహాన్ని కాస్తా బయటపెట్టింది మంజరి.

"ఒకేరకం డైలాగులు రెండుసార్లెందుకు తీశారండీ!" అన్నదావిడ.

"ఇంకా నువ్వు నయం. ఒక్కో ఆర్టిస్టు ఇరవై టేక్స్ దాకా తీసుకొంటారు. ఇవన్నీ ఉంచరు. ఇందులో ఏది బాగా వుంటే దాన్నే ఉంచుతారు. మిగతావన్నీ అవతల పారేస్తారు. పిక్చరంతా ఇలా ముక్కల కిందనే తయారవుతుంది".

డైరెక్టర్ కాలుగాలిన పిల్లిలాగా అటూఇటూ తిరుగుతున్నాడు. ప్రొడ్యూసరు నిప్పులు తొక్కిన కోతిలాగా చిందులు తొక్కుతున్నాడు. ఇవ్వక ఇవ్వక ఇచ్చిన ఒక్క కాల్‌షీటులోనూ మూడోవంతు ఇప్పటికే అయిపోయింది. ఇంతవరకూ హీరో రాలేదు. ఆయనగారి రాకకోసం, జగజ్జెట్టీలందరూ ఎదురుచూస్తున్నారు.

"ఏమిటి బ్రదర్ వ్యవహారం?" అన్నాడు చలపతి అసిస్టెంట్‌తో. ఇద్దరూ కలసి చాటుకు వచ్చారు.

"ఈ లైన్లో పని చెయ్యటం కన్నా అడుక్కు తినటం మంచిదయ్యా బాబూ! ఇంతవరకూ హీరో రాలేదు. ఎందుకని గట్టిగా అడిగే ధైర్యం మాకు లేదు. అడిగితే-అసలు కాల్‌షీట్సే ఇవ్వడేమోనని భయం! అదీగాక-మనం మాత్రం ఖచ్చితంగా ఆయనకు డబ్బిచ్చి చచ్చిందేముందీ? మా ప్రొడ్యూసర్ డబ్బుకోసం తిప్పుతాడు. వాళ్ళేమో ఇట్లా ఏడిపిస్తారు. ఏం చచ్చేట్లు?" అన్నాడు అసిస్టెంట్.

గంట తరువాతగాని హీరో రావుగారు రాలేదు. ఆయనగారు మేకప్ చేయించుకొనే వచ్చాడు. పెద్దపెద్ద ఆర్టిస్టులు స్టూడియోలో మేకప్ చేయించుకోరు. అలా చేయించుకోవడం చిన్నతనంగా కూడా వారు భావిస్తారు.

రావుగార్ని చూస్తూనే అందరి ముఖాలూ నవ్వులతో విప్పారాయి. డైరెక్టర్ ఎదురుగా వెళ్లి సాదరంగా ఆయన్ను కార్లోంచి దింపారు.

‘‘మన్నించాలి. కాస్త ఆలస్యమైంది’’ అన్నారు రావుగారు.

‘‘ఏమిటండీ మీదంతా చాదస్తం? ఏమిటిట ఆలస్యమైతే! మరేం ఫర్వాలేదు. మీకు కాస్త రెస్టు తీసుకోండి. నెమ్మదిగా చూదాం....ఈలోగా అసిస్టెంట్ మీకు...’’ అన్నాడు డైరెక్టరు.

‘‘నమస్కారం సార్! ఇంతకు ముందే మావాడు బాంకులో కాష్‌కట్టి వచ్చాడు. మీ చెక్‌ను సబ్‌మిట్ చేయండి సార్! అసలు నిన్ననే నాకు అందాలిసింది. కాస్త ఆలస్యమయింది’’ అన్నాడు ప్రొడ్యూసర్.

మంజరి ఇవన్నీ చూస్తూ విస్తుపోయింది. క్షణాలమీద, మనుషులెలా మారిపోతారో, ఎంత చిత్రంగా మాట్లాడుతారో ఆవిడకనుభవంలోకి వచ్చింది.

మరోసారి ఇంకో దృశ్యాన్ని కూడా మంజరి చూసింది. ఈ పిక్చర్‌లోనే భారతి అని ఆర్టిస్టు పనిచేస్తూ ఉంది. ఆవిడ సెకండ్ హీరోయిన్. ఆవిడకు ఇడ్డెన్లు తినడమంటే ఇష్టం. అవి పడితే గాని మూడ్స్ రావుట. రాత్రి ఒంటిగంట దాటింది. భారతి ఇడ్డెన్లు కావాలని అడిగింది. ‘‘ఇదిగో పంపిస్తున్నా’’నన్నాడు అసిస్టెంట్. ఆవిడ ఎదురుగానే ఒక మనిషిని కారిచ్చి పంపించాడు కూడా. ఈలోగా భారతితో రెండు మూడు షాట్స్ తీశాడు డైరెక్టరు. షాట్‌కూ షాట్‌కు మధ్య ఆవిడ ఇడ్డెన్లని గోలపెడుతూనే ఉన్నది. అసిస్టెంట్ ‘ఇదిగో అదిగో’ అంటూనే ఉన్నాడు. తెల్లవారుఝామునాలుగైంది. ఇడ్డెన్లు రాలేదు గాని, సీన్‌లో ఆవిడ పనంతా పూర్తయింది.

‘‘మొత్తానికి భలే అసాధ్యుడివయ్యా నువ్వు. నన్ను పస్తుంచి, పని చేయించుకొన్నావ్’’ అన్నది భారతి నవ్వుతూ.

ఇంకోసారి విమల ఒక గమ్మత్తు ఇన్సిడెంట్ చెప్పింది. ఆవిడకు అయిదొందలు రావాలిట. ఎన్నిసార్లడిగినా ఇవ్వాళ, రేపు అని తిప్పుతున్నారట. ఆఖరుకు విసుగెత్తి తిరగడం మానుకొందట. తనతో పనితీరిపోయింది గనుక, ఇక తనకా డబ్బు రాదని కూడా అనుకొన్నదిట. కానీ, చివరినిమిషంలో కథలో చేసిన మార్పుల ఫలితంగా, తనతో మళ్ళా అవసరం కలిగిందట. అప్పుడు డబ్బంతా ముందుగా ఇస్తేగానీ రంగు వేసుకోనన్నదిట విమల. అసిస్టెంట్ జేబులోంచి చెక్కుతీసి ఆవిడ ముందుపెట్టి, నిల్చున్న పళంగా కారుమీద ఆవిణ్ను స్టూడియోకు పట్టుకొచ్చా డట. ఆ పూట పనేదో అయిపోయింది. ఆ మొన్నాడు బాంకుకెళ్లి చెక్కు ప్రెజంట్ చేస్తే అందులో నూట పాతిక రూపాయలకన్నా ఎక్కువ లేవుట. తను ఏడుస్తూ ఇంటికొచ్చానన్నది విమల.

‘‘నువ్వెందుకూరుకున్నావమ్మా! నాలుగూ దులిపెయ్యక పొయ్యావా?’’ అన్నది మంజరి కోపంగా.

విమల నీరసంగా నవ్వింది.

‘‘ఇక్కడి గొడవలు నీకింకా పూర్తిగా తెలీవు అక్కయ్యా! ఫలానా కంపెనీ డబ్బివ్వలేదని మనం పైకి చెప్పుకోడానిక్కూడా లేదు. మనలాంటి చిన్న ఆర్టిస్టుల గోడు ఎవరికీ పట్టదు. గట్టిగా అడిగితే ట్రబుల్‌సమ్ ఆర్టిస్టంటారు. ఆపేరు పడ్డాక మనకసలు వేషమే దొరకదు. అడక్కపోతే, డబ్బివ్వరు’’అన్నది విమల.

‘‘దీనికేమిటి మందు?’’ అన్నది మంజరి.

‘‘ఏం లేదు. ఇదింతే!’’ అన్నది విమల.

సరోజ చాలాకాలం నుండీ, ఈ ఇండస్ట్రీలో ఉన్న మనిషి. ఒకసారి ఒక తమాషా కథ చెప్పింది.

"నాతో పని ఈ సీనుతో ఆఖరని నాకు తెలిసింది మంజరీ! పనయ్యాక చాలా కంపెనీలు డబ్బివ్వవు. అందుకని ఆ పూట షూటింగ్‌కు రానన్నాను. అసిస్టెంటు చెక్కు చేతికిచ్చాడు. అది నాకు రావలసిన మొత్తానికి సరిపడా ఉంది. ఇదిగో వస్తున్నాను పదమని ముందుగా బాంకు కెళ్లాను. చెక్కుఇచ్చాను. బాలెన్సు డెబ్బయ్ రూపాయలు తక్కువగా ఉంది. వెంటనే నేను కంపనీపేర డెబ్బయ్ రూపాయలు జమచేసి, వెయ్యిరూపాయలూ డ్రా చేశాను. ఆరోజు నేనాపని చెయ్యకపోతే, ఆ వెయ్యిరూపాయలూ నాకు దక్కేవిగావు, అన్నది సరోజ.

ఈ పిక్చర్ ధర్మమా అంటూ, మంజరికి ఇటువంటి లోగుట్టులన్నీ తెలిసి వచ్చాయి. రకరకాల మనుషులతో పరిచయమయింది. వారి అనుభవాలు వింటూంటే ఒక్కోసారి తల తిరిగిపోతూ ఉండేది. ఎక్స్ట్రాల గోడు మరీ అమానుషంగా కనిపించింది మంజరికి. వారికి సరిగ్గా డబ్బివ్వరనీ, గౌరవంగాచూడరనీ, వారిలో చాలామంది రోజుకొకపూటైనా సరిగా తినరనీ, ఎక్కువమంది శరీర్నామ్ముకొని బతుకుతుంటారనీ తెలిసి మంజరి ఖేదించింది. తన రంగంలో కాస్త కాలు నిలబడటమే జరిగితే ఈ పరిస్థితులన్నిటినీ మార్చాలనీ కూడా అనుకొన్నది.

మంజరి తొలిసారిగా నటించిన పిక్చర్ రిలీజయింది. బాగా డబ్బొచ్చింది. అనేకచోట్ల శతదినోత్సవాలు చేసుకొంది. డిస్ట్రిబ్యూటర్ల పెట్టుబడిపోను ప్రొడ్యూసర్ వాటా కింద ఎన్నో లక్షలొచ్చాయని కూడా చలపతి చెప్పాడు. కానీ ఇందువల్ల మంజరికి వొరిగిందేమీ లేదు.

తనను గురించి గాని, తన నటనను గురించి గారి పత్రికలు ఏమన్నాయోనని మంజరి చాలా ఆత్రంగా వెదికింది. చాలా పత్రికలు మంజరి పేరన్నా ఎత్తలేదు. ఒకటి రెండు పత్రికలు మాత్రం 'ఫలానా ఫలానా వారు ఇందులో నటించారు' అని మాత్రమే అన్నాయి. శతదినోత్సవాలకు మంజరిని కూడా పంపడానికి చలపతి విశ్వప్రయత్నాలు చేశాడు గాని, అవేవీ ఫలించలేదు.

"ఈ పిక్చర్‌తో నువ్వు తారాపథానికెక్కుతావని నేననుకోలేదు. నువ్వు నలుగురి దృష్టిలోకి వస్తే చాలనుకొన్నాను. ఆ పనేదో బాగానే అయింది. నీకు ఇంకో పిక్చర్‌లో ఇంతకన్నా మంచివేషం దొరకాలి. అవునుగాని మంజరీ నీకు డాన్సేమయినా వచ్చునా?ట' అన్నాడు చలపతి.

"రాదు" అన్నది మంజరి.

"ఫర్వాలేదు. ఇవ్వాళే పరబ్రహ్మశాస్త్రిగారి నడిగి మంచి ముహూర్తం పెట్టిస్తాను. నువ్వు డాన్సు నేర్చుకో. పనిలో పనిగా అరవం, హిందీ కూడా నేర్చుకో. నీకు బ్రహ్మాండమైన పాండిత్యం అవసరం లేదు. స్పష్టంగా మాట్లాడ్డమూ, ఎదటివారన్నది అర్థం కావడమూ ముఖ్యం. తెలుగు ఫీల్డుకన్నా టామిల్ ఫీల్డ్ ఎంతో నయం. వాళ్ల పేమెంట్స్ కూడా చాలా డీసెంటుగా ఉంటాయి. హిందీ సంగతి సరేననుకో, అదింకో అయిదారేళ్లకు గానీ మనం ఆలోచించలేం. కాని ఇప్పణ్ణించి మనం జాగ్రత్తపడాలి గదా?" అన్నాడు చలపతి.

మంజరికీ పిక్చర్ వల్ల చిల్లికానీ ముట్టలేదు. కాని టాలెంటున్న ఆర్టిస్టని పేరు మాత్రం పడింది. దీనికితోడు మంజరి అందం చాలామందిని ఆకర్షించింది. మంచి వేషమిస్తే బాగా రాణిస్తుందని ఒకరిద్దరు అనుకొన్నారు. రావుగారి వర్గంతోనూ, మూర్తిగారి వర్గంతోనూ కలుపుగోలుతనంగా ఉండి, మంజరికి మంచి ప్రచారం చేయించాడు చలపతి.

మూర్తిగారు కూడా ప్రీవ్యూ రోజున ఈ పిక్చర్ చూశాడు. అప్పుడతని పక్కనే కూచున్న చలపతి మంజరి రాగానే, ఓ ముక్క వదలి చూశారు.

"హీరోయిన్ కన్నా, మనకాండిడేటే బాగుందయ్యా చలపతీ! ఇదే ఫస్టు పిక్చరన్నావు గదూ! అయినా ఫర్వాలేదే! బాగానే చేసిందే! అన్నాడు మూర్తిగారు.

"మీ దయ గురువుగారూ!" అన్నాడు చలపతి.

మంజరిలో పైకొచ్చే లక్షణాలున్నాయని మూర్తిగారికి తెలుసు. ఇప్పటి ఆర్టిస్టులతో ప్రొడ్యూసర్లు యమయాతనలు పడుతున్నారనీ, వారు కొత్తముఖాల కోసం వెదుకుతున్నారనీ, అయినా ఎవరూ సాహసం చేయలేకపోతున్నారనీ ఆయనకు తెలుసు. తగిన అవకాశమిస్తే మంజరి తప్పకుండా రాణిస్తుందని కూడా మూర్తిగారు గ్రహించారు. ఇంతటి శక్తిసామర్థ్యాలున్న మనిషి ఏనాడూ మూలనపడి ఉండదు.

"అప్పుడప్పుడు కనిపించవయ్యా బాబూ! ఏదన్నా మంచి వేషం దొరికితే అమ్మాయికి చెబుతాను...అవును గానీ ఏమిటి రావుగారి కబుర్లు? ఆయనీ మధ్య నన్ను గురించి చాలా అసహ్యంగా మాట్లాడుతున్నాట్టగా, నిజమేనా?" అన్నాడు మూర్తి.

"మీకు తెలియందేముంది సార్! నాతోనైతే అనలేదు గాని, ఆయన స్వభావం మాత్రం అటువంటిదేనంటారండీ! మీకూ,రావుకూ పోలికేమిటండీ? అయినా మొన్న రిలీజయిన పిక్చర్లో, అసలు-రావుగార్నే ముందు హీరోగా బుక్‌చేశారండీ! మనవాడివల్ల కాలేదు. డిస్ట్రిబ్యూటర్ కూడా తోకముడిచేలాగా కనిపించాడు. అప్పుడు కాదుటండీ వాళ్లు మీదగ్గరకొచ్చిందీ!" అన్నాడు చలపతి.

"అవునవును. ఆ సంగతి నాకూ తెలుసు. అందుకే గదుటోయ్ దులిపిపారేశాం. ఆ పిక్చర్లో నేనో కొత్త మేనరిజం ఇంట్రొడ్యూస్ చేశాను. జనానికి అది బాగా పట్టింది. ఇప్పుడు ఎక్కడ చూసినా ఆ గొడవే!" అన్నారు మూర్తిగారు.

"చిత్తం, చిత్తం! ఆ ముక్క నాకెప్పుడో తెలుసునండీ!" అన్నాడు చలపతి.

నాలుగైదు రోజుల తరువాత, మూర్తిగారో పెద్ద సినిమా కంపెనీకి ఫోనుచేసి మంజరి విషయం చెప్పాడు.

"మీరు చూశారో లేదోగానీ, చాలా ఫ్యూచరున్న ఆర్టిస్టు. నేను నిన్ననే చూశాను. మంచి వేషమిస్తే బ్రహ్మాండంగా రాణిస్తుంది. ఏ ప్రొడ్యూసరో అమాంతం ఆవిడ రేటు పెంచేసిన తరువాత మిగతా వాళ్లంతా వెర్రిముఖాలు వేస్తారు. మీరో పనిచేయండి. ఏకంగా మూడు సంవత్సరాలకు ఆవిడతో ఓ ఎగ్రిమెంటు కుదుర్చుకోండి. మీరు చూస్తానంటే, ఆర్టిస్టును మీ ఆఫీసుకు పంపుతాను..."

వ్యాపార దక్షత కలిగిన ఆ కంపెనీ యజమానులు మంజరిని పిలిపించి చూశారు. ఆవిణ్ణి పంపివేశాక చలపతితో ఎగ్రిమెంటును గురించి ప్రస్తావించారు.

"మూడేళ్లపాటు మా కంపెనీలో ఉంటుంది. ఈ పీరేడ్‌లో మా పిక్చర్లన్నింటిలోనూ, మేమిచ్చిన వేషం వేయాలి. మా పర్మిషన్ లేనిదే ఇంకో పిక్చరులో పనిచెయ్యకూడదు. నెలకు పదొందలిస్తాం. అవసరమైనప్పుడు కంపెనీయే కారు పంపుతుంది. దీనికి నీకిష్టమేనా?" అన్నారు కంపెనీవారు.

చలపతి నీళ్లు నమిలాడు.

"మీరిచ్చిన వేషమంటున్నారు సార్!...మరీ చిన్న చిన్న వేషాలయితే ఆ అమ్మాయి పైకి రావడం కష్టం గదా సార్? అయినా నాదేముంది సార్? ఆమెను గూడా అడుగుతాను. ఈ సాయంత్రానికల్లా ఏ సంగతీ మీకు చెబుతాన్ సార్!" అన్నాడు చలపతి.

ఇంటికొచ్చాక మంజరితో సంప్రదించాడు చలపతి.

"నాదేముందండీ! మీకేది ఇష్టమైతే నాకూ అదే ఇష్టం!"

అసలే ఎటూ తేల్చుకోలేక మల్లగుల్లాలు పడుతున్నాడేమో-మంజరి సమాధానం మరింత చిర్రెత్తుకొచ్చింది.

"నా ఇష్టమే నీ ఇష్టంగానీ, నీకు స్వంత ఇష్టాలంటూ ఏమీ లేవన్నమాట!" అన్నాడు చలపతి చాలా సీదాగా.

మంజరి పలకలేదు. చలపతి కోపంగా ఉన్నాడని తెలుసుకొంది. ఏమంటే ఏం కొంప మునుగుతుందో తెలీనప్పుడు, అసలేమీ అనకపోవడమే మంచిదని మంజరి ఉద్దేశం.

"మాట్లాడవేమిటోయ్?" అన్నాడు చలపతి.

ఈసారి మంజరికి కొద్దిగా కోపమూ, రవ్వంత భయమూ కలిగాయి.

ఈ పూట మీ మనస్సేమీ బావున్నట్టు లేదు. సాయంత్రంలోగా మనమేదో వొకటి చేదాం. ముందు మీరు స్నానం చేయండి, ఈలోగా నేను ఇద్దరికీ అన్నం వడ్డించేస్తాను. మనం కలిసి భోంచేసి ఎన్నిరోజులయిందో? తాయారూ! అయ్య స్నానానికొస్తున్నాడు. గంగాళంలో నీళ్లు తొలిపి వుంచు" అంటూనే అక్కడి నుండి వెళ్లిపోయింది.

అసలు సమస్య తనను తప్పించడానికి మంజరి ప్రయత్నిస్తున్నదని చలపతికి తెలుసు. అతనా విషయాన్ని అప్పటికి ఎత్తకుండా భోజనానంతరం కదిపాడు.

"మీ ఉద్దేశం చెప్పండి, తరువాత నా విషయం చెబుతాను" అన్నది మంజరి. తమలపాకులకు సున్నం రాస్తూ.

చలపతి సిగరెట్ ముట్టించి గట్టిగా పొగపీల్చి మంజరి మీదికి వదిలాడు.

"అబ్బా! ఉండండి బాబూ! నాకీ పాడు సిగరెట్లంటే అసలే పడదు"అన్నది మంజరి.

చిటికవేసి, సిగరెట్ నుసి రాల్చుతూ చలపతి తన అభిప్రాయం చెప్పుకొచ్చాడు.

"జయా ఫిలింస్ వారు ఈ రంగంలో ఆరితేరిన ఘటికులు. మట్టి నుండి మాణిక్యాలను పుట్టించడం ఎలాగో వారికొక్కరికే తెలుసు. నీకు మూడేళ్ల ఎగ్రిమెంటు ఇస్తున్నారంటే, అందుకు మింజుమలే. వారు నీకు చెల్లించేది నెలకు వేయి చొప్పున ఏడాదికి పన్నెండు వేలున్నూ పన్నెండును మూడు పెట్టి హెచ్చిస్తే -పన్నెండు మూళ్లు ముప్పైయారు వేలూను. అంటే-మూడేళ్లకు కలిపి వాళు నీకిచ్చేది ముప్పయారు వేలు. వాళ్లకు బ్రహ్మాండమైన స్టూడియో ఉన్నది. ఒకేసారి అయిదు పిక్చర్లు షూట్ చేయొచ్చు. తలుచుకొంటే మూడు మాసాలతో పిక్చర్‌చొప్పున మూడేళ్లలోనూ పన్నెండు సినిమాలను లాగి అవతల పారేయగలరు. అందుగ్గాను నీకు గిట్టేది సినిమాకు మూడువేలు. ఇదేమీ మంచిరేటు కాదు. కాబట్టి, ఆ కంపెనీలో నువ్వు చేరడం భావ్యంగా నాకు తోచలేదు"అన్నాడు చలపతి.

ఈ ఆర్గ్యుమెంటు మంజరికి నచ్చలేదు.

"వాళ్లు ఏడాదికి నాలుగు పిక్చర్లూ తియ్యకపోవచ్చుగా!"

"నిజమే! అలాంటి ఉద్దేశమేదో వారికి లేకపోతే, నీమీద ఇంత డబ్బు ఖర్చు చెయ్యడానికి వాళ్లు దద్దమ్మలు కాదు. భగవంతుడి దయవల్ల నీకు మంచివేషం దొరకాలేగాని, రెండో పిక్చర్‌లోనే నువ్వు పాతికవేలు డిమాండ్ చెయ్యొచ్చు. నువ్వా సంగతి ఆలోచించవేం?" అన్నాడు చలపతి.

"అయితే వీలులేదని చెప్పండి!" అన్నది మంజరి.

"అలాక్కాదు. ఏదో నా సంతృప్తికోసం నువ్వామాట అన్నావు గానీ, నీ అసలు అభిప్రాయం అది కానేకాదు. నీకా కంపెనీలో చేరాలని లోలోపల ఉంది. అది బయటపెడితే, నేను

నొచ్చుకుంటానేమోనని నువ్వు దాస్తున్నావు. అవునా?'' అన్నాడు చలపతి.

మంజరి నవ్వి, అతని చెంపలు నిమిరి మెటికలు విరుచుకొంది. ఎనిమిదివేళ్లూ, కిటకిటమని విరిగాయి.

``మీరు దేవాంతకులండీ బాబూ! మనుషుల కడుపులో దూరి ఆలోచనలు తెలుసుకొంటారు. భగవంతుడి సాక్షిగా చెబుతున్నాను. నా ఉద్దేశం అదే!'' అన్నది మంజరి.

``అవునా! మరి -అందుకు నువ్వు చెప్పే కారణాలేమిటీ-అని?''

``మూడేళ్లపాటు, డబ్బుకు లోటుండదు. వేషాలకోసం వెదుక్కోనక్కరలేదు. నామీద అంత డబ్బుపెడుతున్నవాళ్లు, నాకో చిన్నదీ చితకదీ వేషమివ్వరు. నానుండి నాలుగు డబ్బులు పిండుకోవాలనే చూస్తారు గదా! జయా ఫిలింస్ పేరు పొందిన కన్సరన్ అని మీరే చెప్పారు.

``పోనీ కొంతకాలం పాటు పనిచేసి చూదాం. మనకిలాంటి అవకాశం రావడమే అదృష్టం. తరువాత మీ ఇష్టం!'' అన్నది మంజరి.

చలపతి ఓ పదినిమిషాల పాటు ఏమీ పలకలేదు. ఏదో ఆలోచిస్తూ ఉండిపోయాడు. తీరా అన్నాకగాని, తనలా అనకుండా ఉంటే బావుండేదన్న ఆలోచన మంజరికి రాలేదు.

- ``అందుకే మీ ఇష్టం వచ్చినట్లు చెయ్యమన్నాను. నా ఉద్దేశమేదో చెప్పిందాకా ప్రాణాలు తీశారు. తీరా చెప్పిం తరువాత మనస్సు కష్టపెట్టుకుంటారు. ముక్కు మొఖమూ ఎరగనిదాన్ని-నా అభిప్రాయంతో మీకేంపని చెప్పండి? మీకు ఏదితోస్తే అది చెయ్యండి'' అన్నది మంజరి.

``ఎగ్రిమెంటుకే ఒప్పుకుందాం మంజరీ! ప్రతిక్షణం రిస్కును ఫేస్ చెయ్యడం మాటలు కాదు. నువ్వన్నట్లు-మూడేళ్లపాటు మనకు దేనిగురించీ వెదుక్కోవలసిన బాధ ఉండదు. మనం చెయ్యదలుచుకున్నదేదో, ఆ దరిమిలానే చెయొచ్చు. ఈలోగా ఈ కంపెనీవారు, తమకోసమైనా నీకు పబ్లిసిటీ ఇవ్వక తప్పదు. ఇవన్నీ నీకు ఫ్యూచర్లో మాంఛి ఎస్సెట్స్! ఆల్రైట్, సాయంత్రం వెళ్లి చెప్పొస్తాను'' అన్నాడు చలపతి.

ఆ తరువాత అతను ఏదో గొణుక్కుంటూ వెళ్లిపోవడం తాయారు చూసింది.

``అయ్యగారు శానాకోపంమీదున్నారండీ!'' అన్నది తాయారు.

``వెళ్ళారా?'' అన్నది మంజరి.

``ఆఁ. పోయినారండీ అమ్మాయిగారూ! ఏటేటో గొనుక్కుంటూ ఉన్నారండీ!''

``ఆఁ. గొనుక్కోమనవే. ఇప్పుడు పోయిందేమిటి! బంగారం లాంటి ఆఫర్ చేతికొస్తే వొద్దనమంటాడు! ఇదేం గ్రహచారం తాయారూ! తెల్లవారేటప్పటికి లక్షలు సంపాదించాలంటే ఎలా?'' అన్నది మంజరి.

``మా పసందుగా అన్నారండీ అమ్మాయిగారూ! అయినా ఈ మధ్యన అయ్యగారికి కోపం జాస్తి అయిపోనాదండీ! చీటికీ మాటికీ అయిందానికీ, కాందానికీ ఇలా చిర్రెత్తిపోతావుంటే నెగ్గడం కష్టమండీ!'' అన్నది మంజరి.

మంజరి తనలోతనే నవ్వుకొంటూంటే ``ఏమిటే?'' అన్నది.

``అమ్మాయిగారూ, మీరు నిజమనుకోండి, అబద్ధమనుకోండి. మీపేరు పాండీ బజారంతా మోగిపోతాఉన్నాదమ్మాయిగారూ! ఈ ఫీల్డులో మీ అంత సక్కనోరు లేరనీ, మీరే కనక ఈరోయినైతే జనం ఇరగబడి చూస్తారనీ అనుకొంటావున్నారండీ! మొన్న తీసిన బొమ్మలో మీరు రెండుసార్లు నవ్వినారట గదండీ? ఒక్కో నవ్వు ఏస్తే ఎయ్యి రూపులుగా ఉన్నదటండీ! మిమ్మల్ని ఏ పెద్ద అయ్యగారో

ఎగరేసుకుపోతారని అనుకొంటున్నారండీ అమ్మాయిగారూ!'' అన్నది తాయారు.

''ఇవ్వన్నీ నీకెలా తెలుసే?'' అన్నది మంజరి

''నిన్న టూడియో కెళ్ళినానుగదుండీ! ఆడవిన్ననుండీ!''

మంజరికో అనుమానం వచ్చి ''స్టూడియోలో నీకేంపనే?'' అన్నది.

తాయారు కాస్సేపు తటపటాయించి, అసలు విషయం బయటపెట్టింది. సినిమాల మీద మోజు ఇంకా చావలేదనీ, ఏనాటికైనా పైకి రావచ్చుననే నమ్మకంతో, ఎక్స్ట్రా వేషాలు వేస్తూ ఉంటాననీ అన్నది. ఇలా నడవగా నడవగా ఎప్పటికైనా పైకి రాలేకపోతానా అని తాయారు నమ్మకం.

''ఈ సంగతి ఎనక మీకోపాలి చెప్పినట్టు గ్యాపకమండీ అమ్మాయిగారూ'' అన్నది తాయారు.

మంజరికాసంగతులేవీ జ్ఞాపకం రాలేదు.

''అమ్మాయిగారూ! అయ్యగారి మాటల్ని మీరు లెఖ్ఖచేయమాకండి. ఇంకో మడిసికి తెలియకుండా, నేరుగా మీరా కంపెనీలో చేరిపొండి. శానామంది ఆ కంపెనీ గేటుకాడ ఉద్దేగం దొరికినా స్నాలనుకొంటారు. నామాట యినండమ్మాయిగోరూ! ఇటువంటి ఛాఙుసు మళ్లా అందదండీ అమ్మాయిగోరూ!''

''అలాగేలేవే! నేనూ అంతేననుకొన్నాను. ఆ కంపెనీకే పోయాడనుకొంటాను. ఎగ్రిమెంటుకు వొప్పుకుంటే సరేసరి, లేదా రేప్పొద్దున నేనే వెళ్లి చెప్పొస్తాను. ఆ తరువాత ఎవరికి కోపం వచ్చినా సరే! ఎవరో ఏదో అనుకొంటారని చేతులారా సిద్ధాన్నాన్ని మట్టిలో కలుపుకోవడం నాకిష్టం లేదు'' అని తన నిశ్చయాన్ని బయటపెట్టింది మంజరి.

''ఎయ్యేళ్లు బతకండి తల్లీ! నా కడుపులో ఆలోచనే మీరు చెప్పారు'' అన్నది తాయారు. ''కాస్త మీరక్కడ నిలబడినంక, నాకేదన్నా ఏరుపాటు చేపించండమ్మాయిగారూ! మీరు తలుసుకొంటే కాదనేవారెవరూ ఉండరు. మీకాడ బతుకుతున్నదాన్ని, మీపేరు సెప్పుకొంటా''.

''అలాగేలేవే! నాకే ఇంకా దారుడ్డం లేదు. ముందు నన్ను కాస్త ఊపిరిపీల్చుకోనీ! నేను సుఖంగా ఉంటూ నిన్ను బాధపడనిస్తానని ఎప్పుడూ అనుకోకు, సరా!'' అన్నది మంజరి.

''మీరామాత్తరం ఆమీ ఇచ్చినారు నాకంతే సాల్నండీ!'' అన్నది తాయారు.

సాయంత్రానికల్లా చలపతి వచ్చి, ఇస్సురంటూ కుర్చీలో కూచున్నాడు. మంజరి మంచినీళ్లగ్లాసు అందించింది. రెండు గుటకలు తాగి, గ్లాసు మంజరి చేతికిచ్చి జేబులోంచి, ఆకుపచ్చ రంగు కాగితం తీసి మంజరికిచ్చాడు చలపతి.

''ఏమిటిది?'' అన్నది మంజరి.

''చెక్కు! జయాఫిలింస్ వాళ్లుమూడు మాసాల జీతం అడ్వాన్సుగా ఇచ్చారు. మంచిరోజు చూసుకొని అగ్రిమెంటు పంపుతామన్నారు''.

మంజరి శరీరం గాలిలో తేలిపోతున్నట్లుగా ఉంది.

''ఇంద, మీ దగ్గరే ఉంచండి!'' అన్నది మంజరి అతనికే యిస్తూ.

''అది నీ పేరుమీదుగా రాశారమ్మా, కనక నీదే! దాన్ని నువ్వేం చేసుకొంటావో చేసుకో''.

క్షణంలో మంజరి ముఖకవళికలు మారిపోయాయి. లోపల ఏమనుకొన్నా, పైకి మాత్రం ఎంతో నొచ్చుకున్నట్లుగా మాట్లాడింది.

''మీరింకా మన్దిరి మధ్యా ఎడం ఉంచుకొనే మాట్లాడుతున్నారని నేననుకోలేదు. నాపేర్న రాయడమేమిటి? నా ఇష్టం వచ్చినట్లు ఖర్చు చేసుకోవడమేమిటి? ఏమిటండీ ఇదంతాను? మిమ్మల్ని

కష్టపెట్టి ఏదో చావుకు తిందామని నాకేనాడూ లేదు. నా ఉద్దేశం చెప్పమంటే చెప్పాను గాని, దాని ప్రకారమే చేసి తీరాలని నేనేమీ అనలేదు. నేనేదన్నా తప్పు చేస్తే మీరు దండించవొచ్చు. అంతేగాని ఇలా సూటీపోటీలని నన్ను హింసపెట్టొద్దు. అంతగా ఇష్టం లేకపోతే ఈ చెక్కును మీరు తీసుకోకుండా ఉండలేకపోయారా? ఆ కంపెనీ వాళ్లకైనా అదేం రోగం? ఆడదాని పేరుమీదుగా చెక్కు రాయడమెందుకు? ఎదురుగా మీరున్నారుగా! ఇంద, మీరు పట్టుకొచ్చిన చెక్కు మీకే పారేస్తున్నాను. దాన్ని కంపెనీకే తిరిగిస్తారో, చించి ముక్కలే చేసుకొంటారో మీ ఇష్టం!''

ఈ మాటలని, మంజరి లోపలికెళ్లిపోయింది.

చలపతి వచ్చి చూసేసరికి, మంజరి మంచం మీద పక్కగా తిరిగి పడుకొని ఉన్నది. అతను తలుపులు వేసి, అదే మంచం మీద కూచుని, మంజరిని తనవేపు తిప్పుకొన్నాడు. ఆవిడ కళ్లు ఎర్రగా ఉన్నాయి. ముఖమంతా గండరించి ఉంది.

''నేనమన్నానని మంజరీ, అంతకోపం?'' అన్నాడు చలపతి ఆవిడ ముంగురులు సవరిస్తూ.

''ఆ బాధపడేవాళ్లకుగాని తెలీదు. ఇలా మాటలకు విషం పూసి నన్నెందుకు బాధపెడతారో తెలీకుండా ఉంది''.

''ఈ కాంట్రాక్టు నిజంగా నాకు ఇష్టంలేదు మంజరీ! నువ్వేదో అనుకొంటున్నావుగాని. దీన్ని గురించి నువ్వు పశ్చాత్తాపపడవలసిన టైం తప్పకుండా వస్తుంది. ఇప్పుడు కాలు జారకుండా ఉంటే మంచిదని నేననుకొన్నాను. కాని అదేమీ జరగలేదు'' అన్నాడు చలపతి.

''ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు. ఈ ఎగ్రిమెంటుకు నేను వొప్పుకోలేదని, ఉదయమే వెళ్లి చెప్పిరండి!''అన్నది మంజరి.

చలపతి ముక్కుమీద వేలు పెట్టుకొని, 'చ్‌చ్‌చ్' అన్నాడు.

''అంతకన్నా తెలివితక్కువ పని ఇంకోటి లేదు. జయాఫిలింస్ వారిని గురించి నీకేమీ తెలిసినట్టు లేదు. వారు తలుచుకొంటే నిన్ను ధ్వంసం చేసి పారేస్తారు. ఈ ఊళ్లో నీకు గిద్దెడు మంచినీళ్లు కూడా పుట్టకుండా చెయ్యగలరు. అదేం లాభం లేదు...సరే జరిగిందేదో జరిగింది. ఇదెందుకొచ్చిందో మనకు తెలీదు...అన్నట్లు చెప్పడం మరిచిపోయాను. పరబ్రహ్మశాస్త్రిగారు కనిపించారు. ఆవలెల్లుండి ఉదయం మాంచి లగ్నం ఉన్నదట. అరవం, హిందీ తెలిసిన ట్యూటర్ని తనే మనింటికి పంపుతామన్నారు. నటరాజన్‌గారి డాన్సులకు సినిమాల్లో మంచి గిరాకీ ఉంది. వార్నేమో డాన్సు మాష్టరుగా మాట్లాడాను. పాఠాలు ఆ లగ్నంతోనే ప్రారంభించుదాం!'' అన్నాడు చలపతి.

''నాకు తెలీదు, అదంతా మీ ఇష్టం'' అన్నది మంజరి.

''నిజంగా నువ్వీమాటమీద నిలబడతావా మంజరీ?'' అన్నాడు చలపతి.

''ఆఁ''

''తిరిగితే?''

''నా మాటమీద మీకామాత్రం నమ్మకం కూడా లేదన్నమాట?''

''ఉన్నది.... నా ఇష్టమేమిటంటే...''

''అమ్మదొంగా! ఇదా మీ ఎత్తు? ఈవిషయంలో మీ పప్పులేమీ పనికిరావండి బాబూ! అయ్యో రామ! నన్ను లేవనన్నా లేవనివ్వండి...''అన్నది మంజరి గారాలుపోతూ.

ఈ మాటలేమీ చలపతి వినిపించుకోలేదు; మంజరికి ఆ అవకాశం ఇవ్వనూ లేదు.

తన జీవితం యిప్పటికొక స్థాయికొచ్చిందనీ, ఈ వెసులుబాటులో తను భవిష్యత్తుకోసం రాచమార్గాలను ఏర్పాటు చేసుకోవచ్చుననీ మంజరి మనస్ఫూర్తిగా విశ్వసించింది. తనొక స్థితికి వచ్చాక అటు రాజమణికి, వసంతక్కూడా తగిన ఏర్పాట్లేమన్నా చేయాలనుకొన్నది. ముందుగా యిల్లు మారడం ముఖ్యమనీ, తను కొత్తగా చేరే ఇల్లు చాలా పెద్దదిగానూ, అందంగానూ ఉండాలనీ, ఇంటినిండా ఖరీదైన ఫర్నీచరూ, టెలిఫోనూ, ఇద్దరుముగ్గురు పనివాళ్లూ, ఫాన్లూ, తివాచీలూ-ఈ అట్టహాసమంతా ఏర్పాటు చేసుకోవాలని కూడా మంజరి అనుకొన్నది. ఏంచేయాలన్నా తను ముందుగా చలపతిని సంప్రదించాలి. అతని అనుమతి మీదనే చేయాలి. అతన్ని కాదని, అతని ఇష్టానికి వ్యతిరేకంగా చేయడం భావ్యం కాదు. మంజరి తన ఉద్దేశాలన్నీ చలపతికి చెప్పినప్పుడు, అతను ఆట్టే ఆశ్చర్యపడలేదు.

"నేనూ ఆ విషయాన్ని గురించే ఆలోచిస్తున్నాను. టీనగర్‌లో రెండుమూడు మేడలు చూశాను. అవేవీ నాకు నచ్చలేదు. అవి మనకు అచ్చి వచ్చే ఇళ్లు కావు. అందులో ఇదివరకు చేరినవారెవరూ పైకి రాలేదు. అద్దె కాస్త ఎక్కువైనా మనం మంచి ఇంట్లోకే మారాలి. ఇల్లు కుదిరాక గానీ, మనం ఫర్నీచర్ సంగతి ఆలోచించి లాభం లేదు" అన్నాడు చలపతి.

ఈ మాటలంటున్నప్పుడు చలపతిలో ఉత్సాహమేమీ లేదు. అతను చాలా పరధ్యానంగానూ, అంతో ఇంతో చిరాకుగానూ కనిపించాడు.

ఏమిటని మంజరి అడగనూ లేదు, చలపతి "ఫలానా" అని చెప్పనూలేదు.

రెండుమూడు రోజులదాకా, చిన్నచిన్న ఆర్టిస్టులు చాలామంది మంజరి ఇంటికి వచ్చిపోసాగారు. వారిలో చాలామంది తనకన్నా అందంగా ఉన్నారనీ, తనకన్నా తెలివైనవారనీ మంజరి హృదయపూర్వకంగా నమ్మింది. వారిని చూసి అసూయపడటానికి బదులుగా ఎంతో జాలిపడింది.

"వర్తున్న వారెందరో ఇలా బూజుపట్టిపోతున్నారు. సినిమా మనుషుల చూపులు పైకిపోతాయే గాని, కిందకు చూడవు. ఇది చాలా అన్యాయం" అన్నది మంజరి.

తన అదృష్టాన్ని గురించి, తన భవిష్యత్కార్యక్రమాన్ని గురించి రాజమణి కొక జాబు కూడా రాసింది;

"అక్కా! ఆనాడు నువ్వే ఉద్దేశంతో నన్ను చలపతివెంట పంపించావో గానీ, ఈ రోజున దాని ఫలితం నాకు కనిపించసాగింది. ఈ మధ్యలో నేను మానసికంగా చాలా వ్యధనను భవించాను. ఒక్కోసారి, పారిపోయి నీదగ్గరకు వచ్చేదామని కూడా గట్టిగా అనుకొన్నాను. కానీ నువ్వు వొప్పుకొన్నావుగాదు. నాకిక మూడేళ్లదాకా ఆర్థికంగా ఏ లోటూ లేదు. రెండుమూడు రోజులలో కాంట్రాక్టు మీద సంతకం చెయ్యబోతున్నాను. ఈలోగా ఆ కంపెనీ వారు నాకు మంచి పబ్లిసిటీ ఇస్తారట. ఇదంత లాభసాటి వ్యవహారం కాదని చలపతి సణుగుతున్నాడు. అయినా నేను ఒప్పుకున్నాను. నీ నుంచి జాబు వచ్చి చాలా రోజులయింది. నీ ఆరోగ్యం ఎలా వున్నది? వసంత ఏమంటోంది? మిగతావారు క్షేమమేనా? ఈమధ్య పోలీసులు నీవున్న ప్రాంతం మీద దాడిచేశారని పేపర్లో చదివాను. నీకేమీ ఇబ్బంది కలగలేదు గదా! నాకు అడ్వాన్సు కూడా ఇచ్చారు. ఆ చెక్కు మార్పించగానే నీకు కొంత పంపుతాను. దాదాపుగా నేనిక్కడ స్థిరపడినట్లే లెక్క. త్వరలోనే నువ్వూ, వసంత ఇక్కడికి రావలసి ఉంటుంది. నేనికక్క సుఖంగా ఉంటున్నప్పుడు మీరింకా ఆపాడుపనితో ఉండటం నాకిష్టం లేదు. తొరగా జవాబు రాయి. ఇల్లు మారాలనుకొంటున్నాను. ఉంటాను-

నీ చెల్లెలు

-మంజరి"

ఉత్తరం తాయారు చేతికిచ్చి పోస్టు చేయించింది. ఈ జాబు చూసి రాజమణి ఏమనుకొనేది ఊహించి మంజరి మురుసుకొన్నది. వసంత మద్రాసు ప్రయాణం కోసం పరవళ్లు తొక్కుతూ ఉంటుందనీ, ఈ సందడిలో పడి అది ఖాతాదారుల్ని కూడా సరిగ్గా చూడకపోవచ్చు ననీ మంజరి ఊహించింది. తనకు జయాఫిలింస్‌లో కాస్త స్థాయి చిక్కాక, వసంతను కూడా చేర్పించాలనుకొన్నది. పెద్ద పెద్ద స్టార్సు చాలా మంది చిన్నవారిని చిన్నచూపు చూస్తు ఉంటారని, వారిని పైకి రాకుండా అణగదొక్కుతుంటారనీ, కాస్త కనుముక్కుతీరు సజావుగా ఉన్నవారు తమ పక్కన యాక్టు చేయడానికి వొప్పుకోరనీ సరోజ చెప్పింది. అందం, తెలివితేటలు ఉన్నవారిని మరీ మూలలకు నెట్టిపారేస్తూ ఉంటారని కూడా సరోజ చెప్పింది. వారి ముందు తాము వెలావెలా పోవలసివస్తుందేమోనన్న భయమే దీనికి కారణమని కూడా సరోజ అన్నది. తనీ సంప్రదాయాన్ని తప్పించాలనుకొన్నది మంజరి. తనను అభినందించడానికొచ్చిన భారతితోనూ, సరోజతోనూ ఈవిషయం స్పష్టంగా అననుగూడా అన్నది.

"ఈ పెద్దవాళ్లందరూ ఒకప్పుడు చిన్నవాళ్లేనన్న సంగతి మరచిపోకూడదు. తాముపడిన కష్టాలు యింకోరు పడకూడదనీ, వాౖరెనా సుఖంగా ఉండాలనీ అనుకోవాలి గాని-యిలా మాచకమ్మ కోరికలు కోరకూడదు. నాకేమన్నా అవకాశమంటూ ఉంటే మీకు తప్పకుండా సాయం చేస్తాను. నిజంగా నాకన్నా సరోజ చాలా అందంగా ఉంటుంది..."

"ఆఁ నా ముఖం" అని చప్పరించేసింది సరోజ మధ్యలోనే.

"అదికాదమ్మా! నిన్ను స్తుతిచేయడం కాదు. నేను నిజమే చెబుతున్నాను అవునా? నాకన్నా ముందు నుండి ఈ రంగంలో ఉన్నది. అయినా పట్టుమని పదిసినిమాలైనా వచ్చాయి కాదు. వచ్చిన వాటిల్లోనూ ఒక్క మంచి వేషమన్నా దొరకలేదు. నన్నడిగితే ఇది చాలా అన్యాయమంటాను. దీన్ని కనీసం నానుండైనా మార్చుకొంటూ రావాలి" అన్నది మంజరి

"మీ మనస్సు చాలా గొప్పది అక్కా! భగవంతుడు నీకు సర్వసహాయాలు చేయాలని కోరుకుంటున్నాను" అని వంగి నమస్కారం చేసింది సరోజ.

భారతి కళ్లు కూడా మిలమిలలాడాయి. వారు వెళ్లిపోయాక చలపతి నిప్పులు తొక్కిన కోతిలాగ చిందులు వేశాడు.

"నువ్వసలు రాజకీయవాదివి కావలసింది. నా ఖర్మకాలి ఆర్టిస్టువు కాబోతున్నావ్! నీ సంగతేదో నువ్వు చూసుకోమని లక్షసార్లు చెప్పాను. లోకం మరమత్తు పనులు వదిలేయమన్నాను. నా మాటల మీద నీకు గురి కుదిరినట్లు లేదు. ఈ తుక్కు సజ్జునంతా ఉద్ధరిస్తానంటావు. ఆ పనినీవల్ల నవుతుందో కాదో నీకు తెలుసా? పిచ్చి మొహందానా! నువ్వనవసరమైన విషయాల్లో జోక్యం చేసుకోకు. ఎవరి జాతకానికి ఎవరు కర్తలోయ్? నీకు మూడేళ్లు ఎగ్రిమెంటు రాకముందు వీళ్లల్లో ఎవరన్నా నీముఖం చూశారా? ఆ భారతి నువ్వేసిన వేషంకోసం డైరెక్టర్ చుట్టూ ఎన్నిసార్లు తిరిగిందో నీకు తెలుసా? రావుగారు చెప్పకపోయినట్ల యితే, ఆ వేషం డెఫినెట్‌గా భారతికి దక్కేది. అదొచ్చి నాలుగు బులిబుచ్చికం మాటలు చెప్పగానే నువ్వు నీ స్థాయికి మించి వాగేశావు. వాళ్లు నిన్ను గురించి ఏమనుకొంటారో తెలుసా?" అన్నాడు చలపతి.

మంజరిక్కూడా కోపం వచ్చింది. గట్టిగా సమాధానం చెప్పాలనుకొన్నది.

"ఆఁ తెలుసు!" అన్నది.

ఆ సమాధానం వస్తుందని చలపతి అనుకొని ఉండడు. మొదట దిమ్మెరపోయాడు. తరువాత తేరుకొని సన్నగా నవ్వాడు.

''అయితే చెప్పు!'' అన్నాడు సీదాగా దిగిపోయి.

''నేను చాలా మంచిదాన్ననుకొంటారు. గర్వంలేనిదాన్ననీ, సహాయం చేసే గుణమున్నదాన్ననీ అనుకొంటారు!''

ఈసారి విరగబడి నవ్వాడు చలపతి.

''పిచ్చిదానా! అలా చస్తే అనుకోరే. నువ్వెంత ఫూల్‌వా అనుకొంటారు. ఇప్పట్లో నీ మాటకేమీ విలువ వుండదని వారికి తెలుసు. కానీ ఇక ముందెన్నడన్నా నువ్వు గొప్పదానివయితే గియితే అప్పటికీ పరిచయం పనికొస్తుందని వారి ఉద్దేశం! నిన్ను చూసినవారు రెండుమూడు రోజులు నవ్వుకొన్నా నాకాశ్చర్యం లేదు...ఈ కాస్త ''కా కా''కే నువ్వు ఉబ్బిపోతే, రేపు నీ చుట్టూ ఈ బాపతు జనం మంద కడతారు. అప్పుడు నీవు ఉబ్బడానికే ఉండదు. అయినా ఈ చిన్న ఎగ్రిమెంటుకే నువ్వు తన్మయం చెంది, నన్ను మరిచిపోతే ఎలా? నువ్వేదో గడిచి గట్టెక్కావనుకోవడం భ్రమ! నిజంగా నీ కెరీర్ ప్రారంభమయిందే ఇప్పుడు కాబట్టి అమ్మాయిగారూ...''

మంజరి ముఖం గోటి నాటుకు నెత్తురు బొట్టు లేకుండా ఎండిపోయింది. కనీసం కళ్లల్లో నీరు కూడా తిరగలేదు. పెదవులు ఆర్చుకుపోయాయి.

''అదీ సంగతి. నువ్వేమీ అనకు. అనవసరంగా ఏదీ కమిట్ కాకు. నేనున్నాను గదా! ఆ విషయాలన్నీ నాకొదిలేయ్'' అన్నాడు చలపతి.

మంజరి ఏదో చెప్పబోయింది. చలపతి వినిపించుకోకుండానే వెళ్లిపోయాడు.

అరగంట కిందట ఎంత ఉత్సాహంగా ఉన్నదో, ఇప్పుడంతకు పదిరెట్లు కుంగిపోయింది మంజరి. మనస్సు నిండా చీకటి పొగలు కమ్ముకొని, ఆవిణ్ణి ఉక్కిరి బిక్కిరి చేశాయి. శరీరమంతా దిగచెమటలు పోశాయి. మాడులో గునపంతో పొడిచినట్లు సన్నని పోటు ప్రారంభమైంది. హాయిగా నిద్రపోతే బాగుండుననిపించింది. కాని నిద్రరాదని తెలుసు. మేలుకొని ఉండి ఇంత సంక్షోభానికి తట్టుకోలేననిపించింది. తాయారును పిలిచి, వందరూపాయల కాగితమిచ్చి, హెూటల్ గుర్తులన్నీ చెప్పింది.

''ఓ మీరు ఈడనే కూసోండి అమ్మాయిగారూ, ఛనంలో తెచ్చిస్తాను''అన్నది తాయారు. ''ఇంతొసిదానికి అల్లాడదాకా ఎందుకండీ అమ్మాయిగారూ! మా పక్కింట్లో డాక్టరుగారున్నారండీ! ఆయనగారు ఇసుమంటి సీసాలు శానా అమ్ముతారుండీ! ఆరికాడ తెస్తానుండండి అమ్మాయిగారూ!''

పదినిమిషాల కల్లా పమిటలో రంగుసీసా, చేతిలో సోడాలతో సహా తాయారు వచ్చింది. ఎంతో అనుభవమున్నదానిలాగా, ''మందు''గ్లాసులో పోసి, సోడా కలిపి మంజరికిచ్చింది. ఆ వాసన చూస్తూనే ఆవిడ తల తిరిగిపోయింది. కానీ అది పుచ్చుకోకపోతే తను నిద్రపోలేదు. కనుక ముక్కు మూసుకొనైనా ఆ కాస్త నోట వేసుకోవలసిందే! మంజరి ఆ పనే చేసింది. తీరా చేశాక మోతాదు చాలదేమోననిపించింది. మరో గ్లాసు పుచ్చుకొన్నది. పుల్లని తేపులొచ్చాయి. శరీరమంతా రోమాంచమయింది. గాలిలోకి తేలిపోతున్నట్లుగా ఉన్నదేగాని నిద్రమాత్రం రావడం లేదు. నిద్ర రానిదే లాభం లేదు. గనక నిద్ర వచ్చేదాకా ''మందు''పుచ్చుకోక తప్పదు గదా! ఈ పంపిణీ మీద మరో రెండు గ్లాసులు ఖాళీ చేసింది. మూడు నాలుగు ఖాళీ చేసిన సంగతి మంజరికి బొత్తిగా తెలియదు. అప్పటికే ఆవిడ స్వాధీనం తప్పిపోయింది. ఎటువంటి ప్రయత్నమూ లేకుండానే కళ్లు మూసుకుపోయాయి. అంతదాకా గ్లాసులందిస్తున్న తాయారు, ఆఖర్న మిగిలిన కాస్తమందునూ నీళ్లన్నా కలపకుండా పుచ్చుకొని, కటిక నేలమీద పడుకొని నిద్రపోయింది...

చలపతి ఆ రాత్రి రానేలేదు. ఉదయం జోగులాడుతూ వచ్చి, పిడుగులాంటి వార్తను మంజరి ముందు పడేశాడు.

మంజరి కొయ్యబారిపోయింది. "ఇప్పుడేమిటి చెయ్యడం?" అన్నది.

"ఏం చేస్తావో చెయ్యి. జయా ఫిలింస్ వారికి రావుగారు మరో కాండిడేట్‌ను రికమెండ్ చేశారు. వచ్చే పిక్చర్‌లో, రావును బుక్ చేదామని జయావారు, చాలా రోజుల్నుంచి అనుకొంటు న్నారు గాని, అతను వొప్పుకోడేమోననీ, అడిగి లేదనిపించుకోవాలిసొస్తుందేమోననీ వెనకా ముందాడుతున్నారు. ఇప్పుడు వారికో అవకాశం చిక్కింది. నీకు బదులుగా, రావుగారు చెప్పినావిణ్ణి తీసుకొని ఆయన్ను శాటిస్‌ఫై చేస్తారు. అందుకు బదులుగా తమ పిక్చర్లో పనిచేయమంటారు. బహుశా రావుగారు దీనికి ఒప్పుకోవచ్చు కూడాను" అన్నాడు చలపతి.

"మనకు ఎడ్వాన్సు కూడా ఇచ్చారు గదండీ!" అన్నది మంజరి

"ముష్టి మూడువేల రూపాయలకోసం జయా ఫిలింస్ వారు చూడరు. మూడువేల రూపాయల కన్నా, నీకన్నా వారికి రావుగారు ముఖ్యం".

మంజరి కళ్లు పూర్తిగా పొడారిపోయాయి.

"అబ్బా! తలపగిలిపోతున్నదండీ!" అన్నది మంజరి. "నాకేమీతోచడం లేదు. మీరేమన్నా చెయ్యగలిగితే చేయండి. లేదా భగవంతునికో దణ్ణం పెట్టి మానుకోండి. ఇంతకుమించి నేను చెప్పగలిగిందేమీ లేదు".

చలపతి కింది పెదవి కొరుక్కుంటూ సన్నగా నవ్వాడు.

"కేవలం మనమీద కోపంతోనే రావుగారీ పనిచేశాడు మంజరీ! మనం మూర్తిగారిని కలుసుకొన్నామనీ, ఆయన నిన్న జయాఫిలింస్ వారికి రికమెండ్ చేశారనీ రావుగారికి తెలిసింది. వెంటనే తను "జ్యోత్స్న" అనే అమ్మాయికి కబురుపెట్టి జయాఫిలింస్‌కు ఫోను చేశాడు. ఇదంతానాకు రావుగారి ప్రైవేట్ సెక్రటరీ చెప్పాడు" అన్నాడు చలపతి.

"అయితే మనం ఈ ఎగ్రిమెంటుకు నీళ్లొదులుకోవలసిందేగా?" అన్నది మంజరి.

"లేదు, దానికో పథకం ఆలోచించాను. పాపం రావుగారి పి.ఎస్సే. అదీ చెప్పాడు. వాడికేమన్నా మనం ఉపకారం చేయాలి".

"అలాగే చేదాం " అన్నది మంజరి.

"జయాఫిలింస్ వారికి ఫైనాన్స్ చేసేది మెహతాగారు. ఆయన గనక నిన్ను గురించి ఓ ముక్కచెబితే చాలు. రావుగారినన్నా వొదులుకుంటారు గాని, మెహతాను జయవారు వదులుకోలేరు".

"అయితే మీరు మెహతాతో చెప్పి చూడకపోయారా?" అన్నది మంజరి.

"నీ పర్మిషన్ కోసం చూడకుండానే ఆ పనీ చేసుకొచ్చాను. రాత్రల్లా ఇందుకోసమే తిరిగాను మంజరీ! మెహతాతో ఇంటర్వ్యూ దొరకడమే బ్రహ్మప్రళయం, ఆయనతో నేనీ గొడవలన్నీ చెప్పలేదు. మంజరి అనే అమ్మాయి ఓ చిన్న పార్టీ ఇవ్వదలుస్తున్నదని, దానికి మీరు చీఫ్ గెస్ట్‌గా ఉండాలని అన్నాను. మెహతా ఎంత వ్యాపారదక్షుడో, అంత శృంగార పురుషుడు. దేవుణ్ణి కాదని బతకచ్చు గాని ఆయన్ను కాదని ఒక్క కంపెనీకి కూడా సినిమా తీయలేదు. దాదాపు అన్ని కంపెనీలకూ ఆయనగారు ఫైనాన్స్ చేస్తుంటారు. మరి ఆయన మాటకు కాకపోతే ఇంకెవరి మాటకు విలువ ఉంటుందమ్మా?" అన్నాడు చలపతి.

మంజరి పలకలేదు.

"సిద్ధాన్నం చేతులారా పాడుచేసుకోవడం దేనికని నేనీపార్టీని ఎరేంజ్ చేశాను. జయా ఫిలింస్‌తో యెగ్రిమెంట్ పోయినందుకు నాకు బాధలేదు. కానీ, మనం తలపెట్టిన పనిలో అపజయం ఎదురుకాకూడదు. అదీ నాపట్టుదల. వజ్రాయుధంలాంటి వాణ్ణి నీకు పరిచయం చేస్తున్నాను. అతనిచేత నువ్వేమయినా చేయించవచ్చు. ఐతే నువ్వనుకొంటున్నంత తేలికగా మెహతా లొంగదు. అతన్ని లొంగదీసి జయవారికి చెప్పించుకోవడమన్నది-కేవలం నీమీదనే ఆధారపడి ఉన్నది. నువ్వీపనిలో సక్సెస్ అయ్యావో- నీ రథానికీ రంగంలో ఇహ అడ్డే లేదు" అన్నాడు చలపతి.

చలపతి ఉద్దేశాన్ని ఎప్పుడో పసిగట్టింది మంజరి. ఇలా ఎంతమందితో తను "చనువు"గా ఉండాలో బోధపడదు. వీరందరి అవసరమూ తనకు ఉంటుందనీ, వీరి దయాధర్మాల మీదనే తన భవిష్యత్తు ఆధారపడి ఉంటుందనీ ముందుగా తెలిస్తే, అసలు తనీ రంగంలోకి రాకనేపోవునేమో! తీరా వచ్చాక-మొలబంటిదాకా దిగబడిపోయాక-వెనక్కు రావడం కన్నా పూర్తిగా మునగడమే ఉత్తమం.

చాలా నిరాడంబరంగా పార్టీ జరిగింది. మెహతాను మంజరికి లాంఛనప్రాయంగా పరిచయం చేశాడు చలపతి.

"ఇదో బ్రహ్మాండమైన పార్టీ అని మీకు భ్రమ కలిగిస్తే నన్ను మన్నించాలి. కేవలం కుటుంబంలో జరిగినట్లు జరుపుకొంటున్నాం. మంజరి కొత్తగా ఈ ఇండస్ట్రీలో కొచ్చిన ఆర్టిస్టు. మీవంటివారి ఆశీర్వచనం ఆవిడకు కావాలి. మీ పేరు చెప్పుకొని పైకొచ్చినవాళ్లు చాలామంది ఉన్నారు. మిమ్మల్ని నమ్ముకొన్నవాళ్లంతా ఈనాడు టాప్‌రాంకులో ఉన్నారు. నెలరోజుల్నుంచీ నా ప్రాణాలు తీస్తోంది మిమ్మల్ని చూపించమని. ఈరోజుగ్గానీ ఆ అవకాశం చిక్కలేదు. నాపనేదో ఇక అయిపోయింది. మీరిద్దరూ పెర్మిట్ చేస్తే, నేనలా వెళ్లి ఓ సిగరెట్ కాల్చుకొస్తాను..."

మెహతా "నో నో" అంటూండగానే చలపతి వెళ్లిపోయాడు. గదిలో ఇద్దరే మిగిలి పోయారు. మెహతాకు ఇటువంటి సంఘటనలు చాలా మామూలు. మంజరి కూడా ఈ విషయంలో బాగా ఆరితేరిన ఘటం. తన భవిష్యత్తు, ఈ బొజ్జగాడిచేతుల్లో ఉన్నదనుకొన్నప్పు డల్లా మెహతా మీద ఆవిడకు అసహ్యం వేయసాగింది. కంచి మేకలాగా యెప్పుడూ ఏదో నవుల్తూ, తలనుండి కాళ్లదాకా, ఎత్తుపల్లాలు లేకుండా కుదించిన బస్తాలా పిటపిటలాడుతున్న ఈ మనిషి, తన భవిష్యత్తు నిర్ణయించడం కన్నా దౌర్భాగ్యం లేదనుకొన్నది మంజరి. తను లోగడమాదిరిగా "వ్యాపారం"లో ఉన్నప్పుడు ఈ మెహతా రావడమే జరిగితే, తను నిర్మొహ మాటంగా తిరస్కరించి ఉండేది. కానీ ఇప్పుడల్లాకాదు. తను వీడికోసం పరవశిల్లిపోతున్నట్లు నటించాలి. వీడి దాహాన్ని తీర్చాలి. అందుకు బదులుగా వీడు తన ఎగ్రిమెంటును ఖాయపరుస్తాడు. అందువల్ల తనకు సినిమాలో వేషాలు దొరుకుతాయి. ఆ వేషాల వల్ల కీర్తి దక్కుతుంది. డబ్బు దక్కుతుంది. అందుకోసం తనీ ఛండాలమంతా నోరుమూసుకుని భరించాలి.

మెహతా హిందీలో ఏదో అన్నాడు. మంజరికి హిందీ రాదని తెలిసి ఇంగ్లీషులో మాట్లాడాడు. అదీ మంజరికి తెలియలేదు.

"టామిల్ తెరిమా?" అన్నాడు మెహతా. మంజరి మౌనండా ఉండటం చూసి "మైగాడ్!" అన్నాడు.

ఆ సోఫాలో రెండో మనిషికి చోటు లేదు. మెహతా ఎంత జరిగినా మంజరి సుఖంగా కూచోలేదు. ఉక్కిరిబిక్కిరవుతూనే అతని భుజం మీద చేయివేసింది. వీపు మీది కండలు బొదబొదలాడుతూ

కదిలాయి. పెద్ద బొజ్జ మంజరిని తాకింది. నవ్వినప్పుడు గారపళ్ల మధ్య మిలమిలమంటున్న బంగారు పన్నును చూస్తూ మంజరి కళ్లు మూసుకొన్నది.

# 12

ఈ సంఘటన జరిగిన మూడోరోజున జయాఫిలింస్ జనరల్ మేనేజర్ నాగరాజు పనిమాలా మంజరి ఇంటికొచ్చి, ఎగ్రిమెంట్ మీద సంతకం చేయించుకొని మరీ వెళ్లాడు. అతనున్న కాస్సేపూ చలపతిపోయిన పోకిళ్లు ఇన్నీ అన్నీ కావు. మంజరి కూడా ఆ సమయంలో ద్విపాత్రాభినయం చేసింది. వినయానికి లోటు కలగనివ్వలేదు గానీ ఏమాత్రమో అతిశయాన్ని కూడా ప్రదర్శించింది.

''మరో వారం రోజుల్లో స్క్రిప్టు ఫైనలైజ్ అవుతుందమ్మా! మీ కారెక్టర్ కూడా నిర్ణయమయిపోతుంది. కాగానే మీకు కబురు పెడతాను. మరి నాకు సెలవిప్పిస్తారా?'' అన్నాడు నాగరాజు లేచి నమస్కరిస్తూ.

మంజరి కూడా నమస్కరించింది.

తీరా ఆ పాత్ర విషయం తెలిసే నాటికి, సినిమా మొత్తం మీద దానికి అట్టే ప్రాముఖ్యం లేదనీ తెలిసింది. పిక్చరంతటా ఆ పాత్ర వస్తున్న మాట నిజమే! కాని దానికున్న ప్రాముఖ్య మేమిటిట? అది హీరోయిన్ కారెక్టర్ కాదు. కనీసం సెకండ్ హీరోయినన్నా కాదు. పోనీ హీరోకో, హీరోయిన్‌కో, విలన్‌కో, వాంప్‌కో, కామెడియన్‌కో దగ్గర సంబంధాలున్నదీ కాదు. కథలో ఓ బలమైన మార్పుకు -అది మంచికైనా, చెడ్డకైనా సరే-కారణభూతం కానిపక్షంలో, ఆ పాత్రను ప్రేక్షకులు చస్తే జ్ఞాపకం ఉంచుకోరు.

''అమ్మాయీ! ఇదీ సంగతి, ఈ కారెక్టర్ నీకు పేరుప్రతిష్టలు తెచ్చిపెట్టేది కాదు. ఇందులో నిన్ను చూసినవారెవ్వరూ పదివారాల పాటన్నా జ్ఞాపకం ఉంచుకోరు'' అని తన అభిప్రాయాన్ని ప్రకటించాడు చలపతి.

మంజరి అంతదూరం ఆలోచించకపోయినా, ఆ పాత్ర మంచిది కాదని మాత్రం నమ్మింది గనక, చలపతి అభిప్రాయంతో ఏకీభవించింది.

''అయితే ఇది నావల్ల కాదని చెప్పేయనా?'' అన్నది మంజరి.

''అందువల్ల లాభం ఉంటుందనుకోను. నువ్వు వాళ్ల స్టాఫ్ ఆర్టిస్టువు. వాళ్లే వేషమిస్తే దాన్ని వేయవలసిందే! కాదనడానికి వీల్లేదు. ఎగ్రిమెంట్‌ను బ్రేక్ చేస్తే అందుకయిన ఖర్చులన్నీ నీనుండి వడేసి పిండుకొంటారు'' అన్నాడు చలపతి.

''మరి నన్నే గంగలో దూకమంటారండీ? ఈ కారెక్టరేమో మంచిది కాదాయె. ఇంకోటి మనకివ్వరాయె. వేషం వేయననడానికి వీలుపడదాయె. ఇహ ముక్కు మూసుకొని విషం పుచ్చుకోడం కన్నా గత్యంతరం కనబడ్డం లేదు'' అన్నది మంజరి, నుదుటిమీద చెమటను పమిటతో తుడుచుకొంటూ.

చలపతి తక్షణమే ఏమీ చెప్పలేదు. గట్టిగా నిట్టూర్చి ఓ సిగరెట్ వెలిగించాడు. పదినిమిషాల పాటు వరండాలో అటూఇటూ పచార్లు చేశాడు. కళ్లు రెండూ నములుకొంటూ, వొళ్లు విరుచుకొన్నాడు.

''మనం మధ్యాహ్నం ఓసారి డైరెక్టర్‌గార్ని కలుసుకొందాం. వారు నాకు తెలుసుననుకో. ఇలాంటి సందర్భాల్లో మగవారి మాటలకన్నా లేడీ ఆర్టిస్టుల మాటకు ఎక్కువ విలువ ఉంటుంది. అయితే ఆ

విజయం నువ్వు అప్రోచ్ కావడంలో, ఎదటివారిని కన్విన్స్ చేయడంలో ఉంది. డైరెక్టర్ ఫైనల్ అథారిటి కాదు...ఈరోజుల్లో ప్రొడ్యూసరే అన్నీ చూసుకొంటున్నాడు.. అయినా ఓసారి ప్రయత్నిద్దాం. ఒక్కమాట మాత్రం నిజం మంజరీ! మనమేదో విధంగా ఈ కారెక్టర్‌ను మార్చుకోకపోతే, నీ ఫ్యూచరంతా పాడయిపోవడం ఖాయం. దాన్ని దృష్టిలో ఉంచుకొని మనం వ్యవహారం నడపాలె" అన్నాడు చలపతి.

అదృష్టవశాత్తూ డైరెక్టర్ శంకరంగారు ఇంట్లోనే ఉన్నాడు. మంజరినీ, చలపతినీ చూసి ఆయన చాలా ఆనందించాడు.

"ఇప్పుడో ముఖ్యమైన పనిమీద మీ దగ్గరకొచ్చాం. మీరు కాస్త మార్జిన్ మాకు చూపెడ్తే, మీరూ, మేము కూడా బాగుపడచ్చు" అన్నాడు చలపతి.

శంకరం అదేమిటో చెప్పమన్నాడు.

"ఆమధ్య వెంకటేశ్వర్లుగారనే ప్రొడ్యూసర్ గారు నవకళాచిత్రాలయ సంస్థను స్థాపించిన సంగతి మీకు తెలిసిందే! భాగస్తుల పేచీవల్ల ఆ కన్సర్న్ మూసివేశారు. మళ్లా కొత్త బ్యానర్‌తో -శ్రీరామా పిక్చర్స్ అనుకోండి-సోషల్ తీద్దామనుకొంటున్నారు. ఆయన మాకు తెలుసు. మరో వారంలో వచ్చేస్తున్నాడు. నిన్ననే యాభైవేలు బాంక్ చేశాం. వచ్చేప్పుడు ఇంకో లకారం పట్టుకొస్తున్నాడు. ఈలోగా నన్ను అన్ని ఏర్పాట్లూ చేయించమన్నాడు. సరే, చాతనైందేదో చేస్తున్నాననుకోండి...మీరు బిజీ డైరెక్టరని నాకు తెలిసినా ఈ పిక్చర్ బరువు కూడా మీమీద ఉంచుదామనుకొంటున్నాను. మీ అభిప్రాయం చెప్పండి?" అన్నాడు చలపతి.

ఈ గొడవలన్నీ శంకరం గారికి ఇదివరకే తెలుసు గనక, ఆయన అన్నింటికీ ఊఁ కొట్టేశాడు. చివరి వాక్యానికి మాత్రం అభ్యంతరం చెప్పాడు.

"నాకిప్పటికే నాలుగైదు పిక్చర్లున్నాయి. అదీగాక మంచికథ లేందే నేను టేకప్ చేయను. మీరిచ్చే డబ్బు ముఖ్యం కాదు. మీ పిక్చర్ ముఖ్యంనాకు. ఓ అణాకానీ సినిమాకు నేను డైరెక్టర్నిని చెప్పుకొని యాభైవేలు సంపాదించడం కాన్న, ఓ సక్సెస్‌ఫుల్ పిక్చర్లలో పనిచేసి పాతిక పుచ్చుకోవడం మంచిదనుకొనే బాపతు మనిషిని"అన్నాడు శంకరం.

"అవునాండీ! అంచాతే నేను మీదాకా వచ్చాను. మీదగ్గరేమన్నా కథుంటే సరేననుకోండి. లేదా, ఓ నెలరోజులు మనమలా కలకటా వెళ్లొద్దాం. ఓ బాక్సాఫీస్ హిట్ అయిన బెంగాల్‌పిక్చర్ స్టోరీని కొనేద్దాం. ఓ మరాఠీ పిక్చర్ స్టోరీని పుచ్చుకోవచ్చు. ఏంచేస్తే బావుంటుందో కూడా మీరే ఆలోచించాలి. ఆ భారమంతా మీదేననుకోండి. అయితే మీకేం కావాలో చెబుతే ఈరోజునే వారికి ఫోను చేస్తాను" అన్నాడు చలపతి.

"తొందరేముంది లెండి. వార్ని రానివ్వండి" అన్నాడు శంకరం.

"అలా అనకండి బాబూ! నేనిక్కడ గోళ్లు గిల్లుకుంటూ కూచున్నాని మావాడనుకో కూడదుగదా! మీ టెరమ్స్ అండ్ కండిషన్స్ నాకు చెప్పకండి. ఒక్క ఫిగర్ చెవి వేయండి చాలు".

శంకరం చాలాసేపు గునిశాడుగానీ చలపతి వదల్లేదు.

"అందరి దగ్గరా నలభై తీసుకొంటున్న సంగతి మీకు తెలుసు గదా!" అన్నాడు శంకరం.

"అన్ని కంపెనీల సంగతి వేరు, నా సంగతి వేరూనండి! నేనంత ఇచ్చుకోలేను. పాతిక్కు సెటిల్ చేయించండి. పిక్చర్ సక్సెస్ కావడమే జరిగితే-అందులో ఢోకా లేదనుకోండి. మీరన్నంత మొత్తమూ నేనిస్తాను. మీరిందుకొప్పుకున్నట్లు ఫోను చేస్తున్నాను" అన్నాడు చలపతి.

శంకరం అది కాదనీ, ఇది కాదనీ, నే చెప్పేది వినమనీ, అబ్బే మరి తక్కువనీ, అంటున్నా చలపతి విననంటే వినని చెవులు మూసుకొన్నాడు.

"నువ్విలా మొహమాట పెట్టడం భావ్యంకాదు బ్రదర్!" అన్నాడు శంకరం.

"ఇహ మీరేమన్నా నాకు వినిపించదని ముందే చెప్పాను. మీరిందుకు వొప్పేసుకున్నారు. బస్, అంతే! ఏం మంజరీ! మరి వెడదాంలే" అన్నాడు చలపతి లేచి నిలబడి.

మంజరి లేవలేదు. సన్నగా నవ్వింది.

"ఏమ్మా! ఏమిటిసంగతి?" అన్నాడు శంకరం.

చలపతి కూడా కూచుండిపోయాడు.

మంజరి ఇంకోసారి నవ్వి, చలపతికేసి తిరిగి తలదించుకున్నది.

"అసలు సంగతేమిటో చెప్పాలమ్మాయీ! ఇలా నీలో నువ్వు...ఓహో! ఆ విషయమేనా?" అన్నాడు చలపతి.

"ఊఁ" అన్నది మంజరి, మరీ సిగ్గుపడుతూ, నేలచూపులు చూస్తూ.

"ఏమిటీ?" అన్నాడు డైరెక్టర్.

"ఆఁ నా తలకాయ! అదేనండీ!! జయాఫిలింస్ వారి పిక్చర్‌లో ఈవిడ కిచ్చిన కారెక్టర్ నచ్చలేదుట. దీన్ని మార్చి ఇంకేమన్నా ఇవ్వమని అడుగుతానన్నది. ఆ ముక్క నేనే చెబుతానంటే విన్నది కాదు. తను స్వయంగా బయలుదేరి వచ్చింది"అన్నాడు చలపతి, మంజరి వేపు చూసి నవ్వుతూ. "సరే, ఇహపద. బాబయ్యగారితో చెప్పావు గదా! ఆ గొడవేదో ఆయనగారే చూసుకొంటారు, లే మరి!"

శంకరం ఇరుకులో పడిపోయినట్లు కనిపించాడు.

"కారెక్టర్లన్నీ పంచడం అయిపోయిందమ్మా! ప్రయత్నించినా ఏమాత్రం ఉపయోగపడు తుందో చెప్పలేను. అయినా ఆ కారెక్టర్ మరీ అంత తీసికట్టు కాదేమోననిపిస్తుంది. ఏదైనా జయవారికి అట్టే సెన్స్ ఉన్నట్టు లేదు బ్రదర్! వజ్రం ముక్కలాంటి ఆర్టిస్టు చేతుల్లో ఉంటే బ్రహ్మాండంగా ఎక్స్‌ప్లాయిట్ చేయవచ్చు గదా-అలాంటి కారెక్టరివ్వటమేమిటండీ నా బొంద" అని విసుక్కొన్నాడు శంకరం కూడా.

డైరెక్టర్‌గారు చూడకుండా మంజరికి కన్ను మలిపాడు చలపతి.

"అదే బాబయ్యా నాబాధ. ముందుగా ఈ అనింపార్టెంట్ రోల్‌లో కనిపిస్తే నాకు ఫ్యూచరేముంటుంది చెప్పండి?మీరు కలగచేసుకొంటే తప్పకుండా లాభిస్తుందని నాకు నమ్మకం. దయచేసి మీరెలాగైనా నాకీ ఉపకారం చేయాలి" అని కళ్లనీళ్లపర్యంతమయింది మంజరి.

చలపతి ముగ్ధుడైపోయాడు. మంజరి ఇంత అద్భుతంగా నటిస్తుందని అతనూ అనుకోలేదు.

"ఓసీ పిచ్చిదానా! నువ్విన్నిసార్లు చెప్పకు. శంకరం గారు మాటంటే తిరిగిపోయే మనిషి కారు. ఆయన చూస్తానంటే, చేస్తాననే అర్థం. ఇహ పోదాం పద".

శంకరం గారు ఏం చెప్పడానికీ అవకాశమివ్వకుండానే మంజరి, చలపతి సెలవు పుచ్చుకొని బయటికొచ్చేశారు.

"థాంక్స్ మంజరీ! అదీ పద్ధతి" అని అభినందించాడు చలపతి.

"పనవుతుందంటారా?" అన్నది మంజరి.

"కాదు. కాదని నాకు ముందే తెలుసు, ఈరోజుల్లో డైరెక్టర్ల మాట వినే ప్రొడ్యూసరెవరమ్మా నీ పిచ్చిగానీ!".

"అయితే ఈ గొడవంతా దేనికండీ?" అన్నది మంజరి.

"కనీసం మనవాడు అడ్డుపుల్ల వేయకుండా ఉంటే చాలు. ఒక మనిషి మరో మనిషికి ఉపకారం చేయలేకపోవచ్చుగానీ, అపకారం చేయగలడు. కనీసం దాన్నుండి మనం తప్పుకొన్నా తప్పుకొన్నట్లే" అన్నాడు చలపతి.

పోతున్న టాక్సీని పిలచి, ఇద్దరూ ఎక్కారు.

"మనమొకసారి రావుగార్ని కలుసుకొందామంటారా?" అన్నది మంజరి.

"ఎందుకట? ఈపనిమీదనేనా?"

"ఊఁ"

"లాభం లేదు. ఆయన చెయ్యగలడు గానీ, చెయ్యడు. నా అనుమానం మూర్తిగారి మీది కోపమంతా నీమీద తీర్చుకుంటున్నాడేమోనని. బహుశా ఈ కారెక్టర్ నీకివ్వమని ఆయనే చెప్పి ఉంటాడని కూడా నేననుమానిస్తున్నాను".

మంజరి నిట్టూర్చింది.

"నువ్వలా బెంబేలు పడకు మంజరీ! ఇంతలో కొంపమునిగిందేమీ లేదు. మనమోసారి మెహతాను కలుసుకొంటే బావుంటుందనుకొంటాను. ఇప్పుడు నువ్వు శంకరంతో చెప్పినదాంట్లో పదోవంతు మెహతా చెవిన వేసినా చాలు. ఆయన మనకు తెలిసినవాడే గదా!"అన్నాడు చలపతి.

మిగతా విషయమంతా మంజరికి గ్రాహ్యమయిపోయింది.

ముందుగా ఫోన్‌చేసి, ఆ తరువాత మెహతా రమ్మన్న వేళకు, ఆయన ఆఫీసుకు వెళ్లింది మంజరి. రాత్రి తొమ్మిదిగంటలు దాటిందేమో, ఆఫీసంతా నిర్జీవంగా ఉన్నది; ఒకరిద్దరు పనివారు తప్ప ఎవ్వరూ లేరు.

"వణక్కం అమ్మా!" అన్నాడు కుర్రాడు.

"వణక్కం వణక్కం" అన్నది మంజరి.

"ఆయన మీదదా వున్నాడు. ఇంకో అమ్మతో రగస్యం మాట్లాడుతూ ఉండరు. మీ రీడనే కూసోండిమీ! నానుదా సొల్లుదును" అన్నాడు వాడు.

పదినిమిషాకల్లా వాడు నవ్వుకొంటూ వచ్చి, మంజరిని మేడమీదికి చేర్చాడు. మెహతా వరండాలో పెద్ద సోఫాలో కూచుని ఉన్నాడు. ఎదురుగా బల్లమీద సీసాలూ, గ్లాసులూ ఉన్నాయి.

"రా"అన్నట్టు తలతోనే సైగచేశాడు మెహతా.

మంజరి కళ్లు "ఇంకో అమ్మ"కోసం వెదుకుతున్నాయి.

"నీ ఎగ్రిమెంట్ గొడవలన్నీ తీరిపోయాయా?" అన్నాడు మెహతా.

"ఆఁ" అన్నది మంజరి

మెహతా ఓ గ్లాసును నింపి సగం తాను తాగి బల్లమీద పెట్టాడు. మిగతా సగాన్ని మంజరి పుచ్చుకొన్నది.

"మీ దయవల్ల అన్నీ సక్రమంగా అయినాయండీ! ఇప్పుడింకో పనిమీద వచ్చాను. మీరు దాచకుండా చెబుతానంటే అడుగుతాను" అన్నది మంజరి.

మెహతా ఏదో అనబోయాడు. లోపలి నుండి గాజుల చప్పుడయింది. మంజరి గుండెలు ఝల్లుమన్నాయి.

"ఇలారా పర్వాలేదు"అన్నాడు మెహతా, లోపలికి వినపడేలాగా.

ఓ నిమిషంపాటు నిశ్శబ్దం. ఆ తరువాత మెత్తని అడుగుల చప్పుడు...తలుపు వెనక నుండి ఓ అందమైన ఆకారం వరండాలోకొచ్చింది.

మంజరి శరీరమంతటా రక్తం ఎగసన చిమ్మింది! సోఫాలో స్థిమితంగా కూచోలేకపోయింది.

తనీ స్థితిలో కళ్యాణిని చూడగలనని మంజరి ఏమాత్రం ఊహించినా ఇంత దిమ్మరపాటు ఆవిడకు కలగకపోను.

కళ్యాణి కూడా మంజరి కేసి వోరగా చూసి నవ్వీ నవ్వనట్లుగా నవ్వింది. మంజరి అక్కడున్నందుకు కళ్యాణి కూడా కొంత ఇబ్బంది పడినట్లు కనిపించింది. కళ్యాణి నిలబడే ఉంది. తను పక్కకు జరుగుతూ చేత్తో సైగ చేశాడు మెహతా. కాస్సేపు తటపటాయించి సన్నగా నిట్టూర్చి అతని పక్కనే కూచుంది మంజరి. ఇంకోపక్కగా మరో కుర్చీని లాక్కొన్నది కళ్యాణి. వారిద్దర్నీ పరిచయం చేశాడు మెహతా.

కళ్యాణి బల్లమీద సీసాను మూడు గ్లాసుల్లోకి వొంపి, మంజరికీ, మెహతాకు అందించాక తనుకూడా వొకటి తీసుకుంది. కళ్యాణి కీ గొడవ మామూలేనేమో! ఆవిడ చాలా సాదాగా మాట్లాడుతోంటే మంజరి ముడుచుకుపోసాగింది. గ్లాసు బల్లమీద పెట్టి, కళ్యాణి బుగ్గలు పుణికాడు మెహతా. ఆవిడ 'అబ్బా' అని చిన్న కేకవేసి, వల్లమాలిన బాధను అభినయించింది. కోపమూ, నవ్వూ కలగలిపి చూసి, మూతిని సున్నాలాగా ముడివేసింది.

"మీరిలా చేస్తుంటే నేనిక్కడ ఉండను బాబూ! బుద్ధిమంతుడైన పిల్లకాయలా వుండాలి" అన్నది కళ్యాణి.

"ఉండను"

"అయితే-"

కళ్యాణి లేచి మెహతా రెండు చెంపలూ సున్నితంగా వాయించింది. ఆ మహాకాయుడు బ్రహ్మానందపడిపోయి మంజరి మీదికి ఒరిగిపోయాడు.

"ఇక్కడ మరీచలిగా ఉంది" అన్నాడు మెహతా.

"వెళ్లి దుప్పటి కప్పుకొని నిద్రపోండి. నేనే మంజరీ వెడతాం" అన్నది కళ్యాణి.

"దట్సాల్" అన్నాడు మెహతా. ఓ మూలుగు మూలిగి సోఫాలోంచి లేస్తూ మంజరి చెయ్యి పట్టుకొన్నాడు. కళ్యాణి వెనకనిలబడి నవ్వుతూ ఉంటే 'ప్లీజ్' అన్నాడు మెహతా.

"ఊఁహ నేను రాను" అన్నదే గానీ, వారి వెనక తనూ గదిలో ప్రవేశించింది కళ్యాణి...

తెల్లవారుఝామున మూడుగంటలకు గానీ, మంజరి తను వచ్చిన విషయం చెప్పలేకపోయింది. అదీ-కళ్యాణి తన గొడవ చెప్పుకొన్నాకనే ఆ ధైర్యమైనా ఆవిడకు కలిగింది.

కళ్యాణి ధోరణి చూస్తుంటే, తనీ రంగంలో ఎంత వెనకబడి ఉన్నదో మంజరికి తెలిసి వచ్చింది. తను నిజంగా కళ్యాణికి కొత్త అయినా మెహతా మైకంలో పడున్నప్పుడు ఎన్నో సంగతులు మాట్లాడింది. ఆవిడతో మాట్లాడుతుంటే కత్తిమీద నడిచినట్లుగా ఉంటుంది. ఏమాత్రం ఎక్కడ పొరపాటుపడినా పాదాలు చీల్చుకుపోతాయి. అంత జాగ్రత్తగా అడుగులు వేయాలి.

మెహతా పొట్టమీద ఓ చిన్న పోటు పొడిచి పకపకా నవ్వింది కళ్యాణి.

"అవునుగానీ, రేపోసారి జయావారికి ఫోన్ చెయ్యకూడదూ! నేనిక్కడున్నాను గదా, హీరోయిన్‌గా చంద్రావతిని బుక్‌చేస్తున్నారట-ఎందుకు? నేను చచ్చాననే అనుకొన్నారా?" అన్నది కళ్యాణి.

మెహతా నవ్వి ఊరుకొన్నాడు.

“రేపు సాయంత్రానికి నాకా కంపెనీ నుండి ఏ వర్తమానమూ రాకపోతే రాత్రికి మళ్లా వస్తాను. ఈసారి ఈ పొట్టను కాస్తా చీల్చేసి మరీ వెడతాను” అన్నది కళ్యాణి.

మెహతా వోసారి బొజ్జ నిమురుకున్నాడు.

“నేను కింద ఉంటాను. మంజరిని తొరగా పంపు...ఏమోయ్, వేగిరం వచ్చేస్తావు గదూ! నువ్వు “మే మే” అంటూ కూచుంటే, ఇలా రాత్రల్లా నిన్ను తినేస్తూనే ఉంటాడు. ఏం మందు మప్పుతాడోగానీ మహానుభావుడు, మనల్ని కుక్కల్ని చేసి వదిలిపెట్టాడు మంజూ! ఇతనితో విరోధం పెట్టుకొని తెగతెంపులు చేసుకొందామన్నా చేసుకోలేకుండా ఉన్నాం. మనల్ని కట్టేసుకొన్నాడు”అన్నది కళ్యాణి.

ఈ మాట ఫలితం అద్భుతంగా కనిపించింది మంజరికి. కళ్యాణి వెళ్లాక మెహతా చెక్కిళ్లనోసారి చూసి, “మీరొప్పుకోరుగానీ, ఆ రెండు బుగ్గలనూ చిదిమెయ్యాలనిపిస్తోంది సుమా!” అన్నది మంజరి.

మెహతా నవ్వాడు.

“మీరిలా-నాలాంటి దానిమీద మీ బ్రహ్మాస్త్రం ప్రయోగించకండి బాబూ! వారం రోజుల నుండీ మీరు కళ్లల్లో మెదులుతున్నారు. పదే పదే వస్తే, మీకు చులకనయిపోతానేమోనని భయం. ఏమయితే అదే అవుతుందని ఈరోజున తెగించి వచ్చేశాను...అన్నట్టు అసలు సంగతి చెప్పటమే మరచిపోయాను. జయాఫిలింస్ వారితో రేపు కళ్యాణిని గురించి మాట్లాడేటప్పుడు నావిషయం కూడా చెబుదురూ!వాళ్లు నాకో దిక్కుమాలిన కారెక్టరిస్తున్నారు. మీదాన్ని గదా-నన్నిలా అవమానపరచడానికి వాళ్లకెన్ని గుండెలుండాలండీ?”

కింది నుండి హారన్ వినిపించింది.

“అబ్బబ్బా! ఈ కళ్యాణిది అన్నింటికి ఒకటే తొందర” అన్నది మంజరి విసుగ్గా. తరువాత మెహతా కేసి తిరిగి “మాట”అన్నది. అతను దగ్గరకొచ్చాక ఒక్కసారి డీ ఢిక్కి కొట్టి “ప్రాణాలన్నీ ఇక్కడే వొదిలిపోతున్నాను. పోనీ ఓ పని చెయ్యగూడదాండీ! నన్ను మీ పర్సనల్ సెక్రటరీగా వేసుకొంటే తీరిపోతుంది గదా, ఆపని...”

మరోసారి హారన్ వినిపించి.

“వస్తాను” అంటూ మంజరి ఆఖరుసారిగా, మెహతాను ఆలింగనం చేసుకుని గబగబా మెట్లు దిగి వచ్చేసింది. పోర్టికోలో తనకోసం ఎదురుచూస్తూ ఉంది కళ్యాణి. ఆవిడ కారు ఆ మసగ వెలుతురులో కూడా నీడలీనుతూ ఉంది. కళ్యాణి స్టీరింగ్ ముందు కూచున్నది. మంజరి ఆఖరు మెట్టుమీద నిలబడి వున్నది.

“కమాన్, రావేం?” అన్నది కళ్యాణి.

మంజరి నిశ్శబ్దంగా వచ్చి కళ్యాణి సరసనే కూచున్నది.

గేటుదాటి రోడ్డుమీది కొచ్చాక “తలుపు సరిగ్గా పడలేదు మంజూ! ఓసారి లాగివెయ్యి”అన్నది కళ్యాణి.

నిర్మానుష్యమైన తారురోడ్లమీద, లైట్లకాంతి కురిసి ఇంకిపోతోంది. చల్లగాలి రఁయ్‌మని కారులోకి దూసుకుపడుతోంది.

“ఏమంటున్నాడు?” అన్నది కళ్యాణి ఏక్సిలేటర్ మీది కాలును మరింత నొక్కుతూ.

మంజరి ఏమీ అనలేదు..

కళ్యాణి ఫక్కున నవ్వింది.

“అలా బెరుకుపడతావేం మంజూ! ఇలాంటిచోట్ల అరమరికలు పనికిరావు. ఇదంతా నిజమని

వాడూ అనుకోడు; మనకు అంతకన్నా లేదు, మొత్తానికి అదేమిటి? అలా ఉన్నావేం?''

మంజరి ప్రాణాలన్నీ ఉగ్గబట్టుకొని తేపింది.

''మరేం లేదు, మోతాదు మించిందనుకుంటాను. నన్ను మా ఇంటి దగ్గరి దింపేయండి. వెళ్లి హాయిగా నిద్రపోతే తప్ప లాభం లేదు'' అన్నది మంజరి.

''ఇప్పుడేం నిద్రోయ్?'' అన్నది కళ్యాణి నవ్వుతూ. ''నువ్వింకా కొత్తదానివి గనక నీకు తెలీదుగానీ, ఈ ఫీల్డులో నిద్రసంగతి సరేసరి...ఒక్కోసారి తిండి తినడానిక్కూడా టైందొరకదు. అలా నేను షూటింగుల కెళ్లిన సందర్భాలు చాలా వున్నాయి. కంటినిండా నిద్రపోయి ఎన్ని రోజులయిందో తలుచుకుంటే భయమేస్తుంది మంజూ! ముందు ఏదన్నా హొటలుకెళ్లి కాస్త తిందాం. ఆ తరువాత మా ఇంటికెళ్లి కాస్సేపు కన్నుమూసుకొందాం''.

''ఇప్పుడు నేనేమీ తినలేను''.

''అయితే ఇంటికే పోదాం పదా!'' అని కారును ఇంకో రోడ్డు పట్టించింది కళ్యాణి.

పావుగంట తరువాత ఓ పెద్ద మేడముందు కారాగింది. గూర్ఖా సలాంకొట్టి గేటుతీశాడు. పోర్టికోలో కారాగగానే, ఇంకెవరో వచ్చి కారు తలుపుతీశారు. కళ్యాణి చకచకా మేడ మెట్లెక్కుతోంటే మంజరి ఆవిడను అనుసరించింది. చల్లగా హాయిగా ఉన్న ఆ గదిలో ఖరీదైన ఫర్నీచర్, ఎంతో అందంగా అమర్చి ఉన్నది.

''స్నానం చేస్తావా?'' అన్నది కళ్యాణి.

''ఉఁహు''.

''అయితే కూచో, ఇప్పుడేవస్తాను''.

కళ్యాణి వెళ్లిపోయిన వెంటనే, ఇంకెవరో వచ్చి మంజరి కాలి జోడు విప్పి తీసుకెళ్లారు. ఇంకో మనిషి పొగలుగక్కుతున్న కాఫీ బల్లమీద పెట్టి వెళ్లిపోయింది.

మంజరి దాన్ని ముట్టుకోలేదు. కళ్యాణి కోసం ఎదురుచూస్తోంది. పావుగంటకల్లా కళ్యాణి ఇంగ్లీషు వాళ్ల పంపిణీ మీద గౌనువేసుకొని, చడావులు టకటకరాడించుకొంటూ వచ్చింది.

''తాగలేదేం?''

''మరి-మీరో?'' అన్నది మంజరి.

ఇద్దరూ కాఫీ తాగారు.

''మరీ తూగుతున్నావు, పద పడుకొందాం''అన్నది కళ్యాణి.

మంజరికి ఆ గదిలో మరో మంచం కనిపించలేదు.

''అలా చూస్తున్నావేం మంజూ! మనిద్దరికీ ఈమంచం సరిపోదా?'' అన్నది కళ్యాణి నవ్వుతూ. ''ఈరోజు నీ దగ్గర పడుకోవాలనిపించిందోయ్! అందుకే ఇంటికి తీసుకొచ్చాను''.

ముందు కళ్యాణి పడుకొని దిండ్లు సరిచేసుకొన్నది. ఆ తరువాత మంజరిని దగ్గరగా తీసుకుని ఓ చెయ్యి భుజం మీదగా వీపు వేపుగా వేళ్లాడేసి దగ్గరగా తీసుకొన్నది. మంజరి కళ్లుమూసుకొన్నది గానీ నిద్రపోలేదు.

''నిద్రొస్తోందా?''

''లేదు'' అన్నది మంజరి కళ్లు తెరిచి.

కళ్యాణి కళ్లు నీటితో నిండి ఉన్నాయి.

''ఏమిటది?'' అన్నది మంజరి.

"ఏం ఉందమ్మా మంజూ! నిన్ను చూస్తుంటే మా చెల్లెలు జ్ఞాపకానికొస్తోంది. మరేం లేదు".

"ఇప్పుడు..."

"లేదు. చనిపోయింది. ఈ మాత్రం డబ్బు అప్పుడే గనక నా దగ్గరుంటే దాని ప్రాణాన్ని రూపాయలు పోసి కొనివుందును. అప్పుడు నాకు ఒక్క పిక్చరు కూడా లేదు. వేషం ఇస్తామన్న వాళ్లందరూ మొండిచేయి చూపించారు. రోజులు గడవడమే అంతంత మాత్రంగా ఉంది. మా చెల్లెలికేమో టైఫాయిడొచ్చింది...మంచి మందిచ్చి ఉంటే తప్పకుండా బతికేది. కేవలం నా దరిద్రం వల్లనే అది చనిపోయింది. రెండేళ్లపాటు నాకు మతికూడా స్థిమితంగా లేదు. ఎన్నోసార్లు ఆత్మహత్య చేసుకుందామని, మద్రాసు నుంచి పారిపోదామని అనిపించింది. ఎవరన్నా చేరదీస్తే శాశ్వతంగా అతనితో ఉండిపోదామని కూడా అనుకొన్నాను. చాలామంది నా ముఖం స్క్రీనుకు పనికిరాదన్నారు. నా డైలాగ్స్‌లో మాడ్యులేషన్ ఉండదన్నారు. నా జాతకం మంచిది కాదన్నారు.. పట్టుమని ఆరేళ్లు కాలేదు. కట్టుకుపోయినన్ని పిక్చర్లు వస్తున్నాయి. చంద్రావతిని ఆరోజుల్లో సాయం చేయమని అడిగితే ఓ రూపాయి నోటిప్పించి పంపేసింది. ఈరోజున ఆవిడ కుడిచెయ్యయితే నేను ఎడమచెయ్యిగా ఉన్నాను. ఆవిడ పాతిక తీసుకొంటున్నది. నేను పదిహేను, ఇరవైదాకా డిమాండ్ చేస్తున్నాను. దేనికైనా వోర్పు కావాలమ్మా! రెండోది జాతకఫలం ఉండాలి. వచ్చిన అవకాశాలను సద్వినియోగం చేసుకోవాలి. ఎవరైనా మనకు పిక్చర్లో వేషం ఇప్పించగలరేగానీ, దాన్ని బాగా చేయడం మన చేతుల్లోనే ఉన్నది. ఉన్న కారెక్టర్ను పాడుచేశామనుకో...బోరెత్తడం లేదు గదా మంజూ?" అన్నది కళ్యాణి.

"లేదు".

"పడుకో పాపం! ఈదిక్కుమాలిన సొదతో నీకు నిద్రలేకుండా చేశాను".

మంజరికి వొట్టుపెట్టినట్లుగా కునుకు రానేలేదు. తను ఇంటి దగ్గర బయలుదేరేటప్పుడు కళ్యాణిని చూడవలసి వస్తుందని కూడా అనుకోలేదు. అటువంటిది ఈ క్షణాన తనావిడ సరసర పడుకొని ఉన్నది. కళ్యాణి నటించిన సినిమాలు తను చాలా చూసింది. లవ్‌సీన్సులో ఎంతో అద్భుతంగా ఆవిడ నటిస్తుంది. సెక్స్‌ప్పీల్ రోల్స్ వేయడంలో ఆవిణ్ణి బీట్ చేసే ఆర్టిస్ట్ లేదు. ఆడవాళ్లను కూడా సమ్మోహింపచేయగల కళ్యాణి-హైసొసైటీ లేడీలాగా సినిమాల్లో కనిపించే కళ్యాణి లోలోపల ఎన్ని అగ్నిపర్వతాలు, ఎన్ని శూన్య ప్రదేశాలు, అగాధాలు దాగొని ఉన్నాయో తలుచుకొని మంజరి విచలితురాలయింది.

# 13

జరగవలసినవన్నీ సక్రమంగా జరిగిపోయాయి. కళ్యాణి హీరోయిన్ కావడమే కాదు; మంజరికి తను కోరుకొన్న వేషం కూడా దొరికింది.

ఫిలిం పరిశ్రమకు మెహతా మకుటంలేని మహరాజని లోగడ మనం చెప్పుకొన్నాం. రాజు తలుచుకుంటే దెబ్బలకు కొదవలేనట్లే ఈరాజు తలుచుకొంటే సినిమారంగంలో కానిపనికూడా లేదు.

"మీ కథ నాకునచ్చింది కానీ హీరోయిన్‌గా మీరు కళ్యాణిని బుక్ చేస్తే బావుంటుందనుకొంటాను. అందులోను అది హెవీ కారెక్టర్. కళ్యాణి తప్ప ఇంకోరు దాన్ని చేయలేరు" అన్నాడు మెహతా. ఆ మర్నాడు తన్ను కలుసుకోవడానికొచ్చిన జయాఫిలింస్ వారితో.

ప్రొడ్యూసర్ల ప్రాణాలు అన్నుబట్టాయి. వారేమాటా అనేలోగానే మెహతా తన రెండో నిర్ణయాన్ని కూడా బయటపెట్టేశాడు.

"నెలకు వేయి చొప్పున పుచ్చుకునే ఆర్టిస్టు చేత రెండువేల రూపాయల చాకిరీ తీసుకోకపోతే నువ్వు మంచి ప్రొడ్యూసరువు కావన్నమాటే! ఆవిడకు ఫలానా కారెక్టరివ్వండి...మరి మీకు చెక్ రాయించనా?"అన్నాడు మెహతా. అవతలి వారు ఆలోచించుకోడానిక్కూడా అవకాశమివ్వకుండానే!

అయినా జయవారు ఆలోచించారు. తమ దగ్గర డబ్బు లేకపోలేదు గానీ, ఆ మొత్తం పిక్చర్ తీయడానికి ఎంతమాత్రం చాలదు. అదేగాక, ఈబిజినెస్ మాగ్నెట్‌ను కాదని ఈ ఫీల్డులో బతకడం అసంభవం! వీడిక్కావలసిన విధంగా సినిమా తియ్యనన్నా తియ్యాలి. లేదా అసలా ఆలోచనే మానుకోనన్నా మానుకోవాలి. వాళ్లు సినిమా తియ్యడానికే నిశ్చయించుకొని, చెక్కు తీసేసుకొన్నారు. మెహతా చెప్పినట్లుగా వాళ్లిద్దరకూ ఆయా వేషాలు కూడా ఇచ్చేశారు.

కళ్యాణి మీద జయా వారికి అట్టే కోపం లేదు. ఆవిడ ఫస్టు రాంక్ హీరోయిన్ కాదన్న మాటేగానీ, వాళ్లకే మాత్రం తీసిపోయేది కూడా కాదు. మంచి వేషం దొరికి, మంచి డైరెక్టర్ చేతిలో పడితే, కళ్యాణి ఆకాస్త గనుపునూ దాటేయగలుగుతుంది. కానీ, మంజరి మాటేమిటని? మంజరిని నెల జీతమ్మీద బుక్ చేయడానికి చాలా కారణాలున్నాయి. మూర్తిగారు చెప్పడమన్నది ఒక కారణమే అయినా, అంతకన్నా ముఖ్యమయింది మంజరి అందం. ముందు ముందు పైకి రాగల లక్షణాలున్నమ్మాయి. ఆ పిల్లచేల నాలుగైదు సెక్సప్పీల్ డాన్సలు పెట్టిస్తే దేశాన్ని దోచిపారేస్తుంది. దీనికి తోడుగా, కొత్త ఆర్టిస్ట్ గనుక, కాల్‌షీట్సూ దొరుకుతాయి. టైముకొస్తుంది... అన్నిటికి పనికొస్తుంది. ఇవన్నీ వారు ఆలోచించాకనే నెలజీతం విషయం ప్రస్తావించారు. అయితే వారనుకున్న దానికి వ్యతిరేకం జరిగింది. మంజరి సామాన్యురాలు కాదనీ, ఆవిడ వెనక మందీ మార్బలం ఉన్నదనీ, ఆ మందికి సినిమా పరిశ్రమంలో మాంఛి పలుకుబడి ఉన్నదనీ తేలిపోయింది. ఇహ ముందెప్పుడో చేసుకోవలసిన పనులన్నీ మాంఛి పలుకుబడి ఉన్నదనీ తేలిపోయింది. ఇహ ముందెప్పుడో చేసుకోవలసిన పనులన్నీ ఆవిడ ముందుగానే చేసుకొన్నదంటే, ఆవిడ పట్ల జాగ్రత్తగా ఉండటమే కాదు; ఆవిడ అంతేమిటో కూడా తేల్చుకోవాలి. సమయం వచ్చినప్పుడు అణిచి పారేయాలి కూడాను.

అయిదారు మాసాల తరువాత, అటువంటి సమయం రానే వచ్చింది. పోలీసు కుక్కకున్నంత గ్రహణశక్తి వున్న చలపతి, ఆ సమయాన్ని కనిపెట్టి మంజరిని ప్రోత్సహించాడు.

"నేననుకొన్నంతా అయింది. ఇప్పటికప్పుడే ప్రొడ్యూసర్ల మధ్య కాంపిటేషన్ పెరగుతున్నది. జయాఫిలింస్ వారు నిన్నో టామిల్ పిక్చర్లో యాక్టు చేయమని అడగబోతున్నారు" అన్నాడు.

"నిజంగానా?" అన్నది మంజరి, ఆమాటలు నమ్మలేనట్లుగా.

"నీకీ వార్త సంతోషంగా వుంది గదూ?" అన్నాడు చలపతి.

"మీకు మాత్రం సంతోషం కాదా? పట్టుమని పదిమాసాలన్నా కాలేదు గదా, ఇప్పటికప్పుడే, ఆరవ పిక్చర్లో వేషం దొరకడమంటే మాటలేనండీ? నాకన్నా ముందు నుంచీ ఈ ఫీల్డులో ఉన్నవాళు ్లన్నారు. వారి కింకా తెలుగు పిక్చర్స్‌లోనే మంచి వేషాలు దొరకడం లేదు. అంతదాకా దేనికీ? మన కళ్యాణి సంగతే చూడండి!"

చలపతి నిట్టూర్చకపోతే ఏమనేదో గాని, అతని వాలకం చూసి, మాటను మధ్యలోనే ఆపేసింది మంజరి.

"తెలివతక్కువదాన్ని గనక, ఇదంతా నామంచికే అనుకొంటున్నాను. కాకపోతే మీరు చెప్పండి;

నేను కాదంటే గదా?'' అన్నది మంజరి.

''ఇది మంచికోసం కాదననుగానీ, ఇప్పుడు మాత్రం మంచిది కాదంటాను-ఎందుకంటే, జయావారి ఎగ్రిమెంటులో నిన్ను వాళ్ల ఫిలింస్‌లో యాక్టు చేయడానికి బుక్‌చేశారుగానీ, ఇతర కంపెనీల వాళ్ల పిక్చర్లులోకని కాదు. ఐనప్పుడు, నువ్వా ఇతర కంపెనీల సినిమాల్లో వేషాలేయడం దేనికి? అందువల్ల నీకిచ్చే జీతం పెరుగుతుందా? అదీ లేదే!'' అన్నాడు చలపతి.

చలపతి చెప్పదలుచుకొన్నదాన్ని మంజరి ఏనాడో గ్రహించింది. ఈకారణంగా జయావారితో పేచీకి దిగడం మంజరికిష్టంలేదు. అసలు వేషాలు దొరక్క నానాగడ్డీ కరిచేవాళ్లు కరుస్తుంటే కాళ్లదగ్గరకొచ్చిన బుకింగ్సును కాదనడంలో అర్థం లేదని మంజరి ఉద్దేశం. అయినా ఆవిడ చలపతి మాటకు ఎదురు చెప్పలేకపోయింది. అతని సలహా మీద సినిమా వ్యవహారాల్లో ఆరితేరిన నొక అడ్వకేట్‌ను ఆరోజునే సంప్రదించింది.

కేసంతా విన్నాక ఆ అడ్వకేట్ తను ఇవ్వకూడని సలహా నొకదాన్నిచ్చాడు.

''మీరన్నది నిజమే! బ్రహ్మాండమైన పాయింట్సున్నాయి. కోర్టుకెడితే మీరు గెలవడం కూడా ఖాయమే! కానీ, ఆ పనిచెయ్యొద్దని నా సలహా! ఫలానా ఆర్టిస్టు పేచీకోరుదనీ, కోర్టుల కెక్కుతుందనీ తెలిశాక, మీకు బుకింగ్సు దొరుకుతాయని నేననుకోను. మీకీ వూళ్లో మంచినీళ్లు కూడా పుట్టవు.

''అరవ పిక్చర్లో ఛాన్స్ రావడమే మీకు గొప్ప. ఒకటి రెండు పిక్చర్సుకు మీకు డబ్బు రాదనుకోండి. పీడాబోయింది. కానీ ఆ తరువాత మీరు ''ల''కారాల మీద సంపాదిస్తారు. ముష్టి వేయిరూపాయలు కోసం మీరు ఫ్యూచరంతా పాడుచేసుకోవడానికి సిద్ధపడితే కేసు గెలిపించడానికి నాకేమీ అభ్యంతరం లేదు. అయినా మనం తొందరపడకూడదు, జయావారు  నాక్లయింట్సే! రేపు నేను వెళ్లి మాట్లాడి చూస్తాను''అని సర్ది పంపేశాడు.

జయా ఫిలింస్ వారికి ఈ ఆలోచన కలిగి చాలారోజులయింది. నెలకు వేయి రూపాయిలిస్తూ మూడేళ్లపాటు ఎగ్రిమెంటుం చేయించుకొన్న ఆర్టిస్టు, ఈ మూడేళ్లపాటూ తను స్వాధీనంలో ఉంటుందనీ, ఆవిణ్ణి ఎలా ఉపయోగించుకొన్నా, కాదనడానికి వీల్లేదనీ వారి వాదన. మూడేళ్లకాలంలోనూ ఆవిడకు చెల్లించే 36వేల రూపాయలనూ, ఇంకో ప్రొడ్యూసర్ నుండి పిండేస్తే, తమ పిక్చర్సులో మంజరి ఊరికే వాడుకోవచ్చునని వారనుకొన్నారు. మంజరి యాక్టు చేసిన రషెస్ చూసి, ఒకరిద్దరు తెలుగు ప్రొడ్యూసర్లు, అరడజను మంది అరవ ప్రొడ్యూసర్లు ముగ్ధులయ్యారు. ఆవిణ్ణి బుక్ చెయ్యడానికి చాలామంది సిద్ధపడ్డారు కూడాను. కానీ, ఇంకో మూడు సంవత్సరాల దాకా మంజరి ఇంకెవరి పిక్చరులోనూ యాక్టు చేయడానికి వీల్లేదు. అలా చేయాలంటే జయవారి అనుమతి కావాలి.

ఒక తమిళ ప్రొడ్యూసరు జయవారికి పదిహేనువేలివ్వడానికి అంగీకరించి, మంజరి తన పిక్చర్లో యాక్టుచెయ్యడానికి పర్మిషన్ తీసుకున్నాడు. దీనిమీద ఇంత గొడవ జరిగింది.

అడ్వొకేట్ అడిగిన ప్రశ్నలన్నింటికీ జయావారు సమాధానాలు చెప్పుకొచ్చారు.

''అరవ పిక్చర్సులో కూడా యాక్ట్‌చేయాలని, పొరబాటున మేము ఎగ్రిమెంట్‌లో మెన్షన్ చేయలేదు. రైటే. ఆవిడ మామీద దావా వేయనూవచ్చు; మేం వోడిపోనూ వచ్చు. కానీ ఆ టామిల్ పిక్చర్ కూడా మాదే! మేం దానికి కూడా ప్రొడ్యూసర్లం. జయా ఫిలింస్ భాగస్థులందరికీ, ఆ టామిల్ పిక్చర్లో కూడా వాటాలున్నాయి. ఆవిడయాక్ట్ చెయ్యనంటుందా?'' అన్నాడు ఓ భాగస్థుడు.

''అదేదో అరవ కంపెనీ అటగా! అందులో మీకు భాగాలుండటమేమిటండీ?''అన్నాడు

అడ్వొకేటు.

మహాబుద్ధిశాలియైన ఆ భాగస్థుడు మందస్మిత వదనారవిందుడయి ఇలా ప్రవచించాడు.

"మహానుభావా! మీరన్నది నిజమే! కోర్టుకెళ్లక ముందే నిజం! ఆ గడప ఎక్కాక నిజం చెబుతామా? ఏంచెబుతే గెలుస్తామో అవే చెబుతాం. మేం ఇప్పటికే చాలా ఏర్పాట్లు చేసుకొన్నాం. మంజరి కోపం అవన్నీ మార్చడం అబద్ధం. ఆవిణ్ణి నోరుమూసుకొని పనిచేయమనండీ, లేదా తన్ని పనిచేయించుకొంటాం. మంజరి చేత అరవ పిక్చర్లో వేషం వేయించకపోతే, ఈ మీసం గొరిగించుకొంటాను. అరవ ప్రొడ్యూసరు నా ఫ్రెండే! అతన్ని నా కంపెనీ బానర్ మీదనే సినిమా తీయమంటాను. అప్పుడు కూడా వేషం వేయనంటుందా మంజరి? అరెస్టు చేయించి జైల్లో పెట్టిస్తానని చెప్పండి" అన్నాడు రెండో భాగస్థుడు.

మంజరి చాటుగా పిలిపించి రాజీ ప్రతిపాదనలు చేశాడు అడ్వొకేటు.

"అమ్మాయి! ఇదీసంగతి. నువ్వు దావా వేయడం దేవుడికి తెలుసు. వీళ్లే నీ మీద కోర్టుకెక్కబోతున్నారు. నువ్వు సరిగ్గా పనిచేయడం లేదనీ, వేళకు రావడం లేదనీ, పేచీలు పెడుతున్నావనీ నీమీది కంప్లెయింట్స్. ఎందుకొచ్చిన గొడవ ఇదంతా? ఆ చలపతి గాడికేం చెబుతాడు. నీలాంటి వాళ్లను లక్షమందిని చూశాడతను. నువ్వతనితో విరోధంపెట్టుకోవలసిన పనిలేదుగానీ, అతనన్నదానికల్లా గంగిరెద్దులాగా తలూపవలసిన అవసరంకూడా లేదు. నీ సంపాదన మీద బతుకుతున్న వాడి మాటను, నువ్వు లెక్కచెయ్యకు. నేను ఎవ్వరికీ నష్టం లేకుండా రాజీ చేస్తాను. నువ్వు వొప్పుకుంటావా?" అన్నాడు అడ్వొకేటు.

"చెప్పండి!"అన్నది మంజరి.

"జయావారి పిక్చర్సులో వేషాలేసినందుకు, ఆ కంపెనీ నీకు జీతమిస్తూనే ఉంది. అవిగాక వేరే కంపెనీల్లో నువ్వు పనిచేయవలసి వచ్చినప్పుడు, అందువల్ల వచ్చే డబ్బులో సగం నువ్వు తీసుకో. మిగతా సగం కంపెనీ తీసుకొంటుంది. దానివల్ల నీకు అనేక లాభాలున్నాయి. కంపెనీతో నీకున్న సంబంధాలు మెరుగవుతాయి. మంచి మంచి వేషాలు దొరుకుతాయి. తమ వాటాకోసం జయవారు నీకు బుకింగ్స్ వెదకిపెడతారు. నీరేటు కూడా పెంచుతారు. నీకు మంచి పబ్లిసిటీ యిస్తారు. ఇవన్నీ ఆలోచించుకొని, నీ అభిప్రాయం చెప్పు" అన్నాడు అడ్వొకేటు.

మంజరి ఎటూ తేల్చుకోలేక ఉక్కిరిబిక్కిరయిపోయింది. తనను సంప్రదించకుండా రాజీకి వొప్పుకున్నందుగ్గాను చలపతి ఏమంటాడోనని ఆవిడ భయపడింది. అయినా చివరికి రాజీ కుదర్చమనీ, అందులో ఈ షరతులన్నీ ఉండేలా చూడమనీ, మంజరి ప్రాధేయపడింది.

"నా శక్తివంచన లేకుండా చూస్తాను. ఇందుకు జయావారు కూడా వొప్పుకోవాలి. ఇప్పుడా కంపెనీవారు నీపేరు చెబితేనే మండిపోతున్నారు. రాజీకి-ముఖ్యంగా కావలసింది రెండు పార్టీల మధ్యా సుహృద్భావం ఉండటం. అదిప్పుడు...నువ్వో పనిచెయ్యి, సరాసరి జయాఫిలింసుకెళ్లి, వారితో మాట్లాడు. కాస్త వేడి తగ్గాక వారిని వొప్పించే భారంనాది!" అన్నాడతను.

అతని సూచనలను అక్షరాలా పాటించింది మంజరి. చలపతికి చెప్పకుండానే జయాఫిలింసుకెళ్లింది. దోవ పొడవునా ఆవిడ గుండెలు గుబగుబలాడుతూనే ఉన్నాయి. ఈసారి చలపతి ఏమంటాడోనని కాదు; కంపెనీవారు ఏమంటారోనని మంజరి భయం. నలుగురిలోనూ తనను నానామాటలు అంటే చిన్నపోవాల్సివస్తుందేమోననీ, తిరిగి ఇంటికి పోదామనీ అనుకొన్నది కానీ, కారు సరాసరిగా ఆవిణ్ణి పోర్టికోలో దించి వెళ్లిపోయింది.

మంజరి ఓ క్షణం అటూఇటూ చూసింది. మూమూలు ముఖాలన్నీచాలా మామూలుగా ఉన్నాయి.

"లోపలున్నారు, దయచెయ్యండి"అన్నాడు ప్రొడక్షన్ మేనేజరు.

మంజరి స్వింగ్‌డోర్సు తీసుకొని గదిలో అడుగుపెట్టింది. ఒక భాగస్థుడు తాపీగా సిగరెట్ కాలుస్తూ, ఏదో సినిమాపత్రిక చదువుకొంటున్నాడు.

"కూచో" అన్నాడతను పత్రిక నుండి తలతిప్పకుండానే.

మంజరి నిశ్శబ్దంగా కూచున్నది.

పైన ఫాను తిరుగుతున్నా ఆవిడక చెమటలు పోస్తున్నాయి.

అయిదారు నిమిషాలదాకా అతను మాట్లాడలేదు, క్షణక్షణానికి మంజరి ప్రాణాలు జివ్వుమంటున్నాయి.

"ఈ వారం రోజుల నుండీ ఆఫీసుకు రావడం లేదేం?" అన్నాడతను.

మంజరి మాట్లాడలేదు.

"ఆరోగ్యం బావుండలేదా?"అన్నాడతనే మళ్లీ.

ఈసారి మంజరికి వంక దొరికింది.

"ఊఁ"

"ఇప్పుడెలా ఉంది?"

"బాగానే ఉంది"అన్నది మంజరి.

అతను పత్రిక మడచి బల్లమీద పడేసి, కళ్లద్దాలు తీసి, కట్టుపంచతో తుడుచుకొన్నాడు. బాయ్‌ని పిలిచి రెండు కాఫీలు తెప్పించాడు. కాఫీ ఓ గుక్కతాగి బల్లమీద కప్పునుంచుతూ మంజరికేసి చూశాడు. ఆ చూపుల్లో ఏమున్నదీ మంజరి అస్పష్టంగా చదువుకోగలిగింది.

"నిన్నేదో మోసం చెయ్యాలని మేమనుకోలేదు. ఆ అవసరం కూడా మా కంపెనీకి లేదు. మూర్తిగారంటే మాకు గురి వుంది. ఆయన పాటికి పదిసార్లు నిన్ను గురించి చెప్పాడు గనుక తీసుకున్నాం. నీలాంటి ఆర్టిస్టులు మాకు దొరకరని నువ్వనుకోకు. మూడేళ్లలో నీకు రావలసిన 36వేలకు నీకిప్పుడే చెక్కిస్తున్నాను. మరో అరగంటలో మనం ఎగ్రిమెంటును కాన్సిల్ చేసుకోబోతున్నాం"అన్నాడతను.

మంజరి కొయ్యబారిపోయింది.

పదినిమిషాల తర్వాతగానీ ఆవిడ కళ్లల్లో నీరు తిరగలేదు.

"ఇందులో నాతప్పేమీ లేదండీ! చలపతిగారూ-"

"అవును-చలపతి నీకేమవుతాడమ్మా?"అన్నాడతను మధ్యలోనే.

"దూరంగా బంధువు"అన్నది మంజరి

"అతనేదో నిన్నుకొనేసినట్లు మాట్లాడుతాడేం? పాపం! ఆ అడ్వొకేటు నిన్ను గురించి చాలా సానుభూతిగా మాట్లాడుతుంటే ఈ చలపతిగాడేమో అడ్డుసవాళ్లు చేస్తూ కూచుంటాడాయె. నాకు ప్రాణం విసిగిపోయిది. అవతల నాకు బెంగుళూరు వెళ్లే పనిలేకపోతే మీవాడి అంతు తేల్చుకొని వుందును"అన్నాడతను.

"మీరు బెంగుళూరు పోతున్నారా? ఎప్పుడండీ?" అన్నది మంజరి ధోరణిని సున్నితంగా మార్చేస్తూ.

''ఇంకో గంటలో ప్లేన్ వుంది....''

''ప్లేనంటున్నారు. చాలా దూరమా ఏమిటి?''అన్నది మంజరి.

''అరె, నువ్వెప్పుడూ చూడనేలేదా? చాలా మంచి సిటీ. అక్కడి గార్డెన్సులో మనకు షూటింగు ఉంది. ఆ ఏర్పాట్లన్నీ చేసుకురావాలి. ఓ వారంరోజులపాటు...''అన్నాడతను.

''ఏమాత్రం ఉంటుందండీ ఛార్జి?'' అన్నది మంజరి.

''నీకు రావాలని ఉన్నదా? అరె, మాటమాత్రం ముందు చెప్పకపొయ్యావా? నీకూ వో సీటు బుక్‌చేసి ఉందునే! అయినా చూద్దాం'' అంటూ ఎక్కడికో ఫోను చేసి బెంగుళూరుకు ఇంకో టికెట్ కూడా బుక్‌చేయమని రిసీవర్ పెట్టేశాడు.

నిశ్శబ్దాన్ని ఎంత మాత్రం సహించే స్థితిలో లేదు మంజరి. అందుకని భాగస్థుణ్ణి మెల్లిగా కదిలించి వదిలిపెట్టింది.

''మీరింత కొస వెర్రి మనుషులని నేననుకోలేదు సుమాండీ! ఎవరో ఏదో అన్నారని, ఆ కోపమంతా నామీద చూపెడితే ఎలా? నేనటువంటిదాన్ని కాదు. ఆ మాటలు అనడం కూడా నావల్ల కాదు. చలపతిగారైనా ఇంకో ఉద్దేశంతో అలా అనలేదు. ఏదో మాట సామెతగా, 'నీ ఎగ్రిమెంటులో అరవ సినిమాల్లో కూడా యాక్ట్ చెయ్యాలని ఉన్నదా?''అన్నాడు. నాకు ఇంగ్లీషు అంతగా రాదు. అంచాత అడ్వొకేటు దగ్గర కెళ్లి చూపించాం. అంతేగానీ, మీతో పేచీ పెట్టుకోవాలన్న ఉద్దేశం మాకు లేదండీ! మీరేమో 36వేలు పారేస్తామనీ, ఎగ్రిమెంటు చించేస్తామనీ అంటున్నారు. మీ కంపెనీలో పనిచెయ్యకుండా మీ దగ్గర నేను మాత్రం డబ్బు పుచ్చుకొంటానా? నామీద మీకిష్టంలేకపోతే అది వేరు మాట. సరేపోనీలెండిగానీ, మీ ఖర్చులమీద నన్ను బెంగుళూరు తీసుకుపోతున్నారు గదా! ఇదంతా నన్నెలా తీర్చుకోమంటారు? పోనీ పనన్నా ఉంటే అనుకోవచ్చు''అన్నది మంజరి, మధ్యమధ్య నవ్వుతూ, అతనికేసి పులుకు పులుకున చూస్తూ.

''కళ్యాణిని నువ్వు చాలా రోజుల నుండి ఎరుగుదువా?''

కళ్యాణి ఏం చెప్పిందో తెలీదు గనుక ముభావంగా ఉండిపోయింది మంజరి.

''ఆవిడ కూడా నిన్ను గురించి చాలా చెప్పింది. నీ ఎగ్రిమెంట్ కాన్సిల్ చేశాక కళ్యాణికి మేము చచ్చినంత సంజాయిషీ ఇచ్చుకోవాలి''.

ఫోను మోగితే రిసీవర్ అందుకొని 'గుడ్ గుడ్' అని కుర్చీలో అటూ ఇటూ కదిలాడతను.

''నీకూ సీట్ బుక్ చేశారుట. నువ్విలానే వచ్చేస్తావా? అతగాడికేమన్నా కబురుచెయ్యాలా?''అన్నాడతను.

''ఏమీవొద్దు. పదండి వెడదాం. ఈవారంరోజుల నుండి నన్ను నమిలి తినేశాడు చలపతి. ఏదో వో నిమిషంలో పారిపోయి మీ దగ్గిరకొచ్చేద్దామనుకొన్నాను''.

''మరి రాలేదేం?''

''ఇప్పుడొచ్చాను గదా? ఇహపదండి!'' అన్నది మంజరి.

అతను మంజరికేసి ఓ చూపు చూసి కింది పెదవి కొరుక్కొన్నాడు.

''బతికాం. పక్షి పంజరంలో చిక్కినట్లే!'' అనుకొన్నది మంజరి.

* * * * * * * *

వారం రోజులనుకొన్నా కాంప్, రెండువారాల దాకా దేకింది. పార్ట్నర్ ఈరెండు వారాలూ మంచినీళ్లవతుగా డబ్బు ఖర్చుపెట్టేశాడు. మంజరి కూడా చాలా కులాసాగా ఈరెండు వారాలూ

గడిపేసింది. మొదటిరాత్రి పదకొండు గంటలకల్లా రాజీకుదిరిపోయింది. రెండు మూడు రాత్రులు దాన్ని మరింత కట్టుదిట్టం చేసుకొంది మంజరి. మిగతా రోజుల్లో అతగాడే ఆవిడ కొంగుపట్టుకొని వేళ్లాడసాగాడు. మగవాడి బలహీనతలేమిటో, ఎప్పుడు వాటిని లాభసాటిగా వాడుకోవాలో మంజరికి క్షుణ్ణంగా తెలుసు. అనేక వందలసార్లు ఆవిడా అవకాశాలను ఉపయోగపెట్టుకొని లాభించింది. అపారమయిన ఆ అనుభవం ఆవిడికిప్పుడు ఉపయోగ పడింది. సాధారణవ్యక్తులు చచ్చీచెడీగాని చేయలేని పనులను మంజరి సులువుగా చేయగలగడానికి ఈ అనుభవాలే కారణం. అనేక సందర్భాలలో మంజరి మనుషుల్ని క్రూరంగా ద్వేషించిన మాట నిజమే! తను అసహ్యించుకొన్నవాడికే తన శరీరాన్ని అర్పించిన సందర్భాలు కూడా అనేకమున్నాయి. కానీ అందువల్ల మంచి ఫలితాలు కలుగుతున్నప్పుడు ఆ పనులు చెడ్డపనులని మంజరి కూడా అనుకోలేకపోయింది.

పార్ట్నర్ ధోరణి తెలిసిందాకా మంజరి భయపడింది. మనిషిలో లోతుల్ని ఇట్టే పసిగట్టగల ఆవిడ అనుభవం 'ఈ పార్టర్న్ కూడా నీకు బలాదూరే సుమా!' అని అప్పుడే చెప్పేసింది. 'మరో 24గంటల్లో వీణ్ణి నేను కుక్కను చేసి వదిలిపెట్టకపోతే నాపేరు మంగమ్మే కాదు' అని ప్రతిజ్ఞ చేసిందావిడ. నిజానికంత టైం కూడా పట్టలేదు. ఈలోగానే విజయం మంజరిని వరించింది. బెంగుళూరు రావడం అన్నది కేవలం నిమిత్తమాత్రమే! ఓ కొత్త సిటీని చూశానన్న సంతృప్తి తప్ప ప్రత్యేకంగా మంజరికి ఒరిగిందేమీ లేదు. ఇహ పార్ట్నర్‌తో రాజీమాట- ఈ దిక్కుమాలిన బోడీ రాజీకోసం పనిమాలా బెంగుళూరే రానవసరం లేదు. అరగంటసేపు ఏకాంతం దొరికితే, ఎక్కడయినా దాన్ని మంజరి సాధించి ఉండేది.

ఎగ్రిమెంటును చించి పారేస్తానన్న పెద్దమనిషి ఆ మాట అన్న 24గంటల తరువాత, మంజరి చీరల కింద పదిహేను వందల రూపాయలు ఖర్చుచేశాడు. ఈ 24గంటల్లోనూ అతను మంజరిని ఆర్టిస్టుగా చూడటం మానేశాడు. ఆవిణ్ణు తన వెంట తిప్పుకోవడంలో అతను పొందే ఆనందాన్ని చూచి, మంజరి ఎంతగానో నవ్వుకొంది. లోగడ రామచంద్రం, మాధవరావులు, ఈ మధ్య చలపతి, ఆ దరిమిలా వెంకటేశ్వర్లు, ఇప్పుడు ఈపార్ట్నర్-వీళ్లందరూ తన చేయి పట్టుకొని, వీధుల్లో సగర్వంగా నడిచినవాళ్లే! వాళ్లందరికీ, తను పూర్తిగా వాళ్ల మనిషేనన్న భ్రమను కలిగించిఉండకపోతే, వారింతపని చేసి ఉంటారా? ఒక్కనాటికీ అలా జరిగి ఉండదని మంజరికి తెలుసు.

''ఏడ్చిపోతాడని ఊరుకొన్నాను గానీ, వీణ్ణి పూర్తిగా పిండేయడం రోజుల్లో పని'' అనుకొన్నది మంజరి.

బెంగుళూరులో చూడవలసినవన్నీ చూశాక ''మనం ఎప్పుడు పోతున్నాం?'' అన్నది మంజరి, పార్టనర్ చొక్కా గుండీలను సుతారంగా తిప్పుతూ.

''ఏం? విసుగెత్తిందా?'' అన్నాడా ప్రేమికుడు, మంజరి బుగ్గలను అంతకన్నా సుతారంగా నొక్కుతూ.

''నాకా?''అన్నది మంజరి, అతనికి మరికొంచెం దగ్గరగా జరుగుతూ. ''మీరిలా నాతో ఉన్నంతకాలం, నాకు ప్రపంచం పట్టదు...అవును గానీ, అన్నిరోజుల నుండీ ఆఫీసుకొస్తున్నాను గదా, ఒక్కసారి కూడా నన్ను పలకరించారు కాదేం?''

''నువ్వా ముభావంగానే ఉన్నావుగా!''అన్నాడతను.

''మీరిలాంటి వారని తెలిస్తే, ఎప్పుడో కొరుక్కు తినేసి ఉందును...అబ్బా! అలా నాకేసి చూడకండి బాబూ! మీకు పుణ్యం ఉంటుంది'' అన్నది మంజరి అతని కళ్లను రెండు చేతులతోను మూస్తూ.

ఆ మానవుడు పూర్తిగా కరిగిపోయాడు...

.....మంజరి ఇంటికొచ్చేసరికి చలపతి లుంగీ కట్టుకొని, కట్‌బనీను వేసుకుని వరండాలలో అటూ ఇటూ తిరుగుతున్నాడు. అతనోసారి మంజరికేసి చూసి, ఏదో అనబోయి మానుకొన్నాడు. డ్రైవరు, రెండు పెద్ద పెద్ద ట్రంకులు తెచ్చి వరండాలో పెట్టి నిలబడ్డాడు. మంజరి అతనికో పదిరూపాయల నోటిచ్చింది. వాడు మిలటరీ శాల్యూట్ చేసి వెళ్లిపోయాడు.

ఒకప్పుడు జయాఫిలింస్‌వారు మాట్లాడుతారేమోనని భయపడిన మంజరి, ఇప్పుడు చలపతి మాట్లాడనందుకు భయపడసాగింది. చలపతి తనను కొడతాడనీ, తిడతాడనీ కాదు. అంతకు మించిన మాటలంటాడని ఆవిడ భయం. అదేదో త్వరగా తేలితే బావుండుననని మంజరి అనుకొంది. కానీ చలపతి పైకి తేలలేదు. అతను చుట్టూ జరుగుతున్నదేమీ గమనించనట్లుగా, వీటన్నింటికీ అతీతంగా ఉన్నట్లుగా వ్యవహరిస్తున్నాడు. మంజరి స్నానం చేసి బట్టలు మార్చుకొచ్చింది. చలపతి ఇంకా వరండాలోనే ఉండిపోయాడు. ముందుగా ఎలా పలకరించాలో మంజరికి తోచలేదు. ఓ క్షణంపాటు ఆలోచించి ''ఓసారిలా వస్తారా?''అన్నది మంజరి.

చలపతి వచ్చి నిలుచున్నాడు.

అతను వచ్చాక, ఏం మాట్లాడటమన్న ప్రశ్న మళ్లా ఎదురయింది.

''అలా ఉన్నారేం? వొంట్లో బావుండలేదా''అన్నది మంజరి.

''లేకేం? దుక్కలా ఉన్నాను''అన్నాడు చలపతి.

''అంత కోపం దేనికండీ? నేనడిగిందేమిటీ? మీరు చెప్పిందేమిటి?''అన్నది మంజరి.

''ఒడ్డెక్కిన మనిషివి, కనీసం వొడ్డెక్కాననుకొంటున్న మనిషివి-ఇప్పుడు నువ్వేమన్నా చెల్లుతుంది''.

''నేను మాత్రం ఏమైనా ఎందుకంటాను? నాకళ్లకేమీ పొరలు కమ్మలేదే?'' అన్నది మంజరి రవంత కోపంగా.

''అని నువ్వంటే ఎలా?నీ కళ్లకేమీ పొరలు కమ్మలేదనీ,నువ్వు మామూలు మనిషివేననీ ఎదటివారికనిపించాలి. అదేకాదు- పొరలు కమ్మిన మనిషికి, అలా కమ్మినట్లు తెలీదు. పోనీ నీమాటే నిజమనుకొన్నా, పొరలు కమ్మడం క్షణాలమీద జరుగుతుంది. కాని అవి విడిపోవడానికి కొంతకాలం పడుతుంది. నువ్వనవసరంగా బుకాయిస్తున్నావుగానీ, నీకు మామూలు పొరలుగావు-బాగా దళసరి పొరలు కమ్ముకొన్నాయి. ఈ గొడవకేం గానీ,నన్ను పిలిచిందెందుకుట?'' అన్నాడు చలపతి.

ఈ మాటల బాణాలు మంజరిని గాయపరిచి, స్మృతి తప్పేటట్లు చేస్తాయని చలపతి భావించి ఉంటే, అది పూర్తిగా భ్రమ అని చెప్పాలి. మంజరికి గాయాలయితే తగిలాయిగానీ, ఆవిడ శోషొచ్చి పడిపోలేదు. వాటిని తట్టుకొని నిలబడింది.

''మీ కోపమంతా తీర్చుకోడానికే నేనొక్కదాన్నే కనిపించడం నా దురదృష్టం. అసలీ గొడవంతా ఏమిటండీ బాబూ! ఏదన్నా తప్పుంటే చెప్పరాదా, నేను కాదన్నానా?''అన్నది మంజరి. రాజీకి వచ్చే ధోరణి కనపరుస్తూ.

చలపతి రాజీపడటానికి సిద్ధంగా లేడు.

''చూశావా, నేనన్నమాటను క్షణాలమీద రుజువు చేశావు''అన్నాడు చలపతి పళ్లు గిట్టకరచుకుంటూ. ''నీకు పొరలు కమ్మిన మాట-మాంచి మందమైన పొరలు కమ్మిన మాట నిజమేనని రుజువు చేశావు. నాకు కోపమున్నదనుకోవడం మొదటి తప్పు. నువ్వేతో తప్పు

చేశావనుకోవడం రెండో తప్పు. నేను అనవసరంగా గొడవలు రేపుతున్నాననడం మూడో తప్పు. పొరలు కమ్మిన మనిషి కుండే లక్షణాలన్నీ నీకిప్పుడున్నాయి. పైగా నేనేదో నిన్ను హింసపెడుతున్నట్లు మాట్లాడుతావేం?''

మంజరి కోపం తారామండలానికి లేచింది, ఆవిడ చలపతిని దులపవలసిన నాలుగు మాటలూ దులిపేసింది.

''ఒకళ్లనొకళ్లం పోషిస్తున్నదేమీ లేదు. ఎవరి బతుకు వాళ్లు బతుకుతున్నప్పుడు వొకరినొకరు ఇలా పీడించడంలో అర్థంలేదు. మీకిష్టంలేకపోతే చెప్పండి, నేను వెళ్లిపోతాను''అన్నది మంజరి.

ఆ గొంతులో దైన్యంగానీ, విచారం గానీ లేదు.ఆ క్షణాన చలపతి పొమ్మనడమే జరిగితే, అందుకు తాను సిద్ధంగా ఉన్నానని కూడా మంజరి తెలియచేసిది. చలపతి ఓ నిమిషంపాటు కళ్లు మూసుకొని ఆలోచించి, తోడేలు నవ్వినట్లుగా నవ్వాడు. అతని కళ్లు అంతో ఇంతో ఎర్రబడ్డాయి కూడా.

''అంటే నీ ఉద్దేశం నాకు బోధపడలేదు మంజరీ!'' అన్నాడు చలపతి.

''ఇంట్లో నుంచి పోతానని నన్ను బెదిరించవలసిన అవసరం లేదే. లేకపోతే నన్ను పొమ్మని చెప్పడానికిదొక మార్గమా? నేను పోవలసిన టైం వొకటుందిగానీ, అదింత తొందరగా దగ్గరపడుతుందనుకోలేదు. నేనిప్పుడే ఈ కొంప విడిచిపట్టడానిక్కూడా సిద్ధంగానే ఉన్నాను. కాని అందువల్ల నువ్వు కొన్ని ఇబ్బందులు పడాలిసొస్తుందని మానేస్తున్నాను. నేనిక్కడుండటం నీకంత ఇష్టంకాని పక్షంలో నేనెప్పుడైనా వెడతాను''.

''నన్ను ప్రాణాలతోనే కాల్చేస్తున్నారండీ బాబూ మీరు! చిటికెతో పోయేదానికి బ్రహ్మాండం చేసి కూచుంటున్నారెందుకో నాకు తెలీదు. ఏమాటన్నా తప్పే అయితే ఏ గంగలో దూకనండీ?'' అన్నది మంజరి.

ఆవిడ ధోరణిలో వచ్చిన మార్పును చలపతి కూడా గ్రహించాడు. మంజరి ఇదివరకటి మంజరి కాదని అతనికి తెలుసుగాని, ఇంత గట్టిపడుతుందని మాత్రం ఊహించలేకపోయాడు. అయినా తెగిందాకా లాగడం అతని స్వభావానికే విరుద్ధం.

''వేడి తగ్గిందా?'' అన్నాడు చలపతి సన్నగా నవ్వుతూ.

''నా కసలు వేడంటూ ఉంటే గదా తగ్గడానికి? వారంరోజులు ఊళ్లో లేకపోయేసరికి, ఎవరికి వేడెక్కిందో, ఎవరికి పైత్యం ఎక్కిందో తెలుస్తూనే ఉంది''అన్నది మంజరి.

రాంబాణం లాంటి ఈ చివరి వాక్యం చలపతిని చిత్తుచేసి పారేసింది. అతను పగలబడి నవ్వుతూ, మంజరి భుజం మీద చెయ్యి వేశాడు.

''ఆఁ పోదురూ; ఈ మాత్రం లయలు నాకూ తెలుసు''అన్నది మంజరి అందుకు సిద్ధంగా ఉ ది.

''అది గాదమ్మాడూ! నిన్ను చూడకుండా నేనింతకాలం ఉంటానని ఎలా అనుకొన్నావమ్మా? పోనీ, ఇదీ విషయమని నాకు ఉత్తరమన్నా రాశావుగాదేం? నీకోసమని ఎన్నిచోట్లకు వెళ్లను? ఎంతమందికి ఫోను చేయను? ఆఖరికి జయాఫిలింస్‌లో కనుక్కొంటే తెలిసింది. ''హమ్మయ్య''అనుకొని గుండెదిటవు చేసుకొన్నాను. అవునుగానీ బెంగుళూరెలా ఉంది? నువ్విదే మొదటిసారి చూడ్డం కదూ?''

మంజరి పలకలేదు. ముఖం ముడుచుకొని మూతిని సున్నాలాగా తిప్పి, మంచం మీద

పడుకొంది.

“పలకవేం?”అన్నాడు చలపతి, తాను కూడా మంచంమీద కూచుంటూ.

మంజరి లేవబోయింది. చలపతి ఆవిడ లేవకుండా అదిమిపెడుతూ, “ఎందుకమ్మా అంత కోపం? నువ్వు ఉత్తరమన్నా రాశావు కాదని తప్పితే నీమీద నాకెందుకమ్మా కోపం?”అన్నాడు.

అప్పటికీ మంజరి పలకలేదు.

“ఇలాంటి పోజులు రెండుమూడుంటే ఆ పిక్చర్ సెంచరీ కొడుతుందనుకో మంజరీ! ఇప్పుడు నాకేమనిపిస్తుందంటే-”

“సిగ్గులేకపోతే సరి!”అన్నది మంజరి.

“దిక్కుమాలిన సిగ్గు లేకపోతే పీడాబోయిరిగానీ, నాకోసం బెంగుళూరు నించి ఏం తెచ్చావో చూడనీ!”అన్నాడు చలపతి.

అతను అనడం ఆ మాటలే అన్నా అతని చూపులు ఇంకేదో చూడటం కోసం తారట్లాడుతున్నాయి.

విషయాన్ని వెంటనే పసిగట్టేసిందావిడ.

“హమ్మయ్య, అయ్యగారు అయిసయిపోయారు!”అనుకొన్నది మంజరి.

బెంగుళూరు నుండీ వస్తూ వస్తూ, చలపతికోసమని ఓ ఖరీదైన రిస్టువాచీ, గజం పాతిక రూపాయలు చేసే పాంటు గుడ్డలూ, వెండి సిగరెట్‌కేసూ తెచ్చింది. ఇవన్నీ కొనాలని ఆవిడ ముందుగా అనుకోలేదు. షాపులో కెళ్లాక కూడా కొందామనుకోలేదు. పార్ట్నర్ దగ్గర ఇంకా పచ్చనోట్లు మిగిలి వుండటాన్ని చూసి ఈ రూపంగా వాటిని సద్వినియోగం చేసింది మంజరి. అనవసరంగా కొన్న వస్తువులు ఈ అదునులో ఆవిణ్ణు ఆదుకొన్నాయి.

ఇవి ఎందుక్కొన్నావనిగాని, డబ్బెక్కడదనిగానీ, చలపతి అడగనూ లేదు; మంజరి చెప్పనూలేదు. ఒకవేళ చలపతి అడగటమే జరిగితే నిజం చెప్పేదామనీ, అప్పుడతని ముఖమెలా ఉంటుందో చూదామని మంజరి అనుకొంది. కానీ చలపతి ఆ అవకాశాన్ని మంజరి కివ్వలేదు...

“మంచి లోకేషన్స్ దొరికాయా?” అన్నాడు చలపతి, వాచీని తిప్పితిప్పి చూస్తూ, “వాచీ బాగానే ఉంది సుమా మంజరీ! బహుశా ఇది నీ సెలక్షన్ అనుకొంటాను. ఏమాత్రం అయిందేమిటి?”

“మార్కెట్ రేటు చాలా ఉందనుకోండి. ఇది స్మగుల్డు వాచీఅట. అంచేత మూడువందల చిల్లరెంతో అయింది. నేనేమో, ఎక్కడున్నా మీకోసం ఇలా పాకులాడుతూ ఉంటాను. మీరేమో, నిష్కారణంగా నామీద కస్సుబుస్సుమంటారు”అన్నది మంజరి.

“ఈ పంపిణీ మీద నన్నెంతకాలం సాధిస్తావు మంజరీ?” అన్నాడు చలపతి నవ్వుతూ.

“జన్మకు సిగ్గులేకపోతే సరి”అనుకొన్నది మంజరి.

చలపతి ఏదో పనున్నదంటూ వెళ్లిపోయిన గంటకల్లా ఓ అందమైన కారు వాకిటి ముందు ఆగింది. ఆ కారును తనెక్కడో చూసింది. కానీ ఎక్కడ చూసిందీ, ఎప్పుడు చూసిందీ మంజరికి జ్ఞాపకంరాలేదు. ఈ మద్రాసు వచ్చాక తనిలాంటి కార్లు కట్టుకుపోయినన్ని చూసిందాయె; ఎన్నని జ్ఞాపకముంటాయి గనక?

అంతలోనే డ్రైవర్ అల్లంతదూరం నుండే వంగి వంగి దణ్ణాలు పెడుతూ వచ్చి మంజరికో చిన్న కవరందించాడు.

“ఏమిటిది?”అన్నది  మంజరి.

పోస్టుమాన్ నుండి తప్ప, విడిగా ఉత్తరాలందుకోవడం మంజరికిదే మొదటిసారి.

"అమ్మగారు పంపించారమ్మా!"అన్నాడు డ్రైవర్.

ఉత్తరం విప్పిచూసిందాకా దాన్నికళ్యాణి రాసి ఉంటుందని మంజరి ఊహించలేకపోయింది.

"నీతో చాలా పనుంది. ఎన్నో విషయాలు మాట్లాడాలి. సాయంత్రం కారు పంపిస్తాను. తప్పకుండా రావాలి. బహుశా రాత్రంతా నువ్వు ఇక్కడే ఉండిపోవలసి వస్తుందేమో! మీ "ఆయన"తో ఈ రాత్రి రాననే చెప్పు తియ్యని ముద్దులతో... నీ కళ్యాణి"

ఉత్తరాన్ని మరోసారి చదువుకొంది మంజరి. ఎందుకు రమ్మన్నదీ అందులో ఏమీలేదు.

"అమ్మగారికి వొంట్లో బావోలేదా?"అన్నది మంజరి.

ఏం చెబితే ఏచిక్కు వస్తుందో తెలిసిన డ్రైవర్ "తెలీదమ్మా! నేను డ్యూటీమీదకు రాంగానే ఈ కవరిచ్చారు. నాకు తెలియదండీ!" అన్నాడతను.

"సరే,అలాగేనని చెప్పు"అన్నది మంజరి.

డ్రైవర్ సలాంకొట్టి పోయాడు.

ఇహ మంజరి సుఖంగా కుర్చీలో కూచోలేకపోయింది. ఇంకోసారీ మరోసారీ ఉత్తరం చదివింది. అక్షరాలన్నీ గొగ్గురు గొగ్గురుగా ఉన్నాయి. సంతకం దిద్దినట్లుగా కూడా ఉంది. ఆరోగ్యం బాగులేదనే మంజరి శంకించసాగింది. కానీ అదే నిజమయితే, తన్ను వెంటనే రమ్మంటుంది గానీ, సాయంత్రం దాకా ఆగమని ఎందుకంటుంది? తనతో ఏవో విషయాలు మాట్లాడాలని కూడా రాసింది. కొంపదీసి ఈ బెంగుళూరు ప్రయాణం కళ్యాణికి తెలిసి పోయిందేమోనని మంజరి భయపడింది. ఖర్మకాలి కళ్యాణి తనను నిలదీసి అడిగితే, ఏం చెప్పాల్సిందీ మంజరికి తోచలేదు.

ఇసుళ్లలాగా ఆలోచనలు ఆమెను ముసురుకొన్నాయి. ఆమే, తనూ తొలిసారిగా మెహతా ఆఫీసులో కలుసుకోవడం, ఇద్దరూ కలిసి అతగాణ్ణి ఆటలు పట్టించడం, ఆరాత్రి తను కళ్యాణి ఇంట్లో గడపడం, కళ్యాణి చెప్పిన గత చరిత్రా-ఇవన్నీ సినిమా పరిభాషలో -రీల్సులాగా, ఆమె మనోవీధిలో మెదిలాయి. ఈ మధ్యకాలంలో, తను కళ్యాణిని కలుసుకొని ఉండవలసిందనీ, అలా కలుసుకొనకపోవడం అన్యాయమనీ, ఆమె బాధపడింది. దురదృష్టమేమిటంటే, ఏదో ఒకటి రెండుసార్లు తప్పితే, తనకు కళ్యాణి జ్ఞాపకమే రాలేదు.

సాయంత్రానికి ముందుగానే, మంజరి మేకప్ చేసుకొంది. మేకప్ లేకుండా అసలు అడుగు బైటకు పెట్టడానికే వీల్లేదన్నాడు చలపతి. సినిమా స్టారన్న తరువాత గ్లామర్ పెంచుకోవాలి గానీ చంపుకో కూడదన్నాడు. తారల బతుకంతా గ్లామర్ మీదనే ఆధారపడి ఉందన్న అసలు రహస్యాన్ని కూడా చలపతి చెప్పేశాడు.

మేకప్ పూర్తికావడానికి దాదాపు గంటన్నరకు పైగా పట్టింది. బెంగుళూరు నుంచి తెచ్చిన చీర, జాకెట్ వేసుకొంది. నిలువుటద్దం ముందు నిలబడి ఒక్కసారి ఆపాదమస్తకం చూసుకొన్నాది మంజరి. ఆమె సౌందర్యం ఆమెనే ముగ్ధురాలిని చేసింది. ఈ అందమైన శరీరం ప్రక్కనే చలపతిని, వెంకటేశ్వర్లును, మెహతాను, పార్ట్నర్‌ను ఊహించుకొని చూసింది. ఎవ్వరూ సరిపోలేదు. సుతారంగా కింది పెదవి కొరుక్కుంటూ తన బొమ్మకు తనే కన్నుగీటింది మంజరి. అప్రయత్నంగా మంజరి పెదవుల మీద మెరుపులాంటి చిరునవ్వు వెలిగి అక్కడే ఇంకిపోయింది. తాయారు రాకపోతే, ఇంకెంతసేపు అలా చూస్తూ ఉండేదో ఆమెకే తెలీదు.

"ఇయ్యాల దేవకన్నెలాగుండారండీ అమ్మాయిగోరూ!" అన్నది తాయారు.

మంజరి చెక్కిళులు రవంత గండరించాయి.

"నిజంగానుటే తాయారూ?"

"నన్ను సంపుకొన్నట్టుంది అమ్మాయిగారూ! అప్సరసవోలె వున్నరుండీ! ఇంక జనం మీ ఎనకాతల-"

ఎవరో నెత్తిమీద పెఠీమని బాదినట్టు ఆగిపోయింది తాయారు. దానికి మనుషుల బలహీనతలు తెలుసు. అందులోనూ, అట్టడుగున బతుకుతున్న మనిషేమో, ఆ బలహీనలు మరింత స్పష్టంగా తాయారుకు అవగాహనవుతాయి.

"అమ్మాయిగారూ! యాడికెల్లినా మీ ఊసేననుకోరి! మీ అంతసక్కండి ఈ సినిమా స్టారుల్లో లేరంటండి! మీ గొంతు కూడా మా పసందుగా ఉంటుందంటండీ! మీరు డైలాగులు అంటావుంటే పైనపొయ్యే పచ్చులు కూడా ఆలకిస్తాయంటండీ! ఇంకో యాడాదిపోతే, మీరు యాకంగా బొంబాయి పట్నానికే మకాం ఎత్తేత్తారంటండి అమ్మాయిగారూ!".

మంజరి చాలా హాయిగా నవ్వేసింది.

"ఎవరన్నారే ఇవన్నీ నీతో?"

"ఓరనేదేందుండి, అమ్మాయిగారూ! నేనేడకెల్లినా మీవూసే యినపడతావుంటదనుకోండి! మా దొరసానమ్మగారు బొంబాయి ఎల్లకపోతే, ఇంకీ పట్నంలో ఎల్లేవోల్లే లేరని నేనంటావుంటనుండీ!"

"ఓసి నీ అసాధ్యం పాడుగానూ?"అన్నది మంజరి, దాని మాటలను ఔననిగానీ, కాదనిగానీ తేల్చకుండా, "ఉండవే, రేపెప్పుడన్నా మన కంపెనీలో కనుక్కుంటాను-చిన్న వేషమేదన్నా దొరికితే వేద్దువుగానీ! పాపం, లోగడ నన్ను నోరారా అడగను కూడా అడిగావు"అన్నది మంజరి.

"అదీ మీకాడ నైతేనే యాత్తానుండి! ఇంకోదాని దగ్గిర యాసం కట్టమంటే, నావల్లకాందడీ! మీ పాదాల్ని నమ్ముకోనున్నా. సినిమాలో కూడా మీ అడుగంటే ఉండాల్నండి"అని ఓ చిన్న షరతు కూడా పెట్టింది తాయారు.

మంజరి ఏదో అనబోయింది. కళ్యాణి కారు వచ్చి వాకిట్లో ఆగింది.

"నేనో పనిమీద పోతున్నానే తాయారూ! అయ్యగారొస్తే నేనీ రాత్రి రానని చెప్పు".

"సరేనండమ్మాయిగారూ!"అన్నది తాయారు.

మంజరి కారెక్కింది. ఓ చిన్న ఊగు ఊగి కారు బయలుదేరింది. కోడంబాకం గేటు దగ్గరికొచ్చేసరికి అదికాస్తా మూసి ఉంది. అటూఇటూ చాలా కార్లున్నాయి. తమకు ముందున్న ఓ కారుచుట్టూ చాలామంది మూగారు. కొంతమంది ఈలలు వేస్తున్నారు. ఇంకొంతమంది చప్పట్లు చరుస్తున్నారు. కొన్ని గొంతులు "వేలైక్కారి-వేలైక్కారి"అంటున్నాయి.

"ఏమిటదీ?" అన్నది మంజరి.

"ఎ.బి.సి,5473కారండీ!"అన్నాడు డ్రైవర్.

మంజరికేమీ బోధపడలేదు. ఆ సంగతి తెలిసినవాడల్లే డ్రైవర్ "సరసగారి కారండీ అది!"అన్నాడు.

ఆ పేరు మంజరికి చాలాపరిచితమయింది. అగ్రశ్రేణి తారాగణంలో సరస కూడా వొకతె. ఒకసారి కార్లో పోతుంటే, మంజరి ఆవిణ్ణి చూసింది. ఆ చుట్టూ మూగిన వారందరూ ఆమె ఫాన్సు! చలపతిగారు ఎప్పుడో అన్నాడు; సరసను చూడటం కోసం, ఆవిడ ఇంటిముందు గంటలకొద్దీ జనం నిలబడిపోతారని. భగవంతుని దయవల్ల, తనకూ నాలుగు పిక్చర్లు చిక్కి అందులో మంచి వేషాలో దొరికితే, తన కారు పోతున్నప్పుడు కూడా జనం ఇలాగే మూగుతారు. బహుశా ఇంతకన్నా

ఎక్కువమందే తనను చూడ్డానికి ముసరొచ్చు. సరసకు మంచిపేరయితే ఉంది గాని....

కారు పోర్టికోలో ఆగడమూ, డ్రైవర్ తలుపు తీయడమూ కూడా మంజరి గ్రహించే స్థితిలో లేదు. ఆవిడ ఆలోచనలన్నీ వేలాది ఫాన్సుమీదా, వారు రాసే ఉత్తరాలమీదా, శతదినోత్సవాల కెళ్లినప్పుడు తన ఆటోగ్రాఫుల కోసం విరగతొక్కుకు వచ్చే జనంమీదా ఉన్నాయి.

"హలో!"

మంజరి బుర్రంతా క్షణకాలం మొద్దుబారిపోయింది. ఆవిడ చుట్టూ చూసి, ఎదురుగా ఉన్న కళ్యాణిని పలకరించబోయి, నవ్వి ఊరుకొన్నది.

"హలో! ఎలా ఉన్నావమ్మా?"అన్నది కళ్యాణి.

"వెరీ వెల్"అన్నది మంజరి.

ఇద్దరూ మేడమీదికొచ్చారు. ఎదురుబొదురుగా కూచున్నారు.

"ఏమన్నా తింటావా?"అన్నది కళ్యాణి.

"వొద్దు".

"పోనీ, ఏ డ్రింకన్నా..."

"వొద్దక్కా!" అన్నది మంజరి.

"అలా వీల్లేదే చెల్లమ్మా! రెండు డ్రింక్సు తెప్పిస్తాను, అందులో లైట్‌గా -అబ్బే చాలా లైట్‌గా-కలపమని చెబుతాను. లాభంలేదు మంజూ! నువ్విలా తలతిప్పేస్తే వూరుకొనేదాన్నిగాను. ప్లీజ్, నాకోసమన్నా".

"తరువాత చూద్దాం"అన్నది మంజరి.

"దట్సాల్"అన్నది కళ్యాణి. "ఈమధ్య నీ దర్శనమే లేదేమిటమ్మా? రెండు మూడుసార్లు నువ్వుంటే ఎంత బావుంటుందా అనుకొన్నాను. నీకోసం వద్దామన్నా అడ్రస్ తెలీదాయె. జయాఫిలింస్‌లో అడిగితే చెప్పారు"అన్నది కళ్యాణి.

మంజరి గుండె గతుక్కుమన్నది. జయాఫిలింస్‌లో కళ్యాణికి ఏం చెప్పారు? తన ఎడ్రసా? తనిలా బెంగుళూరు వెళ్లినట్లుగానా?

"నువ్వు తప్పకుండా పైకొస్తావ్ మంజూ! భగవంతుడు మాకెవ్వరికీ లేని గొప్పవరం నీకిచ్చాడు. నీ అందం ముందు మేమంతా బలాదూరేననుకో"అన్నది కళ్యాణి నవ్వుతూ.

"ఏమిటక్కా నీ చాదస్తం?"

"నేనూ ఆడదాన్నయిపోయానుగానీ మంజూ! లేకపోతే నిన్నీపాటికి నిలువునా కొరుక్కుతినేసి ఉందును".

మంజరి సిగ్గుపడింది.

కళ్యాణి తను కూడా మంజరిపక్కనే కూచుని, ఆవిణ్ణి తనకేసి తిప్పుకొంది.

"కొన్నివిషయాల్లో మద్రాసు కన్నా బెంగుళూరు చాలా బావుంటుంది మంజూ! ఏమీ తోచనప్పుడు నేనలా వెళ్ళొస్తుంటాను. ఆ పార్టనర్ అతని పేరు ప్రసాద్ గదూ?"

"ఊఁ"అన్నది మంజరి.

"పిసినారికాడు...ఎంత బావుంటాయి మంజూ నీ కళ్లు? మంచి సీక్వెన్సులో, ఆ కళ్లకు రెండు క్లోజప్‌లిస్తే, జనం చచ్చి వూరుకొంటారనుకో"అన్నది కళ్యాణి.

"నీ ఉత్తరం చూసి, నీ వొంట్లో బావోలేదేమోననుకొన్నాను"అన్నది మంజరి.

''నిజంగా బావోలేదు మంజూ! నిన్నా, ఇవ్వాళా ఉన్న కాల్‌షీట్స్ అన్నీ కాన్సిల్ చేసేశాను. డాక్టర్ ఎక్కడికీ కదలొద్దనీ, బెడ్‌రెస్టు తీసుకోమనీ చెప్పాడు. ఈ ప్రొడ్యూసర్లేమో ప్రాణాలు తోడేస్తున్నారు. ఒకాయన ఇంతకు ముందు దాకా ఇక్కడే ఉన్నాడు. ఓ అరగంట అలా వచ్చి ఇలా వెళ్లమంటాడు. ఈ చిన్న సీనూ తీసేస్తే ఈ సెట్‌తో పనయిపోతుందంటాడు. ఇప్పటికే తను పీకలదాకా మునిగిపోయాట్ట. నన్నొచ్చి ఉద్ధరించమంటాడు. వెధవగోల, ఇంకో వారందాకా మాట్లాడొద్దని వచ్చేశాను. అయినా, మళ్లా పొద్దుటే తయారవుతాడు, ప్రాణాలు కొరుక్కు తినేస్తాడు. రోజుకు ఇరవైగంటలు పనిచేసినా తరగడం లేదు మంజూ!''అన్నది కళ్యాణి.

మంజరికిదంతా చిత్రంగా తోచింది. వేషాలు దొరక్క నానాబాధలూ పడేవాళ్లు పడుతుంటే, కొంతమంది వేషాలు వెయ్యలేకా, తీరుబాటులేకా చచ్చిపోతున్నారు.

''నువ్విక్కడ లేవు, ఏదో ఆలోచిస్తున్నావు''అన్నది కళ్యాణి.

''లేదు, లేదు''అన్నది మంజరి సర్దుకొంటూ.

''బుకాయించకమ్మా పిల్లా! కొంపదీసి ప్రసాద్‌గానీ జ్ఞాపకం రాలేదు కదా?''

''లేదు''అన్నది మంజరి నవ్వి.

''తరువాత నువ్వేనొప్పుకుంటావుగానీ, ముఖ్యంగా నీక్కొన్ని సలహాలిద్దామని పిలిపించాను. అసలు వొంట్లో బావుంటే, నేనే వద్దామనుకున్నాను. డాక్టరేమో కదలకూడదన్నాడాయె. అదీగాక అడుగు బయటపెడితే జనం చుట్టేస్తారాయె. ఈ బాదరబందీ పడలేక నిన్నే పిలిపించాను. నీకీరాత్రి ప్రోగ్రామేమీ లేదుగా?'' అన్నది కళ్యాణి. ''ప్రోగ్రాం'' అన్నపదం వచ్చినప్పుడు ఒక కన్ను సగం మూసి నవ్వుతూ.

మంజరి కూడా నవ్వి ''ఊఁహు''అన్నది.

''డాక్టర్ వద్దన్నాడు గానీ, నేను మాత్రం సిగరెట్ కాల్చకుండా ఉండలేకపోతున్నా నమ్మాయ్! ఎవరన్నా ఫ్రీగా మాట్లాడేవారుంటే ఆ ధ్యాసలో పడి కాస్సేపన్నా మరచిపోవచ్చు. మధ్యాహ్నం వొద్దు వొద్దనుకుంటూనే, అయిదారు సిగరెట్లు కాల్చేశాను. ఆయా చూసి దాచేసింది. కుర్రాణ్ణి పంపించి మరో పాకెట్ తెప్పించాను. నీ బ్రాండ్ ఇదేనా?''

మంజరి ఆశ్చర్యంగా కళ్యాణికేసి చూసింది. కళ్యాణి సిగరెట్లు కాలుస్తుందని ఆవిడ కింతవరకూ తెలీదు.

''అదేమిటి మంజూ? అలా చూస్తావేం? నువ్వసలు స్మోక్ చెయ్యవా ఏం ఖర్మ?''

తను అంతగా దిమ్మరపోయినట్లు కనిపించి ఉండకూడదని మంజరి అనుకొనేవేళకే పరిస్థితి చేయి దాటిపోయింది.

''ఆఖరికి మంచి సిగరెట్ కూడా కాల్చుకోకపోతే ఈ సంపాదనంతా ఎందుకమ్మా- తగలెయ్యనా? ఇష్టమొచ్చింది ఇష్టమొచ్చినంత తినే ప్రాప్తం మనకెటుగూడీ లేదనుకో. కనీసం ఆవార మిగతా వాటిల్లోనన్నా పూడ్చుకోకపోతే ఎలా?- ఇది వరకు నీకీ అలవాటు లేకపోతే లేకపోయింది. ఈ క్షణం నుండన్నా ప్రారంభించు. ఇంద... ఈ బ్రాండ్ చాలా మంచిది; మంజూ! ప్రతి నెలా నేను రెండుమూడు టిన్నులు తెప్పిస్తుంటాను. చాలా మైల్డ్‌గా ఉంటాయి. లంగ్స్‌కేమీ దెబ్బ తగలలదు'' అన్నది కళ్యాణి.

మంజరి తన కొద్దంటే వొద్దన్నది.

"ఇవ్వాళంటే నువ్వు కాల్చనన్నా నేనూరుకొన్నాను గానీ, ఇంకోరైతే ఊరుకుంటారా? నువ్వు తప్పకుండా సిగరెట్ కాల్చి తీరవలసిన సందర్భాలు బోలెడొస్తాయి. అప్పుడు దేబెముఖం వేసుకొని దిక్కులు చూడనన్నా చూడాలి. లేదా ఆ నిమిషం నుండే కొత్తగా ప్రారంభించనన్నా ప్రారంభించాలి. ఆ గొడవలేవో అప్పుడు పడటం కన్నా, ముందుగానే, వాటన్నింటికీ మనం అలవాటుపడి ఉండటం మంచిది. మాటవరసకు మన ప్రసాదే సిగరెట్ కాల్చమన్నాడనుకో, నువ్వుకాదంటావా? అనవు. అనకూడదు కూడానూ! సోసైటీలో మూవ్ అవుతున్నప్పుడు, అందరికన్నా ఓ అడుగు ముందుండాలి గాని వొకర్ని చూసి నేర్చుకొనే స్థితిలో మనముండకూడదు. మనం వొకళ్లకు నేర్పేటట్లుగా ఉండాలి. కాబట్టి డియర్!ప్లీజ్ ట్రై" అన్నది కళ్యాణి సిగరెట్‌ను మంజరికిస్తూ.

మంజరి సిగరెట్ తీసుకొంది. చూపుడువేలు బొటనవేలు కలిపి వాటి మధ్యన సిగరెట్‌ను ఇరికించింది.

"నో నో అలాకాదు"అన్నది పకపకలాడుతూ కళ్యాణి. "మరీ చుట్టను పట్టుకొన్నట్టు పట్టుకోకు. ఇలా సుతారంగా మధ్య వేలికి చూపుడు వేలికి మయంగా సిగరెట్టునుంచాలి. ఊఁ...గో(అ)న్. ఇంద లైటర్...".

మంజరికాస్సేపు సిగరెట్ కేసి చూసి, నోట పెట్టుకోబోయి, చప్పున తీసేస్తూ ఏమిటోనక్కా! నాకు సిగ్గుగా ఉంది"అన్నది.

"సినిమా డైలాగ్సు కాస్సేపన్నా మరచిపోదాం మంజూ! ముందు నవ్వు కానివ్వు. తరువాత మాట్లాడుకొందాం"అని కళ్యాణి తొందరచేసింది.

మంజరికిక తప్పలేదు. అయిష్టంగానే సిగరెట్‌ను వెలిగించింది. పొగ ముక్కూ నోటాకమ్ముకొని, ఉక్కిరిబిక్కిరయిపోయింది. దానికి తోడుగా ఉమ్మి తడికి సిగరెట్ నాని పైకాగితం విడిలిపోవడంతో, నాలుక నిండా పొగాకు నలుసులు అతుక్కున్నాయి. మంజరి సిగరెట్‌ను విసిరేసి, పుక్కిలించింది.

"నువ్వేమన్నా అనుకో అక్కా! ఈ పనిమాత్రం నావల్లకాదు"అన్నది మంజరి.

కళ్యాణి సన్నగా నవ్వింది.

"పిచ్చిదానా! మనం చేసిన పనులన్నీ మనవల్ల అయ్యేవేనా? మొదట్లో నేనైనా ఇలాగే ఉక్కిరిబిక్కిరయ్యాను. రెండుమూడు రోజులకల్లా అదే అలవాటయిపోయింది. ఒకసారి నేనూ సరసా పందాలు పెట్టుకొని కాల్చాం. నాకన్నా అదే రెండు సిగరెట్లు ఎక్కువ వూదేసింది".

"అసలీ అలవాటు నీకెందుకయిందక్కా?"అన్నది మంజరి.

"ఏదో పిక్చర్‌లో నా వేషం సిగరెట్ కాల్చవలసి వచ్చింది. ఎన్ని టేక్‌లు తీసినా నాచురల్‌గా రాలేదు. అందుకని పనిమాలా రెండుమూడు రోజులు అద్దం ముందు కూచుని, ప్రాక్టీస్ చేశాను. ఆఖరికి అలవాటయిపోయింది. దరిమిలా, ఈ అలవాటు నాకు బాగా అచ్చొచ్చింది మంజూ! మన దగ్గరి కొస్తుంటారే "ఫ్రెండ్స్"వాళ్లు మనచేత సిగరెట్ కాల్పించిందాకా వదలరు. కష్టమర్స్‌ను డిసప్పాయింట్ చేసి మనం బావుకొనేదేమీ లేదు గనక-వారికన్నా ఎక్కువగానే మనం కాల్చేస్తుంటాం".

మంజరి ఏదో అనబోయింది. ఫోన్ మోగడంతో అదేదో అనలేదు. కళ్యాణి విసుక్కుంటూ వెళ్లి రిసీవర్ అందుకొని, రెండునిమిషాలు ఊఁకొట్టి ఇస్సురంటూ వచ్చి కూచుంది. ఆవిడ ముఖం ఇప్పుడంత ఉత్సాహంగా లేదు. సోఫాలో జారగిలబడి కళ్లు మూసుకొంది. రెండు కణతలూ గట్టిగా నొక్కుకుంది.

"ఏమయిందక్కా?" అన్నది మంజరి ఆదుర్దాగా.

కళ్యాణి పెదవి విరిచి ఏమీ లేదన్నది.

"నేన్నమ్మను. నువ్వేదో దాచిపెడుతున్నావు...పోనీ ఆరోగ్యం బాగోలేకపోతే పడుకొందాం పద! ఈ కబుర్లు ఎప్పుడైనా చెప్పుకొందాం..."అన్నది.

కళ్యాణి నిట్టూరుస్తూ "అదేం కాదు మంజూ..."అన్నది.

"నేను చేయగలిగిందేమైనా ఉంటే చెప్పు అక్కా! నీకోసం తప్పకుండా దాన్ని చేస్తాను"అన్నది మంజరి.

"నిజంగానా మంజూ?"

"నీ తోడు"అన్నది మంజరి.

కళ్యాణి అమాంతం మంజరిని కౌగలించుకొని ముద్దుల్లో ముంచెత్తింది.

"నువ్వెంత మంచిదానివి మంజూ! భగవంతుడు నా చెల్లెల్ని తీసుకెళ్లినందుకు తిట్టాను గానీ, అంతకన్నా మంచి చెల్లెల్నిస్తాడనుకోలేదు"అన్నది.

"నాతో చెప్పడానికింత బాధపడటమెందుకక్కా?"

కళ్యాణి రెండుమూడు నిమిషాలు పాటు మౌనంగా ఉండిపోయింది.

"ఊఁ"అన్నది మంజరి చెప్పమన్నట్లుగా.

"ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో నాకు తోచకుండా ఉన్నది మంజూ! తీరా చెప్పాక, అక్కయ్య ఇలా అన్నదేమిటా అని నువ్వు అనుకొనిపోతావేమోనని భయపడుతున్నాను".

"భగవంతుడు సాక్షిగా నేనలా ఎప్పటికీ అనుకోను. నా మనస్సింకా నీకు తెలీదు. అక్కా! కావాలంటే నా చర్మం వొలిచి నీచేత పెడతాను-సరా?"అన్నది మంజరి.

కళ్యాణి చేయి చాపింది. మంజరి ఆ చేతిమీద తన చేతినుంచింది.

"ఏమిటంటే మంజూ...పోన్లే అమ్మాయ్! ఈగొడవలాదిలేద్దాం. ఇంకేమన్నా చెప్పు" అన్నది కళ్యాణి.

ఈసారి మంజరి కళ్ళల్లో నీటిజీరలు మోసులెత్తాయి. కళ్యాణి సున్నితంగా వాటిని తుడిచేసి, మంజరి కళ్లను ముద్దుపెట్టుకుంది.

"నిజంగా నేనిటువంటి విషయాలు నీతో అనకూడదు. కానీ తప్పనిసరైంది. నువ్వేమనుకొన్నా సరేనని చెబుతున్నాను"అన్నది కళ్యాణి సన్నగా నిట్టూర్చి.

"రాజన్ అని నాకు తెలిసిన కోటీశ్వరుడొకాయనున్నాడు మంజూ! ట్రిచ్‌లో ఆయనకు చాలా వ్యాపారులున్నాయి. దాదాపుగా వంద లారీలు నడుపుతుంటాడు. అతను నాకు చాలా రోజుల నుండీ తెలుసు. చాలాసార్లు నన్ను ట్రిచ్ కూడా తీసుకెళ్లాడు. ఇందాకనే వచ్చాట్ట. నన్ను హొటల్‌కి రమ్మని ఫోన్ చేశాడు. నా ఆరోగ్యం బావుంటే, ఏ గొడవా లేకపోను...ఇతన్ని డిసప్పాయింట్ చేయడం నాకిష్టం లేదు. నా 'బ్లూ మెర్క్యురీ' కారు అతనే ప్రెజెంట్ చేశాడు. నాకోసం చాలావేలు తగలేశాడు. ఆరు మాసాల తరువాత, ఇవ్వాళొచ్చి ఫోన్ చేశాడు. ఏం చెయ్యడానికీ నాకు తోచకుండా ఉంది"అన్నది కళ్యాణి.

మంజరికి విషయమంతా అవగాహనయింది. కానీ తను మాత్రం ఏమని చెబుతుంది గనకా!

"నీతో కులాసాగా గడుపుదామని నినున పిలిపిస్తే, మధ్యలో ఇదో తంటసం తగులుకొన్న దాయె చచ్చి...డాక్టరేమో అసలు కాలన్నా కదపకూడదంటాడు. నన్నడిగితే మనబోటి వాళ్లకు ఆరోగ్యం చెడిపోవడమంటూ జరక్కూడదు మంజూ! ఇప్పుడు చూడు ఎలాంటి గండకత్తెర వచ్చిపడిందో!

నామీద గౌరవంతో నువ్వు మాట దక్కిస్తావనుకో మంజూ! నువ్వు లేకపోతే నాగతేం గానా అని?''

మంజరి కళ్లు మూసుకుని నిట్టూర్చింది.

''నేనతనికి ఇప్పుడే ఫోన్ చేస్తాను మంజూ! నువ్వు నాచెల్లెలివని చెబుతాను. నువ్వు కూడా అతనడిగితే అంతే చెప్పు. మనిషి బంగారంలో మునిగి తేలుతుంటాడు. నువ్వెంత రొళ్లుకున్నా తెలుసుకోలేనంత డబ్బున్నవాడు. అతనికి గురి కుదిరిందంటే చాలు, నీకూ వో కారు 'ప్రెజెంటు'గా దొరుకుతుంది...అసలీ గొడవలన్నీ నీ కనవసరం అమ్మాయ్! అవేవో, నేనూ అతనూ చూసుకొంటాం...మరి నువ్వు బయలుదేరు. కింద కారు రెడీగా ఉంది. హొటల్ కైలాస్, రూమ్ నెంబర్ 24లో ఉన్నాడు. ఎర్రగా, బొద్దుగా ఉంటాడు''.

మంజరి లేచి నిలబడింది.

కళ్యాణి ఒకసారి మంజరిని ఎగాదిగా చూసి,రెండు బుగ్గలూ పుణికి, మెటికలు విరుచుకొంది.

''నిజంగా నిన్నక్కడకు పంపడం నాకిష్టంలేదు మంజూ! నిన్ను చూచినకళ్లతో, నన్ను చూస్తే భూతకిలాగా కనపడతాను. రాజన్ నాకిక దక్కుతాడన్న నమ్మకం కూడా లేదు. విష్‌యు గుడ్‌లక్''అన్నది కళ్యాణి కిందికి ఫోన్‌చేస్తూ. ''మంజూ ఎక్కడికో వెడుతుందిట కారు పంపించు. అవసరమయితే కారుతో సహా డ్రైవరును అక్కడే ఉండమను...''

మంజరి కిందికెళ్లిన పావునిమిషం కల్లా కారు కదిలిపోయిన చప్పుడు కళ్యాణికి వినిపించింది. కిటికీలోంచి, పోతున్న కారులైట్ల కేసే చూసి తనలో తనే నవ్వుకొంది కళ్యాణి. నవ్వుతూనే ఫోన్ చేసింది.

''యస్ డియర్! నేనే మాట్లాడుతున్నాను...మంజరి ఇప్పుడే బయలుదేరింది. ఇంకో పావుగంటకల్లా రూముకొస్తుంది. మళ్లా ఉదయమే పంపించు... బ్రహ్మాండమైన నాటకం ఆడితేనేగానీ వీలుపడింది కాదు. అనవసరంగా నా ప్రాణాలు తీశావు...వెరీగుడ్! ఉదయమే కలుసుకొందాం...''

కళ్యాణి సోఫాలో కూచుని ఎదురుగా ఉన్న అద్దంలో చూచుకొంది. మెళ్లో ఉన్న డైమండ్‌నెక్లెస్ కొత్త కాంతులలో తళుక్కుమన్నది.

❦❦❦❦❦❦❦❦

ఆరు మాసాల్లో పూర్తవుతుందనుకొన్న జయా ఫిలింస్ వారి సాంఘిక చిత్రం యింకో నాలుగు నెల్లకుగానీ పూర్తికాలేదు. మూడురీళ్లు తీశాక, ప్రసాద్ ప్రోద్బలం మీద, ఆ కథనంతా మార్చివేశాడు రచయిత. మొదటి వెర్షన్ ప్రకారం మంజరి పాత్రకు చెప్పుకోతగినంత ప్రాముఖ్యమేమీ లేదు. అది పూర్తిగా ఎక్స్ట్రా కారెక్టర్ కాదన్న మాటేగానీ, ఆ పాత్రకు కథలో పెద్దప్రమేయం కూడా లేదు. మంజరిని ఆవేషంలో చూడటానికి ప్రసాద్ ఇష్టపడలేకపోయాడు. అక్కడ నుండైనా కథను మార్చుదామనుకొంటే, అప్పటికే మూడు రీళ్ల పిక్చర్ తయారయి కూచుంది. అందుకని, ఆ నెగటివ్‌ను కాస్తా మూలపడేసి, మళ్లా హరివోం అంటూ ప్రారంభించారు. ఈసారి ఎన్నుకొన్న కథకూ, మొదటి దానికి ఎక్కడా పోలికల్లేవు. ఈరెండవ వెర్షన్‌లో మంజరివేషం సెకండ్ హీరోయిన్‌కు దీటైనటువంటిది. హీరో,హీరోయిన్‌ల కథ సుఖాంతమయితే, మంజరి పాత్ర విషాదంగా ముగిసిపోతుంది. తను చిన్నతనం నుండి మనసా,వాచా గాఢంగా ప్రేమించిన హీరోను మంజరిపాత్ర, తన స్నేహితురాలికోసం త్యాగంచేస్తుంది. సినిమా భాషలో ఇది గొప్ప సెంటిమెంట్ కింద లెక్క.

''కథ చాలా పకడ్బందీగా ఉంది. నీకు కట్టుకుపోయినంత సింపతీ వస్తుందనుకో''అన్నాడు చలపతి మంజరీతో.

కథను ఈపంపిణీ మీద మలచడంలో, చలపతి హస్తకౌశలం కూడా చాలా ఉంది. అతను రోజూ పనిమాలా కవిగారింటికెళ్ళి, మంజరికి ఇంపార్టెన్స్ వచ్చేలాగా సన్నివేశాలను పేనడం ప్రారంభించాడు. ఒకదశలో, మంజరినే హీరోయిన్‌గా చేస్తే బావుంటుందన్న ఆలోచన కూడా చలపతికొచ్చింది. కానీ-అంత సాహసానికి ప్రసాద్ సిద్ధపడలేకపోయాడు.

''ఇప్పటికే కంపెనీ కళ్యాణికి బోలెడంత డబ్బిచ్చింది. దాన్ని వొదులుకోవడంలో అర్థంలేదు. అదీగాక-బాగా పేరున్న స్టార్! ఫక్తు ఆవిడకోసం పిక్చరు చూసే జనం చాలామంది ఉన్నారు. పైగా మెహతా కావాలని కళ్యాణి పేరు మనకు సజెస్ట్ చేశాడు. ఆయన డబ్బు రెండు లక్షారైనా కంపెనీ ఖర్చు చేసింది. చిన్నవేషానికి కళ్యాణి వొప్పుకోవడమన్న ప్రశ్నే లేదనుకోండీ- అథవా వొప్పుకొన్నా, అన్ని వేలు పుచ్చుకొంటున్న దానిచేత, మనం చిన్నవేషం వేయించడం మాత్రం ఏం సబబు? రెండో వెర్షన్ ప్రకారం మంజరి కారెక్టర్ కూడా మంచిదే! హీరోయిన్‌కు లేని గ్లామర్ ఈ కారెక్టరుకుంది. ఈపిక్చరిలా పోనివ్వండి. రిజల్టు చూశాక, బావుంటే నెక్స్‌ట్ పిక్చర్‌కు, మంజరే మన హీరోయిన్''అన్నాడు ప్రసాద్.

చలపతికి ఇంకేమనడానికి అవకాశం లేకపోయింది. ఈ విషయమంతా మంజరికి చెప్పినప్పుడు ఆవిడ సంతోషించకపోగా చలపతిని ముక్కచీవాట్లు వేసింది.

''ఇలాంటి పనులు నాకు తెలీకుండా మీరెప్పుడూ చెయ్యకండి. కళ్యాణి మనస్సు బాధపడే పక్షంలో, నేనసలు ఏ వేషమూ వెయ్యను''అని ఖండితంగా చెప్పేసింది మంజరి.

''నన్నుద్ధరించడానికి వేషాలేస్తున్నావా?'' అన్నాడు చలపతి.

''కానేకాదు. నా ఉద్ధరింపుకోసమే వేస్తున్నాను. కనక నేనే గట్టిగా చెప్పాలిసొచ్చింది. నేనే స్వయంగా కాదంటున్నప్పుడు మీరెందుకు పట్టుకు పాకులాడుతున్నారో బోధపడదు. మనమీ విషయమై సాగదీసి మాట్లాడుకోవడం మానేద్దాం''అన్నది మంజరి.

చలపతి ఇంకేమీ అనలేదు.

ఇటీవల వారిద్దరి మధ్యాగల సంబంధాలు రవంత చెడిపోయినట్లు కనిపిస్తుంది. అయితే ఈ మాటలను చలపతిగానీ, మంజరిగానీ వొప్పుకోలేదు. మూడో ప్రాణి ఎదట వారింతవరకూ బయటపడని మాట నిజమే! కానీ, ఏక్షణాన ఈ అగ్నిపర్వతం పేలినా పేలవచ్చు.

మంజరి తన పట్టునుండి మెల్లిగా జారుకొంటున్నదనీ,రెక్కలొచ్చిన ఈ పక్షి ఎక్కువకాలం తన పంజరంలో ఉండదనీ చలపతి అనుమానించసాగాడు. అతని అనుమానాలకు ఆధారాలున్నాయి. చలపతి వద్దంటున్నా వినకుండా మంజరి రెండు దఫాలు రాజమణికి చాలా పెద్ద మొత్తాలు పంపించింది. ఆరోజు వారిద్దరూ శత్రువులకన్నా హీనంగా పోట్లాడుకొన్నారు.

''ఇది నాడబ్బు. దాన్ని నా ఇష్టం వచ్చినట్లు ఖర్చుచేసుకొనే హక్కునాకుంది. నేనైనా దుబారా చెయ్యపోవడం లేదు. తాగి తందనాలాడటంలేదు. మా అక్కయ్య ఇబ్బందుల్లో ఉండి పంపమన్నది. పంపుతున్నాను. ఇందులో మీరు రుంజుకోడానికి కారణమేమీ లేదు''అన్నది మంజరి.

''ఏదో వొకరోజున నీ నోట ఈ మాట వస్తుందని నాకు తెలుసు. డబ్బు నీదన్నమాట నిజమే! దాన్ని నువ్వు దుబారా చెయ్యటం లేదన్న మాటా నిజమే! అవసరమయితే మీ అక్కకు రెండుమూడు వందలు పంపించు. నేను కాదనను. వేలకు వేలు పంపి నువ్వేమయిపోదామని? ఖర్మగాలి ఈపిక్చర్ కాస్తా ఫ్లాపై కూచుంటే నీ ముఖం చూసేవాడే ఉండడు. అప్పుడు మన తిండికైనా గడవాలి గదా! కాస్తంత ముందు జాగ్రత్త పడమన్నాను గానీ, మీ వాళ్లను కాల్చుకు తినమని నేనంటానా? అయినా

రాజమణి నీకేమాత్రం రక్తబంధువో నాకు తెలీన సంగతా?'' అన్నాడు చలపతి.

''రక్తబంధువు కానిమాట నిజమే గానీ, మీకన్నా నాకది చాలా దగ్గర చుట్టం'' అన్నది మంజరి.

''అయితే నీ ఇష్టం వచ్చినట్లు తగలడు. నాకేమీ తెలీదు''అని తాత్కాలికంగా అస్త్రసన్యాసం చేశాడు చలపతి.

ఇహ చలపతి ఈ ఇంట్లో కాలుపెట్టడని తాయారు అనుకొంది గానీ మంజరి అనుకోలేదు. చలపతి వ్యక్తిత్వానికున్న విలువలేపాటివో మంజరికి క్షుణ్ణంగా తెలుసు. ఆరోజు వస్తాడని మంజరికూడా అనుకోలేదు గానీ, మొన్నాటి సాయంత్రంలోగా అతను రాక మానడనీ ఆవిడనుకొన్నది. అయినా చలపతి సాయంత్రానికే వచ్చి పాతిక రూపాయలు అడిగిపుచ్చుకొని వెళ్లిపోయాడు. మంజరి తనలోతను నవ్వుకొంది.

కళ్యాణి ప్రోద్బలం మీదనే మంజరి కోడంబాకం నుండి త్యాగరాయనగర్‌కు మకాం మార్చింది. అద్దెకింద నెలకు రెండువందల పైచిలుకు ఖర్చయిపోతోంది. ఇవన్నీ ఆలోచించి, కొంతకాలం దాకా తనా ఇంట్లోనే ఉంటానన్నది మంజరి! ఆదాయానికి ఖర్చులకూ పొంతన లేకపోతే ఉడ్డుకుడిచి చావాలిసొస్తుందన్నది.

''అందుకని నువ్వు పిసినారి బతుకు బతుకుతావా? అవసరాలను క్రమంగా పెంచుకుంటూ పోవాలి. ఆ మేరకు ఆదాయాన్ని కూడా సాధించాలి. డబ్బు పిండడం చాతగానివాళ్లు అవసరాలను కుదించుకొంటారు. వాళ్లు మంచాన్ని బట్టి కాళ్లు ముడుచుకునే మనుషులు. మనం కాళ్లను బట్టి మంచాలను మార్చుకునే మనుషులం. అదీ తేడా!''అన్నది కళ్యాణి.

''అయినా ఆయనన్నడిగి చూస్తాను''అని వోమాట అడ్డం వేసింది మంజరి.

''ఆయనెవరు?ఓహో చలపతినా?'' అని ఫక్కుననవ్వింది కళ్యాణి. ''వాణ్ణడిగితే ఏదీ కాదంటాడు. అవన్నీ నువ్వు వినకు. అసలు నువ్వింతకాలం ఆ గుహలో ఉండటమే నాకాశ్చర్యంగా ఉంది. మన విలువ మన పరిసరాలను బట్టి కూడా మారతుంటుంది మంజూ! బ్రహ్మాండమైన పాలెస్‌లో ఉండు, పదిమంది పనివాళ్లను పెట్టుకో, రెండు కార్లు కొనెయ్. అందాకా అణకువగా పడివుంటే, ఆచలపతిగాడిఓ కారు పడెయ్. బ్యూటిఫుల్ ఫర్నీచర్ పర్చేస్ చెయ్యి. నువ్వు వెళ్లనవసరం లేదు. ఏ కంపెనీవాడయినా రెక్కలు కట్టుకుని వాలతాడు. కనీసం రెండు ఫోన్లయినా ఉండాలి.పోతే-''

మంజరి ఫక్కున నవ్వింది.

''నా మాటలు నీకు నచ్చలేదు గదూ!''అన్నది కళ్యాణి.

''అందుక్కాదు. ఈ పూట నీకు మోతాదు మించింది. అందుకూ నేనవ్వింది. సరే మళ్లా కలుద్దాం''.

త్యాగరాయనగర్ వచ్చిందాకా కళ్యాణి వదల్లేదు. ఇల్లు కూడా తన సెక్రటరీ చేత కళ్యాణే ఫిక్స్ చేయించింది. ప్రసాదూ, మంజరీ వెళ్లి ఆ ఇంటిక్కావలసిన ఫర్నీచర్ పట్టుకొచ్చారు. వేయిరూపాయల వ్యయంతో, చలపతి నేలంతా తివాచీలతో కప్పేశాడు. మంజరి మేడమీది ఐదు గదులూ తన కింద ఉంచుకొన్నది. పనివాళ్లు, చలపతి కింద అంతస్తులో ఉంటున్నారు. చలపతి తను కూడా పైనే ఉంటానన్నాడు. మంజరి దాన్ని పడనివ్వలేదు.

''పైనేమిటి కిందేమిటండీ? దానికీ దీనికీ మధ్య మైళ్లదూరంఉన్నట్లు మాట్లాడతారేం? కింద బోలెడంత సామానుంది. దాన్నంతా పనివాళ్ల పరం చేసి మనంపైన కులుకుతూ కూచుందామంటారా?'' అన్నది మంజరి.

"అదన్నమాట సంగతి! అయితే చెప్పావు కాదేం? అవును సుమా? నువ్వన్నది రైటే! బోలెడంత డబ్బుపోసి కొన్నాం. చేతులు దాటాక యేమనుకొన్నా ప్రయోజనం లేదు"అన్నాడు చలపతి.

జయా ఫిలింస్‌వారి పిక్చర్ ఇక కొద్దిరోజుల్లో రిలీజవుతుందనగా, పబ్లిసిటీ కాంపైన్ ప్రారంభమైంది. ఈలోగా మంజరి మరొకసారి మెహతాను కలుసుకొంది. వాల్‌పోస్టర్సులో తన పేరు వెయ్యడమే చాలదనీ, తన బొమ్మ కూడా ఉండాలనీ మంజరి పట్టుపట్టింది. పనిలో పనిగా కళ్యాణి చేత కూడా చెప్పించింది.

"పిక్చర్ బాగా పోవాలంటే ఏదో వో విడ్డూరం ఉండాలి గదా మరి! జయా ఫిలింస్ వారి పిక్చర్‌లో మంజరి నటించడం విడ్డూరం! అందాల తార మంజరి అని బోల్డ్ లెటర్స్‌లో వేయించండి. సెక్సీగా ఉన్న ఓ స్టిల్ కూడా తగిలించండి. జనం జేబులు ఖాళీచేసి మీ పెట్టుబడికి ఇబ్బడిముబ్బడిగా ముట్టచెబుతుంది"అని సలహా ఇచ్చింది కళ్యాణి.

ఈ మాత్రం మెహతాకు కూడా తెలుసు. అతనుమట్టిలో నుండి బంగారం పోగుచేసే మనిషి. ప్రొడ్యూసర్ల ఖర్చుమీద అతను బ్రహ్మాండమైన వాల్‌పోస్టర్లు తయారుచేయించాడు. ప్రముఖ తారాగణం పేర్లకిందుగా మంజరి పేరూ, బొమ్మా వేయించాడు. పత్రిక ప్రకటనల్లో కూడా మంజరి పేరు చేర్చారు. పత్రికలు సినిమా వార్తలు ప్రచురించినపుడల్లా మంజరి పేరును అచ్చువేస్తూనే ఉన్నాయి.

చలపతి ఈ పత్రికలన్నీ పోగుచేసి మంజరికి చూపెడుతూ ఉండేవాడు. మొదట్లో ఎంతో ఆసక్తిగా మంజరి వాటిని చూసిందిగానీ, ఇప్పుడు తీరుబాటేలేదు. చలపతి సలహా మీద అరవ, హిందీ బాషలూ, కళ్యాణి సలహాననుసరించి, డాన్సుపాఠాలూ మంజరి నేర్చుకొంటోంది. ఆవిడకు సరిగ్గా నాట్యం రాని కారణాన, డాన్సులుండవలసిన రెండు సీక్వెన్సుల్లో ఇంకెవరినో పెట్టిషూట్ చేయవలసి వచ్చింది. జయా ఫిలింస్‌వారు పత్రికా ప్రతినిధులకు, నటీనటులకు, సాంకేతిక సిబ్బందికీ బ్రహ్మాండమైన పార్టీ ఇచ్చారు. ఆ తరువాత పిక్చర్‌ను చూపించారు. సినిమా ప్రపంచంలోని హేమాహేమీలందరూ వచ్చినప్పుడు ఎవరెవరితో ఏయే స్థాయిల్లో మాట్లాడాలో, ఎవరికి వంగి నమస్కరించాలో, ఎవరికి తలవంచితే సరిపోతుందో, చిరునవ్వుతోనూ, 'ఓ' అనడంతోనూ సరిపెట్టవలసిన వారెవరో చలపతి వైనవైనంగా మంజరికి బోధించాడు.

"ప్రొడ్యూసర్లు కూచునేచోట మన మనుషులు కొందర్ని ఏర్పాటు చేశాను. నువ్వొచ్చిన పుడల్లా వారు నిన్ను గురించి నాలుగు ముక్కలంటుంటారన్నమాట! సందర్భాన్ని బట్టి చప్పట్లు కొట్టడం, ఈలలు వేయడం కూడా చేస్తారు. వారికేదో మనం తరువాత ముట్టచెబుదాం. పనిలోపనిగా, మనం పేపరు వాళ్లకు రేపోపార్టీ ఇద్దామా?"అన్నాడు చలపతి.

"అవసరమంటారా?"

'తప్పకుండానూ! నువ్వు తప్ప ఈ పిక్చర్‌లో మిగతావాళ్లందరూ పాతవాళ్లే! వాళ్లకు పబ్లిసిటీ అవసరం లేదు. నీకే కావాలి. వరసగా నాలుగు పేపర్లు నువ్వెందుకూ పనికిరావని రాస్తే, మట్టికొట్టుకుపోతావు. మెహతా కాదుగదా,వాడి బాబు కూడా నీకిక వేషమిప్పించలేడు. తరువాత నీఇష్టం!"

"నా ఇష్టమేమిటండీ నా బొంద! అవసరమనుకొంటే అలానే చేదాం"అన్నది మంజరి.

షో ప్రారంభమయింది. టైటిల్స్‌లో తన పేరు చూశాక, మంజరి శరీరం జలదరించి నట్లయింది. హఠాత్తుగా ఆవిడకు రాజమణీ, వసంతా జ్ఞాపకం వచ్చారు. వాళ్లిద్దర్నీ రేపే ఈ సినిమా చూడవలసిందిగా జాబు రాయాలనుకొన్నది మంజరి.

మంజరి గడ్డితట్టను చంకన బెట్టుకొని గట్లమీదుగా, ఛెంగు ఛెంగున పాటపాడుకొంటూ రావడంతో సినిమా ప్రారంభమయింది.

''రావేర మా యింటికి
వొంటిగ నిదుర
రాదురా నాకంటికి
మామయ్యా!
మనసు కాజేశావు
వయసు దోచేశావు
దొంగోలె నాయెనక
తొంగిసూత్తుండావ!
రావేర మాయింటికి
ఒంటిగ నిదుర
రాదురా నా కంటికీ''

ఈ పాట అయిందకా సీత-మంజరి వేషం పేరు-ఇంటికి రాదు. ఈలోగా రెండు కొండలూ, ఒక నదీ, ఒక పూలవనమూ, ఓ గొర్రెలమందా, ఓ కొంగలగుంపూ సీత దాటేస్తుంది. ''ఒంటిగ నిదురా, రాదురా, నా కంటికీ'',అన్నప్పుడూ, ''మనసుకాజేశావు, వయసు దోచేశావు''అన్నప్పుడూ సీత చూపించిన వయ్యారం బ్రహ్మాండంగా ఉంది. కెమెరామేన్ ఈ రెండు సందర్భాలనూ క్లోజప్‌లో తీశాడు. చలపతి ఏర్పాటు చేసిన మనుషులు హాలు దద్దరిల్లిపోయేలా చప్పట్లు చరిచారు. ''తప్పకుండా పైకొస్తుంది'', ''వెరీబ్రైట్ ఫ్యూచరున్న ఆర్టిస్టు'', ''మార్వెలెస్ ఎక్స్ప్రెషన్స్'', ''బ్యూటిఫుల్ యంగ్ ఛామ్''లాంటి మాటలు అందరికీ వినపడేంత నిశ్శబ్దంగా అనుకొన్నారు. డైరెక్టర్, ప్రొడ్యూసర్, డిస్ట్రిబ్యూటర్, రచయిత కూడా మంజరి నటన చూసి సంతోషించారు.

''వండర్‌ఫుల్ డిస్కవరీ మిస్టర్ ప్రసాద్!''అన్నారెవరో జయాఫిలింస్ పార్ట్‌నర్ని.

''ఆ క్రెడిట్ నాది కాదు, మూర్తిగారిది. వారే నాకీ ఆర్టిస్టును ఇంట్రొడ్యూస్ చేశారు''అన్నాడు ప్రసాద్.

ఈ మాటలన్నీ చలపతి వింటూనే ఉన్నాడు. కార్యక్రమాన్నిప్లాను ప్రకారం నడిపిస్తూనే ఉన్నాడు. మధ్యమధ్య మంజరిని చూస్తూనే ఉన్నాడు.

నిజంగా మంజరి ఈ ప్రపంచంలో లేదు. కదులుతున్న తన బొమ్మను చూసుకొని మంజరి మనస్ఫూర్తిగా ఆనందించింది. లోగడ ఓ పిక్చరులో చిన్న వేషమేసినమాట నిజమేగానీ, దానికాట్టే ప్రాముఖ్యం లేదు. తనుగా చెప్పుకుంటే తప్ప ఆ వేషం ఎవరికీ గుర్తురాదు కూడాను. ఇదలాకాదు. మొత్తంకథ తన చుట్టూ తిరుగుతుంది. ఓరకంగా తనే హీరోయిన్. షూట్ చేసేటప్పుడు ఏ ఘట్టం ఎక్కడొస్తుందో, ఎలా వస్తుందో ఆవిడకు తెలీదు. ఒకే సెట్టుమీద, తన నవ్వూ,తన ఏడుపూ, షూట్‌చేశారు. తను సరిగ్గా ఏడవలేకపోయినపుడు శంకరంగారు ఉపయోగించిన టెక్నిక్ జ్ఞప్తికొచ్చింది మంజరికి.

అప్పటికి ఆయన చాలాసార్లు వోపిగ్గా చెప్పాడు. డైలాగ్స్ కూడా మార్పించాడు. అయినా మంజరి శోకాన్ని చూపించలేకపోయింది. శంకరం మండిపోయాడు. చేతిలోఉన్న కాగితాలను విసిరి మంజరి ముఖం మీద కొట్టాడు.

“నువ్వు గొడ్లు కాసుకోవలసిన బండమనిషివి, మా ఖర్మకాలి సినిమాల్లో కొచ్చావు. నాలుగు మాటలనడం చేతగాని పక్షివి, వేషం వేయాలనుకోవడం దేనికీ? ఇలా మా దుంప తెంచడం దేనికీ?ఎవడి బాబుగాడి సొమ్ముందనిక్కడ నీమీద రాఫిలిం ఖర్చుచేయడానికి? ఛా పో. నీముఖం చూపెట్టవాకు. నీకువేషం లేదు. గీషం లేదు. నీలెక్క చూచుకొని పట్టుకెళ్లు. ఫో ముందు”అన్నాడు శంకరం కొట్టడానికి చెయ్యి యెత్తుతూ.

మంజరి ముందుగా కొయ్యబారిపోయింది. కళ్లింత చేసుకొని శంకరంగార్ని చూసింది. చుట్టూ ఉన్నవారు ముసిముసినవ్వులు నవ్వుతున్నారు. అవమానంతో ఆమె గుండెలు మండిపొయ్యాయి. రెండుచేతుల్లోనూ ముఖం దాచుకొని, భోరుమని ఏడుస్తూ కుప్పకూలిపోయింది మంజరి.

రెండు మూడు నిమిషాలు గడిచాయి. గొల్లుమని నవ్వులూ, ఆవెంటనే చప్పట్లూ వినిపించాయి. మంజరి తలెత్తి చూసింది. శంకరంగారు ఆవిడ పక్కనే కూచుని ఉన్నాడు.

“వెరీనైస్, చాలా బాగా వచ్చింది”అన్నారాయన.

అప్పటికి మంజరికి బోధపళ్లేదు. ఆవిడ శంకరంగార్ని చూడలేక తలదించేసుకొన్నది.

“చూడమ్మా! ఇప్పుడు నువ్వేడ్చినంత నాచురల్‌గా ఇందాకనే ఏడిచి ఉంటే, నేనిన్ని మాటలు అనేవాణ్ణి కాదు. నీచేత సహజంగా ఏడ్పించడానికిదొక టెక్నిక్. అంతేగానీ, నిన్నేదో అన్నానని బాధపడకు. చాలా గొప్పగా వచ్చిందీ సీను. రేపు నువ్వే చూస్తావుగా!”అని ఓదార్చాడాయన.

ఇంకోసారి హీరోగారు మంజరికి వెనగ్గా వచ్చి నడుంచుట్టూ చేతులు వేసి దగ్గరగా లాక్కుని వొళ్ళో కూచోబెట్టుకొని ముఖాన్ని తనవేపు తిప్పుకొని ముద్దెట్టుకోబోతాడు. ఇక్కడ కూడా మంజరి చాలా పేజీలు పెట్టింది.

వీటిల్లో ఏ పనీ ఆవిడకు కొత్తగాకపోయినా, దయ్యాల్లాంటి లైట్ల ముందు, అంతమంది మనుషుల ఎదట, అలా హీరో వొళ్ళో కూచోడానికి వొప్పుకోలేదు. అప్పుడూ ఇంతే జరిగింది.

ఆ సంఘటనలన్నీ సినిమా చూస్తున్నంతసేపూ మంజరికి జ్ఞాపకం రాసాగాయి. ఒకచోట మంజరి వొంగుని ఆవుకు మేతవేస్తూ ఉంటుంది. అప్పుడు తీసిన క్లోజప్‌లో ముఖం, గొంతుతో బాటుగా ఆ దిగువభాగాలు కూడా కనిపించాయి. దాన్ని చూసి మంజరి సిగ్గుపడింది...

తనూ, హీరో ఉయ్యాల లూగుతున్నప్పుడు ఎక్కడా ఒక్క పిట్టన్నా లేదు. సినిమాలో అందుకు విరుద్ధంగా వున్నది. ఇక్కడ మంజరి హీరో ఉయ్యాలలూగుతుంటే ఇంకోచోట రెండు పిట్టలు ఓ చెట్టుకొమ్మమీద కూచుని ముక్కుకు ముక్కు ఆనించుకుంటాయి. ఇవన్నీ ఎలా వచ్చాయి?

సినిమా అయిపోయింది. చాలామంది ఆమెచుట్టూ చేరి అభినందించసాగారు. ఒకరిద్దరు ప్రొడ్యూసర్లు “టామిల్ తెరిమా?”అని కూడా అడిగారు. వారికి అరవంలోనే సమాధానం చెప్పింది మంజరి.

ఇందులో తన ప్రజ్ఞేమీ లేదనీ, శంకరంగారు, ప్రసాద్‌గారు, కవిగారు, మూర్తిగారు కలిసి తననిలా తీర్చిదిద్దారని, చలపతిగారు తనకు దేవుడులాంటి వారని, వీరందరి ఆశీర్వచన ఫలితంగానే తనీ మాత్రమైనా ధైర్యంగా చేయగలిగానని మంజరి తనను అభినందించడానికొచ్చిన వారి ముందు చెప్పింది.

మంజరిని మూడ్స్‌లోకి తెచ్చి వదిలేశాడు చలపతి. దాదాపు పదినిమిషాల పాటు ఆవిడ ధోరణిని గమనించాక, అతనికి ఫర్వాలేదనిపించింది. కాని, ఇప్పుడో చిక్కువచ్చిపడింది. తమకా కారులేదు. ఇంతమంది చూస్తుండగా టాక్సీలో వెళ్లడమంటే ప్రెస్టేజీ వుండదు. ఇంకోరి కారులో వెళ్లడమూ

భావ్యంకాదు. ఏమిటి చెయ్యడం?

చలపతి ఏమీతోచక ఉడ్డుకుడిచిపోతున్నాడు. అంతమంది మధ్యా అశాంతితో కుతకుతలాడిపోతున్నవాడు అతనొక్కడేనేమోననిపిస్తోంది. మంజరి తనచుట్టూ వున్నవారితో తూచితూచి మాట్లాడుతోంది. ఇతర డైరెక్టర్లు, ప్రొడ్యూసర్లు కనిపించినప్పుడు అతివినయంగా వంగీ వంగనట్లు వంగి నమస్కారాలు చేస్తోంది. ఇన్నీ చేస్తూనే చలపతికేసి సిగ్నల్స్ కోసం చూస్తూంది. మంజరి నెట్టుకురాగలదన్న నమ్మకం అతగాడికి పూర్తిగా ఉంది. అంచాతే, ఆవిణ్ణి వొంటరిగా వొదిలి ఇవతలకొచ్చాడు. మంజరి ఏమవుతుందన్న బెడద అతనికిప్పుడు లేదు. పరువుపోకుండా ఇంటికి చేరడమెలాగన్నదే సమస్య.

అతనోసారి నుదుటిమీద చెమటను తుడుచుకొని సిగరెట్ వెలిగించాడు. ఎవరో వచ్చి భుజంమీద చెయ్యి వేశారు. అలవాటు ప్రకారం చలపతి నమస్కారం చేశాడు.

''మీరు మంజరి తాలూకు వారేగదూ?'' అన్నాడా పెద్దమనిషి.

''అవు''నన్నట్టు తలాడించాడు చలపతి.

''మీతో మాట్లాడాలి. మనం ఓఅరగంటసేపు ఎటన్నా వెడదామంటారా? పోనీ, మా ఆఫీసుకు వస్తానంటే నాకభ్యంతరం లేదు. లేదా మీ ఇంటికి రమ్మన్నా వస్తాను''అన్నాడతను.

అతన్నెక్కడో చూశాడు చలపతి. కానీ ఎప్పుడు చూసిందీ, ఎక్కడ చూసిందీ జ్ఞాపకం రాలేదు. అయినా ఆ పెద్దమనిషి సినిమావాడేననిపించింది. సినిమావాళ్లను గుర్తించడంలో చలపతి పోలీసుకుక్కలకన్నా నైపుణ్యంగా వ్యవహరించగలడు.

''ఈ వేళప్పుడు మీ ఆఫీసుకు రావడం కుదరదు. వస్తామంటున్నారు గనక మా ఇంటికి వెడదాం పదండి. అయితే ఇంకో అరగంట దాకా ఆగాలి. మా కారు ఇంకెవర్నో దిగబెట్టడానికి వెళ్లింది'' అన్నాడు చలపతి.

''ఫర్వాలేదు. నాకారులో వెడదాం!''అన్నాడతను.

చలపతికి ప్రాణం తెరిపినబడినట్టయింది. అతడు గట్టిగా నిట్టూర్చి ''వన్‌మినిట్'' అంటూ మంజరి దగ్గరికొచ్చాడు. ఆమె ఇంకా మాట్లాడుతూనే వుంది. జనం క్రమక్రమంగా పలకచబడిపోతున్నారు. పత్రికలవాళ్లు ఇంకా అక్కడే తారట్లాడుతున్నారు.

''అయ్యా శర్మగారూ! రేపు సాయంత్రం మర్చిపోరు గదూ? మూర్తిగారూ? ఇంకోసారి పిలుస్తున్నాను. మీరు తప్పకుండా పార్టీకి రావాలి. లాస్టుటైం కూడా మీరు రాలేదు.ఏమండీ భగవాన్‌రావు గారూ, మర్చిపోరు గదూ? రేపు రాకపోయారంటే మీతో మాట్లాణ్ణు. హలో తంగవేలు! డోన్టు ఫర్‌గేట్ టుమారోస్ ఎంగేజ్‌మెంట్...ఓ.కె.ఛీరియో...''

మంజరి చొరవను చూసి చలపతి దిగ్భ్రాంతుడయ్యాడు. ఈ పంపిణీమీద పెరుగుతూ పోతే, మంజరినితను అందుకోవడం కల్లోనిమాట. ఈక్షణాన తను లేకపోయినా ఆవిడకేలోటూ లేదు. ఎంతలో ఎంతగా మారిపోయింది మంజరి!

''అయ్యా! మరి శలవు, మీతో చాలా సంగతులు మనవి చేయాలి. ఇప్పుడు టైంలేదు. రేపు ఎటూ కలుసుకొంటున్నాం గనక తీరిగ్గా మాట్లాడుకొందాం. అవతల ఎవరో ప్రొడ్యూసర్ మాకోసం చూస్తున్నాడు''అన్నాడు చలపతి.

మంజరి మరోసారి అందరికీ నమస్కరించింది.

''ఆయన సినిమా ప్రొడ్యూసరనుకొంటాను. మనింటికొస్తున్నాడు జాగ్రత్త!''అని ఉప్పు

అందించాడు చలపతి.

"సరే"నన్నట్టు తలపంకించింది మంజరి.

ఆ పెద్దమనిషి కార్లో ముగ్గురూ ఇంటికొచ్చారు. మంజరి డ్రెస్ మార్చుకొచ్చేలోగా చలపతి చాలా విషయాలు కూపీ తీశాడు. 'మన్నించాలి' అంటూ మంజరి కూడా రంగంలోకి ప్రవేశించింది.

"కూచో"అన్నాడు చలపతి. "వీరి పేరు మొదలియార్. నేను లోగడ చెప్పింది వీరిని గురించే. కొత్తగా ఓ ప్రొడక్షన్ ప్రారంభించారు. కథ, డైలాగ్స్ రెడీగా వున్నాయి. కొన్ని పాటలు కూడా రికార్డుచేశారు. నిన్నటిదాకా, అందులో వున్న సెకండ్ హీరోయిన్ వేషం ఇంకెవరికో ఇవ్వాలనుకొంటున్నారు. ఆ వేషం మనకిద్దామని వారి ఉద్దేశం".

మంజరికి వెంటనే "సరే"అందామనిపించింది. కానీ అనలేదు. ఎందుచేతనంటే చలపతి ధోరణిలో "లీడింగ్"లేదు. అతను కేవలం విషయం మాత్రమే చెప్పి వూరుకొన్నాడు. ఆ తరువాత తను అనవలసిన మాటలేవో సూచనగా అందించినప్పుడు; తను ఔననో, కాదనో అనాలి. అదేమీ లేనప్పుడు తను మెదలకుండా ఊరుకోవలసిందే!

"అలాగాండీ!"అన్నది మంజరి కళ్లు టపటపలాడిస్తూ.

"మీరు రెండు వెర్షన్లు తీస్తున్నారా?"అన్నాడు చలపతి.

"లేదు. ముందుగా టామిల్లో తీస్తాను. తరువాత తెలుగులోకి డబ్ చేద్దామనుకొంటున్నాను. ఇంకో పార్టనర్ వస్తానంటున్నాడు. అతను కూడా కలిస్తే, రెండు వెర్షన్లూ సైమల్ టేనియస్‌గా తీస్తాను. అలా జరిగితే దానిరేట్లు మాట్లాడుకొందామనుకోండి. ముందుగా టామిల్ వెర్షన్‌కు మీరెంత డిమాండ్ చేస్తున్నారో చెప్పండి"అన్నాడు మొదలియార్, మంజరికేసి చూస్తూ.

మంజరి నవ్వి చలపతిని చూసింది.

"ఏదైనా మీకు మాటివ్వడానికి భయంగా వుందండీ! ఇప్పటికే అయిదారు పిక్చర్లు చేతిలో వున్నాయి. అందరూ జనవరి, ఫిబ్రవరుల్లో పూర్తిచేయాలనుకొంటున్నారు. కాల్‌షీట్స్ సర్దగలమా, లేదా అన్నదో సమస్య. పోనీ ఎలాగో ఎడ్జెస్టుచేదామనుకోండి -శ్రమకు తగిన ఫలితం వుంటుందో లేదో కూడా మనం చూసుకోవాలి గదా!"అన్నాడు చలపతి.

"అదే చెప్పండి?"అన్నాడు మొదలియార్.

"మీ ఉద్దేశమేమిటి?" అన్నది మంజరి, ఏమీ అనకపోతే బాగుండదని.

"వేషం మంచిది. రొమాంటిక్ కారెక్టర్. వాంప్ టచెస్ లేవు కానీ సొసైటీ లేడీ. రెండు చోట్ల క్లబ్‌సీనులున్నాయి. అక్కడ డాన్సు చేయాలి. వీటిని ఫారిన్ పంపి, కలర్ చేదామని ఉంది. డిసప్పాయింట్‌మెంట్ లేదు, సారోనెస్ లేదు...మీకు సరిపోతుంది. టామిల్‌లో మీకు తొలిసారిగా అవకాశమిచ్చినవాణ్ణి నేనవ్వాలని నా కోరిక"అన్నాడు మొదలియార్.

"థాంక్స్"అన్నది మంజరి.

చలపతి కళ్ళెర్ర చేసి చూశాడు. తరువాత మొదలియార్‌కో సిగరెట్ ఆఫర్ చేస్తూ "క్షమించాలి"అన్నాడు. "మీరు మూడోవారు, కానీ ఈ తరహా, వేషమిచ్చిన వారిలో మీరే మొదటివారనుకోండి...నాదొక్కటే పాయింట్. ఓ పిక్చర్లో ఫస్టు హీరోయిన్‌గా మంజరి బుక్ అయింది. యస్-టామిల్ పిక్చర్‌లోనే! ఇంకో దాంట్లో పాథాస్‌రోల్ వేయడానికి ఎగ్రిమెంట్ కుదుర్చుకొన్నాం. అలాంటప్పుడు మీ పిక్చర్లో సెకండ్ హీరోయిన్‌గా వేస్తే, మార్కెట్ ఎలా ఉంటుందన్నదే మా సమస్య".

''ఏదైనా ఈ అమ్మాయి నాపటంలో ఉండాలి. మీరేమడుగుతారో అడగండి''అన్నాడు మొదలియార్.

చలపతికిదో గొడ్డుముడిలాగా కనిపించింది. తను ఎంత అడిగినా తక్కువే అడిగినట్లవుతుందేమోనని అతని భయం. అతని ఉద్దేశమేదో బయటికి లాగందే తనో అంకె చెప్పడం కన్నా పొరపాటు ఉండబోదని అతను గ్రహించాడు. మంజరికూడా అందుకు దోవలు వెదకసాగింది.

''మీరీ అమ్మాయిమీద ఎంత ఖర్చు చెయ్యదల్చుకున్నారో చెప్పండి!''అన్నాడు చలపతి.

''ఏదో అంకె నానోట పలికించిందాక మీరడగదల్చలేదనుకొంటాను. నేను మంజరికి అయిదువేలిస్తాను. కావాలంటే, రేపే మనం ఎగ్రిమెంట్స్ రాసుకోవచ్చు''.

చలపతి నవ్వి తల అడ్డంగా తిప్పేశాడు.

''కుదరదు లెండి, ఈ విషయం డ్రాప్‌చేసి ఇంకేదన్నా మాట్లాడుకొందాం''అన్నాడు చలపతి.

''కుదుర్చుకోవాలనుకున్నప్పుడు, రెండువేలు అటైనా ఇటైనా ఇబ్బంది లేదు. మీరుచెప్పమన్నారు గనక చెప్పాను. మీరడిగేదేదో అడగండి మరి!''

''అవతల నేను తీసుకొన్నంతైనా లేకపోతే, వేషం వేయడంలో అర్థం లేదు. పదివేలు వారి దగ్గర పుచ్చుకొంటూ అందులో సగం మొత్తానికి మీ కంపెనీతో ఎగ్రిమెంట్ కమిట్ కావడం ధర్మం కాదు. మీకు ముమ్మాటికి ఇష్టమైతే ఆ పదివేలూ మీరూ ఇవ్వండి''అన్నది మంజరి.

''ఆఖరిమాటగా అడుగుతున్నాను. ఎనిమిదిస్తాను. మీరు వేషం వేసినా సరే మానుకొన్నా సరే! ఏ సంగతీ నాకు ఫోన్‌చేయండి. మరి నేను వస్తాను''అన్నాడు మొదలియార్ లేస్తూ.

మంజరీ, చలపతీ కూడా లేచారు.

''అబ్బబ్బా! గీసిగీసి బేరం చేస్తారేమండీ? రేపు మీ వాటాకో పదిలక్షలు వస్తే నాకేమీ ఇవ్వరు గదా!''అన్నది మంజరి.

''వస్తుందన్న నమ్మకంతోనే ఉండాలి. మీనోటి చలవన అందులో సగభాగం వచ్చినా, మీకో కారు ప్రెజెంట్ చేస్తాను''అన్నాడు మొదలియార్ నవ్వుతూ.

''మొదలియార్‌గారు అసాధ్యులు మంజరీ! మనకెక్కడా చిక్కరు''అన్నాడు చలపతి.

''పోనీండి''అన్నది మంజరి. చలపతికేసి సన్నగా కన్ను గీటుతూ. ''వారు-మనమే కావాలని పనిమాలా వచ్చి అడుగుతున్నారు గనక, కాదనడం భావ్యంగా ఉండదు''అన్నది మంజరి. మొదలియార్ వేపు తిరుగుతూ. ''చూడండీ! మీరింతగా అడుగుతున్నారు గనక, మీ మాట ప్రకారమే కానివ్వండి. అయితే ఓ చిన్న షరతు ఉంది. నాచెల్లెలొకమ్మాయి ఉంది. అద్భుతంగా పాడుతుంది. నేను పాడవలసిన పాటలన్నీ దానిచేత పాడిస్తానంటే, ఎనిమిదివేలకే ఒప్పుకుంటాను. అందుగ్గాను ఆ అమ్మాయికి వేరే పే చెయ్యండి''.

''అంటే ఇంకోవిధంగా పదివేలు నానుండి తీసుకొంటున్నారన్న మాట!''అన్నాడు మొదలియార్‌నవ్వి.

''అలాకాదు. నన్ను ఎనిమిది వేలకే బుక్ చేస్తున్నారు. అదనంగా ఓ ప్లేబాక్ ఆర్టిస్టును తొలిసారిగా మీకు ఇంట్రడ్యూస్ చేస్తున్నాను''అన్నది మంజరి.

''బాగా పాడుతుందా?''

''ఎక్సలెంట్!'' అన్నది మంజరి.

''ఎవరన్నా బుక్ చేశారా?''

"ఆఫర్సున్నాయనుకోండి. ఎగ్రిమెంట్ చేసింది మాత్రం మీరే!"అన్నది మంజరి.

"పాట విన్నదాకా నేనేమీ గ్యారంటీ ఇవ్వను. పిలిపించండి. చూదాం, పాట నచ్చితే మీరన్నదే ఖాయం"అన్నాడు మొదలియార్, తన మార్జిన్ తనకుంచుకుంటూ.

"ఓ యస్"అన్నది మంజరి

చలపతి ముఖంలో ఏదో లోపించింది.

"వసంను పిలిపించబోతున్నావా?"అన్నాడు.

"మరే! మీ ఉద్దేశమేమిటి?"అన్నది మంజరి.

"అవతల ఆ పెద్దమనిషికి మాటిచ్చాక నా ఉద్దేశంతో పనేమీ లేదు మంజరీ! అయినా నువ్వేదో లాంఛనంగా అడగడమే తప్ప, నా ఉద్దేశాల ప్రకారం నడవాలన్న ఉద్దేశం నీకు లేదని నాకు తెలుసు"అన్నాడు చలపతి.

"ఏమోబాబూ! ఈ మధ్య మీరు పందెపు కోడిపుంజులాగా మారిపోతున్నారు. పోట్లాడటమే తప్ప, మీకింకో పనిలేదని ఎవరన్నా అనుకొని పోతారేమోనని నా భయం. మీకా బెంగలేదు. వసంతను పిలిపించడం మీకిష్టంకాకపోతే ఆ మాట స్పష్టంగా అనరాదా?"అన్నది మంజరి.

"రేపా పెద్దమనిషి, కేమని చెబుతావమ్మా?"అన్నాడు చలపతి.

"మీ ధర్మాన, నాకా విద్యలో కాస్త ప్రవేశమందిలెండి. నేను ఆమెకు కబురుపెట్టాననీ, ఈలోగా రెండు కంపెనీల్లో నెలజీతాలమీద కుదరడం వల్ల ఆవిడకు వీలుచిక్కలేదనీ అనేస్తాను. వసంతకైనా ఇప్పుడా అవకాశం మనమే బలవంతాన కల్పించాం".

"మనమని నన్ను కూడా కలపకు. నువ్వే కలిగించావు"అన్నాడు చలపతి.

మంజరి నవ్వింది.

"అవును గదూ! ఈమధ్య మనం విడిపోయాం. మీరు వేను నేను వేరూనూ. నేనేమిటో నాకు అంతో ఇంతో తెలుసు కానీ మీరెవరో నాకు బోధపడకుండా వుంది"అన్నది మంజరి.

చలపతి పకపకా నవ్వాడు.

"బ్యూటీఫుల్ డైలాగ్ మంజూ! వెరీ పవర్‌ఫుల్ డైలాగ్"అన్నాడతను.

చలపతి ధోరణిలోని మార్పును మంజరి గమనించింది.

"ఏమండీ! ఒక్కోసారి మనమే డైలాగ్ కూడా మార్చుకోవచ్చునటగా-నిజమేనా?"

"దానికింకా టైముంది, తప్పకుండా మార్చుకోవచ్చు. అలా మార్చుకొంటాం కూడాను. సాధారణంగా కవిరాసిన చెత్తంతా ఆర్టిస్టులనరు. వాళ్లకు నచ్చిన డైలాగ్స్ అంటారు. అయితే ఈ పప్పుల్ని అందరూ ఉడికించలేరు. టాప్‌రాంక్ ఆర్టిస్టులే ఉడికిస్తారు"అన్నాడు చలపతి.

"మరయితే, కవి, డైరెక్టరూ ఊరుకొంటారా? పేచీ పెట్టరా?"

"ఛస్తే ఆ పనిచెయ్యరు, ఒకరిద్దరు డైరెక్టర్లు తప్ప. తెలుగు ఫీల్డులో ఆర్టిస్టుల్ని కమాండు చేయగల నాథుడే లేడు మంజరీ! గట్టిగా మాట్లాడితే సగంలో వేషం కడిగేసుకొని వెళ్లిపోతారేమోనని భయం. ధ్వంసమయ్యేది ప్రొడ్యూసరు, ఫలానా డైరెక్టర్ ఆర్టిస్టులతో పేచీలు పెట్టుకొంటాడన్న, పేరొస్తే అతను గింజకుచచ్చినా ఒక్క పిక్చరు కూడా దొరకదు. ఆ డైరెక్టరుంటే, యాక్ట్ చెయ్యమని ఆర్టిస్టులు స్పష్టంగా చెబుతారు. అందరూ కాదు, చాలా కొద్దిమంది, వేళ్లమీద లెక్కపెట్టవచ్చుననుకో...ఇహ మిగతావారు వాళ్ల దయా ధర్మాలకోసం పాకులాడుతుంటారు..."

"ప్చ్"అని చప్పరించేసింది మంజరి.

చలపతి "బ్యూటీ"అన్నాడు.

"ఏమిటి కథ?"అన్నది మంజరి

చలపతి నవ్వాడు

"ఏం తెలివిరా నాయనా!"అనుకొన్నది మంజరి.

"నేనేమో అనుకొన్నాను గానీ, మనుషుల్తో మాట్లాడ్డం కత్తిమీద సాము చేయడంలాగా ఉంటుందండీ! నరాలన్నీ పీక్కుపోతామనుకోండి బాబూ! ఈ గొడవలతో ప్రాణం హైరానా పడిపోయింది. జ్వరం వచ్చినట్టుగా ఉంది. నేవెళ్లి పడుకొంటాను. ఎవరన్నావస్తే మీరే మాట్లాడి పంపేయండి"

చలపతి సమాధానం కోసం చూడకుండానే మంజరి మేడమీదికొచ్చింది. తాయారు ఫానువేసి, పొగలు చిమ్మే కాఫీ తెచ్చి బల్లమీద పెట్టి, రెప్పవాల్చకుండా మంజరికేసి చూడసాగింది.

"అదేమిటే?"అన్నది మంజరి.

"ఇందాకటి పిచ్చర్లో,మీ వేషం గుర్తుకొచ్చిందదండమ్మాయిగారూ! ఎంత బ్రెమ్మాండంగా చేసినారుండి! జనం ఇరగబడి సూత్తారనుకోండి...ఇంక మీరు పైకి ఎల్లినట్టేలేరి. మిగతా వాల్లంతా మీముందు బలాదూర్..."

మంజరి వినడం లేదని తెలిశాకగానీ తాయారు మానలేదు. నిజంగానే మంజరి వినడం లేదు. ఆవిడ ఆలోచనలన్నీ, ఇందాకటి సంఘటనల చుట్టూ తిరుగుతున్నాయి. తన నటనా, దాన్ని నలుగురూ మెచ్చుకోవడం, తనకోసం ప్రొడ్యూసర్లు వెంటపడటం, వేలమీద బేరాలు సాగడం-ఇన్నీ మంజరికి అమితమైన తృప్తినిచ్చాయి. శరీరం తేలికపడి గాలిలోకి తేలిపోతున్నట్టుగా ఫీలయింది. ఆవిడకిలాంటి జీవితమే కావాలి-కాదు-ఇంతకన్నా మంచి జీవితం కావాలి. తన పేరు మీదుగా నాలుగు బ్యాంకుల్లో ఎకౌంట్సుండాలి. నాలుగు కార్లుండాలి. బ్రహ్మాండమైన పాలెస్ ఉండాలి. నాలుగు టెలిఫోన్‌లుండాలి. తనకో ప్రొడక్షన్ కంపెనీ ఉండాలి. డిస్ట్రిబ్యూటర్లు, ప్రొడ్యూసర్లు తన గడపల్లో పడిగాపులు పడుతూ ఉండాలి. చిన్న ఆర్టిస్టులు, రచయితలు, టెక్నీసియన్లు రికమెండేషన్లకోసం తనను ప్రాధేయపడాలి. తన వందరూపాయల నోటుకు పదిరూపాయలకన్నా మించి విలువ వుండకుండా ఉండాలి...ఇవన్నీ తను సాధించవలసిందే. తను తప్పకుండా సాధించగలనని కూడా మంజరి అనుకొంది. ఆ లక్ష్యాన్ని చేరడానికి తనిప్పుడే ప్రయాణం ప్రారంభించింది! ఈ ప్రయాణంలో తనకు తోడ్పడే వాటిని ఆదరిస్తుంది. అనవసరమైన వాటిని విసర్జిస్తుంది. వేటిని ఆదరించాలో, వేటిని విసర్జించాలో తనకు తెలుసు..

"పోనీ నేను వెళ్లనా?"

మంజరి ఆలోచనలన్నీ చెదరిపోయాయి. ఓ క్షణం కలవరపడి చూసింది. జయాఫిలింస్ ప్రసాద్, నవ్వుతూ ఎదురుగా కనిపించాడు.

"మీరా?"అన్నది మంజరి, సోఫాలో ఓ పక్కకు సర్దుకొంటూ.

ప్రసాద్ ఆమెకు ఎదురుగా కూచున్నాడు.

"ఒంట్లో బావుండలేదనీ, పడుకొన్నావనీ చెప్పాడే చలపతి?" అన్నాడు ప్రసాద్.

"నిజంగా బావుండలేదనుకోండి, మీరీ రాత్రి నన్ను ఒంటరిగా ఒదిలి పెడతారా? వెళ్లరని నాకు తెలుసు. అయినప్పుడు, నా బాగోగులు మీకెందుకు చెప్పండి?" అన్నది మంజరి నవ్వుతూ.

ఆ నవ్వు సమ్మోహనాస్త్రం బాబులాగా పనిచేసింది. ఆ వాక్యాలు అతనిలోని పురుషత్వాన్ని

రెక్కొలిపాయి.

"నేను వెళ్లడం కోసం రాలేదు"అన్నాడు ప్రసాద్.

"వెడతారని నేనూ అనుకోలేదు"అన్నది మంజరి పకపకా నవ్వుతూ. "మీ సంగతి నాకు తెలీదు గనకనా, మోసపోవడానికి? ఏం చేశారో నాకు చెప్పడం రాదు గానీ నన్ను మాత్రం పూర్తిగా మైకంలో ముంచేశారు".

ఈ దెబ్బతో ఆ మానవుడు పూర్తిగా మైకంలో పడిపోయాడు.

"దోవలో కొచ్చాడు"అనుకొంది మంజరి.

"నేనేదో అనుకొన్నాను గాని, నువ్వు బ్రహ్మాండంగా యాక్ట్ చేశావు మంజూ! మొదట్నించీ నీమీద నాకా నమ్మకముంది. నా మాట దక్కించావు"అన్నాడు ప్రసాద్.

"ఇదంతా మీ దయ, మీ చలవ. కొత్తదాన్నని ఆలోచించకుండా మంచి పోర్షనిచ్చారు. నా శక్తివంచన లేకుండా కృషి చేశాను. మీ చేయూత లేకపోతే, నేనెక్కడ ఉండేదాన్నో నాకు తెలుసు"అన్నది మంజరి.

ప్రసాద్ ఓ క్షణం ఆగి, చిరు చిరుగా నవ్వాడు. అతని కళ్లల్లోకి తోడేలు చూపువస్తోంది.

"అయితే నాకేం బహుమతి ఇస్తావ్ మంజూ?"అన్నాడతను మంజరిని ఆపాదమస్తకం చూస్తూ.

"బహుమతా?"అన్నది మంజరి నవ్వి. "ఇవ్వడానికి నా దగ్గరేమీ లేదు. ఉన్నదేదో మీకెప్పుడో అర్పించాను. భగవంతుడు, నాకేదన్నా గొప్పవరం ప్రసాదిస్తే, దాన్ని మీకోసం నేనిస్తాను. అంతకన్న నేనేమివ్వగలను చెప్పండి?"

ప్రసాద్ ఇక స్థిమితంగా కూచోలేకపోయాడు. చేయిచాచి మంజరి చేతినందుకొని, ఆ వూపుతో మంజరి పక్కకొచ్చి కూచున్నాడు. ఆవిడ కళ్లుమూసుకొని, మెడ రిక్కించింది. ప్రసాద్ ఆమె చెంపల్ని అరచేతులతో అదిమి కళ్లు ముద్దు పెట్టుకున్నాడు.

"నీ కళ్లు ఎంత బావుంటాయి మంజూ! నువ్వు కంటారా చూస్తే నేను భరించలేను. నీ చూపులు, బాణాల్లాగా పొడిచిపొడిచి నన్ను చంపేస్తాయి"అన్నాడు.

"అయితే నా దగ్గరకు రాకండి. వెళ్లిపోండి"అన్నది మంజరి.

"వెళ్ళనా? నిజంగా?"

"ఓ యస్".

"చేతులు తియ్యి, పోతాను"

మంజరి అతని చుట్టూ చేతులు వేసి బిగించింది. క్షణక్షణానికి అవి మరింత గట్టిగా హత్తుకుపోతున్నాయి.

"పోనివ్వు"అన్నాడు ప్రసాద్, కొద్దిగా పెనుగులాడుతూ.

"నేను చేతులు తియ్యను. చాతనయితే తప్పుకు వెళ్ళండి. లేదా నేను పొమ్మన్నదాకా యిలానే, ఈ బందిఖానాలోనే ఉండిపోండి!"

"నన్ను చంపేస్తున్నావు మంజూ!"అన్నాడు ప్రసాద్ ఆమె చెవిలో.

"అబద్ధం. ఆ పనిచేస్తున్నది మీరే!" అన్నది మంజరి అంతకన్నా సన్నగా.

అతన్నొకసారి నిలువునా హత్తుకొని, పెదవులతో మెడకింద కితకితలు పెట్టి వదిలేసింది మంజరి.

"వీలు చిక్కింది గదాని వెళ్ళేరు జాగ్రత్త! అసలు నేనే వద్దామనుకొన్నాను. మరో అరగంటలో,

మీరు రాకపోతే వచ్చేసి ఉందును కూడాను...నో నో, మాటలూ వద్దూ, పాడూ వద్దు. నేను మధ్యాహ్నమే అన్నీ రెడీ చేశాను. నా బ్రాండే-రెండు బాటిల్స్ తెప్పించాను. సోడాలూ ఉన్నాయి. రేపటి నుండి, మళ్లా రొటీన్ పనులున్నాయి. ఆ తుక్కు బతుక్కు దూరంగా, ఈ రాత్రల్లా మనం ఇక్కడే వుంటున్నాం...ఇవిగాక ఇంకేమన్నా కావాలా?''అన్నది మంజరి.

''ఇవన్నీ అవసరమని నేననుకొంటుంటే ఇంకేమన్నా కావాలా అంటావేం మంజూ? నాకు నువ్వు కావాలి, నువ్వొక్కదానివీ చాలు-ఇంకేమీ వొద్దు''అన్నాడు ప్రసాద్.

''బాబూ! నే నెక్కడికీ పారిపోవడం లేదండీ! నేనుంటాను. సరేలెండి, నాకు తోడుగా ఇవి కూడా వుంటే. యింకా బావుంటుంది. ప్లీజ్, నన్నీ రాత్రి మీరేమీ కాదనకండి. నేనేం చేసినా మీరూరుకోండి. నేచెప్పినట్లుగా వినండి...ఈ రాత్రి నాకేదో పిచ్చెక్కినట్లుగా ఉంది...నన్నేదో ఇంద్రజాలంలో ముంచేసి, ఏమీ తెలీని నంగనాచిలాగా నిలబడతావేం? అదుగో-అలా నాకేసి చూశారంటే, నన్ను దయ్యాలు పట్టుకుంటాయి. ఆనక నన్ను నెపపెట్టి లాభం లేదు''.

ప్రసాద్ నిలువునా కరిగిపోయాడు. మంజరిపక్కనే ఉన్న బటన్ నొక్కింది. పెద్దపళ్లెంలో రెండు సీసాలు, సోడాలు, గ్లాసులు పట్టుకొచ్చింది తాయారు. వాటిని బల్లమీద ఉంచుతూ ''నమస్కారం బాబయ్యా!'' అన్నది తాయారు.

ప్రసాద్ తలపంకించాడు.

''ఏం బాబయ్యా! రోజుకోపాలన్నా అమ్మగారికి ఆవుపియ్యరాదా? ఆమెగారు అస్తమానూ మీ ఊసే నాకాడ అంటా ఉంటుందండీ! పిల్చకరా, పిల్చకరా అంటూ నన్ను తోల్తదండీ! మీరేమో ఆవుపియ్యరాయే! కాస్తంత నా తిప్పట తగ్గించండి బాబయ్యా!'' అన్నది తాయారు.

''అది లాభం లేదు లేవే తాయారూ! ఆయన్ని మనమే మేడ దిగకుండా చెయ్యాలి. గదిలో పెట్టి తాళం వేస్తే గానీ అయ్యగారి తిక్క కుదరదు. ఆ పని నీవల్లకాదు; నేనే చెయ్యాలి''.

తాయారు వెళ్లిపోయింది. మంజరి తనే గ్లాసులోకి వొంపి ప్రసాద్ కందించింది.

''నీకు?''

''కొంపతీసి, ఇదంతా మీరొక్కరే తీసుకొంటారేమిటి? కాస్త నాకూ మిగల్చండి. రెండు గ్లాసులూ కావాలని, మీరంటే తప్ప-ఒక్కటే సరిపోతుందనుకుంటాను''.

ప్రసాద్ ఓ గుక్కతాగి, ఇన్ని జీడిపప్పులు తిని ''హోవిట్''అన్నాడు మంజరితో.

మంజరి గ్లాసు ఖాళీచేసింది. ప్రసాద్ జేబులోంచి ఓ సిగరెట్ తీసి, వయ్యారంగా పెదవులకంటించింది. ప్రసాద్ లైటర్‌తో దాన్ని వెలిగించాడు. మంజరి గుండెలనిండుగా పొగ పీల్చి, ''ఉఫ్''మని ప్రసాద్ ముఖంమీదికి ఊదింది.

''సిల్లీగరల్''అన్నాడు ప్రసాద్, తనూ వో సిగరెట్ అంటిస్తూ.

ఓ సీసా పూర్తిగా అయిపోయింది. రెండో సీసాలో సగం కూడా అయిపోయింది. ప్రసాద్ కళ్ళ జ్యోతుల్లా మెరుస్తున్నాయి. మంజరి నైట్ గౌనుతో మిలమిలా మెరిసిపోతోంది. రేడియో గ్రామ్‌లోంచి, వెస్టరన్ మ్యూజిక్ మైల్డ్‌గా వినిపిస్తోంది. పైన ఫాన్ సోమరిగా తిరుగుతోంది. లావెండర్ వాసన గదంతా నిండిపోయింది.

''నిద్దరొస్తోంది''అన్నాడు ప్రసాద్.

''వొద్దు, మేలుకొని ఉండాలి. ఇందాక నేను చెప్పినట్టు వింటానన్నారు. నేను నిద్రపొమ్మనందే పోతానంటారేం?'' అన్నది మంజరి, అతని జుట్టులోకి వేళ్లు పోనిచ్చి గోముగా దువ్వుతూ.

ప్రసాద్ ఆమె కళ్లల్లోకి చూసి తలవొంచుకొన్నాడు.

"ఇలాగా-అచ్చంగా ఇలాగే-నీ వొళ్లో పడుకొని చచ్చిపోవాలని ఉంది".

మంజరి ఛట్టున అతని నోరు మూసింది.

"ఆ మాట అనవలసింది నేనుగానీ, మీరు కాదు"అన్నది అతని కనురెప్పల్ని పెదవులతో తడుపుతూ.

ప్రసాద్ పలకలేదు.

మంజరి ఓ క్షణం ఆగి, సన్నగా నిట్టూర్చి "నేనే సంగతి అడగనా?"అన్నది.

"ఊఁ"

"మీ నా మధ్య ఈ కంట్రాక్టులూ, ఎగ్రిమెంట్లూ ముళ్ళతొడుగుల్లా అడ్డుపడుతున్నాయండీ! మీరు ప్రొడ్యూసరుగానూ, నేను ఆర్టిస్టుగానూ ఉన్నప్పుడు, ఇవి అవసరమేననుకోండి. అదృష్టవశాత్తూ మనం అంతకన్నా దగ్గరకొచ్చాం. ఆ పాత సంబంధాలు పీడకలగా మర్చిపోకుండా ఇవి మనమధ్య ఉండటం మరీ దారుణం. మనం వాటిని రద్దుచేసుకొందాం"అన్నది మంజరి.

ప్రసాద్ ఆమె ముఖాన్ని జాగ్రత్తగా వెదికి "అవసరమా?"అన్నాడు.

"అని నేననుకొంటున్నాను...మీకాగితాలు చూసినప్పుడల్లా నాకు జెర్రులు పాకినట్లనిపిస్తుంది. మీరేమీ అనుకోనంటే వాటిని రేపే మనం రద్దు చేసుకొందాం".

"అవి మనకు అడ్డొస్తున్నదెక్కడ మంజూ?" అన్నాడు ప్రసాద్.

"అవి నాపెట్టెలో ఉన్నాయన్న జ్ఞాపకం నన్ను పొడిచి పొడిచి చంపేస్తోంది. అదీగాక-ఇంకే కంపెనీ వారడిగినా, మిమ్మల్ని పర్మిషన్ కోసం వేధించాలి డియర్! మనసులు కలవడమే కష్టం. అవి కలిశాక, మిగతావన్నీ కేవలం శుద్ధ వేస్టు"

"చూద్దాం"అన్నాడు ప్రసాద్.

మంజరి పలకలేదు.

కాస్సేపయ్యాక, అతను మంజరికేసి చూశాడు. ఆవిడ కళ్లు నీటితో నిండిపోయాయి. ప్రసాద్ ఉలిక్కిపడి లేచి కూచున్నాడు.

"ఏమిటిది మంజూ?"

"నేనేదో అనుకొన్నాను గానీ, నా అంత పిచ్చిముండ మరొకరుండరండీ! అందరూ తెలివైన వాళ్లే నేను తప్ప, పోనీండి. నా జాతకం అలాంటిది!" అన్నది మంజరి.

ఆమె గొంతు బొంగురుపోయింది కూడానూ!

"ఇప్పుడేమయింనీ కళ్ళంట నీళ్లు పెట్టుకోవడం? అలాగే రేపు కానిద్దాం...అనవసరంగా లేనిపోనివి ఊహించుకొని, ఈ స్వర్గాన్ని పాడుచెయ్యకు మంజూ! నీకేం కావాలో చెప్పు, అవన్నీ చెయ్యడానికి నేను సిద్ధంగా ఉన్నాను"అన్నాడు ప్రసాద్, ఆమె భుజాలమీద చేతులు వేసి కళ్ళల్లోకి చూస్తూ.

"నాకా? నాకా? నాకేమీ వద్దు! ఏమీ వద్దు! నిజంగా ఏమీ వద్దు- ఇలా-మీరు-శాశ్వతంగా నాపక్కనే ఉండటం కావాలి. అంతకు మించి ఏమీ వద్దు".

"తప్పకుండా మంజూ! మనం కలకాలం ఇలాగే ఉందాం. ఇలాగే ఉంటాం"అన్నాడు ప్రసాద్.

మంజరి ఇంకోసారి, అతన్ని ఆపాదమస్తకం హత్తుకొంది.

లైట్లు ఆరిపోయాయి.

# 14

ఉదయం కాఫీ తాగేప్పుడు, చలపతి ఆ రోజు చేయవలసిన పనులన్నీ మంజరికి జ్ఞాపకం చేశాడు.

"సాయంత్రం పత్రికల వాళ్ళొస్తున్నారు. ఎంత మందొస్తారో చెప్పలేను. మనం మాత్రం ఏర్పాట్లు బాగా చెయ్యాలి" అన్నాడు చలపతి.

"అలాగే"అన్నది మంజరి.

"మనం ఏదన్నా హొటలు వాళ్ళకు ఆర్డరివ్వడం మంచిదనుకొంటాను. చేసేదేదో గ్రాండ్‌గా చెయ్యాలి. పదిరూపాయలు వెదజల్లి, వంద రూపాయలు ఏరుకోవడంలోనే ఉంది తెలివి".

"అలాగే చేదాం!" అన్నది మంజరి, పరధ్యానంగా.

ఆవిడ దృష్టి సాయంత్రం పార్టీమీద లేదు, జయాఫిలింస్ వారి కాంట్రాక్టు మీద ఉంది. దాన్ని ఏదో విధంగా రద్దు చేయించాలని ఆవిడనుకొంది. అందుకు అవతల పార్టీని వొప్పించింది. కానీ, దీనివల్ల కలిగే ఫలితాలను తను ఆలోచించలేదు. ఏదో ఓ నిర్ణయం తను తీసుకోలేక కాదు, అలా చేసినప్పుడు కలిగే ఫలితాలేమిటో ఊహించకుండా నిర్ణయం చేయడంలో అర్థమేమిటిట? అదీగాక, తనీ విషయం చలపతితో ఇంతవరకూ అనలేదు. అతనభిప్రాయం కూడా తెలుసుకోవడం మంచిది.

"నాకేమీ తెలీదు, నీఇష్టం!" అన్నాడు చలపతి, పగ్గాలు వదిలేసిన రౌతులాగా.

మంజరికి కోపమొచ్చిందిగానీ, బయటపడనివ్వలేదు. ఉద్రేకాలను ఎప్పుడు అణచుకోవాలో, ఎప్పుడు బయటపెట్టాలో మంజరికి బాగా తెలుసు.

తన జవాబుతో, మంజరి తలకిందులయిపోతుందని చలపతి భావించి ఉంటే, అతను పూర్తిగా పొరపాటు పడినట్లే లెఖ్ఖ. మంజరి తలకిందులు కాలేదు సరిగదా, కనీసం నొసలు కూడా చిట్లించలేదు. పైగా చిన్నగా ఓ నవ్వు కూడా నవ్వింది.

"నన్నిలా నట్టడవిలో వదిలేసి నాకేమీ తెలీదంటే ఎలానండి? ఈవైరాగ్యం మొదట్నుంచీ ఉంటే అదోదారి. సగందాకా ఎక్కాక నిచ్చెన లాగేస్తానంటే, నే ననగలిగిందేమీ లేదు"అన్నది మంజరి.

అప్పటికీ చలపతి పలకలేదు.

"ఇవ్వాళేదో 'నీఇష్టం' అంటూ వేలెత్తి చూపుతున్నారు గానీ లోగడ చేసినవన్నీ నా ఇష్టప్రకారమే చేశారా? నాకిష్టంలేని పనులు నాచాత కట్టుకుపోయినన్ని చేయించారు. అవన్నీ నోరుమూసుకొని నేనూ చేశాను. అలా చూస్తారేం? నేనన్నది అబద్ధమా?" అన్నది మంజరి.

చలపతి మెట్లుదిగి నేలమీదికొచ్చాడు.

"రాత్రి ప్రసాద్ వచ్చినప్పుడే నువ్విటువంటిదేదో చేస్తావనుకొన్నాను. అన్నిటికీ అతనొప్పుకొన్నాడా?"

"ఆఁ"అన్నది మంజరి.

"అతనొప్పుకొని ఉండడు. నువ్వే బలవంతాన వొప్పించి వుంటావు. ఇటువంటి అభిప్రాయం నీకున్నప్పుడు కాస్తంత ముందుగా నాతో సంప్రదించి ఉండవలసింది" అన్నాడు చలపతి తన కసినంతా వెళ్ళబోసుకొంటూ.

"ఇప్పుడు సంప్రదిస్తున్నాగా, చెప్పరాదా?"అన్నది మంజరి.

"అసలాకంపెనీలో- ఏ కంపెనీలోనైనా సరే, జీతాల మీద కుదరడమే నాకిష్టం లేదు. అలా కుదిరిందాకా నా ప్రాణాలు తోడేశావు. ఇప్పుడేమో దాన్ని రద్దు చేయించమంటున్నావు. ఎలానమ్మా

నీతో చావడం?''అన్నాడు చలపతి.

మంజరి పలకలేదు.

''నన్నడిగితే'' అని ప్రారంభించాడు చలపతి. ''ఇప్పట్లో ఆ కంపెనీని వదలడం మంచిది కాదనే అంటాను. ఫలానా కంపెనీలో ఫలానా ఆర్టిస్టు ఉన్నదన్నప్పుడు మార్కెడ్ డిమాండ్ వేరు. ఖాళీగా ఉన్నదన్నప్పుడు అనుకొన్నంతగా అంబ పలకదు. అలవ సులవ ధరలకు అడుగుతుంటారు. కాబట్టి-''

''నన్నక్కడే ఉండమంటారు''అని పూర్తిచేసింది మంజరి.

''మరే!''

''అదేం వీలుపడదులెండి. ముందువెళ్లి ఆ విషయం చూసిరండి. ప్రసాద్ మనకోసం ఎదురుచూస్తుంటాడు. వస్తూ వస్తూ మొదలియార్ గార్ని కూడా కలుసుకొని రండి!''అన్నది మంజరి.

''నే చెప్పే సలహాను పాటించాలని అనుకోనప్పుడు, నన్నడగడమెందుకు మంజరీ?''అన్నాడు చలపతి.

''అడక్కుండానే మీరనదలచిందేమిటో నాకు తెలిసే ఉపాయం లేదు గనక''.

చలపతి ఇంకోమాట మాట్లాడకుండా లేచాడు.

''వేగిరం రండి. మళ్లా టీపార్టీ వ్యవహారాలు చూడాలి!''

''అలాగే'' అని వెళ్లిపోయాడు చలపతి.

చాలాసేపు మంజరి అక్కడే కూచుండిపోయింది. ఆవిడ బుర్రలో కందిరీగలు రొదపెడుతున్నాయి. తను సాహసించి చేస్తున్న ఈ పని ఎలా పరిణమిస్తుందో మంజరి తేల్చుకో లేకపోతోంది. ఆ వేళప్పుడు కూడా ఆవిడకు చిరుచెమటలు పోశాయి.

స్వతహాగా మంజరికి పేపర్లు చదివే అలవాటు లేదు. న్యూస్‌పేపర్లు చదవడం అసలే కిట్టదు. అందులోని వార్తలేమీ మంజరికి రుచించవు. అయినా, అన్ని పత్రికలూ ఆవిడ తెప్పిస్తున్నది. ముఖ్యంగా ఇతర భాషల్లోని సినిమా పత్రికలన్నీ ఆవిడకొస్తాయి. వాటిల్లో తన బొమ్మగానీ, తన్ను గురించిన న్యూస్‌గానీ ఉంటే ఆ కటింగ్స్ జాగర్తపరచమని చలపతికి చెబుతుంది. లేకపోతే అదీలేదు. వారం రోజులకిందట మంజరి ఇంకో పనికూడా చేసింది. కళ్యాణి పోరుపడలేక అయిదారువందల రూపాయల పుస్తకాలు కొన్నది. వాటన్నింటినీ చక్కగా బీరువాల్లో సర్దించింది.

''ఇవన్నీ నేను చదవను. కాస్సేపు పుస్తకం పట్టుకొంటే గుడ్లు పీక్కుపోతాయి'' అన్నది మంజరి.

''నేనూ చదవను. అయినా మూడు బీరువాల నిండా పుస్తకాలున్నాయి. ఎందుకుంచానని అడక్కు. అవి అలా ఉండాలి-అంతే! వాటి ఉపయోగం చాలా ఉంది'' అని సలహా ఇచ్చింది కళ్యాణి.

ఆ ఉపయోగమేమిటో ఆరోజుసాయంత్రం గానీ బయటపడలేదు. పత్రికలవాళ్ళకిచ్చిన పార్టీలో-అసలా పార్టీ ఏర్పాట్లే బ్రహ్మాండంగా ఉన్నాయి. లోపలి ఆరెంజిమెంట్స్ తాయారు చూస్తుంటే మంజరీ చలపతీ పక్కపక్కగా నిలబడి అతిథులకు స్వాగతం చెప్పారు. చలపతి ఆయా వ్యక్తుల స్థాయిలను బట్టి ''విష్'' చేస్తుంటే,, మంజరి కూడా దానికనుగుణంగానే ప్రవర్తించింది. కాస్సేపు పిచ్చాపాటీ మాటలయ్యాక, చలపతి అసలు విషయం ఎత్తాడు.

''గిరీశం అన్నట్టుగా మనవాళ్ళు ఏ ఆచారాన్నయినా అర్థం లేకుండా ప్రారంభించరు. చిన్నవారిని పెద్దవారు ఆశీర్వదించడం మన సంప్రదాయం. మా మంజరి, పెద్దలైన మీ అందరి ఆశీర్వాదాలనూ కోరుతున్నది. ఈ యుగంలో పత్రికలకున్న స్థానమేమిటో నాకన్న మీకే ఎక్కువ తెలుసు. ముఖ్యంగా

సినిమా పరిశ్రమలో ఆర్టిస్టులకు ఆయువు పట్టు పత్రికలు. మంజరి మీ అందరి దయవల్లా ఇప్పుడిప్పుడే వెలుగులోకొస్తున్న తార. ఆమెకు ఉజ్జ్వలమైన భవిష్యత్తు నివ్వవలసిందిగా భగవంతుణ్ణి ప్రార్థిస్తూ ఈ పార్టీని ప్రారంభిద్దాం''అన్నాడు చలపతి.

ముందుగా ప్రసాదూ, కాస్త ఆలస్యంగా మెహతా కూడా ఆ పార్టీకి వచ్చారు. వారిద్దరూ పక్కపక్కగా కూచుని ఉండటం చూశాక, మంజరికి వెంకటేశ్వర్లూ, కోటేశ్వరరావూ, మాధవరావూ, రామచంద్రమూ జ్ఞాపకం వచ్చారు. కళ్యాణి తన కాల్‌షీట్సనీ కాన్సిల్ చేసుకొని మధ్యాహ్నమే వచ్చింది. పార్టీలో ఎలా మెలగవలసిందీ, సాధారణంగా పత్రికల వాళ్లడిగే ప్రశ్నలూ, వాటికివ్వవలసిన జవాబులు కూడా కళ్యాణి చెప్పింది.

''ఇంకేమన్నా వస్తే నేనున్నాను. చలపతిగారున్నారు. మరేమీ ఫర్వాలే''దన్నది కళ్యాణి.

అనుభవజ్ఞులైన వారిద్దరి ఆధ్వర్యాన పార్టీ బ్రహ్మాండంగా జరిగింది. మంజరిని కూడా మాట్లాడమని కళ్యాణి బలవంతం చేసింది. మంజరి ససేమీ వొప్పుకోలేదు. అప్పటికి ఊరుకొన్నా, అయిదారు నిమిషాలకల్లా ఆ మాటకాస్తా కళ్యాణి బహిరంగంగానే అనేసింది. మంజరికిక తప్పలేదు.

''ఈ సంతోష సమయంలో నేనేమి మాట్లాడాలన్నా మాటలు తడబడుతున్నాయి. నేను ఆహ్వానించినంతనే వచ్చిన మీకందరికీ నా ధన్యవాదాలు. అసలీ పరిశ్రమకు నన్ను పరిచయం చేసిన మా చలపతిగారికీ, సాహసంతో మంచివేషమిచ్చిన ప్రసాదుగారికీ, నన్నెంతగానో ఆదరించి ప్రోత్సహించిన మెహతాగారికి, కళ్యాణి అక్కగారికి నా నమస్కారాలు!'' అని కూర్చున్నది మంజరి.

ఆ తరువాత పత్రికలవాళ్లు ఆమెతో గోష్ఠి జరిపారు. ఆమె చదువు సంధ్యలను గురించీ, అభిమాన గ్రంథాలను గురించీ, వ్యక్తిగతమైన అభిరుచులను గురించీ, అందాల అలంకరణలను గురించీ, చాలామంది చాలా రకాల ప్రశ్నలు వేశారు. మంజరి వాటికి ఆచితూచి సమాధానాలు చెప్పింది.

''స్కూలు డిగ్రీలే కావాలంటే, నాకసలేమీ చదువేలేదని చెప్పుకోవాలి. చిన్నతనంనుండీ బడికెళ్ళి చదుకోవడమంటే నాకెందుకో సరిపడేది కాదు. ఆపంతుళ్ళు, ఆ పలకలు, బలపాలు నాకు గిట్టేవి కావు. కాస్త వ్యక్తత వొచ్చాక, నాటకాలమీదకు మనస్సు పరుగులెత్తింది. మా నాన్న అమ్మా కూడా నన్ను కాదనలేకపోయారు. నేను స్కూలు నుంచి చదువుకొన్నదేమీ లేదు. జీవితం నుండీ, జీవితం నేర్పిన అనుభవాల నుండీ నేను పాఠాలు నేర్చుకొన్నాను. ఈ విశాల ప్రపంచమే నా పాఠశాల. నాకు నచ్చిన రచయితలు చాలామంది ఉన్నారు. ముఖ్యంగా శరత్‌బాబు నాకు చాలా ఇష్టుడు. తెలుగులో భారత, బాగవత రామాయణాలు నా అభిమాన గ్రంథాలు. వ్యక్తిగతంగా నేను ఒంటరితనాన్ని కోరతాను. నిజమైన కళ, వ్యక్తి ఏకాంతంగా ఉన్నప్పుడుగానీ, అనుభవించడానికి వీలుపడదు. ప్రజల్ని సంతోషపరచలేని కళ, అసలు కళే కాదని నా అభిప్రాయం''.

''మీకు అలంకరణలంటే చాలా ఇష్టమా?'' అన్నాడొక పత్రికా విలేఖరి.

''ఇష్టమేననుకోండి. కానీ చాలా కాదు''అన్నది మంజరి బితుకు బితుగ్గా కళ్యాణికేసి చూస్తూ.

కళ్యాణి''సెభాష్''అన్నది మెల్లగా.

''మీరు తీరిక కాలంలో ఏంచేస్తుంటారు?'' అన్నాడు ఇంకో విలేఖరి.

''నాకు తీరికే చాలా కొద్ది. అంటే బిజీ ఆర్టిస్టునని కాదు. ఎక్కువకాలం చదువుతుంటాను. మంచిపుస్తకం కంటబడితే చదువందే నిద్రపోలేను. రోజుకు రెండుమూడు గంటలు తమిళం, హిందీ నేర్చుకొంటున్నాను. ఇప్పుడా భాషల్లో నేను మాట్లాడగలను. తోటపని, వంట అంటే నాకు సరదా.

టైం ఉంటేనే వంట చేస్తుంటాను''.

''మీరు నాట్యం ఎవరి దగ్గర నేర్చుకొన్నారు?'' అన్నాడొకాయన.

''చిన్నతనంలో సత్యనారాయణ గారి దగ్గర ఐదేళ్లపాటు శాస్త్రీయ నృతం నేర్చుకొన్నాను. బెంగుళూరు పిళ్ళైగారి దగ్గర రెండేళ్లపాటు నానాట్యానికి తుది మెరుగులు దిద్దుకొన్నాను. సినిమా నటిగా జీవితం ప్రారంభమయ్యాక ఈ రంగానికవసరమైన పద్ధతుల్ని ఇప్పుడు అభ్యాసం చేస్తున్నాను''అన్నది మంజరి.

''కొత్తగా ఈ పరిశ్రమలో ప్రవేశించి నటిగా, ఈనాటి సినిమాలను గురించి మీ అభిప్రాయాలేమిటి?''అని వొకాయన అడిగాడు.

మంజరి ఏదో అనబోయింది.

కళ్యాణి చటుక్కున ఆదుకొంది.

''ఇంకా అనుభవం లేదు గనక, మంజరికో అభిప్రాయమంటూ ఉండదనుకొంటానండీ! ఏమమ్మా, అంతేనా?'' అన్నది కళ్యాణి.

''ఔను. నేనీ ప్రశ్నకు జవాబు చెప్పలేను''.

''తెలుగు నటీనటుల్లో మీకెవరి నటనంటే ఎక్కువ ఇష్టం?''

''వాళ్ళందరూ నాకు పూజ్యులు, విశేషమైన అనుభవం ఉన్నవాళ్ళు, నాకు గురుతుల్యులు''అన్నది మంజరి.

కళ్యాణి పెదవులు కసిగా నవ్వుకొన్నాయి.

తరువాత తన ఇంటినీ, తన పుస్తకాల బీరువానూ, చీరెలనూ చూపించింది మంజరి. కొంతమంది వాటిని కూడా ఫోటో తీశారు.

చలపతి వారిలో చాలామందిని విడివిడిగా కలుసుకొని, గుసగుసలాడటం మంజరి గమనించింది. అయిదారుగురితో ''రేపు కలుసుకోం''డని చెప్పడం కూడా ఆవిడ విన్నది.

అందరూ వెళ్లిపోయాక, చలపతి అయిదారు పేర్లూ, చెక్‌బుక్‌ను తీసుకొచ్చి మంజరి ముందు పడేశాడు.

''ఏమిటి?'' అన్నది మంజరి.

''వాళ్లను రేపు రమ్మన్నాను. మనం వాళ్లకేమన్నా ముట్టచెప్పాలి. నలుగురు నీ బొమ్మను ముఖచిత్రంగా వేస్తున్నారు. వాళ్లకు బ్లాక్‌మేకింగ్ ఛార్జీలు మనం ఇవ్వాలిసిందే! ఒకరిద్దరు నిన్ను గురించి వ్యాసాలు రాయబోతున్నారు''అన్నాడు చలపతి.

''అన్నీ పూర్తిచేసి పట్టుకురారాదా మంజరి సంతకం పెడుతుంది! చెక్‌బుక్ పడేస్తే ఏమయినట్లటా?'' అన్నది కళ్యాణి.

చలపతి ఓసారి మంజరికేసి ఇంకోసారి కళ్యాణి కేసి చూసి, కాగితాలు తీసుకొని వెళ్లిపోయాడు.

అతనటు వెళ్లగానే కళ్యాణి విరుచుకుపడిపోయింది.

''అమ్మాయి! నీ వ్యవహారంనాకేమీ నచ్చలేదు. అతనేమిటో నువ్వు స్పష్టంగా తేల్చుకోవాలి. ఈ ముసుగులో గుద్దులాటలు అట్టేకాలం సాగవు. అతన్ని ''ఆయ''నంటావా, ఆ అడవాపన్లు చెప్పకు. సెక్రటరీ అంటావా, ఇంత చనువు ఇవ్వకు''అన్నది కళ్యాణి.

''పోన్లే అక్కా! నువ్వు ప్రతిదానికీ-'' అని విషయాన్ని తేలవేసింది మంజరి.

''అలా జారిపోకు మంజరీ! మనం ఎప్పుడో వొకప్పుడు, ఈ ప్రశ్నకు జవాబు చెప్పుకోక తప్పదు.

అదేదో త్వరగా తేల్చుకోమనే నేనంటున్నది. ఆ తరువాత నీ ఇష్టం!''

''ఏంచేస్తే బావుంటుందో నువ్వే చెప్పాలక్కయ్యా ఆ విషయం మనం నిర్ణయించుకొందాం గానీ, ఈ పూట హడావుడికి అధమం వేయి రూపాయలన్నా అయ్యుంటాయి. మనవాడు, ఇంకేవో చెక్కులంటున్నాడు. ఉన్నదంతా అయిపోతే ఏమిటి చేయడమో తోచకుండా ఉంది. లేనిపోనిది ఇదోటి నెత్తిమీదికి తెచ్చిపెట్టాడు మావాడు'' అన్నది మంజరి.

''ఈ డబ్బు వృధా కాదు. దీనికి ఇబ్బడిముబ్బడిగా నీకు పబ్లిసిటీ వస్తుంది. దాన్ని గురించి నువ్వేమీ దిగులుపడకు. ఇక డబ్బు సంగతి. ఇందాకా ఎవరో మొదలియార్ అన్నావు గదా! అతన్ని కూడా నువ్వీ పార్టీకి పిలిచి ఉండాలిసింది. సమయానికి నాకూ జ్ఞాపకం రాలేదు. పోన్లేగానీ, రేపో పనిచెయ్యి. మీవాణ్ణి ఉదయమే మొదలియార్ దగ్గరికి పంపించు. అతనిని పిలుచుకు రమ్మను. నువ్వే స్వయంగా మాట్లాడు. ఎగ్రిమెంటు మీద సంతకం చేసి ఎడ్వాన్సు పుచ్చుకో రేపో రెండు వేలు నీ పేర బాంకులో క్రెడిట్ చేయిస్తాను. తరువాత చూసుకొందాం'' అన్నది కళ్యాణి.

''నీ రుణం తీర్చుకోలేనక్కా!'' అన్నది మంజరి సజల నేత్రాలతో, కళ్యాణి నవ్వి, మంజరి బుగ్గలు పుణికి వెళ్లిపోయింది.

మొదలియార్ రానూ వచ్చాడు. ఎడ్వాన్సు ఇవ్వనూ ఇచ్చాడు. కానీ, ఎగ్రిమెంటులో ఇరవై వేలని రాసి వుంది.

''ఇలా చేశారేం?'' అన్నది మంజరి నవ్వుతూ, ''పదివేలకే గీసి గీసి బేరం చేశారు గదా, అమాంతం ఇరవై వేలివ్వడానికి ప్రాణమెలా వొప్పిందబ్బా?''

''మీకు తెలియందేమీలేదండీ! ప్రొడక్షన్ ఖర్చులు అపరిమితంగా పెరిగిపోయాయి. బ్లాక్‌మనీ ఎడ్జెస్టు చేసుకోలేక చస్తున్నాం. అంచాత మీలాంటి వారి నుండి రసీదులు తీసుకోవాల్సి వస్తోంది'' అన్నాడు మొదలియార్.

మంజరి అయిదువేలు తీసికొని పదిహేనువేలకు రసీదిచ్చింది.

పత్రికల వారి మీద మంజరి ఖర్చు చేసిన డబ్బు మాంఛి లాభాలను తెచ్చిపెట్టింది. తనను గురించి రాసిన పత్రికలన్నిటికీ మంజరి జయా వారికి ఫోన్ చేసి ఎడ్వర్‌టైజ్ మెంట్లు ఇప్పించింది. వారు కూడా ఆ అదునులోనే తమ పబ్బం గడుపుకొన్నారు. సినిమా కథ రాసిన కవితోనే నాలుగైదు రకాలుగా ''చిత్ర సమీక్షలు'' రాయించి ఎడ్వర్‌టైజ్‌మెంటు బ్లాకులతో సహా ఆ కాపీలు కూడా ఇచ్చారు. కొందరా సమీక్షలనే యధాతధంగా వేశారు. ఇంకొంత మంది, భాష మాత్రం మార్చి, పిక్చరుకు ఆకాశానికెత్తుతూ సమీక్షించారు. ఒక పత్రికవారు, ఆ పిక్చర్‌మీద వేసి ప్రత్యేక సంచికైన ఖర్చు యావత్తూ అణాపైసలతో సహా జయా వారు ఇచ్చేశారు. ఏవో రెండుమూడు పత్రికలు మాత్రం, ఉత్తామధ్యమంగా రాశాయి. అందులోనూ, ఓ పత్రిక ఆ పిక్చర్‌నూ, మంజరినీ తూర్పారబట్టి వదిలేసింది. జయావారు చాలా బాధపడ్డారు. ఆ పత్రికను మంజరి కూడా చూసింది. వెంటనే మెహతాకు ఫోను చేసి ఆ విషయమేదో కనుక్కోమన్నది. ఎందుకైనా మంచిదని, కళ్యాణి చేత కూడా ఫోను చేయించింది. ఇరవై నాలుగ్గంటల్లోగా కావలసిన పనులన్నీ పూర్తయ్యాయి. మెహతా అన్ని కంపెనీలకూ ఫోనుచేసి, ఆ పత్రిక విషయం జ్ఞాపకముంచుకోమన్నాడు. ఆ ఒక్క వాక్యమూ చాలు, ఆ పత్రిక నడుం విరిగి కూలిపోవడానికి, చివరికి జరిగింది కూడా అదే! దరిమిలా ఆ పత్రికకు ఏ సినిమా కంపెనీ కూడా ప్రకటన ఇవ్వనే లేదు.

జయావారి పిక్చర్‌కు మంచి కలెక్షన్‌లే వచ్చాయి. కానీ కంపెనీ వాటాకు వచ్చిందాట్టే లేదు.

ఎందుకంటే, మెహతా ముందుగా తను ఇన్వెస్టు చేసిందంతా పిండుకొన్నాడు. అతను పెట్టిన ఖర్చులన్నీ కలిపి తడిసి మోపెడయ్యాయి. థియేటర్లలో జనం పలుచబడుతున్న వేళకు ప్రొడ్యూసర్లకు తమ పెట్టుబడిలో పదోవంతు రాలేదు. అప్పటికీ ఖర్చుకు జంకకుండా ఎక్లాసు, బిక్లాసు సెంటర్లలో ఏజెంట్లను పెట్టి, బాగా కాన్వాసు చేయించారు. ఆ సినిమాలోని పాటలపోటీని ప్రారంభించారు. అందులో ఉన్న తప్పులను ఎత్తిచూపిన వారికి వేయిరూపాయల నగదు బహుమతులిస్తామని ప్రకటించారు. ఈ ఊపుతో, ఇంకో వారం పదిరోజులు గడిచాయేగానీ, అంతకు మించి వొరిగిందేమీ లేదు.

ఈ సంక్షోభం నుండి ఆ కంపెనీని ఉద్ధరించినవాడు మెహతా. అతను ప్రొడ్యూసర్లను పిలిచి తన సలహా చెప్పాడు.

''మనం అర్థ శతదినోత్సవాలనూ, సంయుక్త శతదినోత్సవాలనూ జరపాలి. ఆ ఉత్సవాలకు యాక్టర్లనూ, టెక్నీషియన్‌లనూ పిలవాలి-రైటే! ఇంకా డబ్బు ఖర్చవుతుంది. కానీ, ఈ దెబ్బతో ఈవారా, ఆవారా కొట్టుకొస్తుంది. ఇంతకంటే ఇంకో తరుణోపాయం లేదు. ఈ విషయం ముందుగా మనం పత్రికలకివ్వాలి. థియేటర్ల దగ్గర పదిరోజులు ముందుగా పబ్లిసిటీ ఇవ్వాలి. ఇలా చేస్తే బావుంటుందని నా ఉద్దేశ్యం'' అని సలహా ఇచ్చాడు మెహతా.

జయాఫిలింస్ తరపున ప్రసాద్ ఇందుకు వొప్పుకున్నాడు. అయితే ఈ పని కూడా అనుకొన్నంత సాఫీగా జరగలేదు. టాప్‌రాంక్ తారలందరూ ఎడతెగని షూటింగుల్లో మునిగితేలుతున్నారు. రోజుకు ఇరవయ్ గంటలు పనిచేసినా వారికి పిక్చర్లు తెమలడం లేదు. అలాంటి వారు పదిరోజులు పని మానుకొని రావడం మాటలు కాదు.

జయాఫిలింస్ వారడిగితే వచ్చేవారు కాదేమో గానీ, మెహతా ఫోన్‌చేశాక, వీలుపడదనే ధైర్యం ఎవరికీ లేకపోయింది. లోపల తిట్టుకొంటున్నా పైకి మాత్రం అందరూ సంతోషంగా వొప్పుకున్నారు. ప్రయాణానికి ముహూర్తం నిర్ణయించుకొన్నాక ప్రసాద్ వచ్చి, ఆ విషయాన్ని మంజరికి తెలియచేశాడు.

''వరసగా వారం రోజులు మొదలియార్‌కు కాల్‌షీట్సిచ్చాను. నేనిలా వచ్చేస్తే బావుంటుందా?'' అన్నది మంజరి.

''నువ్వు లేకుండా నేను తెలుగుదేశానికెళ్లడం అసంభవం! స్టేజీమీద నువ్వు, కనిపించకపోతే జనం ఊరుకోరు. నువ్వు రావాలి''అన్నాడు ప్రసాద్.

''నా ఇబ్బందిని మీరు గమనించకపోతే ఎలా?'' అన్నది మంజరి.

''నిన్ను గురించి జనం ఏమనుకొనేది తెలుసుకోవాలని ఉంటే ఇంతకన్నా మంచి అవకాశం ఉండదు. నిన్ను పదిరోజులలూ ఉండమనడం లేదు గదా! ఫస్టు నెల్లూరు, సెకండ్ తెనాలి, థరుడు గుంటూరు. పోనీ, నువ్వు గుంటూరు ఉత్సవాలకు వచ్చేయి. చాలు, అవొక్కరోజూ ఉండి మొన్నాడు బయల్దేరవచ్చు. అవసరమయితే మొదలియార్‌తో నేను చెబుతాను''అన్నాడు ప్రసాద్.

''అతనొప్పుకుంటాడనుకోను''

''సరేనంటేనే రారాదా! అప్పుడు నీకేమీ అభ్యంతరం ఉండదు గదా?''అన్నాడతను.

''లేదు''.

ప్రసాద్ అప్పటికప్పుడే ఏదో నంబర్ డయల్‌చేసి, ''మీరో రెండు రోజులు మొదలియార్‌కిచ్చిన కాల్‌షీట్సు కాన్సిల్ చేయాలండీ, థరుడు ఫోర్తు చాలు...మంజరిని మేం గుంటూరు తీసుకువెడుతున్నాం. తను రాననడం బావుండదేమోనని భయపడుతోంది. మీరు నా గురించి -ప్లీజ్-హెల్పు

చేయండి-అలాగే-నేను మంజరిగారి ఇంట్లోంచి మాట్లాడుతున్నాను! ఏ సంగతీ పదినిమిషాల్లో నాకు-ఒ.కె. థాంక్సు"అని రిసీవర్ పెట్టేశాడు.

"ఎవరికేమిటి?"అన్నది మంజరి.

"చెబుతాను గానీ, నువ్వీలోగా నాకోమంచి కాఫీ తెప్పించాలి. నా ప్లాను ఫెయిలయితే తట్టుకోవడానికీ, సక్సెసయితే సంతోషించడానికీ దమ్ము కావాలి గదా మరి!" అన్నాడు ప్రసాద్.

అతను కాఫీ తాగడం కాకముందే ఫోన్ మోగింది.

"మీదేననుకుంటాను, చూడండి!" అన్నది మంజరి.

"కాయా పండా మంజరీ? భగవంతుడి దయవల్ల పండేననుకొందాం"అంటూ రిసీవర్ తీశాడు ప్రసాద్.

మరునిమిషంలోనే అతని ముఖం విప్పారింది.

"చాలా థాంక్సండీ! మీకు శ్రమ కలిగించినందుకు మన్నించాలి".

అతను ఉత్సాహంగా చిటికె వేసి, సిగరెట్ పొగను సుతారంగా మంజరి ముఖం మీదికి ఊదాడు.

మంజరి "ఉఫ్"మంటూ దాన్ని చెల్లాచెదురు చేసింది.

"మీ హీరోకు ఫోను చేశాను మంజూ! అతనికి హఠాత్తుగా మూడు నాలుగు తేదీల్లోసుస్తీ చేస్తుంది. అంచాత మొదలియార్‌గారికిచ్చిన కాల్‌షీట్సు కాన్సిల్. ఆ రెండు రోజులూ నవ్వు బెజవాడ, గుంటూరు రావచ్చు. సరేనా?"

మంజరి రిచ్చపడింది!

ఇదో నూతనానుభవం: ఇదేకారణం తను చెబితే మొదలియార్ వొప్పుకోడు. ఆ రానన్నది హీరోగనక, నోరు మూసుకొని ఊరుకొన్నాడు.

ఈ ప్రయాణం నిజంగా కళ్యాణికిష్టం లేదు. ఆవిడకు చాలా పనులున్నాయి. అదీగాక ట్రిచ్చి నుండి రాజన్ తనొస్తున్నానని ఫోనుచేశాడు. ఆవేళకు తను లేకపోవడం బావుండదు. అలాగని, మెహతాకు మాత్రం తను నొప్పికలిగించడం క్షేమం కాదు. అందుకని రాజన్‌కు రావద్దని కబురుపెట్టింది కళ్యాణి. మంజరి కూడా ఒకటే మోయిన సతపోరుతోంది. తను వెళ్ళకపోతే మంజరి కూడా వెళ్ళలేదు. అందరూ పోతున్నప్పుడు తను పోకపోతే కొక్కిరించినట్లుంటుంది. సగం ఆకారణంతోనే కళ్యాణి వొప్పుకుంది.

ఈ విషయాలన్నీ ముందుగానే వసంతకు జాబు రాసింది మంజరి.

"నన్ను తప్పకుండా కలుసుకోండి. అక్కను కూడా తీసుకురా. ఎక్కడుండేది రాయనవసరం లేదనుకొంటాను"అని ముగించింది ఉత్తరాన్ని.

ఆ ఉత్తరం రాశాకా, పోస్టు చేశాకా కూడా మంజరి మనస్సు గిలగిలలాడుతూనే ఉంది. వాళ్ళు తనను కలుసుకోవడం కాదు-తనే వాళ్లను కలుసుకోవాలి. కానీ టైమేదీ? ప్రసాద్ చెప్పిన ప్రోగ్రాం ప్రకారం, తనకు క్షణం తీరిక ఉండదు. నిజం కూడా అంతే!

రాత్రి 10గంటల దాకా షూటింగులో ఉండి, ఆదరా బాదరా రంగులు కడిగేసుకొని, మేకప్ చేసుకొని కార్లో పడేసరికే పన్నెండయింది. మధ్యలో, నెల్లూర్లో, గావును పదినిమిషాలు ఆగారు. పీచు పీచు తెల్లవారుతుండగా గుంటూరుకొచ్చారు. ఊరిబైటనుండే, ఊళ్లోని హడావుడి తెలిసిపోతోంది. రోడ్డుకడ్డంగా పెద్ద బానర్ మీద, "సినీ కళాకారులకు గుంటూరు ప్రజల స్వాగతం" అన్న

అక్షరాలు-చెమ్కీ అక్షరాలు -కనిపించాయి. కాస్త లోపలికొచ్చేసరికి చెట్లకూ, ఎలక్ట్రిక్ స్తంభాలకూ, గోడలకూ, సుస్వాగతం కాగితాలూ, సినిమా పోస్టర్లు కనిపించాయి. వాటిమీద తన బొమ్మను చూసుకొని ముగ్ధురాలయింది మంజరి. ఆవిడ బద్ధకమంతా చేత్తో తీసేసినట్లుగా వొదిలిపోయింది.

"అడుగో ప్రసాద్!"అన్నది కళ్యాణి.

ప్రసాద్ కారు తమకారుకు ఎదురుగా వస్తోంది.

"ఏమిటి హడావుడి?"అన్నది మంజరి.

"అప్పుడే ఏమయింది మంజూ! ఇవ్వాళారేపూ,మనం తోప తోప అయిపోతామనుకో. జనం నిజంగా మన్ని చంపేస్తారు".

"ప్రయాణం బాగా జరిగింది గదా!" అన్నాడు ప్రసాదు తన కారును, బాగా దగ్గరికి కోస్తూ. "ఊఁ-పదండి త్వరగా. ఇంకా ఎవ్వరూ మేలుకోలేదు. ఆలస్యమయిందంటే, మన్ని ఇక్కడే చుట్టేస్తారు".

గుంటూరు బజార్లను చూస్తుంటే మంజరి రక్తంలోకి కొత్త శక్తులేవో ప్రవేశించనట్లయింది. అమాంతంగా కార్లోంచి దూకి, వీధులవెంట పరుగెత్తాలనిపించింది. చిన్నతనం నుండీ తనకు తెలిసినవారినీ, తను తెలిసినవారినీ కలుసుకోవాలనీ వారికి ఊపిరి తిరక్కుండా కబుర్లు చెప్పాలనీ అనుకొంది. కారు జిన్నా చౌక్ దగ్గరకొచ్చేసరికి మంజరి ఆగలేకపోయింది. ఆ పక్క సందులోనే రాజమణి, వసంత ఉన్నారు. ఒకసారి వాళ్లను చూస్తూ; తనిలా హఠాత్తుగా వారి ముందు కనపడితే ఎలా ఉంటుంది?

"వన్ మినిట్ ప్లీజ్, ఇప్పుడే వస్తాను"అన్నది మంజరి.

కారు అప్పటికే ఆంజనేయస్వామి గుడి, గుంటగ్రౌండ్ దాటేసింది. మరో అయిదారు నిమిషాలకల్లా అరండల్‌పేటలోని ఓ పెద్దమేడముందాగింది. అప్పటికే ఆమేడ దగ్గర జనం ఉన్నారు. కొంతమంది చుట్టుప్రక్కల మేడల మీంచీ, ఇంకొందరు చెట్టమీంచీ ఆ మేడకేసి -సినిమా వాళ్లున్న మేడకేసి-చూస్తున్నారు.

"ఊఁ-త్వరగా పదండి"అని తొందరపెట్టాడు ప్రసాదు.

ముందుగా కళ్యాణీ, ఈ వెనుక మంజరీ దిగారు. కళ్యాణిని చూస్తూనే జనం 'ఓ' అని గోలకెత్తారు. మంజరిని చూసి "ఒంటిగ నిదురా, రాదురా నా కంటికి"అని ఎవడో పాడాడు. ఆ పాట జయాఫిలింస్‌వారి పిక్చర్లోది. సినిమాలో మంజరి వేషం పాడే పాట అది.

పది గంటలకల్లా యాక్టర్లూ, టెక్నీషియన్లూ కారుల్లో బయలుదేరారు. విడిది దగ్గర పోలీసులే గనక లేకపోతే వాళ్ళు కార్లెక్కడం కూడా అసంభవమయ్యేది. దోవ పొడుగునా జనం గుంపులు గుంపులుగా చేరిపోయారు. థియేటర్ దగ్గర సరేసరి.

మంజరి కొద్దిగా తల బయటికి పెట్టి చూసింది. కనుచూపు ఆనినంత మేరా ఒకటే జనం! పోలీసులు, తోసుకొస్తున్న జనాన్ని ఆలపేక సతమతమవుతున్నారు. తాబేలు నడకలతో కార్లు హాల్లోకి వచ్చాయి. పిక్చరింకా అరగంటదాకా ఉంటుంది. కానీ, కార్ల చప్పుడు విన్నాక అందరూ గొల్లుమని లేచారు.

ఆ జనసముద్రంలో ఈదుకొంటూ స్టేజీ దగ్గరకెళ్ళడమే బ్రహ్మప్రళయమయింది. హాలంగా సిగరెట్ల పొగతో, చెమట వాసనతో నిండిపోయింది. హాలు యజమాని మైకులో ఎన్నిసార్లు "విజ్ఞప్తి" చేసినా మణగలేదు. ఆఖరికో నటుడు లేచి అందర్నీ స్థిమితంగా కూచోమన్నాడు. అన్న పావుగంటగ్గానీ రద్దీ తగ్గింది కాదు. అందరూ లాంఛనంగా ఏదో మాట్లాడారు. కళ్యాణి ఆ సినిమాలోని డైలాగ్సే

నాలుగు చెప్పింది. మంజరికేమీ చెయ్యడానికి పాలుపోలేదు.

“నన్నే చెయ్యమంటావక్కా?”అన్నది మంజరి.

“ఏమీచెయొద్దు. ఒక్క నమస్కారం చేసి కూచో, చాలు”అన్నది కళ్యాణి.

తన వంతు వచ్చినప్పుడు ఆ పనే చేసింది మంజరి. కానీ అందరికీ ఊరుకొన్నట్లుగా, నమస్కారంతో ఈసారి జనం తృప్తిపడలేదు. ఈ సినిమాలో మంజరి పాడిన పాటలు పాడమనీ, ఆవిడ చేసిన(దనుకొంటున్న) రెండు డాన్సులూ కూడా తనవిగావనీ, తను కేవలం మూమెంట్స్ ఇస్తే, లాంగ్‌షాట్‌లో ఇంకెవరి డాన్సులోషూట్ చేశారనీ మంజరి ఎలా చెబుతుంది? చెప్పి ఆ గ్లామర్‌ను ఎలా చంపుకొంటుంది?

“ఊరుకొంటే లాభం లేదు నీకు సుస్తీగా ఉంది గనక పాడలేననీ, డాన్సు చెయ్యలేననీ చెప్పు”అన్నది కళ్యాణి.

విధిలేక రెండోసారి లేచి నిలబడింది మంజరి.

“నామీద మీకున్న అభిమానానికి కృతజ్ఞురాలిని. గత వారంరోజులుగా నా ఆరోగ్యం సరిగ్గా లేదు. జయాఫిలింస్‌వారు నా పుట్టింట్లో ఉత్సవాలను జరుపుతున్నారన్న ఉత్సాహంతో వచ్చాను. ఇంకోసారి నేను తప్పకుండా యిక్కడికొచ్చి మీరు కోరిన పాటలు పాడతాను. ప్రస్తుతం నన్ను మన్నించాలి”అని కూచున్నది మంజరి.

జనం ఇంకోసారి ఈలలువేసి, చప్పట్లు చరిచి, తమ ఉత్సాహాన్ని తెలియపరచారు. మళ్లా జనసముద్రాన్ని ఈదుకొంటూ కార్లు బయలుదేరాయి.

“ఈ పంపిణీ మీద నాలుగు ఆటలకూ మనం రావాలసిందేనా?”అన్నది మంజరి.

“ఆఁ”.

“నేనిక రాలేనమ్మా!”అన్నది మంజరి.

“చెంబెడు నీళ్ళకే ఉలిక్కిపడితే, కాగెడు నీళ్లెవరు పోసుకుంటారే తల్లీ! ఇప్పుడే ఏమయిందీ? ఈరాత్రిలోగా ఎన్ని గండకత్తెరలొస్తాయో చూడు. ఇంకే బలవంతమూ లేకుండా మనం సుఖంగా మద్రాసు చేరితే అదే పదివేలు”.

మంజరికి “బలవంతం”అంటే ఏమిటో చప్పున అర్థంకాలేదు.

“అవి కూడానా అక్కా!”అన్నది మంజరి కాస్సేపాగాక.

“ఆహా! ఎవడో తొక్కాయ్, వందరూపాయల నోట్లకట్టలు పంపించి, పార్టీకి రమ్మంటాడు, మానేస్తావా? ఒకసారి నేను విశాఖపట్నం వెళ్లాను మంజూ! ఏదో హెూటల్లో దిగాను. పగలల్లా ఈలాంటి వ్యవహారాలలో సరిపోయింది. శరీరమంతా విరగ్గొట్టినట్లయింది. తల చిటచిట లాడిపోతోంది. వచ్చిన వాళ్లమీద చిరాకుపడ్డానికి లేదు. నవ్వుతూ తీయగా మాట్లాడి పంపేయాలి. అలానే చచ్చాను. రాత్రి పదిగంటలకు రూముకొచ్చి, స్నానం చేశాను. అన్నం తెచ్చే సర్వర్ తలుపు చేర్లవేశాడు. వాడి చేతిలో పెద్ద చాకు ఉంది. నేనేమాత్రం అరచినా, వాడో నేనో చావ్వలసి వచ్చేది. వాడి సాహసం చూశాక, “పోన్లేపాపం”అనిపించింది మంజూ!..అదుగో చూశావా! సంతకాల వేటగాళ్ళు ఎలా తయారయ్యారో?”

విడిది దగ్గర చాలామంది చిన్న చిన్న పుస్తకాలు పట్టుకు నిలబడ్డారు. వారందరికీ ఆటోగ్రాఫులు కావాలి. కొందరు చేశారు. వాళ్లు చేస్తుండగా ఇంకొందరు లోపలకు జారుకొన్నారు. మంజరి వెంటా అయిదుగురు పడ్డారు. వారి పుస్తకాల్లో సంతకం చెయ్యక తప్పలేదు. అలా సంతకం చేస్తున్నప్పుడు మంజరి శరీరం రోమాంచితమయింది. సగర్వంగా వారికేసి చూసి, పుస్తకాలిచ్చి వేసింది! ఒకడు

పుస్తకం అందుకొంటూ, ఆ వంకతో మంజరి వేళ్లను గట్టిగా నొక్కాడు.

"ఈ సంఘటన వాడి జన్మంతా చెప్పుకొంటాడు"అనుకొన్నది మంజరి, తనలో తను నవ్వుకొంటూ.

ఆవిడ ప్రాణమంతా వసంతకోసం, రాజమణికోసం కొట్టుకులాడిపోతున్నది. ఏదో విధంగా సందుచేసుకొని, ఓ అరగంట వెళ్ళొస్తానన్నదిగానీ, కళ్యాణే వొప్పుకోలేదు.

"వాళ్లను చూడటమే ప్రధానమైతే, నువ్వే వెళ్లక్కర్లేదు. మనం కారు పంపి పిలిపిద్దాం. అడ్రస్ చెప్పు"అన్నది కళ్యాణి.

"అక్కయ్య ఏమన్నాఅనుకొంటుందేమోనని భయంగా ఉంది!"అన్నది మంజరి.

"నువ్వక్కడికెడితే తిరిగి రావేమోనని నాకూ భయంగానే ఉంది. నీకింకా తెలీదు మంజూ! పెద్దదాన్ని నామాట వినరాదా? కాదు కూడదు పోతానంటే ప్రసాద్‌తో చెప్పి వెళ్ళు. నాకేమీ అభ్యంతరం లేదు"అన్నది కళ్యాణి.

మంజరి వెడతానని మళ్లా అనలేదు. కళ్యాణి స్వయంగా కారు పంపించింది.

"మన ఖర్మకాలి, నాలుగుకొట్లు తిరిని నచ్చిన చీర కొనుక్కనే అవకాశం లేదు. సాయంత్రం పూట అలా షికారుకెళ్లడానికి లేదు. సరదాగా, ఏ నాటకానికన్నా,సినిమాకన్నా, సర్కస్‌కన్నా వెళ్లడానికి లేదు. నిమిషంలో మన చుట్టూ జనసముద్రం ఏర్పడిపోతుంది. ఈ బాధలు ముందు ముందుగానీ నీకు అనుభవంలోకి రావు. ఈ బ్రతుకో జైలు శిక్షలాంటిదనుకో మంజూ!".

ప్రసాద్ అప్పటికే తొందరపడిపోతున్నాడు. ఎవరో టుబాకో మర్చంట్ టీపార్టీ ఇస్తున్నాట్ట. అందర్నీ బయల్దేరమంటున్నాడు.

"ఊఁలే మరి, డ్రెస్ మార్చుకో. ఆ ఐబ్రౌ చెదిరిపోయింది. సరిగ్గా దిద్దుకో-లిప్‌స్టిక్ ఇంకోసారి...వస్తార్లేవమ్మా తల్లీ! చూద్దువుగాని గదా! దేనికయినా అంత ఆరాటం పనికిరాదమ్మాయ్!" అన్నది కళ్యాణి.

మంజరి పైకేమీ అనలేదు గానీ, లోలోపల చాలా నొచ్చుకొంది. కళ్యాణికే గనుక రాజమణి లాంటి మనిషి తటస్థపడి ఉంటే, ఇంత ఉదాసీనంగా ఉండేది కాదనుకొంది. రాజమణి ఎంత మంచిదో తెలీకపోవడం వల్లనే కళ్యాణి ఇలా అన్నదని కూడా మంజరి సరిపెట్టుకొంది.

ప్రతీక్షణం సుదీర్ఘంగా సాగి సంవత్సరంలాగా అనిపిస్తోంది. రాజమణి, వసంతా ఏ క్షణాన వచ్చినా రావచ్చు గనక, ఇప్పుడు క్షణాల విలువేమిటో మంజరికి తెలిసివచ్చింది. ఏ కారు హారన్ విన్నా అందులో రాజమణి, వసంతలు వస్తున్నారనే మంజరి అనుకోసాగింది. క్షణాలు, నిమిషాలు గడిచిపోతున్నాయే గానీ, వారికోసం వెళ్ళిన కారుమాత్రం తిరిగి రాలేదు. ఇవతల కళ్యాణి అద్దంముందు కూచుని, మేకప్‌చేసుకొంటూ ఉంది. పెదవులకు మరోసారి లిప్‌స్టిక్ తగిలించింది. కనుబొమ్మలు తీర్చిదిద్దింది. ముంగురులను ముఖంమీద పడేలా సర్దుకొంది. బ్రాసరీస్ మార్చి, కొత్తవి-ఇంకొంచెం పెద్దవి-వేసుకొంది. వానిటీబాగ్‌లో అవీఇవీ కుక్కి సిద్ధం చేసింది.

ప్రసాద్ హడావుడిగా తిరుగుతున్నాడు. అతనికి బొత్తిగా తీరుబాటు లేకుండా ఉంది. పరుగులాంటి నడకలోనే మాట్లాడేస్తున్నాడు. మధ్యమధ్య ఎవరితోనో గుసగుసలాడేస్తున్నాడు.

"నువ్వింకా ఇలానే ఉన్నావేం మంజూ?"అన్నది కళ్యాణి.

"ఏం చెయ్యనక్కా?" అన్నది మంజరి.

"మరీ అంత మొండితనం పనికిరాదమ్మాయ్! వెళ్లిన కారు రావాలి గదా! ఈలోగా నువ్వెంత అంగలార్చినా లాభంలేదు...ముందు నువ్వా డ్రెస్ చేసుకో. ఈలోపుగా కారేగనక వస్తే!"

''నా మనస్సేమీ బావోలేదక్కాయ్!''అన్నది మంజరి

''అందుకనీ నువ్వీ పిచ్చక్కమ్మ వేషంతో పార్టీకొస్తానంటావా?'' అని కోప్పడింది కళ్యాణి. ''మనలాగా-అందంమీద బతికేవాళ్ళకు మేకప్ ఎంత అవసరమో నీకు తెలీదు. నిన్ను మీవాళ్లతో కలిపిగాని నేనీ వూరు నించి కదలను, సరా? ముందు లోపలికి పద...నిన్నీ వేషంలో చూస్తే-''

అరగంటలో మేకప్ పూర్తిచేసుకొని ఆదరాబాదరా బయలుదేరారు. అప్పటిగ్గానీ కళ్యాణి పంపిన కారు రాలేదు. అందులో రాజమణీ, వసంతా ఉన్నారు. వారిని చూస్తూనే మంజరి ప్రాణం లేచివచ్చింది. డోర్‌తీసుకుని, ఓ కాలు కింద పెట్టిందోలేదో, ఓ కుదుపు కుదిపి కారు బయలుదేరింది. మంజరి కొయ్యబారిపోయింది. రాజమణీ, వసంతా ర(యినపోతున్న కారుకేసి కళ్ళింతచేసుకొని చూశారు.

''ముందు కళ్ళొత్తుకో, మేకప్ చెరిగిపోగలదు జాగ్రత!''అని హెచ్చరించింది కళ్యాణి. కళ్ళొత్తుకొంది మంజరి.

'తీరా చూస్తే ఈపార్టీ నీకోసమనే జరుగుతున్నదనుకొంటానమ్మాయ్! నువ్వీవూరుదానివేమో, అందులోనూ కాస్త పేరుతెచ్చిన సినిమా కూడా ఇదేనేమో, గుంటూరువాళ్లు నీకోసం పడిచస్తున్నారు. నువ్వు తెలివైనదానివైతే, ఈ మోజును అద్భుతంగా కాష్ చేసుకోవచ్చు''అన్నది కళ్యాణి.

ఈసారి కూడా మంజరి పలకలేదు.

''నువ్వు మంచి మూడ్స్‌లోకి రాకపోతే, ప్రోగ్రామంతా అభాసవుతుంది. చాలా సరదాగా ఉండాలి. ఒకసారేం జరిగిందంటే మంజూ!''

అంటూ కళ్యాణి, తన పూర్వపు అనుభవాలేవో చెప్పసాగింది. మంజరి మనస్సు నిండా ఆ అనుభవాల తాలూకు వాతావరణం నిండిపోయింది. ఆవిడ తాత్కాలికంగా రాజమణినీ, వసంతనూ మరచిపోగలిగింది. మధ్యమధ్య ''అదేమిటి?''-''ఇదేమిటి''-''అలా ఎందుకు జరిగింది?''-అంటూ ప్రశ్నలు వేసింది. అసలా ప్రశ్నలు వేయాలనే కళ్యాణి కూడా అలాంటి ''కథలు'' చెప్పింది.

పార్టీ దగ్గర కూడా చాలామంది జనం పోగయ్యారు. పార్టీ ఇస్తున్న పెద్దమనిషి నానాహంగామా చేస్తున్నాడు. ఆయన మంజరిని చూస్తూనే నవ్వాడు. మంజరి కూడా నవ్వింది. అతన్నెక్కడో చూశాననుకొంది మంజరి. కానీ ఎక్కడ చూసిందీ, ఎప్పుడు చూసిందీ జ్ఞాపకం రాలేదు.

''నన్ను మరిచిపోయావనుకుంటాను''అన్నాడా పెద్దమనిషి మంజరికి అల్లంత దూరంలోకొచ్చి.

''ఎంతమాట? కులాసాగా ఉన్నారా?''అన్నది మంజరి నవ్వుతూ.

కానీ ఎంత గింజుకుచచ్చినా, అతనెవరో జ్ఞాపకం రావడం లేదు. నాటకాల్లో చేరాకనో, చేరకముందో, ఎప్పుడో తనకోసం వచ్చిఉంటాడనుకొంది మంజరి. ఇంతలో ఇంకెవరో ''హలో''అంటూ పలకరించారామెను.

అతను హార్మోనిస్టు. నాటకసమాజంలో జీతంమీద పనిచేస్తూ ఉండేవాడు.

''ఇప్పుడేం చేస్తున్నారు?''అన్నది మంజరి.

''సైకిల్ రిపేర్లు చేస్తున్నాను. ఏదో గడిచిపోతావుంది''అన్నాడతను. ''మీకోసమని పదిసార్లన్నా పిక్చర్ చూస్తుంటాను. బ్రహ్మాండంగా యాక్ట్‌చేశారండీ! మీకిలాంటి ఫ్యూచరున్నదని నాకెప్పుడో తెలుసు. మీరు రేపు కూడా ఉంటే నాకే పది నిమిషాలు టైమివ్వండి. మీతో నా పెర్సనల్ విషయాలు మాట్లాడాలి''.

''దట్సాల్ రైట్; కానీ రేపునేనుండను. మీరు చెప్పదలుచుకొన్నదేమయినా ఉంటే-ఫరవాలేదు-ఇప్పుడే చెప్పండి. నేనీరాత్రే వెళ్లిపోవాలి. అవతల నాలుగైదు పిక్చర్లు సగంలో ఉన్నాయి.

బ్రహ్మప్రళయం మీదగానీ రాలేకపోయాను''అన్నది మంజరి.

''మరేం లేదండీ! నా సంగతి మీకు తెలియంది కాదు. పొట్టకోసం గతిలేక సైకిల్ రిపేర్లు చేసుకొంటున్నాను. మీరేకంపెనీలోనన్నా నాకు కాస్త పుటింగ్ ఏర్పాటు చేయిస్తే, మీకాళ్లముందు పడుంటాను. మీరు చెబితే వింటారని నాకు తెలుసు. నాకోసం కాకపోయినా, నా పిల్లల్ని చూసయినా, మీరీ ఉపకారం చేయాలి''.

తనకున్న పరపతే మాత్రమో చెప్పడం మంజరి కిష్టం లేకపోయింది. తనో గొప్ప వ్యక్తిగా అవతలివాడు మాట్లాడుతుంటే కాదనడమెందుకుట?

''అలాగే! తప్పకుండా చూస్తాను. నాకీ విషయాలన్నీ జ్ఞాపకం ఉండవు. రేపే మీరో ఉత్తరం రాయండి. అవకాశం రాగానే మీకు తెలియపరుస్తాను''అన్నది మంజరి.

''అలా కాదండీ! మీరు తప్పకుండా చూడాలి''అన్నాడతను ప్రాధేయపడుతూ, ''కనీసం మీ పెర్సనల్‌సెక్రటరీగా నన్నా, నన్ను వేసుకోక తప్పదు''.

''చూద్దాం. ఇప్పుడు చలపతని-మీకు తెలుసుగా-మన నాటకాల కంపెనీలోనే ఉండేవాడు-వాడుపనిచేస్తున్నాడు.-సరేలెండి. మీరు ఉత్తరం రాయండి. నేను చేయగలిగిందేదో చేస్తాను''అన్నది మంజరి.

అతన్ని చూడగానే జ్ఞాపకం వచ్చిన వో సంఘటన, అతను వెళ్లగానే సంపూర్ణ రూపం ధరించింది. ఈ హార్మోనిస్టే తొలిసారిగా తను నాటకాల కంపెనీలలో చేరినపుడు-ఎవ్వరూ లేని సమయంలో తనను బలవంతం చేశాడు. తనప్పుడు రామచంద్రం ప్రాపకంలో ఉన్నది. అతనికి తెలిస్తే బావుండదన్న ఉద్దేశంలో వీణ్ణి కాదన్నది. ఆ మర్నాటి నుండీ వీడు తనమీద యాగీలు ప్రారంభించాడు. తన గొంతు బావుండదనీ, తనకు పొట్టం రాదనీ నసపెట్టాడు. రామచంద్రం ఏదోవిధంగా దాన్ని సర్దేశాడు గనుక సరిపోయింది. లేకపోతే, తనకా కంపెనీ నుండి అప్పుడే ఉద్వాసన జరిగేది! ఆ దరిమిలా కూడా ఇతనికీ, తనకూ మంచి సంబంధాలేమీ లేవు. నాటకం అభాసవుతుందని కూడా ఆలోచించకుండా తన సీనొచ్చినప్పుడల్లా వికృతంగా వాయించేవాడు ఈ వెధవ. తన డైలాగ్స్ వినిపించకుండా 'బొఁయ్'మని హార్మోనియం తొక్కేవాడు. ఆ డైలాగ్స్ పెద్దగా అనడానికి లేదు, మెల్లగా అందామంటే-అసలు తను అనేదేమిటో జనానికి వినిపించదాయె! అలా ప్రాణాలు తోడాడీ లం...ఇప్పుడు వీడికి తను సహాయం చేయాలి!

''ఏమిటా ఆలోచన్లు? పద....''అంటూ కళ్యాణి వచ్చింది.

వీళ్ళిద్దరి చుట్టూ చాలామంది పోగుపడ్డారు. వారిలో చాలా ముఖాలు మంజరికి పరిచితమైనవే! అయితే వారి పేర్లుగానీ, ఇతర వివరాలు గానీ ఆమెకు జ్ఞాపకం లేవు.

పార్టీకి ముందు, ఇందాకటి పెద్దమనిషి లేచీ ముక్తసరిగా మాట్లాడాడు.

''జయా ఫిలింస్‌వారి చిత్రం అద్భుతంగా ఉన్నదనడం కన్నా నేనింకేమీ అనలేకపోతున్నాను. అందులోనూ మంజరి నటన ఇంకా బాగా వుంది. మంజరి మన గుంటూరు మనిషి కావడం మనకెంతో గర్వకారణం. ఈ తార ఇంకా ఉజ్జ్వలమైన వేషాలు వేసి మన పట్నానికి మంచికీర్తిని తీసుకురాగలదని నేనాశిస్తున్నాను''అన్నాడాయన.

ఆ తరువాత ఎవరెవరో మాట్లాడారు. పార్టీ హాయిగా జరిగిపోయింది. అంతసేపూ అతను కళ్యాణితో ఏదో మాట్లాడుతూనే ఉన్నాడు.

''సిగరెట్ కాల్చనా?''అన్నది మంజరి మెల్లగా కళ్యాణితో.

“కొంపముంచేశావు పో! అలాంటి పాడుపని ఎప్పుడూ చెయ్యకు. అందులోనూ, పదిమంది మధ్యా మనం అసలే అలాంటివి చెయ్యకూడదు...అవునుగానీ మంజూ! ఆ వెంకటరత్నం నువ్వంటే పడి చస్తున్నాడే!”అన్నది కళ్యాణి.

ఈ పేరు విన్నాకగానీ మంజరి అతన్ని గుర్తుతెచ్చుకోలేకపోయింది. తన నాటకాల్లో వేషాలేస్తున్న రోజుల్లో అతనోసారి నాగమణి ఇంటికొచ్చాడు. పదో, పదిహేనో ఇచ్చినట్లు జ్ఞాపకం. తన కాపూట వొంట్లో బావోలేదు. ఆమాటే అంటే, నాగమణి తనను కొట్టిమరీ గదిలోకి తోసింది.

“ఇలాంటి పెద్ద వ్యాపారస్థుడు మన చేతిలో ఉండటం ఎందుకైనా మంచిది. రేపు ఇతనే వో పిక్చర్ని ప్రొడ్యూస్ చేయవచ్చు లేదా ఏ పిక్చర్‌కన్నా ఫైనాన్స్ చేయవచ్చు. తరువాత నీ ఇష్టం!”

“నువ్వసాధ్యురాలివక్కా!”అని నవ్వేసింది మంజరి.

మొదట ఆట ఇంటర్వల్‌లో నటీనటులందరూ స్టేజిమీద కనిపించారు. అందరూ విడిది గృహానికి వచ్చారుగానీ, మంజరిమాత్రం రాలేదు. ఆవిడ వెంకటరత్నం కార్లో వెళ్లిపోయింది. ఆ పోకపోక తిరిగి రెండోఆట ఇంటర్వల్‌కు గానీ కనిపించలేదు. ఈసారీ ఆమెవెంట వెంకటరత్నం ఉన్నాడు. ఈసారి -అతను చాలా చనువుగా మంజరితో మాట్లాడటం చూసి, కళ్యాణి నవ్వుకొన్నది.

ఒంటిగంటగ్గానీ మంజరికి కాస్త ఊపిరి పీల్చుకొనే వ్యవధి దొరికింది కాదు. ఆవిడ ఇస్సురంటూ, కారు దిగి మెట్లెక్కుతున్నది. మెట్లపక్కగా చీకట్లో నుంచి ఎవరో “మంజూ!” అని పిలిచారు. మంజరి ఛరాలున వెనక్కి తిరిగింది. ఈలోగా రాజమణీ, వసంతా కూడా మెట్లదగ్గరికొచ్చారు. మంజరి ఒక్కదూకులో రాజమణిని కలుసుకొని అమాంతం కౌగలించుకొంది ఎముకలు గట్టిగా తగిలాయి.

“ఇలా అయిపొయ్యావే అక్కాయ్!”అన్నది మంజరి, రాజమణి ముఖాన్ని వేళ్లతో తడుముతూ.

వసంత కళ్లు మిలమిలలాడిపోతున్నాయి.

“అప్పణ్ణించీ ఇక్కడే ఉన్నాం మంజూ! నువ్వెప్పుడొస్తావో తెలీదాయె! నిన్ను చూడాలని ప్రాణాలు పీకాయనుకో మంజూ! ఏవేమో చెప్పాలనుకొన్నాను”అన్నది రాజమణి.

“మాట్లాడుకొందాం”.

“నిన్ను చూశాక, ఏమిచెప్పడానికి మిగల్లేదు”అన్నది రాజమణి.

“ఏం వసూ, బాగున్నావా?”అన్నది మంజరి కళ్ళెగరేస్తూ.

“ఆఁ”అన్నది వసంత సంగ్రహంగా.

“మీరు రావడం చూశాను. కానీ,ఊపిరి తీసుకోడానికైనా తీరికలేకపోయిందక్కా; చూస్తున్నావు గదా!”అన్నది మంజరి.

ఆప్యాయతనంతా కళ్లల్లోకి తెచ్చుకొని మంజరిని చూసింది రాజమణి.

“నువ్వున్న సినిమా పదిసార్లయినా చూసి వుంటుంది వసంత”అన్నది రాజమణి.

“ఎలా ఉందమ్మా?”

వసంత నవ్వి ఊరుకొంది.

ఆ రాత్రల్లా వాళ్లు మాట్లాడుతూనే ఉన్నారు.రాజమణి తన ఆరోగ్యం గురించీ, ‘వ్యాపారం’గురించీ, వసంత గురించీ చెప్పుకొచ్చింది.

“ఆ సాధక బాధకాలేవో మంజరి క్కూడా తెలుసు. వసంతకోసం మంజరి, డబ్బు తక్కువ తీసుకొని, వో పిక్చర్‌లో బుక్కయింది. అయినా మీరింకా ఇక్కడెందుకమ్మా, మద్రాసు

వచ్చేయండి...ఏదో చూదాం''అన్నది కళ్యాణి.

మంజరి అయిదు వందరూపాయలనోట్లు రాజమణికిస్తూ ''ఏవన్నా సర్దుబాట్లుంటే చేసుకురండి! రెండు మూడు రోజుల్లో బయల్దేరతానంటే, నేను స్టేషనుకు వస్తాను. పోనీ, మీరెపుడు బయలుదేరేదీ, ఏ బండికొస్తున్నదీ వైర్ చేయండి''అన్నది.

''ఇహ మేం బయల్దేరాలమ్మా. మళ్లా తెల్లారినప్పణ్ణుంచీ గొడవలు! అదీగాక, అవతల ప్రొడ్యూసర్లు ఊరుకోరు''అన్నది కళ్యాణి.

ప్రసాద్‌కు ఆ రాత్రి నిద్రలేదు. రెండు గంటలదాకా వాళ్లతోనూ,వీళ్లతోనూ మాటలు సరిపోయాయి. నాలుగింటిదాకా కళ్యాణి ప్రయాణానికి ఏర్పాటు చేయడంతో సరిపోయింది.

''అయితే నువ్వు బెజవాడ రావట్లేగా?''అన్నాడు ప్రసాదు.

''చూస్తూనే మీరలా అంటే ఎలాసార్? నన్నిబ్బంది పెట్టాలని కాకపోతే, ఏమిటా ప్రశ్న?'' అన్నది మంజరి నవ్వుతూ.

''నా నెక్స్టు పిక్చరులో నువ్వలా నవ్వకపోతే, నేనూరుకోను సుమా మంజరీ!'' అన్నాడు ప్రసాదు ఆమె బుగ్గను సున్నితంగా మెలిపెడుతూ.

# 15

తీరా మద్రాసు వచ్చాకగానీ, తను అడగదల్చుకొన్నదేదో అడగలేదు మంజరి. నిజానికి తన కింకో రోజు వ్యవధి ఉంది. తను బెజవాడ వెళ్లనూవచ్చు. అక్కడి ఉత్సవాల్లో పాల్గొని తిరిగి, వేళకు మద్రాసు రానూవచ్చు. అయినా కళ్యాణి ఏదో కొంపలంటుకుపోతున్నట్లు హడావుడి పడిపోయింది. తనకోనిమిషం వ్యవధి కూడా యిచ్చింది కాదు. తను రాజమణితోనూ, వసంతతోనూ మనసు విప్పి మాట్లాడుకొన్నది మాత్రం ఏముందీ? ఏదో లాంఛనప్రాయంగా అడిగిందే తప్ప, తన మాటల్లో ఆప్యాయత కొరవడిందని మంజరి భావించింది. వెంట ఉండి కళ్యాణి నసపెట్టకపోయినట్లయితే, తను ఏదో సమయంలో రాజమణి ఇంటికే పోయి ఉండేది. తనవి తీరా అక్కతో మాట్లాడి ఉండేది. కళ్యాణి ఈ అవకాశం ఎందుకివ్వలేదుట? ఈ విషయమయి అడిగినప్పుడు, కళ్యాణి నవ్వి, మంజరి రెండు బగ్గులూ పుణికి, చిన్నగా ముద్దుపెట్టుకొన్నది.

''పిచ్చితల్లీ! నీ మనస్సులోని ఆరాటం నాకు తెలీదనుకోకు, మనం మన ఉద్రేకాలను ఇష్టమొచ్చినట్లు చూపెట్టడానికి లేదు. నువ్వు మామూలు మంజరివయితే నాకేమీ అభ్యంతరం లేదుగానీ, నువ్వో స్టార్‌వి. అందులోనూ ఇప్పుడిప్పుడే పైకొస్తున్నదానివి. నువ్వు గ్లామర్‌ను పెంచుకోవాలి గానీ, చంపుకోకూడదు...నాకేగనక ఇలా నా చిన్నతనంలో చెప్పినవాళ్లుంటే, ఈ ఇండస్ట్రీ ఏంచేసి ఉ ందునో తెలీదు...నే చెప్పిన మాటల విలవ, నీకిప్పుడే తెలీదు. ఎందుకూ-నువ్వే అంటావు గదా!'' అన్నది కళ్యాణి.

ఈ సమాధానం మంజరికి నచ్చలేదు. అయినా ఆ విషయాన్ని బయటపడకుండా ఇంకేదో మాట్లాడేసింది మంజరి.

''రాజమణీ! వసంతా వస్తున్నట్లు ఆయనకు చెప్పడం మంచిదనుకొంటాను అక్కాయ్! ఇవ్వాళగాకపోయినా, రేపయినా మనం చెప్పాలిసిందే గదా!ఏమంటావ్?''అన్నది మంజరి.

కళ్యాణి ఓ నిమిషం దాకా ఏమీ మాట్లాడలేదు. సన్నగా నిట్టూర్పు మాత్రం విడిచింది.

"ఇలాంటి విషయాలు ఇంకొరిని అడక్కూడదు మంజరీ! నీకెలా తోస్తే అలానే చేసేయ్"అన్నది కళ్యాణి.

"నాకేమీ తోచకనే గదా, నిన్నడుగుతూంట!" అన్నది మంజరి.

"దీన్ని గురించి వెనకోసారి చెప్పిన జ్ఞాపకం ఉంది. అతనితో చెప్పడమూ, మానడమూ అన్నది అతని పొజీషన్ను బట్టి ఉంటుంది. ఇన్నిటికీ చలపతి ఎవరో ముందు నువ్వు నిర్ణయించాలి. అతను నీకు ఆప్తుడయితే, తప్పకుండా చెప్పాలి. అలా చెప్పినప్పుడు అతను
కాదన్నాడనుకో, నువ్వు వాళ్లను రప్పించీ ప్రయోజనం లేదు. అలాకాక చలపతి నీ స్నేహితుడో కాక, నీ పెర్సనల్ సెక్రటరీనోననుకో-అతన్ని కన్సల్టు చెయ్యాలిసిన అవసరమేమీలేదు. నువ్వేం చెబితే అతనది చెయ్యాలి. దానిమంచిచెడ్డలతో అతనికి నిమిత్తం లేదు"అన్నది కళ్యాణి.

మంజరి పలకలేదు. కళ్యాణికేసి ఓ క్షణం పాటు చూచి, తలదించేసుకుంది.

"ఎప్పుడోవొకప్పుడు దీనికి నువ్వు సమాధానం చెప్పుకోవలసి ఉంటుందని కూడా నేనిప్పుడు చెప్పాననుకొంటాను. ఆ టైము ఇప్పుడే వచ్చిందనుకొంటే సరేసరి! లేదా-ఇప్పుడెలాగో మానేజ్ చేదాం. తరువాత సంగతి తరువాత చూచుకొందాం"అన్నది కళ్యాణి.

"అదేదో తల్చుకుంటనే మంచిదక్కాయ్!"

"భేష్! అయితే ఏం చేదాం?"అన్నది కళ్యాణి.

"నువ్వే ఏదో ఒకటి చెప్పు అక్కాయ్!"అన్నది మంజరి నీరసంగా. "ఈ గొడవలతో, నాకు తల తిరిగిపోతూ ఉంది. ఏంచేస్తే ఏంజరుగుతుందో తెలీని స్థితిలో, ఏం చెయ్యాలన్నా భయంగా ఉంటుంది".

కళ్యాణి నవ్వింది.

"చలపతి అనేక రకాలుగా ఉపయోగపడే మనిషి! వాణ్ణి చెయ్యి వదలడం ఎంత తప్పో, నెత్తికెక్కించుకోవడమూ అంతే తప్పు. అతన్ని ఉండాల్సినంత దూరంలో ఉంచు. అయినా అతన్ని ముఖ్యమైన అన్ని విషయాల్లోనూ కన్సల్టు చేస్తూ ఉండదు. సాధారణంగా అతను కాదనడు. గమ్మత్తేమిటంటే-మనక్కావలసిన పనులన్నీ అతనిచేత మనం చేయించుకోవాలి గానీ-తను పరాయివాడన్న అభిప్రాయం మాత్రం అతనికి కలిగించకూడదు"అన్నది కళ్యాణి.

"ఇన్ని గుంటచిక్కుల వ్యవహారాలు నావల్లకావమ్మా అక్కాయ్!"

"అవుతాయి. నాకు తెలుసు. కాకపోతే కొత్తగనక, నువ్వుకాస్త భయపడుతున్నావ్ అంతే!"అన్నది కళ్యాణి.

ఆవిడ వెళ్లాక, చలపతిని పైకి పిలిచింది మంజరి.

అతను వచ్చి, కూచోడమా, మానడమా అన్నట్లు తటపటాఇస్తున్నాడు.

"కూచోండి..."అన్నది మంజరి.

చలపతి కూర్చున్నాడేగానీ, ఏమీ పలకలేదు. విషయాన్ని ఎలా ప్రారంభించాలో తెలీక మంజరి కూడా ఉడ్డుకుడిచిపోతూ వుంది. ఏదో ఒకటి అనాలి గనక, "అలా ఉన్నారేం?"అన్నది.

ఒకప్పుడైతే "నువ్వు దగ్గరగా లేవు గనక"అనేవాడు చలపతి. ఈ నాడామాట అనడానికి అతను సాహసించలేకపోయాడు. అదోలాగా నవ్వి "ఎలా జరిగాయి ఫంక్షన్సు?"అన్నాడు తాపీగా. మంజరికి వెంటనే ఓ ఆలోచన వచ్చింది. ఈ అస్త్రం విసిరిచూస్తే ఎలా వుంటుందో చూడాలనుకొంది.

"అందరూ బాగా జరిగాయంటున్నారు. ఆఖరికి కళ్యాణి కూడా "బ్రహ్మాండం" అనేసింది.

కానీ, నాకయితే -అదోలా ఉందండీ!''అన్నది మంజరి.

''అదేం?'' అన్నాడు చలపతి.

''అక్కడేం చేయాలో,ఎలా మాట్లాడాలో, ఎట్లా బిహేవ్ చెయ్యాలో నాకు తెలీదాయె. అన్నిటికీ వెదులాటేనాయె! మీరున్నట్లయతే, నాకీ బెడద లేమీ లేకపోను. ఈ గొడవలన్నీ మీరు చూసుకొంటుంటే, నేను నిశ్చింతగా ఉండేదాన్ని. నాకంటే కొత్తగనకా, తెలీదు గనకా, ఊరుకొన్నాననుకోండి-మరి మీరన్నా మాట మాత్రం నాతో అనలేదేం?''అన్నది మంజరి.

''నేను నీవెంట రావడం నీకిష్టం కాదేమోననుకొన్నాను''అన్నాడు చలపతి.

ఈ ఎదురుదెబ్బ మంజరి ఊహించింది కాదు. అందుకని క్షణకాలం దిమ్మరపోయింది.

''మీరెందుకిలా మాటలతో నన్ను చీలుస్తారో బోధపడదు. తెలీక నేను లక్షపనులు చేస్తుంటాను. పెద్దవారు మీరున్నదెందుకుట? నా తప్పులు నాకు చూపించకపోతే, నేనేమైపోతానో మీకు తెలీదా? ఇందులో ఇష్టాఇష్టాల ప్రసక్తేమీలేదు. ఇద్దరమూ వెళితే, కొంపలో ఎవరూ ఉండరు గనక, ఆ మాట నేననలేదు...మీమాట మీకొప్పచెప్పడం నాకు చేతకాదనుకోకండి! నా వెంట రావడం మీకిష్టమో కాదో నాకూ తెలీదు. అందుకనే మిమ్మల్ని నేను సాహసించి రమ్మనలేకపోయానని, నేనూ అనవచ్చుగా! అయినా ఆ మాట నేననబోవడం లేదు''అన్నది మంజరి.

''పోన్లేగానీ, నన్ను రమ్మన్నదెందుకమ్మా?''అన్నాడు చలపతి.

''గుంటూరు వెళ్లినపుడు, రాజమణీ, వసంతా కన్పించారండీ!''అన్నది మంజరి.

''ఓహెూ!''అన్నాడు చలపతి.

అతనేమన్నా కామెంట్ చేస్తాడేమో, డొంకంతా కదుపుదామనుకొంది మంజరి. చలపతి ఆ అవకాశం మంజరికివ్వనేలేదు.

''వాళ్ళుకూడా ఇక్కడికి రావాలని వుంది!''

''ఓహెూ!''అన్నాడు మళ్లీ చలపతి.

మంజరికి చిర్రెత్తుకొచ్చింది, అయినా కోపాన్ని అణచుకొంటూ, ''మీ ఉద్దేశమేమిటో చెప్పండి!'అన్నది మెల్లిగా.

''ఎవరో మద్రాసురావడాన్ని గురించి నన్నడిగితే, ఏం చెప్పమంటావు మంజరీ?'' అన్నాడు చలపతి.

''ఎవరో రావడం గురించయితే నేనూ అడక్కపోదును. వాళ్లు మనవాళ్లు గనుకనే అడుగుతున్నాను''అన్నది మంజరి రవంత కోపంతో.

''మనవాళ్లంటే-వాళ్లు నీకేమన్నా అవుతారేమోగానీ, నాకు కారు. సరేనా?''

మంజరికి కోపం మిన్నుముట్టింది.

''ఈమధ్య మీరు బొత్తిగా అర్థంకాకుండా పోతున్నారండీ! మీకూ నాకూ మధ్య బ్రహ్మాండమైన అగడ్తలేవో ఉన్నట్లుగా మీరు మాట్లాడటం చూస్తుంటే -నేనేమీ అనలేకపోతున్నాను. అదిగాదండీ బాబూ! ఒక్క విషయం చెప్పండి! నేను మీకు ఏదన్నా అయితే, వాళ్లూ మీకు అవుతారు. నేను మీకేమీ కాకపోతే వాళ్లూ కారు అంతేనా?''

''నువ్వు చాలా తెలివయిందానివి మంజూ! నీతో వాదించి గెలవడం మామూలు వాళ్లవల్లకాదు''అన్నాడు చలపతి నవ్వుతూ.

''అది తప్పే అయితే, దానికి బాధ్యులు మీరే! నోట్లో నాలుకలేనిదానిని తెచ్చి, ఇలా

తయారుచేశారు''అన్నది మంజరి కూడా నవ్వుతూ. ''ఇన్నిటికీ నేను అసలు విషయం చెప్పనేలేదు. వాళ్ళేమో అక్కడ నానా బాధలూ పడుతున్నారు. ఇక్కడికొచ్చెయ్యా లనుకొంటున్నారు. అనుకొంటున్నారంటే-నేను వచ్చెయ్యమన్నాననుకోండి-మరి మీ ఉద్దేశం చెబితే-''

''రానివ్వు మంజరీ! తప్పేం?''అన్నాడు చలపతి.

మంజరి గట్టిగా నిట్టూర్చి ''హమ్మయ్య! బతికిపోయాను''అని సోఫాలో చేరగిలబడిపోయింది.

''దీన్నిబట్టి చూస్తే, నేను కాదంటానేమోనని నువ్వనుకొన్నావన్న మాట!అవునా?''అన్నాడు చలపతి.

''అబ్బా! మీతో వేగడం కష్టమండీ, భగవంతుడు మిమ్మల్నెలా పుట్టించాడో గానీ, నా కడుపులో ఆలోచనలు కూడా మీరు చెబుతుంటే ఎలానండీ చావడం?''అన్నది మంజరి.

ఈ మాటలకు చలపతి ఉబ్బిపోతాడని మంజరి అభిప్రాయం. కానీ చలపతి ఉబ్బిపో లేదు. ఈమాటల వెనక పనిచేసిన మనస్తత్వమేమిటో అతనికి క్షుణ్ణంగా తెలుసు.

అనుకొన్న వేళకు రాజమణి, వసంతా వచ్చారు. స్టేషన్‌కు మంజరి వెళ్లలేదు. గుర్తులన్నీ చెప్పి, చలపతిని పంపించింది. తీరా వారు వచ్చేవేళకు మంజరి ఇంట్లోకూడా లేదు. మొదలియార్ పిక్చర్ షూటింగుకెళ్లింది. నాలుగ్గంటల్లో అయిపోతుందనుకొన్నా కాల్‌షీట్, రాత్రి పదిగంటలదాకా పట్టింది. తమిళ హీరో రావడమే రెండుగంటలు ఆలస్యంగా వచ్చాడు. వచ్చాక డబ్బివ్వందే సెట్‌లోకి రానన్నాడు. ప్రొడక్షన్ మేనేజర్ ఆఫీసుకెళ్లి చెక్ తీసుకొచ్చిందాకా, అతనలానే కూచున్నాడు గానీ కిమ్మనలేదు. అతన్ని రంగు వేసుకోమనే ధైర్యం ఎవరికీ లేకపోయింది.

''ఇదే నేనయితే, నలుగురూ, నాలుగుమాటలూ అనేసి ఉందురు. హీరోగనక కుక్కినపేనులాగా పడున్నారు''అనుకొన్నది మంజరి.

పదిగంటలకు ఆపసోపాలు పడుతూ ఇంటికొచ్చిందో లేదో, కళ్యాణినాలుగైదు దఫాలు ఫోన్ చేసిందనీ, రాగానే కబురు పంపమన్నదనీ చలపతి చెప్పాడు. పైకి వచ్చేసరికి రాజమణీ, వసంతా సోఫాల్లో కూచొని వున్నారు. తాయారు వారికల్లంత దూరంలో నిలబడి ఏవో కబుర్లు చెబుతోంది.

''ఏం అక్కాయ్, ప్రయాణంలో ఇబ్బంది లేదుగదా! ఏవమ్మా వనూ! భోజనాలయ్యాయా?''అన్నది మంజరి.

''మీకోసం కల్లానమ్మగారు శానామాట్లు ఫోనుచేసిన్రుండీ అమ్మాయిగారూ!''అన్నది తాయారు.

మంజరి సోఫాలో కూచుంటే తాయారొచ్చి కాలిజోళ్లు విప్పి దూరంగా ఉంచింది. వానిటీబాగ్ తీసి డ్రాయరుమీద పెట్టింది. ఫాన్‌ను నాలుగుమీద నుండి ఆరుమీదకు తిప్పింది. పొగలుచిమ్ముతున్న కాఫీ తెచ్చి అలానే నుంచుంది. ఇవన్నీ రాజమణీ, వసంతా ఆశ్చర్యంగా చూస్తున్నారు. అంతలోనే మళ్లా ఫోను మోగింది. తాయారు ట్రేను బల్లమీదుంచి, రిసీవర్ అందుకొని, ''హల్లో''అని మౌత్‌పీస్‌కు చెయ్యి అడ్డుపెట్టి ''కల్లానమ్మగారండీ! మిమ్మల్ని పిలుస్తావున్నారండీ అమ్మాయిగారూ!''అన్నది.

''ఎందుకుట?''అన్నది మంజరి.

''తెలీదండీ! ఏమని చెప్పమంటారు?''

మంజరి విసుగ్గా లేచి రిసీవర్ అందుకొన్నది.

''నీకోసం రెండు గంటల నుంచీ ట్రై చేస్తున్నాను. నువ్వు అందావుగాదు..వెంటనే బయల్దేరు''అన్నది కళ్యాణి.

''ఈ పూట....''

వాక్యం పూర్తిగాకముందే కళ్యాణి అడ్డుకొన్నది. "అదేమీ కాదమ్మాయ్!నీతో చాలాపనులున్నాయి. పదినిమిషాల్లో ఇక్కడికిరా. మిగతా విషయాలు చెబుతాను. అర్జంట్....కారు పంపనా మరి! అలాగే ...పంపుతున్నాను".

మంజరి విసుగ్గా రిసీవర్ పడేసింది.

"మళ్లా వస్తానమ్మా అక్కాయ్! అర్జెంటు పనిమీద పోతున్నాను...నాకోసం మీరు కనిపెట్టుకొని ఉండకండి. ఎప్పటికొస్తానో తెలీదు".

"ఎప్పుడు తిన్నావో ఏమిటో, కాస్త ఎంగిలి పడరాదుటే మంజూ!"అన్నది రాజమణి.

"పదినిమిషాల్లో బయల్దేరాలి అక్కాయ్! ఈలోగా డ్రెస్ చేసుకోవడమే కాదు. భోజనానికి టైమేదీ? తాయారూ! చూడమ్మా"అన్నది మంజరి లోపలిగదిలో కెడుతూ.

రాజమణీ, వసంతా వొకరినొకరు చూసుకొన్నారు.

---------------

మంజరిని చూస్తూనే కళ్యాణి కిందపెదవి కొరుక్కుంటూ కళ్లెగరేసింది.

"మరీ అంత బిజీఅయితే ఎలాగమ్మా! స్టూడియోకు ఫోనుచేస్తే నువ్వు సెట్‌లో వున్నావనీ, కదపటానికి వీల్లేదనీ అంటారు. మధ్యలో ఫోను చేస్తే నువ్వు కోప్పడతావంటారు. మరి నువ్వేమో-"అన్నది కళ్యాణి.

మంజరి ఎదురుగా వున్న అద్దంలో ఇంకోసారి మేకప్ సరిచూసుకొంది.

"ఇవ్వాళ ట్రిచ్చి నుండి రాజన్ వచ్చాడు మంజూ! వస్తూనే నిన్ను గురించి అడిగాడు. నువ్వు ఎవైలబుల్ కాదన్నాను. ఏవో షూటింగ్ గొడవల్లో ఉన్నదన్నాను. అతనేమన్నాడో తెలుసా?" అన్నది కళ్యాణి.

"చెప్పు"అన్నది మంజరి నవ్వి.

"ఈ సినిమా గొడవలు మానేసి అచ్చంగా తనవూళ్లో ఉండిపోకూడదా అన్నాడు".

మంజరి చటుక్కున వెంకటేశ్వర్లు జ్ఞాపకం వచ్చాడు. అప్పుడెప్పుడో అతనుకూడా ఈమాటే అన్నాడు. దానికి తనేం సమాధానం చెప్పిందీ జ్ఞాపకం లేదు-బహువా 'సరే'నని ఉంటుంది. అలాగే ఇప్పుడీ రాజన్ కూడా అంటున్నాడు.

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావ్?"అన్నది కళ్యాణి.

మంజరి "ప్చ్"అన్నది.

"రాజన్ ఇంకో పదినిమిషాల్లో ఇక్కడికొస్తాడు. మనల్నే హోటలుకు రమ్మన్నాడుగానీ, నేనొప్పుకోలేదు. ఈ రాత్రి అతనిచేత మనం చాలా కమిట్ చేయించాలి. అతనికి ఊపిరి తిరగనివ్వకూడదు. బస్-అంతే!"అన్నది కళ్యాణి.

"నువ్వేం చెయ్యమంటే అదే చేస్తాను. నాకంతకన్నా ఇంకేమీ తెలీదు"అన్నది మంజరి నిరుత్సాహంగా.

"అలా ఉన్నావేమిటమ్మా! నువ్విలా జోగులాడుతూ ఉంటే రాజన్ ఏమనుకొంటాడు?"అన్నది కళ్యాణి.

"వాడేమనుకొన్నా నాకు ఇబ్బందిలేదు. వాడ్ని చూసి జడుసుకోవలసిన అవసరమేముందక్కా?"అన్నది మంజరి. మెడవోపక్కగా ఉంచి కళ్యాణిని చూస్తూ.

"నువ్వు పూర్వజన్మలో ఏ పూజ చేసుకొని పుట్టావోగాని, మంజరి కోపంలో కూడా నువ్వు

జగన్మోహనంగా ఉంటావమ్మా! ఈరాత్రి రాజన్ పిచ్చికుక్కయిపోవడం ఖాయం!''అన్నది కళ్యాణి, మంజరి సరసకు జరుగుతూ. ''రాజన్ సంగతి నీకింకా తెలీదు మంజూ! అలాంటి వారి ప్రాపకం ఉండటంలోని లాభాలు నీకిప్పుడు తెలీవు.నువ్వూ, నేనూ ఈ ఇండస్ట్రీలో ఉండటం డబ్బుకోసం గానీ, లోకాన్నుద్ధరించడానికి కాదు. అయినప్పుడు డబ్బున్నవాణ్ణి నువ్వసహ్యించుకోడంలో అర్థంలేదు''.

దూరం నుంచికారేదో వచ్చి పోర్టికోలో ఆగిన చప్పుడయింది.

''అడుగో రాజన్ వస్తున్నాడు-బీకేర్‌ఫుల్!''అన్నది కళ్యాణి.

మంజరి వోసారి వొళ్లు విరుచుకుని సోఫాలో సరిగ్గా కూచుంది.

రాజన్ వచ్చాడు. వస్తూనే వారిని చూసి నవ్వాడు. కళ్యాణి, మంజరీ లేచి నమస్కరించారు.

అతను కూచున్నాక, ఇద్దరూ అతనికి ఎదురుగా కూచున్నారు.

''ఓ షరతు మీదయితే మీతో మంజరి మాట్లాడుతుందిట. లేకపోతే మానేస్తుందిట!''అన్నది కళ్యాణి నవ్వుతూ, మెల్లిగా మంజరికి సైగచేసి.

''ఏమిటది?''అన్నాడు రాజన్.

''యస్''అన్నది మంజరి.

''అదుగో చూశావా! నీ షరతును నేనొప్పుకోకముందే, నాతో మాట్లాడేశావు''అని నవ్వాడు రాజన్.

కళ్యాణి నవ్వడమే కాదు ''హియర్ హియర్'' అంటూ చప్పట్లు కూడా చరిచింది. మంజరి బుంగమూతిపెట్టి రాజన్ తొడమీద చిన్నదెబ్బ కొట్టింది.

''మీరిలా అంటారనే, మీరంటే నాకు కోపం. అసలు మాట్లాదనుకొన్నాను. కానీ, మిమ్మల్ని చూశాక ఆ సంగతే మరచిపోయాను''.

''ఇప్పుడే వస్తాను''అంటూ కళ్యాణి లోపలికెళ్లిపోయింది.

రాజన్ ముందుకు వంగి, మంజరి చెయ్యి పట్టుకొని లాగాడు. ఆ వూపుకు అతని పక్కనే వచ్చిపడింది మంజరి.

''ఇంతకాలం ఏమైపొయ్యారుట? నేనున్నాననైనా జ్ఞాపకం రాలేదా?''అన్నది మంజరి.

రాజన్ ఆమె భుజాలమీద చేతులు వేసి తనకేసి తిప్పుకున్నాడు.

''అబ్బా, మీరలా చూడకండి బాబూ!''అని తలదించేసుకొంది మంజరి.

రాజన్ ఆమె ముఖాన్ని పైకెత్తాడు. మంజరి కళ్లుమూసుకొంది. అతనామెను మెత్తగా ముద్దుపెట్టుకొన్నాడు.

''ప్లీజ్!వన్‌మినిట్!''అన్నది కళ్యాణి.

మంజరిగానీ, రాజన్‌గానీ ఉలిక్కిపడలేదు సరిగదా, కనీసం సిగ్గయినా పడలేదు. ట్రేలో రెండు నల్లటిసీసాలూ, మరో నాలుగు సోడాలు ఉన్నాయి. గమగమలాడుతున్న కూర, ఇంకో సాసర్‌లో ఇన్ని జీడిపప్పులు ఉన్నాయి. కళ్యాణి మూడు గ్లాసుల్లోకీ వొంపి, మిగతా ఖాళీలనుసోడాలతో నింపేసింది. ముగ్గురూ గ్లాసులందుకొని, వొకదాని కింకొకటి తాకించారు. కళ్యాణి తన గ్లాసును పైకెత్తి ''ఫర్‌ది హెల్తాఫ్ మిస్టర్ రాజన్!''అన్నది.

''డిట్టో''అన్నది మంజరి.

రాజన్''మీ ఇద్దరి ఆరోగ్యం కోసం''అంటూ గ్లాసును ఖాళీ చేశాడు.

దాదాపు పదకొండున్నరయింది. రేడియోగ్రామ్‌లోంచి సన్నగా, మధురంగా ఏదో సంగీతం

వినిపిస్తోంది. రాజన్ గట్టిగా సిగరెట్ లాగి, మంజరి ముఖంమీదికి పొగవదిలాడు. మంజరీ అతని సిగరెట్‌ను లాక్కుని కాల్చసాగింది. కళ్యాణి అతనికి వెనకవైపున చేరి, మంజరికి సైగచేసింది. గ్రహించానన్నట్లుగా మంజరి కూడా కన్ను నులిపింది.

“నిజంగా మీకు సిగ్గులేదండీ!”అన్నది కళ్యాణి వ్యవహారాన్ని ప్రారంభిస్తూ.

“వాట్!”అన్నాడు రాజన్ చాలా తాపీగా.

“ఊరంతానేమో వేం మీ మనుషులమనుకొంటుంటే-మీరేమో ఇలానిమ్మకు నీరెత్తినట్టుంటారాయె!”అన్నది కళ్యాణి.

“ఏమయింది?”అన్నాడు రాజన్.

దానికి కళ్యాణి సమాధానం చెప్పలేదు. మంజరికేసి తిరిగి, “చూడు మంజూ! నిన్నో మొన్ననో, ఎవరో ఆటోమొబైల్ కంపెనీవారు నీకోసం వచ్చారు గదా! కారేమన్నా బేరం చేస్తున్నావా?”అన్నది.

“ఊఁ”అన్నది మంజరి.

“నువ్వేమీ తొందరపడకు. అంతగా అవసరమైతే అందాకా వీరి కారు వాడుకో, తరువాత చూసుకొందాం. కొనదలుచుకున్నదేదో మంచిదేకొనాలి గానీ, ఆడవారకు కొనకు. సరేనా?”అన్నది కళ్యాణి. తరువాత రాజన్‌కేసి తిరిగి “మీరంటే ఇన్‌ఫ్లూయన్స్ చేసి, అయిదు నిమిషాలల్లో కొత్తకారు తెచ్చుకోగలరు, మంజరికామాత్రం హెల్ప్ చెయ్యకూడదూ?”అన్నది.

“వారేమనుకొన్నాసరే”ఆ కారు నేనుతీసేసుకొంటాను అక్కాయ్! రాతలూ, కోతలూ తరువాత చూసుకోవచ్చు. ఆయన మనతో ఉన్నా లేకపోయినా, కనీసం వారి కారన్నా మనతో ఉంటుంది”అన్నది మంజరి.

“ఐహేవ్ నో అబ్జెక్షన్”అన్నాడు రాజన్ మత్తులో జోగులాడుతూ.

మంజరి ‘హమ్మయ్య’అనుకొంది.

కళ్యాణి, అతనికి ఎదురుగా వచ్చి హత్తుకొని వదిలేసింది.

“అలా ఉన్నావేం మంజూ! ఇలాంటప్పుడు,ఎందుకమ్మా ఆ దిగులు?.... ఇసీ... అదన్నమాట సంగతి? నేనింకా ఆ విషయమే మరిచిపోయాను సుమా? అయినా నీదంతా సాధ్యంకాకపోతే అలా వాయిదాల మీద ఇల్లు తీసుకోమని నీకెవరు చెప్పారు మంజూ? పోనీ, మాట మాత్రమున్నా నాతో అనలేకపోయావా?కావాలంటే రాజన్‌గారిక నడిగి వాడి డబ్బు ముఖాన గిరాటేసివుందును. ఇప్పటికి రెండు ఇన్‌స్టాల్మెంట్సు పే చేశావుగదూ?”అన్నది కన్నుమలుపుతూ.

కళ్యాణి సాహసం చూసి, అంతమైకంలోనూ, మంజరి కొయ్యబారిపోయింది.

కళ్యాణితో పోల్చిచూస్తే తనుత్త అర్భకురాలు, తనకు మనుషులతో మాట్లాడడమూ రాదు, వాళ్లతో పనులు చేయించుకోవడమూ రాదు.

“డోన్ట్ వర్రి డార్లింగ్. ఐ విల్ సెటిల్ ద మాటర్!” అన్నాడు రాజన్.

“అనే నేనూ చెప్పాను. అయినా మంజరి వినిపించుకోదు. దాని భయం దానిదీ! అమ్మాయీ! నువ్వికి నిశ్చింతగా ఉండు. ఆ గొడవలన్నీ రాజన్‌గారే చూసుకొంటారు. ఆయన రానప్పుడేమో, ‘ఎప్పుడొస్తాడు, ఎప్పుడొస్తాడు?’ అని నా ప్రాణాలు తోడేస్తుంటావు! తీరా మనిషొచ్చాకనేమో ఏవో దిక్కుమాలిన కబుర్లన్నీ పెట్టుక్కూచుంటావు”అని కోప్పడింది కళ్యాణి.

మంజరి లేచింది. రాజన్ లేచాడు. కళ్యాణి లేచింది. ముగ్గురూ ఇంకో పెద్ద గదిలో ప్రవేశించారు. తలుపులు మూసుకొన్నాయి.

ఉదయం రాజన్ కారు మీదనే ఇంటికొచ్చింది మంజరి. ఆవిడ కళ్ళు ఎర్రగా ఉన్నాయి. జుట్టంతా రేగిపోయింది. దిద్దిన కనురెప్పల రంగు వికారంగా, ముఖమంతా పాకిపోయింది. నోరువిప్పితే పుల్లని వాసన వేస్తోంది. చలపతి కారు చూచాడు గానీ, ఏమీ అనలేదు. రాజమణి, వసంత ఏదో మాట్లాడబోయారు. తాయారు వారిని వారించింది. మంజరి సరాసరి తన గదిలోకి వెళ్ళి మంచం మీద పడుకొంది. ఆమెను పలకరించడానిగ్గానీ, కనీసం లేపడానిగ్గానీ ఎవ్వరూ సాహసించలేదు.

మధ్యాహ్నానికల్లా మిగతా పనులు కూడా పూర్తి చేసింది కళ్యాణి. తను మంజరికి కారు అమ్మినట్లు, అందుగ్గాను ఆవిడ ఇవ్వవలసిన డబ్బంతా తనకు ముట్టినట్లు రాజన్ ఒక రశీద్ మీద సంతకం పెట్టి ఇచ్చాడు. కళ్యాణి సెక్రెటరీ చలపతికి ఫోను చేస్తూ "ఇంకేమన్నా కావాలేమో ఆలోచించి చెప్పమని మా అమ్మగారు అంటున్నారు. సాయంత్రంలోగా చెప్పాలట మీకు తెలీకపోతే, ఇంకెవరినన్నా కనుక్కోమన్నారు. మీ అమ్మగారేం చేస్తున్నదీ చెప్పమన్నారు" అన్నాడు.

"మా అమ్మగారా?" అని క్షణకాలమాగాడు చలపతి. అతని పెదవులు కోపంతో అదురుతున్నాయి.

"అవునండీ! అమ్మాయిగారేం చేస్తున్నదీ మా అమ్మగారు కనుక్కోమంటున్నారు" అన్నాడు కళ్యాణి కార్యదర్శి.

"గొడ్డులాగా నిద్రపోతుంది!" అని ఫోన్ పెట్టేశాడు చలపతి.

ఆ మరుక్షణంలోనే అతను కొయ్యబారిపోయాడు. మెట్ల మీద మంజరి నిలబడి ఉంది! ఆవిడ మాటలన్నీ విన్నది.

చలపతి కేమీ తోచలేదు. ముచ్చెమటలు పోశాయి. భయంతో అతని గొంతు పొడారిపోయింది.

మంజరి తాపీగా మెట్లుదిగి, అతని బల్ల దగ్గరికొచ్చింది. ఆమె ముఖంలో కోపంగానీ, అసహ్యంగానీ లేవు.

"మంచి డ్రైవర్ను మాట్లాడండి. చాలా మంచివాడు కావాలి. ఎప్పుడూ యిక్కడే వుండాలి. అతనికి మనమే ఫ్రీ క్వార్టర్సు ఎరేంజ్ చేద్దాం" అన్నది మంజరి.

"అలాగే!" అన్నాడు చలపతి.

"ఎప్పుడో కాదు, సాయంత్రంలోగా మాట్లాడాలి"

మెట్లెక్కబోయిందల్లా ఆగి, వెనక్కు తిరిగి ఏదో అనబోయింది మంజరి. కొంపలంటుకున్నాయనుకొన్నాడు చలపతి.

"మరేం లేదు. ఆ సంగతే ఇంకోసారి చెబుదామనీ!" అంటూ పైకెళ్ళిపోయింది మంజరి.

చలపతి స్థిమితంగా కుర్చీలో కూచోలేకపోయాడు.

ఈ సంఘటన ఇంతటితో సమసిపోదనీ, దీని తాలూకు ఫలితాలు, ఎప్పుడో ఒకప్పుడు తను అనుభవించక తప్పదనీ చలపతి నిశ్చయించుకొన్నాడు. అతనీ నిర్ణయానికి వచ్చేందుకు తగినన్ని కారణాలు కూడా అతనిదగ్గరున్నాయి. ఒకేమిటంటే మంజరిని గురించి అతనికి బాగా తెలుసు-ఇంకెవరికీ తెలియనన్ని విషయాలు కూడా తనకు తెలుసుననుకొనేవాడు చలపతి. తనకు జరిగిన ఉపకారాపకారాల్లో దేన్నీ మంజరి మరచిపోలేదని చలపతి నమ్మకం. అనేక వందలసార్లు రామచంద్రాన్ని గురించీ, మాధవరావును గురించీ మాట్లాడటం తన అనుభవంలో ఉన్నదే! వాళ్ళు మాత్రం ప్రత్యేకంగా మంజరికి వొరగపెట్టిందేమీ లేదు. వాళ్లకో మంచి అమ్మాయి కావాలి; మంజరికో ఉపాధి కావాలి.

అదృష్టవశాత్తూ ఇవి రెండూ సమకూరాయి. మరి వాళ్ళు ఈమెను గురించి ఇన్నిసార్లను కొంటున్నారో లేదో, ఆ భగవంతుడికే తెలియాలి. ఈవిడ మాత్రం సమయం వచ్చినప్పుడల్లా వాళ్ళను ఆకాశానికెత్తుతూ వుంటుంది. పగ విషయంలో కూడా మంజరి తీసిపోయిందేమి కాదు; జయా ఫిలింస్ వారితో ఆదిలోనే ఏర్పడ్డ వివాదమప్పుడు, ఆ కంపెనీ మీద మంజరి కారాలు మిరియాలు నూరింది. సమయం వచ్చినప్పుడు దెబ్బకు దెబ్బ తీస్తానని కూడా అన్నది. అయితే ఇంతవరకూ అలా జరగని మాట నిజమే! కానీ అదును దొరికినప్పుడు మంజరి అన్నంతపనీ చెయ్యకుండా ఊరుకొంటుందా? ఊరుకొంటుందని ఎవ్వరుగానీ గ్యారంటీ ఇవ్వలేరు.

ఇటీవల తన గ్రహాలు బాగా వక్రించాయని చలపతి ఏనాడో గ్రహించాడు. మంజరిని గురించి అతని అంచనాలన్నీ రైటవుతూ వచ్చాయి. అయితే అనుకొన్నదానికన్నా చాలా త్వరగా దాని ఫలితాలు కనిపంచడమే చిత్రం! ఏదో వొకనాడు తనకూ, మంజరికీ మధ్య రవరవలు పొడచూపక మానవనీ, ఆనాడు తను నెత్తిన తడిగుడ్డ వేసుకొని చక్కాపోవలసి వస్తుందనీ తను అనుకుంటూనే వున్నాడు. కానీ, ఆ గడువు ఇంకా చాలా దూరాన్నున్నదని తను అనుకొంటూ వచ్చాడు. గమ్మత్తేమిటంటే - ఆ గడువు ఇహ ముందెప్పుడో రావడం కాదు - ఇప్పటికే వచ్చింది. ప్రస్తుతం సంకురుమయ్య తనలాంటి వాళ్ళ మీదనే సవారీ చేస్తున్నాడు. మంజరి ధోరణి చూస్తుంటే ఏ క్షణాన భగ్గుమని పేలుతుందో తెలీయకుండా వుంది. అప్పుడప్పుడు -తన అండదండలింకా వదలదని అనిపించినా, వదిలినా నష్టం లేదని మంజరి గ్రహిస్తే తన గతేం కావాలిట? తన ఇష్టప్రకారం మంజరి వుండటం లేదన్న బాధ మినహాయిస్తే-ఆ కాస్తా తను వదుకుకొటే తనకన్నా సుఖజీవి మరోడు వుండడు. పెద్ద పెద్ద తారల ప్రాపకం కావాలంటే మాటలా?

ఇన్నిటికీ యీ యింట్లో తన స్థానమేమిటో ఇంకా నిర్ధారణ కాలేదు. తనకు నిజంగా మంజరి ఏమవుతుందో తేలాలి. ఇదివరకు సరేసరి-ఇప్పుడలా కాదు గదా చచ్చి? తను పూర్తిగా కిందనే వుండిపోతున్నాడు. ఎప్పుడోగానీ మంజరితో మాట్లాడే అవకాశమే దొరకటం లేదు. ఆ కాస్సేపయినా కస్సుబుస్సులాడుకోవడమో ఒకరినొకరు మాటలతో చీల్చుకోవడమో తప్ప, సౌమనస్యమన్నదే లుప్తమైపోయింది. ఒకప్పుడు తనేం చెబితే అది చేసిన మంజరి-ఇప్పుడు ఆవిడ చెప్పిందాన్ని చెయ్యాలిసొస్తోంది. అంటే, పాత్రల తారతమ్యాలు మారిపోయాయన్నమాట! తనిప్పుడు -గుమస్తాగిరీ వెలగ పెడుతున్నాడే తప్ప, మంజరి మీద తనకెలాంటి పట్టూ లేకుండా పోయింది. తిరిగి తానెప్పటికైనా జారిపోయిన పగ్గాలను చేజిక్కించుకోగలిగితే, మంజరిని ముప్పతిప్పలుబెట్టి, మూడు చెరువులు నీళ్ళు తాగించిగాని వదలడు.

ఈ నిర్ణయానికొచ్చాక, చలపతిలో కొత్త ఉత్సాహమేదో పొటమరిచింది. తను కూడా మంజరినే అంటిపెట్టుకొని వుండాలనీ, సమయం వచ్చినప్పుడు చావు దెబ్బతీసి మరీ చెక్కెయ్యాలనీ అనుకొన్నాడు. విరోధం మీద సాధించలేని అనేక ఘనకార్యాలు హితవుతో సాధించవచ్చునన్నది చలపతి అనుభవపూర్వకంగా గ్రహించిన సత్యం.

ఎంత చిరాగ్గావున్నా, చెప్పిన పని చెయ్యకపోతే మరీ ప్రమాదం గనక, ఆ సాయంత్రానికల్లా చలపతి ఓ డ్రైవర్ను మాట్లాడాడు. మంజరి చెప్పిన షరతులన్నీ వివరించాడు. జీతం దగ్గర కొచ్చేసరికి చలపతికి దుర్బుద్ధి పుట్టింది. అతను డ్రైవరుతో బేరాలు సాగించాడు.

"అబ్బాయీ, ఇదీ సంగతి. బంగారం లాంటి ఉద్యోగం. ఫస్టుక్లాసయిన ఫ్రీక్వార్టర్స్ కూడా ఇస్తాను. నీకేం కావాలో చెప్పు" అన్నాడు చలపతి.

డ్రైవరు కాలాంతకుడు. ఇలాంటివారిని కట్టుకుపోయినంత మందిని చూశాడు.

"మీరేమిచ్చినా, నూరు నేనిప్పుడే తెచ్చుకొంటున్నాను. అంతకు మొగ్గితే నాతో మాట్లాడండి, ఆలోచిస్తాను. ఏమీ లాభంలేనప్పుడు నేను మాత్రం చేసేచేసే ఉద్యోగం వదులుకొని ఎందుకు రావాలిట?" అన్నాడతను.

నూటపాతిక దగ్గర ఖరారు పడ్డాడు చలపతి. అలా చేసినందుగ్గాను మొదటి నెలజీతం తను పుచ్చుకొంటాననికూడా అన్నాడు. ఈ మాట మంజరితో అన్నప్పుడు, ఆవిడ చాలా ఆశ్చర్యపోయింది.

"అంత జీతంలో కుదర్చమనా, మీతో అన్నది?" అని కూడా అన్నది.

"అతను చాలా మంచివాడు మంజు! సాధారణంగా డ్రైవర్లు రహస్యాలు దాచరు. సినిమాల్లో బోలెడన్ని రహస్యాలుంటాయి. అవన్నీ బయట వాగేస్తే కొంపలంటుక పోతాయి. అదీగాక - అతని హస్తవాసి కూడా మంచిది. అతనొచ్చాకనే 'లత'కు బోలెండంత డిమాండు పెరిగింది. లోగడ అతను పనిచేసిన కంపెనీలు, అతనున్నంత కాలం ఝుంఝుమారుతంగా వుండేవి. అతను పోవడంతో బూజుపట్టిపోయాయి. నేనివన్నీ ఆలోచించే, ఓ పదిరూపాయలు పోయినా మాబగేనని అతన్ని కుదిర్చాను" అని చెప్పుకొన్నాడు చలపతి.

మంజరి ఔననీ కాదనీ చెప్పలేదు. నిశ్శబ్దంగా పైకెళ్ళిపోయింది.

మొదలియార్‌గారి తమిళ పిక్చర్లో కొంత భాగం అయింది. పది పాటల దాకా రికార్డు చేశారు. అందులో రెండు పాటలు మంజరి పాత్ర పాడవలసినవీ ఉన్నాయి. వాటిని మార్పించి వసంత చేత పాడించాలని మంజరి అభిప్రాయం. అసలా షరతు మీదనే తను తక్కువ మొత్తానికి వొప్పుకొంది కూడాను. లేకపోతే ఇంకో అయిదువేలన్నా ఆ కంపెనీ నుండి మంజరి పిండి ఉండేది.

మొదలియార్‌కీ ప్రపోజల్ ఇష్టం లేదు. ఇప్పటికే అతగాడు ఒక్కోపాట మీదా మూడు, నాలుగు వేలదాకా తగలేశాడు. అందులో రెంటిని కాన్సిల్ చేసి మళ్ళా రికార్డు చెయ్యడమంటే, తడిసి మోపెడవుతుంది. అందుకని మంజరితో చాలా సున్నితంగా వ్యవహరించాడు.

"నేనన్నదేమో కరెక్టే, తప్పకుండా తీసుకొందాం. అయితే, ఇప్పుడు కాదు. ఈ పిక్చర్ అయిన వెంటనే నేనింకోటి ప్రారంభిస్తున్నాను. అందులో ఆ యమ్మకు తప్పకుండా మనం చాన్సిద్దాం" అన్నాడు మొదలియార్.

మంజరి అలా వీల్లేదన్నది.

"అయితే నన్నిప్పుడే గంగలో దూకమంటావమ్మా?" అన్నాడతను.

"నాకు గంగ సంగతీ తెలీదు. గోదావరి సంగతీ తెలీదు. మీరన్న మాటేదో మీరు నిలబెట్టుకోవాలని మాత్రమే నేనంటున్నాను. వసంత పాడలేనప్పుడు మీరేమన్నా నే వొప్పుకొంటాను. దివ్యంగా పాడేదాన్ని పట్టుకొని, మీరు కాదూకూడదంటే చిర్రెత్తుకొస్తుంది" అన్నది మంజరి అది కోపమో, హాస్యమో తేలకుండా.

"పోనీ కోరస్ సాంగ్ వొకటుంది. అందులో ఛాన్స్ యిద్దాం" అని రాజీకి దిగాడు మొదలియార్.

అతను మెత్తబడటాన్ని మంజరి గ్రహించింది. తనో మెట్టు దిగవలసిన అవసరం లేదనుకొంది. కోరస్ సాంగులో వసంత పాడదనీ, సోలో కావాలనీ పేచీ వేసింది. మొదలియార్ వొప్పుకోకుండానే వెళ్ళిపోయాడు.

"పోన్లే అక్కాయ్! నా గురించి నువ్వంత శ్రమపడకు. ఏది ఎప్పటిక్కావాలో అప్పటి కవుతుంది గానీ మనం తొందరపడితే పొద్దుగూకదు" అన్నది వసంత.

మంజరికీ సిద్ధాంతంలో బొత్తిగా విశ్వాసం లేదు.

"కూకుతుంది" అన్నది మంజరి కింది పెదవిని సున్నితంగా కొరుకుతూ. "ఇక్కడి మనుషులు వేరు, ఇక్కడి రోగాలు వేరు. ఏ జబ్బుకే మందు వెయ్యాలో నాకు తెలుసు"

వసంత యింకేదో అనబోయింది. రాజమణి సైగ చెయ్యడంతో, అనకుండానే ఆగిపోయింది.

మంజరి వేసిన మందేమిటో మరో నాలుగురోజులు తర్వాతగానీ తేలలేదు. మొదలియార్ కాల్‌షీట్ కుదుర్చుకొని, ప్రొడక్షన్ మేనేజర్‌చేత మంజరికి కబురు చేశాడు.

"నేను రాలేనండీ!" అన్నది మంజరి చాలా తాపీగా.

ప్రొ.మే. గుండెల్లో నిజంగానే రైళ్ళు పరుగెత్తాయి.

"పొన్లేగానండీ! మీరలా ఉన్నారేమిటి? ఏదో నలిగినట్లు కన్పిస్తున్నారు.
చూడండమ్మాయిగారూ, ఈ సినిమా లైనుంది చూశారూ - అబ్బో అబ్బో, మా గమ్మత్తయిందిలెండి. మీలాంటివారికి తీరిక దొరకడమంటే మరి మాటలా?" అన్నాడు. అతను తన మామూలు ధోరణిలో.

మంజరి వింటూ కూచుంది.

ప్రొ.మే. మళ్ళీ సాగించాడు.

"అవునుగానండీ అమ్మాయిగారూ! నేనో రహస్యం చెబుతాను - ఎక్కడా అనకుండా వుంటారా? అబ్బేబ్బే! మీరలాంటివారు కాదునుకోండి-మీ విషయం నాకు తెలుసుననుకోండమ్మాయిగారూ! ఈ ఫీల్డులో కొంతమంది ఉన్నారండీ, ఉత్తహోప్‌లెస్ ఫెలోస్. ఇలా వినడం, అలా ఇంకోరికి ఉప్పు అందించెయ్యడమూనూ. ఏ ముక్కన్నా కడుపులో ఇముడ్చుకోలేరు. మొదట్లో నేనూ తెలీక ఓసారి గోతిలో పడిపోయాను. పీక కాస్తా ఎగిరిపోతుందనుకొన్నాను. కానీ ఆ తిరుపతి వెంకన్న దయవల్ల తప్పిపోయింది. ఏదోలెండీ - నా సొద ఎప్పుడూ వున్నదేననుకోండి. మీరు మాత్రం అమ్మాయిగారూ, నేను చెప్పాననికాదుగానీ, ఓ మంచి డాక్టర్ను కన్సల్టు చేసి చూడండి. ఠాలా రోలీరకం కాదు సుమండీ! నాకు సుందర్రావని ఓ డాక్టర్ తెలుసు. చాలా మంచివాళ్ళెండి. మనవాళ్ళందరూ ఆయన దగ్గర్నే మందుచ్చుకొంటూంటారు. మీకు తెలిసే వుంటుందనుకొంటాను. కాదంటే ఓసారి వెడదామంటే వెడదాం" అన్నాడు.

"చూదాం" అన్నది మంజరి మామూలుగా.

ప్రొ.మే. అప్పటికీ ఊరుకోలేదు. అతను ప్రొ.మే.యే కాదు.

" అబ్బో, అబ్బో! వింటున్న మాకే పళ్ళు పులిసిపోతున్నాయనుకోండి. మా ప్రొడ్యూసర్‌గారు, అస్తమానూ మీ గురించే అంటూంటారు" అన్నాడు ప్రొ.మే.

ఈసారి మంజరి తన బింకాన్ని వదల్లేదు.

"మీరు కాఫీ తాగారా? పోన్లెండీ ఇంకోసారీ పుచ్చుకోండి" అని బెల్ నొక్కింది మంజరి.

"నో నో మేడమ్- థాంక్స్!" అన్నాడు ప్రొ.మే.

"అదేం? మీ ప్రొడ్యూసర్ కాఫీ కూడా తాగొద్దంటాడా?"

ఈ లోగా రెండు కప్పుల్తో వసంత కాఫీ పట్టుకొచ్చింది. టేబిల్ మీద కప్పులుంచి ప్రొ.మే. కేసి తిరిగి "నమస్తే" అన్నది వసంత.

"మా చెల్లెలు వసంత. బాగా పాడుతుంది. వీరు" అని పరిచయం చేసింది మంజరి.

"మిమల్ని చూసినందుకు చాలా సంతోషమండీ! అక్క ఎప్పుడూ మీ గురించే అంటుంది" అని శృతి కలిపింది వసంత.

తన శిక్షణ వృధా పోలేదనుకొంది మంజరి. కానీ దానికింకా లౌక్యం తెలీదని కూడా అనుకొంది. తెలిసిందయితే, ప్రొ.మే.గాడితో అలా అనదు. ఓ తార ప్రొ.మే.ను గురించి అస్తమానూ అనడమేమిటి - దాని తలకాయ!

''పట్టుకెళ్ళమ్మ!''

వసంత కక్కడ ఉండగూడదని అర్థం చేసుకొని వెళ్ళిపోయింది.

''ఆఁ చెప్పండి. మీ ప్రొడ్యూసర్ తిడుతున్నారనా అన్నారు?'' అని అందించింది మంజరి.

''శివశివా! అలా అన్నవారు పురుగులుపడి, చూసే దిక్కు లేకుండా పోతారండీ అమ్మాయిగారూ! మీరంటే ఎంత అభిమానమో వారికి! ఏమాటొచ్చినా ముందుగా మీ పేరే చెబుతారు. మీరట - అందరిలాంటివారు కారట. ఓసారి డైరెక్టరు చెబితే, అక్షరాలా అలానే చేస్తారట. ఎక్కువ టేక్సు తీసుకోరట. డైలాగ్స్ ఫర్‌పెక్ట్ గా అంటారట. మిమల్ని హీరోయిన్‌గా ఉంచి సోషల్ తీద్దామని ఆయన ఉద్దేశం. స్టోరీ కూడా రాయిస్తున్నారు. మాంచి డాన్సులు నాలుగైదు ఉంచేస్తున్నారు. అమ్మమ్మా, ఆయనకు నచ్చడమంటే మాటలు కాదండీ! మహా మహావాళ్ళే తల్లకిందులయిపోతుంటారు. ఏమనుకొన్నారో!'' అన్నాడు ప్రొ.మే.

మంజరి కళ్ళు మూసుకొంది. ఆమె పెదవుల మీద సన్నని చిరునవ్వు పెరిగి అంతలోనే మాయమయిపోయింది. తరువాత పది నిమిషాలగ్గానీ, మళ్ళీ మామూలు స్థాయికి రాలేదు. మెల్లగా కళ్ళు తెరచి, సోఫాలో సర్దుకుకూచుంది.

''మీకీ పూట పనేమి లేకపోతే, నాతో భోజనానికుండి పోగూడదూ?'' అన్నది మంజరి.

''భోజనమే! ఇప్పుడా? డొక్కా వాలికలై పోతుందండీ అమ్మాయిగారూ! ఇవ్వాళ చచ్చినంత పనుంది. అదంతా అలా ఉంచేసి, నేను మీతో కబుర్లాడుతూ కూచున్నాను. ఇహ చీవాట్లు తప్పవనుకోండి మరి బయల్దేరుతున్నారుగా -'' అన్నాడు ప్రొ.మే.

''అలా దారికిరారా బిడ్డా!'' అనుకొంది మంజరి.

''లేదు బాబూ!నేనీపూట రాలేను. నన్ను క్షమించాలి'' అన్నది చాలా వినయంగా.

''నన్ను చంపేశారండీ అమ్మాయిగారూ! వారే వస్తానంటే అవసరం లేదని నేనిలా వచ్చాను. ఈసరికి అందరూ వచ్చే వుంటారు. మేకప్ కూడా జరుగుతూ ఉంటుంది.''

''మరేం చెయ్యనండీ! ఏవో దిక్కుమాలిన కబుర్లలో పడిపోయాం. వేరేసారీ సార్ మరి వెళ్ళి రాకూడదూ?'' అన్నది మంజరి ఎంతో నొచ్చుకుంటూ.

ప్రొ.మే. ఆలోచించి, అటూఇటూ చూచి, ''అమ్మాయిగారూ! ఇవ్వాళ మీకేమన్నా పే చేస్తామన్నారా ప్రొడ్యూసర్‌గారు? నిన్ననే పాతికవేలకు డ్రాఫ్ట్ తెప్పించారు లెండి. బ్యాంకులో వేశాం. కావాలంటే మీ ఎక్కౌంట్‌కు చెక్కు పుచ్చేసుకోవచ్చు. లేదా క్యాష్ కావాలంటే - మీరలా స్టూడియోకు పదండి; ఈలోగా నేను డ్రా చేసి మరీ వస్తాను. పోనీ,నేనలా బ్యాంకీ కేసి వెళ్ళిరానా ఏమిటి?'' అన్నాడు ప్రొ.మే.

''అదేం కాదండీ! హెల్త్ బావోలేదు'' అన్నది మంజరి

''ఓసి దొమ్మరిముండా! కంపనా కట్టెనా కాలకుండా ఉన్నావే!'' అనుకొన్నాడు ప్రొ.మే.

''అలానండీ పాపం! ఏదో వీలు చూసుకొని, అలా ఓ గంట వచ్చి పోగూడదూ? ఒక్కటే షాట్ మిగిలిపోయిందండీ! మళ్ళా దొరకటం కష్టం. ఎలాగన్నా వోపిక చేసుకొందురూ! ఇవి చేతులు కావనుకోండి.''

“నన్నింతసేపూ అడగక్కర్లేదు. నా విషయం తెలిసికూడా మీరిలా అనడం మరీ ఘోరం. నేనేదో కడుపులో ఉంచుకొని ఇలా అంటున్నానని మీరనుకొంటే, అంతకన్నా అన్యాయం మరోటి ఉండబోదు మీ మనస్సు కష్టపెట్టానేమో, మన్నించమంటున్నాను” అన్నది మంజరి.

ప్రొ.మే. కోపం కట్టలు తెంచుకొంది. తనెంత పోరుకాడినా కార్యం సాఫల్యం కాలేదు. ఇన్నేళ్ళ తన అనుభవమంతా మట్టిలో కలిసిపోయింది. ఈ అఘాయిత్యం తప్పించడం ముందు తను ఎందుకూ పనికిరాడని తేలిపోయింది.

“అయితే మరి సెలవు” అంటూ అతను వెళ్ళిపోయాడు.

అతనొచ్చిన కారు కదిలాక, మంజరి విరగబడి నవ్వింది.

“ఈ పూట వెళ్ళవా అమ్మాయ్?” అన్నది రాజమణి.

“ప్చ్!”

“అతనేదో కాళ్ళా వేళ్ళా పడుతున్నాడు గదుటే పాపం!!” అన్నది రాజమణి.

“అవసరం తీరిందాకా అలానే పడుతుంటారు అక్కాయ్! వీళ్ళను చీల్చి ఎండేసినా పాపం లేదు” అన్నది మంజరి.

అరగంటలోగానే మొదలియార్ వచ్చాడు. అతని ముఖం చూస్తే, అతనెంత చిరాగ్గా ఉన్నాడో ఇట్టే తెలిసిపోయింది.

“నమస్కారమమ్మాయ్! ఒళ్ళు సరిలేదన్నావుటగా!” అన్నాడు మొదలియార్ కుదుటపడుతూ.

“మరేనండీ! ఈ దిక్కుమాలిన ట్రబుల్ కూడా ఇప్పుడే రావాలా? మీకే మాత్రం అవకాశమున్నా ఈ కాల్‌షీట్ కాన్సిల్ చేసుకోకూడదూ?” అన్నది మంజరి.

అందువల్ల ప్రొడ్యూసర్ ఎన్నివేలు నష్టపోవలసివస్తుందో మంజరికి తెలీకకాదు. తెలిసే ఆవిడా మాటలన్నది.

“నేనందుకోసం రాలేదు. మీ వసంతను టెస్టుకు తీసుకుపోదామని వచ్చాను. మీరంతగా పాటికి పదిసార్లు చెబుతున్నప్పుడు కాదనడం నాకే అసహ్యంగా ఉంది! ఇదంతా పెద్ద రిస్కేననుకొండి. అయినా ఎక్స్‌పెరిమెంట్ చేదామనే డిసైడ్ చేశాను. మీరైనా పాట బాగా లేకపోతే తీసుకొమనరు గదా!” అన్నాడు మొదలియార్.

“అలా లొంగిరా బిడ్డా?” అనుకొంది మంజరి.

“వన్ మినిట్! వసంతను కేకేసుకొస్తాను” అంటూ లోపలికొచ్చింది మంజరి.

“యూ ఆర్ లక్కీగరల్ వసూ! కాళ్ళబేరానికొచ్చాడు. నీ చేత పాడిస్తానన్నాడు.

నువ్వు త్వరగా రెడీగా. మిగతావన్నీ నేను చూసుకొంటాను” అన్నది మంజరి

“దేవుడికి మొక్కుని పో తల్లీ!” అన్నది రాజమణి.

అరగంటకల్లా రెండుకార్లూ స్టూడియో కొచ్చాయి. అప్పటికే మిగతా యాక్టర్లు మేకప్ చేసుకొని రెడీగా ఉన్నారు. వాళ్ళతో విడవిడిగా తీయవలసిన షాట్సన్నీ డైరెక్టర్ తీసేసుకొన్నాడు మంజరి ఉంటే తప్ప, మిగతా షాట్స్ తియ్యడానికి లేదు.

“మీ కోసం గంటన్నర నుంచీ పడిగాపులు కాస్తున్నాం” అన్నాడో యాక్టర్.

“ఆరోగ్యం బావోలేదు లెండి. లేకపోతే ఆ అమ్మాయి అలా ట్రబులిచ్చేది కాదు. చూడండి అమ్మాయి! మీరు చప్పున మేకప్ చేసుకోస్తే - అరేయ్ నారాయణా! అమ్మాయిని తొందరగా పంపించమని మేకప్‌మాన్‌తో చెప్పు” అన్నాడు డైరక్టర్

''ఇంతదూరం ఎలాగూ వచ్చారు గదా! రెండు షాట్స్ లాగేదాం. నే నీలోగా వసంత వ్యవహారం చూస్తాను, మీరలా వెళ్ళిరండి'' అన్నాడు మొదలియార్

మంజరి ఓసారి అందర్నీ చూసి, ఏమనుకొందో ఏమోగానీ నిశ్శబ్దంగా తలొంచుకొని వెళ్ళిపోయింది.

''అక్కయ్య ఇప్పుడే వస్తుంది. అందాకా మీరోసారి పాటను చూసుకోవచ్చు. ఇలా వెడదాం రండీ!'' అంటూ వసంతను తీసుకెళ్ళాడు మొదలియార్.

''ఏమిటండీ ఈ తలనొప్పి? ఈవిడ కోసమని ఎంతమంది కాచుక్కూచుంటారుట? ఆ మాత్రం జ్ఞానం ఉండక్కర్లా? రెండు పిక్చర్లలో వేషాలు దొరగ్గానే కళ్ళు నెత్తిమీదికోస్తే ఎలా?'' అని విసుక్కున్నాడు హీరో.

''నిజమే బాబూ! ఇంకోసారిలా జరక్కుండా చూదాం. ఆవిడ ఏదో చేసిందని, మనం తొందరపడితే ఎలా? పొరబాటు పొరబాటే! నేను సీరియస్‌గా వార్నింగ్ ఇస్తాన్లెండి!'' అని సర్దేశాడు డైరక్టర్.

మంజరి ఆ పూట సరిగ్గా చెయ్యలేదు. ఆవిడ మనస్సంతా వసంత చుట్టూ తిరుగుతోంది. తను మ్యూజిక్ డైరక్టర్‌తో మాట్లాడటానిక్కూడా అవకాశం లేకపోయింది. అయినా ఫర్వాలేదు. ఆ విషయం తను చూచుకోగలదు.

గంటలో అయిపోతుందనుకొన్న పని రాత్రి తొమ్మిదిగ్గానీ కాలేదు. ఈ లోగా వసంతకు రెండు మూడు పాటలిచ్చారు పాడమని. పాట దిగువను ''నొటేషన్స్'' కూడా రాశారు పాపం! వచ్చిన చిక్కేమిటంటే - వసంత గొంతు మంచిదేగానీ, ఆ గొంతుకు స్వరాలంటే ఏమిటో తెలీవు. ''స'' - ''ప'' -''గ'' అన్నీ ఒకే స్థాయిలో అంటోందిగానీ, స్వరబేధాలు పలికించలేకపోతోంది. వసంతకు చాతయిందల్లా ఒక్కటే! ఎవరన్నా ఓసారి పాడి వినిపించాలి. మక్కీకి మక్కీగా దాన్ని అనుకరించడంలో మట్టుకు ఢోకా లేదు. కానీ, వసంత కామాత్రం సాయం చేసేదెవరుట?

ఈ గొడవలన్నీ చెప్పినప్పుడు మంజరి తల చిటచిటలాడిపోయింది.

''అబ్బబ్బా! ఏం ప్రపంచమే ఇది? ఇందులోకి కొత్తవాళ్ళు రావడమంటే బ్రహ్మప్రళయమనుకో అలా జిడ్డులాగా గీమారుతూ అంటిపెట్టుకొని వుండగా వుండగా ఎప్పటికో వో చిన్న అవకాశం దొరికితే, అది అదృష్టమే ననాలి. ఒక్కో వ్యక్తికి అదీ ఉండదు. ఇంతకన్నా అడుక్కు తినటం నయం!'' అన్నది మంజరి.

''అయితే వసంత పని ఖాళీయేనా మంజూ?'' అన్నది రాజమణి.

''చూదాం. ఇంకా టైముందిగదా! మనమేం చేశామనీ, ఇప్పటికప్పుడే అలా కుంగిపోవడం? ఇలాంటివి లక్షోపలక్షలు. అవన్నీ కిక్కురుమనకుండా భరించవలసిందే!'' అన్నది మంజరి మేకప్ కడుక్కొంటూ.

భోజనానికి కూచోబోయేముందు చలపతి ఫోన్ చేశాడు.

''ఏమిటి?'' అన్నది మంజరి

''కిశోర్ నాలుగుసార్లు ఫోన్ చేశాడు'' అన్నాడు చలపతి.

''కిశోరా? ఎవడండీ?''

''మెహతాగారి పెద్దబ్బాయి. విషయమేమిటంటే చెప్పాడు కాదు. రాగానే ఫోన్ చెయ్యమన్నాడు. చేసి, నీకు కనెక్షనివ్వనా? లేకపోతే వొంట్లో బావోలేదని చెప్పనా?'' అన్నాడు చలపతి.

“ ఏం చెయ్యవలసిందీ నిర్ణయించేది నేనుగానీ నువ్వు కాదు. నీ వల్లా నేను చెప్పింది. చెయ్యడమే! కనెక్షనివ్వు” అన్నది మంజరి కటువుగా.

మరో నిమిషానికల్లా అవతలికోసనించి “హలో” అని వినిపించింది.

మంజరి విసుగునంతా కప్పి పెట్టుకుంటూ “విష్” చేసింది.

“మన్నించాలి. నేను ఇప్పుడే స్టూడియో నుండి వస్తున్నాను. అవునవును మా సెక్రటరీ చెప్పాడు. అదేమిటండీ, మీరు నాకు తెలీకపోవటమేమిటట? ఎక్కడ? ఆయామ్ వెరీ హాపీ టు స్టే దేర్ సర్టెన్లీ మై డియర్ ఐ విల్‌కమ్.”

“క్లిక్” మని నొక్కి చలపతికి ఫోన్ చేసి, “బయటికెళ్ళాలి. కారు తీసుకురమ్మను” అన్నది మంజరి.

“భోజనమన్నా చేసిపోవే తల్లీ!” అన్నది రాజమణి

“ఛాఛా, వీడేం మనిషక్కాయ్! బాంబేనుండి గోపిచంద్ పార్టీ వాళ్ళొచ్చారు. డిన్నర్‌కు రమ్మని నన్ను ఇన్‌వైట్ చేశారు. లక్ష పనుల్లో నాకా సంగతే జ్ఞాపకం లేదు. ఈ వెధవల గుర్తు చెయ్యొద్దా? వాళ్ళంతా నా కోసం కనిపెట్టుకొని కూచున్నారట సరే, మీరు కానివ్వండి. నేను వచ్చేసరికి చాలా పొద్దుపోతుంది.”

మంజరి మేకప్ అవడానికి తాయారు సాయం చేసింది. తీరా బయలుదేరబోయే ముందు కళ్యాణి కోసారి ఫోన్ చేద్దామా, అనుకొన్నది మంజరి. కానీ చెయ్యలేదు. అదేమంత ముఖ్య విషయమని కళ్యాణికి చెప్పడం? ఆదీగాక - ప్రతి చిన్నదాన్నీ, కళ్యాణీ దాకా తీసుకుపోవడం కూడా భావ్యం కాదు. ఎవరైనా దోవచూపిస్తారేగానీ, దోవపొడవునా చెయ్యిపుచ్చుకు నడవరు గదా !

కారు గేటు దాకా స్పీడు తగ్గించి, “ఎక్కడికమ్మా?” అన్నాడు డ్రైవరు.

“హాపీ సెంటర్” అన్నది మంజరి.

“నేనే కిశోర్‌ను. మెహతా మా నాన్న” అంటూ హాపీ సెంటర్ హాల్లో ఓ ముప్పయ్యేళ్ళ యువకుడు లేచి నిలుచున్నాడు.

“వెరీ గ్లాడ్‌టు సీయు” అన్నది మంజరి. ఇద్దరూ ఓ మూలగా ఉన్న రూంలో కొచ్చారు.

“మొదలియార్ పిక్చర్‌లో మీరున్నారు గదూ? రషెస్ చూశాను. అద్భుతంగా యాక్ట్ చేశారు. మొత్తం పిక్చర్ పూర్తయిందాకా ఉండట మెందుకని, ముందుగానే మీకు పార్టీ ఇవ్వాలనుకొన్నాను. మీరీ రాత్రి..... ”

“ఊఁ” అన్నది కళ్ళు చిట్లించి.

“మీ కోసమని చాలాసార్లు ఫోను చేశాను. స్టూడియోలో ఉన్నారని తెలిసింది. ఏకంగా అక్కడికే వచ్చేదామనుకొన్నాను” అన్నాడు కిశోర్.

“పోనీ రాకపోయారా?”

“మరీ అంత తొందరెందుకని మానేశాను. ఆ పిక్చర్‌కు, మా ఫ్రెండే ఫైనాన్స్ చేస్తున్నాడు. మొత్తం కాదనుకో. ఉదయం ఇద్దరం రషెస్ చూశాం. మరింక నిన్ను చూడకుండా ఉండలేకపోయాను. నువ్వేమనుకొన్నా సరేనని పిలిపించాను. ఇఫ్‌యు డోన్ట్‌మైండ్”

“మీరు మీ అమ్మగారిలా ఉంటారా?” అన్నది మంజరి హఠాత్తుగా.

“ఏం?”

“మీ అమ్మ చాలా అందంగా ఉంటారనుకొంటాను. వీలయితే వారి నోసారి చూడాలనిపిస్తోంది

- మిమల్ని కలుసుకొన్నాక!'' అన్నది మంజరి.

కిషోర్ భుజా లెగరేశాడు.

''పార్టీ అంటూ నన్ను చాలా దూరం నుండి పిలిపించారు. మామూలు పార్టీ అయితే, నేనింకోసారి రాను. గ్రాండ్‌గా ఉండాలి. ఎలా చేస్తారో చూస్తాను'' అన్నది మంజరి నవ్వుతూ

కిశోర్ తన్మయుడయిపోయాడు.

''ముందుగా........'' అని అడిగాడు.

''గో (అ)న్ ఇహవన్నీ నన్నడక్కూడదు. మీరు హొస్టు, నేను గెస్టును'' అన్నది మంజరి.

కిశోర్ ఓ గుక్క పీల్చి, సిగరెట్ అంటించాడు. మంజరికి ఆఫర్ చేశాడు. ఓ క్షణం ఆలోచించి 'సారీ' అన్నది మంజరి.

''నువ్వు సినిమాలోకంటే విడిగా అందంగా ఉంటావంటే కోపం రాదు గదా?'' అన్నాడు కిషోర్.

''వస్తుంది''

అయినా అంటాను. నేను ఫీలయిందాన్ని చెప్పకుండా ఉండలేను.''

కిషోర్ గ్లాసు ఖాళీ చేశాడు.

''మీకు మనుషుల్ని ఉబ్బెయ్యడం బాగా తెలుసుననుకొంటాను. ఈ మాటే నేనంటే మీకు కోపం వస్తుందా?''

''రాదు'' అన్నాడు కిషోర్.

''అమ్మో అసాధ్యులు'' అన్నది మంజరి పగలబడి నవ్వుతూ

ఎందుకో తెలియకుండా కిషోర్ కూడా నవ్వాడు.

''నేనో సలహా ఇవ్వమంటే ఇస్తాను, మీరు వింటారామరి?''

''వై నాట్?'' అన్నాడు కిషోర్.

''మీరు సినిమాల్లో చేరిపోకూడదూ? ఇప్పుడున్న హీరోలందరూ తోకముడుచుకొని ఉడాయించేస్తారు గదా! ఏమిటో కిషోర్! పేరేగానీ, ఒక్కడి బాడీకూడా ప్రపోర్షనేట్‌గా ఉండదు. విడిగా చూస్తే మేమందరమూ అంతేననుకో! నీలాంటి పర్సనాలిటీ ఉన్నవాడు ఈ ఫీల్డులోకొస్తే కొరుక్కు తినేస్తారుగానీ వదలరు'' అన్నది మంజరి.

''ఎవరుట ఆ పని చేసేది?''

''నాటీబోయ్! నా చేత నీ పేరు చెప్పించుకోవాలనా నీ ఎత్తు?''అన్నది మంజరి.

కిషోర్ ఆ మాటలతో కుదిలించుకుపోయాడు.

''నువ్వన్నది నిజమో కాదో నాకు తెలీదుగానీ, నేనా భయం చేతనే సగం సినిమాల్లో చేరడం మానేశాను.''

''అలా ఎంతకాలమని దాక్కుంటారుట? ఏ నాబోటి దాని కళ్ళనో మీరు పడకా మానరు. అన్నంతపనీ జరక్కా మానదు. ఇప్పుడిక మీరు చెయ్యగలిగిందేమీ ఉండదుకూడాను'' అన్నది మంజరి.

''అంటే నువ్వు నన్ను కొరుక్కు తినేస్తానంటావు. అంతేనా?'' అన్నాడు కిషోర్.

''అయ్యో! లేకపోతే ఎలారా నాయనా?'' అనుకొంది మంజరి.

కిషోర్ వచ్చి ఆమె పక్కనే కూచున్నాడు. అతని కళ్ళు బాగా ఎరుపెక్కాయి. ముక్కపుటాలు బిగించి గాలి పీలుస్తున్నాడు. చేతి వేళ్ళు కొద్దిగా వణుకుతున్నాయి.

"తయారవుతున్నాడు!" అనుకొంది మంజరి.

మొన్న ఇదేవేళకు తను రాజన్ ప్రక్కన్న కూచున్నది. తనకెదురుగా కళ్యాణి. రాజన్‌తో కూడా తను తొలిగా అతన్ని కలుసుకొన్నప్పుడు, ఇదే ధోరణిలో మాట్లాడింది. రాజన్ తెలివైన ఘటం! అతనితో ఎంతో జాగ్రత్తగా వ్యవహరించాలి. కిషోరు లాంటి వాజమ్మలను ముక్కుకు దారం వేసి తను ఆడించగలడు. అదృష్టవశాత్తూ భగవంతుడు వీరికి డబ్బిచ్చాడుగానీ తెలివితేటలిచ్చాడు కాదు. అవీ ఉంటే ప్రపంచాన్ని మాడ్చుకు తినేసేవారు!

చిత్రమేమింటే, తన జీవితంలో ఎదురైన వారందరిదీ వొకటే మచ్చు. తమ డబ్బును చూసిగాక, తమను చూసే తను భ్రమసిపోతుంటుందని వారనుకొంటారు! ఒకవిధంగా అది వారి తప్పు కూడా కాదేమోననిపిస్తుంది. అలాంటి భ్రమను కలిగించేది కూడా తనే! కానీ అది తనకు తప్పనిసరి! ఆ భ్రమే లేకపోతే, వారి నుండి తను దమ్మిడీ పొందలేదు. కానీ ప్రతివాడికీ, తను వాడి సోత్తనే నమ్మకం గుడ్డి నమ్మకం - అవసరమేమో! ఆ నమ్మకంలోనే వాడికానందం లభిస్తే అది వాడి ఖర్మ! ఇప్పుడు వీడూ ఇంతే. వీడ్ని చూసి తనేదో భ్రమసిపోతున్నానని వీడనుకొంటున్నాడు. నిజానికి ఈ మనుషులంటే తన కెంత అసహ్యమో వీరికి తెలీదు! ఏదో వొకరోజున ఈ మనుషులందర్నీ వరసగా నుంచో బెట్టి కాండ్రించి ముఖాన ఉమ్మేస్తూ పోవాలనిపిస్తుంది. అప్పటిగ్గానీ వారంటే తనకున్న నిజమైన అభిప్రాయమేమిటో తెలీదు. అలాంటి అవకాశం తనకు వస్తుందో రాదో తెలీదు. వచ్చిన రోజున అన్నంత పనీ చేయడం మాత్రం ఖాయం.

"ఏదో పరధ్యానంగా ఉన్నావ్?" అన్నాడు కిశోర్.

"నిన్ను గురించేరా వాజమ్మ!" అందామనుకొంది మంజరి.

ఆ ముక్క కాస్తా అనేసి, వాడి ముఖం కేసి చూసి, చప్పట్లు చరచాలనిపించింది.

"మాట్లాడవా?" అన్నాడు కిశోర్ ఇంకొంచెం దగ్గరికి జరుగుతూ

"మరేం లేదు మిమల్ని ఎటునుంచి కొరుక్కు తినడమా అని ఆలోచిస్తున్నాను అరరె ఉ ‍ండండి ఏమిటి అఘాయిత్యం" అన్నది మంజరి అతన్ని దూరంగా నెట్టేస్తూ

"నిన్నింత అందంగా ఉండమని ఎవరు చెప్పారు మంజరీ! అందంగా ఉండటంలో నీ తప్పేమీ లేదా? అది చూసి, ఎవరన్నా ఏమైనా చేస్తే వాడిది తప్పా? ఇదేం న్యాయమో నాకు తెలీదు మరీ నువ్వలా దూరంగా వెడితే, నేనూ రాగలను"

"రండి!" అన్నది మంజరి సన్నగా నవ్వుతూ చికిలించి.

కిశోర్ పూర్తిగా చిత్తయిపోయాడు.

# 16

మంజరికీ పూట మనస్సూ శరీరమూ కూడా బావోలేదు. నిన్నటి సంఘటన పదేపదే జ్ఞాపకం వచ్చి ఆమె చికాకు పడసాగింది. తనెంత తెలివిగా వ్యవహరించాననుకొందో, అంతకన్నా తెలివిగా మొదలియార్ వ్యవహరించాడు. వసంత విషయం తేలిందాకా తను కాల్‌షీట్ కెళ్ళగూడదనుకొంది. కానీ, వెళ్ళక తప్ప లేదు. వసంత విషయం ఏమయిందీ తెలీదు. ఈ గొడవలు కాక మధ్యలో కిశోర్ యింకో బెడద తెచ్చిపెట్టాడు. అదో తలనొప్పి వ్యవహారం. ఇవన్నీ తనెందుకు తెచ్చిపెట్టుకొంటున్నదో తెలీదు. ఓ క్షణం కంటారా నిద్రపోవడానికి లేదు. ఓ గంటసేపు ప్రాణానికి హాయిగా ఉండేందుకు

లేదు. ఎందుకొచ్చిన లాయలాసా ఇదంతా?

ఈ ప్రశ్నకు మంజరి ఏమని సమాధానం చెప్పుకొనేదో తెలీదుగానీ, ఇంతలో కింద నుండి చలపతి ఫోను చేశాడు.

"ఏమిటి?"అన్నది మంజరి విసుగ్గా.

"శర్మ-శర్మగారు-వచ్చారు...అదే "కొరడా"పత్రిక ఎడిటర్...అలాగే".

మరునిమిషాలకల్లా తోలుసంచీ పట్టుకొని, పెదాల మధ్య సిగరెట్ పొగలు రాజుతుండగా శర్మగారు పైకొచ్చారు.

ఏదో విశేషం లలేనిదే శర్మ రాజని మంజరికి తెలుసు. వాడికి డబ్బవసరం కలిగి నప్పుడల్లా! ఇలా వచ్చిపోతూ ఉంటాడు. పది పరకాయిస్తే పుచ్చుకోడు. వందకు తక్కువ పుచ్చుకోవడం తన డిగ్నిటీకి భంగమంటాడు. అదయినా అప్పుగా అడుగుతాడు గాని, ఉత్తినే యివ్వమనడు. ఆ అప్పు మళ్లా తీర్చేదిగాదు. అయినా సినిమా తారల డబ్బు చేతి నుండి దాటాక, తిరిగి రావడమంటూ ఎప్పుడు జరిగింది గనక!

"నమస్కారం శర్మాజీ! దయచేయండి. ఈ మధ్య బొత్తిగా దర్శనాలే కరువయ్యాయి". అన్నది మంజరి నవ్వుతూ.

శర్మగారు ఏమీ మాట్లాడలేదు. తోలుసంచి పక్క కుర్చీలో పడేసి తనో కుర్చీలో కూచుని, కాలుమీద కాలుసేవుకొని గట్టిగా సిగరెట్ పీల్చి ఒక్కసారిగా పొగవదిలేశాడు.

ఈ వికారపు చేష్టలు మంజరికి అసలే గిట్టవు. అయినా తన అయిష్టాన్ని లోలోపలే అణచుకొని, పైకిమాత్రం కులాసాగా నవ్వింది.

"శర్మాజీ! నేనేవిషయమడుగుతాను. నిజం చెబుతారా?"అన్నది మంజరి.

"తప్పకుండా!"

"రోజుకెన్ని సిగరెట్లు కాలుస్తారండీ మీరు? ఈ పంపిణీమీద ఎంతకాలం-"

శర్మ తాపీగా నవ్వాడు.

అతని ధోరణి చూస్తుంటే, ఏదో విశేషం చెప్పడానికొచ్చిన వాడికిమల్లే ఉన్నది. కానీ "తైలం" పడందే మాట పెగలదు. వాడడక్క ముందే తనంతటతనే "తైలం" మాట ఎత్తడం బావుంటుందా? అయినా పోదామనుకొంది మంజరి. "పత్రికెలా పోతోంది శర్మాజీ?"అన్నది రెండు కప్పుల కాఫీ తెమ్మని వసంతకు పురమాయిస్తూ.

"అలాగే గెంటుకొంటూ వస్తున్నానండీ! ఎంత గింజుకుచచ్చినా నాలుగువేలు దాటటం లేదు. రావలసిన బాకీలు అయిదారువేలదాకా వున్నాయి. కానీ, ఒక్కరూపాయి వసూలు కాదు. అలాగని పత్రిక ఆపటానికి వీల్లేదు"అన్నాడు శర్మ.

"అంతదాకా బాకీలెందుకు పెంచుకుంటారండీ? ఎప్పటికప్పుడు వసూళ్లు చేసుకోరాదా?"అన్నది మంజరి.

"అదో గొడవతల్లీ! సినిమా పత్రికలయినా అట్టేమంది చందాదారులుండరు. విడి అమ్మకాలమీదనే ఆధారపడి ఉండాలి. అంటే-ఏజెంట్ల దయాదాక్షిణ్యాలమీద పత్రిక బతుకుతూ ఉంటుందన్నమాట. పోన్లెండి-ఈ క్షోభ ఎప్పుడూ ఉండేదే!" అన్నాడు శర్మ.

వసంత తెచ్చిన కాఫీని మంజరీ శర్మా పుచ్చుకొన్నారు. వసంతను మాత్రం శర్మకు పరిచయం చెయ్యలేదు మంజరి.

వసంత వయ్యారా లొలకబోస్తూ ''నమస్తే''అన్నది.

శర్మకూడా ప్రతి నమస్కారం చేశాడు.

''చెప్పండి శర్మాజీ! ఈ పూట నా మనస్సేమీ బావోలేదు. మీరింకో అరగంటసేపు రాకపోతే, నేను కబురు పెట్టేదాన్ని''అన్నది మంజరి.

''ఆఁ-పోనిద్దురూ!''అని తేల్చేశాడు శర్మ.

''కాదు కూడదు చెప్పాల్సిందే''నన్నది మంజరి. వసంత కూడా చెప్పి తీరాలన్నది.

''ఏముందండీ చెప్పేందుకు? ఈ ఏజెంట్లు, ఎక్కడెక్కడో ఉంటారు. చాలామంది డిపాజిట్లు కట్టరు. అమ్మిన డబ్బు పంపుతామంటారు. తమకు ఫలానా ఫలానా పత్రికలు వస్తున్నాయనీ, ఎవ్వరికీ తాము డిపాజిట్ కట్టలేదనీ, కనుక మీరు కూడా ఈ జాబు అందగానే ఇన్ని కాపీలు ఫలానా రైల్వేస్టేషన్‌కు పంపమనీ రాస్తారు. పత్రిక సేల్సు పెరగుతుంద గదాని కాపీలు పంపుతాం. రెండు వారాలయ్యాక డబ్బు పంపమని ఉత్తరాలు రాస్తాం. పంపవలసిన డబ్బులో కొంత పంపుతూ, ఈసారి ఇంకో యాభై కాపీలు అదనంగా కావాలంటారు. ఇలాగా దాదాపు ఏజెంట్లందరూ రాస్తారు. ఈసారి యింకో వెయ్యి కాపీలు ఎక్కువ స్ట్రైక్ చేయించుతాం. వాళ్ళడిగిన కాపీలు పంపుతాం. మూడోసారి -పంపవలసిన డబ్బు పంపడు. కానీ రెండు వందల కాపీలు కావాలంటాడు. పత్రిక హాట్‌కేక్సులాగా అమ్ముడవుతోందంటాడు. జూలై నాటికి అయిదొందల కాపీల దాకా సేల్సు పెంచుతానంటాడు. ఊళ్లో అన్నిచోట్లా పత్రికలను డిస్ట్రిబ్యూట్ చేస్తున్నాననీ, పత్రికలతో బాటుగా, వాల్‌పోస్టర్లు కూడా పంపుతే ఇంకా అమ్మకాలు పెరుగుతాయనీ మనకు సలహా ఇస్తాడు. సబ్‌ఏజెంట్ల నుండి ఇంకా వసూళ్లు కాని కారణంగా డబ్బు పంపలేక పోయాననీ, అందంగానే టి,యం.ఓ. ద్వారా పంపుతాననీ అంటాడు. మళ్లీ వాడికి రెండొందల కాపీలు పంపుతాం''.

''పోనీ పంపడం మానెయ్యరాదూ?''అన్నది మంజరి.

''అలా వీలుపడదు లెండి!''అన్నాడు శర్మ తాపీగా.

''ఎందుచేతనుట?''

''ఏజెంట్ల నుండి ఉత్తరాలు వచ్చేసరికే యిక్కడ ఫారాలు అచ్చవుతూ ఉంటాయి. పత్రిక తయారయ్యేనాటికి -డబ్బు పంపని ఏజెంట్లకు కాపీలు పంపమనుకోండి-ముప్పావలా వంతు కాపీలు మిగిలిపోతాయి. వాటిని మణుగుల లెక్కన తూకానికమ్మితే, రెండుపూటలా భోజనానికొడా రాదు. ఏజెంటు మీద బాకీ ఉండటమే మంచిదనుకొని, మళ్లా పంపుతూ ఉంటాం. ఇలాగ సంవత్సరం గడిచేసరికి, ఒక్కొక్క ఏజెంటు అయిదారు వందల బాకీ తేల్తాడు. మనం ఇక్కడ నుండి ఎన్ని ఉత్తరాలు రాసినా డబ్బు పంపడు. వసూళ్లకోసం మనిషిని పంపామనుకోండి. వాడెంత ఇచ్చాడో, వీడెంత ఖర్చు చేసుకొన్నాడో లెఖ్ఖతేలదు. నేనే వొకసారి టూర్ బయలుదేరాను. ఖర్చులకొడా వసూలు చేసుకోలేకపోయాను. గట్టిగా అడిగితే, అసలు నువ్వు ఫలానా పత్రికవాడివన్న గ్యారంటీ ఏమిటన్నాడో ఏజెంటు. రాజమండ్రి ఏజెంటు తనకింత వరకూ మీ పత్రిక రాలేదన్నాడు. తన పేరుగల వాళ్లు రాజమండ్రిలో చాలామంది ఉన్నారనీ, వారెవరన్నా పార్శిల్సు తీసుకొంటున్నారేమో తనకు తెలీదని, పత్రిక మాత్రం తను అప్పుడప్పుడు చూస్తున్న మాట నిజమేననీ, ఇక నుండి తనకు ఏజెన్సీ ఇచ్చే పక్షంలో రెగ్యులర్‌గా డబ్బు పంపుతూ ఉండగలననీ అన్నాడు. వాణ్ణి ఏంచేసేటట్లు చెప్పండి? వీడి తాతలాంటివాడు అనకాపల్లిలో ఉన్నాడు. నా పత్రిక మొదలెట్టినప్పణ్ణించీ వాడికి కాపీలు పంపుతున్నాను. ఎర్రని ఏగానీ జమపడలేదు. ఖమ్మం ఏజెంటుకు రాస్తే-వాడు స్టేట్‌మెంటు

పంపించాడు. దాని ప్రకారం ఆ ఏజెంటుకు నేను రు.112-00లు బాకీ ఉన్నాను...ఇహ చెక్కులు పంపించే మహానుభావులున్నారు. వాళ్లు పెట్టే బాధలు వర్ణనాతీతం!''.

మంజరికి నవ్వాగింది కాదు. పకపకా నవ్వుతూ, ''చాలా ఇంటరెస్టింగుగా ఉంది శర్మగారూ! ప్రొసీడ్''అన్నది మంజరి.

శర్మ మరోసిగరెట్ వెలిగించాడు.

''ఇంకోసారి కాఫీ తెప్పించనా?''

''నో ప్లీజ్ థాంక్స్''అన్నాడు శర్మ.

''ఊఁ...చెక్కులు పంపేవాళ్లు-'' అని అందించింది మంజరి.

''మీరు బోరెత్తి పోతారేమోనని నా భయం!''అన్నాడు శర్మ నవ్వుతూ.

''నో..నో...యు ప్రొసీడ్''.

''చిత్తూరులో అజీజ్ అని వో ఏజెంటున్నాడు. రెండువందల రూపాయలకు చెక్కు పంపుతూ, నాలుగువందల కాపీలు ఫలానా స్టేషనుకు పంపమనీ, రాయలసీమ మొత్తానికి తనకే ఏజెన్సీ ఇచ్చే పక్షంలో రెండు వేల రూపాయలు డిపాజిట్ చేస్తాననీ రాశాడు. అయితే కమీషను 25%కాక 33-1బై3% కావాలన్నాడు. రెండువేల రూపాయలంటే-నామట్టుకు నాకు అదో పెద్ద మొత్తమే! ఆ డబ్బు పెట్టి ఏకంగా ఓ వందరీములు న్యూస్ ప్రింటుకొని పడేస్తే, కాగితం బెడద వొదులుతుంది గదా అనుకొన్నాను. వెంటనే అజీజ్‌ను రాయలసీమకు సోల్ ఏజెంటుగా ఖాయపరుస్తూ వైరిచ్చాను. ఇటు-వాడడిగినన్నీ కాపీలూ పంపించాను. పత్రికలు అమ్ముకొని తినేశాడు. వారం రోజులకల్లా, చెక్కు తిరిగి నాదగ్గరకొచ్చింది. ఇదేమిటని అజీజ్‌కు ఉత్తరం రాస్తే జవాబు లేదు. ఇది జరిగిన నెలరోజులకల్లా అహమ్మద్ అని ఇంకో ఏజెంటు నాకు రాస్తూ, పత్రిక ఏజెన్సీని తనకివ్వమన్నాడు. అజీజ్ ఉత్తదొంగవెధవనీ, చాలామంది పత్రికలవాళ్లను ఇలానే మోసం చేశాడనీ, తను మాత్రం 25% కమీషను పోగా మిగిలిన డబ్బును ప్రతినెలా 25వతేదీ దాటకుండా పంపుతాననీ, కాపీలు పంపమనీ రాశాడు. ఇప్పటికి నా పత్రిక్కు అహ్మమద్ ఏజెంటుగా ఉంటున్నాడు. చిత్రమేమిటంటే మేడమ్, ఈ అహమ్మదూ ఆ అజీజు కూడా వొక్కడే! ఇలాంటి వాళ్లను పెట్టుకొని పత్రికను నడపటమంటే, ఎలా ఉంటుందో మీరు చెప్పండి!'' అన్నాడు శర్మ.

మంజరి వచ్చే నవ్వును ఆపుకొంటూ ''పోనీ-ఎడ్వర్‌టైజ్‌మెంట్లు బాగా వస్తే చాలదూ?''అన్నది.

''చిన్న చిన్న పత్రికలు బతుకుతున్నాయంటే, ఎడ్వర్‌టైజ్‌మెంట్ల రెవెన్యూవల్లనేననుకోండి. కానీ, అవి మాత్రం సులభంగా దొరుకుతున్నాయంటారా? సర్క్యులేషన్ బాగా ఉంటే తప్ప ప్రకటనలు రావు. సర్క్యులేషన్ ఉండాలంటే-ఏజెంట్ల మీద ఆధారపడక తప్పదు. బిజినెస్ ఫరమ్సు సాధారణంగా చిన్న పత్రికల కివ్వవు. సినిమా ప్రకటనలు కావాలంటే, ఏ ప్రొడ్యూసరో, డిస్ట్రిబ్యూటరో, యాక్టరో రికమెండ్ చేయాలి. తీరా ఎడ్వర్‌టైజ్‌మెంటు వేశాక, డబ్బుకోసం కనీసం పాతికసార్లయినా తిరగాల్సి ఉంటుంది. పదే పదే తిరగందే వసూళ్లు కావు. తిరిగామనుకోండి- రెండోసారి ఎడ్వర్‌టైజ్‌మెంట్ ఇవ్వరు. ప్రెస్‌బిల్లు ఇవ్వందే పత్రికరాదు. ఇవ్వడానికి డబ్బుండదు. ఇక పత్రికవాళ్లు ఏ గంగలో దూకాలో మీరు చెప్పండి!'' అన్నాడు శర్మ.

ఈ సారి మంజరి నవ్వలేదు.

రెండుమూడు నిమిషాల దాకా అందరూ మౌనంగా ఉండిపోయారు.

''అసలే మీ మనస్సు బావోలేదంటున్నారు. అనవసరంగా వాగి, మీకు చికాకు కలిగించానేమో!

అసలీ గొడవంతా ఎందుకొచ్చిందండీ?''అన్నాడు శర్మ.

ఎందుకొచ్చిందో మంజరి చెప్పలేదు.

''మీకో చిన్న వార్త చెబుదాం గదాని వచ్చాను. మాటల సందట్లో ఇంకేదో గొడవలోపడిపోయాం... మీకు చేతనయితే మధ్యాన్నంలోగా, దీనికి రెమెడీ ఆలోచించండి, లేదా-మొదలియార్ పిక్చరుకు మీరిక ఆశ వొదులుకోవలసి ఉంటుంది!''అన్నాడు శర్మ తాపీగా.

మంజరి ఉలికిపడింది. ఆవిడ ముఖం గండరించిపోయింది. కళ్ళల్లో చావు భయం కన్పించింది శర్మకు. వసంత వోసారి ''అక్క'' ముఖంకేసి చూసి చల్లగా లోపలికెళ్లిపోయింది.

''ఏమిటది?''అన్నది మంజరి మెల్లగా.

''నేనిప్పుడే మొదలియార్ కంపెనీకి వెళ్లొస్తున్నాను. అతనే ప్రొద్దుట పిలిపించాడు. మిమ్మల్ని తన పిక్చర్లో నుంచి తొలగించానన్నాడు. ఈ విషయం పత్రికలో వేయమని కూడా చెప్పాడు''అన్నాడు శర్మ.

''అదేమిటండీ? ఎందుకనిట?''అన్నది మంజరి పొడారిపోయిన గొంతుతో.

''అతనేవో కారణాలు చెప్పాడనుకోండి. అవన్నీ మీ దగ్గరనడం పత్రిక ధర్మం కాదు. మీ క్షేమాన్ని కోరేవాణ్ణి గనక, ముందుగా చెప్పాను. మీరేం చేస్తారో చేసుకోండి''అన్నాడు శర్మ.

ఎంత ఆలోచించినా మంజరికి కారణం తోచింది కాదు. తోచినకారణాలు సరైనవో కావో కూడా మంజరి తేల్చుకోలేకపోయింది. మొదలియార్ తన నెందుకు తీసివేసిందీ తెలిస్తే తప్ప, తను సరైన యాక్షన్ తీసుకోదు. ఆ కారణాలు శర్మకు తెలుసు. అవి తనిప్పుడు బయటపెట్టించాలి.

''శర్మాజీ! నా విషయం మీకు తెలుసు. నాకు మీరూ, మీకు నేనూ కొత్తవాళ్ళం కాదు. మీరు నాకు లోగడ చేసిన సహాయాలేమిటో నాకూ, మీకూ, ఆ భగవంతుడికీ, తప్ప మరోకంటివాడికి తెలీదు. మొదలియార్ పిక్చర్ పోయినందుకు నాకు బాధ లేదు గానీ - ఈ ఫీల్డులో నాకిక మంచినీళు ్ళ కూడా పుట్టవు. నా క్షేమాన్ని కోరేవారు గనక, దయచేసి అతనలా ఎందుకు చేసిందీ చెప్పండి. మళ్ళా మీరన్నట్లుగా నేనెక్కడా అనను. కారణం తెలియందే నేను మాత్రం ఏం చెయ్యను చెప్పండి?'' అన్నది మంజరి.

''నన్ను మీరు చాలా డెలికేట్ సిట్యుయేషన్లో పెడుతున్నారండీ!'' అన్నాడు శర్మ. ''మీరుగానీ నిన్న ఏమైనా ట్రబులిచ్చారా? ఇచ్చారని అతనంటున్నాడు. మిగతా పిక్చర్లో మీరిక ఉండరు'' అన్నాడు శర్మ.

''అదెలా శర్మాజీ! త్రువౌట్ పిక్చరున్నానే!'' అన్నది మంజరి.

శర్మ బాధగా నవ్వాడు.

''ఉన్నమాట నిజమే ననుకోండి. కానీ, ఇక్కడ్నుంచీ కథ మారిపోతుంది. మీ రేకారు యాక్సిడెంటులోనో పోయినట్టు, ఓ చిన్న ఇన్సిడెంట్ క్రియేట్ చేస్తారు. ఇహప్పుడు మీరుండాల్సిన అవసరమేముంది?'' అన్నాడు శర్మ.

'పోనీ దానికైనా నేను కావాలి గదా!' అన్నది మంజరి ఆశగా.

ఆ మాత్రం అవకాశముంటే ఎలాగో మొదలియార్తో రాజీ చేసుకోవచ్చునని మంజరి అభిప్రాయపడింది.

''లాభం లేదు మేడమ్! ఓ డమ్మీని పెట్టి లాంగ్షాట్లో, యాక్సిడెంట్ సీను షూట్ చేశారనుకోండి. అప్పుడు మాటేమిటి? వస్తూ వస్తూ కవి దగ్గరకు కూడా వెళ్ళాను. మొదలియార్ రాత్రే వచ్చి కథను

మార్చమని చెప్పాట్ట. అతను కూచుని కథంతా మళ్ళా తిరగరాస్తున్నాడు.ఇహ మీకూ ఆ కంపెనీకి రుణం తీరింది'' అన్నాడు శర్మ.

మంజరి బింకమంతా దిగజారిపోయింది. వస్తున్న కన్నీళ్ళను బలవంతాన ఆపుకొంటూ ''నన్నేం చెయ్యమంటారు శర్మాజీ?'' అన్నది మంజరి.

''అదేదో మీరే ఆలోచించాలి. ఏదో వొక మార్గం కనిపించకపోదు. నేను సాయంత్రం వస్తాను. నేనూ ఆలోచిస్తాను'' అన్నాడు శర్మ.

అతను వెళ్ళాక చలపతిని పైకి పిలిపించింది మంజరి. విషయమంతా చెప్పి ''ఇప్పుడేం చేదామంటారు?'' అన్నది.

తన కసినంతా తీర్చుకోవడానికి ఇంతకన్నా మంచి ఛాన్స్ చలపతికి దొరకదు. అతనా అవకాశాన్ని పూర్తిగా సద్వినియోగం చేసుకొన్నాడు.

''అంతా అయిపొయ్యాక నన్నడిగితే ఏం చెప్పను మంజూ! క్షమించాలి మిమ్మల్నిప్పుడు 'మంజరిగారూ' అనాలిగావును!'' అన్నాడు చలపతి.

మంజరి కళ్ళు మూసుకొని సన్నగా నిట్టూర్చింది.

''నేనంటే మీకింత కోపం ఉండటానికి - నేనేదో చెయ్యరాని పని చేసి ఉండాలి. అదేదో విప్పి చెప్పరాదా, నన్నిలా చిత్రహింస పెట్టకుండా!'' అన్నది మంజరి.

''అమ్మమ్మా! మీరలా అనకూడదు. నేను మీ మోచేతి కింద నీళ్ళు తాగి బతుకుతున్నవాణ్ణి. మీ సెక్రటరీని. మిమ్మల్ని నేను హింస పెడుతున్నానడం మీకే నామోషి. మీరామాట అనకూడదు - నేను విననూ కూడదు'' అన్నాడు చలపతి.

''మాటల్తో మనిషిని చంపటమంటే ఏమిటో మీ దగ్గరే నేర్చుకోవాలండీ! అసలే గుండెపగిలి నేను కుమిలిపోతుంటే, మీరు నామీద రాళ్ళుకూడా రువ్వుతున్నారు. ఇంతకన్నా మరో సమయం మీకు దొరక్కపోవడం నా ఖర్మ!'' అన్నది మంజరి.

''మీరేమన్నా అనుకోండి. మరి నాకు సెలవిప్పిస్తే కిందికి వెడతాను.''

''అందుగ్గాదు గదా మిమ్మల్ని పిలిచింది. మీరేమన్నా ఉపాయం చెబుతారేమోనని పిలిపించాను. మీ నా మధ్య రవరవలేమన్నా ఉంటే, అవి మనిద్దరం సర్దుకోవాలి. మూడోవాడెవడో వచ్చి మన నెత్తిన దుమ్ము చిమ్ముతుంటే, మీరు మౌనంగా ఉండటం భావ్యం కాదు'' అన్నది మంజరి.

''ముఖాన చెంగేసుకుని భోరుమని ఏడవమంటే ఏడుస్తాను. ఆ పని చెయ్యనా?'' అన్నాడు చలపతి.

''నేనెంత మెత్తగా చెప్పినా మీరు వినిపించుకోవడం లేదేమిటండీ?'' అన్నది మంజరి.

''వసంతనుగానీ, రాజమణినిగానీ సలహా అడక్కపోయారా?'' అన్నాడు చలపతి.

''వాళ్ళ మీద నాకా నమ్మకం లేదు. ఉన్నవాళ్ళనడిగితే మాటలతో చంపుతున్నారుగాని, సాయం చేయడం లేదు'' అన్నది మంజరి.

''నే పోతున్నాను'' అన్నాడు చలపతి.

''మీరేమి''

''లేదండీ! నాకా శక్తి లేదు. నేను కేవలం మీ పర్సనల్ సెక్రటరీని ఇలాంటి వ్యవహారాల్లో పర్సనల్ సెక్రటరీలు జోక్యం కలిగించుకోరు. కలిగించుకోకూడదు కూడాను''

మంజరి కోపం మిన్నుముట్టిపోయింది. పోతున్న చలపతిని 'ఇలార'మ్మంది.

"చెప్పండి నాకు చెముడేమీ లేదు. ఇక్కడున్నా వినిపిస్తుంది" అన్నాడు చలపతి మెట్టు మీద నిలబడి.

"నేను దగ్గరగా రమ్మంటున్నాను. రావాలి. అంతేగానీ, దిక్కుమాలిన ప్రశ్నలన్నీ వేయకు" అన్నది మంజరి పెద్దగా.

చలపతి అక్కణ్ణుంచి కదల్లేదు.

"నీకు ఓ నిమిషం టైమిస్తున్నాను. ఇక్కడకు రావడమో, సరాసరి వీధిలోకి వెళ్ళిపోవడమో నిర్ణయించుకో" అన్నది మంజరి కింది పెదవి కొరుక్కుంటూ.

చలపతి కొన్ని క్షణాల అలానే నిలబడ్డాడు. తరువాత అడుగులో అడుగు వేసుకొంటూ మంజరి దాపులోకొచ్చి నిలుచున్నాడు.

"నువ్వు నా పర్సనల్ సెక్రటరీవనీ, ఏ సెక్రటరీ కూడా ఇలాంటి విషయాల్లో జోక్యం చేసుకోకూడదనీ అన్నావు. నువ్వు సెక్రటరీవి కాకుండా నాకు తాళ్ళిగట్టిన మొగుడివైనా ఏమీ చెయ్యలేవు. నువ్వొత్త పనికిమాలినవాడివని నాకెప్పుడో తెలుసు. ఈ మాట అడగడానికే నిన్ను పిలిపించాను. నువ్వింక వెళ్ళవచ్చు" అన్నది మంజరి.

చలపతి నిశ్శబ్దంగా కిందికి వెళ్ళిపోయాడు.

మంజరి సోఫాలో కూలబడిపోయింది. రెండు కణతలూ పట్టుకొని కళ్ళు మూసుకుంది. ఆవిడ కనురెప్పల మాటున నీటి బిందువులు జీరాడాయి. సన్నగా నిట్టూరుస్తూ ఏదో నెంబరుకు ఫోను చేసింది.

"పోనీ, వచ్చాక నాకు ఫోను చెయ్యమని చెప్పండి. థాంక్స్" అన్నది మంజరి.

లోపలనుండి వెక్కిళ్ళు వినబడితే "ఎవరది?" అన్నది మంజరి.

"వసంతమ్మాయిగారు ఏడుత్తున్నారండీ?" అన్నది తాయారు.

"ఇలా రమ్మను"

చెంగుతో కళ్ళొత్తుకుంటూ వసంత వచ్చింది.

"నా మూలంగా ఎన్ని చిక్కులొచ్చిపడ్డాయక్కా నా ఖర్మాన నేను పోతాను. నన్ను తిరిగి గుంటూరు పంపించేసెయ్యి" అన్నది వసంత భోరుమని ఏడుస్తూ.

మంజరి, సున్నితంగా వసంతను కావలించుకొని, అంతకన్నా సున్నితంగా నవ్వేసింది.

"పిచ్చిదానా! దీనికేనా ఏడవడం? ఇంతలో ఏమయిందనీ, నువ్వు గుంటూరు వెళ్ళడం? నా సంగతి నీకింకా తెలీదమ్మాయ్! ఇటు సూర్యుడు అటు పొడిచినా తరుముతూనే ఉంటుంది. అన్నీ నేను చూస్తాను. అన్నీ సక్రమంగా అవుతాయి నువ్వు ఊరుకో. అదో ఫోను మోగుతోంది."

మంజరి మౌత్‌పీస్‌కు చెయ్యడ్డు పెట్టి, దగ్గి గొంతు సరిచేసుకొంది.

"మీరేనా? మీకోసమని"

"చెప్పు!" అన్నాడు అవతలి కొసనించి కిశోర్.

"మీ రిప్పుడే నిద్రలేచారా? అవును బాబూ! నేను లేచి పట్టుమని పదినిమిషాలు కూడా కాలేదు. మెలకువస్తే, తియ్యనికలలు కరిగిపోతాయేమోనని, అలాగే పడుకొన్నాను నాటీబాయ్ ఏమిటా మాటలు? మరేం లేదు. రాత్రి మీరిచ్చిన పార్టీకి బదులుగా ఇవ్వాళ నేనే మీ కివ్వాలనుకొంటున్నాను. అదేం కుదరదు. రాత్రల్లా నాతో ఉండిపోవలసిందే! నిన్నంటే మీ

కివ్వాలనుకొంటున్నాను. అదేం కుదరదు. రాత్రల్లా నాతో ఉండిపోవలసిందే ! నిన్నంటే కొత్తగనక, మిమల్ని విడిచిపుచ్చానుగానీ -ఏమో చెప్పలేను. మొత్తమే కొరుక్కు తినేస్తానేమో ఇప్పుడెలా చెప్పను? ఊఁహ ఎవ్వరూ లేరు. నేనొక్కదాన్నే ఉన్నాను. ఆదా? చంపేశారండీ బాబూ! అందుకే బదులుకు బదులు తీర్చుకొందామనే మిమ్మల్ని రమ్మంటూంట. థాంక్స్! వెరీగుడ్ వెరీగుడ్ అవునుగానీ కిశోర్! నీ ఫ్రెండన్నావే ఎవరో? మొదలియార్‌కు ఫైనాన్స్ చేస్తున్నాడన్నావు గదూ? అతనూ నువ్వూ ఈ పూట మా ఇంటికి భోజనానికి రావాలి. పార్టీ మనిద్దరిదీని లేదు డియర్! దానికీ దీనికి పోటీ లేదు. అబ్బబ్బా! ఎంత చిలిపివాడివోయ్ నువ్వు మీకోసం వెయిట్ చేస్తుంటాను. ఛీరియో'' అంటూ ఫోను పెట్టెసింది మంజరి. తాయారును పిలిచి ఇద్దరు గెస్టులొస్తున్నారనీ, వంట చెయ్యమనీ చెప్పింది.

అనుకొన్న వేళకు కిశోర్ తన స్నేహితుణ్ణి వెంట బెట్టుకొచ్చాడు. మంజరి భోజనాల ఏర్పాటు బ్రహ్మాండంగా చేసింది. తను మధ్యగా కూచుంది. అటూ ఇటూ కిశోరూ, ఫైనాన్సరూ కూచున్నారు. వసంత వడ్డన చేసింది.

భోజనాలయ్యాక మెల్లగా రంగంలోకి దింపింది మంజరి.

''మా కిశోర్ చెప్పిందాకా, మీరే మొదలియార్‌కు ఫైనాన్స్ చేస్తున్నారన్న సంగతి నాకు తెలీదు. అతను మీకు చాలా కాలం నుండీ తెలుసా?'' అన్నది మంజరి.

''లేదు. ఈ మధ్యనే ఎవరో పరిచయం చేశారు. నెగటివ్ రైట్సు నేను రాయించుకుని డబ్బిస్తున్నాను'' అన్నాడతను.

''ఏం జరిగిందేమిటి?'' అన్నాడు కిశోర్ విలవిలలాడిపోతూ.

''ఏం జరిగినా మీరున్నారుగనక ఫర్వాలేదనుకోండి. నాకంటే మీరు తెలుసు. మీ మనిషిని గనక, అతనేమన్నా అంటే, అదుపులో వుంచుతారు. కానీ, మన పిక్చర్లో వున్నవారందరికీ మీరు తెలుసా? వారందర్నీ యీ మొదలియారు నానాబాధలూ పెడుతుంటే చూస్తూ వూరుకోవలసిందేనా?'' అన్నది మంజరి.

''ఏం బ్రదర్! మీ మొదలియార్ వ్యవహారం బాగా ముదిరినట్టుందే?'' అన్నాడు కిశోర్ చిరుకోపంగా.

''అదేదో మీకు తెలియాలి. నేనెవర్నిట అనడానికి? డబ్బు తీసుకొని వేషం వేస్తున్నదాన్ని. అదైనా వీల్లేకుండా పోయింది. నన్ను పిక్చర్లోంచి తీసేశానంటూ కబురు పంపించాడు. అవసరమయితే కథ కూడా మారుస్తానన్నాడు. హేమా హేమాల్లాంటి మీరిద్దరూ ఉండగానే, అతనలా బిహేవ్ చెయ్యడం న్యాయమని మీరనుకొంటే నాకేమి అభ్యంతరం లేదు. నాకీ పిక్చర్ కాకపోతే, మరోటి వస్తుంది. అదికాదు ప్రశ్న. మీ ప్రెస్టేజీ, మీ డిగ్నిటీ ఏ గంగలో కలిసిపోయాయని?''

''వాటీజ్ దిస్ నాన్సెన్స్?''అన్నాడు కిశోర్.

''ఐ విల్ సీ''అన్నాడు ఫైనాన్షియర్.

''నిన్న నాకు వొంట్లో బావోలేదు. షూటింగ్ కెళ్లడానికి ఓ అరగంట ఆలస్యమయితే అయిందేమో! ఇంతోసి దానికి తీసేస్తే తీసెయ్యమనండి. కథ కూడా మార్చుకోమనండి. వాడేం చేసినా మట్టిగొట్టుకుపొయ్యేది మీరుగానీ, వాడు కాదు. డబ్బు మీదా? పెత్తనం మొదలియార్‌దా? నేనేమో మీ మనిషినా? వాడేమో నన్ను పిక్చర్లోంచి తీసేస్తాడా? ఎందుకిన్ని గొడవలు రేపుకుంటాడో నాకు బోధపడదు''అన్నది మంజరి చిరచిరలాడిపోతూ.

''నువ్వాపిక్చర్లో లేకపోతే మా ఫ్రెండ్ ఒక్కదమ్మిడీ యివ్వడు! సరేనా?'' అన్నాడు కిశోర్.

''అంతదాకా దేనికిలెండి! అసలు జరిగిందిది; -మా చెల్లిని చూశారుగా -వసంతను-బాగా పాడుతుంది. వీలుపడితే, ఒకటి రెండు పాటలు పాడించమన్నాను. సరేనన్నాడు. పనిమాలా గుంటూరు నుండి పిలిపించాను. తీరా వచ్చాక గ్రూప్‌సాంగ్ యిస్తానంటాడు, ఇంకేవో అంటాడు. అతనిష్ట ప్రకారం పోతే డబ్బాలు నాటులో నాటికి తిరిగిరావడం ఖాయం. బాగా వుండేవాళ్లను తీసుకోవాలిగానీ, డబ్బెవడిదోగానీ మనకిష్టమైనవాళల్లను తీసుకొంటే ఎలా?'' అన్నది మంజరి.

''నా కీ గొడవలేవీ తెలీవు. అతన్ని పిలిపించి కనుక్కొంటాను. మీరు పిక్చరులో లేకపోతే నా డబ్బు నాకిచ్చెమంటాను...ఆ పిక్చర్ సోల్ ప్రొడ్యూసర్ను నేను గానీ వాడు కాదే! వసంత సంగతంటారా? ఆపిల్ల బాగా పాడే పక్షంలో, ఈ పిక్చర్లోనే ఛాన్సిద్దాం...''అన్నాడు కిశోర్ ఫ్రెండ్.

''భోజనానికి పిల్చి, ఇవన్నీ చెప్పిందేమిట్రా భగవంతుడా అనుకోరు గదా?'' అన్నది మంజరి.

''నెవర్. మీరిలా అనడమే మేలయింది. లేకపోతే ఈ లోపలి గూడుపుఠాణీ నాకు తెలిసేది కాదు. చాలా థాంక్స్...మళ్లా కలుసుకుందాం''అంటూ ఫైనాన్షియర్ లేచాడు.

కిశోర్ కూడా కుర్చీలో కదిలాడు లేవడానికి; మంజరి ఆగమన్నట్లుగా, అతని చేతిని నొక్కింది.

ఫ్రెండ్ వెళ్లిందాకా ఆగి, కిశోర్ చేతిని గట్టిగా నొక్కుతూ ''రాత్రికి'' అన్నది మంజరి మెల్లిగా.

''ముందీ మొదలియార్‌గాడి వ్యవహారం తేలనీ చెబుతాను''అన్నాడు కిశోర్.

''తేల్చుకొనేరండి. కానీ ఏవేళకయినా మీరు రావాలి సుమా! మీకోసం వొళ్లంతా కళ్లు చేసుకొని వస్తుంటాను''.

''వొళ్లంతా ఏం చేసుకోని?'' అన్నాడు కిశోర్ నవ్వుతూ.

అతని చూపులు మంజరి భుజాలమీద తారట్లాడుతున్నాయి.

''ఎంత కొంటె కోణంగివోయ్ నువ్వు...అలా చూడకు...నేను తట్టుకోలేను''.

కిశోర్ ఇంకోసారి మంజరి అపాదమస్తకం చూశాడు. అతని కళ్లల్లోకి తోడేలు దృష్టి వచ్చింది.

''నేనెక్కడికీ పారిపోవడం లేదు. పన్నెండు గంటల రాత్రి వుంది'' అంటూ అతన్ని సాగనంపింది మంజరి.



# 17

నిజంగా దెబ్బకు దయ్యం వదులుతుందో లేదో మనకు తెలీదు గానీ, మంజరి వేసిన ఎదురెత్తుకు మొదలియార్ చిత్తుచిత్తయిపోయాడు. మంజరంటే మామూలు ఆర్టిస్టని, ఆవిణ్ణి కోతి నాడించినట్లు ఆడించవచ్చుననీ అతను భావించి ఉండాలి. ఆ భ్రమ విడిలిపోవడానికి ఎక్కువ టైం అవసరం లేకపోయింది. కిశోర్ స్నేహితుడు -మొదలియార్‌కు ఫైనాన్స్ చేస్తున్నాయన-సరాసరిగా మొదలియార్‌ను తన దగ్గరకు పిలిపించుకొని, తనిక ఈ పిక్చరుకు డబ్బు పెట్టుకోవడం లేదనీ, తను చెల్లించిందంతా జమకట్టి గానీ షూటింగ్ ప్రారంభించడానికి వీల్లేదనీ అన్నాడు.

మొదలియార్‌కీ తెర వెనుక భాగవతం తెలీదు. అతను మూర్ఛపోయినంత పనిచేసి ''ఎందుకని'' అన్నాడు తడబడుతూ.

''నువ్వూ నేనూ రాసుకొన్న ఎగ్రిమెంట్ ఉంది. అందులో ఉన్న నిబంధనల్ని నువ్వు కాదనే పక్షంలో, నీకు నేను చిల్లికానీ కూడా ఇవ్వనవసరం లేదు. నువ్వు ప్రారంభంలో చూపించిన కథ వేరు. దాన్నలాగే తీస్తానన్నప్పుడే నీకు నేను డబ్బివ్వాలి. మధ్యలో నీ ఇష్టమొచ్చినట్లు మార్పులు చేసుకుంటూ

పోతానంటే కుదరదు. నువ్వు దమ్మిడీ కూడా పెట్టలేదు గనక...నష్టం వచ్చినా నీకేం ఫర్వాలేదు. కాని లక్షలు పెడుతున్నవాణ్ణి నా సంగతేమిటని?''అన్నాడతను.

మొదలియార్ తన్ను తాను సమర్థించుకోడానికి వ్యర్థప్రయత్నాలు చేశాడు. ఇంకెవరికన్నా పట్టుకొని, అతని డబ్బు అతనికిద్దామని కూడా అనుకొన్నాడు. ఆ మాటే తన పెట్టుబడిదారు క్కూడా చెప్పాడు.

''అలాగే! నువ్వేం చేసినా నా కిష్టమే! నేను నిన్ను డబ్బే కక్కమనలేదు. కథ మార్చగూడదనీ, ఆర్టిస్టులతో యాగీ పెట్టుకోవద్దనీ మాత్రమే నేనన్నాను. ఈపనిచేయడం ఇష్టంలేని వారికి డబ్బు కుమ్మేపాటి సంస్కారం నాకు లేదు'' అని తెగేసి చెప్పాడతను.

మొదలియార్ వొకపూటల్లా మంచి డిస్ట్రిబ్యూటర్ కోసం గాలించాడు. ఈలోగా కిశోర్ నాలుగు కంపెనీలకు ఫోనుచేశాడు. ఒకటి రెండు కంపెనీలల దగ్గర 'నాన్నగారు చెప్పారు'అని కూడా అన్నాడు. మొదలియార్ ఎక్కడకు వెళ్ళినా చుక్కెదురయింది. అతను దిగులుపడలేదు. అవమానమనీ అనుకోలేదు. సరాసరి మంజరి దగ్గరకొచ్చి మునుపటి కన్నా వినయంగా వ్యవహరించాడు.

''చూడమ్మాయీ! నేనేమో ననుకొన్నానుగానీ, మంచి రిజల్ట్సు వచ్చాయి. వసంత పాట మ్యూజిక్ డైరెక్టరు ఓ.కే. చేశాడు. నీ పాటలన్నీ వసంత చేత పాడించడం బావుంటుందని కూడా అతనన్నాడు.... ఏదీ వసంత? నన్ను కంగ్రాచ్యులేట్ చెయ్యనివ్వు'' అన్నాడు మొదలియార్.

''నీరోగం కుదిరింది కదా నాన్నా!'' అనుకొన్నది మంజరి. పైకి మాత్రం ''చాలా థాంక్సండీ! వసంత కలకాలం మీకు రుణపడి ఉంటుంది'' అన్నది.

'వసంత' అనే నేపథ్యగాయని ఆ విధంగా తారాపథంలో ప్రవేశించింది.

జయవారి పిక్చరు బాగాపోయిన మాట నిజమేగాని, ప్రొడ్యూసరు వంతు కొచ్చిందాట్టేలేదు. మెహతా మాయాజాలం పట్ల కలెక్షన్‌లన్నీ అతని కార్యాలయానికి చేరి, ఉత్తి స్టేట్‌మెంట్లు మాత్రం ప్రసాద్ చేతికొచ్చాయి. వాటి ప్రకారం అతనికీ, అతని పార్ట్నర్లకీ కలిపి, పదిహేను వేల పై చిల్లరగా వచ్చాయి. ఈ డబ్బుతో పిక్చరు తీయడం మాట దేవుడెరుగు, ఆర్టిస్టులకు ఎడ్వాన్సు లివ్వడానికే చాలదు. పోనీ ఈ దుకాణం కట్టేసి సొంతవూళ్ళకెడదామని ఒక భాగస్థుడన్నాడుగానీ ప్రసాద్ దానికొప్పుకోలేదు.

''మనం నష్టపడితే నువ్వన్నపనే మంచిదిగాని, పిక్చరు బోలెడన్ని లాభాలు తెచ్చిపెట్టింది. డిస్ట్రిబ్యూటరు మింగేశాడు. ఈసారి మనం డిస్ట్రిబ్యూటరు మీద ఆధారపడకూడదు. సొంతంగా బొమ్మ తీయాలి. అప్పుడు ఖర్చులు పోగా మిగిలినదంతా కంపెనీకే ఉంటుంది'' అన్నాడు ప్రసాద్.

''నిజమేగానీ, ఈ ఇండస్ట్రీని నమ్ముకొని, మిగతా పొలం నేను అమ్మను'' అన్నాడు భాగస్థుడు.

''అలా జరక్కుండా చూదాం'' అన్నాడు ప్రసాదు.

ఆ ప్రయత్నంలో తొట్టతొలిగా అతను మంజరిని కలుసుకున్నాడు.

''రండి'' అంటూ ఆప్యాయంగా ఆహ్వానించింది మంజరి.

ఆవిడ ధోరణి చూశాక, లోగడలాగా 'చనువు'గా మాట్లాడలేకపోయాడు ప్రసాద్.

''నేను నీతో వో ముఖ్యమైన పనివుండి వచ్చాను'' అంటూ ప్రారంభించాడు ప్రసాదు.

''చెప్పండి''.

''నీ సాయం తప్పకుండా ఉంటుందనుకొంటున్నాను''అన్నాడు ప్రసాదు వో

సిగరెట్టంటించుకొంటూ, "నాపిక్చరు మంచి లాభాఏ తెచ్చినా, నాకు రావలసిన భాగం, న్యాయంగా నాకు రాలేదు. నాపెట్టుబడి కూడా చాలా భాగం చెల్లాచెదరయిపోయింది. మళ్ళా నేను కొత్త పిక్చరు ప్రారంభించాలనుకొంటున్నాను".

"వెరీ హ్యాపీ న్యూస్, తప్పకుండా స్టార్ట్ చెయ్యండి. నావల్ల మీకే సాయం కావాలన్నా చేస్తాను"అన్నది మంజరి

'థాంక్స్' అంటూ ప్రారంభించాడు ప్రసాద్. "ఈసారి నేను డిస్ట్రిబ్యూటర్ మీద ఆధారపడదలుచుకోలేదు. నేనే స్వయంగా ప్రొడ్యూస్ చేదామనుకొంటున్నాను. నా దగ్గరున్న కాపిటల్ చాలా కొద్ది, మీరందరూ కోఆపరేట్ చేస్తే నా పిక్చరు పూర్తవుతుంది.

మంజరి "వింటున్నాను"అన్నది తాపీగా

"నేను పెద్దగా అడ్వాన్సులు కూడా ఇచ్చుకోలేను... కథ తయారవుతోంది. మీరు హీరోయిన్, హీరోగా ఇంకా ఎవర్నీ అనుకోలేదు. మీరు ఎవర్ని సజెస్టు చేస్తే వారినే తీసుకొంటాను. మిగతా సపోర్టింగ్ కారెక్టర్సుకు కూడా మీరే సెలక్టు చేయండి".

"నేను సరేననుకోండి-మిగతా వారు ముందుగా డబ్బు తీసుకోకుండా వస్తారా? ఆ నమ్మకం నాకు లేదు"అన్నది మంజరి.

"నాకూ లేదనుకోండి. కానీ, మీరున్నారన్న ధైర్యంతో ఈ స్కీం ప్రారంభించాను. నేననుకొన్న దేమిటంటే, ముందు కొద్దిగా ఎడ్వాన్సులిచ్చి ఎగ్రిమెంట్స్ రాసుకొందాం. నాకు రేటు తగ్గించాల్సిన అవసరం కూడా లేదు. పిక్చరు తెలుగు, టామిల్ రెండు వెర్షన్లు తీస్తున్నాను. రెండింటిలోనూ ఒకే కాస్టింగ్. అందుకని-సిటీరైట్స్ ఇంకెవరికో ఇవ్వకుండా మీకే ఇస్తాను. ఎగ్రిమెంటులలో ఉన్న మొత్తం తీరేదాకా, కలెక్షన్‌లన్నీ మీరు తీసుకోండి. ఆ తరువాత వసూలు అయిన డబ్బు చెరిసగం తీసుకొందాం. అలాగే హీరోకు, సౌత్‌లో ఉన్న రెండు టౌన్లు ఇచ్చేస్తాను. మిగతా ఆర్టిస్టుల సంగతే ఆలోచించాలి"అన్నాడు ప్రసాద్.

మంజరికి ఈపద్ధతి బొత్తిగా కొత్తది కాదు. లోగడ ఇలాంటి వాటిని గురించి చిన్నది. కానీ అప్పుడంతగా పట్టించుకోలేదు. ఈ పథకం వల్ల లాభం వుండాలే గానీ తనుతప్పకుండా వొప్పుకొంటుంది. మరి లాభం ఉండేదీ లేనిదీ తను తెలుసుకోవాలి.

"సరేలెండి, ఆలోచిద్దాం"అన్నది మంజరి విషయాన్ని నానపెడుతూ.

"అలాకాదు, మీరు సరేనంటే గానీ, నేనింకోదాన్ని గురించి ఆలోచించలేను. ఈ స్కీం సక్సెస్ కావడం కాకపోవడం అన్నది మీమీదనే ఆధారపడి వుంది" అన్నాడు ప్రసాదు.

"మరి స్టూడియో, మేకప్, పాటలు-వీటి సంగతేమిటి?" అన్నది మంజరి.

"మీరూ, హీరో సరేనన్న తరువాత, కథ ఫైనలైజు అయ్యాక స్టూడియోను గురించి ఆలోచిస్తాను. బహుశా ఆ విషయంలో అడ్డంకులేమీ ఉండవనుకుంటాను. ఇక పాటల సంగతా-మాటలు రాస్తున్నాయనే పాటలు రాస్తున్నాడు. మీకు పాడేందుకు వసంత వుండనే వుంది. మిగతా వాటికి జూనియర్ ఆర్టిస్టులను తీసుకొంటాను. లేదా మీరు చెబితే, ఏ మ్యూజిక్ డైరెక్టరన్నా వొప్పేసుకొంటాడు", అన్నాడు ప్రసాదు.

అతని ధోరణి చూస్తుంటే, పిక్చరు తియ్యడమూ, తియ్యకపోవడమూ అన్నది కేవలం తన మీదనే ఆధారపడి ఉన్నదనిపించింది. తన నిర్ణయాన్ని చెప్పడానికి ముందు, చాలాసేపు ప్రసాదు కేసి చూసింది మంజరి. ఆ మొఖంలో మునుపటి ఉత్సాహంగానీ, నేవళం గానీ లేవు. ఒకప్పుడు

అతని ఫేవర్‌కోసం తను పడినపాట్లు జ్ఞాపకం వచ్చాయి. అతనితో బెంగుళూరు దాకా వెళ్లి, చలపతితో జగడం కూడా తెచ్చుకొంది! అతను జారిపోకుండా, చాలా జాగ్రత్తగా మేనేజ్ చేసింది. అతన్ని ఆకాశానికెత్తింది. నీవు లేందే జీవించలేనన్నది...ఇవన్నీ బ్రహ్మాండంగా పే చేశాయి. కానీ అతను మాత్రం అడుక్కు జారిపోయాడు. ఇప్పుడు తన ఫేవర్ కోసం ప్రాధేయపడుతున్నాడు. పోనీ 'ఊఁ' అంటే? మంజరి అంత సులభంగా 'ఊఁ' అనలేదు. తన కాళ్ళింకా ఈ రంగంలో బాగా నిలదొక్కుకోకముందు, తన్ను అదిరించి బెదిరించి హడలగొట్టిన వాళ్లల్లో ఇతనూ ఉన్నాడు. ఆ రోజున తన హృదయం ఎంతగా మండిపోయిందీ ఇప్పటికీ తనకు జ్ఞాపకం ఉంది. ఆ కసినంతా తను తీర్చుకోవడానికిదే అదను. తను వొప్పుకోకపోవడమే కాదు-ఇంకెవరూ వొప్పుకోకుండానూ తను చెయ్యగలదు. క్షణంలో ఇతన్ని అధఃపాతాళానికి తొక్కెయ్యడం తనకిప్పుడే మాత్రం కష్టంకాదు. ఆ పనిచేస్తే?

"మీరేదో ఆలోచిస్తున్నారు. ఇందువల్ల మీకు లాభమేగాని నష్టమేమీ లేదు. ఓ పిక్చరుకు మీకు వచ్చే బ్లాక్ అండ్ వైట్ మనీకన్నా ఇందువల్ల మీకు రెట్టింపు వస్తుంది. ఈ లాభం ఇంకోరు తినడమెందుకని మీదగ్గరకొచ్చాను. మీరు కాదన్న తరువాతనే మిగతా వారిని గురించి ఆలోచిద్దామనుకొన్నాను. మరి మీ యిష్టం?"అన్నాడు ప్రసాద్.

అతను ఏదిక్కుగా వ్యవహారాన్ని లాగుతున్నది మంజరి గ్రహించింది. పకపకా నవ్వుతూ-

"ఎంత అసాధ్యులండీ మీరు? మనిషిలోని పేగులు కూడా లెక్కపెడతారు సుమా! నేనింకా ఏ సంగతీ చెప్పకముందే మీరిలా తొందరపడితే ఎలా?! కనీసం నేను కథన్నా తెలుసుకోవాలంటారా వద్దా?"అన్నది మంజరుఇ.

"తప్పకుండాను. ఆ కథ వింటే మీరు ఎగిరి గంతేస్తారు. ఇందులో హీరోయిన్ చాలా రొమాంటిక్ గరల్! లక్షాధికారి బిడ్డ. చాలా గ్లామరెస్ కారెక్టర్" అన్నాడు ప్రసాదు.

"మంచిది, సాయంత్రం మీరు స్టోరీ పట్టుకురండి. కూచుని మాట్లాడుదాం. నాకు సంబంధించినంత వరకూ, మీ మాట కాదనను. మిగతా వారిని ఎలా డీల్ చేయడమన్నది నేనూ ఆలోచిస్తాను. సాయంత్రం మీరొస్తే, ఒక ఫైనల్ డెసిషన్ కొచ్చేద్దాం" అన్నది మంజరి.

ప్రసాద్ బరువు దిగిపోయినట్లు నిట్టూర్చి "వస్తాను" అంటూ వెళ్లాడు.

అతనటు వెళ్లగానే కళ్యాణికి ఫోను చేసింది మంజరి.

"ఏమిటి కథ? ఈమధ్య బొత్తిగా నీ దర్శనం కావడం లేదు" అన్నది కళ్యాణి.

మంజరి విషయమంతా చెప్పింది.

'తప్పకుండా వొప్పుకో మంజూ! ప్రొడ్యూసరు మన గుప్పిట్లో ఉంటాడు. కోతినా డించినట్లు ఆడించవచ్చు. నీ కభ్యంతరం లేకపోతే సాయంత్రం నేనూ వస్తాను. రానామరి?" అన్నది కళ్యాణి.

"నేను వద్దన్నా ఈ ఇంటికొచ్చే హక్కు నీకొక్కదానికే వున్నదక్కా! ఇదంతా నీ చలవే! నువ్వే లేకపోతే మంజరికీ వూళ్లో ఇన్ని మంచినీళ్ళు కూడా పుట్టేవికావు"అన్నది మంజరి.

"మునగచెట్టు ఎక్కించకు మరి"అన్నది కళ్యాణి నవ్వుతూ.

"అదేం కాదుగానీ-అతను సాయంత్రం ఆరింటికొస్తానన్నాడు నువ్వీలోగావస్తే, మనిద్దరం ముందుగా మాట్లాడుకొందాం. అతని ముందు తడుముకోవలసిన అవసరం ఉండదు"అన్నది మంజరి.

"నీ నుంచి నేను చాలా నేర్చుకోవాలి మంజూ"

"పో అక్కాయ్"అంటూ మంజరి ఫోను పెట్టేసింది.

కళ్యాణి వచ్చేదాకా మంజరి చేతులు ముడుచుకు కూచోలేదు. చలపతి ద్వారా సిటిలోని ఎగ్జిబిటర్సును-ముఖ్యమైన వాళ్ళను కాంటాక్టు చేసింది. మరీ ముఖ్యమైన ఎగ్జిబిటర్సును ఇంటికి పిలిపించింది. అసలు విషయం బయటపడకుండా, అవసరమైన సమాచారం మాత్రం చెప్పి, వారి అభిప్రాయాలను అడిగింది.

‘‘నన్నా ప్రొడ్యూసరు ఫైనాన్సు చెయ్యమంటున్నాడు. చెయ్యడానికి నాకేమీ అభ్యంతరం లేదు. నేను సిటీరైట్స్ కావాలన్నాను. అతను సరేనన్నాడు. ఇందువల్ల నిక్కచ్చిగా నా కొచ్చే లాభాలేపాటి ఉంటాయో చెప్పండి. అసలీ వ్యవహారమే మంచిది కాదనుకోండి-ఆ సంగతీ స్పష్టంగా నాతో చెప్పండి’’అన్నది మంజరి.

ఎగ్జిబిటర్స్ బాగా లెక్కవేసి ఎంత లాభం వచ్చేదీ చెప్పారు.

‘‘ఇది మంచి అవకాశం. మీరు చేజారకండి’’అని కూడా వొకతనన్నాడు.

అతను మొదలియార్ పిక్చరుకు ఎగ్జిబిటరు. ఆ పిక్చరు బోలెడంత కలక్షన్సు తెచ్చిపెట్టింది. ఆ పిక్చర్లోని హైలైట్ మంజరి డాన్సులు- ఆ డాన్సులకోసం జనం విరగతొక్కుకు చస్తున్నారు.

‘‘పిక్చర్లో డాన్సులుండాలి. అలా ఉంటే బాగాపోతుంది’’అన్నాడతనే.

అందరూ వెళ్లిందాకా ఉండి, ఆ ఎగ్జిబిటరు అసలు విషయం ఎత్తాడు.

‘‘నాకీ సిటీలో మూడు థియేటర్లున్నాయి. సేలంలో రెండున్నాయి. నేను డిస్ట్రిబ్యూటర్నుకాదుగానీ, మీ ప్రపోజల్ విన్నాక నేనో సలహా ఇద్దామనుకొంటున్నాను. మీ సిటీరైట్స్ నాకివ్వండి. మీకేం కావాలో అడగండి. కావాలంటే ముందుగా నేను అడ్వాన్సు చేస్తాను. అయితే వో కండిషన్ ఉంది. పిక్చర్లో ఎట్‌లీస్టు నాలుగైదు డాన్సులు-మీవే వుండాలి. మన ఎగ్రిమెంటులో, ఈవిషయం రాసుకోవడం ముఖ్యం’’ అన్నాడతను.

మంజరి ఆశ్చర్యపోయింది. తనకింత డిమాండ్ ఉన్న సంగతి తనకే తెలీదు. కేవలం తన డాన్సులకోసమే జనం వస్తున్నారంటే-

‘‘ఎడ్వకేట్‌ను పిలవనా?’’ అన్నాడతను.

‘‘ఇప్పుడు కాదు. మీకు నేను కబురుచేస్తాను’’అన్నది మంజరి అతన్ని వారిస్తూ.

‘‘ఇందులో పెద్దగా ఆలోచించవలసినదేమీలేదు. పెర్సంటేజి విషయమంటారా? డిస్ట్రిబ్యూటర్సుకిస్తున్నంతా మీకిస్తాను. సరేనా?’’అన్నాడతను.

అతనెంత తొందరపడుతున్నదీ మంజరికిట్టే తెలిసిపోయింది. అందుకని, ఏ మాటా తూలకుండా బాలెన్సుడ్‌గా మాట్లాడింది మంజరి.

‘‘మరేం లేదండీ! మూడు థియేటర్సులో వొక్కసారిగా రిలీజ్ చేదామని నా ఉద్దేశం’’.

‘‘నేనింకెవరికీ ఇవ్వను. అలా ఇవ్వవలసి వస్తే, మిమ్మల్ని తప్పకుండా కన్సల్టు చేస్తాను. మీ ఫోను నెంబరు సెక్రటరీ కిచ్చిపోండి’’అన్నది మంజరి.

ఆ ఎగ్జిబిటరు ఫోనునెంబరివ్వడమే కాకుండా, చలపతితో చాలాసేపు గుసగుసలాడి మరీపోయాడు. ఆ విషయం కూడా మంజరికి తెలిసింది.

‘‘పూర్ ఫెలో!’’అని నవ్వుకొంది మంజరి.

అయిదు కాకముందే కళ్యాణి వచ్చింది. కారు దిగుతూనే కావాలని ‘‘మీ అమ్మగారెక్కడయ్యా?’’అనడిగింది చలపతిని.

చలపతి నిలబడి నమస్కారం చేశాడు. ‘‘పైనున్నారు, దయచెయ్యండి’’అన్నాడు ఎంతో

వినయంగా.

కళ్యాణి లోలోపల నవ్వుకొంది.

"ఎవరది? నువ్వా అక్కాయ్?"అన్నది మంజరి రవంత ఆశ్చర్యంగా.

కళ్యాణి ఫక్కున నవ్వింది.

"నిన్ను చూచి నేను ఛటుక్కున కనుక్కోలేకపోయాను సుమా! ఏమార్వాడీ సుందరోననుకున్నాను. ఇవ్వాళ నువ్వెంత బావున్నావంటే అక్కాయ్, కనీసం ఈ వొక్కరాత్రన్నా నేను మగవాణ్ణయితే చాలుననిపిస్తోంది"అన్నది మంజరి హాయిగా నవ్వుతూ.

"పోవే మంజూ! బాగా మాటలు నేర్చావ్"అన్నది కళ్యాణి సోఫాలో కూచుంటూ.

మంజరి కూడా ఆవిడ పక్కనే కూచుంది.

"అయినా ఫర్వాలేదు".

"ఏమయినా-"అన్నది మంజరి కనుబొమలు చిట్లించి.

"నువ్వు మగాడివి కాకపోయినా"అన్నది కళ్యాణి నవ్వుతూ. "నువ్వంటే అందుకే నేను పడిచచ్చిపోతుంటాను. నువ్వుపాదరసం లాంటిదానివి మంజూ! ఎక్కడోగాని, నీలాంటి వారు పుట్టరు".

మంజరి "ప్చ్"అంటూ చప్పరించేసింది. తరువాత, ఈ ఎగ్జిబిటర్సు గొడవలన్నీ చెప్పుకొచ్చింది.

"నువ్వీపని చేస్తావని కూడా నేననుకున్నాను. తెలివైనవారెప్పుడూ ఇంత కాన్షస్‌గానూ ఉండాలి. నిద్ర మొఖం వారికి ఫ్యూచర్ ఉండదు. మంజూ! నువ్వు మంచిపని చేశావు. అయితే చేయాల్సిన వింకా కొన్ని వున్నాయి"అన్నది కళ్యాణి.

"ఏమిటవి?"అన్నట్లు కళ్ళెగరేసింది మంజరి.

"ముద్దొచ్చినప్పుడే చంక కెక్కాలి. తరువాత మన ముఖం చూసే నాథుడే వుండడు. ముందుగా మీ ప్రసాద్‌తో వ్యవహారం తేల్చుకోవాలి. దరిమిలా, ఎగ్జిబిటర్ విషయం ఆలోచింతాం".

"అలాగే"అన్నది మంజరి.

ఈలోగా కళ్యాణి క్రతువు నడపవలసిన విధానమంతా చెప్పింది.

"ఇందులో ఇన్ని గుంట చిక్కులుంటాయనుకోలేదు సుమా!"అన్నది మంజరి ఆశ్చర్యపోతూ.

అనుకొన్న సమయానికే ప్రసాదు వచ్చాడు. వెంట కవికూడా వున్నాడు. ముందుగా కథ చెప్పమన్నది మంజరి. కవిగారు కథ చదివాడు. చదువుతున్నంతసేపూ కళ్యాణిని చూస్తూనే ఉంది మంజరి. కళ్యాణి ముఖంలో ఉత్సాహం లేదు. కవి గుండె మోకాళ్లలోకి జారిపోయింది.

మంజరికయితే ఆ కథ బాగానే వుంది. మరి కళ్యాణికి నచ్చలేదు గనుక, తనకూ నచ్చనట్లే.

"ఎలా వుంది?"అన్నాడు ప్రసాద్.

కళ్యాణికేసి చూసి, "ప్చ్"అన్నది మంజరి. "ఏమక్కాయ్, నీకూ నచ్చినట్టు లేదు?"అన్నది, తనకు నచ్చలేదన్న భావాన్ని పరోక్షంగా వ్యక్తంచేస్తూ.

"నచ్చలేదంటే-దానికి చాలా కారణాలున్నాయి. ముఖ్యంగా అది హీరో పిక్చర్. హీరోయినంటూ ఉన్నా, ప్రామినెన్సు చాలా తక్కువ"అన్నది కళ్యాణి.

"కరెక్టు, నేనూ అదే అనాలనుకొంటున్నాను"అన్నది మంజరి కూడా కళ్యాణి అభిప్రాయాన్ని బలపరుస్తూ.

ప్రసాద్ కవివేపు చూశాడు.

"చిత్తం-అమ్మాయిగారన్నమాటలో కూడా నిజమన్నది లేకపోలేదనుకోండి. మనం ఈ కథనే

ఫైనలైజ్ చేయబోవడం లేదు. హరివోమ్మంటూ ప్రారంభించాం. ట్రీట్‌మెంటును రాసుకునేటప్పుడు మార్పులు చేసుకోవచ్చు గదా! కాదూ కూడదంటారా? మనమిప్పుడు కూచుని, సబ్జెక్టును డిస్కస్ చేదాం. రేపీ వేళకు మళ్ళా రాసుకొస్తాను''అన్నాడు కవి.

''దట్స్ గుడ్. అలాచేదాం''అన్నది మంజరి.

కళ్యాణి, మంజరీ కలిసి కథనంతా తిరగతోడారు. ఆ లెక్కప్రకారం, కథమొత్తం హీరోయిన్ చుట్టూ తిరుగుతుంది. హీరోయిన్‌కు, కథాంతాన భర్తయ్యే కారెక్టర్ హీరోగనక-అతగాడికి అట్టే ప్రాముఖ్యం లేదు. ఎక్కువ కాలం అతను జైల్లో ఉంటాడు. లేదా అడవుల్లో తిరుగుతాడు. రెండవ వెర్షన్‌లో, కళ్యాణికి సరిపోయిన కారెక్టరు కూడా వున్నది. మంజరికి నాలుగు డాన్సులున్నాయి. ఒకచోట స్విమ్మింగ్ సీన్ ఉంది. ఒక డ్రీం సీక్వెన్స్ ఉంది.

''ఎక్కువ క్లోజప్‌లుండాలి. అందుకోసం ఎంత తీసుకోవడమన్నది మనం మాట్లాడుకొందాం. అలాగే మద్రాసు పిక్చర్సులో, స్విమ్మింగ్ సీన్ ఇంతవరకూ లేదు. మనమే తొలిసారిగా ఇంట్రడ్యూస్ చేస్తున్నాం''అన్నది మంజరి.

''అంటే-నువ్వు బేతింగ్ డ్రెస్ వేసుకోవాలన్న మాట!''అన్నది కళ్యాణి.

''కాదా మరి! ఏదో వో నావెల్టీ లేందే బాక్సాఫీస్ నిద్రపోతుంది''అన్నది మంజరి.

మొత్తానికి ఇద్దరూ కలిసి, ప్రసాద్ చేత''అవు''ననిపించారు. ప్రతిదానికీ తలూపటం అలవాటయిన కవిగారు, ఈ కొత్త కథ భేషుగ్గా ఉన్నదనడమే కాకుండా ఇంకొంచెం గుగ్గిలం పొగ కూడా వేశాడు.

''అమ్మయ్యో! ఈ విషయం చాలా జాగ్రత్తగా ఉండాలండీ అమ్మాయిగారూ! మీరు సజెస్ట్ చేసిన పాయింట్లు వండర్‌ఫుల్‌గా ఉన్నాయిసుమా! మీరు చెప్పిన విధంగానే గనక కథరాస్తే అద్భుతంగా ఉంటుందనడంలో నాకెలాంటి అనుమానమూ లేదు''అని కూడా అన్నాడు.

ఆ రకంగా రాసిన కథలో, మంజరి హీరోయిన్, కళ్యాణి హీరోయిన్ వంటిది. హీరోను మంజరి, కళ్యాణి కలిసి నిర్ణయిస్తారు. మిగతా ఆర్టిస్టుల విషయంలో కూడా వాళ్ళు సాయం చేస్తారు. మంజరి పాడవలసిన పాటలు వసంత పాడుతుంది. అందుకు వేరే ఇవ్వాలి. ఈ పనులన్నీ చేసినందుగ్గాను ముప్పయ్‌వేలు మంజరి డిమాండ్ చేసింది. కళ్యాణి ఇంకో ఐదువేలు పెంచుక్కూచుంది. హీరోకు, మిగతావాళ్లలకు ప్రసాదే ఇచ్చుకోవాలి.

''చాలా ఎక్కువ''అన్నాడు ప్రసాదు.

''అయితే మనం ఈ టాపిక్ డ్రాప్‌చేసి, ఇంకేదన్నా మాట్లాడుకొందాం''అన్నది కళ్యాణి.

ఆ సమాధానం విని మంజరి కూడా రవంత నొచ్చుకొంది. అలాగని, తను కళ్యాణిని నొప్పించనూలేదు. ప్రసాదును సర్దనూలేదు. ఎలా చావడం?

''పోనీ మీ అభిప్రాయం చెప్పండి. అందుబాటులో వుంటే చూదాం. మీరు కాష్ పే చేసినా అంతకంటె తక్కువగా ఎవ్వరూ రారు''అన్నది మంజరి.

ప్రసాద్ చెప్పిన అంకెకు కళ్యాణి వొప్పుకోలేదు.

''వేడుక మాటలు అవనసరమండీ! నాకు పాతికివ్వండి. అక్కకు ముప్పయ్ ఇవ్వండి. హీరోను నారేటుకన్నా తక్కువకు బుక్‌చేసే బాధ్యత మాది. మాకేమన్నా ఎక్సెస్‌పేమెంట్ అనుకొంటే-ఆవార హీరోబుకింగ్‌లో మీకు కలిసొస్తుందికదా! ఎగ్రిమెంట్స్‌లో చెరి పదివేలకన్నా రాయడానికి లేదు. మిగతా ఎమౌంట్ జూనియరు ఆర్టిస్టులమీద సర్దుబాటు చేసుకోండి. ఇంతకు మించి నేను చెప్పవలసిందేమీ

లేదు''అన్నది మంజరి తుది తీర్పునిస్తూ.

ప్రసాద్ ''ఇంకోసారి ఆలోచించండి''అన్నాడు.

''ఇప్పటికే చాలా మార్జిన్ ఇచ్చాం. ఇక ఆలోచించవలసింది మీరే''అన్నది మంజరి.

ప్రసాద్ 'సరే'నన్నాడు. 'రేపే మనం ఎగ్రిమెంట్స్ రాసుకొందా''మన్నాడు. ''మంజరి చెప్పినట్లుగా కథ తయారుచేయ''మని కవిగారికి పురమాయించాడు.

''ఈ పూట మిమ్మల్ని భోజనానికుండమందునుగాని, ముందుగా చెప్పలేదండీ! మన్నించాలి''అన్నది మంజరి.

''థాంక్స్, పర్వాలేదు, వస్తాను''అంటూ ప్రసాద్ లేచాడు.

కవిగారు కూడా, ''వస్తానండమ్మాయిగారూ! మీరూనమ్మా!'' అంటూ వెళ్లిపోయాడు.

''ఈ పూట మంచి బిజినెస్ చేశాం మంజూ!''అన్నది కళ్యాణి సోఫాలో బారుగా పడుకుంటూ.

''ఏం గొడవలు రావుగదా?''అన్నది మంజరి.

''ఏమీ రావు. రేపు మూర్తిగారికో, రావుగారికో ఫోను చెయ్యి. పిక్చరు నీదేనను. కాకపోతే జయా బేనర్‌మీద తీస్తున్నానను. ఇన్‌కంటాక్సు బాధ తప్పుకోవడానికి ప్రసాదును ప్రొడ్యూసరుగా వుంచానను. తప్పకుండా వొప్పుకుంటారు. లేదా కొత్తగా వస్తున్న వాళ్లు చాలామంది ఉన్నారు. ఎవరికి కబురెట్టినా ఎగిరి గంతేసి వొప్పుకుంటారు''అన్నది కళ్యాణి.

''ఆ పని కూడా కాస్త నువ్వే చేసిపెట్టాలక్కయ్యా!''అన్నది మంజరి.

''అలాగే''అన్నది కళ్యాణి.

\- అన్నదేగానీ ఆవిడ ధ్యాస ఇక్కడలేదు.

కళ్యాణి ముఖం నిమిషంలో మారిపోయింది. అంతదాకా ఉన్న ఉత్సాహం అస్తమించి, విషాదచ్ఛాయలు మోసులెత్తాయి. కళ్లల్లో ఎర్రజీరలు చోటు చేసుకొన్నాయి.

''ఏమిటక్కా-అలా ఉన్నావేం?''అన్నది మంజరి ఆదుర్దాగా.

కళ్యాణి పలకలేదు. రెండు కణతలూ లోపలికి నొక్కుకుంటూ, కుర్చీలో కూచుండిపోయింది.

''చెప్పకూడనిదయితే తప్ప-''

''అదేంకాదు మంజూ! ఎలా చెప్పడమా అని ఆలోచిస్తున్నాను...నీ దగ్గర డబ్బేమాత్రముంది?''

''రెండుమూడు వందలుంటాయేమో! కనుక్కోనా?''అన్నది మంజరి.

''ఇంట్లో కాదు, బ్యాంకులో-నాకో పదిహేను కావాలి. పీకలమీదికొచ్చింది. నీ దగ్గరుంటే సర్దు''అన్నది కళ్యాణి.

''అలాగే, రేపు పంపుతాను''.

''నన్ను రక్షించావు మంజూ! ఇన్‌కంటాక్సు వాళ్లు నన్ను వేటాడుతున్నారనుకో. వాళ్లేమో ఎగ్రిమెంట్సు ప్రకారం మన ఇన్‌కం లెక్కగడతారు. వాటిల్లో సగానికి సగం కూడా మనకు రావు. రాలేదయ్యా అంటే వూరుకోరు. దావావేసి వసూలు చేసుకోకపోయావా అంటారు. కోర్టులకెడితే ట్రబుల్సం ఆర్టిస్టంటారు. వెళ్ళకపోతే డబ్బురాదు. అయినా మనం మాత్రం, దేవుడా అంటూ చెల్లించాల్సిందే! నిన్నడగ్గూడదనుకుంటూనే అడిగాను''అన్నది కళ్యాణి.

''ఫర్వాలేదక్కాయ్! నా విషయంలో నువ్వులాంటి మొఖమాటాలు పెట్టుకోకు''అన్నది మంజరి.

''నువ్వు కాదంటే ఏంచేయాలో కూడా ఆలోచించాను. నా కారు, జువెలరీ మార్ట్‌గేజ్ చేసేదాన్ని, తరువాత ఎప్పుడో విడిపించుకొనేదాన్ని''అన్నది కళ్యాణి.

మంజరి భయంతో నిట్టూర్చింది.

"ఏం బతుకులో మంజూ! మన జీవితాలకో అర్థమంటూ లేకుండా పోతుంది. ఇదంతా ఎందుకు చేస్తున్నామన్న ప్రశ్నకు మనం చెప్పుకోగలిగే జవాబేమీ లేదు. బతుకు ఎంత నీరసంగా, నిస్తేజంగా ఉంటుందంటే, హఠాత్తుగా ఏ రైలుకిందనో పడి ముక్కలు ముక్కలయిపోవాలనిపిస్తుంది. మళ్ళా ఆ బాధంతా అనుభవంలోకి రావాలని కూడా ఉంటుంది. అయితే ఇవేవీ జరగవు, జరగబోవు. మనమిలా ఈ పంజరాల్లో ఉండవలసిందే!".

మంజరి కళ్ళార్పకుండా కళ్యాణికేసి చూడసాగింది.

"తలంతా నాదుగా ఉన్నదమ్మీ! ఇంట్లో ఏమన్నా ఉన్నదా?"

"ఆఁ"

వసంత ఫ్రిజ్‌లోంచి సోడాలు, సీసాలు పట్టుకొచ్చి బల్లమీద ఉంచింది...

కళ్యాణి ఆదమరచి నిద్రపోయిందిగానీ మంజరికి చాలా రాత్రి వరకూ కంటిమీద కునుకేరాలేదు. చాలాసేపు ఆవిడ కళ్యాణిని చూస్తూ కూచుంది. ఆ తరువాత వసంత పడుకొన్న గదిలోకి వచ్చింది. ఓ టేబుల్‌మీద, కొన్ని పాటల కాగితాలూ, ప్రక్కనే రేడియో గ్రాము, ఓ షెల్ఫ్‌లో రికార్డులూ, వాటి పక్కనే టేపురికార్డరూ రెండు డజన్ల టేపులూ ఉన్నాయి. వాటికోసం తను అయిదారు వేలు దాకా ఖర్చు చేసింది. ఎందుకు చేయవలసి వచ్చిందన్న ప్రశ్నే లేదు. ఆ లెఖ్ఖకొస్తే కళ్యాణి తనకు చేసిన సాయమంతా ఎందుకు చేసినట్లుట?

మంజరి ఏమీతోచక టైం చూసింద. పన్నెండు దాటి పదకొండు నిమిషాలయింది. రాజమణి నిశ్చింతగా, మెడదాకా దుప్పటి కప్పుకొని పడుకొంది. వసంత నిద్రపోతోంది. కళ్యాణీ నిద్రపోతోంది. చలపతి-నిద్రపోయే ఉంటాడు. డ్రైవరు-కారు దగ్గరగా కాంప్ కాట్‌మీద నిద్రపోతున్నాడు. అందరూ హాయిగా, నిశ్చింతగా నిద్రపోతున్నారు. ఒక్క తను మాత్రమే మేలుకొనిఉంది. తనకీపూట నిద్రపట్టదు. కనీసం పట్టే సూచనలు కనుచూపుమేరలో కూడా లేవు.

ఏమీ తోచక ఆఫీసు గదిలో కొచ్చింది మంజరి. ఆరోజు వచ్చిన ఉత్తరాలన్నీ ఓ పక్కగా ఉన్నాయి. ఒక్కొక్కదాన్నే చింపి చూడసాగింది. అందులో చాలా ఉత్తరాలు తన ఫోటోకోసం రాసినవి, కొన్ని ఉత్తరాలు తననూ తన నటననూ అభినందిస్తూ రాసినవి. కొంతమంది తనను "అక్కా"అనీ "సోదరీ"అని సంబోధించారు. పది పదిహేను ఉత్తరాలు తనతో-కోరుతూ రాసినవి ఉన్నాయి. ఆ ఉత్తరాలను వొకటి రెండుసార్లు చదువుకొంది మంజరి. కింద సంతకాలైతే వున్నాయి గాని అడ్రసులులేవు! మంజరికి నవ్వొచ్చింది. ఒక ఉత్తరం ఎవరో ఎసోసియేషన్ వారు రాశారు. వారి వార్షికోత్సవం ఇంకో వారం రోజుల్లో ఉన్నదిట. ఆ సందర్భంలో జరిగే సాంస్కృతిక కార్యక్రమాలను తను ప్రారంభించాలట. ఒక అనాథశరణాలయం వారు తన సహాయం కోరుతూ జాబురాశారు.

మరో ఉత్తరం-ఆకుపచ్చ సిరాతో అడ్రసు రాసి ఉంది-చూస్తూనే మంజరి కళ్లు చిట్లించింది. ఆ దస్తూరీ కూడా తనకు పరిచయం ఉన్నదానిలాగె అనిపించిందామెకు. ముసురుకొంటున్న జ్ఞాపకాల నుండి తప్పుకొంటూ ఆ కవరు చింపింది మంజరి. అది మాధవరావు రాసింది. ఆ పేరు చూడంగానే మంజరికి పాతసంగతులెన్నో జ్ఞాపకంలో మెదిలాయి. గుంటూరులో తన గత జీవితం, నాగమణి దయాదాక్షిణ్యాలమీద తను ఆధారపడటం, నాటకాలు, రామచంద్రం, కోటేశ్వరరావు తగాదాలు-ఎన్ని గొడవలు!

మెల్లగా ఉత్తరం చదవసాగింది మంజరి.

“చిరంజీవి మంగమ్మకు-

ఇలా సాహసంగా నిన్నా పాతపేరుతోనే పిలుస్తున్నందుకు నీక్కోపం వస్తుందేమో మరి! అయినా, నిన్ను“మంజరి”అని పిలవడం, ఎంచాతో నాకిష్టంలేదు. నీకు రామచంద్రం, కోటేశ్వరరావు జ్ఞాపకం ఉన్నారనుకొంటటాను. వారే లేనప్పుడు, నేనూ ఉండి ఉండను. రామచంద్రం భార్య చాలా జబ్బునపడింది. ఏడాది నుండీ ఆసుపత్రిలోనే ఉంది. వాడి పొలం కాస్తా హరించిపోయింది గానీ, భార్య జబ్బుమాత్రం నయం కాలేదు. ఈ మధ్య వాడు నీకు రెండు జాబులు రాశాడు. నీనుండి కనీసం జవాబన్నా వొస్తుందని ఆశించాడు. రాలేదు. వాడెంత బాధపడ్డాడో నేను చెప్పలేను. “ఆ సినిమా ప్రపంచంలోకెళ్లిన వాళ్లకు మామూలు ప్రపంచం కనిపించదు. మామూలు మనుషులు మనుషులనిపించరు”అన్నాడు వాడు. నువ్వటువంటి దానివి కావని నాకిప్పటికీ నమ్మకముంది. నాసంగతి సరేసరి. కంపతొాడుగులాగినట్టు ఈ సంసారాన్ని లాక్కొస్తున్నాను. ఈ ఏడు పెద్దదాని పెళ్లిచేయాలనుకుంటున్నాను. పంటచూదామా, అంతంత మాత్రంగా ఉంది. పొయ్యిమీదకి కుండెక్కడమే కష్టంగా ఉంది. నీకు మేము జ్ఞాపకం ఉంటే, నీకు వీలయితే, ధర్మమని నువ్వనుకకుంటే, రామచంద్రానికేమన్నా సాయం చెయ్యి. నువ్వలా చేస్తావన్న నమ్మకంతోనే వాడు నీకు రాశాడు. సహాయం చెయ్యాలని ఎక్కడా రాసిపెట్టిలేదు. కేవలం ధార్మిక దృష్టితో అడుగుతున్నాను. అతనయితే వొద్దనే వొద్దన్నాడు. నేనే వాడికి తెలీకుండా రాస్తున్నాను. నువ్వుపంపినా, పంపకపోయినా, నాకు సంతోషమే! నేనేమీ అనుకోను. నువ్వింకా పైకి రావాలనీ, ఇంకా పేరు ప్రతిష్టలలు సంపాదించాలనీ నేను మనసారా కోరుకుంటున్నాను. ఈ మధ్య నువ్వున్న పిక్చరొకటి చూశాను. అందులో నీ యాక్షను నాకేమీ నచ్చలేదు. డైలాగ్స్ ఎందుకంట పట్టిపట్టి అనడం? సినిమాల్లో, అలా అనడమే అవసరమయితే, నేను పొరపాటు పడ్డానన్నమాట! ఇలా అన్నందుకు కోపగించుకోకు. జవాబు-కనీసం జవాబు రాయి. ఉంటాను”.

కనీసం నాలుగుసార్లయినా ఆ జాబును చదివిఉంటుంది మంజరి. అందులోని ప్రత్యక్షరమూ తనను పిండివేస్తున్నట్లుగా బాధపడింది. రామచంద్రం తనకు జాబురాసిన జ్ఞాపకమే ఆమెకు లేదు. ఒకవేళ రాసేవుంటే? ఈవిధంగా అతి ముఖ్యమైన ఉత్తరాలు ఎన్ని తనదాకా రాకుండా పోతున్నాయోననుకొంది మంజరి. రామచంద్రం జాబురాస్తే, తను డబ్బు పంపకుండా ఉండటమన్న ప్రసక్తే లేదు. తను ఎందరికో ఎన్నో విధాలుగా సాయంచేసింది. రామచంద్రానికి చేస్తే తప్పేమిటిట?

అప్పటికప్పుడే మాధవరావుకు జాబు రాసింది మంజరి. అందులో-తనకా ఉత్తరాలు-రామచంద్రం రాసినవి-చేరలేదని రాయలేదు. తను, గత నాలుగు వారాలుగా మద్రాసులో లేననీ, ఔట్‌డోర్ షూటింగుల నిమిత్తం మఫజుల్ కెళ్ళాననీ, రామచంద్రం జాబులతో బాటుగా, మీ జాబు కూడా ఈ పూటే చూశాననీ తనను అపార్థం చేసుకోవడం భావ్యం కాదనీ రాసింది. “అక్కడకన్నా, మద్రాసులో వైద్యసదుపాయాలు బాగా ఉంటాయి. రామచంద్రంగారిని భార్యతో సహా ఇక్కడికే రమ్మనండి. మా ఇంట్లో ఉండొచ్చు. మంచి డాక్టరునెవర్నయినా ఎంగేజ్ చేదాం. లేదా అక్కడే ట్రీట్ చేయించుకొంటానంటే వారిష్టం. అవసరమయినప్పుడు నాకిలా ఓ కార్డు రాయండి. ఉన్నంతలో మీకేలోపమూ జరగదు”అని కూడా రాసింది.

ఉత్తరం పూర్తిచేశాక మంజరికి ఏడుపూ, కోపమూ కూడా కలిగాయి. ఆ ఉద్వేగంతోనే కుర్చీకి చేరబడి, కళ్లుమూసుకొంది. ఆవిడకు నిద్రపట్టనూ లేదు,పూర్తి మెలకువగానూ లేదు.

మంజరిని ఆఫీసు కుర్చీలో తొట్టతొలిగా చూసింది తాయారు. ఇంతోసి కష్టం అమ్మగారు

పడినందుకు దాని గుండెలు నిజంగా అవిసిపోయాయి. అది తనను తను పడదిట్టుకొంటూ, మంజరిని మేడమీదకి-దాదాపు మోసుకొంటూ తీసుకొచ్చింది. మంజరికింకా పూర్తి బద్ధకం వదల్లేదు. అలా తూలుకొంటూ వెళ్లి మంచంమీద పడుకొని పదిగంటలదాకా నిద్రపోయింది.

ఉదయం ఆఫీసు గదిలో కొచ్చిన చలపతి, ఉత్తరాలన్నీ చించి ఉండటం చూస్తూనే జరిగిన విషయాన్ని గ్రహించాడు. ఈ పూట ఏదో కొంప మునుగుతుందనుకున్నాడు. మంజరికీ, తనకూ ఈనాటితో రుణం తీరిపోయిందని చలపతి గట్టిగా నమ్మాడు. అలాంటిదే జరిగితే తనేం చేయవలసిందికూడా అతను ఆలోచించి పెట్టాడు. ఆ నిశ్చయానికొచ్చిన అతనికి దిగులూ, విచారమూ లేకుండాపోయింది.

"అమ్మగారు పిలుస్తున్నారు" అంటూ కబురొచ్చింది.

"భగవాన్!"అనుకొంటూ చలపతి లేచాడు.

"కూచోండి"అన్నది మంజరి, చాలా తాపీగా.

అతను కూచున్నాక-

"ముఖ్యమైన ఉత్తరాలు ఏమన్నా ఉంటే నాకు పంపుతుండండీ"అన్నది మంజరి.

"అలాగే" అన్నాడు చలపతి.

మంజరికిక మాట్లాడడానికేమీ మిగలదనుకొన్నాడు చలపతి.

"అయితే-ఏవి ముఖ్యమైన ఉత్తరాలో ఏవి కావో మీరెలా తెలుసుకొంటారు?" అన్నది మంజరి.

"ఆ మాట నిజమే!"అన్నాడతను.

"అందుకని వచ్చిన టపా అంతా నాకు పంపుతుండండీ! నేనే చూసుకొంటాను"

చలపతి పలుకలేదు.

"రాత్రి నేను టపా చూశాను. అందులో వో ముఖ్యమైన ఉత్తరం ఉంది. లోగడ "రామచంద్రం"అనే వారెవరైనా నాకు జాబు రాశారా?"అన్నది మంజరి.

"రాశారేమో నాకు జ్ఞాపకం లేదు. ఆపేరుగలవాళ్లు చాలామంది ఉంటారు. ఉత్తరాలన్నీ మీకు తెచ్చివ్వమంటారా?"

"ఊఁ"

"అలా అయితే మీకు మరీ కష్టం. వచ్చిన ప్రతి చెత్తనూ మీరు చూడడానికి టైముండాలి కదా! అందుకని చాలాభాగం నేను చూచి పారేస్తున్నాను. ఫొటోలు కావాలనీ, చందాలు కావాలనీ, ప్రారంభోత్సవాలకు రమ్మనమనీ రాస్తుంటారు. ఇవన్నీ చూడటం మీకు సాధ్యమా"అన్నాడు చలపతి.

"దీనికేదన్నా ఇంకోమార్గం చూదాం. మీరు వెయ్యిరూపాయలకో డ్రాఫ్టు తెప్పించండి. రామచంద్రం పేరుమీదుగా, గుంటూరులోని బాంకుకు, ఈ ఉత్తరంతో కలిపి పంపించండి".

"అలాగే!"

చలపతి వెళ్లిపోయాక పకపకలాడుతూ కళ్యాణి వచ్చింది.

"అంత త్వరగా వదిలావేం మంజూ? నువ్వతనితో దెబ్బలాడతావనుకొన్నానే!" అన్నది కళ్యాణి.

"నాకీపూట మూడ్సు బాగాలేవు".

"రావుగారు వచ్చారు. రమ్మంటారా?"అంటూ చలపతి స్వయంగా పైకి కబురు పట్టుకొచ్చాడు. మంజరీ, కళ్యాణి వొకరినొకరు చూసుకున్నారు. రావుగారేమిటీ? తమింటికి రావడమేమిటి? మంజరి, కళ్యాణి కూడా ఆదరాబాదరా కిందికొచ్చారు. రావుగారు చాలా మామూలుగా ఓ

కుర్చీలో కూచుని ఉన్నారు.

“నమస్కారమమ్మా! మీకూనండీ కళ్యాణిగారూ!”అన్నాడు రావు.

“మీతో ఓ చిన్నపనుండి వచ్చాను. మీరు బిజీగా లేకపోతే పదినిమిషాలు...”

చలపతి అవతలికెళ్లిపోయాడు.

“ముందుగా కబురన్నా చేయలేకపోయారా బాబూ!”అన్నది కళ్యాణి.

“ఇప్పుడేమన్నా అర్జెంట్ పని ఉంటే నేను తరువాత వస్తాను”అని లేవబోయాడు రావు.

“అందుగ్గాదు, మేమే వచ్చేవాళ్లం గదా!”అన్నది మంజరి.

“మరేం ఫర్వాలేదమ్మా! ఏదో పనుండి పోతూపోతూ ఇలా వచ్చాను”అన్నాడు రావు, మెల్ల గా సిగరెట్ వెలిగించుకొంటూ, “మీతో ఓ చిన్న ఆబ్లిగేషన్ ఉన్నదమ్మా! మీరు కనీసం నాకోసమన్నా వొప్పుకోవాలి. మన నారాయణ పిక్చరు తీస్తానంటున్నాడు. నన్నడిగితే సరేనన్నాను. హీరోయిన్‌గా మీ పేరు సజెస్టు చేశాను. వొప్పుకొన్నాడు. మీ ఉద్దేశం కనుక్కుందామని వచ్చాను”.

“అతడు సరిగ్గా పే చెయ్యడని విన్నానండీ!”అన్నది మంజరి.

“అదీ నిజమే!”అన్నాడు రావుగారు. “మీకా భయంలేదు. డబ్బు పూచీనాది. కథ కూడా నేనే తయారుచేయిస్తున్నాను. ప్రతి ఇన్‌స్టాల్‌మెంటూ మీకు డిస్ట్రిబ్యూటరిస్తాడు. నామీద మీకు నమ్మకమే గదా! కథనచ్చితే మీకు అగ్రిమెంటు పంపుతాను”.

“అలాగే! చాలా థాంక్సండీ! ఈసంగతి చెప్పడానికి మీరింత దూరం రావాలా బాబూ! ఫోను చేస్తే నేనే వద్దును గదా!”అన్నది మంజరి.

“ఫర్వాలేదు. మరి నేనొస్తాను”అంటూ రావుగారు వెళ్లారు.

“అసాధ్యుడు!”అన్నది కళ్యాణి కింది పెదవి కొరుక్కుంటూ. “నిజంగా ఈ ఫీల్డుకు సరిపోయిన మనిషి మంజూ! ఎంత తెలివైనవాడంటే-”

“ఊఁ”అన్నది మంజరి.

అతనితో పోల్చడానికి ఇంకోవారెవరూ లేరు. ఎలా నేర్పుగా వ్యవహరించాలో, ఎంత తియ్యగా మాట్లాడాలో మనం రావుగారి నుండి నేర్చుకోవాలనుకొంటాను. అతనేది మాట్లాడినా, చాలా ఆలోచించిగానీ అనడు”.

“అలాగా?”అన్నది మంజరి.

“నారాయణ దాదాపు ఇరవై వేలు సున్నా చుట్టాడు. అయినా రావుగారు కిమ్మనలేదు. ఇంకొకరితో చెప్పనూలేదు. ఇప్పుడు మళ్లా అతనిపిక్చర్లో వేషం వేస్తున్నాడు. నువ్వయితే ఏం చేస్తావే?”అన్నది కళ్యాణి.

“ఇంతవరకూ నాకీలాంటి సమస్య రాలేదక్కా!”అన్నది మంజరి

“ఒకవేళ వచ్చిందనుకో!అప్పుడు?”

“నిర్మొహమాటంగా కాదంటాను”అన్నది మంజరి.

“అవునా! అందువల్ల రావలసింది రాకపోగా, అనవసరంగా వొక ఛాన్సు కూడా పోగొట్టుకొంటున్నావన్నమాట! రావుగారయితే అలా చేయరు. చెయ్యలేరు కూడాను. ఆయన నారాయణ చేత మళ్లీ పిక్చరు తీయిస్తున్నాడు. అందులో తను హీరోగానూ, నిన్ను హీరోయిన్‌గానూ బుక్‌చేశారు. చేసినట్టేననుకో. ఆపిక్చర్ తన డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీలకే యిప్పిస్తున్నాడు. అంటే-పాత ఫిలిం డబ్బు, ఈ ఫిలిం డబ్బు కూడా అతను వసూలు చేసుకుంటున్నాడన్నమాట! నారాయణ

ఎంతో కొంత పెట్టుబడి ఎటుగూడీ పెడుతున్నాడు. ఏదో వో డిస్ట్రిబ్యూటర్ ఆ పిక్చర్ తీసుకోకపోడు. అలాకాకుండా, మంచికథను మంచి కాస్టింగ్ ఇప్పించాడనుకో, ఎన్ని విధాలుగా లాభం ఉంటుందో నువ్వే ఆలోచించు''అన్నది కళ్యాణి.

మంజరి ఆశ్చర్యపోయింది. నిజంగా ఇది తనకు సరికొత్త అనుభవం!

''మరి-మనం రావుగారితో, జయవారి స్కీంను గురించి చెబితే బాగుండేది కదూ?''అన్నది మంజరి.

''నిజమేగానీ, మనకా అవకాశం ఇప్పుడు లేదు. తనిలా అడిగినందుకు, మనం ప్రతిగా ఈ స్కీం చెప్పామనుకొంటాడు. ముందుగా మూర్తిగారి నడుగుదాం. ఆయన వొప్పుకుంటే సరేసరి. లేదా, ఆ రెండు టౌన్ల డిస్ట్రిబ్యూటింగ్ రైట్సు నవ్వు తీసుకో. ఇంత లాభం చూచుకొని మరో కంపెనీకి అమ్మేసెయ్. హీరోకు నువ్వే డబ్బిచ్చెయ్. పోయిందేముంది గనక?''అన్నది కళ్యాణి.

''అంత డబ్బు కావద్దా?''అన్నది మంజరి..

కళ్యాణి ఓ నిమిషం పాటు పలకలేదు.

''కావాలి. అలాగని అవకాశాన్ని జారవిడుచుకోవడం మాత్రం తెలివైనపనికాదు. రాజన్ ఉన్నాడు గదా! అతడేమన్నా సర్దగలడేమో చూద్దాం. లేనప్పుడు ఇంకేదన్నా ఆలోచిద్దాం''అన్నది కళ్యాణి.

ఏదో విషయాన్ని తనకు చెప్పకుండా కళ్యాణి దాచిపెడుతున్నదని మంజరి గ్రహించింది. డబ్బు గురించి అంత భరవాసాగా అంటున్నదంటే, ఏదో గట్టి సోర్సు కళ్యాణికి తెలిసి ఉండాలనీ, సమయం వచ్చినప్పుడు గానీ ఆ విషయం కళ్యాణి బయట పెట్టవద్దనీ మంజరి అనుకున్నది.

ఆ విషయమై వారిద్దరూ ఏమీ అనుకోలేదు.

మూర్తిగారికి ఈ స్కీంను గురించి చెప్పినప్పుడు, ఆయన చాలా నిరుత్సాహంగా మాట్లాడాడు.

''నన్ను మన్నించాలమ్మాయ్! నాకిటువంటి వసవసలేమీ పనికిరావు. నేను డబ్బు మనిషిని. కళని, దేశసేవని, సంస్కృతిని ఉద్ధరించడమని, నానా చెత్త వాగడం నాకు గిట్టదు. మనలో ఎవ్వరూ వీటికోసం కొట్టుకుపోవడంలేదు. ఒక్క దమ్మిడీ వొదులుకోవడమూ లేదు. మామూలుగా నా రేటు చొప్పున నాకివ్వు. నీ కేదో ఇంటరెస్టు ఉన్నదంటున్నావు గనక ఇంకో అయిదువేలు తగ్గించుకో'' అన్నాడు మంజరి.

''పోనీ మీరింకోసారి ఆలోచించి చూడండి; మళ్ళా కలుస్తాను'' అన్నది మంజరి.

''లాభం లేదు. అయినా అన్నను కూడా అడిగి చూస్తాను'' అన్నాడు మూర్తి.

ఈ వ్యవహారం నీళ్ళు కారిపోయినట్లే ననుకొన్నది మంజరి. అయితే కళ్యాణి సలహా మీద రావుగారితో ఈ ప్రతిపాదననే ఇంకోరూపంలో తీసుకొచ్చింది.

''నేను- మీరడిగినట్లుగానే, నారాయణగారి పిక్చర్‌లో పని చేస్తాను. నాకు చిల్లిదమ్మిడీ వద్దు. దానికి బదులుగా, మీరు ఈ పిక్చరులో పనిచేసి పెట్టండి!'' అన్నది మంజరి.

రావుగారు ఇంకో ఆలోచన లేకుండా వొప్పుకొన్నాడు. తనుగాని, తన డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీగాని చిల్లిదమ్మిడి ఇవ్వకుండా మంజరి పని చేసి పెడుతుంది. అందుగ్గాను తనకింకో పిక్చర్‌లో వేషం దొరికింది. ఇందులో తను నష్టపడవలసిందేమీ రావుగారికి కనిపించలేదు.

రెండువారాలు తిరక్కుండానే, మంజరి చాలామంది అర్టిస్టులను, ప్రసాద్ పేరు మీదుగా బుక్ చేసింది.

''మీరీ పిక్చరులో పనిచేసి పెట్టండి. నేను పనిచేసే మిగతా పిక్చర్సులో మీకు వేషాలిప్పిస్తాను''

అన్నది మంజరి.

ఈ మందు బ్రహ్మాండంగా పని చేసింది. మంజరికున్న పలుకుబడి ఎలాంటిదో ఫీల్డులో చాలా మందికి తెలుసు. ఆవిడ మాటను - అక్షరాలా పాటించేవారు-అందునా చాలా పెద్దవారు-ఇండస్ట్రీలో ఉన్నారు. వాళ్ళతో, ఎప్పుడు వో మంచిముక్కన్నాచాలు - వేషాలు దొరుకుతాయి. ఓ పిక్చర్‌లో పదిరూపాయలు తక్కువొస్తే ఏమిటి గనక?

పిక్చర్ ప్రారంభోత్సవం చాలా అట్టహాసంగా ఏర్పాటు చేసింది మంజరి. ఇందుకోసం పనిమాలా రాజన్ ట్రిచ్చి నుండి వచ్చాడు. అసలు అతని చేతనే కెమెరా స్విచాన్ చేయిస్తానన్నది కూడా. కళ్యాణి పగ్గాలు బిగలాగకపోతే అంతపని చేసేది కూడాను.

''పిచ్చిదానా! నీ పైత్యమంతా వొక్కసారే వెళ్ళబోసుకోకు. రాజన్ నాకన్నా నీకు దగ్గరవాడు కాడు. అతగాడేమి ఆకాశం నుండి ఊడిపడలేదు. నీకిష్టమయితే ఇంకో పనిచెయ్యి!'' అన్నది కళ్యాణి.

''ఏమి''టన్నది మంజరి.

''బాంబే నుండి ''లాలారాం'' వచ్చాడు. హాపీ సెంటర్‌లో ఉన్నాడు. నువ్వెళ్ళి అతన్ని రిక్వెస్టు చెయ్యి. అతన్ని వొప్పించగలిగితే నీ రొట్టె విరిగి నేతిలో పడిందన్నమాటే!'' అని సలహా ఇచ్చింది కళ్యాణి.

''రాజన్ ఏమన్నా అనుకోడా?''

''అనుకోడు, ఎందుకంటే, నువ్వూ, వాడు కలిసి వెళ్ళి లాలారాంను అడుగుతున్నా రయ్యే. అతగాడేమో, ఆలిండియా ఫిలిం డైరెక్టరయ్యే అవసరమయితే, ఈ పిక్చర్‌నే నువ్వు హిందీలోకి డబ్‌చేసి నార్తులో రిలీజ్ చేదామని కూడా అనుకొంటున్నావయ్యే. అందుకోసం లాలారాం సహాయం నీకు తప్పకుండా కావాలయ్యే. ఇన్ని జరగవలసి ఉండగా ఎవడో గన్నాయ్ ఏదో అనుకొంటాడంటావేం? అనుకొంటే మాత్రం మనకు పోయేదేమిటి? ఈ దేశంలో రాజన్ వొక్కడే ధనవంతుడు కాడు. అలాంటివాళ్ళు ఇంకా చాలమంది ఉన్నారు'' అన్నది కళ్యాణి.

''ఆల్‌రైట్!'' అన్నది మంజరి ఉత్సాహంగా

ఈ ప్రయత్నాన్నీ గురించి రాజన్‌తో చాలా నేర్పుగా చెప్పింది మంజరి.

''మన పిక్చరుకు మనమే స్విచాన్ చేసుకోవడమేమిటండీ నా బొంద! అలా అంటేగానీ మీరు రారని అన్నాను. అయినా మీరా గొడవల్లో పడితే, నేను జ్ఞాపకం రాననుకొంటాను. కనీసం వారానికొకసారయినా కనిపించమని మీ కెన్నిసార్లు చెప్పినా వినిపించుకోరాయె. ఎలా మీతో వేగడం?'' అన్నది మంజరి.

రాజన్ ముసిముసిగా నవ్వాడు.

''లాలారాం వచ్చాట్ట. హాపీ సెంటర్‌లో ఉన్నాట్ట. మనం వెళ్ళి ఇన్‌వైట్ చేదాం. ఎలాగైనా ఆలిండియా మార్కెట్ ఉన్న డైరెక్టర్. మన కథ నచ్చితే, హిందీ రైట్స్ అతను కొనగలడు. డబ్బు మీరు పెడుతున్నా, దాని పదిలంగా తిరిగి మీకు వొప్పగించవలసిందాన్ని నేనే గదా!'' అన్నది మంజరి.

ఈ కారణాలన్నీ సబబైనవే! ఇవి రాజన్‌కు నచ్చడంలో కూడా ఆశ్చర్యం లేదు. ఇద్దరూ ప్రయాణ మవుతుండగా కళ్యాణి ఇంకో సంగతి చెప్పొకొచ్చింది.

''లాలారాం ఊరికే ఇక్కడికి రాలేదే పిచ్చిదానా! ఆయన పిక్చరుకు సిటీలో డిస్ట్రిబ్యూటర్ని మాట్లాడుకోనేందుకు వచ్చాట్ట. మెహతాకుగాని, కిశోర్‌కుగాని నేనీలోగా ఫోన్ చేస్తాను. నువ్వు బయలుదేరు'' అన్నది కళ్యాణి.

వీరు వెళ్ళేసరికి లాలారాం వీరికోసమే ఎదురుచూస్తున్నవాడిలాగా కనిపించాడు.

రాజన్‌ను చాలా హైస్టైల్లో పరిచయం చేసింది మంజరి.

మంచినీళ్ళప్రాయంగా ఆవిడ ఇంగ్లీషులో మాట్లాడుతుంటే లాలారాం విస్తుపోయాడు.

"సౌత్ఇండియన్ స్టార్స్ అట్టే చదువుకున్నవారు కాదని నాకెవరో చెప్పారు. ఇప్పుడుగానీ, అది అబద్ధమనుకోలేదు." అన్నాడు లాలారాం.

తనకిలాంటి అవకాశం ఇచ్చినందుకు మంజరిని, రాజన్‌ను కూడా అతను అభినందించాడు.

"భాషాభేదాలు, ప్రాంతీయ భేదాలు ఇంకెవరికన్నా అవసరమేమోగాని, కళాకారులు వీటన్నింటికి అతీతులు. ప్రజలకు విజ్ఞాన వినోదాలను కలిగించడం ద్వారా, వారు నిజమైన ప్రజాసేవ చేస్తున్నారు" అన్నాడు. లాలారాం స్విచాన్ చేస్తూ "మనం భారతీయులం, ఆసేతు హిమాలయ పర్యంతం ఉన్న భారతీయులందూ వొక్కటే; భారతీయాత్మ ఒక్కటే; మనకు ఇతర విభేదాలేమీ లేవు. మన మందరం, కళాస్వరూపమైన ఈ పరిశ్రమలో కార్మికులంగా పని చేస్తున్నాం" అని కూడా లాలారాం అన్నాడు.

ఆ తరువాత మెహతా, రాజన్, మంజరి మాట్లాడిన పిమ్మట ప్రసాద్ వంతు వచ్చింది.

" సినిమా కళ- విచ్ఛిన్నమైన జాతీయయైెక్యతను సాధిస్తున్నదనడానికి ఇప్పటి సంఘటనే పెద్ద ఉదాహరణ. తెలుగువారు తీస్తున్న పిక్చర్‌కు తమిళులైన రాజన్‌గారి అండదండలున్నాయి. బొంబాయి డైరక్టరు ప్రారంభోత్సవం చేస్తే అహమ్మదాబాద్ వ్యక్తి ఆశీర్వదించాడు!" అన్నాడు ప్రసాద్.

ఒక్క పిక్చరు తీయడానికి నాలుగైదు సంవత్సరాల టైము అవసరం లేదనీ, అందరూ టీం వర్కుగా ఫీలయి పనిచేస్తే, అయిదారు మాసాలకొక పిక్చరు తీయవచ్చుననీ మంజరి అనుభవ పూర్వకంగా గ్రహించడమే కాకుండా, మిగిలినవారికి కూడా రుజువు చేసింది.

అయితే అందరికి ఇలానే అన్నీ కలసిరావు. తగినంత డబ్బు లేకా, డబ్బుంటే ఆర్టిస్టుల సహకారం లేకా, ఇవి రెండూ ఉన్నప్పుడు ముడిఫిలిం లేకా, అన్నీ కుదిరినప్పుడు స్టూడియోలు ఖాళీలేకా, డిస్ట్రిబ్యూటర్ గొంతెమ్మ కోరికలను తీర్చలేకా, చాలా సినిమా కంపెనీలు ఈసురోమంటూ, సంవత్సరాలకొద్దీ ఒకే పిక్చరును ప్రొడ్యూస్ చేస్తూ, దానిమీద అపరిమితమైన ఖర్చు చేసి, అవన్నీ రాక, నామరూపాలు లేకుండా నశించిపోతూ ఉంటాయి. పూర్తయికూడా విడుదలకు నోచుకొని సినిమాలు, సగంలో ఆగిపోయిన సినిమాలూ, అసలు పిక్చరు ప్రారంభం కాకముందే మూసేసుకొన్న సినిమా కంపెనీలూ బోలెడున్నాయి.

మంజరి - ఈ బాలారిష్టాలన్నింటినీ చాలా చాకచక్యంగా తప్పుకొన్నది. అడిగినప్పుడల్లా వేలకువేలు గుప్పించగల రాజన్ చేతిలో ఉన్నాడు. ఈ సినిమా వంకతో రాజన్ నుంచి చాలాసార్లు చాలా పెద్ద మొత్తాలు పుచ్చుకొన్నది మంజరి. ఒకసారి రాజన్, కాస్త విసుక్కొన్నందుకు మంజరి ముక్క చీవాట్లు వేసింది పైగా.

"ఈ డబ్బంతా నేను మింగడంలేదు. మీ పిక్చర్‌కే పెడుతున్నాను. అణాపైసలతో సహా నా దగ్గర లెక్క రాసి వుంది. మీకే క్షణాన కావలసినా ఎకౌంట్సు బుక్సు చూసుకోవచ్చు. నేనేదో తింటున్నాని అనుమానం మీకుంటే మీరే ఇక్కడ వుండి అన్నీ స్వయంగా చూసుకోరాదా? మీ పని నేను చేసి పెడుతున్నందుకు నాకేదన్నా, ప్రజంట్ చెయ్యడం పోయి, విసుక్కుంటే అర్థమేమిటి? రేపు వేలకు వేలు లాభాలొస్తే మీరు తీసుకొంటారుగానీ, నాకేమన్నా ఇస్తారా?" అని ఝాడించింది మంజరి.

"ఏం లాభాలో ఏం లోకమో!" అన్నాడు రాజన్.

"అంత నమ్మకం లేనివాళ్ళు - అసలీ గొడవల్లోకి ఎందుకు దిగారండీ బాబూ! దమ్మిడితో సహా

లెక్క చెప్పడానికి నేను సిద్ధంగా వున్నానంటే మీరు చప్పరించేస్తారేమిటి? మీ ధోరణి చూస్తుంటే అనవసరంగా, దోవనబోయ్యే తద్దినాన్ని నెత్తి కెక్కించుకొన్నానా - అనిపిస్తోంది. ఈ క్షణంతో నాకూ నీ కంపెనీ వ్యవహారాలకూ రాం రాం. అందరికీ పారేసినట్లు, నాకిచ్చేదేదో పారేయండి, సలాంలు కొడుతూ పని చేసి పోతాను. కూడూ నీళ్ళూ లేకుండా, రాత్రింబవళ్లు ఈ దిక్కుమాలిన కంపెనీతో నేను చావడమేమిటి? ఇన్ని అనుమానాలు కడుపులో పెట్టుకొని, నా పక్కనే పడుకోవడానికి మీకు సిగ్గు వెయ్యడంలేదా? పైగా ఎందుకలా దొంగ నవ్వులు నవ్వుతారు'' అని దులిపేసింది మంజరి.

ఆ మానవుడు మళ్ళా నోరెత్తితే వొట్టు.

ఈ కంపెనీవల్ల ఇంకో లాభం కూడా జరిగింది. తనకు ఇతర కంపెనీల నుండి రావలసిన డబ్బును మంజరి పిండిపారేసింది.

''మీరేమో మీ ఇబ్బందులు చెబుతారు. నే నెవరికి చెప్పుకోను మరి? మీకుమల్లేనే నేనూ అవతల ఆర్టిస్టులకు డబ్బివ్వాలంటారా లేదా? అందులోనూ చాలామందిని నెల జీతాలమీద కుదిర్చాను. నేను తిన్నా తినకపోయినా, నెలాఖరుకు ఐదువేల రూపాయలు అలా ఠంగున చెల్లించాల్సిందే! నాలుగు కంపెనీల వారూ నన్నిలా తిప్పితే నేనేం కావాలి? నేనూ నా వాళ్ళను తిప్పాలి. ఆ పని నావల్ల కాదు. మీ బాధలేవో మీరుపడి, నాకు కొంతలో కొంతైనా సర్దాలి.''

ఈ ధోరణిలో కొన్ని కంపెనీల నుండి మంజరి కొంత డబ్బును వసూలు చేసింది. ఒక్కోసారి ప్రొడ్యూసరు దగ్గర నుండి ఉత్తరం తీసుకొని డిస్ట్రిబ్యూటరు దగ్గర నుండి కూడా వసూలు చేసింది.

''ఆర్టిస్టుల దగ్గర లక్షలకు లక్షలుంటాయనుకొంటారుగానీ వారు కూడా కార్లు, సొమ్ములు తాకట్టుపెట్టుకొని బతుకుతుంటారని చాలా మందికి తెలీదు. కిందటి నెలాఖర్న నా కారు మార్టుగేజ్ చేసి, నేను జీతాలిచ్చాను. ఇంతవరకూ తెచ్చుకోలేదు. మీరాకారు విడిపించండి. నేను కాల్‌షీట్ కొస్తాను. ఇంకోరి కారు మీద స్టూడియోకు రావడం నాకిష్టం లేదు'' అన్నది మంజరి ఒక ప్రొడ్యూసర్‌తో.

కారు విడిపించనన్నా విడిపించాలి. లేదా కాల్‌షీట్ కాన్సిలన్నా చేసుకోవాలి. ఆ ప్రొడ్యూసర్‌కు మరో మార్గం లేదు.

మామూలు వాడి కివన్నీ వింటే - మంజరి ఎంత బాధపడుతున్నదో ననిపిస్తుంది. ఇవేవి లేవు సరిగదా - ఇందులో వీసపాలు బాధలు కూడా ఆవిడ పడలేదు. పైగా ఈ పేరు మీదగా చాలా పోగుచేసుకో గలిగింది. ప్రసాద్ ఖర్చులమీద పిక్చరుకు మాంచి పబ్లిసిటీ ఇప్పించింది. బ్రహ్మాండమైన డాన్సులు, గొప్ప థ్రిల్లింగ్ షాట్సు, డ్రీమ్ సీక్వెన్సులూ, కుస్తీ సీనులూ, సర్కస్ ఫీట్లూ, సెక్సు పిక్చర్ నిండా కుక్కి పారేసింది. రషెస్ చూసినవారు ''సెంచరీ కొడుతుంది'' అన్నారు. పత్రికల్లో కూడా బాగా రాయించింది. అదీగాక, రావుగారి ముఠా మనుష్యులద్వారా, బోలెడంత ప్రచారం సాగించింది. పిక్చరు తయారవుతుండగానే ''బ్రహ్మాండమైన పిక్చరు'' అన్న గాలి అంతటా వ్యాపించింది.

ఈ ఊదర ఊరికే పోలేదు. మంజరికి డబ్బు చేసి పెట్టింది. ఆవిడకున్న సిటీరైట్సు, ఈ ''పొగ'' వల్ల ఎక్కువ ఖరీదుకు అమ్ముడుపోయాయి. హీరో వాటా కింద వీటిలో రెండు పట్టణాలకూ ఉన్న హక్కులను, ఇరవై వేలకు, ఇద్దరు ఎగ్జిబిటర్లకు అమ్మింది మంజరి. ఆవిడ మాత్రం హీరోకు పే చేసిందేమి లేదు. ఎందుకు చేస్తుంది! బదులుగా తన నారాయణ పిక్చర్లో పనిచేస్తున్నదిగదా మరి ?

''పది సంవత్సరాల అనుభవాన్ని ఆ పిక్చర్ వల్ల నేను సంపాదించాను'' అన్నది మంజరి వొక సందర్భంలో.

అది అక్షరాలా నిజం కాకపోయినా, చాలా వరకు నిజమే! రీరికార్డింగ్ సమయంలోనూ, ఎడిటింగ్ సమయంలోనూ మంజరి స్టూడియోలోనే ఉండిపోయేది.

''కంటిన్యూయస్‌గా పేథాస్ సీన్సే ఉంటే ఎలా? ఆడియన్సు ''ఏడుపుగొట్టు పిక్చర''ని దుమ్మెత్తి పోస్తారు. మధ్యలో, కాస్తంత కామెడీ తగిలించండి'' అనేది మంజరి.

''పాటయిందాకా హీరోయిన్నే చూపకండి. మధ్యలో, హీరో కారుమీద వస్తున్న షాట్స్ ఉండాలి. అప్పుడు కాంట్రాస్ట్ వుంటుంది'' అనేది.

''హీరో గోడమీద నుండి దూకిన షాట్ ఉందే - దాన్నెక్కడ పెడుతున్నారు? నో, నో, హీరోయిన్ డ్రీంసీక్వెన్సుకు తరవాత ఉండాలి. ముందెందుకయ్యా బాబూ; హీరోయిన్, హీరోను ఇమేజ్ చేస్తుంది. తరువాత గోడదూకిన షాట్ - నెక్స్టు, ఆవిడ గదిలో ఉన్న షాట్ - దట్సెనఫ్'' అనేది ఇంకోసారి.

అయితే టైటిల్సులో ఎడిటింగ్ ఫలానా అనే ఉన్నదిగానీ మంజరి పేరెక్కడా లేదు.

అదేవిధంగా రీరికార్డింగ్ అప్పుడుకూడా, మంజరి తన ''అమూల్యమైన సలహాలను'' వారికి సరఫరా చేసింది. ఎక్కడ ఏ మ్యూజిక్ ఉంటే బావుంటుందో, ఎప్పుడు ఎలాంటి ట్యూన్స్ వేస్తే లబ్జుగా ఉంటుందో మంజరి నిర్భయంగా చెప్పి చేయించింది.

ఆవిడ చెప్పిందాన్ని ''కా''దన్నవారు గాని, ''ఇదేమి'' టని అడిగినవారు గానీ లేరు. అందరూ ''బ్రహ్మాండం'' అన్నారు. ''అద్భుతం అద్భుతం'' అన్నారు. ఇంతమంది వోకేమోయిన అదేపనిగా అంటుంటే మంజరి క్కూడా ''నిజమేనేమో'' ననిపించింది.

పబ్లిసిటీ విషయం దగ్గరకొచ్చేసరికి మంజరికి అనేక సమస్యలు ఎదురయ్యాయి. ఈ సందర్భాన్ని ఆసరా చేసుకొని, శర్మాజీ పబ్లిసిటీ ప్రాముఖ్యాన్ని గురించి, ఓ చిన్న లెక్చరు దంచేశాడు.

''మీ పిక్చరు బ్రహ్మాండమైన దనడంలో నాకెలాంటి అనుమానమూ లేదు. అది లోగడ ఏ రెండు పిక్చర్లూ స్కోర్ చెయ్యనంత కలెక్షన్స్ సంపాదిస్తుంది'' అన్నాడు శర్మ.

''అంతా మీ దయ. మీ నోటి చలవన అలా జరగాలేగానీ, మీ పత్రిక్కు శాశ్వతమైన ఏర్పాటేదో చెయ్యనండి! అన్నది మంజరి.

అన్నదేగానీ, ఏ మూలనో, ఓ అనుమానం మినుకు మినుకుమంటూనే ఉంది. శర్మ నిజంగా ఈ మాటలన్నీ నమ్మే అంటున్నాడా? అదే ఐతే అతన్ని నమ్మడానికి ఆధారాలంటూ ఉండాలి గదా! అవేమిటో తను తెలుసుకొంటే, ఈ పిక్చర్ బాగా పోయేది లేనిది తను సులభంగా అంచనా వేయగలుగుతుంది. ఈ ఉద్దేశాలేవీ మంజరి బయట పెట్టలేదు. ఆవిడ సుతారంగా నవ్వుతో -

''ఏమిటో శర్మాజీ! పదిమందీ పది రకాలుగా అంటున్నారు. ఆ మాటలన్నీ వింటుంటే గుండె బేజారెత్తిపోతున్నది. కాస్త అటూ ఇటూగా రెండు లకారాలు నేనిందుకోసం ఖర్చు చేశాను. ఈ పెట్టుబడిపోగా ఎంత మిగిలినా నాకు సంతోషమే! ఇందులో నా డబ్బు కళ్యాణిదీ కలపలేదు. వసంతక్కూడా మనమేదో ముట్ట చెప్పాల్సిందే గదా! ఇవి మినహాయించే నేను మాట్లాడుతూంట'' అన్నది మంజరి.

''నాకు ముందు కాఫీ కావాలి'' అన్నాడు శర్మ కణతలు నొక్కుకొంటూ

పది నిమిషాల్లో రాజమణి ఓట్రేలో రెండు గ్లాసులు కాఫీ పట్టుకొచ్చింది.

''వసంత లేదా?'' అన్నది మంజరి

''ఏదో రికార్డింగున్నదని వెళ్ళింది'' అన్నది రాజమణి

ఆవిడ ఖాళీ గ్లాసులు పట్టుకెళ్ళాక "ఏదో చెబుతూ, చెబుతూ మధ్యలో ఆగిపోయారే!" అని విషయాన్ని కదిలించింది మంజరి.

"ఆదా?" అని ఓ క్షణం ఆలోచించి, సిగరెట్ ముట్టించాడు శర్మ. "ఆఁ అవును. పిక్చర్ బాగా పోవడం, పోకపోవడమన్నది, కేవలం పిక్చర్ మీదనే ఆధారపడి ఉండదు. ముప్పాతికభాగం పబ్లిసిటీ మాద ఆధారపడి ఉంటుంది. మాటవరసకు మీ పిక్చర్ సంగతే చూడండి. మాస్‌కు కావలసినవన్నీ ఇందులో వున్నాయి. డ్రీమ్ సీక్వెన్సులు, సస్పెన్సు, డాన్సులు, సెంటిమెంట్, ఫైటింగ్-అన్నిటినీ మించి, ఏ ఇండియన్ పిక్చర్‌లోనూ లేని స్విమ్మింగ్ సీన్సు ఉన్నాయి. వసంత పాటలు అద్భుతంగా ఉన్నాయనడంలో సందేహం లేదు. కానీ, ఇవన్నీ ఇందులో వున్నాయనీ, బొమ్మ ట్రెమెండస్‌గా ఉంటుందనీ పబ్లిక్‌కె ఎలా తెలుస్తుందని? నీ పిక్చరుకు నాలుగు పావలా లిచ్చేవారు కావాలి గానీ, క్లాస్‌జనం అవసరం లేదు. అంటే - మామూలు మనుషుల దగ్గకు నీ పిక్చరు సమాచారం అందాలన్నమాట!" అన్నాడు శర్మ.

"అవును సుమా శర్మాజీ!" అని ఆశ్చర్యం నటించింది మంజరి.

శర్మ రెట్టించిన ఉత్సాహంతో చెప్పుకుపోసాగాడు.

"దానికేమిటి మార్గం? పబ్లిసిటీ! విరివిగా పత్రికల్లో ఎడ్వర్‌టైజ్ చేయించాలి. స్టిల్సు వేయించాలి. పాటికి పదిసార్లు న్యూస్ పడాలి. ఇదంతా చదువుకున్న వారి కోసం. మన ఖర్మకాలి మనదేశంలో చదువుకొన్న జనాభా చాలా తక్కువ. ఎక్కువభాగం పల్లెల్లో ఉంటున్నారు. వీరే నిజమైన పోషకులు. వారి కోసం వాల్‌పోస్టర్లు, కరపత్రాలు టన్నుల కొద్దీ పంచిపెట్టాలి. ఎడ్లబండి మీద థియేటర్లకు జనం వోస్తే తప్ప, కనకవర్షం కురవదు. కానీ - చాలా మందికీ కిటుకు తెలియదు. వాళ్ళెంతసేపటికీ పిక్చరో, పిక్చరో అంటారుగాని, పబ్లిసిటీ కేసి చూడరు. ఆ పాపానిగ్గాను, వాళ్ళు మట్టిగొట్టుకుపోతున్నారు. ఇలాంటి కంపెనీలు నా కళ్ళముందే బొచ్చెడన్ని కూలిపోయాయి. ఇంకోసంగతి కూడా ఉన్నదమ్మాయిగారూ! రిలీజ్ చెయ్యడానికి ముందే, డబ్బాలనోసారి తిరుపతి పట్టుకెళ్ళి అభిషేకం చేయించిరండి. లాభాల్లో ఇంత శాతమిస్తానని స్పష్టంగా మొక్కుకోండి. మీరు సక్సెన్ కాకపోతే నా చెవ్వు కోయించుకొంటాను" అన్నాడు శర్మ.

"పోనీ అలాగే చేదాం" అన్నది మంజరి అభిషేకం గురించి. కానీ, పబ్లిసిటీదే గడ్డుగా ఉన్నది. ఆ విషయమే డొంక తిరుగుడుగా అనేసింది కూడాను.

"మీ కభ్యంతరం లేకపోతే ఆ పనులన్నీ నేను చూస్తాను" అన్నాడు శర్మ, మంజరి ముఖాన్ని జాగ్రత్తగా వెదుకుతూ

మంజరి ఈ సంగతిని ఎప్పుడో కనిపెట్టేసింది. ఓ క్షణం ఆలోచించి సన్నగా నవ్వింది.

"నా కడుపులో ఉన్న ఆలోచనే మీరూ అనేశారు శర్మాజీ! ఒక్కదాన్ని అన్ని పనులూ చూసుకోవడమంటే తల తిరిగిపోతున్నది. అదీగాక టైం కూడా ఉండటం లేదు. మీ అంతట మీరే ఇంత పెద్ద సాయం చేస్తామంటే అంతకన్నా నాకు కావలసిందేమీ లేదు. టైటిల్స్‌లో మీ పేరు కూడా వేయిస్తాం" అన్నది మంజరి.

"థాంక్స్" అన్నాడు శర్మ.

అని ఓ నిమిషం ఆలోచించి, అయిదారుపేర్లు, పక్కనే ఉన్న న్యూస్‌పేపర్ మీద రాసి కొట్టేశాడు.

"ఓ పని చేయండి మేడమ్. టైటిల్స్‌లో "శర్మ పబ్లిసిటీస్ అని వేయించండి. అంతే!" అన్నాడు శర్మ.

''అదేం?''

''ఈ కన్సరన్ నాదే! నే నీ క్షణం నుండే ఈ సంస్థను స్థాపించాను. దీనికి సోల్ ప్రొప్రయిటర్ను కూడా నేనే! ఏదో ఫలానా గన్నయ్య పబ్లిసిటీ ఇచ్చాడనడం వేరూనూ, ఒక సంస్థ పబ్లిసిటీ ఇచ్చిందనడం వేరూనూ! ఈ రెండవదాంట్లో వున్న డిగ్నిటీ మోదటి దాంట్లో లేదు. ఏమంటారు?'' అన్నాడు శర్మ.

''ఓ.కె'' అన్నది మంజరి.

''ఎడ్వర్‌టైజుమెంట్సు కోసం చాలామంది మీదగ్గర కొస్తారు. ''శర్మ పబ్లిసిటీస్‌ను కాంటాక్టు చేయ'' మనండి. ఆయా పత్రికల స్థాయినిబట్టి నేను బ్లాకులిస్తాను. మరో సంగతి, మనం రిలీజు చెయ్యడానికి ముందుగానే ప్రెస్‌షో ఇద్దాం. ఊళ్ళో వున్న పత్రికలవాళ్ళనూ, పొరుగువాళ్ళనూ పిలుద్దాం. బొంబాయిలోని చాలా సినిమా పత్రికల తాలుకు కరస్పాండెంట్సు ఇక్కడున్నారు. వీరందరికీ మనం స్వయంగా ఇన్విటేషన్సు ఇవ్వాలి. ''

''మనం - అని నన్ను కూడా కలపకండి. ఆ గొడవలేమో మీరే చూసుకోవాలి మరి!'' అన్నది మంజరి.

''అదేలేండి. అలాగే! మరి - యీ పూటనే ఇన్విటేషన్ కార్డులను అర్డరిస్తాను. పనిలో పనిగా ఓ యాభై బ్లాకులు కూడా వేరియస్ సైజుల్లో వేరియస్ ఇలస్ట్రేషన్సుతో తయారు చేద్దాం. మంత్లీస్‌లో ఫోర్తు కవరు వేయమందాం. సెంట్రల్ స్ప్రెడ్ వేయించడం కూడా మంచిదే! ఫ్రంట్ కవర్స్‌కు ట్రైకలర్ బ్లాకులు మనమే సప్లయ్ చేద్దాం.''

''అలాగే కానివ్వండి శర్మాజీ!'' అన్నది మంజరి ఆలోచిస్తూ. కానీ ఎంత ఆలోచించినా ''స్పెషల్స్'' వేయించడాన్ని గురించి శర్మ అన్న జ్ఞాపకం తగల్లేదు.

''కొంతకాలం పిక్చరుపోయాక మనం 'స్పెషల్స్' వేయిద్దాం. ఆ తరువాత ఇంకా కొన్ని వ్యవహారాలున్నాయనుకో మేడమ్! అవి మనం చాలా జాగ్రత్తగా ఇంప్లిమెంట్ చెయ్యాలి. మన పిక్చర్లో రెండు మూడుచోట్ల హీరోయిన్ దేవాలయంలో కెళ్ళి పాటలు పాడుతుంది గదా!'' అన్నాడు శర్మ.

''రెండు చోట్లేలెండి. మూడోసారి హీరో వెళ్ళి దేవుడిముందు ప్రాణాచారం పడతాడు.''

''ఐసీ!'' అన్నాడు శర్మ చిటిక వేస్తూ. ''మనకదే చాలు. ఆ సీన్సు వచ్చినప్పుడు, విజయవాడలో ఫలానా ఆవిడకు పూనకం వచ్చిందనీ, వైజాగ్‌లో ఓ భక్తుడు ఆ సీను రాగానే కర్పూరం వెలిగించి టెంకాయలు కొడుతున్నాడని, గుంటూరులో ఒక ముదుసలి తన్మయురాలై పడిపోయిందనీ - ఇలాంటి వ్యవహారాలు శతకోటి వున్నాయి. అవన్నీ పిక్చర్‌రన్నవుతున్నప్పటి మాటలు.''

''నిజంగా అలా జరుగుతుందంటారా?'' అన్నది మంజరి.

శర్మ నిట్టూర్చాడు.

''నువ్వెంత అమాయకురాలివి మేడమ్! జరిగేదేమిటమ్మా నా బొంద. ఇవన్నీ జరగాలా ఏమిటి ? ఆ మాటకొస్తే అసలు జరుగుతాయా? ఏ గుడ్డూ లేదు. పబ్లిసిటీలో ఇదో తంతు. ఆ మందు కొన్ని సందర్భాల్లో అమోఘంగా పని చేస్తుంది. ఎంతవరకూ పని చేస్తుంది అనేది మందును వాడే విధానం మీద ఆధారపడి వుంటుంది.''

శర్మ మాటలు వింటున్న కొద్దీ మంజరిలో ఉత్సాహం పెరగసాగింది. శర్మ మామూలు మనిషేనన్న దిలాసా ఆవిడ కేనాడూ లేదుగాని, యింత ఉక్కుపిండమని కూడా తను అనుకోలేదు.

''మీరు నాకివన్నీ వైన వైనాలుగా చెప్పకండి. నేను మాటల మనిషినికాను. చేతలదాన్ని. నాకు

పని కావడం ముఖ్యం''అన్నది మంజరి.

''చూస్తారుగా!'' అన్నాడు శర్మ.

తను మాటలవాడే కాదనీ, చేతలవాడు కూడాననీ శర్మ రుజువు చేసుకొన్నాడు. అందమైన స్టిల్స్ అంతకన్నా అందంగా 'కంపోజ్' చేయించాడు. బ్లాకులు కూడా రెండురోజుల్లో తయారయి వచ్చాయి.

ఈలోగా కల్యాణి సలహా మీద మంజరి ఇంకో పని చేసింది.

''మీది కొత్త కన్సరన్ గదా శర్మాజీ! దీని ప్రారంభోత్సవానికంటూ మీవాళ్ళు నలుగుర్నీ పిలిపించుకోరాదా? మన పిక్చర్ న్యూస్ స్టిల్సు యివ్వరాదా?'' అని సలహా యిచ్చింది మంజరి.

''అది బాగానే వుంటుందిగానీ, అప్పుడు ఊళ్ళో వున్న మిగతా కంపెనీలను కూడా పిలవాలి. అందతా తడిసి మోపెడవుతుంది. ఖర్చులు మీరు భరిస్తారు సరేననుకో మేడమ్! కానీ నే నీ కన్సరన్ను కంటిన్యూ చేయాలనుకొన్నప్పుడే, అలాంటి మతలబు బావుంటుందిగాని, లేకపోతే ఎందుకూ?'' అన్నాడు శర్మ.

'' ఓరీ నిన్ను తగలెయ్య'' అనుకొన్నది మంజరి.

''నాకేమన్నా వుంటే యీ పూట సర్దండి. అర్టిస్టులు, బ్లాకు మేకర్సుకూ పే చేయాలి'' అన్నాడు శర్మ.

మంజరి వెయ్యిరూపాయలకు చెక్కొకటి రాసి శర్మకిచ్చింది.

''శర్మా పబ్లిసిటీస్'' ప్రారంభోత్సవం చాలా నిరాడంబరంగా జరిగింది.

''మన మందరం వొకే కోవలోని వాళ్ళం. చాలా మంది చాలీ చాలని జీతాలతో బాధపడుతుంటే, మిగిలినవాళ్ళం చావు బతుకులతో స్వంత పత్రికలను లాక్కొస్తున్నాం. పత్రికలవాడు పబ్లిసిటీ సంస్థ పెట్టుకోవడం యిదే మొదలనుకుంటాను. ఆ సంస్థ నాది కాదు. మనందరిదీను. నాలుగు డబ్బులు మిగలాలేగాని, తలాకాస్త తీసుకోవడానికి నాకెప్పుడూ అభ్యంతరం లేదు. నేను ముఖ్యంగా జర్నలిస్టును. తరువాత పబ్లిసిటీ మనిషిని. నా తరపున వచ్చే ప్రకటనలతో బాటుగా న్యూస్‌గాని, స్టిల్సుగాని వస్తే, అడుగున పడవేయకుండా చూడండి. నాకంతే చాలు'' అన్నాడు శర్మ.

అప్పటికప్పుడే పది పత్రికలకు బ్లాకులు, న్యూస్ స్టిల్సు కూడా ఇచ్చాడు. ''ఈసారి ట్రైకలర్ బ్లాకులు ఇస్తాను. ఒక నెల కవరు పేజీ బాధ తప్పినా తప్పినట్లే'' అన్నాడు శర్మ. ఆ తరువాత ఒక్కొక్కరినే విడివిడిగా కలుసుకొని కూడా మాట్లాడాడు.

పత్రికలకు ప్రకటన లివ్వడంలో శర్మ వొకరితో మాట్లాడినట్టు ఇంకొకరితో మాట్లాడలేదు. 10శాతం నుండి 50శాతం కమీషనుదాకా డిమాండ్ చేశాడు.

''టారిఫ్‌లో రేట్లు పెంచుకోండి. నేనేమి కాదనను. కాని నా కమీషనులో మాత్రం కోత పెట్టొద్దు'' అని స్పష్టంగా చెప్పాడు శర్మ.

అందువల్ల కొన్ని పత్రికలు శర్మా పబ్లిసిటీస్ కోసమని కొత్తగా ఎడ్వర్‌టైజ్‌మెంట్ టారిఫ్‌లు ప్రింట్ చేసుకోవలసి వచ్చింది.

పబ్లిసిటీ ఉద్యమం నిర్విరామంగా మూడు మాసాలపాటు జరిగింది. అటు శర్మ, ఇటు ప్రసాద్‌కూడా కాలికి బలపం కట్టుకొని తిరిగారు. అట్టే పనిలేనిదల్లా ఒక్క చలపతికే! అతను కూడా ఒకటి రెండుసార్లు తనంత తానుగా కల్పించుకోబోయాడుగాని, మంజరి గట్టిగా సమాధానం చెప్పింది.

'' మా గొడవలేదో మేం పడుతున్నాం. మధ్యలో మమల్ని డిస్టర్బు చెయ్యకు. ఇంకేమన్నా

పనుంటే వెళ్ళి చూసుకో'' అని సలహా యిచ్చింది మంజరి.

ఇంకో వారం రోజులకు పిక్చర్ రిలీజవుతుందనగా, మంజరి ప్రెస్ షో ఎరేంజ్ చేసింది.

''ఇంతకాలం మీరు చేసిందొక యెత్తు, యిప్పుడు చెయ్యవలసిందొక యెత్తు. రివ్యూలు బాగా రాకపోయాయంటే, నీ బుగ్గలు గిల్లి బూరెలొండి పెడతాను'' అన్నది మంజరి నవ్వుతూ.

తరవాత ప్రసాద్‌ను పిలిచి కేకలేసింది.

''మీరిలా నిమ్మకు నీరెత్తినట్లు కూచుంటే లాభం లేదు. ప్రెస్ షోకయినా యితర్లు రావచ్చు. ఊళ్ళో ఉన్న నలుగురు పెద్దలనూ కేకేసుకు రండి. వారు నలుగురు మంచి మాటలంటే మనకు లాభమే గానీ నష్టం లేదు. మీకెవ్వరూ మినిష్టర్లు తెలీదా? కనీసం మీకు తెలిసిన వాళ్ళల్లో మినిష్టర్ల నెరుగున్న వారెవ్వరూ లేరా?'' అన్నది మంజరి.

''వెదికితే వుంటారు'' అన్నాడు ప్రసాద్.

''మరి చూడండి. వారిని మనమే స్వయంగా ఆహ్వానిద్దాం. ఆయనగారి చేత చిన్న ఉపన్యాసం ఏర్పాటు చేయగలిగితే మరీ మంచిది. దాన్నే మనం పబ్లిసిటీలో వాడుకోవచ్చు. ఇలా ప్రతిదీ నేనే చెప్పాలంటే కుదరదు. మీరు కూడా ఆలోచించాలి.''

ప్రెస్ షో రోజున జరిగిన హడావుడి ఇంతా అంతా కాదు. మంజరి అక్షరాలా అప్సరసలా తయారయి వచ్చింది. కళ్యాణి సరేసరి. వసంత పులుకడిగిన ముత్యంలా మెరిసిపోతూ వుంది. రాజమణి సదస్యులకు గంధం అందిస్తూ వుంటే వసంత కర్పూరపు కడ్డీలు సరఫరా చేసింది. మంజరి, కల్యాణి ఒక్కొక్కరికీ విడివిడిగా నమస్కరించడంతో అలసిపోతున్నారు. శర్మ కాలు కాలిన పిల్లిలాగా తిరుగుతున్నాడు. చలపతి దూరంగా నిలబడితే మంజరి పిలిచి చివాట్లు వేసింది.

'' అలా పని తప్పుకుపోతారేం? మీరూ నాపక్కనే ఉండండి!''అన్నది మంజరి లోగొంతుతో.

''నీపక్కనా? నేనా? ఉండనా?'' అన్నాడు చలపతి కసిగ్గా.

''నువ్వేమి మాట్లాడకు. ఈ కాస్సేపయినా నా వెంట ఉండు.''

చలపతి చేతులు రెండూ వెనక్కు పెట్టుకొని, మంజరి వెనక నిశ్శబ్దంగా నిలబడ్డాడు

ఒకప్పుడు, ఈ థియేటర్‌లోనే, ఈ ప్రసాద్ పిక్చరే షో చేస్తున్నప్పుడు, మంజరి, చలపతి గుప్పిట్లో ఉన్నది. అతననమన్నమాట లన్నది. చెయ్యమన్నపని చేసింది. ఇప్పుడు అందుకు ఫక్తు వ్యతిరేకం.

ఇంటర్వెల్లో జీడిపప్పు, బిస్కెట్లు, కూల్‌డ్రింక్స్ సరఫరా అయ్యాయి.

''ఎలా ఉంది మూర్తిగారూ? మీ అభిప్రాయ మేమిటి ఆచార్లు గారూ? ఏమండీ! ఓ శాస్త్రిగారూ, మీరేమన్నదీ నాకూ కాస్త వినపడనీయండి''

ఈ ధోరణి మంజరి నలుగురి నుండీ అభిప్రాయాలు రాబట్టింది. అవన్నీ చలపతి నోట్ చేసుకొన్నాడు. తిరిగి పిక్చర్ ప్రారంభించడానికి ముందుగా -''ప్రధాన అతిధి''గా వచ్చిన మంత్రిగారు, ఆ సినిమాను గురించి తమ అమూల్యమైన అభిప్రాయాన్ని ఉద్ఘాటించారు.

''సోదరీ సోదరులారా'' అని ప్రారంభించారాయన. ''భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన సంగతి మీకందరికి తెలిసిందే'' అని మధ్యలో ఒకసారి జ్ఞాపకం కూడా చేశారు. ''ఈనాడు ప్రజలకు అందుబాటులో ఉన్న వినోద సాధనం ఈ సినిమా వొక్కటే నన్న విశ్వాసం నాకు మనస్ఫూర్తిగా ఉన్నది. ఇందులోని సీనరీలు, మాటలు మరియు పాటలు ఎంతో కమనీయంగా ఉన్నవి. ఈ సినిమాను అసేతు శీతాచలపర్యంతం ఉన్నవారందరూ తప్పకుండా చూడాలని నేను కోరుతున్నాను. కొన్ని సందర్భాలలో నన్ను నేనే మరచిపోయానని చెప్పడం అతిశయోక్తి కాదు. ముఖ్యంగా, కథానాయిక

ఉయ్యాల ఊగుతున్నప్పుడు, పాడినపాట బహుమధురంగా ఉన్నది. ఇందులోని మరో విశేషం-స్నానాల సీను. సాహసోపేతమైన ఇలాంటి చిత్రాఉ విరివిగా రావాలని నేను కోరుతున్నాను. జైహింద్!"

"మీకు చాలా శ్రమ ఇచ్చాం, మన్నించాలి" అంటూ చేతులు జోడించింది మంజరి మంత్రిగారు పోతుంటే. పిక్చరు రిలీజవడానికి, కొంచెం ముందుగా, పత్రికలు సమీక్షలు ప్రకటించాయి. ఎక్కువ పత్రికలు - ఆ చిత్రాన్ని ఆకాశని కెత్తేశాయి. నాలుగైదు పత్రికలు, కథా సంగ్రహాన్ని మాత్రం ప్రకటించి ఊరుకొన్నాయి. ఒక పత్రిక ఆ పిక్చర్ను ఈకకు ఈక తోకకు తోక లాగిపారేసింది.

"పదిరూపాయల కోసం జేబు దొంగతనం చేసినవాణ్ణి పోలీసులు ఖైదు చేస్తున్నారు. తప్పుడు సాక్ష్యం చెబితే, మోసం చేస్తే ప్రభుత్వం శిక్షిస్తున్నది. దోపిడీ చేయడం మన శిక్షాస్మృతి ప్రకారం గొప్ప నేరం అయినప్పుడు, ఈ పిక్చరును ఎలా విడుదల కానిచ్చింది ప్రభుత్వం? అశ్లీలార్థం స్ఫురించే మాటలు పాటలు కోకల్లలు. ఆడదాని అందం ఇంత ఆచ్ఛాదనారహితంగా ఇంకే పిక్చరులోనూ చూపబడలేదు. ఉయ్యాల ఊగే సీనులో, కథానాయిక, ఎత్తునుండి దిగువకు వచ్చేటప్పుడు కెమెరా ఎదురుగ్గా ఉంచి క్లోజప్ తీయడమెందుకు?

"ఇవిగోనండి పాలు" అని హీరోతో హీరోయిన్ అంటున్నప్పుడు, ఆ రొమ్ము విరుపులెందుకు? అప్పుడు గ్లాసు కనిపించదు. హీరోయిన్ భుజం, ఆ దిగువ భాగాలు కనిపిస్తాయి. స్విమ్మింగ్ సీను మరీ ఘోరం. ఈ విధంగా - చెప్పుకొంటూ పోతే, ఈ పత్రిక పేజీలన్నీ నిండిపోతాయి. అమాయకులైన ప్రజల్లోని క్షుద్రవాంఛలను రెచ్చగొట్టే ఇలాంటి సినిమాలను ప్రభుత్వం వెంటనే నిషేధించాలి. అది - దాని కనీస బాధ్యత. పది రూపాయల దోపిడీని సహించలేని ప్రభుత్వంవారు లక్షలాది రూపాయలను "కళ" పేరుతో నిర్భయంగా దోచేస్తూ వుంటే ఎలా ఊరుకో గలుగుతున్నారు? ఈ ఆరాచకానికి అంతం ఎప్పుడు!' అంటూ రాసుకుపోయింది.

ఈ విమర్శ చదివి మంజరి కుపితురాలయిపోయింది. శర్మ రాగానే ఆ పత్రికను మీదికి గిరాటెట్టి "ఏమిటిది? ఎవరితను?" అన్నది మంజరి.

"ఓ పిచ్చివెధవ. దీన్ని మనం లెక్క చెయ్యవలసిన అవసరం లేదు. అక్కడికీ ఎన్నో విధాలుగా చెప్పి చూశాను. విన్నాడు కాదు. లోగడ కూడా వీడిలాగే చేశాడు. మీకు జ్ఞాపకం ఉండే ఉండాలే! ప్రసాదుగారి పిక్చరు ప్రీవ్యూ అయ్యాక"

"ఓహో - వాడేనా?" అన్నది మంజరి.

ఆవిణ్ణా ధోరణి నుండి మార్చడానికి చాలా శ్రమ పడవలసి వచ్చింది.

ఎవరి జాతకం కుళ్ళిందో చెప్పలేం గానీ, పిక్చరు మాత్రం బ్రహ్మాండంగా పోయింది. అనేక కేంద్రాల్లో కొద్ది "పుష్"తో శత దినోత్సవాలు కూడా జరుపుకున్నది. ఈ ఉత్సవాలకు ప్రముఖ తారాగణంతో బాటుగా, సాంకేతిక సిబ్బంది కూడా హాజరుకావడం వారికి వీరు, వీరికి వారు వెండికప్పులు, నటరాజ విగ్రహాలు సమర్పించుకోవడం, కొన్ని చోట్ల ప్రముఖ రాజకీయ నాయకులు, ఉన్నత ప్రభుత్వోద్యోగులు, యీ ఉత్సవాల్లో పాల్గొనడం, వారిని వీరూ, వీరిని వారూ పొగిడేసుకోవడం - అంతా అక్షరాలా జరిగింది.

విశేష మేమిటంటే, యీ సారి వసంత కూడా యీ ఉత్సవాల్లో పాల్గొనడం. గుంటూరులో గావును - వసంత స్టేజీ మీదకు రాగానే, జనం గొల్లుమని అరిచారు. కొంతమంది ఫలానా సీనులోని ఫలానా పాట పాడి తీరాలని పట్టుబట్టారు. వసంతకు పాడక తప్పింది కాదు.

''ఎత్తనురా, ఎత్తనురా
కోడెవయసువాడా!
కళ్ళెత్తనురా, ఎత్తనురా
వయసు దోచువాడా!
అదమబోకు, గదమబోకు
అబలనురా అందగాడ,
అలవగొట్ట తగదురా!
నా దగ్గర ఎర్రగులాబీ పూవుందీ
నీకిస్తే చిదిమి నలిపేస్తావూ!
ఎత్తను, నే నెత్తను
కళ్ళెత్తి చూడజాలనురా!
బిత్తరి చూపులవాడా
అత్తయ్యొస్తున్నదిరా!''

ఇదీ పాట. రసిక జనుల హృదయాలను యీ పాట ఎంతగా ఆకట్టుకొన్నదంటే, కేవలం యీ పాటకోసమని, అప్పటి మంజరి అభినయం కోసమనీ పాటికి పదిసార్లు పిక్చర్ను చూసినవారున్నారు. ఇంతటి పాపులారిటీని పొందిన మరోపాట

''మెడ దిగువన చలి చలి చలి
చలి చలీ, గిలి గిలీ
కళ్ళదిగువ చల్చలా
కాళ్ళ దిగువ గల్గలా''
అనేది.

గత మాజీ అభ్యుదయ కవి వసంతుడు రాసిన యీ పాట ఈత సీనులోనిది. మంజరి, అవిడ స్నేహితురాళ్ళు చెడ్డీలు కట్టుకొని కొలనులో ఈదుతూ, ఆ చన్నీళ్ళు శరీరంలోని ఏ భాగానికి తగిలి, ఎలాంటి అనుభూతులిస్తున్నదీ యిందులో వర్ణించారాయన. పిక్చరైజేషన్ బ్రహ్మాండంగా ఉన్నదనడంలో ఎలాంటి అనుమానము లేదు. ఇన్ని వేలమంది-లక్షల మంది కూడానేమో - ఎంతో అప్యాయంగా, అను నిత్యం పాడుకొనే యీ పాటల్లో ఏదో అశ్లీలం వున్నదనీ, వీటిని తీసివేయాలనీ ఏదో ఓ పత్రిక రాస్తే ఏమిటయిందిట? మట్టిగొట్టుకుపోయింది వాడుగానీ, పిక్చరు కాదే! బతకడం తెలీని మనుషులు ఇలాంటి వెర్రి మొర్రి వేషాలు వేస్తే నామరూపాలు లేకుండా పోతారు.

ఆంధ్ర, తమిళ దేశాల్లోని ప్రధాన కేంద్రాలన్నింటా చిత్రం దిగ్విజయ యాత్ర చేసింది. డబ్బాలు సురక్షితంగా మద్రాసు చేరాయి. మంజరి తనకున్న కార్యక్రమాలన్నీ రద్దుచేసుకొని, వారం రోజుల విశ్రాంతి కోసం ఊటీ వెళ్ళిపోయింది. ప్రయాణానికి ముందు, తనను ఫలానచోట కలుసుకోవలసిందని, రాజన్కు ఫోనుకూడా చేసింది.

''నాలుగైదు లకారాలు మిగులుతాయా?'' అని చాలామంది ప్రసాద్ను అడిగారు.

''న్యాయంగా అయితే మిగలవలసిందే! కానీ, మధ్యలో నేననుకొన్న ప్లానులన్నీ తలకిందులయ్యాయి. ఆర్టిస్టులు -మంజరి ధర్మమా అంటూ చాలా కోఅపరేట్ చేశారు. సమయానికి నేను ఎక్స్పెక్టు చేసిన డబ్బు అందినట్లయితే, నా ఫేట్ ఇంకో రకంగా ఉండేది. అలా జరగలేదు.

స్టూడియోవాళ్ళు, డైరక్టరూ, టెక్నిషియన్లూ నన్ను డబ్బు కోసం వత్తిడి చేశారు. నేను ఏది కాదనుకొన్నానో, అదే చెయ్యవలసి వచ్చింది. మళ్ళా ఓ డిస్ట్రిబ్యూటర్సు ఆశ్రయించాలి సొచ్చింది. ఆంధ్ర కన్నా తమిళ్ ఏరియా ఎంతో నయం. ప్రతి చోటికీ నేను స్వయంగా వెళ్ళి థియేటర్సును బుక్ చేసుకొన్నాను. ఒక్కో జిల్లాకు ఒక్కో డిస్ట్రిబ్యూటర్ కూడా ఇక్కడున్నారు. అందువల్ల కాంపిటీషన్ పెరిగి, నాకు నాలుగు డబ్బులు గిడతాయి. మన ఖర్మం ఇంకోలా తగలడుతోందండీ! ఏ అయిదారు కంపెనీలో - మంచివి -మనకున్నాయి. వీళ్ళే మొత్తం ఇండస్ట్రీని మొనాపలీ చేస్తున్నారు. వీళ్ళను కాదని పిక్చర్‌ను ఎగ్జిబిట్ చేసే ధైర్యం థియేటర్‌కు లేదు. అలాచేస్తే డిస్ట్రిబ్యూటర్లు ఇంకో బొమ్మనివ్వరేమోనని భయం. సరే ఈ గొడవలన్నీ మామూలేననుకోండి ఏదీ - ఇంకా లెక్కలు తయారు కాలేదు. ఎంత హీనంగా చూసుకొన్నా మీరన్నంత కాకపోయినా, అందులో సగమైనా వుంటుందేమో ననుకొంటున్నాను'' అని ముత్తుకొన్నాడు ప్రసాద్.

''మరి నెక్స్టు వెంచర్ ఎప్పుడు ప్రారంభమవుతుంది?'' అన్నారు ఒకరు.

''తప్పకుండా ప్రారంభిస్తాను. మంజరి ఊటీ నుండి రావాలి. వచ్చాక మేమిద్దరం కలిసి ఆలోచించుకోవాలి'' అన్నాడు ప్రసాద్.

ప్రోగ్రాం ప్రకారం వారానికి రావలసినదల్లా రెండువారాలకొచ్చింది మంజరి. ప్రసాద్ వెళ్ళి కలుసుకొన్నాడు, వచ్చాడు. ఈ రాకపోకలతో ఇంకో వారం గడిచిందే తప్ప మంజరి గానీ, ప్రసాద్ గానీ ఎకౌంట్ విషయమే ప్రస్తావించుకోలేదు. మంజరేమో ఎప్పుడూ ఏదో హడావుడితో వుండిపోతుంది. ప్రసాద్‌ను చూచి ''హలో'' అంటూ పలకరించి, ''జస్ట్ వన్ మినిట్, వీరితో మాట్లాడొస్తాను'' అంటూ అతన్ని పైకి పంపుతూనే వుంది. ఆవిడకంటే ఎలానైనా గడుస్తుంది. మరి తన సంగతేమిటనుకొన్నాడు ప్రసాద్. ఒకసారి ఆవిడ పనులు తీరిందాకా కూచున్నాడు. ఈ పూట తేల్చివేసుకొందామని కూడా అనుకొన్నాడు.

''అరె! మీరింకా కూచునేవున్నారా? ఐ యామ్ సారీ ప్రసాద్!'' అని ఎంతో నొచ్చుకుంది మంజరి. ''పోనీ అంత అర్జంటయితే, ఆ మాట అనకపోయారా? నేను వచ్చేద్దునే!'' అని కూడా అన్నది.

''మరేం లేదు - మన ఎకౌంట్స్ అలాగే వుండిపోయాయి'' అన్నాడు ప్రసాద్.

''ఔను'' అన్నది మంజరి ఏదో ఆలోచిస్తూ ''మీకేమన్నా కావాలంటే పట్టుకెళ్ళండి. లెక్కలు తరువాత చూచుకొందాం - ప్రస్తుతానికి ఈ వెయ్యి చాలా?''

''వెయ్యా?'' అన్నాడు ప్రసాద్.

మంజరి విరగబడి నవ్వింది.

''బ్యూటిఫుల్ ప్రసాద్! నువ్వెంచక్కా భావాలను ఎక్స్‌ప్రెస్ చేస్తావోయ్! నీలాంటివారు - సరే, తరవాత చెప్పుకొందాంగానీ రెండు చాలా? పోనీ మూడువేలకు చెక్కివ్వనా? వసూ! ఆ చెక్‌బుక్ ఇలా పట్టుకురా!''

వసంత చెక్ బుక్ తెచ్చి మంజరి ముందు పెట్టింది. ప్రసాద్‌కు నమస్కారం చేసి వెళ్ళిపోయింది.

''నేను రెండువేలు, మూడు వేలు అడగడం లేదు మంజరీ!'' అన్నాడు ప్రసాద్.

''అంతకన్నా నీ కెక్కువ వస్తుందనుకోను. రేపుదయం రారాదా - చలపతి కూడా వుంటాడు. లెఖ్ఖచూసుకొని, నీ కెంత రావాలంటే అంతా పట్టుకు పోవచ్చుగా!'' అన్నది మంజరి తాపీగా.

ప్రసాద్‌కు ముచ్చెమటలు పోశాయి. అతను ఆత్రంగా పెదవులు తడుపుకొంటున్నాడు.

“నేనీ మధ్యనే డిస్ట్రిబ్యూటర్ను కలుసుకొన్నాను. నువ్వొస్తే తప్ప లెక్క చెప్పనన్నాడు.”

“అదేదో నేను చూసుకొంటాను ప్రసాద్! నీకు కావలసిందేదో ముందు పట్టుకెళ్ళు” అన్నది మంజరి.

“నాకు ఎకౌంట్ ప్రకారం డబ్బుకావాలి, అదే ఫైనల్ చెయ్యమంటున్నాను. నీకంటే - పది పిక్చర్లున్నాయి గనక ఫర్వాలేదు. నే నలా కాదు మరి!” అన్నాడు ప్రసాద్.

“నువ్వనే దేమిటో నాకొక్కక్షమూ బోధపడటం లేదన్నది” మంజరి.

“ ఆ మాట అనవలసినవాణ్ణి నేను గానీ, నువ్వు కాదు. నా పిక్చర్ డిస్ట్రిబ్యూట్ చేసినవాడు నాకు లెక్క చెప్పడం ధర్మం. వాడు నిన్ను పిలుచుకు రమ్మంటాడేం? అదే నాకు బోధపడకుండా వుంది” అన్నాడు ప్రసాద్.

“ఎవడో ఏదో అన్నదానికి నన్ను సమాధానం చెప్పమనడం ఏం ధర్మం ప్రసాద్? అతగాడు నన్ను రమ్మన్నందుకు, నువ్వెందుకుట ఉలుక్కోవడం?” అన్నది మంజరి.

“నువ్వేదో అడ్డుపుల్ల వెయ్యకపోతే వాడలా అంటాడా?”

“అడ్డుపుల్ల వెయ్యడమేముందీ ఇందులో? నా డబ్బు నేను జాగ్రత్త పరచుకోవడం తప్పుకాదే! నువ్వెన్నిసార్లు ఎంతెంత యిచ్చిందీ నాకు నోటి జ్ఞాపకం వున్నది. నువ్వు వాడుకొన్న మొత్తాలు - పది అటూ ఇటూ - చెప్పగలను. ఇవి పోను నీకు రావలసిందాన్ని పట్టుకెళ్ళమంటే -నీకు పిక్చర్ ఎకౌంట్ మొత్తం కావాలంటావేం ?” అన్నది మంజరి.

ప్రసాద్ ముఖంలో గోటిగాటుకు నెత్తురు బొట్టు లేకుండా పోయింది.

“అలా తెల్లబోతావెందుకు ప్రసాద్? మొత్తం ఖర్చు నేనే పెట్టాను గదా! జీతాలు వాతాలు కూడా నేనే ఇచ్చాను. ఆ రసీదులన్నీ నా దగ్గరున్నాయి. రకం తిరగక అప్పుడప్పుడు నీ దగ్గర బదులు పుచ్చుకొన్నమాట నిజమే! మహా వుంటే ఇరవై వేలుండను. కాదూ కూడదంటే పాతిక వేలుండును. అంతేగానీ, ప్రొడక్షన్ ఖర్చు రెండు లక్షలూ నువ్వే పెట్టలేదుగా! స్టూడియోకు, టెక్నీషియాన్‌లకూ పే చేశాను. పబ్లిసిటీలో కూడా చాలా భాగం యిచ్చాను. మిగతాది ఈ క్షణాన పారేయంటే పారేస్తాను సరా? అన్నది మంజరి.

“ఈ పిక్చర్ నాది. నువ్వు నన్ను మోసం చేస్తున్నావ్?” అన్నాడు ప్రసాద్ పళ్ళు జిట్టకరచుకుంటా.

మంజరి మెత్తగా పకపక నవ్వింది.

“నీ ఆరోగ్యమేమీ బావోలేదనుకొంటాను ప్రసాద్! అనవసరంగా స్ట్రెయిన్ కాకుండా వెళ్ళి రెస్టు తీసుకోరాదూ? నా కారు మీద పోదువుగాని, ఈలోపుగా డాక్టర్‌కు ఫోన్ చేస్తాను. అవసరమయితే స్పెషల్ ట్రీట్‌మెంట్ తీసుకొందువుగాని! సరా?” అన్నది మంజరి.

“నా డబ్బు సంగతేమిటి?” అన్నాడు ప్రసాద్ బిగ్గరగా. “నువ్వేదో మాయ చేశావ్! నాకు రావలసిన డబ్బంతా మింగాలని చూస్తున్నావ్! ఆ పిక్చర్ నాది”

“పాతికవేలు చేబదుల్చినందుకే నువ్వు పిక్చర్ నాదంటున్నావే. మరి రెండు లక్షలు పెట్టిందాన్ని నా మాటేమిటి ప్రసాద్? నువ్విచ్చిన డబ్బు నీ పేర జమ లేనప్పుడు బాధపడినా అందం చందం ఉన్నది. నీ గోలమాత్రం నాకు కాదు సరిగదా, నన్ను పుట్టించిన బ్రహ్మక్కూడా అర్థం కాదు.”

“నా బానర్ మీద తీసింది నా పిక్చర్‌కాక నీదెలా అవుతుంది?”అన్నాడు ప్రసాద్.

“జయా బానర్ మీద తీసినమాట నిజమే! అది నీ స్వంతమని మాత్రం ఎక్కడుంది ప్రసాద్? ప్రొడ్యూసరుగా నీ పేరు కూడా లేదే ఎక్కడా? నేను నా స్వంత డబ్బుతో, నీ బానర్ మీద పిక్చర్

తీసినంత మాత్రాన, లాభాలన్నీ నువ్వే లాక్కుపోతావంటే - అదెలా కుదురుతుంది? ఖర్చులన్నీ నేనే వాడాను. రసీదులన్నీ నా పేర నున్నాయి. స్టూడియోకు నేనే చెక్కిచ్చాను. ఆర్టిస్టులకు నేనే పే చేశాను. ఇంతచేసిందాన్ని - నేనేమీ కాదంటావేం? అందుకే నీకు మతిపోయిందనడం. నా మాట విని - అరె, అలా ఉద్రేకపడతా వెందుకు ప్రసాద్! నీకు మినిమం మేనర్సుకూడా తెలియదనుకోలేదు సుమా!'' అన్నది మంజరి ఎంతో నిరుద్రేకంగా.

''ఇంతకాలం నేను పడిన శ్రమంతా''

''అందరం శ్రమపడ్డాం ప్రసాద్! మిగతా అందరిలాగే నువ్వూ పని చేశావ్. నీ కష్టం ఉంచుకోనేంత నీచురాలిని కాదు. అందరికన్నా అదనంగా నీకేమన్నా ఇద్దామనుకొంటున్నాను. స్వంతపనులు చేసినట్టు నాకు పనిచేసి పెట్టావ్. ఆ కృతజ్ఞత నాకున్నది. నీలాగా విశ్వాసంతో పనిచేసేవారు ఎందరో ఉండరు ప్రసాద్! ఆ విషయం నాకు తెలుసు''

''ఓసి గుడిసేటిదానా!'' అంటూ ప్రసాద్ రెండు చేతులూ పైకెత్తి లేచాడు.

క్షణంలో పక్కకు తిప్పుకొంది మంజరి. ఈ హడావుడికి వసంత, రాజమణి, తాయారు కూడా వచ్చారు. సోఫాలో బోర్లపడిన ప్రసాద్ లేచి, పిడికిళ్ళు బిగిస్తూ, మంజరికేసి దూకబోయాడు. తాయారు గట్టిగా అతన్ని వాటేసుకొని, కేకలు పెట్టింది.

''నోర్మూయ్యవే పిచ్చిముండా, ఎందుకలా అరుస్తావ్?'' అని తాయారు కోప్పడింది మంజరి. తరువాత మెల్లిగా, ప్రసాద్ కేసి తిరిగి, ఓ క్షణకాలం తదేకంగా చూసి, కింది పెదవి కొరుక్కున్నది. ''నువ్వు మర్యాదగా బయటికి వెడతావనుకొంటున్నాను. నిన్ను అరెస్ట్ చేయించడం నిమిషాల్లో పని. నీకు పూర్తిగా మతిచలించింది. నువ్వు పిచ్చివాడివి. అయినా పాపమని వదిలి పెడుతున్నాను. ఒకప్పుడు నీ నుండి ఏదో చిన్న సాయం పొంది వుండకపోయినట్లయితే, ఈ పాటికి దీంతో '' అని కాలిజోడు ముందుకు విడిచింది మంజరి. ''దీంతో సమాధానం చెప్పి ఉందును. ఏ మూలనో, నన్వింకా ఆ పాపభీతి పట్టుకు పీడిస్తున్నది ప్రసాద్! వెళ్ళు, వెళ్ళిపో. ఇహ జన్మలో ఈ గడప తొక్కకు. నీకు రావలసిందేమయినా ఉంటే, నేనే లెక్క చూసి పంపిస్తాను తాయారూ! వాణ్ణి వదిలెయ్. ఇంట్లోకి రానివ్వొద్దని గూర్ఖాతో చెప్పు''

''అలాగేనండమ్మాయిగారూ!''

పోతున్న ప్రసాద్‌కేసి ఆఖరిసారిగా చూసింది మంజరి. అతని కళ్ళల్లోని వెర్రిచూపులు ఆమెను విచలితం చేశాయి.

పగబట్టిన పాము కాటేయకుండా ఊరుకోదని మంజరికి తెలుసు. ప్రసాద్ సమయం కోసం కాచుకొని ఉంటాడనీ, అదను చిక్కగానే మళ్ళీ లేవకుండా తనను చావుదెబ్బ కొడతాడనీ ఆవిడ అనుకొంది. అంటే -ప్రసాద్ తనను ఏమి చేసేందుకు అవకాశం ఇవ్వకూడదన్నమాట! ఇదెలా సాధ్యం?

''పోనీ చలపతిని సలహా అడుగుదామా'' అనుకొన్నదిగానీ, ఆ పద్ధతి అంత మంచిదని ఆవిడకే అనిపించలేదు. చలపతి తనకు ఇంటి శత్రువు. మేకతోలు కప్పుకొన్న పులిలాంటివాడు. అతగాడు తనకు సాయం చేయడం మాట దేవుడికి తెలుసు - ప్రసాద్‌తో కలిసి తన కంఠానికి ఉ రి తీసుకు రాకపోతే అంతే చాలు.

ఎందుకయినా మంచిదని కళ్యాణిని సంప్రదించింది మంజరి.

''నువ్వెందుకలా భయపడతావ్ మంజూ! ఇదేమంత కొత్త సంగతని నువ్వలా అదురుకోవడం,

మనలో చాలామంది ఇటువంటి వ్యవహారాలు నడిపినవారే! ఈ రోజున ఇండస్ట్రీలో నీకున్న పలుకుబడి వేరు, నీ మాటకున్న విలువ వేరు. ఒకవేళ ప్రసాద్ వెళ్ళి పదిమందితో మొరపెట్టుకున్నా, ఆ పదిమంది నీకు సాయపడతారు గానీ, వాడితరపున మాట్లాడరు. నీకా భయం మవసరం లేదు. నువ్వు నిశ్చింతగా ఉండు'' అని సలహా ఇచ్చింది కళ్యాణి.

కళ్యాణి అంతగా భరోసా ఇచ్చిన తరువాత న్యాయంగా అయితే మంజరి మెదలకుండా ఊరుకోవలసింది. కానీ ఆవిడలా ఊరుకోనేలేదు. ఏదన్నా జరుగుతుందన్న భీతి ఆవిణ్ణి స్థిమితంగా కూచోనివ్వలేదు. కళ్యాణి అవసరం లేదంటున్నా వినకుండా రామస్వామి మొదలియార్‌ను సంప్రదించింది.

''అసలేం జరిగింది?'' అన్నాడు రామస్వామి మొదలియార్.

మంజరి చెప్పుకొచ్చింది.

''స్వంతంగా పిక్చరు తీద్దామనుకొన్నాను. పదిమంది అర్టిస్టులూ నాకు సాయం చేస్తామన్నారు. కొంతమంది తరువాత డబ్బు తీసుకునే పద్ధతి మీద పని చేశారు. మీరందరికి నేనే దరిమిలా డబ్బిచ్చాను. నా దగ్గర లేనప్పుడు నాకు తెలిసినవారి నుండి అప్పు తీసుకొచ్చాను. అప్పుడే ప్రసాద్ గారు నా దగ్గర కొచ్చారు. ''ఇంకో బానర్ మీద పిక్చర్ తీయడం కన్నా నా బానర్ మీదనే తీసుకో'' మన్నాడు. తనకు ప్రస్తుతం తగినంత పెట్టుబడి లేదనీ, డబ్బు రావడానికి ఇంతలో అవకాశం లేదనీ అన్నాడు. అందాకా కంపెనీ మూసేయడం కన్నా, ఎవరిదో వొ పిక్చరు కంపెనీ పేరు మీదుగా రావడమే మంచిదన్నాడు. నేనూ ''సరే'' నన్నాను. ఆ దరిమిలా అతనో పాతికవేలు అప్పుగా నా కిచ్చాడు. నా కంపెనీలోనే పని చేశాడు. తీరా పిక్చర్లో లాభాలొచ్చేటప్పటికి, పిక్చర్‌కు తానే ప్రొడ్యూసరుననీ, లాభాలన్నీ తనకే రావాలని పేచీ పెడుతున్నాడు'' అన్నది మంజరి.

''చాలా గట్టికేసు' అన్నాడు రామస్వామి మొదలియార్, తలపాగా తీసి బల్ల మీద పెడుతూ. ''అతనుగానీ కోర్టు కెక్కాడా?''

''లేదు - లేదనుకుంటాను'' అన్నది మంజరి.

''మీ తరపున వర్క్ చేస్తాను. గెలుపు పూచీ నాది. అయిదు వేలకు దమ్మిడీ తక్కువయితే నా వల్ల కాదు'' అన్నాడు రామస్వామి మొదలియార్.

''మీ తరపున వర్క్ చేస్తాను. గెలుపు పూచీ నాది అయిదు వేలకు దమ్మిడీ తక్కువయితే నావల్ల కాదు'' అన్నాడు రామస్వామి మొదలియార్.

మంజరి ఓ క్షణం ఆలోచించింది.

''సరేనండీ! ఇంటికెళ్ళి డబ్బు పంపుతాను. ముందుగా ఏ మాత్రం కావాలంటారు?''

''మూడు వేలు పంపండి. గుమాస్తా కాయితాలిస్తాడు. వాటి మీద సంతకాలు చేసీ మరీ వెళ్ళండి'' అన్నాడు రామస్వామి మొదలియార్.

మంజరి అనవసరంగా భయపడిందిగానీ, కళ్యాణి చెప్పిందే నిజమయింది. ప్రసాద్ వారం రోజులపాటు పిచ్చికుక్కలా వారివెంటా, వీరివెంటా తిరిగాడు. కనిపించిన ప్రతివాడితోనూ చెప్పుకొన్నాడు. సానుభూతయితే దక్కిందిగాని, అంతకుమించిన లాభమేమీ కలుగలేదు. మంజరి ఉక్కుపిండంలాంటి అడ్వకేట్‌ను పెట్టుకొన్నదనీ, ఆ మహానుభావుడు బమ్మిని తిమ్మిని చేయగల సమర్థుడనీ, కోర్టుకెక్కి కూడా ఏమీ లాభం లేదనీ, చాలామంది ప్రసాద్‌కు పిరికిమందు పోశారు.

''నన్ను అన్యాయం చేసింది నా కళ్ళ ముందరే, నా డబ్బుతో కులుకుతుంటే నేను చూస్తూ

ఊరుకోలేను. దాన్ని చంపిగానీ నేను మద్రాసు విడిచిపెట్టను'' అనడం సాగించాడు ప్రసాద్.

''పిచ్చివాడా! నోటి కొచ్చినట్లు వాగకు. మంజరి నిన్నీ క్షణాన అరెస్టు చేయించడం బ్రహ్మవిద్య కాదు. అనవసరంగా నీకు రావలనసిన డబ్బు - ఆవిడ నీకిస్తానంటున్న డబ్బు ఎందుకు పోగొట్టుకుంటావయ్యా! నువ్వు మనస్సును కాస్త శాంతపరుచుకోవాలి. ఈ రంగంలో కోపతాపాలకు తావు లేదు'' అని ఎవరో సలహా ఇచ్చారు.

మొదట్లో ఈ ప్రతిపాదనకు ప్రసాద్ వొప్పుకొనిమాట నిజమే గానీ, ఆ తరువాత అంతకన్న చేసేదేమీ లేదు గనక, అతను మంజరితో రాజీకి వచ్చాడు. ''అప్పు''గా ఇచ్చిన పాతికవేలూ, పిక్చర్లో పనిచేసినందుకు నెలకు అయిదు వందల చొప్పున రావలసిన సొమ్మూ కాక, ఇంకో అయిదువేలు అదనంగా ఇచ్చింది మంజరి. ఈ మధ్యలో అతను వాడుకున్న మొత్తం అంతా రద్దుచేసింది కూడాను.

''మీరు చాలా ఉదారంగా ప్రవర్తించారమ్మా!'' అన్నాడు మధ్యవర్తి.

మంజరి సన్నగా నవ్వి ఊరుకొంది.

ఈ గొడవలిలా పరిష్కారమవుతుండగానే, రాజన్ డబ్బుకోసం ఉత్తరాలమీద ఉత్తరాలు రాయడం ప్రారంభించాడు.

''నేను ఊపిరి పీల్చుకోడడానిక్కూడా తెరిపి లేకుండా ఉంది. వీలయినంత డబ్బు వెంటనే పంపు'' అని ఓ జాబులో రాశాడు రాజన్.

''ముందు మీరోసారి మద్రాస్ రండి! మీతో చాలా విషయాలు మాట్లాడాలి. మీ రక్కడా, నే నిక్కడా, మధ్యలో ఈ జాబులూ - ఈ పద్ధతి నాకు నచ్చలేదు.'' అని మంజరి జవాబు రాసింది.

మూడోరోజున రాజన్ వచ్చి, ఫలానా చోట తాను దిగానని ఫోనుచేశాడు మంజరికి.

''మంచిది, నే నొస్తున్నాను'' అని ఫోన్ పెట్టేసింది మంజరి.

తరువాత వసంతను పిలిచి ''మనం ఇంకో గంటలో పార్టీకి పోతున్నాం, రెడీ గా ఉండు'' అన్నది మంజరి.

''ఇద్దరూ వచ్చారే!'' అన్నాడు రాజన్ చిరునవ్వు నవ్వుతూ.

''మరే!'' అన్నది మంజరి చిరుకోపంగా.

లోపలి కొచ్చాక తలుపులు దగ్గరగా వేసి గడియ బిగించింది మంజరి.

''ఏమిటి సంగతి?'' అన్నాడు రాజన్ సోఫాలో కూచుంటూ.

మంజరి అతని పక్కనే కూచున్నది. వసంత అతనికి ఎదురుగా కూచున్నది.

''అవునుగానీ బాబూ! ముందీ మాటకు బదులు చెప్పండి. మీకు డబ్బు ముఖ్యమా, మనుషులు ముఖ్యమా? ఎన్ని జాబులు రాసినా ''డబ్బో, డబ్బో'' అంటారుగానీ, నాగురించి అడగనన్నా అడగరేం? మీ డబ్బు కొచ్చిన ఇబ్బందేమీ లేదు. ఎప్పుడు కావాలంటే అప్పుడే దాన్ని క్యాష్ చేసుకోవచ్చు. నేను కొన్నదానికన్నా పదివేలు అదనంగా వస్తాయే తప్ప నష్టం మాత్రం రాదు. కావాలంటే మీ రెవరికయినా బేరం పెట్టుకోండి - నాకేమి అభ్యంతరం లేదు'' అన్నది మంజరి.

''బేరమేమిటి?'' అన్నాడు రాజన్

''డబ్బున్నదిగదాని - అళ్వార్ పేటలో ఓ బిల్డింగ్ ఉంటే కొన్నాను. మొత్తం 75వేలు. కొంత ఇచ్చాను. ఇంకా ఇవ్వాలి. ఇంకా రాతకోతలు జరుగలేదు. ఎడ్వాన్సు ఇచ్చినంత వరకూ రసీదు పుచ్చుకొన్నాను'' అన్నది మంజరి.

రాజన్ పలకలేదు.

''చాలా మంచి బిల్డింగ్ లెండి. ముందు పెద్దతోట, రెండు కార్‌షెడ్లు, నాలుగు ఔట్ హౌస్‌లు, మార్బుల్ ఫ్లోరింగ్ - చాలా అట్టహాసంగా ఉంది. పై అంతస్థులో చిన్న స్విమ్మింగ్‌పూల్ కూడా ఉంది. రాజం పేట జమీందారుగారిదట'' అన్నది వసంత.

''నీకు నచ్చిందా?'' అన్నాడు రాజన్, వసంత కేసి చూస్తూ.

''పోండీ బాబూ! నేను చెప్పను'' అన్నది వసంత బుంగమూతి పెట్టి

''అప్పటికీ నేను భయపడుతూనే ఉన్నాను, మీరేమంటారోనని. ఈ వసంత నా ప్రాణం తీసింది. వారి కెలాగైనా నచ్చచెబుదామన్నది. చెబితే వినకపోతారా అన్నది. మీరెంత కసిన కోత కోసేది నాకు తెలుసుగానీ, దానికేం తెలుసు? మీరు మెత్తగా మాట్లాడినట్లే ఉంటుంది. వాత పెట్టినట్లే ఉంటుంది. దానిపోరు పడలేకనే సగం నేనా బిల్డింగ్‌ను కొన్నాను'' అన్నది మంజరి, సాభిప్రాయంగా వసంత కేసి చూస్తూ.

''జమీందారేమో, బ్రహ్మాండంగా కట్టించి పారేశాడు బావగారు! బెడ్‌రూమంతా అద్దాలతో నింపేశాడు. ఏ మూలనుండి చూసినా గదంతా కనిపిస్తుంది. పైగా ఎయిర్‌కండిషన్ కూడాను. అక్కయ్యేమో, అప్పుడే ఏ గది ఎందుకో డిసైడ్ చేసింది. మీరూ అక్కయ్యా అందులో ఉంటారట. మేమందరమూ, ఇప్పుడున్న పాత ఇంట్లో ఉండాలట'' అన్నది వసంత.

''ఏమనుకొంటే ఏముంది వసూ! మీ బావగారి కిదేమి పట్టినట్టు లేదు. ఆయన డబ్బు మనిషి. డబ్బు తప్ప ఇంకేమి ఆయనకు పనికిరాదు'' అన్నది మంజరి, చేతిలో ఉన్న హ్యాండ్‌బాగ్‌ను రాజన్ మీదికి విసిరివేస్తూ.

బాగ్ తెరిచే ఉన్నదేమో, అందులో ఉన్న కాగితాలన్నీ కిందకు జారాయి. రాజన్ వాటిని పైకి తీస్తుండగా, ఓ చిన్న అట్ట పెట్టె కనపడింది. మూత తీశాడు. తన ఫోటో అది. దానికి పసుపూ కుంకుమా పూసి వుంది. ఫోటో చుట్టూ వాడిన గులాబీ రేకులు, మాగిపోయిన సంపంగి రేకులూ కనిపించాయి.

''ఏమిటీ పిచ్చి?'' అన్నాడు రాజన్.

మంజరి మాట్లాడలేదు. ఆవిడ కళ్ళు నీటితో నిండిపోయాయి.

''ఎందుకమ్మా అలా కళ్ళంట నీళ్ళెట్టుకోడం? నిన్ను ఏమన్నాను గనక? పోనీ, ఇలా ఇల్లు కొన్నానని రాశావా?'' అన్నాడు రాజన్.

''రాయలేదు. రాస్తే మీరు మరీ కోపగించుకొంటారను కొన్నాను. మనకోసం గాకపోయినా, మన పిల్లలకైనా ఉంటుందని కొన్నాను. నా వొక్కదానికీ అంత ఇల్లెందు కండీ? ఏ గదిలో ఉన్నా నాకు గడుస్తుందే!'' అన్నది మంజరి.

''మన పిల్లలా? అంటే -ఓహో - అదెప్పుడు?'' అన్నడు రాజన్ అదుర్దాగా.

అతనిలో ఉండవలసినంత ఉత్సాహం లేదు. మంజరికీ విషయం తెలుసు. అయినా తెలియనట్లుగానే ఉండిపోయింది.

''మరింకా చెప్పావు కాదేం! ఏదీ ఇటు తిరుగు'' అంటూ మంజరి రెండు భుజాలు పట్టుకొని తనకేసి తిప్పుకొన్నాడు రాజన్.

''పోండి, నన్ను మీరు ఏడిపించారు. నేను మీతో మాట్లాడను'' అని విదిలించేసింది మంజరి.

''ఏడిచినప్పుడు నువ్వెంత అందంగా ఉంటావంటే మంజూ!''

''ఈ బలిబుచ్చికం మాటలు నా దగ్గర అనకండి. మీకే చెప్పేది-అయ్యో అలా నొక్కకండి!

నేను మామూలు మనిషినన్నా కాదు.''

వసంత పక పకా నవ్వి, రాజన్ వెనక్కు లాగేసింది.

పది నిమిషాల తర్వాత, వెయిటర్ ఓ పెద్ద ట్రేలో సీసాలు, సోడాలు పట్టుకొచ్చాడు. మంజరి, రాజన్‌లకు వసంతే నింపిన గ్లాసుల నందించింది. తరువాత తను కూడా వొకటి పుచ్చుకొంది.

''ఏదన్నా పాడు - పాట మజాగా ఉండాలి'' అన్నాడు రాజన్, సిగరెట్ అంటించుకొంటూ.

సమయం చూసి, వసంత ఆ సిగరెట్ కాస్తా తను లాగేసుకొంది. రాజన్ ఊరుకోలేదు. ఆ సిగరెట్ కోసం వసంత దగ్గరకెళ్ళాడు. వసంత బెడ్‌రూంలో కెళ్ళింది. రాజన్ కూడా వెళ్ళాడు. మంజరి వారిని అనుసరించింది. ఉదయం ఏడుగంటలదాకా, తిరిగి ఆ గది తలుపులు

తెరుచుకోలేదు.

# 18

ఆళ్వార్ పేటలో ఉన్న ఇల్లు మంజరి బేరం చేసినమాట నిజమే! అది రాజంపేట జమీందార్ గారిదైనా మాటా నిజమే! కొంత అడ్వాన్సు ఇచ్చిన మాట కూడా నిజమే! కానీ ఇంకా రిజిష్టరు కాలేదు. నాలుగుమాసాల్లోగా పూర్తి డబ్బు ఇచ్చేటట్లూ, ఇల్లు రిజిస్టర్లు చేసుకొనేటట్లూ ఎగ్రిమెంటు రాయించుకొన్నది మంజరి. నిజానికయితే, డబ్బుకోసం అన్ని రోజులపాటు ఆగనవసరం కూడా. పిక్చర్లో మిగిలిన డబ్బే బోలెడంత ఉన్నది. దాంతో అలాంటి బిల్డింగులు అరడజను కొని పారేయొచ్చు కానీ, ఉన్న డబ్బంతా బయటపెట్టడానికి లేదు. ''ఇంత డబ్బు నీకెక్కడ''దని రేపు ఇన్‌కంటాక్సు వాళ్ళడిగితే ఏం చెప్పాలి? పిక్చర్ ద్వారా యాభై వేలకన్నా లాభం మిగలలేదని ఎకౌంట్సు చెబుతున్నాయి. అప్పటికి, అమాంబాపతు ఖర్చులన్నీ ఇబ్బడిముబ్బడిగా రాయించింది. పదిరూపాయలిచ్చిన వాడిచేత వందరూపాయలకు వోచర్ తీసుకొంది. పాతిక రూపాయలిచ్చిన జూనియర్ ఆర్టిస్టులచేత రెండు వందలకు రసీదు తీసుకొంది. వసంతకు, కళ్యాణికి, రాజమణికి, తాయారుకు, వేలకు వేలు ఇచ్చినట్లు రాసింది. రకరకాల మనుషుల పేర రకరకాల ఖర్చులురాసింది. ఈ విషయంలో ఆడిటర్సు అద్భుతమైన చాకచక్యం చూపించారు. వారు ఆదాయాన్ని వీలయినంతవరకూ తగ్గించారు. ఖర్చులను గరిష్ట ప్రమాణానికి పెంచారు. అయినా యాభైవేలకు దమ్మిడీ తగ్గకుండా ఉంది. ఇదిగాక, ఇతర పిక్చర్ల వల్ల వచ్చిన ఆదాయం వేరే ఉంది. అదీ ఇదీ కలిపితే ఓ లకారం దాటటం ఖాయం. అంటే-ఇందులో చాలా భాగం మంజరి పన్నుల రూపంలో తిరిగి ప్రభుత్వానికి చెల్లించాలన్నమాట.

''చచ్చీ చెడి మనం సంపాదించడమేగానీ, అందువల్ల సుఖమేమీ లేదక్కా!''అన్నది మంజరి ఒకసారి.

''నిజమే గానీ, ఒక దశ దాటాక సంపాదించకుండా ఉండటమనేది మనచేతుల్లో ఉండదు మంజూ! వద్దనుకొంటున్నా డబ్బు పోగుపడిపోతూ ఉంటుంది. ''నా వల్ల కాదోయ్ బాబూ'' అంటున్నా ప్రొడ్యూసర్లు వినిపించుకోకుండా మన ముందు ఎగ్రిమెంట్లు పారేస్తారు. మన షరతులకన్నింటికి వొప్పుకొంటారు. అడిగినంత డబ్బూ ఇచ్చేస్తారు. మనం వినకపోతే మనకు దగ్గరవాళ్ల చేత చెప్పిస్తారు. మనమీద వత్తిడి తీసుకొస్తారు. వినక తప్పేదేముందిట?''అన్నది కళ్యాణి.

''అదీ నిజమే!''అన్నది మంజరి.

''అందుకనే మనం ఇంకా ఇంకా ఖర్చులు పెంచుకోవాలి. నా మాట విని రాజంపేట రాజాగారి బిల్డింగ్ కొనేయ్! నా దగ్గరే గనక డబ్బుంటే ఈ క్షణాన నేను కొనేసి ఉందును''అని సలహా ఇచ్చింది

కళ్యాణి.

ఆ సలహా విన్నాకనే మంజరి ఈ కొనుగోలుకు సిద్ధపడింది.

సరిగ్గా ఆ రోజుల్లోనే గిండీలో గుర్రాలు పరుగెత్తుతున్నాయి. మద్రాసు నగరంలోని సగభాగం గిండీ దగ్గరకు చేరింది. గుర్రప్పందాలను గురించి మంజరి వినడమేగానీ, ఎప్పుడూ చూడలేదు. ఆవిడకు చూడాలని కూడా లేదు. కానీ కళ్యాణికి రేసెస్ అంటే వల్లమాలిన మోజు.

"నువ్వొక్కసారి రారాదా? నచ్చకపోతే మనం మధ్యలోనే వచ్చేదాం. అక్కడ మనవాళ్లు చాలామంది ఉంటారు. లక్షల మీద టర్నోవరు జరుగుతుంది. మనం తిరిగి వచ్చేలోగా నాలుగుసార్లు లక్షాధికార్లమయి, ఇంకో నాలుగుసార్లు శుద్ధ పాపర్లమయిపోతాం. ఆఖరుసారి మనమేమయితే, అదే ఆరోజుకు ఖాయమన్నమాట! చాలా థ్రిల్లింగా ఉంటుంది మంజూ!"అని కళ్యాణి ప్రోత్సహించింది.

మంజరి బలవంతాన "సరే"నన్నది. దోవలో వీరిద్దరూ "మంగళదాస్" బైనాక్యులర్స్ కొన్నారు. మంజరి కారు షాపు బయట ఆగడం చూసి, ఓ పెద్ద గుంపు ఆ కారుచుట్టూ పోగుపడింది. షాపులో వున్న ఇతర కస్టమర్లు, "మంజరి, మంజరి"అని గుసగుసలాడటం మంజరి విన్నది. వాళ్లు కారెక్కడం చాలా కష్టమయింది. ఎక్కాక కారు కదలడానికి ఇంకో పదినిమిషాల టైం పట్టింది. అప్పటికైనా ట్రాఫిక్‌పోలీసు జోక్యం కలగచేసుకోకతప్పలేదు.

కళ్యాణి నవ్వింది గానీ మంజరి మాత్రం చికాకు పడింది.

"మన మొఖాన కోతులుగానీ ఆడుతున్నాయా ఏమిటక్కాయ్! అలా ఈగలు ముసిరినట్టు ముసురుతారేం?" అని విసుక్కొంది మంజరి.

కళ్యాణి ఏదో అనబోయి, ఇంకేదో జ్ఞాపకం వచ్చి ఆగిపోయింది.

మంజరికి గుర్రప్పందాలు నచ్చాయి. నచ్చడమంటే, అవి జరుగుతున్నంత కాలమూ, ఆవిడ వాటికి హాజరయింది. చిత్రమేమిటంటే, మొట్టమొదటి రోజున తను అనుభవించిన "మజా" చివరిదాకా అనుభవించగలిగిందామె. దానికితోడు "కైపు" వంటి ఆవేశం కూడా మంజరిని పూనింది. ముందు సరదాగా ప్రారంభించిన పందెం, వారం రోజులకల్లా అలవాటు కింద మారిపోయి, ఇంకో వారానికి వ్యసనంగా తయారయింది. ఏ గుర్రం లోగడ ఎన్నిసార్లు గెలిచిందో, దాని పేరేమిటో, దేనిమీద ఏ జాకీ రైడ్ చేస్తాడో మంజరికి తెలిసిపోయాయి. అయినా ఈ సందర్భంగా మంజరి చాలా డబ్బు నష్టపోయింది. కళ్యాణి వద్దంటున్నా వినకుండా వేలకు వేలు పందాలు కాసింది. ఓడిపోయినందుకు దిగులుపడటానికి బదులుగా రెట్టింపు ఉత్సాహంతో మంజరి పందాలు కాసింది. ఓడిపోయినందుకు దిగులు పడటానికి బదులుగా రెట్టింపు ఉత్సాహంతో మంజరి పందాలు కాసింది.

"నీతో ప్రతిదానికి చచ్చిన చావుగా ఉన్నది మంజూ! అతివృష్టి అనావృష్టి తప్ప మధ్యే మార్గం లేకపోతే ఎలా?"అని కోప్పడింది కళ్యాణి.

"నా తీరే అంత!" అని సమాధానం చెప్పింది మంజరి. "బతికితే అగ్నిగోళంగా బతకాలి. లేదా బూడిదలాగా, చప్పగా, చల్లారిపోవాలి. నసుగుడు బేరం నావల్లకాదు".

"నిన్నా రేసెస్‌కు తీసుకువెళ్లకపోయినా బాగుండిపోను"అని గొణిగింది కళ్యాణి.

"తీసుకెడితే ఏమయిందిట? కొంపలారిపోయినట్లు మాట్లాడతావేమిటక్కాయ్? రెండు చేతులా సంపాదించాను. నాలుగు చేతులా ఖర్చుచేవాను. ఇంకా ఇంకా సంపాదించగలను. ఖర్చు చెయ్యనూ గలను. రూపాయిని చూసి జడుసుకోవడం నాకెప్పుడూ ఇష్టం లేదు. డబ్బును చూసి మనం భయపడుతున్నంత కాలమూ, అది మనల్ని బెదిరిస్తూనే ఉంటుంది. దాన్ని మనం కాలుతో తన్నేయాలి.

అప్పుడు మన కాళ్లదగ్గర కొస్తుంది!'' అన్నది మంజరి.

''ఓసి రాలుగాయి!''అనుకొన్నది కళ్యాణి.

మంజరికి జయాపిక్చర్ ద్వారా లభించిన లాభంలో ఎక్కువ భాగం గుర్రప్పందాలు తినేశాయి. వాటి ఆసరా చూసుకొనే ఆవిడ రాజంపేట రాజాగారి బిల్డింగుకు ఎడ్వాన్సు ఇచ్చింది. ఇప్పుడు డబ్బు లేదు. ఈకారణంతో, చేసిన బేరం కాన్సిల్ చేసుకోవడం కన్నా, ముక్కుమూసుకొని ఏ మురుగుగుంటలోనన్నా పడి చావడం నయం! ఫలానా ఆర్టిస్టు, ఫలానా బిల్డింగును బేరం చేసి కూడా కొనలేకపోయిందన్న వాదు కన్నా, చావడమే మంచిది. కానీ, వోటమిని వొప్పుకోవడానిక్కూడా మంజరి సిద్ధంగా లేదు. ఇంకోసారి రాజన్‌ను అడిగి చూడమని వసంత సలహా ఇచ్చింది. అది కూడా మంజరికి నచ్చలేదు. రాజన్ ఇప్పటికే చాలా ఇచ్చాడు. కళ్యాణి మాటల్లో చెప్పాలంటే, ఆవిడ మొత్తం ఇంత కాలంలోనూ పిండినదానికి నాలుగు రెట్లెక్కువగా తను వసూలుచేసింది. పిక్చరు కోసమని అతనిచ్చిన డబ్బులో చిల్లికానీ చెల్లువేసింది లేదు. మళ్లా ఏ మొహం పెట్టుకుని అతన్నడుగుతుంది? రాజన్ బంగారు బాతులాంటివాడు. రోజుకో గుడ్డు చొప్పున తీసుకోవాలేగానీ, ఒక్కసారో కోసుకుతినకూడదు.

మంజరి పడుతున్న మధన వసంతకూ, రాజమణికి తెలుసు. అయినా వాళ్లు అందులో జోక్యం చేసుకోలేదు. వసంత రెండు,మూడు సార్లు, ఏదో సలహా ఇద్దామని ఊగులాడింది గానీ రాజమణి ఆ ప్రయత్నాన్ని పడగొట్టింది.

''మంగమ్మ ఉక్కుముక్కలాంటిది. దాని బుద్ధి పాదరసంలాగా పనిచేస్తుంది. దానికి మన సలహాలు అనవసరం''అన్నది రాజమణి.

మంజరి ఈ ఆర్థిక సంక్షోభం నుండి తప్పుకోడానికి రకరకాల మార్గాలు ఆలోచించింది. మెహతాకు ఫోన్‌చేసి, కొత్తకంపెనీలేమయినా వస్తే, తనను రికమెండ్ చేయమన్నది. కిశోర్‌ను కలుసుకొని, ''నీ మిత్రుని చేత ఇంకో పిక్చర్ తీయించరాదా?'' అని సూచించింది. కానీ జవాడులు అంత ప్రోత్సాహకరంగా లేవు. దీనికి తోడుగా ఆరోగ్యం కూడా అంత బాగా ఉండటం లేదు. ఏమి తిన్నా వాంతులవుతున్నాయి. నోటినిండా నీరూరుతున్నది. ముందుగా తను డాక్టర్ను కలుసుకోవాలి. తనబోటి వారికి ఇలాంటి వ్యవహారాలు బొత్తిగా పనికిరావు. ఇవన్నీ సాధ్యమైనంత తొందరలో తేల్చుకోవాలనీ, కొంతకాలం పాటు మరో వ్యాపకమేదీ లేకుండా హాయిగా విశ్రాంతి తీసుకోవాలనీ మంజరి నిశ్చయం చేసుకొంది. కానీ, ఏ విశ్రాంతి తీసుకోవాలన్నా ముందీ సమస్యలన్నీ తీరాలి గదా!

''బాగానే ఉంది వరస. పిచ్చికుదిరితేనే గానీ పెళ్లికాదు, పెళ్లయితేనేగానీ పిచ్చి కుదరదు. ఏది ముందు?''అనుకొన్నది మంజరి.

అదృష్టవశాత్తూ ఒకరోజున శంకరం పిళ్ళే పనిమాలా మంజరి ఇంటికొచ్చాడు. ఆమెతో అరగంటసేపు మాట్లాడిన తరువాత, ''సాయంత్రం మీరోసారి మా ఆఫీసుకు రండి, మీతో మాట్లాడాలి''అన్నాడు పిళ్లే.

''సరే''అన్నది మంజరి.

అతను వెళ్లాకగానీ, పిళ్లేను గురించి ఆలోచించలేదు మంజరి. అంతకు ముందు పిళ్లేను చాలాసార్లు గిండీలో చూసింది మంజరి. అతను చాలామంది ఆర్టిస్టులతో చనువుగా మాట్లాడుతుండటం మంజరి గమనించింది. వారిలో కొందరికి పిళ్ళై నోట్లబొత్తులు అందించి, చిన్న చిన్న కాగితాల మీద వారి సంతకాలు తీసుకోవడం ఆవిడ కంటపడింది. ''ఎవరితనని''మంజరి

అడినప్పుడు, కళ్యాణి పకపకానవ్వి ఊరుకొంది. కాదు కూడదు చెప్పమని బలవంతం చేసింది మంజరి. "తీరిగా చెబుతాను"అని తప్పుకొన్నది కళ్యాణి. ఆతరువాత కళ్యాణి చెప్పనూ లేదు; తను అడగనూ లేదు.

పిళ్లేపోయిన అరగంట తరువాత కళ్యాణి ఫోను చేసింది, ఎలా ఉన్నావంటూ.

"బాగానే ఉన్నాను"అన్నది మంజరి.

"నువ్వెలా ఉన్నదీ నాకు తెలుసు మంజూ! ఇప్పుడే పిళ్లే నాకు ఫోనుచేశాడు. నీ సమస్యలన్నీ అతను తీర్చగలడు. నిన్ను సాయంత్రం రమ్మన్నాట్టగా! వెళ్ళు"అన్నది కళ్యాణి.

"ఎందుకుట?"అన్నది మంజరి.

"నువ్వడగలేదా?"అన్నది కళ్యాణి.

"లేదు. ఎందుకో రమ్మన్నాడు. నేను 'సరే'నన్నాను. అంతేజరిగింది. ఇదేదో పద్మవ్యూహంలాగా ఉన్నదక్కాయ్! నానుండి నువ్వేదో దాచిపెడుతున్నావ్! అవునా?"

"ఏమీలేదు. ఇప్పుడిప్పుడే నన్నేమీ అడక్కు"అని ఫోను పెట్టేసింది కళ్యాణి.

మంజరికేమీ పాలుపోలేదు. ఆవిడింకోసారి కళ్యాణికి ఫోనుచేసి చూసింది గానీ, ఫలితం లేకపోయింది.

"అయితే నేనే వస్తానుండు"అన్నది మంజరి.

❧❧❧❧❧❧❧❧

శంకరం పిళ్ళే మద్రాసు వచ్చి పదిపదిహేను సంవత్సరాలవుతుంది. మొదట్లో ఏదో ఉద్యోగం చేసుకొందామనే వచ్చాడు. సినిమా వ్యాపారంలో కాలుబెట్టాలన్న తలంపు అతనికప్పట్లో లేదు. పిళ్లేకు ఎక్కడా ఉద్యోగం దొరకలేదు. కొంతకాలలం పాటు ఏదో హెూటల్లో క్లీనర్‌గా పనిచేశాడు. తరువాత మూడేళ్లపాటు ఓ స్టూడియోలో "బోయ్"గా పనిచేశాడు. అప్పుడే అతనికి పెద్దపెద్ద ఆర్టిస్టులతో పరిచయమయింది. ఆతరువాత ఓ పెద్ద నటిదగ్గర పనికి కుదిరాడు. పనంటే మరేం లేదు-ఎప్పుడే ఆమెను అంటిపెట్టుకొని ఉండేవాడు. ఆమెకు ఎప్పుడెప్పుడు ఏం కావాలో పిళ్ళేకు తెలుసు. అవన్నీ అతను ఏర్పాటు చేస్తూ ఉండేవాడు. "అమ్మాయిగారు" ఎవరితో మాట్లాడుతుంటే, పిళ్ళే వారితోనే స్నేహం చేసేవాడు. వారికి నచ్చేమాటలు చెబుతుండేవాడు. అమ్మాయిగారు వాడి విశ్వాసానికి ఎంతో మురిసిపోయేది. తనకు మర్యాద జరక్కపోయినా బాధపడదుగానీ, పిళ్ళేను చిన్నచూపు చూస్తే వూరుకొనేది కాదు. "అమ్మాయిగారిని"గురించి ఏ సమాచారం కావాలన్నా పిళ్లేను సంప్రదించవలసిందే! వాడు కాదన్న తరువాత "అమ్మాయిగారు" ఔననటం జరగదు. వాడు "అవు"నన్న తరువాత ఆవిడ కాదనడం కూడా జరగదు. అందువల్ల అమ్మాయిగారి దర్శనం చేసుకోదలచినవారంతా, ముందుగా పిళ్ళేను దర్శించేవారు. వాడు, ఫలానా రోజు, ఫలానా టైముకు రమ్మన్నాడంటే దానికి ఢోకాలేదు.

అమ్మాయిగారి అంగరక్షకుడిగా పిళ్ళే అయిదేళ్లు పనిచేశాడు. ఈలోగా అతనిదగ్గర చాలా డబ్బుపోగుపడ్డది. దీంతో ఏదన్నా వ్యాపారం చేదామనుకొన్నాడు. దానిమీద లాభంతో పెళ్లిచేసుకొందామనీ, జీవితంలో సుఖపడదామనీ పిళ్ళే సంకల్పించుకున్నాడు. తన ఉద్దేశాన్ని అమ్మాయిగారికి చెప్పినప్పుడు, ఆమె కళ్ళనీళ్ల పర్యంతమయింది.

"ఏదో వ్యాపారం పెట్టుకొని పైకి రావాలంటున్నావు. బాగానే వుంది. అందులో వచ్చే లాభాలేవో నేనే ఇస్తాను. ఇక్కడే ఉండిపో"అన్నది అమ్మాయిగారు.

"కాదు లెండి. నేను వెడతాను. మరి నాకు శలవిప్పించండి!"అన్నాడు పిళ్ళే.

తాను చెప్పడమే కాకుండా, ఇతరుల చేత కూడా చెప్పించింది అమ్మాయిగారు. అయినా పిళ్లే వినలేదు. వెళ్లేప్పుడు వాడికో అయిదువేల రూపాయలిప్పించింది అమ్మాయిగారు.

పిళ్లే ఆ డబ్బుతో చిన్న హోటలు ప్రారంభించాడు. నమ్మకంగా పనిచేసేవాళ్లను అయిదారుగుర్ని పెట్టుకొన్నాడు. తను కాష్ దగ్గరవుంటూ కూడా రష్ ఉన్నప్పుడు సప్లయిచేసేవాడు. సినిమా జనం తెలుసు గనక వారి ఖాతాలన్నీ రాబట్టాడు. ప్రొడక్షన్ మేనేజర్లను మంచి చేసుకొని, ఆయా కంపెనీలకు తన దగ్గర ఖాతాలు పెట్టించాడు. అర్ధరాత్రప్పుడు వేడి ఇడ్లీ సాంబారు కావాలన్నా, మసాలా దోశ కావాలన్నా పిళ్లే దగ్గర దొరికేవి. చాలా స్టూడియోలకు అతని మనుషులు ఫలహారాలు చేరవేస్తూ ఉండేవారు. రెండేళ్లలో పిళ్లే చాలా గడించాడు. అతను పక్కనే వున్న ఇంకో బిల్డింగ్ అద్దెకు తీసుకొని లాడ్జింగ్ కూడా ప్రారంభించాడు. అతని హోటల్లో దిగినవారికి "సమస్త సౌకర్యాలూ" సమకూర్చడంలో పిళ్ళే ఏనాడూ తన నిస్సహాయతను వ్యక్తం చేయలేదు. రకరకాల మనుషులతో అతని లాడ్జింగ్ ఏవేళ చూచినా కళకళలాడుతూ ఉండేది.

అటు రెస్టారెంటును, ఇటు లాడ్జింగ్‌ను ఒక్క చేతిమీదుగా నిర్వహించడం కష్టమైపోయింది. నెలకు ఇంతమొత్తం తననిచ్చే పంపిణీ మీద రెస్టారెంటును "లీజ్"కిచ్చాడు. లాడ్జింగ్‌ను బాగా వృద్ధిచేశాడు.

ఇంకో రెండేళ్లు గడిచాయి.

ఓ శుభముహూర్తాన పిళ్లే లాడ్జింగ్ బోర్డును మార్పించి, అదేచోట "పిళ్లే పిక్చర్స్ ప్రైవేటు లిమిటెడ్"అనే బోర్డును తగిలించాడు.

"నేను పిక్చర్స్ తీయను. కానీ, తీసేవారికి ఫైనాన్సు చేస్తాను. వారికి ఆర్టిస్టులను మాట్లాడి పెడతాను. ఆర్టిస్టులకు వర్కు చూపెడతాను. డిస్ట్రిబ్యూట్ చేదామని అనుకోవడం లేదు. మంచి పిక్చర్ నాచేతికొస్తే, పంపిణీ చేయడానికి నాకేమీ అభ్యంతరం లేదు"అన్నాడు పిళ్ళే.

ఈ వ్యాపారంలో అతనెంతగా రాణించాడంటే అతనికి పోటీ అంటూ తగల్లేదు. చాలామందికి అతను డబ్బు పెట్టుబడి పెడుతూ ఉండేవాడు. తిరిగి నెమ్మదిమీద జమ కట్టుకుంటూ ఉండేవాడు. క్రమక్రమంగా అతని వ్యాపారం వేల నుండి లక్షలకు పెరిగింది. బొంబాయి నుండి మద్రాసుకు వచ్చే మార్వాడీలు అతని ఆతిథ్యం పొందకుండా పోవడమంటూ జరగదు. వారిలో కొందరికి పిళ్ళే దగ్గర ఖాతాలు కూడా ఉన్నాయి. తన ఖాతాదారుల్ని అన్నివిధాలా సంతృప్తిపరచడంలో అతనికతనే సాటి. పిళ్ళే దగ్గర చాలా రకాల ఫొటోలున్నాయి. ఒక్కో వ్యక్తి ఏ డ్రెస్‌లో ఎలా ఉండేదీ ఏమేకప్‌లో ఎలా ఉండేది తెలుసుకోవాలంఏ అతని దగ్గరున్న ఆల్బం చూస్తే చాలు. ఫొటో చూసి నిర్ణయించుకోలేని వారికి పిళ్ళే-మనుషుల్ని రప్పించి మరీ సాయపడుతుండేవాడు. ఆయా వ్యక్తుల ఎత్తు, రంగు, లావు, బరువు వగైరా వివరాలు కూడా అతని దగ్గర సిద్ధంగా ఉండేవి. ఎవరెవరికి ఏయే భాషలు తెలుసునో, ఎవరెవరు ఏయే తరహా డాన్సులు చెయ్యగలరో, లోగడ వున్న అనుభవమేమిటో కూడా పిళ్ళే తడుముకోకుండా చెప్పగలిగేవాడు.

ఈ వ్యాపారంవల్ల పిళ్ళేసాధించిన విజయాలూ చాలా ఉన్నాయి. అనేకమంది కులీన వ్యక్తులతో అతనికి సన్నిహిత సంబంధాలేర్పడ్డాయి. చిత్రరంగంలోని చెప్పుకోదగిన వ్యక్తులెందరో అతనికి బాగా చేరువయ్యారు. ఎడాపెడా డబ్బు పోగుచేసుకోవడమే కాదు-పరిశ్రమ మీద గట్టి పలుకుబడిని కూడా సంపాదించాడు.

ఈ సంగతులన్నీ మంజరికి తెలిశాక ఆవిడ ఆశ్చర్యపోలేదు. పిళ్ళేను మనస్ఫూర్తిగా అభినందించింది.

''అలాంటి మనుషులంటే నాకు చాలా ఇష్టంకళ్యాణీ! చట్టులో మొలిచి, చట్టును బద్దలుకొట్టుకొని మహావృక్షంగా రూపొందడమంటే ఏమిటో నాకు తెలుసు. మనం తప్పకుండా అతన్ని కలుసుకొందాం''అన్నది మంజరి.

''మనమని నన్ను కూడా కలపకు. నువ్వొక్కదానివే వెళ్ళాలి''అన్నది కళ్యాణి.

''అలా కుదరదు. నువ్వు రావాలిసిందే!''అన్నది మంజరి.

ఆ విషయమై మంజరి అట్టే తరచలేదు. కళ్యాణి చెప్పిన ఆధారాల సాయంతో, ఆవిడొక రకమైన బొమ్మను ఊహించింది. తీరా శంకరంపిళ్ళేను కలుసుకొన్న తరువాత, ఆవిడ బొమ్మ పూర్తిగా చెదిరిపోయింది. అతని ఆఫీసు-పిళ్ళే పిక్చరు ప్రైవేట్ లిమిటెడ్-దేవేంద్ర లోకంగా వున్నది. శంకరం పిళ్ళే ఆవిణ్ణి చూస్తూనే విశాలంగా నవ్వాడు. సాదరంగా ఆహ్వానించాడు. ఎవరూ చెప్పకుండానే ఓట్రేలో రెండు కాఫీలు పట్టుకొచ్చి వెళ్లిపోయాడు. ఓ గుక్కతాగి సిగరెట్ అంటించి మంజరిక్కూడా ఓ సిగరెట్ ఆఫర్ చేశాడు పిళ్ళె.

''నో, థాంక్స్''అన్నది మంజరి. ''మీరు తాగరా? అదేమిటి కళ్యాణి నాతో అబద్ధం చెప్పదే?''అన్నాడు పిళ్ళే చాపిన చేతిని అలాగేఉంచి.

''తాగనని కాదు-ఇప్పుడెందుకా అని కాని-''

''ఇవ్వాళ నీకు షూటింగేమీ లేదుగదూ? మరేం లేదు-మీతో కొంచెం వివరంగా మాట్లాడుకొందామనుకొన్నాను''అన్నాడు పిళ్ళె.

''లే''దన్నది మంజరి.

ఆవిడ ఆఖరిగుక్క పీల్చేసి, కప్పును సాసర్‌లో వుంచేసింది. మెల్లగా సిగరెట్‌ను పెదాల మధ్య చేర్చింది. పిళ్ళె లైటర్‌తో, ఆవిడ సిగరెట్‌నూ అంటించాడు.

''రండి. మనం లోపలికి వెడదాం''అన్నాడు పిళ్ళె.

ఓ పెద్ద హాలు దాటాక-ఇంకో అందమయిన చిన్న గదిలోకి వచ్చారిద్దరూ. ఆ గదిలో ఓ మూలగా స్ప్రింగ్ మాట్రెస్ వుంది. ఇంకో పక్క సిల్కుదిళ్ల కుర్చీలున్నాయి. పిళ్ళె పక్కమీద కూచున్నాడు. మంజరి అతనికెదురుగా కుర్చీలో కూచున్నది.

''మీరు డబ్బుకోసం ఇబ్బంది పడుతున్నారని తెలిసింది. మీకేమన్నా కావలిస్తే నా దగ్గర తీసుకోవచ్చు. అలా నా దగ్గర వాడుకొంటున్నవాళ్లు చాలామంది వున్నారు. వారందరి పేర్లూ బహిరంగపరచడం నాకిష్టం లేదు. వృత్తిరీత్యా అది ధర్మం కూడా కాదు''అన్నాడు పిళ్ళె.

''కళ్యాణి చెప్పిందా?''అన్నది మంజరి.

పిళ్ళె నవ్వాడు.

''నేనన్నది అబద్ధమయితే అబద్ధమని చెప్పండి. అంతేగానీ వివరాలడక్కూడదు. పేర్లు బయటపెట్టడం నాకిష్టంలేదనీ నేనింతకు ముందే చెప్పాను. అలాగే-యింకో షరతు కూడా మీరు పాటించాలి...అదే చెబుతాను. ఇక్కడి సంగతులేవీ ఇంకోరితో అనకూడదు. వారు మీకెంత ఆప్తులైనా సరే! ఇక్కడికి మీ రాకపోకలన్నీ చాలా గోప్యంగా ఉండాలి. అందుక్కావలసిన ఏర్పాటన్నీ నేను చూసుకొంటాను. మీరేం వింటున్నట్లు లేదు''అన్నాడు పిళ్ళే మంజరి పరధ్యానాన్ని గమనించి.

''నేనా అదేం? వినకపోవడం కాదుగానీ, నాకిప్పుడో పదివేలు కావాలి, ఇస్తారా?''

"వెళ్ళేప్పుడు తీసుకెళ్లండి. ఆమొత్తం చాలకపోతే నాకు కబురుపెట్టండి. ఎంతకావాలో పంపిస్తాను"అన్నాడు పిళ్ళై.

మంజరి ఆఖరి గుక్క పీల్చి సిగరెట్‌ను యాష్‌ట్రేలో పడేసింది.

"సేఠ్ కిషన్‌దాస్ చందూలాల్ పేరు మీరు వినే వుంటారు. అతనికి బొంబాయిలోనూ, అహమ్మదాబాదులోనూ అయిదారు గుడ్డలమిల్లులున్నాయి. పెద్ద బాంకరు. ఫారెన్‌తో వ్యాపారం చేస్తూ వుంటాడు. అతను నా ఖాతాదారు. నిన్ననే బాంబే నుండి వచ్చాడు. రాత్రి నీ సినిమా చూశాడు. ఇంకో అరగంటలోపుగా ఇక్కడికి వస్తున్నాడు. అతని రూపాయి విలువ దమ్మిడీకన్నా తక్కువుగా ఉంటుం"అన్నాడు పిళ్ళై.

"పేరు విన్నాను. బొమ్మను కూడా చూశానేమో జ్ఞాపకం లేదు"అన్నది మంజరి.

"అతనేవో చిక్కువల్ల రెండేళ్ల నుండీ నా ఎకౌంట్ సెటిల్ చెయ్యలేదు. అయినా నేడగను. కిందటిసారొచ్చినప్పుడు మొత్తం పే చేశాడు. నేను మాత్రం పార్టీలను ఆపింది లేదు. ఎప్పటికప్పుడు నిక్కచ్చిగా యిచ్చేస్తూ వుంటాను. కొందరు వోవర్ డ్రా కూడా చేశారు. మళ్లా ఎప్పుడోవచ్చి చెల్లుగట్టిపోతూ ఉంటారు. నా షరతులు అంగీకరించినంతకాలం, ఆ పద్దులానే నడుస్తూనే వుంటాయి. నిర్ణయించుకొన్నా మొత్తం కన్నా అదనంగా వచ్చిన డబ్బుతో నాకు నిమిత్తం లేదు. అయితే, నా పార్టీలకు కష్టం కలిగేలాగా కానీ, నాఖాతాదారులు నొచ్చుకునేలాగానీ ప్రవర్తించకూడదు. వారేది కోరితే దాన్ని నెరవేర్చాలి. అందుకు మీకిష్టమయితే-కావాలనుకున్నప్పుడు కావలసినంత మొత్తం నా నుండి తీసుకోవచ్చు. అదీగాక-" ఫోన్ మోగింది.

"వన్ మినిట్"అంటూ పిళ్ళై ఓ క్షణం విని, "ఉండమను, వస్తున్నాను"అని రిసీవర్ పెట్టేశాడు.

"నేనిప్పుడే వస్తాను. ఎవరో నాకోసం వచ్చారు".

పిళ్ళై వెళ్లిపోయాడు. ఆ గదిలో, ఆ గాఢ నిశ్శబ్దంలో ఉండడానికి మంజరికి భయంవేసింది. ఎవరో అదృశ్యరూపంలో వచ్చి, తన నరనరాన్నీ చిదిమివేస్తున్నట్లుగా అనిపించింది మంజరికి, చిత్రమేమిటంటే, తన అభిప్రాయమేమిటో తెలుసుకోకుండానే పిళ్ళై తనను ముగ్గులోకి లాక్కొచ్చాడు. ఇప్పుడు తను కాదనడానికి కూడా వీల్లేకుండా చేశాడు.

"ఎక్స్‌క్యూజ్‌మీ"అంటూ పిళ్ళై వచ్చాడు. "మీలాంటి వారికే డబ్బు అర్జంటుగా కావలసి వచ్చింది. పదిహేను వేలిచ్చి పంపించాను. ఇదివరకే ఏమాత్రమో రావాలి. అదీ ఇదీ కలిసి సర్దేస్తానన్నారు. చూదాం-టైమయింది. చందూలాల్ వచ్చాడు. మనమిక్కడే కలుసుకొందాం"అంటూ బటన్ నొక్కాడు.

మరో నిమిసానికల్లా పొడుగ్గా, సన్నగా ఖరీదైన సూట్‌లో వున్నఓ వ్యక్తి లోపలికొచ్చాడు.

"మిస్టర్ చందూలాల్"అని పరిచయ చేశాడు పిళ్ళై.

మంజరి విశాల నేత్రాలు మరింతగా విప్పారాయి. ఆవిడ యింతకు ముందుదాకా ఊహిస్తున్న మనిషికి-పెద్దబొర్ర, బొడ్డుకిందకి పంచె, ఒదులు లాల్చీ, చెమ్కీటోపీ, బంగారం పళ్లుమొనతేలిన చెప్పులు ఉన్నాయి. ఈ చందూలాల్ దొరబాబులాగా ఉన్నాడు. దొరల్లాగే మంచినీళ్ల ప్రాయంగా ఇంగ్లీషు మాట్లాడేస్తున్నాడు. చాలా కొద్దిమాటలు తప్ప మిగతావన్నీ మంజరికి అర్ధమయ్యాయి.

పదినిమిషాలయ్యాక-

"నేను పోతున్నాను"అన్నాడు పిళ్ళై.

మంజరి చెప్పేది వినకుండానే అతను తలుపులు తీసుకొని వెళ్లిపోయాడు. ఓ క్షణం అలానే

నిలబడిపోయింది మంజరి. చల్లగా వొణుకుతున్న వేళ్లు ఆవిడ మెడపక్కగా పాకాయి. వినీవినకుండా నిట్టూర్చి పక్కకు తిరిగింది. చందూలాల్ తోడేళ్లాగా పళ్లు బయటపెట్టి నవ్వుతున్నాడు. ఆ నవ్వు కూడా తోడేలు గురకలాగా వుంది. అతని ముఖమంతా రక్తంచిమ్మి ఎర్రబడిపోయింది. కళ్లు నిప్పు కణికల్లా మెరిసిపోతున్నాయి. అతని వేళ్లు క్రమక్రమంగా మెడచుట్టూ బిగుసుకొంటున్నాయి. కళ్లముందు పచ్చని రంగులు పారుకాడుతున్నాయి. ఊపిరి తిరగడం లేదు. ఉక్కిరిబిక్కిరయిపోతూ వుంది. బలవంతాన అతని చేతుల్ని వెనక్కు తోసింది. చందూలాల్ కళ్ళు మరింత క్రూరంగా మెరుస్తున్నాయి.

''అమ్మా!''అంటూ అరచి కళ్లు మూసుకొంది మంజరి.

చందూలాల్ పకపకలాడుతూ చేతులు వదిలేశాడు. ఆవిడ తేరుకునేసరికి అతనో సోఫాలో కూచుని వున్నాడు. ఇంతకు ముందు తను చూసిన తోడేలు లక్షణాలేమీ లేవు. చాలా మామూలుగా, కులాసాగా నవ్వుతున్నాడు.

అతనో గ్లాసును కొద్దిగా తాగి చూసి మంజరికిచ్చాడు. ఆవిడ దాన్ని ఖాళీచేసింది. ఆ తరువాత చందూలాల్ కోరిన కోరిక ఆవిడకు చాలా విడ్డూరంగా తోచింది.

అతగాడు మంజరిని జుట్టువిరబోసుకోమన్నాడు. అందమైన జాకెట్‌ను పీలికలు పీలికలు చేసుకోమన్నాడు. చీరకూడా చింపుకోమన్నాడు. పిచ్చికేకలు వేస్తూ, గదంతా తిరగమన్నాడు. తనకు చప్పున దొరకవద్దనీ, ఒకవేళ దొరికినా కొట్టి, రక్కి తప్పించుకోమనీ అడిగాడు. అలాగ తను ఆపమన్న దాకా చేయమన్నాడు.

''నెవర్''అన్నది మంజరి కొంచెం కోపంగానే.

''యు షుడ్ డు యిట్!''అన్నాడు చందూలాల్.

అతను రెండు చేతులూ పైకెత్తి, ఓ అడుగు ముందుకు వేశాడు. అతని ముఖంలోకి. తిరిగి తోడేలు లక్షణాలొస్తున్నాయి. పళ్ళికిలికిలిస్తూ గిట్టకరుచుకొంటున్నాడు. ఉన్న బలమంతా చేతుల్లోకి పుంజుకొంటున్నట్లుగా మూలుగుతున్నాడు.

మరొక్కసారి తను ''కా''దంటే చావు తప్పదనుకొంది మంజరి. ప్రాణాలకోసమైనా పారిపోదామనుకొంది. కానీ ఎక్కడికి పోతుంది! బలమైన గోడలు ఆవిడను నిస్సహాయను చేశాయి. వెనక నుండి చందూలాల్ వేటకుక్కలా తరుముకొస్తున్నాడు. అతనికి అందకుండా మంజరి తప్పుకొంటున్నది. ఆవిడ బుద్ధిపూర్వకంగా చెయ్యని పనిని చందూలాల్ బలవంతాన చేశాడు. ఆవిడ జుట్టు ఊడి, భుజాల నిండా కప్పింది. జాకెట్ పీలికలు పీలకలయింది. ఒక దశలో మంజరి ఎదురు తిరిగి, అతని చేతిని వోపిక కొద్దీ మెలితిప్పింది. ఎదుర్రొమ్మున కొట్టి, సోఫాలోకి కూలదోసింది. చందూలాల్ కళ్లు మూసుకొన్నాడు. ఆయాసం తగ్గాక పకాపకా నవ్వుతూ, ''వెరీగుడ్, వెరీగుడ్, ఐయామ్ వెరీ హాపీ నౌ''అన్నాడు.

ఆ మాటలంటున్నప్పుడు, మళ్లా వెనకటి ''దొరబాబు'' వంటి చందూలాలే అయిపోయాడతను.

ఉదయం పోయేటప్పుడు-

''నువ్వెప్పుడన్నా బొంబాయి రారాదా?''అన్నాడు చందూలాల్.

''రాను'' అన్నది మంజరి ముక్తసరిగా.

''అయితే నేనే నీకోసం మద్రాసొస్తాను''అంటూ అతను వెళ్లిపోయాడు.

''మీరిప్పుడే పదివేలూ పట్టుకెడతారా?'' అన్నాడు పిళ్ళే, డ్రాయరు సొరుగులాగుతూ.

''పదివేలా? నాకు పది దమ్మిడీలు కూడా వొద్దు'' అంటూ మంజరి కార్లో కూచున్నది.

డ్రైవరు మంజరిని ఎగాదిగా చూసి, ఏదో అనబోయి, గుటకతో పాటుగా ఆ మాటనూ మింగేసి, ఇగ్నీషిన్ కీ తిప్పాడు.

మంజరి అనుకొన్నదేమీ జరగలేదు. ఆవిడ ఇంట్లో లేప్పుడు, పిళ్ళే వచ్చి వంద, వందరూపాయల నోట్లను రాజమణికిచ్చిపోయాడు. ఆ డబ్బు పుచ్చుకొన్నందుగ్గాను రాజమణి పీకను మంజరి నులిమేసి ఉన్నా ఆశ్చర్యం లేదు. కానీ మంజరి అలాంటి పాడుపనేమీ చెయ్యలేదు. సరిగదా, డబ్బును తీసుకొంటూ ''ఇంకేమన్నా అన్నాడా?'' అని కూడా అడిగింది.

జరిగిందేమిటంటే-పిళ్ళేతో అంత మొండిగా మాట్లాడినందుకు, ఆ తరువాత మంజరి చాలా విచారించింది. ఒక దశలో, అతన్ని మన్నించమని అడుగుదామని కూడా అనుకొన్నది. ఆ అవసరం లేకుండానే, పిళ్ళే రాజీకి వచ్చాడు. ఒకసారి ఆవిణ్ణి పట్టుకెళ్ళి, రకరకాల భంగిమల్లో, రకరకాల దుస్తుల్లో ఫొటోలు తీయించాడు పిళ్ళే.

''అందరి మనస్తత్వమూ వొక్కలాగా ఉండదు. ఎవరికెలా నచ్చితే అలా!'' అన్నాడతను.

ఈ సూత్రంతో మంజరి పూర్తిగా ఏకీభవించింది.

''ఇంకోసారి వీడిగుమ్మం తొక్కను''అని మంజరి ప్రతిజ్ఞ చేసిందో లేదో తెలీదుగానీ,చేసే వుంటే- ఆమాటను ఆవిడ నిలబెట్టుకోదనడం మాత్రం ఖాయం.

ఎందుకంటే, ఆ తరువాత చాలాసార్లు మంజరి పిళ్ళే పిక్చర్స్ ప్రైవేట్ లిమిటెడ్ ఆఫీసుకు వెళ్లింది. వరసగ్గా కొన్ని రాత్రులకు రాత్రులు అక్కడే ఉండిపోయిన సందర్భాలు కూడా ఉన్నాయి. ఇందువల్ల మంజరి బీరువాలు బంగారంతో నిండిపోవడమే కాదు, ఆవిడకు చాలామంది గొప్పవారు కూడా పరిచయమయ్యారు. ఆపరిచయాల వల్ల మంజరి కనీవినీ ఎరుగని అద్భుతాలనెన్నింటినో సాధించింది. కొందరిచేత ఫిలిం కంపెనీలకు అప్పులు పెట్టించింది. ఇంకొందరిచేత స్వయంగా సినిమాలు తీయించి, అందులో తను వేషాలేసింది. ఆ సినిమాలు నాలుగు రాళ్ళు తెచ్చాయో లేదో మంజరి కనవసరం, తనకు రావలసింది చుప్తాగా వచ్చిందా లేదా అన్నదే ముఖ్యం.

ఒకసారి పిళ్ళే ఒక మంచి ''ఆఫర్''తీసుకొచ్చాడు.

అదేదో నది మీద వంతెన కట్టడానికి నిశ్చయించారు. నాలుగైదు కంపెనీలు తమ కొటేషన్లు పంపించాయి. ఈ కంపెనీలన్నీ మంచివే. లోగడ ఇటువంటి పనులు చాలా చేసినవే. వీటిమధ్య పోటీ పెరిగింది. ఒక కంపెనీవారు పిళ్ళేను సంప్రదించారు. అతగాడు మంజరికోసం వచ్చాడు.

''ఇందులో నేను చెయ్యగలిగిందేమీ కనిపించడం లేదు''అన్నది మంజరి.

''అలాగే!'' అన్నారు పిళ్ళే.

మంజరి ఓ గుక్క పుచ్చుకొని, సిగరెట్ అంటించి, చిటికవేసి మసిరాల్చేసింది.

''మరేంలేదు, ఎల్లుండి మనమో కొత్తసినిమాను తీస్తున్నాం. దానికాయన ప్రారంభోత్సవం చేస్తున్నాడు. ఆ సందర్భంలో ఓ పార్టీ జరుగుతుంది. ఆయన చీఫ్‌గెస్టు''

''వెరీగుడ్, గో ఎ హెడ్''అన్నాడు పిళ్ళే.

అన్నీ సక్రమంగానే జరిగాయి. టీపార్టీ అయ్యాక, ఆ పెద్దమనిషిని తన కారుమీద ఇంటికి తీసుకొచ్చింది మంజరి.

''మీకు చాలా శ్రమను కలిగించాను. నన్ను మన్నించాలి....ఈ పూట మీరు నా గెస్టు''అన్నది మంజరి.

ఉదయమే పిళ్ళేకు రింగ్‌చేసి ''సక్సెస్'' అని బద్ధకంగా ఫోను పెట్టేసి, తిరిగి కళ్లు మూసుకొని

పడుకొంది మంజరి.

❦❦❦❦❦❦❦❦

రమారమిగా నెలరోజుల నుండీ మంజరి వర్క్ చేస్తున్న సినిమా కంపెనీలన్నీ ఈగలు తోలుకుంటున్నాయి. అనుకోని విధంగా ఆవిడ ఆరోగ్యం దెబ్బతిన్నది. ఆపరేషన్ జరగలేదన్న మాటేగానీ అంతకు మించిన హడావుడి చాలా అయింది. దాదాపు అన్ని సినిమా పత్రికలూ ఆవిడ సుస్తీని గురించి పతాక శీర్షికలలతో ప్రకటించాయి. ఆవిడ సుస్తీ నుండి త్వరగా కోలుకోవాలని అశేష జనం ఆశించారు. కొందరు మంజరికే స్వయంగా రాశారు కూడాను. అన్ని భాషల్లోనూ కలిపి, ఇప్పుడామె యాక్ట్ చేస్తున్న పిక్చర్లు ఇరవై రెండు దాకా వున్నాయి. ఒకటి రెండు సెట్లమీద పనివున్న పిక్చర్లే పన్నెండు దాకా ఉన్నాయి. దురదృష్టవశాత్తు, ఆవిడ అటో ఇటో అయితే, ఈ నెగటివ్‌లకు అగ్గిపుల్లయినా అంటించాలి. లేదా చచ్చినట్లు కథ మార్చుకొని, ఏదో విధంగా పూర్తయినా చెయ్యాలి. డాక్టర్‌గారు "ఏమీ ఫర్వాలే"దని హామీయిస్తాడేగానీ, అసలు జబ్బేమిటో మాత్రం చెప్పడు. ఆవిణ్ను ఎవ్వరూ చూడకూడదనీ, అతిగా మాట్లాడించకూడదనీ, పూర్తిగా విశ్రాంతి నివ్వాలనీ డాక్టర్ ప్రకటించాడు. ఒక్క రాజన్‌కు, కళ్యాణికి మాత్రం ఈ నిషేధం వర్తించదు.

"నీ ఆరోగ్యాన్ని గురించి, గంపలకొద్దీ ఉత్తరాలొస్తున్నాయే మంజూ!"అన్నది కళ్యాణి వొకసారి.

"రాసి పోసి అగ్గిపుల్ల అంటించు"అన్నది మంజరి విసుగ్గా.

"అలా కోపగించుకోకు మరి; నువ్వు అగ్గిపుల్ల అంటించినా, అంటించకపోయినా, వారికేదన్నా జవాబు రాయాలి గదా!"అన్నది కళ్యాణి.

"ఎన్నేళ్ళుపడుతుందో అక్కాయ్!...ఈ జనానిక్కూడా మతులుండవనుకొంటాను. లేకపోతే ఏమిటీ వేలాం వెర్రి?"

"హవ్వ" అని నోరు నొక్కేసుకొన్నది కళ్యాణి. "కర్మకాలి ఎక్కడన్నా అలా అనేవు. మంజూ! కొంప కూలిందన్నమాటే! మనసులో యేమనుకున్నా, పైకి ఎంతో వినయంగా చెప్పాలి. విడివిడిగా జవాబు లివ్వమని నేనూ అనను. అందరికీ కలిపి ఓ ప్రకటన పారేయ్! "కులాసాగా ఉన్నాననీ, త్వరలోనే షూటింగుల్లో పాల్గొంటాననీ, తిరిగి సినిమా నటన ద్వారా ప్రేక్షక జనాన్ని సేవించే మహదావకాశం భగవంతుడు నాకు ప్రసాదించాడనీ"-ఈ ధోరణిలో ఇస్తేసరిపోతుంది"అని సలహా ఇచ్చింది కళ్యాణి.

"పోనీ అలానే తగలెయ్!"అన్నది మంజరి చిరుకోపంగా

కళ్యాణి పలకలేదు.

మంజరి పక్కకు తిరుగుతుంటే-కనురెప్పలు తడిసినట్లు కళ్యాణికి అనుమానమేసింది.

"ఎందుకమ్మడూ ఆ బెంగ?"అన్నది కళ్యాణి, మంజరి రెండు చెక్కిళ్ళను అరచేతులతో తడుముతూ.

మంజరి జవాబు చెప్పలేదు. కింది పెదవిని బిగబట్టి ఉద్వేగాన్ని అణుచుకొన్నది.

"రాజన్ ఏమన్నా అన్నాడా?"

"లేదు. ఆయనకు తండ్రిని కావాలన్న ఉబలాటం బాగా ఉండేదనుకొంటానక్కాయ్! నన్ను చూస్తూనే బిక్క చచ్చిపోయాడు. సినిమాల్లో దిక్కుమాలిన గెంతులన్నీ గెంతి ఇలా అయ్యానని కోప్పడ్డాడు. అసలు సంగతి అతని కింతవరకూ తెలీదు".

"ఇక ముందు కూడా తెలియకూడదు. తెలియవలసిన అవసరం కూడా లేదు"అన్నది కళ్యాణి.

"అవును. ఆ మాటకొస్తే ఏముంది మరి?" అన్నది మంజరి, ఏదో ఆలోచిస్తూ.

నెలరోజులన్నది, నెలా పదిహేనురోజులకు గానీ, మంజరి పూర్తిగా కోలుకోలేదు. ఈలోగా ఆవిడ శరీరంలో వచ్చిన మార్పులు నిర్మాతల గుండెల్లో రైళ్ళను పరుగెత్తించాయి. అంతకు ముందు రవంత బొద్దుగా, బంతిలాగా ఉండే మంజరి, ఇప్పుడు సన్నబడిపోయింది. పెళ్ళిపీటలమీద బంతిపువ్వులా ఉన్న హీరోయిన్, గర్భాదానం గదిలో సన్నజాజి మొగ్గలా ఉంటే ఎలా? కంటిన్యుటి దెబ్బతింటే ఇంకేమైనా ఉన్నదా మరి? మంజరి కాస్తంత వళ్లుచేయడం కోసం, ఇంకో అయిదారు వారాల దాకా నిర్మాతలు ఆగవలసి వచ్చింది. ఈలోగా ఆవిణ్ణి టానిక్కులు పుచ్చుకోమనీ, పండ్లరసం తాగమనీ నిర్మాతలు సలహాపూర్వకమైన వత్తిడిచేశారు. వాటన్నింటిని చిరునవ్వుతో భరించడం వొక్కోసారి మంజరికి సాధ్యం కాకపోయేది.

"కనీసం-ఇష్టమైన తిండి తినడానిక్కూడా నోచుకోకపోతే, ఎందుకీ జన్మ? ఇదివరకేమో, లావు తగ్గాలని పథ్యమ్మెత్తుకులు తిన్నాను. ఇప్పుడు సన్నబడితే, కండపట్టాలని టానిక్కులు తాగుతున్నాను. ఎంత బానిస బతుకో?"అని మంజరి చాలాసార్లు విసుక్కొనేది.

కానీ తప్పేదేముంది కనకా?

నిజంగానే మంజరికి సుఖమనేది లేకుండా పోయింది. ఒక్కోరోజున 20 గంటలపాటు స్టూడియోల్లో, ఆ దయ్యపు లైట్లముందు నిలబడి, అన్నమాటే పాతికసార్లని, చూసిన చూపే వందసార్లు చూసి, ప్రాణం విసుగెత్తి ఇంటికి రాగానే, ఏదో కంపెనీవాళ్ళు బిక్కముఖాలతో వాకిట్లో ఎదురయ్యేవారు. హీరో జపాను వెడుతున్నాడనీ, ఇంకో నెలదాకా రాడనీ, ఈ వొక్క కాల్‌షీటు పూర్తయితే పిక్చరు సెన్సారుకు పంపించుకొంటామనీ గోలెత్తుతారు. వాళ్లను కాదనడానికి నోరురాదు. పనిచేసే ఓపికా ఉండదు. ఏదో విధంగా తట్టతగలేస్తే, పావలా యిచ్చి చూసేవాడు "ధూత్! ముండ, ఇక్కడ తగలేసిందిరా!"అంటాడు. పత్రికలు అంటబొడిచి విడిచిపెడతాయి.

బాగా చెయ్యాలనీ, మంచిపేరు తెచ్చుకోవాలనీ తనకూ ఉంటుంది. కానీ కొన్ని సినిమాల్లో-బాగా సంగతి దేవుడెరుగు-అసలు చెయ్యడానికే స్కోప్ వుండదు. అలాంటి వేషాలు ఒప్పుకోకుండా ఉండేందుకూ వీల్లేదు. అడిగినంత డబ్బూ కాళ్ల ముందు పడేస్తుంటే-కాదనడమెలా? పోనీ కాదన్నా ఊరుకొంటారా? ఏ హీరోచేతో, డిస్ట్రిబ్యూటరుచేతో, ఇంకా దగ్గరవాళ్లచేతో చెప్పిస్తారు. బాగా చెయ్యడానికి స్కోప్ వున్న పిక్చర్లుంటాయి. అప్పుడు పరధ్యానముండదు; ఇంకెక్కడో పనిచేసి పనిచేసి సొక్కిపోయి వున్నప్పుడు "లవ్‌సీన్"లో జాలీగా ఉండమంటారు. వుండవలసిందే! ఉండకపోతే జనం మళ్ళా దుమ్మెత్తిపోస్తారు.

తను కారణం కాని తప్పులెన్నింటికో ఈ రకమైన శిక్షలు అనుభవించవలసి వచ్చినందుకు మంజరి ఒక్కోసారి మనస్ఫూర్తిగా ఖేదించేది. ఏదో ఓ కంపెనీవారు మార్నింగ్ కాల్‌షీటు అడుగుతారు. అదేరోజు ఇంకొకరు మధ్యాహ్నం నుండీ కాల్‌షీట్ కావాలంటారు. ఈ ఉదయం కంపెనీవారు అనుకొన్నదానికన్నా మూడు గంటలు ఆలస్యం చేస్తే, ఆ రెండో కంపెనీవారు ఫలానా ఆర్టిస్టు టైముకు రాదని ప్రచారం చేస్తారు. వీళ్లను మధ్యలో వదలడానికి లేదు; అవతలివాళ్లను డిసప్పాయింట్ చెయ్యడానికి లేదు. నిన్న జరిగిందిదే! తను చచ్చీచెడీ రాత్రి పదిగంటలకు కొంపకొచ్చింది. ఎనిమిదింటి నుండి ఇంకో కంపెనీవారు కాచుకు్కూచున్నారు. వాళ్ళ కథ వినిపించి "యస్"అనిపించుకోవడానికొచ్చారు. తనే వారినీపూట రమ్మన్నది. పైగా మెహతా దీనికి డిస్ట్రిబ్యూటరు. కాదనడం ఎలా? కథ విని, తనకు తోచిన సలహాలు చెప్పింది. ఫలానా వేషమయితే వేస్తానన్నది.

ఆరెండో వేషాన్ని భారతికి ఇస్తామన్నారు వారు. దానికి తను ఒప్పుకోలేదు. ఏ రంగుపూసి కెమెరా ముందు నించోబెట్టినా భారతి రాణిస్తుంది. దానిముందు తను వెలతెలా పోవలసిన ఖర్మమేం వచ్చింది? భారతి సరసనవుంటే, జనం దాన్ని చూస్తారు గాని, తనను చూడరే! చేతులారా, ఈ తద్దినాన్ని నెత్తిమీదికి తెచ్చుకోవడం దేనికిట? అందుకని ఉదయం మళ్ళా మెహతాకు ఫోన్‌చేసి, భారతిని తొలగించవలసి వచ్చింది. ఈలోగా పిళ్ళే డజనుసార్లయినా ఫోన్ చేశాడు. తను వీలుపడదంటే ఒప్పుకోడు. బాంబే నుండి ఎవడో ఫిలిం ఫైనాన్సర్ వచ్చాడనీ రమ్మనమనీ గోల. తను పన్నెండింటికి పిళ్ళే పిక్చర్సు ప్రైవేటు లిమిటెడ్‌కు వెళ్ళింది. వాడో ఆబవెధవ. అయిదింటికి అటునుండి అటే మేకప్ సోము దగ్గరకెళ్ళి, ఆరున్నరకెల్లా స్టూడియోకు హాజరయింది. ఆ పోక ఇప్పటిగ్గానీ తను ఇంటికి రాలేకపోయింది. మధ్యాహ్నం స్టూడియోలోనే శర్మ కలుసుకొని, ఇవ్వాళ రాత్రి వస్తాననీ ముఖ్యమైన సంగతేదో మాట్లాడాలనీ అన్నాడు. భగవంతుడు దయతలిస్తే, ఈరోజుకు ఆఖరు విజిటర్ శర్మాజీ అవుతాడు.

మంజరి గడియారంకేసి చూసింది. 9కావడానికింకా పదినిమిషాల టైముంది. పోనీ ఈ పూటకు శర్మాజీని చూడటం మానేదామా అనుకొన్నది. కానీ ఏదో ముఖ్యమైన విషయమున్నదన్నాడు. అదేమిటంటే వచ్చి చెబుతానన్నాడు. తొమ్మిదింటి కొస్తానన్న శర్మాజీ పావుతక్కువ పదిగంటలగ్గానీ రాలేదు.

“క్షమించాలండీ! బస్సు అందలేదు...”అన్నాడు శర్మ.

“నీ బొంద”అని లోపలనుకొన్నా “పర్వాలేదు శర్మాజీ, ఇంతలోకే మునిగిపోయిందేమిటిట? ఇలాంటిదేదో జరిగివుంటుందని నేనూ అనుకొన్నాను”అన్నది మంజరి చిన్నగా నవ్వుతూ.

చేతిలో వున్న ఫైలును బల్లమీద పెట్టాడు శర్మ.

“ఇన్నిటికీ మీరు భోజనం చేశారో లేదో ముందు చెప్పండి”అన్నది మంజరి.

శర్మ అదేమీ చెప్పకుండా, “మీకు తెలియకుండా నేనోపనిచేశాను. రేపు రుజువుకొస్తే, అది మీరే చేసినట్లు ఒప్పుకోవాలిసొస్తుంది”అన్నాడు.

“అలాగే శర్మాజీ!”అన్నది మంజరి తాపీగా.

“మీరలా అంటారని నాకు తెలుసు. ఆ ధైర్యంతోనే నేనాపనిచేశాను”.

మంజరి ఫక్కున నవ్వింది.

“ఆ పనిచేశాను, ఆ పనిచేశాను అంటారేగానీ, ఆ చేసిందేమిటో చెప్పరేమండి బాబూ! కొంపదీసి మా వసంతను గానీ లవ్‌చెయ్యలేదు గదా?”అన్నది మంజరి పకపకలాడుతూ.

శర్మకూడా నవ్వాడు.

“లాస్టుమంత్ రిలీజయిన పిక్చర్ వున్నది చూడండి-ఏదీ-”అన్నాడు శర్మ.

“ఏదీ?”అన్నది మంజరి కూడా ప్రశ్నార్థకంగా.

“మీరు డ్యూయల్ రోల్ వేశారే-”

“ఐసీ. అవును. ప్రవాళా ఫిలిమ్సు వారిది. ఏం బావోలేదంటారా;”అన్నది మంజరి కళ్ళు చిట్లించి.

“కాదు మేడమ్! ఆపిక్చర్‌లోని రోల్ గురించి రేపు పత్రికల్లో ఒక ప్రకటన వస్తుంది”అన్నాడు శర్మ ఫైలు విప్పుతూ. “ఇదిగో చదువుతాను వినండి”- “ఆంధ్ర ప్రేక్షకలోకానికి నా హృదయపూర్వకమైన నమస్కృతులర్పిస్తున్నాను. ప్రవాళా ఫిలిమ్సు వారి సాంఘిక చిత్రం “తరుణీమణి”లోని ద్విపాత్రాభినయాన్ని అభినందిస్తూ మీరు వ్రాసిన లేఖలన్నింటినీ నేను ఆప్యాయంగా స్వీకరించాను.

మీలో కొందరు,నన్నూ నా నటనా కౌశల్యాన్నీ నా ప్రతిభనూ పదేపదే మెచ్చుకుంటూ, నన్ను చూడాలని వున్నదనీ, అందుకు అవకాశం కల్పించవలసిందనీ అడిగారు. నా ప్రియతములైన ప్రేక్షకులను కలుసుకోవడానికీ, వారితో ఇష్టాగోష్ఠి జరపడానికీ నేనెప్పుడూ సిద్ధమే! మరికొందరు సోదరులు, సోదరీమణులు నా ఆటోగ్రాఫులున్న ఫొటోలు పంపమని వ్రాశారు. అవి తయారవుతున్నాయి. త్వరలోనే పంపుతానని మనవి చేస్తున్నాను. ఆ పాత్రలను అలా రూపొందించిన కవిగారికి, దర్శకునకూ, ఆనటనను ప్రదర్శించడానికి అవకాశమిచ్చిన నిర్మాతలకూ, ఆదరించి ఆశీర్వదిస్తున్న మీకూ నేను సదా కృతజ్ఞురాలిని. మీకందరకూ వ్యక్తిగతంగా సమాధానలివ్వజాలని నా అశక్తతను మన్నించగోరుచున్నాను. ఇక ముందు కూడా నేను తమ ఆదరాభిమానాలకు పాత్రురాలను కాగలనని ఆశిస్తూన్న-

మీ

- మంజరి''

అని గుక్కతిప్పుకొని, ఫైలు మడిచేసి, ''ఇదీ ప్రకటన. రేపు ఉదయం అన్ని పత్రికల్లోనూ వచ్చేస్తుంది''అన్నాడు శర్మ.

మంజరి కళ్లు మూసుకొనే ''ఊఁ''అన్నది.

మీతో చెప్పి చేసే వ్యవధానం కూడా లేకపోయింది మేడమ్! అవతల ''సరోజ'' కూడా ఇలాంటి ప్రకటనే ఇవ్వబోతున్నట్లు తెలిసింది. బహుశా ఎల్లుండి పత్రికల్లో వేయింతామని ఆవిడ అభిప్రాయమనుకొంటాను. గొరైతోకంత వేషమేసిన సరోజ అంత పబ్లిసిటీ యిచ్చుకొంటుంటే, మన మెందుకూరుకోవాలని నేనీ పనిచేశాను''అని సంజాయిషీ చెప్పుకొన్నాడు శర్మ.

''నిజంగా ఆసినిమాలోని నా వేషం బావుందంటావా శర్మాజీ?'' అన్నది మంజరి.

''అది వేరే విషయం మేడమ్! బాగున్నా లేకున్నా జనానికి నచ్చింది కనుక బాగున్నట్లే లెఖ్క. ఒకవేళ జనానికి నచ్చలేదనుకో, అయినా మనమిలా ప్రకటనలిచ్చుకోవడంలో తప్పేముంది? అన్నాడు శర్మ.

''రేపెవరన్నా-ఉత్తరాలు చూపించమన్నారనుకో.....''

''అనరు. అంత ధైర్యం మనవాళ్లకున్నదన్న నమ్మకం నాకు లేదు. ప్రేక్షకుల్లో ఆపాటి చైతన్యమే ఉంటే, ఈపరిశ్రమ ఇంతకన్నా మంచి పిక్చర్లు తీసి ఉండేది. కనక మీరు నిర్భయంగా ఉండండి. ఏదన్నా వొస్తే నేను చూసుకొంటాను''అన్నాడు శర్మ.

''ఒక్కోసారి నిన్ను చూస్తేంటే అలానే బుగ్గలు చిదిమేయాలనిపిస్తుంటుంది శర్మా. ఇంత పలచని శరీరంలో ఆ ఉత్సాహం, ఆ ధైర్యం ఎక్కడున్నాయనిపిస్తుంది''.

మంజరి వాడిన ఔషధం శర్మ మీద ఆమోఘంగా పనిచేసింది.

''మరో వారం రోజులయ్యాక, ఇంకో బాంబ్‌షెల్ పేలుస్తాను మేడమ్! మొత్తం ఇండస్ట్రీ గగ్గోలెత్తిపోతుందంఏ నమ్ము. వచ్చే సంచికలో చిన్న ''గాలప్ పోల్'' పెడుతున్నాను. ఈ సంవత్సరపు ఉత్తమనటుడు, ఉత్తమన నటి, ఉత్తమ హాస్యనటుడు, ఉత్తమచిత్రం, ఉత్తమ దర్శకుడు, ఉత్తమగాయనీగాయకులు, ఉత్తమసంగీతదర్శకుడు, ఉత్తమ రచయిత-ఇలాగే మిగతావీను, పాఠకులనే నిర్ణయించమంటాను. ఆపై సంచికలో ఫలితాలు ప్రకటిస్తాను. మూడు ఫలితాలు మాత్రం రిజర్వుడు, మిగతావి పాఠకుల నిర్ణయానుసారమే ప్రకటిస్తాను''అన్నాడు శర్మ సంతోషంకొద్దీ చిటికలు వేస్తూ. ''ఉత్తమ నటి మంజరి-రిజర్వుడు; ఉత్తమచిత్రం మీరు తీసింది-రిజర్వుడు; ఉత్తమ గాయని

వసంత-రిజర్వుడు''.

మంజరి ముఖం విప్పారింది. ఆవిడ కల్ళు తళతళా మురిశాయి.

''హారి పిడుగా! మీరెంతకైనా తగిపోతారు శర్మాజీ! మీకున్న ధైర్యంలో నాలుగోవంతు నాకుంటే, ఎంత బావుండిపోను చెప్మా-అనుకొంటానన్నప్పుడపుడూ! అయితే పాఠకులు నింపిన కూపన్లు చూపించమన్నారంటే, మీ గమ్మత్తు ఎగిరిపోతుంది. కాబట్టి జాగ్రత్తగా ఉండండి. అసలీ పనికూడా నాకిష్టంలేదు శర్మాజీ! మీఉత్సాహాన్ని పాడుచేయడం ఇష్టంలేక 'సరే'ననడమేగానీ, పోనీ మానేస్తే నష్టమేమిటి చెప్పండి మనకు?''అన్నది మంజరి, మళ్ళీ శర్మ జారిపోకుండా సున్నితంగా నట్టును బిగిస్తూ.

''ఆ సంగతి కూడా నేను ఆలోచించే ఉంచాను మేడమ్! అయిదువేల కాపీలు ప్రింట్ చేయిస్తున్నాను. రెండు వేలు మాత్రమే మార్కెట్‌లో రిలీజ్ చేస్తాను. మిగిలిన మూడువేలూ మనదగ్గరే ఉంటాయి. ఆ కూపనల్లలో మనక్కావలసిన పేర్లురాసి,ఉంచేసుకుందాం. మఫుజుల్ నుండి, అయిదొందలు మీ పేరు మీద రావా? పోనీ వందన్నా రావా? ఖర్మకాలి ఒక్కటి కూడా రాలేదనుకొందాం మాటవరసకు. అయినా మించిపోయిందేమీ లేదు. మూడువేలమంది పాఠకులు మిమ్మల్నీ, వసంతనూ, మీ చిత్రాన్నీ ఉత్తమంగా నిర్ణయించిన తరువాత, కాదనేపాటి చేవ ఎవరికుంటుంది మేడమ్!''అన్నాడు శర్మ.

''పద్ధతి బాగానే ఉంది శర్మాజీ! కానీ, నా అనుమానమేమిటంటే-''

''అలాంటి వాటి ప్రసక్తి నాదగ్గరతేకండి! మహామహా దేశనాయకులే ఇప్పుడీ దోవ నడుస్తున్నారు. విజయాలను సాధిస్తున్నారు. వారే మనకు ఆదర్శం. ఆ పెద్దలు మెట్టిన మార్గాన్నే మనమూ అనుసరిస్తున్నాం. అందులో ఈషణ్మాత్రం కూడా దొసగులేదని, సవినయంగా మనవి చేస్తున్నాను...బస్, ఇంకేదన్నా వుంటే చెప్పండి''అన్నాడు శర్మ కాళ్లూపుతూ.

మంజరి రవంతసేపు శర్మకేసి చూచి తెక్కట్లాడుతూ నవ్వింది. మధ్యలో, ఏదో చెప్పబోయి కూడా నవ్వువల్ల-చెప్పలేక ఆగిపోయింది. అతిగా నవ్వడం వల్లనేమో ఆమెకళ్ళు నీటితో నిండిపోయాయి. పమిటతో కళ్ళొత్తుకుంటూ-

''ఇంకేదన్నా సంగుతంటే చెప్పమని అడిగావు. బాగానే ఉందిగానీ, తీరా చెప్పాక - 'ఈ పిచ్చిది ఇలా అన్నదేమిటా' అనుకోవు గదా శర్మాజీ?''అన్నది మంజరి.

''మిమ్మల్ని గురించి నేనెలా అనుకునేదీ మీకు తెలియదా?''అన్నాడు శర్మ పొడిపొడిగా.

''మరేం లేదు శర్మా!'' అన్నది మంజరి, ఒక్కక్షణం గాలిపీల్చుకొందుకు ఆగుతూ. ''దురదృష్టవశాత్తూ నువ్వు నాకన్నా చిన్నవాడివైపొయ్యావు గానీ లేకుంటే, ఎగరేసి నిన్ను పెళ్లాడిఉందునయ్యా!''

ఈ మాటలు శర్మమీద ఎంత తీవ్రంగా పనిచేస్తాయో మంజరికి తెలుసు. అన్న తరువాత, ఫలితం కోసం శర్మవేపు చూసింది మంజరి. అతగాడి చెక్కిళ్లు ఆసరికే కెంపురంగులద్దుకొన్నాయి. ముక్కుపుటాలు ఉబికించి కింది పెదవిని, పళ్ళ మధ్య బిగించాడు. కళ్ళనిండుగా మంజరిని ఆపాదమస్తకం చూసి, సన్నగా నిట్టూర్చాడు.

ఇంకొంచెం ఏడిపించి మరీ వదల పెడదామనిపించింది మంజరికి.

లేచి, రెండు చేతులూ చాచి వొళ్లు విరుచుకొన్నది. పలచని నైట్‌గౌను మంజరి అందాన్ని దాచలేకపోతోంది. ఇంకోసారి ఆమె కేసి చూశాడు శర్మ. అతని కళ్ళల్లోని ఎర్రజీరలను మంజరి

గుర్తించింది.

"ఓరి నాచిట్టికన్నా! ఇక నువ్విక్కడ ఉండకూడదు దయచెయ్యి"అనుకొన్నది మంజరి.

ఆవలింతను అభినయించి, నోటి ముందు సన్నగా చిటిక వేసుకొంటూ "చాలా థాంక్స్ శర్మగారూ! మళ్ళీ కలుసుకొందాం"అంటూ, శర్మచేతిని తనచేతిలోకి తీసుకొని మెత్తగా నొక్కి, చూపుడు వేలుతో అతని అరచేతిలో గోకి వదిలేసింది మంజరి.

"ఇంకో రెండురోజులదకా మనిషి-మనిషిగా ఉండడు. పూర్ ఫెలో"అనుకొన్నది మంజరి, మంచంమీద నడుం వాల్చుతూ.

శర్మకు నిద్ర పట్టిందో లేదోగాని, మంజరికి మాత్రం కంటిమీద కునుకురాలేదు. ఓ గ్లాసుడు మందు పుచ్చుకొని, అదీ చాలక రెండు నిద్రమాత్రలు కూడా వేసుకొని కళ్లుమూసుకొన్నది.

బెల్లమున్నచోట ఈగలు ముసురుతాయి. డబ్బున్నచోట మనుషులు ముసురుతారు. ఈ డబ్బు ఎలా వచ్చిందన్న ప్రశ్న ఆ మనుషులకు పట్టదు. డబ్బున్నదా లేదా అన్నదే ముఖ్యం.

మొదటి నుండి పూలపాన్పుల మీద పెరిగినవారికి ఈసత్యం తెలీదు.

డబ్బు సంపాదించడంలో ఆనందముంటుందని మంజరి అనుభవపూర్వకంగా గ్రహించింది. సంపాదన పెరుగుతున్నకొందికీ, ఆనందపుస్థాయి పెరగసాగింది. దీంతోపాటు ఇంకో దృక్పథం సైతం మంజరికి అలవాటయింది. తనకన్నా దిగువస్థాయిలో ఉన్నవారికి అసహ్యించుకోవడమూ మంజరికి అలవాటయింది. అప్పుడప్పుడు మంజరి కొన్ని ప్రవచనాలను కూడా ఉద్ఘాటిస్తూ ఉండేది.

"సమాజం నిన్ను గౌరవించలేదని ఏడిచిపోవడంలో అర్థంలేదు. గౌరవించదగిన అంశాలు నీలో వున్నాయో లేదో ముందుగా ఆలోచించుకో"అనేది అనేకసార్లు.

"నా గురించి నీకు తెలుసు. నా చుట్టూ ఉన్నవారిని గురించి కూడా తెలుసు. నా దగ్గర ఏదో ఉన్నదని, నా మాటలు విలువ వున్నదనీ, కాకపోతే ఇంతమంది మనుషులు నా చుట్టూ చేరతారన్న నమ్మకం నాకు లేదు"అనేది అప్పుడపుపడు.

"ధనసంపాదనలో ఆనందమేమీ లేదనేవారు నాకు అర్థం కాకుండా ఉన్నారు. నా మట్టుకు నేనా ఆనందాన్ని పుష్కలంగా అనుభవిస్తున్నాను!"

ఆమెతో పనుండి వచ్చేవారందరూ, ఆమెగారన్న ప్రతి మాటకూ "ఓహో ఓహో"అనందం వలన అవన్నీ నిజమన్న గాఢవిశ్వాసం సైతం మంజరికి స్థిరపడిపోయింది.

అయితే ఈ అభిప్రాయాలను అందరిముందూ ఆవిడ ప్రకటించేది కాదు. పార్టీలతో వ్యవహరించేటప్పుడు చాలా సున్నితంగా డిప్లొమేటిక్‌గా మాట్లాడేది. ఎదుటివారు నొచ్చుకోకుండా తనక్కావలసిన పనులను అతినేర్పుగా సాధించుకోవడాన్ని మంజరి మాస్టరీ చేసేసింది. తను దేన్నన్నా 'కా'దన్నప్పటికీ, అవతలివారు బాధపడకుండా "అయ్యో, పాపం"అని -వారిచేత అనిపించిగానీ మరీ వదిలేది కాదు.

చాలామంది చాలా పేర్లతో ఆమె దగ్గరకు చందాలకోసం వస్తుండేవారు. వారందరికీ చేతులతో కాకుండా నోటితోనే లేదని చెప్పి పంపేస్తూ ఉండేదావిడ.

"మీ ఇబ్బందులు వింటుంటే గుండె చెరువయిపోతోంది బాబూ! కానీ ఏమీచెయ్యలేని నిస్సహాయస్థితిలో ఉన్నాను. వారంరోజులు కిందటే ఎవరో ఇంజనీరింగ్ స్టూడెంట్ వచ్చాడు. అతనికేదో ఇచ్చి పంపించాను...పేరా...జ్ఞాపకం లేదు. ఉన్నా నేను బయటపెట్టను...ఓ పనిచేయండి. సెక్రటరీకి

మీ ఎడ్రసిచ్చి వెళ్లండి. వీలున్నప్పుడు నేనే మీకేదన్నా పంపిస్తాను''.

''పాపం! నామీద ఎన్ని ఆశలు పెట్టుకొని వచ్చారో మీ ముఖం చూస్తేనే తెలుస్తోంది. కానీ మిమ్మల్ని డిసప్పాయింట్ చేయక తప్పనిసరైనందుకు చాలా బాధగా ఉంది. నన్ను మీరు మన్నించాలి''.

''నిజం చెప్పాలంటే ఈ మేడలు, కార్లు, తోటలు, భూములు అన్నీ ప్రజలవే! వారిచ్చిన పావలాకాసుల నుండీ నాకీ భోగం ముట్టింది. అవసరమయితే-ఇవన్నీ వారికోసం త్యాగంచేయగలను కూడా. కానీ ఆ దశ ఇంకా రాలేదనుకొంటాను. మీరుచెప్పిన విషయాన్ని గురించి నేనింకా ఆలోచించుకోవాలి...మరి నాకు సెలవు. కారు పంపిస్తున్నాను, మీరెక్కడ దిగేదీ అతనికి చెప్పండి''.

ఈ ధోరణిలో మంజరి, ఒకరితో అన్నది మరొకరితో అనకుండా వందలమందికి సమాధానాలు చెప్పి పంపుతూ ఉండేది. కొన్నిసార్లు తప్పనిసరయి, అంతో ఇంతో విదపను కూడా విదిపేది. అలాంటప్పుడు ఆవిడ మనస్సు చాలా ఖేదించేది.

''ఏదో ఇచ్చానని సంతృప్తిపడరు. ఇంతకన్నా ఎక్కువ ఇవ్వనందుకు చాటుకెళ్లి తిట్టుకుంటారు''అనేది మంజరి.

''నేను పిసినిగొట్టుడాన్ని కాదు. డబ్బంటే నాకు మొదణ్ణించీ లక్ష్యంలేదు. కానీ, వృథాగా ఖర్చుచేయడం నాకిష్టంలలేదు. నేనిచ్చే ప్రతి దమ్మిడీకి, అంతో ఇంతో ప్రతిఫలం లేనప్పుడు, నేనెందుకివ్వాలిట?''అనేది మంజరి.

ఒకసారి పదిమంది పెద్దమనుషులు పనిమాలా మంజరిదగ్గరకొచ్చి, ఓ పెద్ద ఉత్తరం ఆవిడ చేతికిచ్చాడు.

''చెప్పండి!''అన్నది మంజరి చిరునవ్వు నవ్వుతూ.

''రామచంద్రంగారు మీకిమ్మని జాబు రాశారు. చూడండీ!''అన్నాడొకాయన.

మంజరి ముఖం రవ్వంత ముడుచుకుపోయింది.

''ఈ ఉత్తరం రాయడానికి నేనెంత బాధపడిందీ నువ్వూహిస్తే అదే చాలు. నా ప్రాణాలు తీసి మరీ రాయించారు. ఇలాగా నిన్ను ఇబ్బందుల్లో పెట్టే హక్కు నాకేమీ లేదు. నీకిష్టమయితే వారడిగిన సహాయం చేయి. నువ్వు చేయకపోయినా నేనేమీ అనుకోను. సహాయమేచేస్తే ముందుగా సంతోషించేది నేనే! మా ఆవిడ పోయింది. నాకు జీవితం మీదనే విరక్తి కలిగింది. ఉంటాను''.

ఉత్తరం మడిచి బల్లమీద పడేసి, కళ్ళొత్తుకొన్నది మంజరి.

''ఊఁ....చెప్పండి!''అన్నదావిడ పొడిపొడిగా.

కాస్సేపు వొకరి మొగాలొకరు చూచుకొన్నారు.

ఆఖరికి ఓ పెద్దమనిషి గొంతు సరిచేసుకొన్నాడు.

''మా వూళ్ళో అయిదేళ్ళ నుండీ ఓ కాలేజీ నడుపుతున్నాం. ఊళ్లో వాళ్లు ఉచితంగా స్థలం ఇచ్చారు. పదిమందీ చందాలు వేసుకొని, పూరిపాకలు వేసి క్లాసులు నడుపుతున్నాం. పక్కా బిల్డింగ్ లేకపోతే, రికగ్నిషన్ రద్దు చేస్తామంటూ గవర్నమెంటు వారు రాశారు. అప్పటికీ మా శక్తికొద్దీ తంటాలు పడుతున్నాం. అయినా పని పూర్తికాలేదు.

భార్యపోయినప్పట్నించీ,రామచంద్రం మరీ వెర్రివాడయిపోయాడు. వాడు తన ఆస్తినంతా కాలేజీకి యిచ్చేశాడు...ఇంకా డబ్బు కావాలి. అధమం లక్షరూపాయలైనా ఉంటే తప్ప పని జరగదు...''

''లక్షరూపాయలా?''అన్నది మంజరి ఆశ్చర్యంగా.

''మరేనమ్మాయ్! మాకేమీపాలుపోక మీ దగ్గరకొచ్చాం. అసలు రామచంద్రాన్నే రమ్మన్నాం

గానీ, వాడు రానన్నాడు. మీ వూరు నీకు కొత్తదేమీ కాదు...ఊరి వెలుపలున్న మామిడితోటలో కాలేజీ నడుస్తున్నది....'' అన్నాడాయన తుంపులు తుంపులుగా మాట్లాడుతూ.

‘‘నాకు మించిన భారం నా నెత్తికెత్తడం మీకూ భావ్యం కాదు బాబూ!''అన్నది మంజరి.

‘‘ఇందుగ్గాను మేము మీకివ్వగలిగింది కూడా ఏమీలేదు. భవనదాత పేరును కాలేజీకి పెట్టదలుచుకొన్నాం. ఇందువల్ల మీకేదో వొరుగుతుందని కాదు. మీకు దేశంలో పేరుప్రతిష్ఠలకు కొదవేమీ లేదు కూడాను. కానీ, మీ నుండి అలాంటి సహాయం పొందినందుకు కృతజ్ఞతగా మేమివ్వగలిగింది ఇదే!''అన్నాడాయన.

‘‘అదికూడా నాకవసరం లేదు బాబూ! నాపేరు పెట్టకపోయినా నాకభ్యంతరం లేదు. నేను పేరుకోసం పాకులాడే మనిషిని కాదు. అంతమొత్తం ఇవ్వగలనా లేనా అనే నేనాలోచిస్తున్నాను''అన్నది మంజరి.

ఆవిడ మెత్తబడటం చూసి నలుగురూ నాలుగువేపులా కమ్ముకొన్నారు. ఆవిడింకో మాట మాట్లాడకుండా వొప్పించేశారు.

‘‘అయితే ఓపనిచేదాం బాబూ! నేనో యాభై వేలిస్తాను. మిగతాది...''

‘‘ఇంకొకర్ని అడగమా? ఫలానా మంజరి దగ్గరకెళ్ళామనీ, ఆవిడ సగమిచ్చి తోకముడిస్తే, మిగతా సగంకోసం మీదగ్గరికొచ్చామనీ, మేం వాళ్ళతో చెప్పాలన్నమాట! అసలు కాలేజీ ఎత్తేసినా మాబాగేకానీ, ఈ పనిమాత్రం మావల్ల కాదు, మేం చెయ్యం''అన్నాడా పెద్దమనిషి.

‘‘నన్నిలా ఇరుకులో పెట్టడం భావ్యంకాదు బాబుగారు!''అన్నది మంజరి ఓ క్షణం ఆలోచిస్తూ, ‘‘గుంటూరు,బెజవాడ, తెనాలి- ఈమూడుచోట్ల నేను డాన్సు పెరఫారమెన్స్ ఇస్తాను. మీరు కాన్వాసు చేసి టిక్కెట్లమ్ముకోండి. ఖర్చులుపోను మిగిలిందంతా నాపేరు మీదుగా కాలేజీఫండును క్రెడిట్ చేయించండి! ఇంతకన్నా పెగలడం నా వల్ల కాదు''.

అరగంట చర్చల తరువాత అందరూ సరేనన్నారు.

‘‘ఇదంతా సులభంగా అవుతుందని నేననుకోను. ఈ మూడు టౌన్సులో వున్న పలుకుబడి గల పెద్దమనుషులందరూ మీ కమిటీలో ఉండాలి. పెద్దపెద్ద ఫరమ్సు ఉండి బాగా డొనేషన్సు పుచ్చుకోవాలి. ఆ గొడవలన్నీ మీరు చూసుకుంటే తప్ప ఈ పథకం వల్ల అనుకొన్నంత లాభం ఉండదు''అన్నది మంజరి.

‘‘అలాగే''అన్నారు వారు.

మంజరి అప్పటికప్పుడు 50వేలకు చెక్కు ఇస్తుందనుకొన్నారు-ఆవిడలా ఇవ్వలేదు. తను నెలరోజుల్లోగా ఓసారి అక్కడికొస్తాననీ అప్పుడు అన్ని విషయాలూ వివరంగా మాట్లాడుకొందామనీ చెప్పి పంపివేసింది.

ఈలోగా రామచంద్రం ఓ ఉత్తరం రాశాడు.

‘‘మా వాళ్లూ అన్ని సంగతులూ చెప్పారు, చాలా సంతోషం. నీరాకకోసం మేమందరమూ ఎదురుచూస్తుంటాం''.

## 19

ఆరు మాసాలలలోగా, కాలేజీ పనులన్నీ పూర్తిచేయించింది మంజరి. అందుకోసం ఏర్పడిన కమిటీవారు,రాత్రింబవళ్లు పనిచేశారు. గుంటూరులో వున్న పొగాకు కంపెనీల యజమానులు,

తెనాలి, బెజవాడల్లో ఉన్న బియ్యం మరల యజమానులు ఆ కంపెనీ సభ్యులు ఓపెద్ద రాజకీయ నాయకుడు ఆ కమిటీకి గౌరవాధ్యక్షుడుగా ఉండేందుకు అంగీకరించాడు. పలుకుబడి కలిగిన ఈ పెద్దల కృషి వలన దాదాపుగా లక్షరూపాలయయ టికెట్లు అమ్ముడయ్యాయి. న్యాయంగా అయితే, మంజరి చేతినించి చిల్లికానీ కూడా ఇవ్వనవసరం లేదు. కానీ ఆవిడ ఆలా చెయ్యలేదు. తనిస్తానన్న యాభై వేల రూపాయలు ఇచ్చింది. కమిటీవారు “మంజరి ఆర్ట్స్ కళాశాల”అని పేరు పెట్టడినికి ఏకగ్రీవంగా ఆమోదించారు.

కళాశాల భవన ప్రవేశ మహోత్సవాలకు హాజరు కావడం మంజరికి బ్రహ్మప్రళయమయిపోయింది. ఆరోజున జగజ్జెట్టీల వంటి వారు బారులు బారులుగా నిలబడి ఆవిడకు స్వాగతం చెప్పారు. జనాన్ని అదుపులో ఉంచడానికి గుంటూరు నుండి అదనంగా ఉక్కుటోపీలు ధరించిన పోలీసులు రప్పించబడ్డారు. గ్రామంలోని వివిధ సంఘాలవారు సంయుక్తంగా మంజరికి సన్మానపత్రం సమర్పించారు. ఢిల్లీ శ్రీనుండి వచ్చిన ఒక ఆంధ్రమంత్రి భవన ప్రవేశ మహోత్సవాలను ప్రారంభించారు

మంజరి ముక్తసరిగా మాట్లాడింది.

“ఈసంతోష సమయంలో నేను ఎక్కువగా మాట్లాడలేకపోతున్నాను. నిజం చెప్పాలంటే..నాకిష్టంలేని పనులు చాలా జరిగాయిక్కడ. నేను వద్దన్న కొందికి కాలేజీకి నాపేరుపెట్టారు. ఒక దశలో-.నేనీ వ్యవహారాల నుండి తప్పుకొందామని కూడా అనుకొన్నాను. కానీ అడినమాట తప్పడం నాకిష్టం లేదు. నేనేదో సహాయం చేశానని, ఉపన్యాసకులందరూ అన్నారు. నేను నిమిత్తమాత్రమేనని మనవి చేస్తున్నాను. నా దగ్గర పదిరూపాయలుండటమే నిజమయితే, ఆ డబ్బు,మీడబ్బు, మీ అందరిదీ. మీ డబ్బును తిరిగి మీకే ఇవ్వడం నా కనీస ధర్మం. ఈ గ్రామం నాకు చాలా ఇష్టమయింది. ఇక్కడ నాకు ఇష్టమైన వ్యక్తులెందరో వున్నారు. రాంచంద్రం, కోటేశ్వరరావు, మాధవరావు గారలు నాకెంతో ఆప్తులు. వారున్న గ్రామానికి ఉడుతాభక్తిగా నేనిచ్చిన కానుక ఇది. మరినాకు సెలవు...క్షమించాలి. ఇంకో చిన్న సంగతి ఉంది. గుంటూరు, తెనాలి, బెజవాడ పౌరులు ప్రత్యేకంగా నన్ను సన్మానిస్తామంటూ నన్ను వత్తిడి చేస్తున్నారు. ఈ సన్మానాలన్నా-సభలన్నా నాకు సరిపడవు. మీ అందరి ఆదరాభిమానాలుంటే అంతే చాలు. సన్మానాల పేరుతో, నా నెత్తిన మరింత భారాన్ని మోపడం మీకు భావ్యం కాదు. నన్ను మన్నించాలి. బొంబాయిలో ఊపిరి తిరగని పనుల్లో ఉండి కూడా, ఈ ఫంక్షన్‌కు రాగలగడం నా అదృష్టం”అన్నది మంజరి.

ఆమె తరువాత ఉపన్యసించినవారు మంజరి దానగుణంతో బాటుగా ఆమె వినయాన్ని గురించి కూడా ముచ్చటించారు.

మంజరి నేరుగా బొంబాయి పోలేదు. మధ్యలో హైదరాబాదులో రెండు రోజులపాటు ఆగింది. శర్మగారు అంతకు వారంరోజులు ముందుగానే హైదరాబాదు వచ్చి, సన్మానోత్సవ సన్నాహాలన్నీ చేవారు. ఇందుక్కావలసిన ఖర్చుల క్రింద, పదిహేనువేల రూపాయల కటిక రొఖ్ఖం ఇచ్చి పంపించింది మంజరి.

"స్టేట్‌కాపిటల్‌లో సన్మానం చేయించుకోవడం ఓ ఫాషనై పోయిందామె. నలుగురూపోయిన దోవనే మనమూ పోదాం. తప్పేదేముంది!"అన్నది మంజరి.

మట్టిలో నుండి మాణిక్యాలను వెలికితీసే ప్రతిభాశాలి శర్మ. దానికితోడు, మంజరి తర్ఫీదు అతన్ని రాటు తేల్చింది. అంతకు ముందు ముక్కూ, మొహమూ ఎరగకపోయినా, వారంరోజుల్లో శర్మగారు, "సినీజన ప్రేమిక సంఘాలు"అయిదారింటిని ఏర్పాటుచేశాడు. వారిచేత సన్మానపత్రాలు, పూలదండలు, నినాదాలు-ఈ తతంగమంతా చేయించాడు.

"జరిగేదేదో పకడ్బందీగా జరగాలలి డబ్బుకోసం వెనక్కు తీయకు. అలాగైతేనే చూడు, లేకపోతే మనం మానుకొందాం"అని ముందుగానే మంజరి హెచ్చరించింది.

"నేను టేకప్ చేసిన ఏ పనీ ఫెయిల్ కాలేదు; కాదు కూడాను. మీరే చూస్తారుగా?"అని భరోవాసా ఇచ్చాడు శర్మ.

ఆయనగారు ఊహించిన దానికన్నా ఎక్కువ చేశాడు. ముందుగా అనుకొన్నదాని ప్రకారమయితే, ఊరేగింపు ప్రోగ్రాం లేదు. శర్మగారు అది కూడా పెట్టించాడు. కిరాయి మనుషులు చాలామంది ఊరేగింపులో పాల్గొనడమే కాదు; నినాదాలు చేయడమే కాదు; ప్రతి ఫర్లాంగుకు, ఓ డజను పూలదండలు మంజరికి సమర్పించారు కూడా.

మంజరి వాటన్నింటికి సముచిత రీతిని సమాధానమిచ్చింది. ఆవిడకు బాక్సాఫీసు సూత్రాలు బాగా తెలుసు. అవే సూత్రాలను మంజరి ఉపన్యాసాలకు కూడా అన్వయించింది. ఏ సభలో ఏరకం ఉపన్యాసాలు బాగా రాణిస్తాయో మంజరి అనుభవపూర్వకంగా గ్రహించింది. ప్రతి పదేసి నిమిషాలకూ జనం చప్పట్లు కొట్టగల ధోరణిలో ఉపన్యసించడాన్ని మంజరి అభ్యాసం చేసింది.

"నేనేదో కాలేజీకి ఉదారంగా లక్షపై చిలుకు విరాళమిచ్చానని ఉపన్యాసకులుంటు న్నారు. అది నా విధిగా భావించి నేను చేశాను"అని ఉపన్యాసం చివర ఓ ముక్క చేర్చింది మంజరి.

❦❦❦❦❦❦❦❦

కాలేజీ ఫంక్షన్లు సందర్భంగా తాను బొంబాయిలో చాలా బిజీగా ఉన్నానని మంజరి ప్రకటించిన నాటికి, ఆవిడ ప్రయత్నాలొక రూపానికి రాలేదు. సేఠ్‌కిషన్‌దాస్ చందూలాల్‌కు మంజరి రెండు ఉత్తరాలు రాసింది. ఆఖరు ఉత్తరంలో "మీరెప్పుడు మద్రాసు వచ్చేది రాయండి. లేదా నన్నెప్పుడు బొంబాయి రమ్మంటారో రాయండి!"అన్నది మంజరి. దానికి జవాబుగా చందూలాలే మద్రాసు వచ్చాడు.

మంజరి ఈసారి పిళ్ళేను తొలగించింది. చందూలాల్‌ను మీనంబాకం నుండి నేరుగా తన ఇంటికే తీసుకొచ్చింది.

"మీరెవరో తెలీకముందు పిళ్ళే అవసరమయ్యాడు. ఇప్పుడెందుకు? మీలాంటివాణ్ణి పరిచయం చేసినందుకు నిజంగా అతనికి నా ధన్యవాదాలర్పించాలి"అన్నది మంజరి.

చందూలాల్ విశాలంగా నవ్వాడు. ఆ దరిమిలా అతనున్న వారం రోజులూ మంజరీ మేన్షన్స్‌లోనే మకాం వేశాడు. ఈలోగా మంజరీ, వసంతా కలిసి చందూలాల్‌ను ఇంకో మనిషి చేసి పారేవారు.

"నాకీ మద్రాసు మీద మొహం మొత్తింది సేఠ్‌జీ! బాంబే వద్దేదామనుకొంటు న్నాను"అన్నది మంజరి.

"అయితేనా!"అన్నాడు చందూలాల్.

"వచ్చి ఏం చెయ్యను మరి? మీకు చాలామంది ప్రొడ్యూసర్లు డైరెక్టర్లూ తెలుసు. ఏదన్నా హిందీపిక్చర్లో వర్క్ చేదామనుకొంటున్నాను. అదీ మికిష్టమైతేనే సుమా! మీరు కాదుకూడదంటే మానేస్తాను"అన్నది మంజరి.

చందూలాల్ తనతో బాటు మంజరిని కూడా తీసుకొచ్చాడు బొంబాయికి. ఆ మహానగరాన్ని చూస్తూనే మంజరి ఆశ్చర్యపోయింది. గుంటూరుకూ, మద్రాసుకూ మధ్యగల అంతరం కన్నా బొంబాయి-మద్రాసుల మధ్య గల భేదం ఎక్కువనుకొన్నది మంజరి. అవిడకయితే పదిరోజులపాటు బొంబాయంతా తిరిగి చూడాలనిపించింది. కానీ బలవంతాన ఆ కోరికను అణచివేసుకొంది మంజరి. తను మామూలు మనిషయితే ఫర్వాలేదు. హిందీ ఇండస్ట్రీలో పాదం పెట్టాలన్న సత్సంకల్పంతో ఇక్కడికొచ్చింది. తనకు మద్రాసులో ఉన్న కీర్తి ప్రతిష్టలేవీ ఇక్కడ చెలామణీ కావు. అయితే- తను రాణించడానికి అవే మెట్లుగా ఉపయోగించాలి. అయినప్పుడు-తను జులాయిగా తిరిగితే లాభమేముందీ? తను ఎంత దూరంగా ఉంటే అంత మంచిది.

మూడోరోజున, ఎవరో తలుపుకొడితే మంజరి "యస్"అంటూ తలుపుతీసింది. ఎదురుగా "లాలారాం" చిరునవ్వుతో ప్రత్యక్షమయ్యాడు. ఓక్షణం పాటు మంజరి నిర్విణ్ణురాలయింది. తన ఆశ్చర్యాన్ని కప్పిపెట్టుకొంటూ లాలారాంను ఆహ్వానించింది మంజరి.

"జ్ఞాపకం పెట్టుకొని వచ్చినందుకు చాలా ధన్యవాదాలు"అని కూడా అన్నది.

"నేనింకా నీకు గుర్తుండటం నా అదృష్టం"అన్నాడు లాలారాం.

వెయిటర్ రెండు టీ తెచ్చిపెట్టిపోయాడు.

"నిన్న సాయంత్రం మీరూ, సేఠ్‌కిషన్‌దాస్ జుహులో ఉండగా చూశాను. మీరిక్కడికొస్తున్నట్లుగా నాకు రాయను కూడా లేదేం? నేనూ వచ్చి కలుసుకొనేవాణ్ణిగా!"అన్నాడు లాలారాం.

దానికేదో సమాధానం చెప్పింది మంజరి.

తరువాత లాలారాం ఈ మధ్య విడుదలైన మంజరి పిక్చర్లమీద తన అభిప్రాయం ప్రకటించాడు.

"మీరింకా ఆ మద్రాసులోనే ఎందుకుండిపోతారో నాకు అర్థంకాదు. మిమ్మల్ని హిందీ ఫీల్డులో కూడా పరిచయం చేదామనుకొంటున్నాను. అయితే,పిక్చర్ ఫినిష్ అయిందాకా మీరు బొంబేలోనే ఉండాలి. మద్రాసులో మీకెన్ని పిక్చర్లున్నాయేమిటి?" అన్నాడు లాలారాం.

"ముప్పైరెండున్నాయి"అని కోసింది మంజరి.

"మరి మీరు బోంబే కెలా వస్తారు?"అన్నాడు లాలారాం.

"అందులో చాలా పిక్చర్లు ఫినిషింగ్ స్టేజీలో వున్నాయి. మిగిలిన వాటిల్లో నేనున్నసీన్సు ముందుగా పూర్తిచేసుకోమంటాను"అన్నది మంజరి.

లాలారాం ఆలోచించి "సరే"అన్నాడు.

"నా దగ్గర కథ రెడీగా ఉంది. ఓ డాన్సర్ లైఫ్. దిక్కులేని కుటుంబంలో పుట్టి, అతినికృష్టమైన వాతావరణంలో పెరుగుతుంది. రకరకాల ఉద్యోగాలు చేస్తుంది. ఆఖరికి ఓ దొంగలముఠాలో చేరిపోతుంది. దొంగలు-తమ దోపిడీకి ఆమెనొక సాధనంగా చేసుకొంటారు. ఆదొంగలముఠాను పట్టుకొనే ప్రయత్నంలో పోలీసులు ఆమెను పాచికగా వాడుకొంటారు. ఈరెండు వర్గాల మధ్యా ఆవిడ నలిగిపోతుంది. స్థూలంగా ఇదీకథ. ఇందులో నువ్వు హీరోయిన్‌వు. ఇద్దరు హీరోలు-దొంగలనాయకుడు పోలీసు అధికారి. డాన్సర్ దొంగల నాయకుణ్ణి ప్రేమిస్తుంది. కానీ అతని దౌష్ట్యానికి బలయిపోతున్న ప్రజల దీనావస్థను చూచి ఆమె చలించిపోతుంది. అతనెంత చెప్పినా వినదు. ప్రజల పట్ల తన కర్తవ్యం, తన వ్యక్తిగత సుఖం- ఈ రెండింటి మధ్యా సంఘర్షణ. ఎక్కువ భాగం ఎల్లోరా, అజంతాల్లో షూట్‌చేస్తాను. కంప్లీట్ కలర్ పిక్చర్"అన్నాడు లాలారాం.

అతని అభిప్రాయమేమిటో మంజరికి అరటిపండొలచి చేత బెట్టినట్లుగా అవగాహనయింది.

"ఏమంటారు?"అన్నాడు లాలారాం.

మంజరి తొందరపడదలుచుకోలేదు.

"చూదాం, మళ్ళా కలుస్తారుగా?" అని విషయాన్ని ఎటూ తేల్చకుండా నానవేసింది మంజరి.

డైరెక్టర్ లాలారాం ఆ తరువాత ఇంకో గంటదాకా ఈ సినిమా సంగతులన్నీ మార్చి మార్చి చెప్పుకొచ్చాడు. నిజానికీ సంభాషణ మంజరికేమీ రుచించలేదు. అలాగని దాన్ని బయటకి అనడానికీ లేదు. చాలా శాంతంగా అతని వాగుడు భరించడమే కాకుండా, మధ్య "ఓహో"-"ఆఁహో"-"ఐసీ"-"దట్స్‌గుడ్"లాంటి పదాలను గూడా సమయానుకూలంగా ప్రయోగించింది.

మంజరిని ఏదోవిధంగా తన పిక్చరులో వాడుకోవాలన్న సదభిప్రాయం లాలారాం గారికి కలిగినట్లే, అతన్ని అడ్డం పెట్టుకొని ఉత్తరాదికి కూడా యెగబాకాలని మంజరికీ కలిగింది. అయితే లాలారాం, తన నటనను మాత్రమే కాక, తన నుండి ఫైనాన్స్‌ను కూడా ఆశిస్తున్నాడని మంజరి ఆదిలోనే గ్రహించింది. ఈ తరహా ధోరణి ఆవిడకకు కొత్తదేమీ కాదు గానీ ఈ విషయమై అటోఇటో తేల్చి చెప్పడానికి ఆవిడ సిద్ధంగా లేదు. కావాలంటే తను మద్రాసులోనే ఆ మాత్రం పెట్టుబడిని పుట్టించగలదు. అవసరమైతే తనే భరించగలదు కూడాను. కానీ యిప్పుడది ప్రశ్న కానేకాదు. తనో చిల్లికానీ పెట్టకుండా ఈరంగంలోకి రావాలి. అందుకేదన్నా మార్గమున్నదా-లేదా అన్నదే ప్రశ్న. తనే డబ్బు పెట్టుకునే పక్షంలో-బొంబాయి రావడం కూడా దండగే! తను హాయిగా మద్రాసులోనే ఉండి, తనక్కావలసిన విధంగా కథ రాయించుకుని ఓ హిందీ పిక్చర్నే ప్రొడ్యూస్ చేసి వుండేది! ఇప్పుడెన్ని హిందీ సినిమాలు మద్రాసులో తయారవుతున్నాయి గాదు? ఎంతమంది సౌతిండియా

ప్రొడ్యూసర్లు బొంబాయి వచ్చి సినిమాలు తీస్తున్నారు కాదు?

లాలారాం మాట్లాడుతున్నప్పుడే మంజరికీ ఆలోచనలన్నీ వచ్చాయి. అందుకే ఆవిడ ''ఔ''ననీ ''కా''దనీ తేల్చకుండా విషయాన్ని మాగబెట్టింది.

లాలారాం కూడా అమీ తుమీ తేల్చమనలేదు. ఆలోచించమనీ ఇటువంటి అవకాశం ఎప్పుడోగానీ రాదనీ మాత్రం అన్నాడు.

''మళ్లా మనం కలుసుకొంటున్నాం గదా! ఈలోగా నా డెసిషన్ చెప్పేస్తాను''అన్నది మంజరి.

''ఈవిషయం అలా ఉంచండి! పోతే-మీరిక్కడి కొచ్చినట్లు ఇక్కడి ఆర్టిస్టులకు తెలిసింది. వారిని మీరు పరిచయం చేసుకోవడం మంచిది. అలాకాదు-వారే మిమ్మల్ని పరిచయం చేసుకోవాలనుకొంటున్నారు. రెండుమూడు రోజుల్లో పార్టీ ఏర్పాటుచేదాం....ఇంద...ఇదీనా ఫోన్ నెంబరు.. వస్తాను''అంటూ లాలారాం వెళ్లిపోయాడు.

ఈ వ్యవహారాన్ని సేట్‌కిషన్‌దాస్ చందూలాల్‌తో చెప్పేప్పుడు మంజరి ప్రదర్శించిన నైపుణ్యం అద్వితీయమైనది. తనకా గొడవలంటే ఇష్టమేమీ లేదంటూనే, ఆ పిక్చరుకు డబ్బు పెట్టుబడి పెట్టడంలో గల లాభాలను గురించి విపులంగా చర్చించింది మంజరి.

''నువ్వు గట్టిగా కావాలంటే డబ్బివ్వడానికి నాకేమీ అభ్యంతరం లేదు. వాడడిగిన మొత్తం నాకో లెక్కలోనిది కూడా కాదు. కానీ దానివల్ల నీకొరిగేదేమిటో నాకు తెలీకుండా వున్నది''అన్నాడు చందూలాల్.

''నాకు హీరోయిన్ వేషమిస్తానన్నాడు''అన్నది మంజరి.

కానీ-

ఆవిడలా అనలేదు. ఆ మాట తన నోటి నుండి వచ్చాక, తన విలువ సగానికి సగం పడిపోతుందనడంలో సందేహం లేదనుకొన్నది మంజరి.

సమాధానంగా నవ్వి ఊరుకొంది.

చందూలాల్ ఓసారి నిశితంగా మంజరికేసి చూసి సిగరెట్ అంటించాడు.

''నాలో ఓ బలహీనత ఉంది సేఠ్‌జీ! ప్రతిదాన్నీ నేను డబ్బుకు ముడెట్టి చూడలేను. ఇందువల్ల జీవితంలో నేనెన్ని ఇబ్బందులు పడ్డానో లెఖ్ఖలేదు. అయినా నాకు ఆ జ్ఞానోదయం కలగకుండా ఉంది. మీరన్నమాట నిజమే! నిజంగా ఈలాలారాం గాడికి మీరు ఫైనాన్సు చేయడం వల్ల ఉపయోగమేమిటంటారు?''అన్నది మంజరి.

చందూలాల్ ఆవిడ ధోరణికి విస్తుపోయాడు. తను ఏ ప్రశ్నకు జవాబు కావాలను కున్నాడో, అదే తనకు యెదరయి నిలుస్తుందని అతనూహించనుకూడాలేదు.

''ఏదో, మాటవరసకడిగాను. ఆ డబ్బు నాకు తిరిగి రాకపోయినా ఫర్వాలేదు. నువ్వు రెకమెండ్ చేశావు గనుక నేనొప్పుకొంటున్నాను. పోనీ లాలారాం నీకేదన్నా మంచివేషమిస్తాడేమో అడక్కపోయావా?''

''అడుగుదామనుకొన్నాను''అన్నది మంజరి సడన్‌గా వాక్యాన్ని ఆపేసి.

''ఊఁ''

“నేనింకా సినిమాల్లో పనిచేయడం మీకిష్టమో కాదో నాకు తెలీదాయె. మీ అభిప్రాయం తెలుసుకోందేం నేనెలా అడగనండీ! తీరా అడిగాక అతను‘సరే’ నన్నాడనుకోండి. మీరు ‘వీల్లే’దన్నారనుకోండి. అప్పుడు వెర్రిబాగులదాన్ని కావలసి ఉంటుంది. ఈ తెటుకంతా లేకుండా మిమ్మల్నడిగే చేదామనుకొన్నాను”.

“థాంక్స్”అన్నాడు చందూలాల్.

అప్పటికప్పుడే అతని కళ్లల్లోకి తోడేలు చూపులు రావడం చూసి, మంజరి నిశ్శబ్దంగా నిట్టూర్చింది.

చందూలాల్ ఆ కలర్‌పిక్చర్‌కు ఫైనాన్సు చెయ్యడానికి ముందు చిన్న “మతలబు”జరిగింది. అతను చాలాకాలం నుండీ ఓ లైసెన్స్‌కోసం ప్రయత్నిస్తున్నాడు. చతుర్విధోపాయాలు ప్రయోగించినా ఆ వ్యవహారాలు తేలడం లేదు. రాజకీయంగా అతను ఆ శాఖోద్యోగుల మీద వల్లమాలిన వత్తిడి తీసుకువచ్చాడు. భారీగా విరాళాలిచ్చాడు. వారికి సన్మానాలు చేశాడు. పార్టీలిచ్చాడు. కానీ, యెక్కడో యేదో అడ్డుకొంటోంది. దాన్ని తొలగించడం అతని వశం కావడం లేదు. ఆ లైసెన్స్ వస్తే-కోట్లమీద వ్యాపారం జరుగుతుంది. లక్షలాది లాభాలు-అలా-వచ్చి దూకుతాయి. కానీ ఏం లాభం? రోజురోజుకూ ఈ విషయం లోతుకు దిగజారిపోతున్నదే తప్ప, పైకి వచ్చే సూచనలేవీ కనిపించడం లేదు.

సరిగ్గా ఈ విషయంలోనే అతను మంజరిని గురించి విన్నాడు. ఉన్నతోద్యోగవర్గాల్లో ఆమెకున్న పలుకుబడి అతన్ని విభ్రాంతుణ్ణి చేసింది. తన వ్యవహారాన్ని పరిష్కరించగలిగిన వ్యక్తి మంజరి మాత్రమేనని అతను గ్రహించాడు. ఈపని పూర్తవడానికి అతనెంత ఖర్చయినా చేసేందుకు సిద్ధపడ్డాడు.

తెలివైన పెట్టుబడిదారుడు ఖర్చులుచూసి జడుసుకోడు, తక్షణ లాభాలకోసం కూడా ఆశపడడు. ఒక్కోసారి చేసిన ఖర్చులో వీసపాలు కూడా తిరిగి రాకపోవచ్చు. అలాంటి దశలో కాళ్లారజాపి చతికిలబడడు. రెట్టించిన ఉత్సాహంతో ముందుకు వెడతాడు. సంచులు విప్పి ధనాన్ని వెదజల్లుతాడు. ఈ వెరసి మొత్తానికి అనేక రెట్లు తనకు వస్తుందని అతనికి రూఢీగా తెలుసు.

చందూలాల్ తెలివైన పెట్టుబడిదారుడేననడంలో సందేహం లేదు. అసలు విషయం చెప్పకుండానే మంజరి మీద బోలెడంత ఖర్చు చేశాడు. ఆవిడలో తీవ్రంగా బుసలుకొడుతున్న కాంక్షలను రేక్కొలిపాడు. ఆ అగ్నిజ్వాలలు మంజరిని నిలువునా దహించివేశాయి.

తొలిరోజుల్లో మంజరి ఇంత దూరం ఆలోచించలేదు. రానురాను చందూలాల్ ధోరణిని ఆవిడ అవగాహన చేసుకొన్నది. తనద్వారా గొప్ప ప్రతిఫలాన్ని ఆశిస్తున్నాడని తేలిపోయినప్పుడు ఆవిడ రవంత బాధపడింది. తను సాధారణంగా మోసపోదనీ, తన ‘పట్టు’నుండి విడిపించుకోవడం ఒకంతట సాధ్యం కాదనీ-ఆవిడకో గర్వం ఉండేది. ఇప్పుడది మొనబోయింది. చందూలాల్ తనకు చిక్కడం కాదు; తనే అతని చేతిలో చిక్కిపోయింది. తనకు తెలీకుండానే అతనికి కావలసిన పనులన్నీ చేసిపెడుతున్నది.

అయితే మంజరి నిరాశపడి కుంగిపోలేదు. ఇదీ ఒకందుకు మంచిదేననుకొన్నది. తనిక మద్రాసులో వుండి సాధించవలసింది కూడా ఆమెకేమీ కనిపించలేదు. దాదాపుగా ఏడెనిమిదేళ్లపాటు మొత్తం పరిశ్రమను ఉక్కిరిబిక్కిరి చేసి పారేసింది. తనమాటలను శిలాశాసనం కింద మార్చేసింది.

'సినిమాకకు ముడిఫిలిం ఎంత అవసరమో, మంజరీ అంతే అవసరం'అన్న పేరు సంపాదించింది. తను హతమార్చాలనుకొన్న వారికి నామరూపాలు లేకుండా చేసింది. పైకి తేవాలనుకున్న వారిని అలా లేపి-తారామండలంలో నిలబెట్టింది. తనకోసం వేలకు వేలు గుమ్మరిస్తామన్నగారి ముఖాలమీద పగలబడి నవ్వింది.

అయినా తృప్తిపడలేదు, ఇంకా ఇంకా ఏదో సాధించాలన్న తపన ఆవిణ్ణి స్థిమితంగా వుండనివ్వలేదు. తను ఉత్తర భారత సినీపరిశ్రమలో కూడా కాలు మోపాలనీ ఇక్కడి సాధించిన విజయాలకు రెట్టింపు-అక్కడ సాధించాలన్నీ కలలుగన్నది. ఆ స్వప్నాలను నిజం చేసుకోవడానికి చందూలాల్‌ను ఎందుకు వాడుకోకూడదనుకొన్నది.

తనెంతో తెలివిగా మంజరిని వుపయోగించుకొంటున్నాననుకొన్నాడు చందులాల్. అతని నలానే అనుకోనిచ్చింది మంజరి. ఆ భ్రమలో అతనున్నప్పుడే తన పనులను చక్కబెట్టుకోవాలనుకొన్నది. 'ఇదుగో-అదుగో' అంటూనే అతనికి జోలపాటలు పాడింది.అతనిచేత లాలారం పిక్చరుకు కావలసిన పెట్టుబడినంతా పెట్టించింది. తను స్థిరంగా నిలబడలేకపోతున్నాననీ, మంజరి తనను గుప్పిటలో బిగించివేస్తున్నదనీ చందూలాల్ గ్రహించేసరికే సమయం మించిపోయింది. అప్పటికే అతను అయిదారు లక్షలు, ఆ చిత్రం మీద పెట్టాడు. మధ్యలో ఆగితే-మొత్తం డబ్బు గల్లంతవుతుంది. అంచేత పూర్తికావడానికి మరింత సొమ్ముపెట్టుబడి పెట్టాలి. చందూలాల్ తెలివైన పెట్టుబడిదారుడు కనుక అతను చిత్రాన్ని పూర్తిచేయడానికే నిశ్చయించాడు.

ఈలోగా అతననేకసార్లు మంజిని ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ కూడా కదిపి చూచాడు. ఒకసారి ఢిల్లీకెడదామనీ, ఆ లైసెన్సు సంగతేమిటో తేల్చుకొందామనీ అతనంటూనే వున్నాడు, ఆమె'సరే సరే'నని అంటూనే వున్నది.

చందూలాల్‌ను తన్ని తగలేయడం వో లెక్కలోది కాదు. ఓ శుభముహూర్తాన ఆ 'ప్రియమయిన చవట'ను వదిలించుకొని విమానమెక్కడం ఓ నిమిషం పని. అనేకసార్లు ఆవిడ తిరిగి మద్రాసే వెళ్లిపోదామని కూడా అనుకొన్నది. కానీ అపజయాన్నంగీకరించడానికి ఆవిడ మనస్సు సిద్ధంగా లేదు. తను బొంబాయిలో దమ్మిడీకి కూడా చెల్లుబడి కాలేదనీ, ''పొలో''మంటూ కొంప చేరుకున్నదీ మొత్తం పరిశ్రమ కోడై కూస్తుంది. ఆ అవమానం భరించడం కన్నా చావడమే నయం. అదీగాక అప్పుడు తనకింత డిమాండ్ కూడా ఉండకపోవచ్చు. కొత్త వాళ్లెందరో ఈ రంగంలోకి రావాలని విశ్వప్రయత్నాలూ చేస్తున్నారు. వారిలో చాలామంది ఇప్పుడున్న వారికన్నా అన్ని విషయాల్లోనూ ఉన్నతశ్రేణికి చెందిన వారున్నారు. ఆ పోటీని తట్టుకొని నిలబడగలగాలి.

దానికితోడు బొంబాయి వాతావరణం పొగలూ, సెగలూ ఎగచిమ్ముతున్నది. దక్షిణాది తారలందరూ హిందీ రంగాన్ని ఆక్రమిస్తున్నారని, కానీ ఉత్తరాది ఆర్టిస్టులకు దక్షిణాన బుకింగ్‌లే ఉండవనీ పత్రికలు తరచుగా వ్యాసాలు రాస్తున్నాయి. బొంబాయి ప్రొడ్యూసర్లు సౌతిండియన్ ఆర్టిస్టులమీద మోజు తగ్గించుకోవడం అవసరమనీ, ఆమాత్రం రూపురేఖలున్నవారు ఇక్కడా ఉన్నారనీ కొన్ని పత్రికలు హెచ్చరికలు కూడా చేస్తున్నాయి.

అటువంటి వాతావరణంలో ఎంతో జాగ్రత్తగా మసలుకోవాలి. తను వొంటరిగా లేననీ, తన

వెనక సర్వవిధాల సమర్థులైన వారున్నారనీ పరిశ్రమకు తెలియాలి. అప్పుడంత ఉధృతంగా దుమ్మొ దూగరా తనమీదికి రాదు. సగం అందుకే మంజరి అన్నింటినీ మౌనంగా భరిస్తూ వచ్చింది.

నర్తకి జీవిత కథ ప్రధాన ఇతివృత్తంగా గల ఆ చిత్రంలో మంజరి కథానాయిక. ఆ పాత్రకు న్యాయం చేకూర్చడానికి మంజరి అహోరాత్రాలు శ్రమించింది. నాట్యంలోని లలిత లలితాలైన భంగిమలను అభినయించడం కోసం ఆవిడ తీసుకొన్న శ్రద్ధ అనన్యమైనది. తనుంటున్న మేడలోని ఒక గదిని పూర్తిగా అద్దాలతో నింపివేసింది. ఆగదిలో గంటలకు గంటలు నృత్యాన్ని అభినయించేది. ప్రతి చిన్న కదలికనూ, ప్రతి స్వల్ప చలనాన్నీ దీక్షతో అభ్యసించేది. నాట్యాచార్యుడెప్పుడన్నా ప్రాలుమాలితే తనే అతన్ని ఉత్సాహపరిచేది. తీవ్రమైన ఆమె పట్టుదలను చూసి నాట్యాచార్యుడే ఒక్కోసారి రిచ్చపడేవాడు.

హిందీ ఉచ్చారణ మరో తలనొప్పిగా తయారయింది. మాడ్యులేషన్ సరే-కానీ- ఆ ఆనడంలో సరళత ఉండేది కాదు. పట్టిపట్టి మాట్లాడుతున్నట్లే ఉండేది. ముక్కుతో అనవలసిన మాటలూ, సగం మాత్రమే ఉచ్ఛరించవలసిన మాటలూ-ఊది పలకవలసిన పలుకుబడులూ ఆవిడనాళ్లూ, నరాలు కొరికేశాయి. టేప్‌రికార్డర్ సహాయంతో మంజరి తన ఉచ్ఛారణను సరిదిద్దుకోవడానికి ప్రయత్నించేది. ఒక పదాన్ని వందసార్లన్న సందర్భాలు కూడా లేకపోలేదు.

ఈ తరహా శ్రమ మరచిపోయి ఆవిడ చాలా సంవత్సరాలయింది. అలసిపోయి, రవంత జారగిలబడగానే తన తొలిరోజులు మనసులో మెదిలేవి.. అప్పుడూ తనిలాగే డైలాగ్సును రిహార్సల్ చేస్తూ వుండేది.

"బొంబాయిలో నేను"ఆ ఆ"ల నుండి నా చదువు ప్రారంభిస్తున్నాను"అనుకొనేది మంజరి.

సంవత్సరంలో పూర్తవుతుందనుకొన్న ఆపిక్చరు ఇంకో ఏడాదికి పైగా దేకింది. అందుకు సగం కారణం తనేనని మంజరి నిష్పేచీగా వొప్పుకుంది.

ఆవిడపూర్తిగా బొంబాయిలోనే ఉండిపోవడానికి లేదు. తనుపనిచేస్తున్న పిక్చర్లు మద్రాసులో చాలా ఉన్నాయి. అలాగని-ఆ పిక్చరును కాడనడం మంజరికి బొత్తిగా ఇష్టంలేదు.

ఆపిక్చరు సగంలో వున్నప్పుడే బొంబాయి నిర్మాతలు ఆమెను బుక్‌చేయడానికి ముందుకొచ్చారు.

వారందరికీ మంజరి సవినయంగా ఒకేవొక సమాధానం చెప్పింది.

"నన్ను మన్నించండీ. మద్రాసులో నాకు ఊపిరి తిరగనన్ని పిక్చర్లున్నాయి. వాటినోదారి పట్టించిగానీ నేను మీకు మాటివ్వలేను".

❦❦❦❦❦❦❦❦

వంద తెలుగు సినిమాలు తెచ్చి పెట్టలేని కీర్తిని ఆ వొక్క హిందీ పిక్చరు తెచ్చిపెట్టింది మంజరికి.

"ఇందుకోసం నేను పడిన శ్రమను తలుచుకొంటే భయం వేస్తుందిప్పుడు. గొడ్డులాగా పనిచెయ్యడమంటే ఏమిటో అప్పుడే నేనర్థం చేసుకొన్నాను. అమానుషమైన శక్తులేవో నన్ను నడిపించి ఉండకపోతే ఈ పని నాకు సాధ్యమయ్యేది కాదు" అన్నది మంజరి.

ఫిలిం జర్నలిస్టులు ఆమె బొంబాయి అనుభవాలను గురించి రకరకాల ప్రశ్నలు వేశారు

"మన చిత్రాల్లోకన్నా, బొంబాయి వాటిల్లో ఫారెన్ ఇన్ఫ్లూయన్స్ ఎక్కువగా ఉంటుందనుకొంటాను. వాటిని చూసి, "ఇదీ భారతీయ సంఘం" అనుకోవడానికి లేదు. సంగీతంలో కూడా హాలీవుడ్ అనుకరణ హెచ్చుగా ఉంటుంది. అయినా బొంబాయికి నేను చాలా కొత్తదాన్ని నా అభిప్రాయాలు సరైనవో కావో చేనిప్పుడేమీ చెప్పలేను" అన్నది మంజరి.

"ఏ ఆర్టిస్టుల్లో టాలెంట్ బాగా ఉంటుందంటారు"? అన్నాడొక జర్నలిస్టు.

మంజరి క్షణకాలం ఆలోచించి సన్నగా నవ్వింది.

"మరీ నన్నంత నిగ్గదీసి అడక్కండి. టాలెంట్ ఉన్నవారు అన్నిచోట్లా ఉన్నారు. ఏ భావమూ పలకని ముఖాలు ఎక్కడైనా ఉంటాయి" అన్నదావిడ చాలా తెలివిగా తప్పుకొంటూ.

"హిందీ ప్రొడ్యూసర్లు ఇచ్చినంత డబ్బు మనవాళ్ళివ్వకపోవడానికి మీరనుకొంటున్న కారణాలేమిటి?" అన్నాడతనే.

"ఆ పిక్చర్ల కొచ్చినంత రాబడి మన కొస్తున్నదంటారా? నే విన్నదేమిటంటే ఎంత తుక్కు హిందీ పిక్చరయినా డబ్బు చేసుకొంటుంది. కనీసం పెట్టుబడి డబ్బుకయినా ఢోకా ఉండదు. కానీ తెలుగు ఫీల్డు అలా కాదు. "ఎ" క్లాసు సెంటర్సులో అథమ పక్షం పదివారాలు ఆడితేగానీ పెట్టుబడి రాదు. ఇవన్నీ మీకు తెలియనివిగావు" అన్నదావిడ.

"మీరిక బొంబాయిలోనే స్థిరపడదలుచుకొన్నారా?" అన్నాడింకో జర్నలిస్టు.

"మీరు అచ్చువెయ్యనంటే చెబుతాను" అన్నది మంజరి నవ్వుతూ

అందరూ "చెప్ప"మన్నారు.

"ఆ ఫీల్డులో నాకున్న స్థాన మెలాంటిదో ఇంకా తేలలేదు. మీరడిన దానికి "ఔ"నన్నానుకోండి; నా కిక్కడున్న పిక్చర్లన్నీ పోతాయి. "కా"దన్నా ననుకోండి; నాకు బోంబేలో చెల్లుబడి లేదంటారు. కాబట్టి బాబూ అలాంటి ప్రశ్నలు నన్నడక్కండి" అన్నది మంజరి.

ఒక మనిషి గౌరవాగౌరవాలు అతని బ్యాంక్ బ్యాలెన్సునుబట్టి నిర్ణయించినట్లే, ఒక పిక్చర్ మంచి చెడ్డలు, అది వసూలు చేసిన డబ్బును బట్టి నిర్ణయించవలసి ఉంటుంది.

ఆ దృష్ట్యా - మంజరి తొలిగా నటించిన హిందీ చిత్రం ఉత్తమోత్తమమైనదనడంలో సందేహం లేదు. సెన్సార్ బోర్డువారు అదృష్టవశాత్తూ దానికి "ఎ" సర్టిఫికెటిచ్చారు. బాక్సాఫీస్ బద్దలు కావడానికి అదొక్కటి చాలు.

చాలా పత్రికలు చిత్రంలో కథ బొత్తుగా లేదని రాసినమాట నిజమే కానీ మంజరి బాగా లేదన్న పత్రికొక్కటీ లేదు. అన్ని రకాల జనానికీ నచ్చాలన్న అభిప్రాయంతో, అందులో అన్ని రకాల నాట్యాలనూ గుత్తళం కింద అమర్చిపారేశారు. ఏ భాగానికాభాగం, ఎంత బావున్నదో అన్నిటికీ కలుపుకొని చూసినప్పుడు అంత వెకిలిగానూ ఉన్నది. మంజరి డాన్సులే లేకపోతే చిత్రం అన్నిరోజులు నడిచేది కాదు.

మద్రాసులో విడుదలయినప్పుడు, మంజరి సకుటుంబంగా వెళ్ళి ఆ చిత్రాన్ని చూసింది.

"నిన్ను చూస్తుంటే నాకొక్కోసారి ఆశ్చర్యం వేస్తుంది మంజూ! నువ్వుగానీ శాపం పొందిన దేవతవేమో ననుకొంటాను అప్పుడప్పుడు" అన్నది కళ్యాణి మధ్యలో.

మంజరి ముందుకు వంగి, కళ్యాణి చెంపలను పెదవులతో తాకింది మెత్తగా

"నువ్వీ మద్రాస్‌లో ఉండటం బావోలేదు మంజూ! నీకిది తగిన స్థలం కూడా కాదు. నా మాట విని బొంబాయికి వెళ్ళిపో" అన్నది కళ్యాణి.

"రానివ్వాలిగదా?" అన్నది మంజరి.

కళ్యాణి అప్పటికి ఊరుకొని, తరవాత దానికి సమాధానం చెప్పింది.

"రానివ్వదు. కానీ మనం వెడదాం, అదంతే!"

"నా మీద నీకింత అభిమానమెందుకు కల్యాణీ!" అన్నది మంజరి అర్థంగా.

"ఎందుకా? అవును. ఎందుకని మంజూ?"

మంజరి పలకలేదు.

ఆవిడ కేవేవో జ్ఞాపకాలొచ్చాయి. తను వెడుతున్నాననీ, మీరు పిక్చర్ చూసిరండనీ మిగతావారితో చెప్పి బయలుదేరింది.

"నేనూ వస్తున్నాను" అన్నది కళ్యాణి.

ఇంటిదాకా ఎవరూ పలకలేదు.

"నీకీ పూట ఏం కులాసాగా లేదనుకొంటాను. రేపొకసారి వస్తాను మంజూ! నీతో వో అరగంట మాట్లాడాలి" అన్నది కళ్యాణి.

"నాక్కూడా ఏదో బెంగగా ఉన్నదక్కా! అంతమంది జనంలో ఉన్నా వొంటరిగా ఉన్నానన్న ఫీలింగ్‌తో గిజగిజలాడిపోయాను. నన్నుక్కిరిబిక్కిరి చేసే కబుర్లేవన్నా చెప్పు" అన్నది మంజరి.

"అలాంటివేమీ నా దగ్గర లేవమ్మా!" అన్నది కళ్యాణి.

కానీ-

అంతకుమించినవే చెప్పింది.

"మనుషులంటే నాకు పరమాసహ్యం వేస్తోంది మంజూ! ఎవర్ని నమ్మాలో ఎవర్ని నమ్మకూడదో తెలీదు. ఎందుకలా నిమిషాల మీద మారిపోతారో అంతకన్నా తెలీదు. నాకు అధికారం లేదు గానీ, ఉంటే - వీరందర్నీ కట్టగట్టి ఊబిలోకి దించేద్దును మంజూ!" అన్నది కళ్యాణి.

"అలాగే చేద్దాం" అన్నది మంజరి తాపీగా.

"మనిషి మనిషిగా కాకుండా - కొన్ని కుక్క లక్షణాలతో వుంటే ఎంత బావుండునో అనుకొంటాను. ఈ చలపతిగాడు నీకేమన్నా అవుతాడా మంజూ?"

"ఏమవుతానంటున్నాడు?" అన్నది మంజరి నవ్వి.

"నిన్నేదో ఉద్ధరించేశానంటున్నాడు. తను లేకపోతే నువ్వనేదానివే వుండవట. నీకోసం తను చాలా చాలా త్యాగం చేశాట్ట. తనుగానీ తలుచుకుంటే నిన్ను మట్టిచేసిపారేయడం చిటికలో పనిట. ఈ వాగుడంతా నువ్వెలా సహిస్తున్నావో యెందుకు సహిస్తున్నావో నాకు తెలీదు. వాణ్ణి పంపెయ్యరాదు?"

"అలాగే పంపుదాం!"

"వాడెంతదాకా వచ్చాడంటే- నీకూ వసంతకూ మధ్య కూడా తంపులు పెట్టాడు. ఆవిడకేవో పిక్చర్లొస్తే నువ్వు పాడు చేశావుట. నీకన్నా వసంత పైకిరావటం నీకిష్టం లేదట. బొంబాయి నుండి

వసంత పాటలకోసం ఏదో కంపెనీవారు అడిగితే, నువ్వు కాదన్నావట. వీడేవో ఉత్తరాలు కూడా చూపి వారిని నమ్మించాడు'' అన్నది కళ్యాణి.

''పోన్లే అక్కాయ్! వాడి గుణం అలాంటిదీ!'' అన్నది మంజరి.

''నేను వాణ్ణనడం కాదు. మనవాళ్ళనంటున్నాను. చెప్పేవాడేదో చెబుతాడు-నమ్మడానికి మనకైనా బుద్ధి వుండాలి కదా!'' అన్నది మంజరి.

కళ్యాణి సోఫా మీద ఒక్క చరుపు చరిచింది.

''మరీ నువ్విలా మన్నుదిన్న పింజేరులా అయిపోతున్నావేమిటి మంజూ! కాస్తన్నా చురుకుదనం లేకపోతే యెలా?'' అన్నది కళ్యాణి.

''మనుషుల్ని గురించి మన మేమనుకోవడానికీ లేదక్కా!'' అన్నది మంజరి. ''రాజమణిగానీ, వసంతగానీ నా దగ్గర వుంటారనుకోను. ఉండాలని కూడా నేననుకోవడం లేదు. వసంతకు మంచి బుకింగ్స్ వున్నాయి. ఇక ఆపిల్ల బాగానే నెట్టుకొస్తుందనుకొంటాను''.

కళ్యాణి ఏమీ అనలేదు.

''మనం బాంబే పోదాం రారాదూ?''అన్నది మంజరి.

''నేనెందుకే నీకు బరువూ?''

''అలాకాదు. అక్కడ పిక్చర్లలో పనిచెయ్యడం ఓ కొత్త అనుభవం! అడుగడుగునా, ఎన్నో చిక్కులొస్తుంటాయి. ఒక్కోసారి ఊపిరి సలపదు. ఆ పద్మవ్యూహంలో ఇరుక్కొని, గిజగిజలాడిపోయి, బయటపడ్డప్పుడుండే ఆనందం-చాలా గొప్పగా వుంటుంది కళ్యాణి''అన్నది మంజరి. ''ఒకసారి చాలా చిత్రమైన సంఘటన జరిగింది. ఔట్‌డోర్ షూటింగ్ నుండి తిరిగొస్తున్నాం. మా యూనిట్‌తో సంబంధంలేని కొత్త మొఖం నాకు దోవలో కనిపించింది. నేనంతగా పట్టించుకోలేదు. అదేరాత్రి పదకొండింటికి ఎలానో అతను నా గది కొచ్చాడు. ఎందుకో చాలా భయమేసింది. ఎవ్వరూ లేరని రూఢీచేసుకొన్నాక అతనో చిన్నపని చేసిపెట్టమన్నాడు. ఎంత డబ్బయినా ఇస్తానన్నాడు''.

''చందూలాల్ గాడి మోస్తరుగా-వీడూ ఇంకేమన్నా-''అని నవ్వింది కళ్యాణి.

''అబ్బే కాదు''అంటూ ప్రారంభించింది మంజరి. ''ఫలానావాడు నీకు తెలుసు గదా అన్నాడు. వాడెందుకడుగుతున్నదీ నాకు అర్థంకాక తెలీదన్నాను. వాడో క్షణం ఆలోచించి, నేనబద్ధమాడుతున్నాననీ, అన్ని విషయాలూ తనకు తెలుసుననీ అన్నాడు. గమ్మత్తేమిటంటే, ఆ ఫలానావాడు యెప్పుడెప్పుడు నా దగ్గర కొచ్చిందీ యే సమయంలో ఏ నంబరు కార్లో వచ్చిందీ కూడా వాడు చెప్పాడు. సరే ఏమిటన్నాను. ఆ ఫలానావాడి నడిగి ఈ ప్రశ్నలకు జవాబులు తెలుసుకోమన్నాడు. కావాలని అడిగినట్లుండకూడదనీ, మాటవరసకు అడిగినట్లుగా ఉండాలనీ, ఖచ్చితమైన జవాబులు మాత్రం కావాలనీ అన్నాడు. వారంరోజుల్లో మళ్లా వస్తానన్నాడు. ఎడ్వాన్సుగా ఉంచమని ఇన్నినోట్లు ఇచ్చాడు. నేను వద్దంటుండగానే వాడెళ్లిపోయాడు. చాలాసేపటిదాకా నాకదంతా కలేమోననిపించింది. కానీ, బల్లమీద నోట్లు కనిపిస్తుంటే నమ్మకపోవడమెలా? మూడోరోజున పేపరు చదువుతుంటే, అదేదో దేశానికి చెందిన ఏజెంట్లు నలుగురు చిక్కారనీ, మిగతావారికోసం పోలీసులు వెతుకుతున్నారనీ ఉంది''.

‘‘వాడు మళ్ళా నీక్కనిపించాడా?’’అన్నది కళ్యాణి కళ్ళింత చేసుకొని.

‘‘లేదు. వాడొస్తే ఆ డబ్బు పారేద్దామని చాలా రోజులు చూశాను.కానీ రాలేదు. చివరికి అగ్గిపుల్లగీసి వాటిని అంటించేశాను’’అన్నది మంజరి.

‘‘బాగానే వుంది మేళం! అలాంటి పాడు గొడవల్లో నువ్వు చిక్కుకోకమ్మా!’’అన్నది కళ్యాణి.

‘‘ఇంకోసారి-’’అని ప్రారంభించింది మంజరి, సిగరెట్ యాష్‌ట్రేలో పడేసి సోఫాలో జారగిలబడుతూ. ‘‘ఎవడో బంతిలాగా వుండే మార్వాడీ వొకడూ, ఇంకో యూరోపియన్ నాదగ్గరకొచ్చారక్కా! ఆ మార్వాడీ నడుముకున్న బెల్టులోంచి ఓ డైమండ్ నెక్లెస్ బయటికి తీశాడు. చాలా బావుందది. మార్కెట్‌లో కొంటే డెబ్భయ్ డెబ్భయ్యయిదు వేలకు తక్కువ ఉండదు. నలభై ఇచ్చి తీసుకోమన్నాడు. నాకవసరం లేదన్నాను. అది దొంగసొమ్ముకాదనీ, ఆ యూరోపియన్ భార్యదనీ చాలా అవసరమొచ్చి అమ్ముకొంటున్నాడనీ మార్వాడీ చెప్పాడు. ఆగమంటే రెండు రోజులపాటు డబ్బుకోసం కూడా ఆగుతామన్నారు....కొందామని చాలా ఊగులాడాను...అయితే...అలా అవసరమొచ్చి, భార్య తాలూకు నగనట్రా అమ్ముకొనేవాడు, డబ్బుకోసం ఎందుకాగుతాడన్న అనుమానం లోపల పురుగులా తొలిచింది. నెమ్మదిగా వారిని శాంతపరిచి పొమ్మన్నాను...అది స్మగుల్డ్ నెక్లెస్...చిత్రమేమిటంటే-మూడురోజుల తరువాత, అదే నెక్లెసును నా కోస్టార్ వేసుకోగా చూశాను’’.

‘‘అలాంటి చోట మనం ఉండటం చాలా కష్టం మంజూ!’’అన్నది కళ్యాణి.

‘‘కష్టమేగాని, అలా ఉండడంలో ఉన్న థ్రిల్లింగ్‌ను ఎంజాయ్ చెయ్యాలంటే అదొక్కటే మార్గం; నాకలాంటి బతుకు బతకాలని ఉన్నది కళ్యాణీ! జీవితంలో వేగం, వెరైటీ, డిసప్పాయింట్‌మెంట్, ఎఛీవ్‌మెంట్-చాలా ఫోర్స్‌బుల్‌గా ఉండాలి. లేకపోతే రుచీపచీ ఉండదు. ఏమంటావక్కాయ్!’’అన్నది మంజరి.

కళ్యాణీ ఏమీ అనలేదు.

‘‘మనం కలిసి కూచుని ఇంతసేపు మాట్లాడి ఎన్నిరోజులయిందో అక్కా! నేను బొంబే నుండి కొద్దిగా షాంపేన్ పట్టుకొచ్చాను, చూద్దువుగాని’’.

మంజరి బెల్‌నొక్కింది. కొద్దిగా తెర తొలగించి తాయారు వచ్చింది.

‘‘చూడమ్మా తాయీ! మధ్యాహ్నం నువ్వు ఫ్రిజ్‌లో ఉంచావే-’’

తాయారు అయిదునిమిషాలకల్లా ట్రేతో వచ్చింది.

‘‘వసంత వాళ్ళొచ్చారా?’’

‘‘రాలేదండమ్మాయిగారూ?’’అన్నది తాయారు.

‘‘ఎవర్నీ రావద్దను. అరగంటయ్యాక భోజనం పట్టుకురా’’.

ఇంకేదన్నా చెబుతుందేమోనని, ఓ పావు నిమిషమాగి మరీ వెళ్ళిపోయింది తాయారు.

మంజరి గ్లాసులు నింపింది.

కళ్యాణి ‘సిప్’ చేసి, పెదవులు, జేబుగుడ్డతో అద్దుకొంది.

కిటికీల్లోంచి చల్లని గాలి ఊడ్చి కొడుతున్నది.

‘‘వానొచ్చేటట్లుంది మంజూ!’’

''రానివ్''.

మంజరి సిగరెట్ వెలిగించి, గాజు తలుపులు బిగించింది.

''నువ్వేమనుకో అక్కాయ్! బతికిన నాలుగు రోజులు జాలీగా బతకాలి. ఎడాపెడా సంపాదించాలి. చిల్లపెంకుల కింద విరజిమ్మాలి. నిర్దాక్షిణ్యంగా డబ్బు పిండి పారెయ్యాలి. పాపం, పుణ్యం, దయాదాక్షిణ్యం-ఇవన్నీ అర్థంలేని మాటలు....హాయిగా తిని, ఇష్టం వచ్చింది తాగి, నచ్చినవాడితో గంటల్ని సెకండ్ల కింద మార్చేసుకొని గడిపెయ్యాలి. అవునా అక్కా?''

కళ్యాణి,మరో గుక్క పీల్చి గ్లాసును ట్రేలో ఉంచింది. అద్దంలోంచి ఆకాశం ఆ కొస నుండి వెలుగుతో చీలికలయిపోవడం కనిపిస్తోంది. ''టప్ టప్''మంటూ వర్షపు చినుకులు అద్దాన్ని తడుముతున్నాయి.

మంజరి సన్నగా నిట్టూర్చి, సిగరెట్‌ను దూరంగా గిరాటెట్టింది.

''మనం కావాలనుకొన్నవన్నీ దూరమయి, అవసరంలేనివి, మన చుట్టూ పేరుకుపోతున్నాయి కల్యాణీ! ఇష్టమొచ్చింది తింటే వొళ్లు పాడయిపోతుందని భయం. తృప్తిగా పుచ్చుకుంటే గొంతు పాడయిపోతుందని భయం. నచ్చినవాడు సరే-అసలా ఆలోచన వస్తేనే ఆసహ్యంతో మనస్సు విలవిలలాడిపోతుందని-వెక్కసమయ్యేంత శరీర సుఖం అనుభవించాం. రొమాన్స్ అనేది యాక్షన్ కిందికి మారిపోయింది. నిజమనేది మర్చిపోయాం''.

బయటవాన హెచ్చింది. కిటికీ అద్దాలమీద నీళ్లు ధారాపాతంగా పడుతున్నాయి. అప్పుడప్పుడు గుండెలు కుదిపిళ్లుపడేలా ఉరుములు.

''ఏదో నాకు తెలీడం లేదు...నేను చెప్పలేకపోతున్నాను...అదేదో లోపించింది మనకు. ఒంటరిగా వున్నప్పుడు, ఎవరో మన గుండెల్లో నించి ఏదో కావాలని ఎలుగెత్తి అరుస్తున్నట్లుంటుంది. అసంతృప్తితో, అశాంతితో ఒళ్లంతా సలసలలాడిపోతుంది. వీటన్నింటికీ దూరంగా జరిగి, నిద్రపోదామంటే-శాపం పెట్టినట్లుగా కునుకురాదు. రోజూ ఇన్ని మాత్రలు మింగి అలా రెప్పలు వాల్చవలసిందే తప్ప-అందుకనే-ఉన్న నాలుగురోజులూ జీవితాన్ని పిండుకొని అనుభవించాలంటాను. ఇంకా కొత్త-అదేమిటి అక్కాయ్ అలా చూస్తావేమిటి? అరె!''

కళ్యాణి చూస్తున్న దిక్కుకే మంజరి కూడా చూసింది. కిటికీ అద్దానికి అవతలవేపు ఓ ముఖం కనిపించింది. వాననీరు ఆ ముఖం మీదుగా చారికలుచారికలుగా ప్రవహిస్తున్నది. ఆ కళ్లు నిశితంగా చూస్తున్నాయి.

మంజరి కెవ్వుమని అరిచి కళ్లు మూసుకొంది.

మరుక్షణంలోనే వెనుక తలుపులు రెండూ తెరుచుకొన్నాయి.

తాయారు కూడా అద్దాని కానుకొని వున్న ఆ ముఖాన్ని చూసింది. దాని గుండెలు జివ్వు జివ్వుమన్నాయి. అదేదో చెయ్యబోయింది. ఆ ముఖం అద్దం వెనుక నుండి మాయమయింది. కళ్యాణి కొంతసేపటికి కోలుకొన్నది గానీ, మంజరి తేరుకోవడానికి ఇంకా చాలాసేపు పట్టింది. కళ్లు తెరిచి ఓసారి కిటికీ కేసి చూసి, చుట్టూ అందర్నీ కలియచూసి, సన్నగా నిట్టూర్చింది మంజరి.

''ఇక నేను వెడతాను మంజూ!''అని కళ్యాణి లేచింది.

మంజరి చాలా నీరసపడిపోయింది. ఆవిడ ముఖం లంకణాల రోగి ముఖంలా పాలిపోయింది. భయచ్ఛాయలు ఆమె కళ్లల్లో ఆ్రాడుతున్నాయి. పెదవులు తడుపుకొని, ఓగుటక మింగి పమిటతోనే ముఖం అద్దుకొన్నది మంజరి.

కళ్యాణి లేచి నుంచున్నది.

''అదూమిటక్కాయ్! నువ్వీ దశలో నన్నొదిలిపోవడం భావ్యమేనా? నా మనస్సేమీ బావోలేదు. ఏదో భయం నన్ను పట్టుకొంది. ఊఁహు. ఇక్కడే ఉండిపోవాలి''అని పట్టుపట్టింది మంజరి.

''కాదమ్మా! నేను వెడతాను''.

మంజరి ఓక్షణం కళ్యాణి కళ్ళల్లోకి చూసింది.

''ఆ ముఖం-ఆ ముఖం నీకు తెలుసా కళ్యాణీ?''అన్నది మంజరి భయం భయంగా.

''ఎవరు? అతనా? నాకా?''అని నవ్వింది కళ్యాణి. ''లేదమ్మా మంజూ! నేనేక్కడా చూడలేదు. అతనెవరో కూడా నాకు తెలీదు''.

''మరలా ఆశ్చర్యపోయావేం అక్కాయ్? నువ్వెడక్కడన్నా చూసి ఉంటావేమోనను కొన్నానే!''అన్నది మంజరి.

కళ్యాణి అదోలా నవ్వింది.

''నువ్వెంత పిచ్చిదానివే మంజూ!అర్థరాత్రి వేళ, మనమెన్నడూ చూడని ముఖం కిటికీలో కనిపిస్తే-ఎవరైనా భయపడరా? ఆ సమయాన నిన్ను చూస్తే అతనెవరో నీకు తెలుసునేమో ననిపించింది. తెలిసినవాడైనప్పుడు మామూలు దోవనరావచ్చుగా? వాడేదో దొంగతనం కోసమే వచ్చి ఉండాలి...ఏదైనా నువ్వు జాగ్రత్తగా ఉండు మంజూ! మరి...మనం రేపు కలుసుకొందాం''అని బయలుదేరింది కళ్యాణి.

''పోక తప్పదంటావా అక్కాయ్?''

''ఊఁ''

మంజరికేదో ఆలోచన వచ్చింది. కింద పెదవిని సున్నితంగా కొరుక్కుంటూ ''పోనీ! ఓనిమిషం ఉండు అక్కాయ్! నేనూ వచ్చేస్తాను. ఇద్దరం కలిసి, మీ ఇంటికే వెడదాం''అన్నది మంజరి.

కళ్యాణి పెద్దగా నిట్టూర్చి తలుపుకు జారగిలబడిపోయింది.

''నువ్వూ వస్తావా?''అన్నది కళ్యాణి. కాస్సేపటిదాకా, ఆవిడ కళ్లుమూసుకొని ఆలోచించింది. తరువాత తల అడ్డంగా తిప్పుతూ, ''వొద్దమ్మా! నా మాట విను. రేపు మనం కలుసుకొందాం. నువ్వొక్కదానివీ పడుకోకు అన్నిరోజులూ మనవిగావు...అవునుగాని మంజూ! ఆముఖాన్ని నువ్వు చూసే ఉంటే-ఎప్పుడు చూశావో, ఎక్కడ చూశావో చెప్పగలవా?''అన్నది.

''ఆఁ'' అన్నది మంజరి.

కళ్యాణి ఆత్రుతగా మంజరికేసి చూసింది.

''ఎక్కడమ్మా మంజూ?''

''ఆ మాట చెప్పొచ్చునో లేదో నాకు తెలీదు....''అని మెల్లగా గొణిగింది మంజరి. తరువాత జుట్టులోకి వేళ్లు పోనిచ్చి, కుదుళ్లను బలంగా కుదుపుకొన్నది. ''నువ్వడిగావు గనక చెబుతున్నానక్కాయ్! అతను నాకు తెలుసు. బాంబేలో ఉండగా-ఎవరో నా దగ్గరకొచ్చారీ, ఇంత డబ్బు పడేసి, ఫలానా

ప్రశ్నలకు ఆన్సర్లు తెలుసుకోమన్నాడనీ ఇంతకు ముందే మనం చెప్పుకొన్నామే-''

మంజరి వాక్యం పూర్తిచెయ్యకముందే, కళ్యాణి కళ్లు చావుభయంతో నిండిపోయాయి. మహెూద్రేకంతో ఆవిడ కంపించిపోతున్నట్లనిపించింది.

''మనం రేపు కలుసుకొందాం మంజూ! ఉదయం ఇంకేపనీ పెట్టుకోకు. ఎనిమిదీ, ఎనిమిదిన్నరకల్లా వచ్చేసెయ్యి''అన్నది.

ఆవిడ మెట్లు దిగడం సజావుగా లేదు.ఎవరో బలవంతాన కిందికి తోస్తున్నట్లుగా దిగుతున్నది. ఇంకాస్సేపటికి నీళ్లను చిందుకొడుతూ కళ్యాణి కారుపోవడం మంజరి చూసింది.

ఆవిడ తలంతా హెూరుతో నిండిపోయింది. రకరకాల ఆలోచనలు ఒకదానితో వొకటి కలిసిపోయి చిరాకెత్తిస్తున్నాయి. అరగంట కిందటి ఆనందమంతా ధ్వంసమయిపోయింది. చెప్పరానంత బెంగ, దిగులు ముసురుకొని, ఊపిరాడకుండా నొక్కిపారేస్తున్నట్లనిపించింది మంజరికి.

మరి కాస్సేపటికల్లా చలపతీ, రాజమణీ వచ్చారు. వాళ్ళొస్తున్నారని మంజరికి అల్లంత దూరం నుండే తెలుసు.

''అద్భుతం, ఆశ్చర్యం! నా జన్మలో ఇలాంటి పిక్చర్ చూడలేదు బాబూ!'' అంటోంది రాజమణి.

''ఈ దెబ్బతో హిందీ స్టార్సంతా పోలోమంటూ ఖాతాలు క్లోజ్ చెయ్యాలిసిందేనండీ రాజమణిగారూ! సౌతిండియా దెబ్బంటే ఏమిటనుకొన్నారు? మంజరి హిందీ మార్కెట్‌ను బీట్ చేసిపారేసింది!'' అన్నాడు ఉత్సాహంగా.

''భోం చేశావా అమ్మాయ్?''

మంజరి పలకలేదు.

''హాట్సాఫ్ మంజరీ!''అన్నాడు చలపతి, ఆవిడకు దూరంగా వున్న కుర్చీలో కూర్చుంటూ. ''నేను న్యూస్ అయితే చదువుతున్నమాట నిజమేగానీ, పిక్చర్ అంత ట్రమెండస్‌గా ఉంటుందని అనుకోలేదు. నువ్వు దానికి ప్రాణం పోశావు మంజూ! ఈ మాట నేననడం కాదు-ప్రెస్ గాలరీ మొత్తం ఇలానే అన్నది. ఒకతను-ఆర్ముగం అనుకొంటాను-నిన్ను మార్లిన్ మన్రోతో పోల్చాడు''.

''అలాగా!''అన్నది మంజరి చాలా తాపీగా.

''ఆవిడ ఇంగ్లీషు సినిమాల్లో మంచి పేరు తెచ్చుకొన్న స్టారటగా మంజరీ! ఆర్ముగమేకాదమ్మా-వాడి వెనక్కాతల ఇంకెవరో కూచుని వున్నాడే-వాడేదో ''టెంపుల్‌టెంపుల్''అన్నాడమ్మాయ్!''అని రాజమణి అందుకొన్నది.

''యస్ మేడమ్! షెర్లీ టెంపుల్ అని ఇంకో బ్రహ్మాండమైన హాలీవుడ్ స్టార్ వుండేది. ఆవిడతో నిన్ను పోల్చడమంటే మజాకా కాదు. ఇదేదో మొఖమాటం కోసం అన్న మాటలు కావు. నిజంగా మీ యాక్షన్ అంత గొప్పగానూ వుంది''.

''చాలామంది ఇదేమాటలన్నారమ్మాయ్!''అన్నది రాజమణి. ''నువ్వప్పుడు పడిన కష్టాలన్నీ తలచుకొంటే ఎందుకొచ్చిన పీడాకారం బాబూ అనిపించింది గానీ-మరి ఏ శ్రమా పడంతే ఇంతమంది మెచ్చుకొంటారా?''

''నువ్వొప్పుకుంటే మనమోపని చేదాం మంజరీ''అన్నాడు చలపతి.

అతను ''నువ్వు'' అనడమూ, ''మంజరి''అనడమూ, దగ్గరకొచ్చేందుకు ప్రయత్నించడమూ ఆవిడ గమనించింది అతన్ని హడలగొట్టి దూరంగా తరిమెయ్యడం నిమిషాల్లో పని. కానీ-అలా చెయ్యడానికి మంజరికి ప్రాణం వొప్పలేదు.

''ఏమిటది?''అన్నది మంజరి.

''నువ్వు భోజనాలు వడ్డించవే తాయారూ!''అని కేకేసింది రాజమణి.

''నేను వెళ్ళనా?''అంటూ చలపతి లేచాడు.

''ఉండండి బాబూ! అందరం కలిసి కూచుని భోజనం చేదాం''అని ఏర్పాటు చేసింది రాజమణి.

ఆ ''మతలబు'' మంజరికి తెలియదనుకోవడం భ్రమ. రాజమణీ, చలపతి అంతదూరం నుండి తన పిక్చరును గురించి పొగుడుకొంటూ వస్తున్నప్పుడే -ఏదో ఉన్నదనుకొన్నది మంజరి. అప్పటికప్పుడే కుండ బద్దలుకొట్టినట్లు మాట్లాడుదామనుకొంది. అంతకు ముందు కళ్యాణి చెప్పిన మాటలు చెవుల్లో గింగురుమంటున్నాయి. బుసాబుసా పొంగుతున్న అసహ్యాన్ని లోలోపలే అణిచేసుకొని, చాలా మామూలుగా ప్రవర్తించింది మంజరి.

అందరూ భోజనాకుపక్రమించారు.

''ఇందాక మీరేదో పనిచేదామన్నారే-ఏమిటి బాబూ అది?''అని ఉప్పు అందించింది రాజమణి.

''ఈ కూర మాచెడ్డ రుచిగా చేశావు తాయారూ!''అని ఓ సర్టిఫికెట్ తాయారు మొఖాన పారేశాడు చలపతి. ''ఏమిటంటే రాజమణిగారూ! మనకిప్పుడు హిందీఫిల్మును గురించిన చింతలేదు. ఆ ఇండస్ట్రీ ఇవ్వాళో రేపో మనకాళ్లముందు సాష్టాంగపడి తీరుతుంది. ఎందుకని? అని అడక్కండి. ఈ పిక్చర్ అలాంటిది. ఇరవై తుక్కు పిక్చర్లు ఇవ్వని కీర్తిని ఈ నర్తకి పిక్చరు మనకు తెచ్చిపెట్టింది''.

''కానీ బాబూ! దీనివలన మనకొచ్చిన డబ్బు చాలా తక్కువే గదా! పడిన శ్రమకు తగిన ఫలితం లేనప్పుడు మనం మాత్రం ఆ ఇండస్ట్రీలో ఎందుకుండాలంటారు?'' అన్నది రాజమణి.

''మీరన్నది పూర్తి నిజంకాదు. మీకింకా సినిమా ఇండస్ట్రీని గురించి ఏమీతెలీదని దీన్ని బట్టి నేననుకొంటున్నాను. సినిమాల్లో డబ్బు రావడమన్నది-చేసిన పనిని బట్టి ఉండదు; నీకున్న కీర్తిని బట్టి ఉంటుంది. ఓ మామూలు కారెక్టరును ఓపెద్దస్టార్ చేసి, ఇరవై వేలు పుచ్చుకుంటే, అదే వేషం ఓ ఎక్స్ట్రాకిచ్చి, రెండొందలు చేతిలో పెడతారు. పనిచెయ్యడంలో ఇద్దరూ ఒక్కటే! ''ఇదేం పాప''మనకండి. అదంతే; అలాగే-ఈ ఫస్టు పిక్చర్ వల్ల మంజరిగారికి గిట్టింది చాలా స్వల్పమేనంటున్నారు మీరు. పీడాబోయంది. ఈసారి-దీనికే ముబ్బడిగా తీసుకొనిగానీ మేం కంట్రాక్టుమీద సంతకం చెయ్యం. సరా?''అన్నాడు చలపతి.

''అంత రేటు మేం భరించలేమని ఏ ప్రొడ్యూసరూ రాడనుకోండి! అప్పుడేమిటి మరి?''అన్నది రాజమణి.

చలపతి పొలమారేంతగా నవ్వాడు. ఆ ఉదుటు తగ్గడం కోసం గ్లాసు మంచినీళ్లు తాగి, గర్రున తేన్చాడు.

''అదిగాదమ్మా! ఈప్రొడ్యూసర్లున్నారే-మనల్ని ఉద్ధరించడానికి బుక్ చెయ్యరు. మనం ఉంటే పదిరూపాయలొస్తాయన్న నమ్మకం వారికుండాలి. అప్పుడే పాటికి పదిసార్లు మనచుట్టూ తిరుగుతారు.

వేషమిస్తారు. మనం చెప్పినట్టల్లా వింటారు. మీరన్నట్లుగా-ఏ హిందీ ప్రొడ్యూసరూ మంజరిని బుక్ చెయ్యడనుకోండి. అందువల్ల నష్టపోయేది వారేగానీ మనం కాదు. బింకానికిపోయి, లక్షలు వొదులుకొనేంత తెలివితక్కువ సన్యాసి-పిక్చర్‌ను ప్రొడ్యూస్ చేస్తాడనే మనం అనుకోకూడదు. అదీగాక-మనమైనా ఎబ్‌నార్మల్ రేట్స్ చెప్పడం లేదు. హిందీ టాప్‌రాంక్ స్టార్స్ తీసుకొంటున్న రేటే మనకూ ఇవ్వమంటున్నాం. వాళ్లయితే నీకు కాల్‌షీట్సివ్వరు. మనమలాకాదు. ప్రొడ్యూసర్‌కు ఇబ్బంది లేకుండా మనం ఎడ్జస్టు చేసుకుంటాం.  అదీ సంగతి....ఇదిగో...తాయారూ! ఇంకో గ్లాసు సూపు పట్రా!''అని కేకేశాడు చలపతి.

రాజమణి సాభిప్రాయంగా తలపంకించి మంజరికేసి చూసింది. ఆవిడివన్నీ వింటున్నదో లేదోనన్న అనుమానం రాజమణిక్కలిగింది. ఎందుకంటే, ఆ సంభాషణతో ఎంతమాత్రం నిమిత్తం లేకుండా, ఓ కార్జం ముక్కను ఫోర్కుకు గుచ్చి మెల్లగా కొరుక్కుతింటోంది మంజరి.

''ఇన్నటికీ అసలు సంగతి నేనుచెప్పనేలేదు''అన్నాడు చలపతి.

''ఏదీ? నేను చచ్చిపోతే-మధ్యలో మీ మాటలకు నేను అడ్డొస్తుంటినిగా-మీరేమో-అదేదో పని చేస్తే బాగుంటుందన్నారు. ఏ పనిచేస్తే బావుంటుందో, దాన్నెలా చెయ్యాలో మీరే చెప్పుకురండి. మనకు గనక నచ్చిందా-అమ్మాయి చేసిపారేస్తుంది, లేదనుకోండి-మనం నష్టపోయేదేమీ ఉండదు''అన్నది రాజమణి.

''ఏమిటంటే-'' అని ప్రారంభించాడు చలపతి. ''ఫారెన్ ఎంబసీస్ మనదేశంలో చాలా ఉన్నాయి. ముఖ్యంగా వాళ్ల ఆఫీసులన్నీ ఢిల్లీలో ఉంటాయి. అవిగాక పెద్దపెద్దసిటీల్లో, వారి కాన్సలేట్స్ ఉంటాయి. ఆ కాన్సలేట్ జనరల్‌ను మనం పట్టుకోవాలి''.

''ఎందుకండీ?''అన్నది రాజమణి.

''ఆ పాయింటుకే వస్తున్నాను....అంతర్జాతీయ సౌభ్రాతృత్వ సంఘం వారు సాంస్కృతిక వినిమయ కార్యక్రమం కింద ఒకదేశంలోని కళాకారులు మరోదేశంలో కొంతకాలం పాటు పర్యటనలు జరపడానికి ఏర్పాటు చేస్తున్నారు. అలాగా కొన్ని కల్చరల్ డెలిగేషన్స్ మనదేశం ఉండి ఫారెన్ వెళ్ళొచ్చాయి. ఆ డెలిగేషన్‌లో ఎవరెవరు ఉండాలో నిర్ణయించేది కేంద్ర ప్రభుత్వమే అయినా-ఎండాసిడర్‌ల సలహాలు కూడా వింటారు. అతను సెంట్రల్‌కు నచ్చచెప్పొచ్చు కూడాను. అలాంటి ఛాన్స్ దొరికిందనుకోండి...''అని మంజరికేసి చూశాడు చలపతి.

మంజరి యధాప్రకారం తనపనేదో తను చేసుకుపోతోంది.

''ఫారెన్ వెళ్ళేందుకు మనం ఇంకోరిని దేబిరంచడమెందుకండీ! మనమంత గతిలేక ఛస్తున్నామా? మనమంతట మనమే పోదాం కావలిస్తే''అన్నది రాజమణి.

''పోలేమని నేనొక్కనాటికీ అనను. కానీ, ఓ విదేశీ ప్రభుత్వం మన గడపదగ్గరకొచ్చి, బొట్టు కాటుకా పెట్టి, మనల్ని పిలవటం వేరూ! మనమంతట మనమే చేతి చమురు వదిలించుకొని ఇతర దేశాలకు వెళ్లడం వేరూనూ!''అన్నాడు చలపతి.

మంజరి గొంతు సరిచేసుకొని చలపతివేపు చూసింది.

''మీరిలా- అరచేతిలో వైకుంఠం చూపించే కబుర్లు చెప్పకండి. నేను మాటల మనిషిని కాను.

ఎందుకూ కొరగాని చెత్తవాగుడును నేను ఛస్తే భరించలేను. ఇప్పుడు మీరన్న వాటిల్లో ఏ పనీ మీవల్ల కాదని నాకు తెలుసు. అయినప్పుడు ఎందుకలా అవాకులూ చెవాకులూ పేలడం? పిచ్చిముండగనుక రాజమణి నోరలా వెళ్ళబెట్టి వింటోంది గానీ-''

మంజరి వాక్యాన్ని అక్కడితో ఆపింది.

ఆ మాటల వెనుక దాక్కున్న మనస్తత్వాన్ని చలపతి పసిగట్టేశాడు. తనను రెచ్చగొట్టి, తనచేత ఆ పనులన్నీ చేయించుకొనేందుకే మంజరి అలా నిష్ఠూరంగా మాట్లాడిందని అతనికి గట్టిగా తెలుసు. ఐతే ''ఈ పని చెయ్యిబాబూ! అని మామూలుగా అడగడానికి మంజరికున్న అభిజాత్యం అడ్డొచ్చింది గనక, అలా డొంకబాటన వచ్చిందని చలపతికి తెలుసు. తనకిదో మంచి అవకాశమే! మంజరికీ తనకూ మధ్యగల ఎడాన్ని ఈ సందర్భంలో తను తగ్గించుకోవచ్చు. భగవంతుడి దయవల్ల ఈ పనులు చేయగలిగితే!

''చూశావా అక్కాయ్, మనవాడి ప్రతాపం?''అని పకపకలాడిపోయింది మంజరి. ''అన్నీ ఇలాగే ఉంటాయనుకో. నేను గనుక మరో అరగంటదాకా ఊరుకొంటే- ఈసరికి చంద్రమండల ప్రయాణాలను గురించి మన చలపతి మాట్లాడుతుండేవాడు. నేనొక్కటే సంగతి చెబుతున్నా నక్కాయ్-జాగ్రత్తగా విను. నీకీ సంగతి తెలీంది కాదనుకో-ఏమిటంటే, చేతిగానివాడికి మాటలెక్కువ. చెల్లనిరూపాయికి గీతలెక్కువ. అంతేననుకో''అన్నది మంజరి.

''మిమ్మల్నెలా నమ్మించడమో ఆలోచిస్తున్నాను. అసలు మనకీ ఆలోచన వచ్చి ఇంకా గంటన్నా కాలేదు. ఇప్పటికప్పుడే ''నన్ను ఇంగ్లండ్ పంపించండో''అంటే నావల్లకాదు. మనం దానికోసం ప్రయత్నించాలి. అంతో ఇంతో ఖర్చుచేయాలి. అవసరమయితే ఢిల్లీలో ఓ నెలరోజులు మకాం పెట్టాలి. ఏవో తంటాలు పడాలి. ఇన్ని జరిగితేనే గానీ, వ్యవహారం పూర్తికాదు. వీటికి మనంసిద్ధంగా ఉన్నామో లేదో కూడా తేల్చుకోవాలి. ముందాసంగతి చెప్పండి!''అన్నాడు చలపతి.

''డబ్బు సంగతి సరే! నీ ఇష్టం వచ్చినంత వాడుకో, అయినప్పటికీ ఆ పని నీవల్ల కాదని నేను స్టాంపు మీద రాసిస్తాను. ఇంద-ఇదిగో చెక్‌బుక్. నీకెంతకావాలో రాసుకో, నేను సంతకం చేస్తాను''అన్నది మంజరి కోపమూ, నవ్వూ కలగలిపి.

చలపతి బల్లమీద చరిచాడు.

''దీన్ని నేనో ఛాలెంజికింద తీసుకొంటున్నాను మంజరీ! నేను చేపట్టిన పనులేవీ ఇంతవరకు ఫెయిల్ కాలేదు. ఇదీకాదు. నా గ్రహచారం బాగుండక-నేనీపని చెయ్యలేకపోయే పక్షంలో ఈ పరిశ్రమ నుండి తప్పుకొని, సన్యాసం పుచ్చుకొంటాను''అన్నాడు.

''దట్స్‌గుడ్''అన్నది మంజరి.

చలపతి ఇంకోమాట కూడా అందామనుకొన్నాడు-''చెయ్యకపోతే సన్యాసినవుతాను సరే; ఒకవేళ చేస్తే-అప్పుడేమిటట?''అని అందామనుకొన్నాడు కానీ, అంతదూరం వెళ్ళడం అతనికే ఆరోగ్యమనిపించలేదు.

''మొత్తానికి మా మంజరి ఇంగ్లండు వెళ్ళడం ఖాయమేనన్నమాట!''అన్నది రాజమణి.

''ఇంగ్లండు కాదు-పోతే అమెరికా వెళ్లాలి. అక్కణ్ణించీ యూరోపియన్ కంట్రీస్ చూసుకొంటూ

జపాన్ , బర్మా, ఇండోనేషియాల మీదుగా ఇండియాకు రావాలి''అన్నాడు చలపతి.

''పోన్లెండి, మీ ధర్మమా అంటూ కలలు గనడానికి మంచి సబ్జెక్టు సజెస్ట్ చేశారు. థాంక్స్!''అన్నది మంజరి.

బయట సన్నగా తుంపర, మళ్ళా మెరుపులు ప్రారంభమయ్యాయి. దాంతో ఇందాకటి సంఘటన మనస్సులో మెదిలి, కుదిలించుకుపోయింది మంజరి.

''పొద్దుపోయిందక్కా, వెళ్లిపడుకోరాదూ!''అని రాజమణిని పంపేసింది మంజరి.

చలపతి కూడా లేచాడు.

''ఉండండి. పోదురుగాని, మీతోకాస్త పని ఉంది. ముందా తలుపు దగ్గరకు వేసిరండి!''అన్నది మంజరి.

రాజమణి వెళ్లినవేపు చూసి, తలుపు దగ్గరగా నొక్కి గడియవేశాడు చలపతి.

మంజరి ఓ సోఫాలో జారగిలపడుకొంది. చలపతిని ఎదురుగా కూచోమంది. తనో సిగరెట్ అంటించింది. చలపతికొకటిచ్చి వెలిగించమంది. ఇదంతా దేనికో తెలీక చలపతి మల్లగుల్లాలు పడుతున్నాడు.

''పర్వాలేదు. అంటించుకో''అని భరవాసా యిచ్చింది మంజరి.

అయినా చలపతి సిగరెట్ వెలిగించలేదు.

''అన్నట్లు-వసంతేదీ? నేనిందాకే అడుగుదామనుకొన్నాను గానీ, మాటల మధ్యలో మరచిపోయాను''అన్నది మంజరి.

చలపతి పలకలేదు.

''మీరు ముగ్గురూ కలిసిరాలేదా?''

''వచ్చాం''అన్నాడు చలపతి.

''మరి?''

''మధ్యలోనే రామకోటి కనిపించాడు. వసంత దిగి వెళ్లిపోయింది...ఇదేమీ కొత్తసంగతి కాదే!''అన్నాడు చలపతి.

''మీకు. కానీ నేనిప్పుడే వింటున్నాను''అన్నది మంజరి.

''రమారమిగా ఏణ్ణర్థంపై చిల్లర నుండీ ఇదిలానే జరుగుతోంది. దీనిక్కూడా బహుశా నువ్వే కారణం కావచ్చు. ఆ హిందీ పిక్చర్ వ్యవహారం లేకపోయినట్లయితే-నువ్విక్కడే ఉండే దానివి. వసంతకు ఏ పిక్చర్‌లోనన్నా ఛాన్సు లిప్పించేదానివి. నువ్వు లేకపోవడంతో వసంతకేమీ పాలుపోయింది కాదు. నువ్వున్నప్పుడు ''సరే''నన్నవారు కూడా, తరువాత వీల్లేదనడం సాగించారు''అన్నాడు చలపతి.

''అందుకని మీరీ ఏర్పాటు చేశారన్న మాట?''అన్నది మంజరి.

''నేను చేయడం కాదు మంజరీ! అసలీ వ్యవహారంలో నేను నిమిత్తమాత్రుణ్ణి. రాజమణి అస్తమానూ నా చెవికింద సణగసాగింది. వసంత గొడవ సరేసరి. దీనికితోడు ఆ శర్మగారొకడు. ఎవరెవర్నో తీసుకువచ్చి వసంతకు పరిచయం చేయడం, వాడు పాడిస్తామనడం, ఈ పిల్లవాళ్లతో హెూటళ్లలో ఉండిపోవడం-ఇదీ తంతు, ఇలాకలిపేసి, ఆ శర్మ ఏమన్నా డబ్బులు వడుక్కునేవాడేమో

నాకు తెలీదుగాని పనిమాత్రం జరగలేదు. ఆఖరుకు రామకోటి కలిశాడు. ఇలాఇలా సంగతని చెప్పాను. మనిషిని చూడనివ్వమన్నాడు. వసంతను వాడికి పరిచయం చేసింది నేనే! ఒకవేళ నేనాపని చెయ్యకపోతే, వసంత తనే స్వయంగా వెళ్ళి రామకోటిని కలుసుకునేది. ఎందుకంటే-రామకోటికి ఈ ఇండ్రస్టీ మీద మంచి ఇన్ఫ్లూయన్స్ ఉన్నదని వసంతకు తెలుసు. ఆ పలుకుబడిని వసంతకోసం రామకోటి ఉపయోగించాడు. తనను బుక్ చెయ్యడానికొచ్చిన ప్రతికంపెనీతోనూ, రామకోటి మన వసంతను కూడా బుక్ చెయ్యమనేవాడు. అలా అయితేనే తను ఎగ్రిమెంట్ చేస్తాననేవాడు. వసంతలాగా -ఆ మాటకొస్తే, ఆవిడకన్నా బాగాపాడగలిగిన ఆర్టిస్టులు చాలామంది వున్నారు. కాని, రామకోటి వంటి కామెడియన్ ఇంకోడు లేడు. అంచాత ''దేవుడా''అంటూ ప్రొడ్యూసర్లు వసంతను కూడా బుక్ చేస్తున్నారు''.

''వెరీగుడ్''అన్నది మంజరి.

బయట ఆకాశం మండిపోతున్నట్లు ఒకటే మెరుపులు.

కొద్దినిమిషాలు ఎవ్వరూ పలుకలేదు.

''నేను పోనా''అన్నాడు? చలపతి ఆ నిశ్శబ్దాన్ని భరించలేక.

''నిద్దరొస్తున్నదా?''

''లేదు''.

''అయితే ఉండండి''అన్నది మంజరి.

కళ్ళుమూసుకొని, సన్నగా తలోతనే ఏదో గొణుక్కొన్నది మంజరి.

''నేనో విషయమడుగుతాను, నిజం చెపుతారా?''అన్నది.

''నీకు చెప్పనా మంజరీ?''అన్నాడు చలపతి.

జారగిలపడుకొన్నదల్లా సోఫాలో లేచి కూచుని, సిగరెట్ అంటించింది మంజరి.

''మనం కాసేపు నిజమైన మనుషులంగా మాట్లాడుకొందాం చలపతిగారూ! ఇద్దరం శుష్కమైన ఆడంబరాలను వదిలేద్దాం. నగ్నంగా నిలబడి సత్యాలను ముచ్చటిద్దాం. మన వ్యక్తిత్వాల ప్రభావం వీటిమీదికి రాకుండా చూసుకొందాం-సరేనా? చెప్పనా?''అన్నది.

''మనం సంకోచాలు పెట్టుకోవద్దు. ఈ కాస్సేపూ అయ్యాక మళ్ళా మన మామూలు వేషాలు మనం వేసుకొందాం. నాటకం దాని మానాన దాన్ని పోనివ్వండి. అప్పుడప్పుడైనా మనమిలా క్షాళనం చేసుకోకపోతే-బతుకులు మరీ పాడుబడిన కొంపల మాదిరి అయిపోతాయి''అన్నది మంజరి.

''ఔను''అన్నాడు చలపతి.

''నామీద మీకుగానీ, రాజమణి వసంతలకు గానీ సదభిప్రాయం లేదని నాకు తెలుసు...''

''అబద్ధం!''అన్నాడు చలపతి.

''ఇస్!''అంటూ మంజరి తలపట్టుకొంది. ''నేనింత చెప్పినా నామాటమీద మీకు నమ్మకం లేకపోతే ఎలానండీ? మీరు బుకాయించకండి! ఈకొద్ది నిమిషాలపాటు ఆత్మవంచన చేసుకోకండి! రెండు బతుకులు మనం బతకొద్దు. నిజంగా మనమేమిటో, మన అసలు రూపాలేమిటో చెప్పుకుందాం. ఇప్పటి మాటలు మనం ఇప్పుడే మరచిపోదాం. వీటి ప్రభావం మన తరువాత బతుకులమీదకు

రాదు. రాకూడదు...ఇప్పుడుచెప్పండి. కారణమేమిటంటారు?''

''నువ్వేమనుకొంటున్నావు?''అన్నాడు చలపతి.

''ముందు మీగురించి నేనేమనుకొంటున్నదీ చెబుతాను''అన్నది మంజరి.

ఓ నిమిషం పాటు కళ్ళుమూసుకొని, తనలోతను నవ్వుకొని, గొంతు సరిచేసుకొని ప్రారంభించింది.

''మీరుత్త దురదృష్టవంతులని, నష్టజాతకులని నా అభిప్రాయం. మట్టిని బంగారం చేసి దాంతో బొమ్మను మలిచి, ఆ బొమ్మను ప్రాణం పోస్తారు. తీరా ఆప్రాణం పోశాక, ఆ బొమ్మ మీ చెప్పుచేతుల్లో ఉండాలనుకొంటారు. కానీ ఉండదు. అలా ఉండనందుకు మళ్లా బోలెడంత బాధపడతారు. పోనీ-మిమ్మల్ని కాదన్నదిగదాని మీరాబొమ్మను విడిచిపెడతారా అంటే అదీలేదు. ఏదో మూలన ఆ బొమ్మమీద మీకు ప్రాణం కొట్టుకులాడిపోతూ ఉంటుంది. బొమ్మచేసే పనులు సహించనూ లేరు, అలాగని గట్టిగా నాలుగు తన్ని అదుపుచేయనూ లేరు. అదోరకంగా మీ బలహీనతేననుకొంటాను. ఏదో చిరాకులో వుండి, మిమ్మల్నో మాటన్నప్పుడు, మీ ముఖంకేసి చూడటానికి నేనెంత సిగ్గుపడతానో ఆ భగవంతుడికే తెలియాలి. పశువులాగా ప్రవర్తించినందుకు నన్ను నేనే శపించుకొన్న సందర్భాలు అనేకం. మీరు వెళ్ళాక, భోరుమని ఏడువని ఇన్సిడెంట్స్ చాలా తక్కువ. పోనీ అంతలా-అలాగా రాక్షసిలా కాకుండా చాలా మామూలుగా ఎందుకు మాట్లాడలేకపోతున్నానో, ఎందుకు ప్రవర్తించలేకపోతున్నానో నాకిప్పటికీ స్పష్టంగా తెలీదు''.

''పోనీ అస్పష్టంగానైనా నీకు తెలిసిందేమిటో చెప్పు''అన్నాడు చలపతి.

''అతి పరిచయం వలన, నీవంటే భయం లేకపోవడం అనుకొంటాను. ఈ సినీ ఇండస్ట్రీ నాకు డోకొచ్చేంత కీర్తిని, డబ్బునూ ఇవ్వడనుకొంటాను. నా డబ్బు మీద నువ్వు ఆధారపడి ఉండటమనుకొంటాను. నేనేమన్నా, నన్ను నువ్వు విడిచిపోవన్న ధైర్యం నా లోలోపల ఎక్కడో గట్టిగా పలుకుతుండటం ఇంకో కారణం కావచ్చు. ఇవన్నీనో - ఇవిగాక, నాకు తెలీని ఇంకేమన్నా కారణాలు కావచ్చు - మొత్తానికి, ఓ రకమైన పలచదనం, చులకన భావం ఉన్నమాట ఖాయం. ఒక్కోసారి నాకేమనిపిస్తుందంటే, ఇన్ని మాటలు పడికూడా చలపతిగారిక్కడెందుకుంటున్నారా- అనుకొంటాను. బతకలేక కాదు. యువార్ ఎ కింగ్ మేకర్! తలలు తీసి, మార్చి మళ్ళా అతికించటం మీకు చిటికెల్లో పని ఇదీ నేననుకొంటున్నది మరి మీ సంగతేమిటి?'' అన్నది మంజరి.

''ఏమీ లేదు. నువ్వు కొండమీదన్నదానివి. నేను కిందవున్న మనిషిని. ఆ భేదం మనమెంత చెరపుకొందామన్నా మాసిపోయేది కాదు. ఎందుకంటున్నానంటే దరిద్రణ్ణన్న భావం నన్నూ, డబ్బుగలదానినన్న భావం నిన్నూ వదలదు. ఎంత విదిలించుకొందమన్నా, రక్తంలో జీతించిపోయిన ఈ గుణాలు వదిలిపోవు. కానీ నాకు మనిషి మీద నమ్మకముంది. అతనిలోని మానవత ఎప్పుడో ఒకప్పుడు వెలికి వస్తుందన్న ఆశను నే నొదులుకోలేను. అది కారణంగానే నిన్ను నేను వొదిలిపోవడంలేదు. ఈ డబ్బు హరించిపోయి, ఈ అందం తిరిగిపోయి, ఈ దేశంలో నిన్ను తలిచేనాథుడే లేనప్పుడు, నేనొక్కణ్ణీ నీకు దిక్కవుతానన్న నమ్మకం కూడా నాకున్నది'' అన్నాడు చలపతి.

“మరి వాళ్ళ సంగతో?” అన్నది మంజరి.

“నాకు బాగా తెలియదు. తెలిసినంతవరకూ చెప్పాలంటే - వాళ్ళు చాలా మామూలు మనుషులు. సగటు మనిషిలో ఉండే కోరికలు, ఆశలు వారిలోనూ ఉన్నాయి. నీ గొడవ లేవో నీవు చూసుకోగా తప్పులేనిది, వారలా అనుకోవడం తప్పా? వసంతకు నీకు మల్లేనే ఆలిండియా ఆర్టిస్టు కావాలన్న ఉబలాటం జాస్తిగా ఉంది. అందుకుగాను-తను మంచివనుకొంటున్న పద్ధతులేవో అవలంబిస్తున్నది. ఆవిణ్ణి తప్పుపట్టే హక్కు నీకు లేదు” అన్నాడు చలపతి.

“వసంతను నీడకు రమ్మన్నది నేను గదా! దానికి పది పిక్చర్లిప్పించింది నేను కదా! అయినా, నా మీద దానికంత కార్పణ్యమెందుకుండాలండీ? నేను చేసిన ద్రోహమేముంది? నన్ను గురించి అక్కడక్కడ కాని మాటలంటూ, తిరిగి నా ముఖం చూడడానికి అది సిగ్గుపడలేదంటే నా కాశ్చర్యంగా ఉంది” అన్నది మంజరి.

చలపతి నవ్వాడు.

“ఏదైనా తనదాకా వస్తేగాని తెలీదంటారు. ఈ నిమిషం వరకూ, నీ ఎదుటపడి వసంత నిన్నొక్క మాటనలేదు. ఎవరో చెప్పిన మాటలు నమ్మి నువ్విలా మధనపడిపోతున్నావు-అవునా? మరి నా సంగతొక్కసారి చూడు. తూర్పు పడమరలు తెలీనిదాన్ని ఇంతస్థాయికి తీసుకొచ్చాను. నన్ను కుక్కకన్నా హీనంగా చూసిన సంఘటనలనేకమున్నాయి. అలా అవమానించడానికి, నీకు నేను చేసిన ద్రోహమేమి లేదు. కానీ నువ్వు చేశావు. ఎందుకని? అది నీ స్వభావం కూడా కాదు. డబ్బు నీ స్థాయినీ, నీ స్వభావాన్నీ మార్చి వేసింది. నీ కళ్ళకు మాయతెరలను కప్పింది. ఆ తెరలున్నంత కాలం అలానే ప్రవర్తిస్తావు. ఒక్క నువ్వనే కాదు - నేనైనా అంతే - రేపు వసంతైనా అంతే! కాబట్టి అమ్మాయీ; దీన్ని గురించి ఆలోచించకు, బుర్ర చెడగొట్టుకోకు” అని సలహా ఇచ్చాడు చలపతి.

“అందులోనూ ఫారెన్ వెళ్ళబోతున్నానేమో!” అని పూర్తి చేసింది మంజరి.

“అయిపోయింది. మనమిక మామూలు మనుషుల మయిపోదాం. నా వేషం నేను తొడుక్కుంటాను” అన్నాడు చలపతి నవ్వుతూ.

మంజరి కూడా నవ్వి, వొళ్ళు విరుచుకొంది.

“కాని నా అనుమానమేమిటంటే - మనం నిజంగా వేషాలు విప్పామా అని. విప్పినట్టు నటించామేమోనని నేననుకొంటున్నాను” అన్నది.

“అదేదో నీకే తెలియాలి మంజరీ! అసలీ గొడవను ప్రారంభించిందే నువ్వు. నువ్వే మాత్రం నిజం చెబుతావో తెలుసుకొందామనే ముందు అవకాశం నీ కిచ్చాను” అన్నాడు చలపతి.

“నేను చెప్పిన విషయాలు మీరు నమ్మలేదు కదూ?”

“నువ్వు చెప్పింది నిజమయినప్పుడు నేను నమ్మానా లేదా అన్న ప్రసక్తికే తావు లేదు. నిజం చెప్పినదానివయితే మనమింకా వేషాలు విప్పలేదేమోనన్న శంక నీకు వచ్చేదే కాదనుకొంటాను. అయినా - అవన్నీ ఎందుకమ్మా! ఆ కళ్యాణి - వేరే ఊసుకొక ఏదో రాజబెట్టి ఉంటుంది. దాన్ని పట్టుకొని నువ్వు వీరంగం వేస్తున్నావు. నేను మొత్తుకొనే దెందుకంటే, కళ్యాణి చెప్పింది గదాని ఇతర్లను నిగ్గదీసేముందు, కళ్యాణి నిజం చెప్పిందో లేదో నువ్వెందు కాలోచించవో నాకు బోధపడదు.”

‘‘నాతో అబద్ధం చెప్పాల్సిన అవసరం కళ్యాణి కెందుకుంటుంది?’’

‘‘ఒక నిజం నీదాకా రాకుండా దాయడంకోసం ఇంకో అబద్ధాన్ని చెప్పొచ్చుగా! కళ్యాణి నీతో చెప్పినవన్నీ నిజాలని నువవ్వనుకోకు, అన్ని విషయాలు దాచుకోకుండా చెప్పిందనీ నువ్వనుకోకు. ప్రతి మనిషికీ ఇంకోరితో చెప్పడానికి వీల్లేని రహస్యాలు కొన్ని ఉంటాయి. అవి-వారితో అలా నశించిపోవలసిందే! అలాంటివే కళ్యాణీకి ఉండవచ్చుగదా?’’ అన్నాడు చలపతి.

‘‘కళ్యాణి నా నుండి ఏమన్నా దాచుకొన్నదంటారా?’’

‘‘ఇంతసేపూ నేను వాగిందంతా వృధా ప్రయాసేనన్నమాట! ఇక లేదాం. ఎందుకూ కొరగాని విషయాలు మాట్లాడి, బంగారంలాంటి నిద్రను పాడుచేసుకొన్నాం. ఇప్పుడు టైమెంతయింది?’’

‘‘పావుతక్కువ నాలుగు’’

‘‘అబ్బ!’’ అని లేచాడు చలపతి.

టెలిఫోను మోగింది.

మంజరి రిసీవర్ ఎత్తి ‘‘హల్లో’’ అన్నది. అవతల నుండి ‘‘మం’’అని మాత్రమే వినిపించింది. ఆ తరువాత ఎవరో బలవంతాన ఫోనులో మాట్లాడుతున్నవారి నోరు మూసేశారు. మంజరి చివాలున లేచి నిలుచుని, రెండు చేతులతోను ఫోను గట్టిగా పట్టుకొని ‘‘హలో-హలో-హలో’’ అనసాగింది. ఆవిడ ముఖం భయంతో గండరించిపోయింది.

‘‘ఏమిటదీ మంజరీ!’’ అంటూ చలపతి రిసీవర్ అందుకున్నాడు.

అవతలనుండి ఎవరో కీసుమన్న ధ్వనీ, బలమైన రొప్పు, గాజులు గలగల, దబ్‌మన్న చప్పుడూ వినిపించాయి. ఆ తరువాత బరువైన వస్తువును నేలమీద ఈడుస్తున్న శబ్దం వినిపించింది. చలపతి ‘హలో హలో’ అన్నాడు. అవతల నుండి టెలిఫోన్ కదిలించిన చప్పుడయింది. మంజరి రిసీవర్ అందుకుని ఏదో అనబోయింది. చలపతి మౌత్‌పీస్‌కు చెయ్యడం పెట్టి డిస్‌కనెక్ట్ చేశాడు.

‘‘ఏదో ఘోరం జరిగిపోయిందనుకొంటాను మంజరీ! ఏమైనా మనం చెయ్యగలిగిందేమీ లేదు. నిశ్చితంగా నిద్రపో. ఉదయం అన్ని విషయాలు తాపీగా చూచుకొందాం. అరె! అలా అయిపోయ్యావేమిటి మంజూ! ఎందుకలా వణికిపోతున్నావ్? అవతలి గొంతు నువ్వు గుర్తించావా?’’

మంజరి సోఫాలో నిలువునా కూలబడి, ముఖాన్ని చేతుల్లో దాచుకొని భోరుమని ఏడ్చింది.

చలపతి ఇంకా తరచలేదు. గుచ్చి గుచ్చి అడిగినా మంజరి చెప్పదనిపించింది. ఇదేదో రవంత నిగూఢంగా ఉన్నప్పటికీ, దిమ్మరపోవలసినంత ఆకస్మిక సంఘటన లేమీ కావనుకొన్నాడు.

‘‘ఓసారి కళ్యాణి ఇంటి దగ్గరకు పోదామా?’’ అన్నది మంజరి.

‘‘ఇప్పుడా?’’ అన్నాడు చలపతి. సాలోచనగా మంజరికేసి చూస్తూ ‘‘ ఆ టెలిఫోన్ కళ్యాణిగారి దగ్గరనుండి వచ్చిందా?’’

‘‘ఆదా?’’ అని ఆగిపోయింది. ఓ క్షణం చలపతి ముఖమంతా వెదికి ఆమె చూపులు కిందికి వాలిపోయాయి.

చలపతి కొక విషయం స్పష్టపడిపోయింది. జరుగుతున్న అన్ని సంఘటనలూ మంజరికి తెలుసు. కానీ ఆవిడ ఆ విషయాన్ని ఒప్పుకోవటం లేదు.

“ఈవేళప్పుడు వొద్దులే మంజరీ!” అన్నాడు చలపతి కళ్లుమూసుకొని, కొద్దిగా కాళ్ళాడిస్తూ “అన్ని రోజులు మనవికావు. కానికాలం వచ్చిందంటే, చేతతాడే పామై కాటేస్తుంది. మనకు ఎదుటివారి మీద అనంతమైన ప్రేమానురాగాలు ఉండటం వేరు; వారి కోసం నిష్ఫలమైన త్యాగాలు చేయడం వేరు. మనం అభిమానాన్ని చూపెట్టడం కోసమయినా క్షేమంగా ఉండాలి గదా! అందుకని”

మంజరి పలకలేదు. ఆమె కళ్ళల్లో పదే పదే నీటి ఊటలు ఉబుకుతున్నాయి. దుఃఖభారంతో పెదవులు ఆదురుతున్నాయి. మనిషి వివశమైపోతూ ఉంది. రెండు కణతలనూ నొక్కుకుంటూ ఉంది. గుండెలు భగ్గుమని మండిపోతున్నాయి. కడుపులో నుంచి అన్ని అవరోధాలనూ తెంచుకొని ఏడుపు బయటికి పొంగుకొస్తున్నది. నరాలు ఉబికాయి. ఊపిరి సరిగ్గా తీసుకోలేకపోతున్నది.

“తాయారును పిలుస్తావా చలపతీ!”

“ఆ” అన్నాడు చలపతి. “ఎందుకూ?”

“నేను కాస్సేపు నిద్రపోవాలి. స్థిమితంగా - నిశ్శబ్దంగా నిద్రపోవాలి. ఏవన్నా తీసుకొని”

“వద్దు” అన్నాడు చలపతి, ఏదో పసికడుతున్న వాడిలాగా. “లేనిపోని బెడదలు మెడకు చుట్టుకోవద్దు. జరగనిదేదో జరిగిందని - మీ ధోరణిని బట్టి నేననుకొంటున్నాను. ఈ ఫలితం ఎంతదాకా ఈడుస్తుందో ఎవ్వరికీ తెలీదు. అంచాత”

ఆరు కావడానికి ఇంకా కొన్ని నిమిషాల వ్యవదానం ఉన్నదనగా రొద చేసుకొంటూ ఓ పోలీసు వాన్ వచ్చి మంజరి గేటు ముందా ఆగింది.

ముందుగా దాన్ని చలపతి చూశాడు.

“ఆరుగో పోలీసులు!” అన్నాడతను చాలా తాపీగా.

అని మంజరిని పరిశీలనగా చూశాడు. ఆవిడ నిలువునా కంపించిపోతున్నది.

“ఇంకో రెండు మూడు నిమిషాల్లో వారిక్కడ కొస్తారు. పోలీసుల చేతిలో చిక్కకుండానే ఉండాలి గానీ వాళ్ళు పెట్టే యాతన పగవాడిక్కూడా వద్దు. అన్నీ నువ్వు చూచుకొంటానంటే కిందికెడతాను” అని లేచాడు చలపతి.

మంజరి ముఖం తిరిగిపోయింది.

ఆవిడ కళ్ళుమూసుకొని తూలిపడబోయి, చలపతిని పట్టుకొని నిలబడగలిగింది.

నన్నీ దశలో వొదిలిపోవడం నీకు ధర్మమేనా చలపతీ!”

మృత్యువాతన పడుతున్న మంజరిని చూసి లోలోపల సంతోషించాడు చలపతి. మండుతున్న గుండెలకు చల్లని నీరు తగిలినట్లనిపించింది.

“ఎలాగైనా నువ్వు యజమానురాలివి, నేను నీ దగ్గర పని చేసేవాణ్ణి. నీ అనుమతి లేకుండా ఏమి చెయ్యమడూ ధర్మంకాదు. అందుకని అడిగాను. ఇంకో నిమిషంలో పోలీసులొస్తున్నారు. నువ్వు గదిలోకెళ్ళు. కళ్ళు తుడుచుకో. నువ్వు నిద్రపోతున్నావన్నమాట. తెలిసిందా?”

మంజరి లోపలి కెడుతున్నప్పుడే, మెట్ల మీదుగా చప్పుడు చేసుకొంటూ నలుగురు పోలీసు అధికారులు పైకొచ్చారు.

“మన్నించాలి, మీకు డిస్టర్‌బెన్స్” అన్నాడొకతను.

“ఫర్వాలేదు రండి, అలా కూచోండి”

కూచున్నాక “నా పేరు సుందరం” అని వో భారీగా వున్న మనిషి తనను తను పరిచయం చేసుకొన్నాడు. “వీళ్ళందరూ నా సహోద్యోగులు ఈ రోజు తెల్లవారుజామున జరిగిన సంఘటన మీకు తెలిసే వుంటుంది. దాని వివరాలు ఇంకేమన్నా దొరుకుతాయేమోనని మీ దగ్గరకొచ్చాం. మీ పేరు చలపతిగారేనా? గుడ్! మంజరి గార్ని పిలిపిస్తే” అన్నాడు సుందరం.

“ఆమెగారు స్నానం చేస్తున్నారనుకొంటాను. ఇంకో పది నిమిషాల్లోగాని రావడం జరగదు. నేను మీకు సహాయపడగలిగితే చెప్పండి. తప్పకుండా చేస్తాను” అన్నాడు చలపతి రవంత బిగ్గరగా.

అతని అభిప్రాయమేమిటంటే, మంజరి ఆ ఏడుపు మొఖంతో గాకుండా రవంత ఫ్రెష్‌గా రావడానికి అవకాశమిద్దామని.

“మీకు తెలుసిన వివరాలు చెప్పండి” అన్నాడు సుందరం, చేకర్రతో సోఫామీద సున్నితంగా తాటిస్తూ.

“ఏ విషయంలో?” అన్నాడు చలపతి

“అదే కళ్యాణిని గురించి”

“వారు మాకు చాలా కాలం నుండి తెలుసు. మంచి ఆర్టిస్టు. ఇంకేవో వివరాలు కావాలంటున్నారు. ఏం జరిగిందండీ ?” అన్నాడు చలపతి.

సుందరం చాలా నిశితంగా చలపతి ముఖంలోకి చూశాడు.

“కళ్యాణి తెల్లవారజామున చనిపోయింది” అన్నాడు సుందరం.

“అరె!”

చలపతి నిశ్చేష్టుడయినట్లు కనిపించాడు.

“ఎలానండి? నే నావిణ్ణు ఆఖరిసారి చూసినపుడు చాలా మామూలుగా ఉన్నారే! అయినా గుండె జబ్బున్న మనిషికి చావు క్షణాల్లో వస్తుంది.”

“ఎలా చనిపోయిందన్నదే ఇప్పటి సమస్య. మీరు గుండెజబ్బు మనిషంటున్నారు. నా అనుమానం ఎవరో ఆవిడ్ని హత్య చేశారని. డాక్టర్లు పరీక్ష చేస్తున్నారనుకోండి; చూదాం. మీకూ, కళ్యాణికీ మంచి సంబంధాలున్నాయని అక్కడ పనివారు నాకు చెప్పారు. మీరేమన్నా ఉపయోగపడే సమాచారమిస్తారేమోనని వచ్చాం.”

మంజరి అందంగా మేకప్ చేసుకొని వచ్చింది. వస్తూనే పోలీసుల్ని చూసి, ముఖం చిట్లించి, “ఎందు” కన్నట్లు చలపతి కేసి చూసి, “నమస్కారం” అన్నది వారివైపు తిరిగి.

“ఈ రోజు తెల్లవారుజామున కళ్యాణిగారు చనిపోయారట మంజరీ! నన్నడిగితే; వారికి గుండె జబ్బున్నది గదూ మరి- ఆ సంగతే చెప్పాను. ఆమె సహజంగా మరణించలేదనీ, ఎవరో హత్య చేసి వుండాలనీ అరె అదేమిటీ మంజరీ! అలా అయిపోతున్నావేం?” అన్నాడు చలపతి.

మంజరి ముఖం వెలవెల అయిపోయింది. ఆవిడ సోఫాలో స్మృతి తప్పినదానిలాగా పడిపోయింది.

“మాట వింటేనే ఇలా అయ్యారంటే - చాలా దగ్గర సంబంధాలు ఉండి ఉ

ండాలన్నమాట!'' అన్నాడు సుందరం.

మిగతా అధికారులు ''ఔ''నన్నట్లుగా తలలూపారు.

దాదాపు పదినిమిషాలకుగానీ మంజరి తేరుకోలేదు. తాయారు చల్లని నీరు ముఖం మీద చిలకరించింది.

''అవతల నాకు చాలా పనులున్నాయమ్మా! నా కోసం అక్కడ ఎదురుచూస్తూ ఉంటారు. కళ్యాణికీ, మీకూ చాలాకాలం నుండీ మంచి సంబంధాలున్నాయని మాకు తెలుసు. అంటే - చాలావరకు ఒకరి విషయాలు మరొకరికి తెలుసున్నమాట. అవి మీరు చెబితే ఈ కేసు సులభమవుతుంది. మీ స్నేహితురాలిని చంపినవారికి మేము తగిన శిక్ష విధించగలుగుతాము'' అన్నాడు సుందరం.

మంజరి మాట్లాడలేదు.

''మీకు తెలిసినంతలో కళ్యాణి కెవరన్నా విరోధులుంటే చెప్పండి'' అన్నాడు సుందరం.

''ఎవ్వరూ లేరు'' అన్నాడు చలపతి

''నేను మంజరిగారిని అడిగాను, వారినే చెప్పనివ్వండి'' అన్నాడు సుందరం.

''కళ్యాణికీ, మంజరికీ పరిచయం చేసినవాణ్ణి నేనే! మంజరి మద్రాసు రావడానికి ముందు నుండి కూడా కళ్యాణి నాకు తెలుసు. మీకు కళ్యాణిని గురించి భోగట్టా కావాలంటే, నాకన్నా ఎక్కువ ఆవిడ చెప్పలేదు. కాక మీరడిగే ప్రశ్నలకు, మంజరి సమాధానాలనివ్వడమే మీకు ముఖ్యమయితే అది వేరు సంగతి'' అన్నాడు చలపతి.

''మంజరి మీకేమవుతుంది? అన్నాడు సుందరం.

చలపతి ముఖం చిట్లించి, మంజరికేసి చూశాడు.

''ఇంకోప్పుడయితే పాత చింతకాయ పచ్చడవుతాడనేదాన్ని బాబూ! ఇప్పుడా ఉత్సాహం లేదు. నా కీయనగారు అన్నీ అవుతాడు, ఏమికాడో చెప్పగలనుగానీ, ఏమవుతాడో చెప్పడం నా వల్లకాదు'' అన్నది మంజరి.

''అతను చెప్పే జవాబులన్నీ మీరు చెప్పినట్లుగా మేమనుకోవచ్చా?''

''ఆఁ''

''అవసరమయితే మీరు, వారికి బదులుగా సంతకాలు పెడతారా?''

''ఆఁ''

''థాంక్స్!''

''ఆఖరిసారి మీరు కళ్యాణిని ఎప్పుడు చూశారు?'' అన్నాడు సుందరం.

''అందరం కలిసి హిందీ పిక్చర్‌కెళ్ళాం. కాస్సేపు కూర్చున్నాక'' అని ప్రారంభించింది మంజరి.

''ఎంతసేపు?'' అన్నాడు సుందరం.

'' ఓ ముప్పావుగంట - సుమారుగా ననుకొంటాను; కళ్యాణి పోతానన్నది. మాకెవ్వరికి అంత త్వరగా వెళ్ళడం ఇష్టం లేదు'' అన్నాడు చలపతి పొడిదగ్గు దగ్గి గొంతు సరిచేసుకొంటూ. ''ఆరోగ్యం సరిగా లేదేమోనన్నుకొన్నాను. కాదుట- ఎవర్నో కలుసుకోవాలన్నది. ఆవిడ కారు తీసుకు రాలేదు.

మా డ్రైవరు కూడా లేడు. నేనే డ్రైవ్ చేసుకొచ్చాను కళ్యానిని దిగబెట్టడానికి. నేను బయలుదేరే సమయానికి మంజరి తను కూడా వస్తానన్నది. ఆవిడకు తలనొప్పిగా వున్నదట. "సరే" నన్నాను. కళ్యాణిని ఇంటిదగ్గర దిగవిడిచాను."

"పోర్టికోలో దించారన్నమాట! బావుందండి! ఆ తరువాత?" అన్నాడు సుందరం.

"కాదు, నేను వీధి గేటు దగ్గర దించాను. గేటు దగ్గర దించమని కళ్యాణే అడిగిందనుకుంటాను. లేకపోతే నేను పోర్టికోదాకా వెళ్ళేవాణ్ణే" అన్నాడు చలపతి.

"గేటు దగ్గరే ఎందుకు దించమన్నదండీ?" అన్నాడు సుందరం.

" అది ఆవిణ్ణడగవలసిన ప్రశ్న. నేనేం సమాధానం చెప్పనండీ దానికి?" అన్నాడు చలపతి.

"అవును ఆఁ తరువాత?"

"ఇద్దరం ఇంటికొచ్చాం"

"బావుంది కానీ కళ్యాణి ఇంటి కాపలాదారు, ఆవిడ చాలా పొద్దుపోయిగానీ ఇంటికి రాలేదనీ, వచ్చేటప్పుడుతన స్వంతకారులోనే వచ్చిరదనీ, అప్పటికి వాన వెలిసిపోయిందనీ చెప్పాడే!" అన్నాడు సుందరం.

"అలాగా! నిజమే అయి ఉండొచ్చు"

"అదెలా సాధ్యమండీ?" అన్నాడు సుందరం.

"ఎలా సాధ్యమో మీరు నిర్ణయించాలి. నేను చెప్పింది మాత్రం నిజం. కాకపోతే వొకటి జరిగి వుండాలి. ఇంటిదగ్గర దిగాక, తను కలుసుకోవలసిన వ్యక్తి వున్న చోటుకు కాలినడకన పోయి వుండాలి కళ్యాణి. అంతకుముందే అతని కోసం అక్కడకు కారుమీద వెళ్ళిన కళ్యాణి - ఆ వ్యక్తి లేకపోవడంతో, మాతో బాటు సినిమాకు వచ్చి వుండాలి. దరిమిలా సంగతులు మీకు చెప్పనే చెప్పాను"

"ఏవమ్మా! అంతేనా జరిగింది?" అన్నాడు సుందరం, ప్రశ్నార్థకంగా మంజరిని చూస్తూ

"అవును"

"మంచిది. మనమొకసారి కళ్యాణి యింటికి పోదాం. మీరూ రండి!" అన్నాడు సుందరం.

"మంజరి రాదులెండి. ఆమెకు శవాలను చూస్తే చాలా భయం!" అన్నాడు చలపతి.

బయలుదేరాలనుకొంటున్న మంజరి అతని మాటలు విని, ఆ ఆలోచనను కట్టిపెట్టింది.

"ఎంతోకాలం నుండి వారిద్దరు ప్రాణానికి ప్రాణంగా కలిసిమెలసి ఉన్నారు. ఈ ఆఖరు క్షణంలో తన స్నేహితురాలి శవం చూసుకొందుకైనా మంజరిగారికి అవకాశం లేకపోవడం అన్యాయం. ఇంతమంది మనముండగా భయమేమిటి? అర్థం లేదు" అన్నాడు సుందరం "రండీ! మీరు అక్కడకు రావడం అవసరం కూడాను."

చలపతి ఇంకేమనడానికీ లేకపోయింది.

అందరూ దిగి కిందికొచ్చారు.

వరండాలోనూ, పోర్టికోలోనూ చాలామంది గుమికూడారు. అందులో పత్రికా విలేఖరులు కూడా ఉన్నారు. వారు మంజరిని చుట్టుముట్టి " మీ అభిప్రాయంమేమిటో చెప్ప"మంటూ వత్తిడి చేయసాగారు.

“నాకంతా అయోమయంగా వుంది. నేనిప్పుడేమీ చెప్పలేను” అన్నది మంజరి.

“లేనిపోనీ పుకార్లు వ్యాపించనీయకండి. చెప్పదలచిందేమన్నా ఉంటే నేనే మీకు చెబుతాను. ఊహాగానావల్ల మా పని ఎంత చిక్కుల్లో పడుతుంఓ మీకు తెలిసిందే!” అన్నాడు సుందరం.

ఇంత చెప్పినా ఒకరిద్దరు ప్రెస్ ఫోటోగ్రాఫర్లు మంజరిని ఫోటోలు తీశారు. వచ్చే సినిమా పత్రికల్లో ఆ ఫోటోలు వేసి, “స్నేహితురాలి మరణానికి విలపిస్తున్న మంజరి” అనిగానీ, “పోలీసులతో ప్రసిద్ధ తార” అనిగానీ అడుగున రాస్తారన్నమాట!

పదిహేను నిమిషాలకల్లా కారు కళ్యాణి ఇల్లున్న వీధిలోకి వచ్చింది. ఆ కొస నుండి ఈ కొసదాకా ఇసకవేస్తే రాలనంతగా జనం కిక్కిరిసి వున్నారు. పోలీసులు యెంత సర్దుబాటు చేసినా, ప్రజలు మూగుకొస్తున్నారేగానీ చెదిరిపోవడం లేదు. మెల్లగా దోవ చేసుకొంటూ కారు కళ్యాణి కాంపౌండులోకి వచ్చింది. అక్కడ ఉన్నత పోలీసు అధికారులతో బాటుగా సినిమా పరిశ్రమలోని హేమాహేమీలవంటివారు కూడా ఉన్నారు. ఉదయానికల్లా కళ్యాణి మరణవార్త కార్చిచ్చులా మద్రాస్ నగరమంతా వ్యాపించింది. కళ్యాణి పట్ల సానుభూతి సూచకంగా నగరంలోని అన్ని స్టూడియోలకూ ఆ రోజు సెలవు యివ్వబడింది.

అందరి దృష్టి మంజరిమీదనే కేంద్రికరించబడి వున్నాయి. కళ్యాణి హత్యకు సంబంధించిన పరమ రహస్యం మంజరి రాకతో తెలిసిపోతుందన్న నమ్మకం వున్నవారు చాలామంది ఆమెను సమీపించి ముందుగా సానుభూతిని ప్రకటించారు.

“మనం పైకి పోదాం రండి!” అంటూ సుందరం మేడమీదికి దారి తీశాడు.

మంజరి, చలపతి అతన్ని అనుసరించారు.

ఇంకెవ్వరూ పైకిరాకుండా పోలీసులు అడ్డగించారు.

మధ్య హాలంతా చిందరవందరగా ఉంది; సోఫాలమీది కవర్లు చెల్లాచెదరయ్యాయి. టెలిఫోన్ స్టాండుకు బార దూరంలో కళ్యాణి వెల్లకిలా పడివున్నది. ముఖమంతా లేత నీలిరంగులోకి మారిపోయింది. కనుగుడ్లు యింత లావుగా బయటికి తోసుకొచ్చాయి. నోరు కొద్దిగా తెరచుకొని, పళ్ళు కనిపిస్తున్నాయి. ముక్కురంధ్రానుండి తెల్లని ద్రవం పై పెదవి మీదకు జారి, అక్కడ గడకట్టిపోయింది”. నోటి మీద, ముక్కుమీద ఈగలు ముసురుతున్నాయి. రెండు పిడికిళ్ళు గట్టిగా బిగిసికొని వున్నాయి. జుట్టంతా రేగి ఇంత ఎత్తున్న ఈత పొదల తయారయింది.

మంజరి నిలువునా కూలిపోయింది. ఆస్థితి లో వున్న కళ్యాణిని చూడవలసివస్తుందనీ, ఆవిడ ఏనాడు ఊహించి ఎరగదు. నిశ్చలంగా, జీవరహితంగా కాశ్మీర్ తివాచీ మీద వెల్లకితల పడివున్న కళ్యాణి ఏదో సినిమాలోని క్లైమాక్స్ సీన్‌లో నటిస్తున్నట్లుగా వున్నది. విశ్వరంగ స్థలం మీద తన పాత్రను పూర్తిచేసుకొని రంగులు కడుక్కొని కళ్యాణి వెళ్ళిపోయిందని, తన నిష్క్రమణకింకా సమయం రాలేదని మంజరి కనిపించింది. చిత్రమేమిటంటే మంజరికి ఏడుపు రాలేదు. అంతకుమించిన ఆగాధమైన, బరువైనా, ఆవాజ్యమైన స్థితిలో మంజరి పడిపోయింది. చాలాసేపటి వరకు కన్నార్పకుండా కళ్యాణి శరీరంకేసి చూస్తూ నిలబడింది మంజరి. తరువాత వంగి కళ్యాణి చేతిని అందుకోబోయింది.

''క్షమించాలి'' అంటూ సుందరం వారించాడు. ''హంతకున్ని వేలు ముద్రల కోసం మేము చూస్తున్నాము. దయచేసి వాటిని మీరు చెరపకండి.''

''చాలా దారుణం'' అన్నాడు చలపతి డగ్గుత్తికతో. ''ఇంత ఘోరం జరగడానికి కారణమేమిటంటారు బాబూ?''

''అదే తేలవలసి వున్నది. ఇంట్లో దొంగతనం జరిగిన దాఖలాలు లేవు. కళ్యాణి వంటిమీది నగలు కూడా అలానే వున్నాయి. ఏదీ కదిలించినట్లు రుజువు లేదు. వొంటిమీద గాయాలున్నాయేమో చూశాం. మా డాక్టరు, ఊపిరాడక చనిపోయినట్లు చెప్పాడు. ఎవరో ఆమెను బలవంతంగా చంపారు. గొంతు దగ్గరి నరాలు నలిగినట్లు కనిపించాయి. ప్రాణరక్షణ కోసం పెనుగులాడినట్లు తోస్తున్నది''అన్నాడు సుందరం.

''కావచ్చు''అన్నాడు చలపతి.

''ప్రాణాలు పోయి కూడా ఎక్కువసేపు కాలేదు. నాలుగు, అయిదూ మధ్యలో చనిపోయి ఉంటుందని డాక్టర్ల అభిప్రాయం....'' అన్నాడు సుందరం మెల్లిగా సిగరెట్ అంటించి, మంజరికేసి తిరుగుతూ. ''చూడమ్మా! మీరు ఈవిషయంలో మా కెంతయినా సహాయం చేయగలరని నమ్ముతున్నాను. మీకు తెలిసిన విషయాలను దాచకుండా చెప్పటం వలన, దోషిని త్వరగా పట్టుకోగలుగుతాము. కళ్యాణి కెవరన్నా విరోధులున్నారా?''

''తెలీదు''అన్నది మంజరి ఓ చెంప చలపతిని చూచుకుంటూ.

''ఆమెకేమయినా దురభ్యాసాలున్నాయా?''

''తెలీదు''అన్నది మంజరి.

''ఉన్నాయండీ!''అన్నాడు చలపతి.

సుందరం ఎటెన్షన్ మంజరి నుండి అవతలివేపుకు మళ్ళింది. చలపతి క్కావలసింది కూడ అదే! ఈ అదనులో మంజరి ఉస్సురని సన్నగా నిట్టూర్చింది.

''కళ్యాణికి మత్తుపదార్థాలు వాడటం అలవాటు. ముఖ్యంగా విదేశీ పానీయాలంటే ఆమె పడి చచ్చిపోయేది. వాటికోసం ఆవిడ చాలా డబ్బు వ్యయం చేసింది. వాటిని ఎక్కడ నుంచి తెచ్చేదో నాకు తెలీదు. అనేకసార్లు ఆవిడ నాకు ఆఫర్ చేయడమూ నేను చాలా కొద్ది దఫాలు కాదనలేకపోవడమూ జరిగింది. ఆవిడ మార్ఫియా వాడటం నాకు బాగా తెలుసు. ఇది దురభ్యాసాలని మీరంటే నాకభ్యంతరం లేదు గానీ, ఈ మాదిరి అలవాట్లు లేనివారెవరూ ఈ పరిశ్రమలో లేరనుకుంటాను''అన్నాడు చలపతి.

''మంజరిగారు ఇంకేమన్నా చెబుతారా?''అన్నాడు సుందరం.

''లేదండీ! నాకామాత్రం కూడా తెలీదు. ఇప్పుడు చలపతిగారీ మాటలన్నీ అంటుంటే-నాకే ఆశ్చర్యంగా ఉంది!''అన్నది మంజరి.

''మీరు నిజం చెప్పడం లేదు''అంటూ చురచుర చూశాడు సుందరం.

''మీరు, కళ్యాణి కలిసి తాగినట్లు మా దగ్గర సాక్ష్యం ఉంది. మరీ అంత నంగనాచిలాగా నటించడం ప్రమాదం-జాగ్రత్త!''

''నేననడం తాగడం గురించి కాదు; మార్ఫియా వాడడం గురించి''అన్నది మంజరి రవ్వంత బెదురుగా.

సుందరం తన జేబులోంచి ఓ పొట్లం బయటికితీస్తూ ''కళ్యాణి ఏ రకం సిగరెట్లు కాలుస్తుంది?''అన్నాడు.

మంజరి ఆ రకమేదో చెప్పింది.

సుందరం పొట్లాన్ని విప్పాడు. అందులో ఆరు సిగరెట్ పీకలూ, ఇంత నుసీ ఉన్నాయి.

''చలపతిగారూ! మీకావిడ బాగా తెలుసునన్నారు గదా! ఆవిడ స్నేహితుల్లోగానీ, శత్రువుల్లో గానీ, ఈ రకం సిగరెట్లు కాల్చేవారెవరన్నా ఉన్నారా?''

చలపతి ఆ పొట్లంలోని సిగరెట్ పీకలను చూచి తెలియదన్నట్లు పెదవి విరిచాడు.

''అంటే-యెవరో కొత్తవాడు వచ్చి ఉండాలన్నమాట! కానీ నౌకర్లు, కాపలావాళ్లు కూడా కొత్తమనుషులు వచ్చినట్లు చెప్పలేదు. కళ్యాణి పెంపుడు కుక్కలు దయ్యాల్లాగా రాత్రల్లా ఆవరణలో తిరుగుతాయి గదా; గతరాత్రి అరవలేదన్నారు పనిమనుషులు! ఈఇంటి చుట్టుప్రక్కలవాళ్లు కూడా కుక్కలరవడం గుర్తించలేదన్నారు. వచ్చినవారెవరో దొంగదోవనకాక,మామూలు మార్గంలోనే వచ్చివుంటారనీ, వారు అతి తరచుగా ఈ ఇంటికి వచ్చిపోతూ ఉండేవారనీ, వారికి ధనేతరమైన ప్రయోజనమేదో ఉండి ఉండాలనీ నేను ఊహించాను. నా ఊహ సరయిందే కావచ్చు. ఏఁవమ్మా! ఇలాంటి సిగరెట్లు మీరెపుడన్నా కాల్చారా?''అంటూ సిగరెట్ పీకల పొట్లాన్ని మంజరికి చూపించాడు సుందరం.

ఆ సిగరెట్ ముక్కలను చూస్తూనే మంజరి ఉలిక్కిపడింది. ఆవలిస్తే పేగులు లెక్కపెట్టగలిగిన సుందరం, ఆమె తడబాటును గుర్తించి, తనలో నవ్వుకొన్నాడు.

''ఏమ్మా! కాల్చారా?''

''లేదు''

''పోన్లేండి, కాల్చేవారిని చూశారా?''

''ఆఁ''

''ఎప్పుడు, ఎక్కడ?''

మంజరి కళ్లు మూసుకొని ఆలోచించింది.

''లాభంలేదు బాబూ! ఎప్పుడో నేను చెప్పలేను. కానీ, ఎక్కడో చెప్పగలను. బొంబాయి విమానాశ్రయంలో ఒక వ్యక్తి ఈ సిగరెట్ కాల్చడం నాకు జ్ఞాపకం!''అన్నది మంజరి.

''అంత గట్టిగా జ్ఞాపకం పెట్టుకోవలసిన అవసరమేమొచ్చిందమ్మా?''

''ఆ వ్యక్తికొక కాలులేదు. నడిచినప్పుడల్లా కొయ్యకాలు గచ్చుకు తగిలి 'టక్ టక్'మంటూ శబ్దం చెయ్యసాగింది. దానికితోడు ఏచేతికోగానీ ఆరువేళ్లున్నాయి. ఇవన్నీ కలిపితే, కొంత విడ్డూరంగా ఉంటాయి కదా! బహుశా అందుచేతనే నేను ప్రత్యేకించి చూసి వుంటాను''అన్నది మంజరి.

''అతన్ని మళ్ళా మీరెక్కడన్నా చూశారా?''అన్నాడు సుందరం.

''లేదు''అన్నది మంజరి.

“తెల్లవారుజామున కళ్యాణి మీకు ఫోనుచేసి ఏమని చెప్పింది”అన్నాడు సుందరం హఠాత్తుగా.

“మాకా? లేదే!”అన్నాడు చలపతి.

“నేనామె నడుగుతున్నాను”.

“మంజరి మూడుగంటలకే నిద్రపోయింది. ఆ దరిమిలా ఇంకో పదినిమిషాలకు నేను నిద్రపోయాను. టెలిఫోను నాగదిలోనే వున్నది. మోగలేదు”అన్నాడు చలపతి.

“ఆవిడ మీకు ఫోను చేసినట్లు టెలిఫోన్ ఎక్స్ఛేంజీలో ఎంక్వయిరీ చేసి కనుక్కొన్నాను. లేదని బుకాయించకండి!”అన్నాడు సుందరం.

చలపతి కణతలు పట్టుకొని కూచుండిపోయాడు.

“మమ్మల్ని క్రిమినల్స్‌గా భావించడం అన్యాయం సార్! కళ్యాణి ఫోన్‌చేస్తే చేసే వుండొచ్చు.కానీ మాకా సంగతి తెలీదు. నాకు మెలకువ రాలేదు”అన్నాడు చలపతి.

“సాధారణంగా మీరు కింది భాగంలో వుంటారని విన్నాను. మీ గదిలో టెలిఫోను కూడా లేదు గదా...”

చలపతి ప్రాణం చిటచిటలాడిపోయింది. అయినా లొంగకూడదనుకొన్నాడు.

“సాధారణంగా పగటిపూట నేను కింది గదిలో ఉండేమాట నిజమే! దాన్ని నేనూ కాదనడం లేదే!” అన్నాడు చలపతి, ‘సాధారణం’ అన్న మాటను నొక్కుతూ.

సుందరం ఏమీ పలక్కుండా, అయిదారు నిమిషాల పాటు కళ్యాణి ముఖంకేసి చూస్తూ కూచున్నాడు.

అంతలోనే కింది నుండి మరో పోలీసాఫీసరు సంబంధం మొదలియార్ రొజుకుంటూ పైకి వచ్చాడు. అతనిచేతిలో కవరున్నది. దాన్ని సుందరానికిచ్చి దూరంగా వెళ్లినుంచున్నాడు.

సుందరం కవరు విప్పి చూచాడు. అతనికళ్లు ఆశ్చర్యంతో విప్పారాయి. చదువుతున్నంతసేపు మంజరికేసి చలపతికేసి చూస్తూనే ఉన్నాడు. అంతా అయిపోయాక, ఉస్సురని నిట్టూర్చి, కవరును ఎగరేసి పట్టుకొని, కింది పెదవిని కొరుక్కున్నాడు.

“ఎక్కడ దొరికింది సంబంధం?” అన్నాడు సుందరం.

“కింద గదిలో ఆమె గుడ్డల బీరువా ఉన్నది సార్! దాన్ని చూస్తున్నాను. ఓ పట్టుచీర కింద ఈ కవరు కనిపించింది”.

“మంచిది, సరే! పనిచూడు”

సంబంధం శాల్యూట్ చేసి వెళ్లిపోయాక, సుందరం ఆ ఇద్దరికేసి గుచ్చిగుచ్చి చూశాడు. ఆ చూపుల్లో ఏవో అనుమాన రేఖలను మంజరి గుర్తించింది. అయినా తను తొణకకూడదనుకొన్నది.

“ఆఖరిసారిగా నేను మీ ఇద్దరకూ చెబుతున్నాను కళ్యాణి చావుకు కారణం మీకు తెలుసు. హంతకుడెవరో కూడా మీకు తెలుసు. అనవసరంగా జాప్యం చేయడం మంచిది కాదు. ఆ సమయంలో హంతకుడు పారిపోవచ్చు. దయచేసి మరో రహస్యాన్ని బయటపెట్టండి!”అన్నాడు సుందరం.

“అంటే!”అన్నది మంజరి.

ఆవిడకు కోపం వచ్చిందని చలపతి గ్రహించాడు. వెర్రికుక్కలా వాగి నెత్తిమీదికి

తెచ్చుకుంటుందేమోనని భయపడిపోయాడు. ఇంకోనిమిషం తను ఊరుకుంటే కొంత సాక్షాత్తూ మునిగిపోతుందనుకొన్నాడు. ఆలస్యం లేకుండా, మంజరికి బాసటగా నిలబడ్డాడు.

"అంటే మరేం కాదు మంజూ! హంతకుడు మనకు తెలుసునన్న భ్రమలో వారున్నారు. అది నిజం కాదని మనం చెప్పుకోవలసి ఉంటుంది. సుందరంగారి అభిప్రాయం కూడా అదే!"అని వాతావరణాన్ని చల్లబరిచాడు చలపతి.

అతనిసైగలను మంజరి కూడా గమనించింది. ఆ మాట అంటున్నప్పుడు చలపతి గొంతు తడుముకోవడం కూడా ఆవిడ గుర్తించింది.

"అదేనండీ నేనూ అడుగుతుంట, దీనికేం చెయ్యడమా-అని?"

"అమ్మ భడవా!"అనుకున్నాడు సుందరం.

"కళ్యాణీ మీకు బంధువా?"అనడిగాడు సుందరం.

మంజరికి ఆగమన్నట్లుగా కన్నుమలిపాడు చలపతి. ఆ ప్రశ్న సుందరం అంతవరకూ అడగలేదు. కవరు చూశాక అడిగాడంటే, ఆ ప్రశ్నకు సంబంధించిన అంశమేదో ఆ కవరులో ఉందన్నమాటే! అదేమిటో తెలుసుకునే అవకాశం లేదు. బంధుత్వం ఉన్నదని గానీ, లేదనిగానీ తను స్పష్టంగా తేలకూడదు.

"మాట్లాడరేం?"అన్నాడు సుందరం మళ్ళా.

"అదే ఆలోచిస్తున్నాను సార్! ఏమిటి చెప్పటమో తోచడం లేదు. బంధుత్వం లేదని కాదు-చాలా దూరంగా, ఎక్కడో కలిసివున్నదనుకుంటాను. అంతకన్నా ముఖ్యం స్నేహితం. దానిముందు మాకున్న బంధుత్వం వొక్కలెక్కలోది కాదు. అయతే ప్రతిదానికీ వో పరిమితి ఉన్నట్లే మా స్నేహానికి కూడా పరిమితులున్నాయి. అనేక విషయాలను గురించి కళ్యాణితో మేము ఏనాడూ ముచ్చటించలేదు. అందులో ఆవిడ డబ్బు వ్యవహారమొకటి. ఒక్కోసారి ఎంత పైలాపచ్చీసుగా ఉండేదో, మరొకసారి డబ్బుకోసం అంతగా కటకటపడేది. ఒకటి రెండుసార్లు మంజరి ఆవిడకు డబ్బు సర్దినట్టు నా జ్ఞాపకం. చెబుతున్నదెందుకంటే, వ్యక్తులతో ఎంత గాఢపరిచయమున్నప్పటికీ కొన్ని సంగతులు ఏనాటికీ మనం తెలుసుకోలేమని నా నమ్మకం! కళ్యాణికి మాతో సన్నిహిత సంబంధాలున్నంత మాత్రాన, ఆవిడ రహస్యాలన్నీ మాకు తెలిసి వుండాలనుకోవడం భావ్యం కాదని మాత్రమే నేను మనవి చేస్తున్నాను"అన్నాడు చలపతి.

"పోనీండి చలపతిగారూ! కళ్యాణి ఆస్తికి వారసులెవరో మీకు తెలుసా?"అన్నాడు సుందరం.

"తెలీదు".

"పోనీ, ఆస్తికోసం కళ్యాణిని హత్య చెయ్యడానికి ఆవారసులకు అవకాశమున్నదంటారా?"

చలపతి సన్నగా నవ్వాడు.

"దీనికి నేనెలా సమాధానమివ్వాలో తెలియకుండా ఉంది సుందరంగారూ! కళ్యాణికి అసలు వారసులంటూ ఉన్నారో లేదో నాకు తెలీదు, అధవా ఉన్నా, కళ్యాణిని హత్యచేస్తే తప్ప ఆస్తిరాని దశలో వారున్నదీ లేనిదీ నాకు అంతకన్నా తెలీదు. అయినపుడు నన్నాప్రశ్న అడగడం ధర్మమేనంటారా?"అన్నాడు చలపతి.

“ఆ అనుమానం నన్ను ఉదయం నుండీ పీడిస్తున్నది చలపతిగారూ! కళ్యాణి తన ఆస్తిలోని సగభాగం మంజరికి రాసిచ్చింది. మిగతా సగభాగం మంజరి ఇష్టం వచ్చిన ధర్మకార్యాలకు వినియోగించవచ్చునని రాసింది”అన్నాడు సుందరం.

మంజరి కొయ్యబారిపోయింది.

కళ్యాణి ఆస్తిని తను వారసురాలా?

“అరె! ఈ సంగతి నాతో ఎప్పుడూ అనను కూడా లేదే!”అన్నాడు చలపతి.

“అది నిజం కాదనుకుంటాను. మీకు తెలియకుండా కళ్యాణి ఈ పనిచేసి ఉంటుందన్న విశ్వాసం నాకు లేదు”

“అది మా దురదృష్టం!”అన్నాడు చలపతి బిగబట్టిన గొంతుతో “అయినా చెప్పాలనిగాని, చెప్పితీరాలని గానీ లేదు. పోలీసాఫీసరుగా-వృత్తి ధర్మం క్రింద, మీరు కనుపించిన ప్రతివారినీ అనుమానించడం సబబేననుకోండి. కానీ,ఎటొచ్చీ, మాలాంటి వారికి ధోరణి కాస్త ఇబ్బందిగా ఉంటుంది”.

“మంచిది మీరు వెళ్ళిరండి! అవసరమయితే, మళ్ళీమళ్ళీ మిమ్మల్ని కలుసుకోవలసి ఉంటుంది. అందుకని...ఎప్పుడని అడిగితే నేను మాత్రం ఏం చెప్పను చలపతిగారూ! ఇది హత్యకేసు గనక, ఏ నిమిషాన్నయినా మీ అవసరం కలగవచ్చు. అంచాత మీరు ఇతర కార్యక్రమాలన్నీ వొకటి రెండు రోజులు వాయిదా వేసుకోవడం మంచిది. అందాక మీరు అవసరమనుకొంటే-నలుగురు పోలీసుల్ని మీకు సాయంగా ఉండమంటాను. అలా చెయ్యనా?”అన్నాడు సుందరం.

“మేం పారిపోము-పోవలసిన అవసరం కూడా మాకు లేదు. కాదు కూడదని మీరనుకొంటే, పోలీసుల్ని కాపలా ఉంచండి!”అన్నాడు చలపతి నవ్వుతూనే.

సుందరమూ, చలపతీ మెట్లుదాకా వచ్చారు. మంజరి ఇంకా కళ్యాణిని చూస్తూనే ఉంది.

“మళ్ళా వద్దాం”అన్నాడు చలపతి ఇక బయలుదేరమన్నట్లుగా.

కిందికొచ్చేసరికి, ఇందాకటి కన్నా రెట్టింపు జనం చేరారు. కళ్యాణి ఇంటికి అటో మైలు, ఇటో మైలుదాకా ఆ జనసముద్రం విస్తరించింది. వద్దంటున్నా వినకుండా పత్రికలవాళ్ళు ఫొటోలు తీస్తున్నారు. కొంతమంది సినిమా పెద్దల అభిప్రాయాలడుగుతూ, వాటికి  చిలవలూ, పలువలూ తొడగసాగారు.

మంజరికి ముఖం వాలిపోయింది. ఆవిడ కళ్లల్లో నీటిజీరలేదు. కానీ, దుఃఖభారంతో వివశమయినట్లు తెలిసిపోతూనే ఉంది. చాలామంది ఆమె దగ్గరకొచ్చి కండోలెన్సెస్ చెబుతున్నారు. మంజరికవన్నీ పట్టినట్లు లేదు.

“పొదాం”అంది మెల్లిగా.

జనాన్ని పాయలుగా చీల్చుకొంటూ మంజరి కారు రోడ్డు మలుపు తిరిగింది.

“ఇంటికిపోతున్నాం!”అన్నాడు చలపతి, స్టీరింగును ఎడమవైపు కోస్తూ.

“వొద్దు. నాకేదో భయంగా ఉంది. నేనా ఇంట్లో ఉండలేను. హొటలుకు పోదాం పద! నాకు గాఢంగా నిద్రపోవాలని ఉంది. మళ్ళా ఓ వారం రోజులదాకా మెలకువరాని సుదీర్ఘమైన నిద్ర కావాలి నాకు”అన్నది మంజరి.

"అయినప్పుడు ఇల్లే మంచిది మంజూ! మనిష్టమొచ్చినంత కాలం ఇష్టమొచ్చినట్లుగా పడుకొన్నా అడిగే నాథుడుండడు. హెూటల్ అలా కాదు"అన్నాడు చలపతి గేరుమార్చుతూ. "ఒక దశ చేరుకోవడమే చాలా కష్టం! చేరుకొన్నాక, ఆ వ్యక్తి ఏపనిచేసినా న్యూస్ అవుతుంది. ఎందుకంటున్నానంటే మంజూ! ఫలాన తార, ఫలాన హెూటల్లో వారం రోజులపాటు వొళ్ళూపై తెలీకుండా నిద్రపోయిదంటే భారతదేశం యావత్తు గగ్గోలెత్తిపోతుంది. అయితే దాన్ని మనం ఇంకోరకంగా బ్లైండ్ చేసుకొనవచ్చుననుకో! "తన స్నేహితురాలైన కళ్యాణి మరణవార్త విని మూర్ఛపోయిన ముగ్ధసుందరి మంజరి"అంటూ మన శర్మ ఫొటోవేసి, కింద రైటప్ రాస్తాడు".

ఇల్లోచ్చింది. అక్కడా చాలామంది గుమిగూడారు. కొందరు కారు దగ్గరికొచ్చి పరామర్శించారు. ఇంకొందరు మెట్లదాకానూ వచ్చారు. చలపతి వారించకపోతే చాలామంది మేడమీదిక్కూడా వచ్చేవారే!

"దయచేసి ఆమెను డిస్టర్బ్ చేయకండి! మంజరి సీరియస్‌గా దెబ్బతిన్నారు. డాక్టర్లు ఆమెకు రెస్టుకావాలని చెప్పాకనే ఇక్కడికి తీసుకొచ్చాను"అని సర్దేశాడు చలపతి.

మంజరిని దాదాపు అతను మెట్లమీదుగా మోసుకొచ్చాడు. కిందివారు పైకి రాకుండా తయారు గడియపెట్టింది. వసంత ఫాన్ వేసింది.

"మీరంతా వెళ్ళండి!"అన్నాడు చలపతి.

మంజరి ఏమంటుందోనని ఓనిమిషం పాటు చూసి, ఆవిడేమీ అనకపోవడం వల్ల అందరూ బయటికి వెళ్ళిపోయారు.

ఆ విశాలమైన గదిలో మంజరీ చలపతీ మాత్రమే ఒకరికెదురుగా ఇంకొకరు కూచుని ఉన్నారు. ఒకరి గుండె చప్పుడు, ఇంకొకరికి వినిపించేటంత నిశ్శబ్దంగా వున్నదప్పుడు. ఆ నిశ్శబ్దాన్ని అసలే భరించలేకపోయింది మంజరి. మనస్సంతా శూన్యంగా అయిపోయింది. అందులో కళ్యాణి రూపం కూడా స్పష్టంగా లేదు. ఏదో అదృశ్యమైన భయాలు తనను వెన్నంటి తరుముతున్నాయనిపించిందామెకు.

"ఇదంతా కలలాగా లేదూ?"అన్నది మంజరి చివరికి.

చలపతి "అవును" అన్నట్లయితే మంజరి ప్రాణానికి కాస్తంత రిలీఫ్‌గా ఉండేది. అతనలా అనలేదు సరిగదా, ఫక్తు అందుకు వ్యతిరేకమైన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు.

"నేను భూమిమీద నడిచేవాణ్ణి, ఊహాలోకాల్లో విహరించడం నాకు చాతకాదు. ఇదికలకు మల్లే నీకున్నదేమోగాని నేనలా అనుకోవడం లేదు"అన్నాడు.

మంజరి నోరింత చేసుకొని చలపతికేసి చూసింది.

"అంటే-"అని ఆగి, భయంతో రెండుకళ్ళూ మూసుకొని, సోఫా అంచుమీదికి ముఖాన్ని ఆనించింది మంజరి. "మీకు కళ్యాణి ఇలా చచ్చిపోతుందని ముందుగానే తెలుసునన్నమాట!అవునా?"

"దాదాపుగా తెలుసు"అన్నాడు చలపతి చాలా తాపీగా.

చాలా సేపటిదాకా మంజరి పలకలేదు. ఆవిడ తాయారును పిలిచి, తాగడానికేమన్నా తెచ్చిపెట్టమన్నది. తాయారు వెళ్ళాక, కుర్చీకి జేరగిలబడి, "ప్చ్"అని చప్పరించేశాడు చలపతి.

"కొందరికి ఎవరూ చెప్పకుండానే విషయాలు తెలుస్తాయి. ఇంకొందరు, తెలిసినవారు చెబితే

వింటారు. ఈరెండు రకాలవారితోనూ ఎప్పుడూ బాధలేదు. మూడోరకం వారికి తెలియనూ తెలియదు, ఇంకొకరు చెప్పినా వినరు. వీరితోనే మహాప్రమాదాలు జరుగుతాయి. తమకు తెలియదని వీరొప్పుకోరు. ఇంకోరు చెప్పిన మాట వినడం చిన్నతనంగా వీరు భావిస్తారు''.

తాయారు సీసా, గ్లాసులు,సోడాలు బల్లమీద పెట్టి వెళ్లిపోయింది.

''నేను ఉదయం నుండీ మొత్తుకొంటున్నదంతా దుమ్ములో కలిసిపోయింది మంజరీ! నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో, నేను పోతున్నాను! నీతోబాటు నేను కూడా కంఠానికి ఉరితెచ్చుకోలేను. నాకింకా బతకాలని ఉన్నది''అన్నాడు చలపతి లేచి నిలబడుతూ.

మంజరి ఏమీ అనలేదు. ఒక్కసారి చలపతి కన్నుల్లోకి చూసింది. తరువాత తలదించేసుకొన్నది. లేచి నిలబడిన చలపతి అడుగు ముందుకు వేయలేకపోయాడు.

''నీతో వచ్చిన చావే ఇదీ''అని గొణుక్కుంటూ తిరిగి కూచున్నాడు. ''మద్రాసులో ప్రొహిబిషన్ ఉన్న సంగతి నీకు తెలుసాయె. ఏ నిమిషాన్నయినా, పోలీసులు మనల్ని పిలిపించుతారన్న సంగతీనీకు తెలుసాయె. ఇన్ని తెలిసి కూడా నువ్వు తాగుతున్నావంటే నిన్నేమనాలో తోచకుండా ఉంది. నిన్ను అరెస్టు చేయడానికి ఈ వొక్క సీసాయే చాలు. ఫలానా తార మద్యం దగ్గరుంచుకొన్న నేరానికి అరెస్టయిందన్న వార్త-నీకెంత అవమానమో నువ్వు ఆలోచించినట్లు లేదు''.

''నాకు మనస్సేమీ బావోలేదు చలపతీ! రాత్రి నుండీ నేను''భీతావహ వాతావరణం''లో ఉన్నాను. కన్నుమూస్తే గడుసుదయ్యాలేవో భయంకరంగా రొదలుపెడుతూ, మీదికి దూకుతున్నట్లనిపిస్తున్నది. అందులోనూ, కళ్యాణి మరణం-''

''కాదు, హత్య''అని సవరించాడు చలపతి.

''పోనీ హత్యేననుకో''అని మంజరి కూడా అతని సవరణను ఆమోదించింది.

''ప్రమాదం నేనెప్పుడో పసిగట్టాను. ఉదయం మనల్ని అనుమానించకుండా ఉండేందుకే-ముఖ్యంగా నిన్ను-స్నానం చేస్తున్నావన్నాను. బహుశా అంతకుముందు నీకా ఆలోచన లేదనుకొంటాను!''అన్నాడు చలపతి.

''లేదు, నువ్వన్నాకనే స్నానం చేశాను...నువ్వు మంచిపని చేశావు చలపతీ! అలాకాకుండా ఆ ఏడుపుముఖంతోనే నేను పోలీసుల ముందు కొచ్చినట్లయితే వారికి అనుమానం కలిగేదనుకొంటాను?''

''ఇప్పటికయినా కలగలేదని కాదు. మనమేదో ముఖ్యమయిన సంగతిని దాచిపెడుతున్నామని సుందరం గారి అభిప్రాయం. అదినిజం కూడాను. కానీ నిజం చెప్పేసి, దోవనపొయ్యే తద్దినాన్ని నెత్తిమీదికి తెచ్చుకోవడానికి మనమెప్పుడూ సిద్ధంగా లేము''.

''అవును''అన్నది మంజరి.

ఓ నిమిషం ఆగి, ఏదో అడగబోయి ఠక్కున ఆగిపోయిందావిడ.

''ఏమిటి?''అన్నాడు చలపతి.

''కళ్యాణి హత్యను గురించి మీకు ముందే తెలుసన్నారు గదా! పోనీ, మాట మాత్రమన్నా నాతో అనలేదేం చలపతీ?''అన్నది మంజరి.

''తెలుసునంటే, అన్ని సంగతులూ తూచా తప్పకుండా తెలుసునని కానేకాదు. కళ్యాణికి

సహజమరణం రాదనీ, ఎవరో వొకరు హత్యచేస్తారనీ నాకు చాలాకాలం కిందటనే తెలుసు. కానీ, అదింత త్వరగా జరుగుతుందనీ నేననుకోలేదు. కళ్యాణి మీద నాకు ఎలాంటి సానుభూతీ లేదుగానీ, కనీసం నీ మెహర్బానీ కోసమయినా, ఈ సంగతి ముందుగా నీకు చెప్పి ఉండవలసింది''.

''దురదృష్టవశాత్తూ నేను పరధ్యానంగా ఉన్నాను. అతను కనుపించాడుగానీ, నేను గుర్తుపట్టలేకపోయాను. మనస్సులో ఏదో మూల సన్నని అనుమానం మెదలుతూనే ఉన్నది. అయినా మనిషిని పోలిన మనుషులుంటారనుకొన్నాను. నేనుసరిగ్గా అంచనా వేయనందువల్ల ఈ ఘోరం జరిగిపోయింది. ఇన్నిటికీ కళ్యాణికి ఈ భూమ్మీద గింజలు లేవు. దాటిపోయింది''అని నిట్టూర్చాడు చలపతి.

మంజరి నిలువునా చలించిపోయింది. రక్తమంతా వోడ్చుకుపోయినదానిలా నీరసంగా సోఫాలో పడుకొన్నది. ఒక చెయ్యి, ముఖంమీదుగా రెండవ పక్కకు వేసుకొన్నది. మరో చెయ్యి కిందికి వేళ్ళాడుతున్నది.

''అన్ని సంగతులు తెలిసికూడా తెలియనట్లుగా నువ్వెలా ఊరుకోగలిగిందీ నాకు అర్థం కావడం లేదు చలపతీ!'' అన్నది మంజరి.

''చెబుతాను, నువ్వు లేచికూచో''అన్నాడు చలపతి. ''తాయారును పిలిపించి, ఈ ఛండాలమంతా సర్దించు ముందు. దీన్నిలా చూస్తూ నువ్వు స్థిమితంగా ఉండలేవు''.

'అబ్బ! చచ్చిపోతే బావుండు బాబూ.''అని విసుక్కుంది మంజరి, ''నాకు నీరసంగా వుంది. కళ్ళు తిరుగుతున్నట్లనిపిస్తున్నది. దాన్ని పిలిచి వీటిని తీయమని చెప్పు''.

''ప్చ్''అని పెదవి విరిచాడు చలపతి. ''ఆ దురదృష్టం నాకు లేదు. నేను వాళ్లను పిలవను. పిలిచినా వాళ్ళు రారు. వచ్చినా నేను చెప్పిన పనిచెయ్యరు. ఈఇంట్లో నామాట కేపాటి విలువున్నదో నాకు తెలుసు. కనక నువ్వే పిలిచి, నువ్వే వాటిని సర్దించు''.

సమయం చూచుకొని చలపతి తనను కుమలపొడుస్తున్నాడని మంజరి ఇట్టే గ్రహించింది. అంత నీరసంలోనూ ఆవిడకు పట్టరాని ఆగ్రహం వచ్చింది. రక్తం వేడెక్కి ఝురీవేగంతో పరువులెత్తి నట్టనిపించింది.చివాలున లేచి కూర్చున్నది. ఆమె కళ్ళు ఎర్రగా ఉండటం చలపతి గమనించి నవ్వుకొన్నాడు. ఆ నవ్వును చూసి మంజరి మరీ రేగిపోయింది.

''నేనన్నది అబద్ధమా?''అన్నాడు చలపతి.

''ఆ''.

''చూదాం''అని బెల్ నొక్కాడు.

''తాయారొస్తుంది. నువ్వలా చూస్తూ ఉండు. ఏం జరుగుతుందో?''

తాయారు వచ్చి, మంజరివేపు తిరిగింది.

''ఈ గ్లాసులూ, సోడాలూ, సీసా పట్టుకెళ్ళు తాయారూ''అన్నాడు చలపతి.

తాయారు ఆ మాటలేమీ విన్నట్లు లేదు. మంజరి ఏమంటుందా అన్నట్లు ఆమె వేపే చూస్తూ నిలుచుంది.

''తీసికెళ్ళవే! నాకు కాఫీ పట్టుకురా!''అన్నది మంజరి.

''నాకు టీ''అన్నాడు చలపతి. తాయారు వెళ్ళాక.

''ఇదీ వ్యవహారం!''అన్నాడు.

ఈ ధోరణిని మార్చాలనుకొన్నది మంజరి.

''వ్యవహారంసరే! నువ్వసలు సంగతి దాటేస్తున్నావు''అన్నది.

''ఏదది?''

''ఈవిషయాలన్నీ ముందుగా తెలిసి కూడా నాతో చెప్పకుండా దాచుకోగలగడానికి....''

''అదా?''అని నవ్వాడు చలపతి. ''నేనో సిగరెట్ కాల్చుకుంటాను. నువ్వా అంటించు''అని సిగరెట్ ముట్టించి, గుప్పుమని పొగ వదిలాడు చలపతి. ''ఇంకో రెండు మూడు వారాలపాటు, నీ ఎదట నేనిలా సిగరెట్‌ను ధైర్యంగా కాల్చగలను మంజరీ! తరువాత మళ్ళా మామూలయిపోతుంది. కళ్యాణి గొడవలొక కొలిక్కి వస్తాయి. నా సలహాలుగానీ, సహాయంగానీ అప్పుడంతగా అవసరం ఉండవు. పోనీ, ఈనాలుగురోజులన్నా వైభోగం వెలగబెడదామనుకొని సిగరెట్ కాలుస్తున్నాను''.

మంజరి గుండెల్లో మందుగని బద్దలయినట్లనిపించింది. అయినా పైకి పొంగలేదు. చాలా మామూలుగా ఉండేందుకు ప్రయత్నిస్తూ ''ఊఁ-చెప్పు''అన్నది.

చలపతి నిట్టూర్చాడు.

''కళ్యాణి నీకీ సంగతులన్నీ చెప్పే ఉంటుందనుకొన్నాను''.

''చెప్పలేదు''.

''అని నాకిప్పుడు తెలుసు. మీ ఇద్దరి మమేకమూ చూసినవారెవ్వరూ అలా అనుకోరు. నీకు చెప్పకుండా కళ్యాణి దాచుకొన్నదేమీ లేదన్న విశ్వాసం నీకూ ఉన్నది. ఆ విశ్వాసాన్ని చెదరగొట్టడం నా అభిమతం కాదు. కళ్యాణి తన సంగతులన్నీ నీకు చెప్పినా చెప్పకపోయినా నాకొచ్చే నష్టమేమీ లేదు. కానీ, చెప్పదనీ చెప్పి ఉండదనీ నాకు గట్టిగా తెలుసు''.

''ఏం మనుషులో బాబూ? నాకు పిచ్చెత్తిపోతున్నది!''అన్నది మంజరి, తలను గట్టిగా నొక్కుకొంటూ.

ఆ మాట చలపతి మీద అమోఘంగా పనిచేసింది. కళ్యాణి పట్ల మంజరికి గల విశ్వాసం దిగజారుతున్నదని అతను గమనించాడు. రెట్టించిన ఉత్సాహంతో చెప్పుకుపోసాగాడు.

''నేను సుందరం గారితో అన్న మాటలన్నీ అబద్ధాలు కావు. కళ్యాణికి సంబంధించినంత వరకూ, మనకు ప్రమాదం కలగని మేరకు-నేను నిజమే చెప్పాను. కళ్యాణి మద్రాసులో అడుగుపెట్టేనాటికి, నువ్వాపేరు కూడా విని ఉండవనుకుంటాను. అప్పటి నుండీ నాకావిడ తెలుసు. తెలుసునంటే అలా ఇలా కాదు, చాలా గట్టిగానే తెలుసు. ఆవిడతో కొన్ని రాత్రులు నేను గడిపానంటే నువ్వు నమ్మవు. నేనుకాదు- నాకన్నా అధములు, ఆవిణ్ణి అనుభవించారు. కొన్ని మాసాల పాటు కళ్యాణి శరీరం అమ్ముకొనే జీవించింది...''

''మరి మీరిద్దరూ-ఎప్పుడూ అంత పరిచయం ఉన్నవారిలాగా ఉండలేదే?''అన్నది మంజరి.

''ఉండలేదు. అలా ఉండటం కూడా సాధ్యం కాదనుకొంటాను.ఎందుకంటే-ఈ పదేళ్ళలోనూ, మా ఇద్దరిపరిస్థితులూ మారాయి. కళ్యాణి తారాపథానికెగబాకింది. డబ్బున్న పురుగులు ఆమెచుట్టూ

తిరగసాగాయి. లక్షలు పిండి, లక్షలు ఖర్చుచేసింది. ఆమె రూపాయికి కానీ విలవ వున్న సందర్భాలు కూడా ఉన్నాయి. కానీ నేనలా కాదే! అప్పటికి, ఇప్పటికీ నేను దిగజారిపోయాను. నీ దగ్గర ఊడిగం చేసుకొంటూ, పొట్టపోసుకొంటున్నాను. అలాంటి వాడిమీద గౌరవం ఉండవలసిన పనిలేదు. పైగా అంతో ఇంతో కసి కూడా ఉంటుంది. కళ్యాణి పగ ఎలాంటిదో నాకు తెలుసు. నామీద కసితో, ననున అనుమానించాలన్న ఉద్దేశంతోనే ఆవిడ నీతో స్నేహం చేసింది. మీరిద్దరూ కలిసి, నేను కుళ్లిపోయే మాటలన్నారు. నా వ్యక్తిత్వం ధ్వంసమయిపోయేలాగా ప్రవర్తించారు. ఏమాత్రం అవకాశం దొరికినా, నన్ను అవమానించడానికే కళ్యాణి చూసేది. ఒకప్పుడు తను దిక్కూమొక్కూ లేకుండా ఉన్నప్పుడు-ఓ పది పారేసి ఆవిడతో ఓ రాత్రల్లా నేనున్నాను. అదీ ఆవిడకి కసి! అదీ ఆవిడకు పగ! అందుకోసం అస్తమానం నన్ను కాకిలాగా పొడుస్తూఉండేది. మానాభిమానాలు వొదులుకున్న ముండమోపిని గనక, అవన్నీ దిగమింగుకొన్నాను... నా అసమర్థత కళ్యాణికి తెలుసు. ఆ బలహీనతను ఆవి ఎక్స్ప్లాయిట్ చేసింది. నేను చచ్చినట్టు ఊరుకున్నాను. సరే! చనిపోయిన మనిషిని గురించి దూషణగా అనగూడదనుకో... జరిగిందిదీ''అన్నాడు చలపతి.

మంజరికి గతమంతా ఛటుక్కున జ్ఞాపకం వచ్చింది. అనేకసార్లు చలపతిని గురించి కళ్యాణి తనతో మాట్లాడింది. ఈ ఇంట్లో అతని స్థానమేమిటో ముందు నిర్ణయించమన్నది. 'మీ చలపతికి మినిమమ్ మేనర్స్ కూడా తెలీవే' అంటూ కంప్లెయింట్ చేసింది. ఆఖరికి రాత్రి కూడా చలపతిమీద కట్టుకుపోయినన్ని కొండాలు చెప్పింది. వసంతకూ తనకూ మధ్య తంపులు పెడుతున్నాడనీ, రాజమణి మనస్సును విరిచిపారేశాడనీ, ఇటువంటి వెధవను ఆదరించకూడదనీ, తన్ని తగలేయమనీ శతకోటి చెప్పుకొచ్చింది. ఇదంతా చలపతిమీద కసితోనే చేసిందా? లేక తను బాగుపడాలన్న ఉద్దేశంతో చెప్పిందా? తన పగల తీర్చుకోవడం కోసం చలపతిమీద ఇవన్నీ కళ్యాణి కల్పించి చెప్పిందో లేదో తనిప్పుడు రుజువు చేసుకోలేదు. ఒకవేళ కళ్యాణి లేదన్న ధైర్యంతో చలపతే ఇదంతా పోగుచేసి చెబుతున్నాడేమో తనకు తెలీదు. ఇందులో ఏది నిజమన్నది-ఆ పరమేశ్వరునికే తెలియాలి!

''నువ్వీ మాటలనేవరకూ కళ్యాణి చాలా యోగ్యురాలనుకొన్నాను చలపతీ!''అన్నది మంజరి.

''యోగ్యురాలే! నేనూ కాదనడం లేదు. నాకామె నచ్చనంత మాత్రాన చెడ్డదని నేనను. కళ్యాణయినా అసహజంగా ప్రవర్తించినదనడం న్యాయం కాదు. చిన్నప్పుడు నిన్నష్టకష్టాలు పెట్టినవారిపుడు నీ దగ్గరకొస్తే నువ్వు వారిని గౌరవించవలసిన అవసరం లేదు. పైగా చిత్రహింసలు పెట్టడం కూడా సబబేనంటాను. దురదృష్టవశాత్తూ నేనురేపు గొప్పవాణ్ణయిపోయాననుకో-నా దగ్గర లక్షలు చేరాయనుకో-చిన్నప్పుడు నన్నవమానించిన వారెదురైతే పగ తీర్చుకొని తీరతానుగానీ మానను. అది మానవ స్వభావం. ఆ సంగతి నాకు తెలుసు గనకనే నేను కళ్యాణిని తప్పుపట్టటం లేదు. కేవలం ఒక వార్తకింద, గతించిన సంగతులన్నీ నీకు చెప్పుకొచ్చాను. అదీ సమయం వచ్చింది గనక!''అన్నాడు చలపతి.

''ఆవిడ కొక చెల్లెలుండాలి గదా! ఆవిడెలాంటిది?''అన్నది మంజరి.

చలపతి కళ్లు చికిలించి మంజరికేసి చూశాడు. తరువాత అదోలా నవ్వి సిగరెట్ అంటించాడు.

''ఆవిణ్ణి గురించి నీకేమీ తెలీదా? తెలిసే వుండాలే! కళ్యాణి మాటల ప్రకారం ఆవిడ చెల్లెలు

అచ్చం నాలాగాఉంటుంది-ఏదో జబ్బొచ్చి చనిపోయింది. ఆ దశలో కళ్యాణి చాలా పేదతనం అనుభవిస్తూ ఉందిట-''

చలపతి ఫక్కున నవ్వాడు.

''ఎలాంటివారైన నమ్మదగిన కథ మంజరీ, ఇది. నాకు తెలిసినంతలో కళ్యాణికి చెల్లెలంటూ లేదు''.

''అరే!''

''నువ్వు నమ్మినా నమ్మకపోయినా యదార్థమిదే!''అన్నాడు చలపతి.

''కళ్యాణికీ నాకూ ఇంత గాఢస్నేహం ఏర్పడడానికి నేను ఆ చెల్లెల్లాగా ఉండడమే ముఖ్యకారణం. మరి-నువ్వేమో ఆవిడకు చెల్లెలే లేదంటుంటివి.''

''లేదు మంజరీ!''అన్నాడు చలపతి నీరసంగా. ''ఏదోరకంగా కళ్యాణి నీతో స్నేహం కలపాలి. నామీద పగతీర్చుకోవాలి. అంటే-తను చెప్పినవన్నీ నువ్వు నమ్మాలి. నమ్మాలంటే మీ ఇద్దరి మధ్యా అరమరికలేమీ ఉండనంత సన్నిహితత్వం ఏర్పడాలి. అలాంటి సన్నిహితత్వం గాలిలోంచి పుట్టుకరాదు. దానికి వాస్తవిక ప్రపంచంలో గట్టి ఆధారం వుండాలి. ఆ ఆధారమే చెల్లెలు. ఎవరయినా సులభంగా నమ్మదగిన అంశమది. అందుకనే-నేనింతకు ముందొకసారి అన్నాను-ప్రతివారికీ తమతోబాటే నశించిపోవలసిన రహస్యాలు కొన్నుంటాయి'అని. బహుశా కళ్యాణికి మధుమేహమున్న సంగతి నీకు తెలీదు; ఆవిడ రొజుకొకసారి, తనకు తానే ఇంజెక్టు చేసుకుంటుందని కూడా నీకు తెలీదు. నాకా సంగతులన్నీ తెలుసు''.

''ఇదంతా ఇంద్రజాలంలాగా ఉన్నది గదూ?''అన్నది మంజరి. అని -పెదవులు తడుపుకొన్నది.

''బహుశా రెండు,మూడురోజుల్లో నాకు పిచ్చెత్తుతుందనుకొంటాను. అలా జరిగినా బావుండిపోను చలపతీ! ఈకల్మషమంతా సమూలంగా అడుగున పడిపోతుంది. అప్పుడెంత హాయిగా వుంటుందో?''అన్నది మంజరి.

ఎంత హాయిగా వున్నా, మనం దాన్ని అనుభవించలేం''అన్నాడు చలపతి నవ్వుతూ. ''ఇంతసుఖాన్ని నేననుభవిస్తున్నానన్న స్పృహ ఉన్నప్పుడే మనం ఆనందించగలం. స్పృహ తప్పేంతగా సుఖపడటం-ఉన్నా లేకపోయినా వొకటే!''

''నీ మాటలు నాకీపూట అర్థంకావటం లేదు చలపతీ! అవునుగానీ-కళ్యాణి దేవూరో చెప్పావుగాదేం?''

''పోనిద్దూ''అన్నాడు చలపతి.

''కాదు, కూడదు, చెప్పవలసిందే''అన్నది మంజరి.

చలపతి ఇంకో సిగరెట్ అంటించాడు. ఆపొగతోనే అగ్గిపుల్లను ఆర్పి, యాష్ట్రేలో పడేశాడు. అనవసరంగా పొడిదగ్గు దగ్గి చెప్పనారంభించాడు.

* * * * * * * *

అనగా అనగా ఒక ఊరు. ఆ ఊళ్లో ఓ మోతుబరి ఆసామీ ఉన్నాడు. ఆ ఆసామీకి లేకలేక ఒక కొడుకు పుట్టాడు. ఆ కొడుకు పేరు పకీరయ్య. అతగాణ్ణి అక్షరాలా అందలాల్లో ఉంచే పెంచారు.

కిందికి దించితే పాడయిపోతాడన్న భయంతో, అసలు దించడమే మానేశారు. బళ్ళోకి పంపుతే మేష్టారు కోప్పడతారేమోనని, ఇంట్లోనే బడి పెట్టించారు. అబ్బాయికీ అక్షరాలు రానందుగ్గాను, ఇంటిల్లిపాదీ కలిసి అక్షరాలను రాల్చిపోశారు. వొదిల్లే-వీధిలో ఆడుకొంటాడేమోనని; అదీ మామూలు పిల్లకాయల్తో-వీధి తలుపుకు అస్తమానూ గడియవేసి ఉంచారు. పదహారేళ్లబ్బాయికి తెలిసిన ప్రపంచం-చాలా పరిమితమయింది. జీతగాళ్ళు చెంబుతో నీళ్ళుపట్టుకొస్తే తప్ప ఊరిబయటకు పోగూడదనీ, ఎవరితోనూ విశేషంగా మాట్లాడకూడదనీ, లోకంగా మోసగాళ్లమయమనీ, ఎవర్నీ నమ్మకూడదనీ, తుచ్ఛ సుఖాలకు లోబడరాదనీ-అన్నీ ఒకటో నెంబరు బుద్ధులు అబ్బాయికి నూరిపోశాడు.

పకీరయ్యకు పెళ్లయింది. పెళ్లాంపేరు కన్నమ్మ. ఆవిడ పచ్చగా ఉంటుంది. అందంగా ఉంటుంది. పెళ్లికూతురు ముస్తాబులో కన్నమ్మనుచూసినవారు ''కుందనబ్బొమ్మ''అన్నారు.

కన్నమ్మ కాపరానికొచ్చిన ఆరుమాసాలకే పెద్దవారు గతించిపోయారు. లంకంత కొంపకు కన్నమ్మే ఆడదిక్కయింది, అబ్బాయిగారేమో అమాయకులయిరి. అంచాత అన్ని పనులూ చూసిపెట్టడానికి అబ్బాయిగారి మేనమామగారొచ్చారు. ఆ మేనమామగారు చాలా అసాధ్యులు. మట్టిలోంచి మాణిక్యాలు తీయగలిగినవారు, అబ్బాయిగారు చవటేశ్వర్రావుగారన్న విషయం వారికెప్పుడో తెలుసు.

''వాడిది అచ్చంగా మా బావ పోలిక''అనేవారు ఆయనగారు.

మూడేళ్లు కాలేదు. అబ్బాయిగారి ఆస్తంతా హరించిపోయింది. పాపం మాటలు ఎవర్ని గురించీ అనకూడదు. సొమ్మంతా మేనమామగారే కాజేశాడనడం శుద్ధాబద్ధం. నిజానికి సగం అబ్బాయిగారే వ్యయం చేశారు. అందుక్కూడా మేనమామగారే దోవచూసినవారయినారు. తన చేవాటుతనం బయటపడకుండా ఉండటం కోసమని, మేనమామగారు అబ్బాయిగారికి 'కొత్తప్రపచం'తో పరిచయం కలిగించారు. రెండుమూడు మాసాలపాటు హమేషా అబ్బాయిగారి వెంట వారుండిపోయారు. హెూటల్సూ,అందులోని గదులూ పరిచయం చేశారు. రకరకాల క్లబ్బులకు తీసుకెళ్లారు. అక్కడ నిరాఘాటంగా సాగుతున్న ''సాంస్కృతిక కార్యకలాపాల''లో అబ్బాయిగార్ని ప్రవేశపెట్టారు. స్వయంగా మెరకవీధులకు తీసుకెళ్లారు. ''ప్రబోధపానీయం''వాడటం నేర్పారు. ''ముక్కాట''నేర్పారు.

మానవుడు అభివృద్ధి చెందాలంటే-నిజానికిన్ని యోగ్యతలు ఉండవలసిన అవసరం లేనేలేదు. వీటిలో ఏ వొకటి రెండున్నా చాలు. అలాంటిది- అన్ని యోగ్యతలూ ఒక్కచోటనే రాసిపడ్డాయంటే, శరవేగంతో అభివృద్ధి జరుగుతుందన్నమాటే!

వాస్తవానికి అలానే జరిగింది. అబ్బాయిగారు పట్టుకుపోతున్నారు. మేనమామగారు దాటవేసేది దాటవేస్తున్నారు. ''ఇదేమి''టని ఎవరన్నా అడిగితే మామయ్యగారు 'కర్మం' అంటూ నెత్తి బాదుకొనేవారు.

''నేను దాటవేశాను గనకనే ఆమాత్రమన్నా దక్కింది. లేకపోతే మొత్తం తుడిచిపెట్టుకుపోయేదే!''అన్నారాయన.

అదీనిజమే మరి!

ఆ మూడేళ్ళలోనూ అబ్బాయిగారు అనేక విషయాల్లో రాటుదేలారు. ముక్కాటలో తాలూకా

మొత్తానికి సవాల్. రాజు, రాణీ, రెండు పొడలూ ఉంటే చాలు-చెక్క వొంచేశాడన్నమాటే! ఏ వీధిలో ఏ కొంప ఉన్నదో, ఏ కొంపలో ఏ బాపతు జనం ఉన్నారో అబ్బాయిగారికి క్షుణ్ణంగా తెలుసు. అయిదారువేలు ఖర్చుబెట్టి ఇద్దరమ్మాయిలకు "కన్నెరికం"కూడా పెట్టారు వారు.

మూడేళ్లయ్యేసరికి అమ్మడానికేమీ మిగల్లేదు. మామయ్యగారు అప్పటికే వెళ్లిపోయారు. బాకీల కింద ఇల్లు కూడా పోయింది.

"ఇప్పుడేం చేదాం?"అన్నది కన్నమ్మ.

"టౌనుకు పోదామే!"అన్నాడు పకీరయ్య.

"అయితే పద!"అన్నది కన్నమ్మ.

ఇద్దరూ బస్తీకొచ్చారు.

పదిహేను రోజుల్లో చేతిలోవున్న ఆఖరు రూపాయి కూడా ఖర్చయిపోయింది. అంతకు ముందు ఇంద్రుడవనీ, చంద్రుడవనీ, ఆకాశానికెత్తిన వారెవ్వరూ ఇప్పుడు కనిపించడం లేదు. కనిపించినా పలకరించడం లేదు. ఒకప్పుడు తన దగ్గర వందలకు వందలు వాడుకొన్న వాళ్ళెవ్వరూ ఇప్పుడు చేబదుళ్లు కూడా ఇవ్వలేకపోతున్నారు.

కన్నమ్మ పస్తులు చేసింది.

పకీరయ్య పస్తులు చేశాడు.

జ్ఞానోదయం కలగడానికింతకన్నా మంచి అవకాశం ఇంకోటి ఉండదు. కన్నమ్మకు జ్ఞానోదయమయింది. పకీరయ్య ఇంకా మాయాజాలంలో పండి కొట్టుకొంటున్నాడు. అతనికి క్రొత్త "ప్రపంచం"మీద రోజురోజుకూ మోజు పెరుగుతున్నదే తప్ప తరగడం లేదు. సర్వశక్తులతోటీ ఈ ప్రపంచంలోని సుఖాన్నంతా అనుభవంలోనికి తెచ్చుకోవాలని తహతహలాడిపోయాడు. అందుకు డబ్బు కావలసివస్తే-దాన్ని సులువు మార్గంలో సంపాదించడానిగ్గూడా పకీరయ్య సిద్ధపడ్డాడు. అనేక సంవత్సరాల పాటు బలవంతంగా అణచివేయబడిన కోరికలెన్నో ఈ మూడేళ్ళలో పడగలు విప్పి, బుసలుకొట్టాయి. ఆ విష జ్వాలలకు పకీరయ్య జీవితం కమిలిపోయింది పాపం!

అతనికి ఇంటి సంగతి పట్టేది కాదు. ఎప్పుడోగానీ ఇంటికి వచ్చేవాడు కూడా కాదు. ఆ ఉన్న కొద్దిగంటలయినా మత్తుతో ఏదో గొణుగుతూ ఉండేవాడు. అప్పుడప్పుడు కన్నమ్మను కమ్చీతీసుకు బాదేవాడు. రక్తం పడేట్టు గుద్దేవాడు. సలసలా మరుగుతున్న నీటిని తొడలమీద పోసేవాడు. ఒకసారి బొటనవేలి గోరుకు పిన్నీసు దిగబొడిచాడు.

ఇవన్నీఎందుకు చేసేవాడో కన్నమ్మకు తెలిసేది కాదు తొలిరోజుల్లో తెలియక "నేనేం చేశానని ఇలా కొట్టడం?"అన్నది. ఆ మాట అన్నందుకు ఒక రాత్రల్లా వానలో ఆవిణ్ణి నించోబెట్టాడు. చలికి గజగజలాడిపోతుంటే-కమ్చీతో రక్తం వచ్చేదాకా కాళ్లమీద కొట్టాడు. వాననీటిలో ఎర్రని చారగా నెత్తురుపారడం చూసిగానీ కొట్టడం ఆపలేదు. బాహిర జీవితలో ఎదురైన భయంకరమైన అపజయాలను తట్టుకోలేక ఆ కసిని ఇంకో విధంగా తీర్చుకొనే మార్గం లేక-కన్నమ్మనలా చావగొడుతుండేవాడతను.

"ఇలా ఎంతకాలం భరిస్తావమ్మా?"అన్నాడు రామిరెడ్డి ఒకసారి.

అతను కన్నమ్మ ఇంటికెదురుగ్గా ఉన్నాడు. మద్రాసులో ఆయనకు ఉల్లిపాయల వ్యాపారం ఉంది.

"మరేం చెయ్యను?"అన్నది కన్నమ్మ.

"నేను చెప్పినట్లు చేస్తావా?"అన్నాడు రామిరెడ్డి.

"ఓ" అన్నది కన్నమ్మ.

ఓ శుభముహూర్తాన రామిరెడ్డి కారులో మద్రాసుకొచ్చిపడింది కన్నమ్మ.

"నేను నెలకు పదిహేనురోజులైనా ఇక్కడ ఉంటాను. మనకీ ఇల్లు సరిపోతుందిగాదూ?"అన్నాడు రామిరెడ్డి.

వంటగదిగాక రెండు గదులూ వరండా ఉన్నాయి. ఇంట్లోనే నీళ్లపంపూ, ఇంటిపక్కన సరుకులకొట్టూ ఉన్నాయి. నెలకు నాలుగురూపాయల జీతం మీద రెడ్డిగారో పనిమనిషిని కూడా మాట్లాడారు.

"మీరు లేనప్పుడు వొంటరిగా ఈ ఇంట్లో ఇండలేను"అన్నది కన్నమ్మ.

"నా బుజ్జిగదే!"అన్నాడు రామిరెడ్డి ఆమెను దగ్గరగా తీసుకుని.

ఆయన ఏడాదిపాటు అన్నమాటమీదనే నిలబడ్డాడు. మరీ తూచినట్లుగా-పదిహేనురోజులక్కాకపోయినా, కాస్త ఆటూఇటూగా రెడ్డిగారు రావడమూ, పోయేప్పుడు అంతోఇంతో ఇచ్చిపోవడమూ-సలక్షణంగానే ఉంది.

ఆ పంపిణీ మీద పదికాలాల పాటు జరిగితే, ఆంధ్రసినీ పరిశ్రమ చరిత్ర ఇంకోరకంగా ఉండేది. రెండో ఏడు సగబడ అయ్యేవేళకు రామిరెడ్డిగారు దాదాపుగా రావడం మానేశారు. అటువంటి ప్రమాదాన్ని తానెప్పుడయినా ఎదుర్కోవలసి ఉంటుందని కన్నమ్మ గ్రహించింది. అయినా ఆవిడ తొందరపడలేదు. రెడ్డిగారికోసం చాలాకాలం పాటు ఎదురుచూసింది. అమ్మడానికి వీలయిన వాటిని అమ్ముకొని తిన్నది. అలాంటివేమీ లేనప్పుడు పస్తులు చేసింది. అనేకసార్లు రెడ్డిగారి ఉల్లిపాయల కొట్లుకెళ్ళి విచారించింది. ఆయనగారింకా రాలేదనో, వచ్చిపొయ్యాడనో, ఇంకో నెలదాకా వచ్చే అవకాశాలు లేవనో గుమాస్తాలు చెప్పేవారు. తన పేరూ, అడ్రసూ రాసిచ్చి "వచ్చిపొయ్యానని చెప్పండి బాబూ!"అని కూడా ప్రాథేయపడింది. అయినా రెడ్డిగారు మళ్ళా కన్నమ్మ ఇంటికి రాలేదు.

ఆ పరిణామం కన్నమ్మ ముందుగానే ఊహించింది. దానికి విరుగుడు కూడా ఆవిడ ఆలోచించి అట్టిపెట్టింది. అందమైన ఆడదానికి-అందులోనూ వయస్సులో ఉన్నఅందమైన దానికి -మంచి "రేటు"పలుకుతుందని ఆవిడకు తెలుసు. తొలిసారిగా పాతికరూపాయలు తీసుకొని మూడో మనిషఖి వొళ్ళప్పగించిన రాత్రి కన్నమ్మ గుండెలవిసిపోయేలాగా ఏడ్చింది. ఆడబ్బును అగ్గిపుల్ల గీసి తగలెడదామా అని కూడా అనుకొన్నది కానీ, రెండుమాసాల ఇంటద్దె, రెండొందలు దాటిన చిల్లరపద్దు, చాకలి బాకీ -వీటిల్లో ఏవొకదాన్ని తీర్చడానికీ ఈపాతిక చాలవే! కోపతో తను తగలేసి బావుకొనేదేమిటిట?

కన్నమ్మ ఆ వృత్తిలో ఎంత బాగా రాణించిందంటే-ఒకసారి రామిరెడ్డిగారొస్తే "మీరు రాత్రల్లా ఉంటారా? వెంటనే పోతారా?"అని నిగ్గదీసి అడిగి, అతని దగ్గర కూడా డబ్బు వసూలుచేసింది!

అంతవరకూ కన్నమ్మకు సినిమాలను గురించి ఎలాంటి అభిప్రాయమూ లేదు. కాకపోతే

సరసుడెవడన్నా ఆమెను బలవంత చేస్తే, అతనితో బాటు సినిమాకెళ్ళేది. వాడు బాగున్నదంటే తనూ బాగున్నదనేది. వాడు "ఛూత్"అంటే, తను కూడా "ఛ ఛ"అనేది. బస్!

ఒకసారో ఎక్స్ట్రా సప్లయిరు కన్నమ్మకెక్కలిశాడు. ఆవిడ వడ్డూపొడుగూ  చూశాడు. పలకరించి చూశాడు. మాట స్వచ్ఛంగా అంటున్నదీ లేనిదీ గమనించాడు.

"సినిమాల్లో వేషం వేస్తావా?"అన్నాడు గళ్ళలుంగీవాడు.

"ఓ"అన్నది కన్నమ్మ.

"ఏం కావాలి?"అన్నాడు గళ్లలుంగీవాడు, బొటమనవేలికి చూపుడువేలు తాటిస్తూ.

"ఏమిస్తావ్?"అన్నది కన్నమ్మ కళ్లు టపటపలాడిస్తూ.

"ఓ గంటపని. రెండు డైలాగ్సున్నాయి. పాతికిస్తాను"అన్నాడు గళ్లలుంగీవాడు.

"సరే పద!"అన్నది కన్నమ్మ.

బస్సెక్కాక-

"నీ పేరేమిటి?"అన్నాడు గళ్లలుంగీవాడు ఆమెను రాచుకుంటూ.

"కన్నమ్మ!"

"అబ్బే"అని చప్పరించాడు గళ్లలుంగీవాడు. కాసేపు గిరజాలు దువ్వుకొని ఫకాలుమని నవ్వాడు వాడు.

"ఏందది?"అన్నది కన్నమ్మ, అతన్ని ఇంకాస్త వొత్తుకుంటూ.జ

"ఏంలేదులే!"అన్నాడతను.

ఆ సంగతి అప్పుడు చెప్పలేదతను, ఆరుమాసాల తరువాత చెప్పాడు.

"నీ పేరు కళ్యాణి. ఎవరన్నా అడిగితే అలానే చెప్పు".

"అదేం?"అన్నది  కన్నమ్మ.

"నీ అసలు పేరు చెబితే నీకిక్కడ మంచినీళ్లు కూడా పుట్టవు"

"అట్టాగా!"అన్నది కన్నమ్మ వురఫ్ కళ్యాణి.

ఆ క్షణం నుండి ఆవిడ కళ్యాణిగా మారిపోయింది.  ఆపేరు జ్ఞాపకం ఉండటం కోసం తనలో తను చాలాసార్లు గొణుక్కుంది. అంతచేసినా, సమయం వచ్చేసరికి పేరుకాస్తా మరిచిపోయిందొకసారి.

గళ్లలుంగీవాడు, ఆమెను స్టూడియోలోకి తీసుకెళ్ళి ఓ చెట్టుక్రింద కూచోమన్నాడు. వెళ్ళి ప్రొడక్షన్ మేనేజర్ను తీసుకొచ్చాడు. ఆ ప్రొడక్షన్ మేనేజరుకూ, గళ్ళలుంగీకి చాలాకాలం నుండీ దోస్తీ వుంది. ప్రొ॥మే॥ ఏ కంపెనీలో వున్నా గళ్లలుంగీని కనిపెట్టి వుంటాడు. అందుగ్గాను గళ్ళలుంగీ ప్రొ॥మే॥ క్కావలసిన సరుకును సరఫరా చేస్తూ ఉంటాడు.

"ఎలా వుంది?"అన్నాడు గళ్ళలుంగీ, మీసాలు మునిపంటితో కొరుకుతూ.

ప్రొ॥మే॥ ముఖంలో సంతోషం కనిపించింది. గళ్ళలుంగీ పొంగిపోయాడు.

"బాగానే ఉందనుకో..."అని ఆగిపోయాడు ప్రొ॥మే॥

"ఒకటో నెంబరు సరుకండీ!"అన్నాడు గళ్ళలుంగీ.

"కలర్ సరేనోయ్-"

"అన్నీ ఒకటోనెంబర్ సార్! చిలక కొరకని కాయ. గురువుగారికి అర్పిస్తున్నాను...కిందటిసారి కూడా గురువుగారు తక్కువచూపు చూశారు. ఆవారా, ఈ వారా ఈ దఫా చూపించాలి" అన్నాడు గళ్ళులుంగీ.

ప్రొ॥మే॥నవ్వాడు.

"పంపించు చూదాం"

గళ్ళులుంగీ కన్నమ్మ వురఫ్ కళ్యాణి దగ్గరకొచ్చాడు.

"ఎప్పుడూ యసాలెయ్యటం?"అన్నది కళ్యాణి.

"ఇప్పుడే!"అన్నాడు గళ్ళులుంగీ.

"మరి పదా"అన్నది కళ్యాణి.

"దామరీ!"అన్నాడు గళ్ళులుంగీ.

మధ్యలో అసలు విషయంకాస్తా చెప్పేశాడు గళ్ళులుంగీ.

"నువ్వందరితోటి మంచిగా వుండాలి. ఎవరు ఏం చెప్పినా "సరే"నంటూ ఉండాలి. అప్పుడే పైకొస్తావు. ఈ పెద్దపెద్దస్టార్లందరూ అట్లా వొచ్చినోళ్ళే"అన్నాడు గళ్ళులుంగీ.

"ఓహెూ!"అన్నది కళ్యాణి.

"వాళ్లకు మల్లే నీకూ పైకి రావాలని ఉందా?"

"ఉంది"

"పెద్ద పెద్ద మేడలూ తోటలు కావాలా?"

"కావాలి"

"కార్లు కావాలా?"

"కావాలి"

"నౌకర్లూ, చాకర్లూ కావాలా?"

"కావాలి"

"బాంకుల్లో డబ్బు, బీరువాల్లో నగలూ..."

"కావాలి"

"ఆటకు అరవై వేలు-"

"కావాలి"

"అయితే చెప్పినట్లు వింటావా?"

"వింటా".

"అయితే విను"అంటూ ప్రొ॥మే॥ సంగతి చెప్పాడు గళ్ళులుంగీ.

"ఓస్ ఇంతేగదా!"అనుకొన్నది కళ్యాణి.

మేకప్ రూమ్‌గుండా, పెద్ద పెద్ద అడవుల బొమ్మలున్న తడికల వెనక్కు తీసుకెళ్ళాడు గళ్ళులుంగీ.

అక్కడ కూచుని బీడీ కాలుస్తున్నాడు ప్రొ॥మే॥

"అరుగో ఆయనే దొరగారు! ఈ కంపెనీ మొత్తం ఆయనగారి చిటికెన యేలిచుట్టూ

తిరుగుద్ది''అన్నాడు గళ్ళలుంగీ.

''నిజమే''నన్నట్టు చూశాడు ప్రొ॥మే॥

నమ్మినట్టే చూసింది కళ్యాణి కూడా.

పదినిమిషాల తరువాత, కళ్యాణి కుచ్చెళ్లు సరిచేసుకుంటూ వచ్చింది.

ప్రొ॥మే॥ నవ్వుకొంటూ వచ్చాడు. అందాకా బీడీకాలుస్తున్న గళ్ళలుంగీ ఆఖరు దమ్ములాగి, బీడీని అవతల పారేశాడు.

''చెప్పండి!''అన్నాడు గళ్ళలుంగీ.

''చెప్పమను!''అన్నది కళ్యాణి.

''ఇందా!''అంటూ పావలా కాసు తీసి గళ్ళలుండీ చేతిలో పడేసి ''కాఫీ తాగి రావోయ్''అన్నాడు ప్రొ॥మే॥

అతని దయవల్ల కళ్యాణికి ఆ పిక్చరులో వేషం దొరికింది. వేషమంటే పెద్ద బ్రహ్మాండమేమీ కాదు. ఓ రాజుగారికి లేక లేక కొడుకు పుడతాడు. పుట్టాడంటే అందరూ సంతోషించవలసిందే గదా! ఆ చిన్నారి చిట్టితండ్రిని వుయ్యాల్లో పడుకోబెట్టి పాటలు పాడతారు. ఆ గుంపులో కళ్యాణి కూడా ఉంది. ప్రొ॥మే॥ కు ఇష్టమైన మనిషి గనక, కవిగారు కళ్యాణికి రెండుమూడు డైలాగ్స్ కూడా ఇరికించారు.

పోతూపోతూ వందరూపాయల రశీదు మీద సంతకం చేసి యాభైరూపాయలు పుచ్చుకొన్నాడు గళ్ళలుంగీ.

''మళ్లా కనిపియ్యవంటారా?''అన్నది కళ్యాణి.

''నీ ఎడ్రసివ్వు, నేనే వస్తాను''అన్నాడు ప్రొ॥మే॥

గళ్ళలుంగీ బస్సెక్కబోతూ పాతికరూపాయలు కళ్యాణి చేతిలో పెట్టాడు.

''ఇదేందీ!''అన్నది కళ్యాణి.

''అంతే!''అన్నాడు గళ్ళలుంగీ.

''అన్నిటికీ కలిసి పాతికేనా?''అన్నది కళ్యాణి.

''పాతికా నువ్వే తీసుకొంటావా? అందులో ఆరుంబావులా నా కమీషనుంది. దానిమాటో?''అన్నాడు గళ్ళలుంగీ.

''కమీషనుమాట నువ్వు ముందు చెప్పలేదు''అని పేచీకొచ్చింది కళ్యాణి.

''ఊరికే చెయ్యటానికి నువ్వు చుట్టానికి కావు''అన్నాడు గళ్ళలుంగీ.

అంతటితో ఊరుకోలేదు; ఇంకో బాణంకూడా విసిరాడు.

''నువ్విలాంటి పేచీకోరువని తెలిస్తే, అసలు వేషమే యిప్పించకపోదునే''.

కళ్యాణి గుండె నిజంగానే గతుక్కుమన్నది.

''గమ్మత్తుకన్నా లేవయ్యా!ఈ కాస్త దానికే ఏం ఉలిక్కిపడతావ్?''అన్నది కళ్యాణి.

అని పదిరూపాయలనోటు గళ్ళలుంగీ మీదికి విసిరి పారేసింది. వాడు ఇంటిదాకా వచ్చాడు. ఆ రాత్రి ఇంట్లోనే వున్నాడు.

గళ్లలుంగీని దాదాపుగా ఆరుమాసాలపాటు భరించింది కళ్యాణి. వాడు పగలల్లా పాండీబజారులో

తిరిగి, సాయంత్రానికి ఇంటికొచ్చేవాడు. వస్తూవస్తూ ఏదన్నా పిక్చర్లో చిన్న వేషమన్నా తెచ్చేవాడు. లేదా కస్టమర్‌నన్నా పట్టుకొచ్చేవాడు. ఇవి రెండూ లేనిరోజున కళ్యాణి వాణ్ణి రాచి రంపాన పెట్టేది.

వాణ్ణి పూర్తిగా వదిలించుకోవడానికి సుమారు ఏడాదికి పైగా పట్టింది కళ్యాణికి. ఆలోగా ఆవిడ చాలా కంపెనీలతో పరిచయాలు ఏర్పాటు చేసుకొంది. ఆ పరియాలెలాంటివంటే, వారిలో చాలా మంది కళ్యాణికోసం పడిచచ్చేవారు.

"శరీర సుఖమంటే ఏమిటో ఒక్క కళ్యాణి దగ్గరే తెలుస్తుంది"అన్నాడొక ప్రముఖ రసికుడు ఆరోజుల్లో.

కావాలన్న వారికి లేదనకుండా, శరీరం ఇచ్చింది. వారి ద్వారా తనక్కావలసిన పనులన్నీ చేయించుకొన్నది. తన శరీరం చూసి మగవెధవలకు మతులుపోతాయనీ, తన ముఖం చూస్తున్నంతసేపూ వాళ్ళు పిచ్చికుక్కలకన్నా కనాకష్టంగా మారిపోతారనీ, కళ్యాణి అనుభవపూర్వకంగా గ్రహించింది. వారా తిక్కలో ఉన్నప్పుడు, మెడలు విరిచి చేయరానిపనులు చేయించింది.

కళ్యాణికి చాలాకాలం పాటు మంచివేషాలు దొరకలేదు. దొరికినవైనా ఆవిడిచ్చిన శరీర సుఖానికి కృతజ్ఞతా సూచకంగా ఇచ్చిన వేషాలేగాని అట్టే మంచివి కావు. తనకు మంచి వేషాలు-జనం మెచ్చుకొనే వేషాలు-ఎందుకియ్యరో కొంతకాలం దాకా కళ్యాణికి తెలీదు.

'ఆవిడకు నటించడం చాతకాదు. చాతయిందల్లా-"అన్నారెవరో, అదేమిటో చేత్తో అభినయించి చూపిస్తూ.

ఆ సత్యాన్ని కళ్యాణి అక్షరాలా వొప్పుకొన్నది.

"సినిమాను నేను అంటిపెట్టుకొని ఉండడానికి కారణాలు అందరికీ తెలిసినవే! ఇంతకన్నా ఎక్కువ డబ్బిచ్చే పరిశ్రమ ఏదన్నా ఉంటే, నేను వేషాలెయ్యడం మానేస్తాను"అన్నది కళ్యాణి.

ఆ దరిమిలా ఆవిడ రామిరెడ్డితో సంబంధాలేర్పరచుకొన్నది. అతనిచేత కంపెనీ పెట్టించింది. అతనికి తోడుగా ఇంకో పదిమంది భాగస్తులను కలిపింది. వారిలో తంపుళ్లు పెట్టింది. ఒకళ్లనొకళ్లు నరుక్కుని చచ్చేలా చేసింది. అందరికీ తనంటే సదభిప్రాయం ఉండేలా చూసుకొంది. ఉన్న పదిమందీ "కళ్యాణి నా సొత్తే!" అనుకొనేలా చేసింది. వారుసినిమా అయితే తియ్యలేదు గానీ, కళ్యాణి ఆర్థికపరిస్థితులు మాత్రం మెరుగయినాయ్.

పదిమందినీ ఆకట్టుకొని, పది కంపెనీల్లో చిన్న వేషాలు తెచ్చుకొని, జీవితంలో రవంత స్థిరపడేనాటికి, ఇంకో బెడద కళ్యాణి మెడకు చుట్టుకొంది.

పోయాడనుకొన్న పకీరయ్య మళ్ళా ప్రత్యక్షమయ్యాడు. అతను కన్నమ్మను చూసి -కళ్యాణి అన్న మార్పును పకీరయ్య గుర్తించనే లేదు-హర్షించాడు.

"చాలామంది కళ్యాణి, కళ్యాణి అంటుంటే ఎవరోననుకొనేవాణ్ణి, నువ్వేనని నాకు మొన్నటిదాకా తెలీదు"అన్నాడు పకీరయ్య.

కళ్యాణి పలకలేదు.

"ఏదో సినిమా చూస్తున్నాం. అందులో నీ డాన్సుంది. 'అదేరా కళ్యాణి"అన్నాడు రసూల్. నీ ముఖం చూస్తూనే నిన్ను గుర్తుపట్టాను. అంతమంది ఎదుటా నువ్వు నా భార్యవని చెప్పుకోలేదు...నువ్వు

పైకొచ్చావ్, నేనింకా అట్టడుగునే ఉన్నాను''అన్నాడు పకీరయ్య.

కళ్యాణి ఏడుస్తుందనిగానీ, తనంటే జాలిపడుతుందనిగానీ పకీరయ్య ఏనాడూ అనుకోలేదు. కళ్యాణికి్కూడా అలాంటి ఆలోచన కలగలేదు.

ఆవిడ పకీరయ్యతో మాట్లాడుతున్న సమయంలోనే అనేకమంది రావడం, వారితో పక్కగదుల్లోకి వెళ్ళి కళ్యాణి మాట్లాడిరావడం జరిగింది.

''వాళ్ళంతా ఎవరు?''అన్నాడు పకీరయ్య, తాపీగా.

''నా స్నేహితులు, ఈసినిమాల్లో ఉండేవాళ్ళు''అన్నది కళ్యాణి.

''వాళ్ళతో ఏం మాట్లాడావ్?''అన్నాడు పకీరయ్య.

''సినిమా సంగతులు!''అన్నది కళ్యాణి.

''అయితే నాముందే మాట్లాడకపోయావా? చాటుకెందుకెళ్ళావ్?''అన్నాడు పకీరయ్య.

''నువ్వా సంగతులన్నీ వినడం ఇష్టంలేక!''అన్నది కళ్యాణి. ఆమెక్కోపం వచ్చింది. ''మాట్లాడవలసిందేమీ లేకపోతే నువ్వెళ్ళరాదా? ఇంకా ఎంతసేపని కూచుంటావ్?''అని కూడా అన్నదామె.

''మరి పంపించు''అన్నాడు పకీరయ్య.

''అంటే?''అన్నది కళ్యాణి కళ్ళు చిట్లించి.

''అంతేనా...?''అన్నాడు పకీరయ్య, 'డబ్బు'అన్నట్టు సైగచేస్తూ...

కళ్యాణి కోపం తారామండలానికి చేరుకుంది.

''నా దగ్గర చిల్లికానీ కూడా లేదు. ఉన్నా నేనివ్వను. నువ్వెవడవని, నీకు డబ్బివ్వను? నీకూ నాకూ సంబంధమేమిటి?''అన్నది కళ్యాణి.

పకీరయ్య ఏమీ అనలేదు. అన్నీ శాంతంగా విన్నాడు. విని కళ్యాణి కేసి చేశాడు. చూసి సన్నగా నవ్వాడు.

''నేను పదిరూపాయలడిగాను. పదిపదులు వంద తిట్లు తిట్టావు. ఒకప్పుడైతే రోషం వచ్చేదేగానీ, నాకిప్పుడు కోపం గాని, రోషంగానీ లేవు. రూపాయముందు ఇంకేవీ పనికిరావని నాయికు తెలుసుగనక నేను నోరు మూసుకొంటున్నాను''.

''నువ్వుత్త వెధవ్వు!''అన్నది కళ్యాణి.

''నిజమే!''అన్నాడు పకీరయ్య.

అతని నామాటలన్నాక, పదిరూపాయలిచ్చి పంపించింది కళ్యాణి.

ఆ పీడ ఇంతటితో వదలదని కళ్యాణికి తెలుసు. ఆవిడ పకీరయ్యకు నయానా భయానా చెప్పి చూసింది. ఇతరులచేత కూడా చెప్పించింది. ఆ సంప్రదింపుల్లోని బలహీనతలను పకీరయ్య కనిపెట్టాడు. తనకు డబ్బు కావలసివచ్చినప్పుడల్లా కళ్యాణిమీద విరుచుకుపడుతుండేవాడు. దానికో సందర్భమనిగానీ, సమయమనిగానీ ఉండేది కాదు. అర్ధరాత్రప్పుడూ, అపరాత్రప్పుడూ వచ్చేవాడు. షూటింగ్ జరుగుతున్నప్పుడూ, మేకప్ వేసుకొంటున్నప్పుడూ, కార్లో పోతున్నప్పుడూ కూడా పకీరయ్య వెంటపడేవాడు.

‘‘ఎవరతను?’’అని చాలామంది కళ్యాణిని అడిగారు.

‘‘తెలిసినవాడు’’అని మాత్రమే అనేది కళ్యాణి.

‘‘మాటిమాటికీ డబ్బు డబ్బంటూ నామీది కొస్తావేం? నాదగ్గర మాత్రం డబ్బెక్కడుంటుంది?’’అన్నది కళ్యాణివొకసారి.

‘‘ఉంటుంది’’అన్నాడు పకీరయ్య తాపీగా.

‘‘నా దగ్గర లేదు’’అని మొండికెత్తింది కళ్యాణి.

‘‘రిజర్వు బ్యాంకన్నా దివాలా ఎత్తుతుంది గానీ, సినిమావాళ్ళు-ముఖ్యంగా ఫైల్లో ఉన్న సినిమావాళ్ళు-డబ్బు లేదంటే నమ్మడమేనా? నేను పసివాణ్ణని నువ్వనుకుంటే తప్ప ఇలా మాట్లాడవు’’అన్నాడు పకీరయ్య.

‘‘ఆడదాన్నిలా ప్రాధేయపడ్డానికి నీకు సిగ్గువేయడం లేదా?’’

‘‘లేదు...’’

కళ్యాణి నిట్టూర్చింది.

‘‘ఇంకెప్పుడూ ఇలా రాకు. ఈసారి వచ్చావంటే, మెడబెట్టి గెంటిస్తాను’’

ఈ మనిషిని ఇంకెప్పుడూ రానీయవద్దని కాపలవాళ్ళతో చెప్పింది. ఈసారి పకీరయ్య ఆమను స్టూడియోలో కలుసుకొన్నాడు.

‘‘నీ ఇంటికి రావాలన్న వాంఛ కూడా నాకూ లేదు.నాకు సరిపడా డబ్బివ్వాలేగానీ, ఎక్కడికిరమ్మన్నా వస్తాను’’అన్నాడు పకీరయ్య.

నలుగుర్లో పడి అల్లరిపాలు కావడం కళ్యాణికిష్టంలేదు. అదీగాక అవిడప్పుడిప్పుడే పైకొస్తున్న తార. తనను గురించి ఇటువంటి ప్రచారం జరగడం, తన భవిష్యత్తుకేవిధంగానూ దోహదకారి కాదు.

‘‘నన్నిలా వేధించడం ధర్మం కాదు. నువ్వు నాశాంతాన్ని పరీక్షకు పెడుతున్నావు. ఎప్పుడో వొకప్పుడు నాకు చిరాకెత్తుకొచ్చిందంటే, నిన్ను పదిమందిలోనూ తన్నేస్తాను’’అన్నది కళ్యాణి.

పకీరయ్య పలకలేదు.

‘‘ఏదన్నా పనిచూపెడతాను చెయ్యరాదూ?’’అన్నదామె. ఈ పీడని ఎలాగయినా వొదిలించుకుందామని.

‘‘చెయ్యను. అవతల నాపెళ్ళాం సినిమాల్లో చేరి వేలకు వేలు తెస్తూ వుంటే, నేను పదికీ, పాతిక్కూ, ఊడిగం చెయ్యనా? ఆ మాటలనడానికి నీకు సిగ్గెయ్యడం లేదా?’’అన్నాడు పకీరయ్య.

‘‘నేనెవరి భార్యను కానే!’’

పకీరయ్య నవ్వాడు.

‘‘పిచ్చిదానా! మనపెళ్లినాటి శుభలేఖలున్నాయి. ఫోటోలున్నాయి. వాటిని నువ్వు మాయం చెయ్యలేవు. ఏ క్షణాన్నయినా నువ్వు నా భార్యవని రుజువు చేసుకోగలను’’.

కళ్యాణి కుంగిపోయింది. పకీరయ్య చూడకుండా కళ్ళొత్తుకుంది.

‘‘నీకో వెయ్యిరూపాయలిస్తాను. వదిలిపోతావా?’’అన్నది కళ్యాణి.

"ప్రస్తుతానికి సరేనని వెయ్యీ పుచ్చుకున్నాననుకో. అవి అయిపోయాక మళ్ళా నీ దగ్గర కొచ్చాననుకో. అప్పుడునువ్వు చేయగలిగిందేముంది చెప్పు? నా అవసరాలు ఈ వెయ్యితో తీరుతాయని నువ్వుగానీ, నిన్ను పుట్టించిన బ్రహ్మదేవుడుగానీ చెప్పలేడు. నువ్వోనేనో చచ్చిందాకా ఇదిలా సాగవలసిందే!"అన్నాడు పకీరయ్య చల్లగా.

"నన్ను వొదిలించుకోవాలని చూడబాకు, నేనంత సులభంగా వొదిలే రకాన్ని కాదు. నాకు పాపపుణ్యాల మీద, జాలిమీదా, ధర్మంమీదా నమ్మకాలు లేవు. వాటిని చూపి నన్ను లొంగదీసుకోగలుగుతాననుకోకు. కట్టుకుపోయినంత సంపాదిస్తున్నావు గదా, అందులో నూరోవంతు నాకోసం ఖర్చుచెయ్యడానికేం?...అదిలాభం లేదు. నువ్వెంతిచ్చినా ఆఫోటోల్విను...నాకున్న తురుపు ముక్కను వాడేసి ఆటను పాడుచేసుకొనేంత వెధవనుగాను"అని స్పష్టంగా తేల్చి చెప్పాడు పకీరయ్య.

పకీరయ్య తన మొగుడని చెప్పుకోవడం కళ్యాణికిష్టంలేదు. దానికి కారణాలు కూడా ఉన్నాయి. ఈ దిక్కుమాలిన రంగంలో 'గృహిణి'కన్నా 'కన్య'కే ఎక్కువ గిరాకీ ఉంటుంది. అదీగాక పకీరయ్యలాంటి అధమాదముణ్ణి తన మొగుడని చెప్పుకొని, తనకున్న విలువను పాడుచేసుకోవడం కూడా కళ్యాణికిష్టం లేదు.

ఏదోవిధంగా పకీరయ్యను వొదిలించుకోవాలని కళ్యాణి చాలాకాలం పాటు ప్రయత్నించింది. ఆవిడ ప్రయత్నించన కొద్దీ పకీరయ్య బిర్రబిగిసిపోసాగాడు.

"నేను నిన్ను వదలను, వదిలించుకోవాలని చూడకు"అని చాలాసార్లు పకీరయ్య తన మాజీ భార్యను హెచ్చరించాడు.

కొంతకాలం పాటు తన దగ్గరే వుండమన్నది. ఆ పనీ, ఈపనీ చెయ్యమన్నది. అన్నిటికీ 'సరే'ననేవాడు. ఏపనీచేసేవాడు కాదు. 'ఇదేమి'టని అడిగితే 'ఖస్సు'మని లేచేవాడు. పదిమంది ఉన్నారని కూడా చూసేవాడు కాదు. తనను చూసి కళ్యాణి భయపడుతున్నదని పకీరయ్య ఏనాడో గ్రహించాడు. ఆ భయాన్ని ఆసరాగా చేసుకొని తన పబ్బం గడుపుకోవాలని అతననుకొన్నాడు. ఇదెంతకాలం సాగుతుందన్న ప్రశ్న అతనికి తట్టలేదు. ఉట్ర ఉడియంగా వచ్చిన వైభోగం ఎంతకాలం ఉన్నా ఉన్నట్లే!

పకీరయ్య ఏమాత్రం జాగ్రత్తగా వున్నా కళ్యాణి ఏదోవిధంగా అతనితో సరిపెట్టుకొని పోగలిగేది. కానీ, పకీరయ్య అందుకు భిన్నంగా వ్యవహరించేవాడు. ఎవరో పార్టీలు వచ్చినప్పుడు కళ్యాణి మీద అధికారం చెలాయించచూసేవాడు. పనిమనుషులమీదా, నౌకర్లమీదా చచ్చేట్టు అరచేవాడు. చెడతాగి, రోడ్లమీద పడిపోయిన సందర్భాలు చాలా ఉన్నాయి.

"అతగాడెవరు?"అని చాలామంది కళ్యాణిని అడిగారు.

ఒకరికి చెప్పిన సమాధానం ఇంకొకరికి చెప్పకుండా కళ్యాణి సర్దుకొచ్చింది.

పకీరయ్యను హతమార్చాలని కళ్యాణి ప్రయత్నించిన సందర్భాలు చాలా ఉన్నాయి. కానీ, అవేవీ ఫలించలేదు. కళ్యాణి వేసిన ప్రతి ఎత్తునూ అతను భగ్నం చేశాడు. పైగా ఆవిడ మెడకే అపాయాన్ని చుట్టిపడేసేవాడు.

"నన్నిలా ఎందుకు బాధిస్తున్నావు?"అన్నదొకసారి కళ్యాణి.

"ఆ సంగతి నీకే తెలియాలి!"అన్నాడు పకీరయ్య.

"నాకేం తెలీదు"అన్నది కళ్యాణి.

పకీరయ్య అన్నిసంగతులూ మరకొసారి చెప్పుకొచ్చాడు.

"పోనీ ఓపనిచెయ్యి. నువ్వెక్కడన్నా వుండు. నెలకు రెండొందలో, మూడొందలో పంపుతాను. నువ్వీ మద్రాసులో వుండి బావుకునేదేముంది గనక? ఇక్కడుంటే నువ్వు నా దగ్గరకు రాకా మానవు, అల్లరి చెయ్యకా మానవు; అందువల్ల నా వృత్తి పాడయిపోతుంది. అదీనీకేనష్టం! బాగా ఆలోచించుకో పకీరయ్యా! నా దగ్గర నాలుగు పిచ్చికలుంటేనే నీకేదన్నా ఇవ్వగలను. నాకే బువ్వకు కటకటగా ఉంటే యింకా నీకిచ్చేదేమిటి? కాబట్టి-"అని సలహా ఇచ్చింది కళ్యాణి.

ఏ బుద్ధిన ఉన్నాడో గానీ పకీరయ్యకీ ప్రతిపాదన నచ్చింది.

"అయితే నెలనెలా నాకు తప్పకుండా పంపుతావా?"అన్నాడు పకీరయ్య.

"ఆఁ"అన్నది కళ్యాణి.

"అయితే ఈరోజునే పోతున్నాను"అన్నాడు పకీరయ్య.

కళ్యాని మనస్సు ఎగిరి గంతేసింది. అతనికో మూడొందల రూపాయలిస్తూ ప్రస్తుతానికి ఇవి నీదగ్గరుంచుకో. మళ్లీ నెలాఖరుకు పంపుతాను.నాకయినా అట్టేపిక్చర్సు లేవు. కాస్త కనిపెట్టి ఖర్చులు పెడుతూ వుండు"అన్నది.

"అలాగే"అన్నాడు పకీరయ్య.

కళ్యాణి ప్రాణానికిపుడు ఎంతో హాయిగా ఉన్నది. ఇంటికొనస్తానే ఏ గొడవలో తలదూర్చవలసివస్తుందోనన్న బెంగ ఆమెకిప్పుడు లేదు.

ఆవిడ తన కాలాన్నంతా పరిశ్రమ మీద కేంద్రీకరించింది. దొరికిన ప్రతిచిన్న అవకాశాన్నీ సద్వినియోగం చేసుకొంది. రకరకాల వ్యక్తులతో పరిచయాలు సంపాదించింది. అందుకోసం తన శరీరాన్ని వాడవలసివస్తే నిస్సంకోచంగా వాడిపారేసింది. ఓ గంట తేడాగా, తండ్రీకొడుకులతో ఒకే గదిలో, ఒకే పక్కమీద కళ్యాణి గడిపిన సందర్భాలు చాలా ఉన్నాయి.

ఆ శ్రమలో చాలా భాగం ఫలించింది. కళ్యాణికి కాస్తంత మంచివేషాలు దొరకసాగాయి. ఆ వేషాల వల్ల వేలకు వేలు దొరకని మాట నిజమేగానీ, వాటిని ఆధారం చేసుకొని లక్షలు సంపాదించవచ్చునని కళ్యాణికి తెలుసు. ఒక మామూలు ఆడది ఒక రాత్రికి సంపాదించే మొత్తానికి వందరెట్లు సంపాదన ఒక సినిమాతార ఒకే రాత్రికి సంపాదించడం కళ్యాణి చూస్తూనే ఉంది. అయినప్పుడు ఏదోవిధంగా రెండో పిక్చర్సులో కాస్తంత మంచి వేషాలు ముందుగా దొరకబుచ్చుకొంటే-ఆతరువాత తనకసలు వేషాలు లేకపోయినా బాధలేదు. తనకయినా సినిమాల్లో వేషాలెయ్యాలని లేదు. తనకు కావలసింది డబ్బు. ఆ డబ్బు-ఇంతకన్నా సులభంగా వొచ్చే మార్గమంటూ ఉంటే ఈ సినిమాలైను విడిచిపెట్టడానికి తనకేమీ అభ్యంతరం లేదు.

చిత్రరంగంలో సజావైన మార్గం కన్నా డొంకతిరుగుడు దోవకు ఎక్కువ విలువ ఉంటుంది. నువ్వెంత గొప్పవాడివైనా, నీకక్కడ మంచినీళ్లు పుట్టవు. నీకో ప్రొడ్యూసర్‌కో, డైరెక్టర్రో, డిస్ట్రిబ్యూటరో, దగ్గరవాడయివుంటే చాలు. కనీసం, ఒక హీరోగానీ, హీరోయిన్‌గానీ, విలన్‌గానీ, కమెడియన్ గానీ,

గట్టిగా రికమెండ్ చేసినా చాలు.

కళ్యానికి లగువు బిగువులు మొదటగానే తెలుసు. అంచాతే ఆవిడ మార్గం సుగమంగా ఉంది.

కళ్యాణికో కొడుకున్నాడన్న సంగతి-ఇప్పటికీ తెలియనివారు చాలామంది ఉన్నారు. కొంతకాలం పాటు 'వాడు నాకొడుకే'అని చెప్పుకొన్నది కళ్యాణి. ఆ తరువాత 'వాడు మాఅక్క కొడుకు'అనడం సాగించిందావిడ. కుర్రవాడికి అయిదో సంవత్సరం వచ్చినప్పట్నుంచీ 'మా తమ్ముడండీ!'అని వాణ్ణే చూపించసాగింది కళ్యాణి. జనం ఇవన్నీ నిజమని నమ్మారా లేదా-అన్న ప్రశ్నకే తావు లేదు. ఆవిడ ఎదుట ఏమీ అనేవారు కారు. చాటు ఏమనుకొనేవారో ఆమెకు తెలీదు.

ప్రతిచిన్న విషయాన్నీ తన అభివృద్ధికి అనుకూలంగా ఎలా మార్చుకోవడమన్న ప్రశ్నకు కళ్యాణి జీవితమొక పెద్ద జవాబు.

ఆవిడ తొలిసారిగా డాక్టర్ను కన్సల్టు చేసినప్పుడు "నువ్వు తల్లివి కాబోతున్నావు" అన్నాడతను.

కళ్యాణి గుండెలు నిజంగా జారిపోయాయి. ఆవిడకు ముచ్చెమటలూ పోశాయి.

"దీనికేమన్నా మార్గముంటే చెప్పండి! ఎంత ఖర్చయినా నేనిచ్చుకుంటాను"అన్నది కళ్యాణి, కళ్ళంట నీళ్లు పెట్టుకుంటూ,

ఆ డాక్టరు రెండు చేతులూ ఎత్తి కళ్యాణికి నమస్కారంచేశాడు.

"మీరలా అంటే కాదు. ఇలాంటివి రావడం నా వృత్తికి ఎంత దెబ్బో మీరూ ఆలోచించాలి"అన్నది కళ్యాణి.

"నన్ను క్షమించాలి. నేనిందుకు అసమర్థుణ్ణి...ఇప్పుడు ఎవ్వరుగానీ చెయ్యడానికేమీ లేదు. మీకు బతకాలని లేకపోతే తప్ప-ఇలాంటి సాహసానికి పూనుకోవద్దు"అని సలహా ఇచ్చాడతను.

అతని సలహా అంగీకరించినట్లు తలూపింది కళ్యాణి.

అతనికివ్వవలసిందేదో ఇచ్చింది. అలాంటి విషయాల్లో అనుభవమున్న ఇంకో డాక్టరును సంప్రదించింది. అతగాడుకూడా లాభం లేదన్నాడు. సమయం మించిపోయిందన్నాడు.

ఇంకొరైతే కుంగిపోయి ఉండేవారు. కళ్యాణి ధైర్యంతో నిలబడింది. ఆవిడో లిస్టు రాసుకొని, అందులోంచి తనకోసం వచ్చే వారెవరో గుర్తులు పెట్టుకొంది. వారందరికీ వరసాగ్గా ఫోను చేసి, తను తల్లిని కాబోతున్నాననీ, ఆ బిడ్డకు మీరే తండ్రులనీ ఫోను చేసింది. సంతోషించినవారికన్నా భయపడిన వారే ఎక్కువమంది.. వారందరికీ సంఘంలో మంచి పేరు ప్రతిష్టలున్నాయి. పలుకుబడులున్నాయి. కళ్యాణి ఆవిధంగా పదిమందిలోనూ ప్రచారం చేయడం ఇష్టంలేనివారు అంతో ఇంతో ఇచ్చి సర్దుకొన్నారు. మిగిలిన వారి నుండీ ఇంకోమార్గంలో కళ్యాణి డబ్బు పిండిపారేసింది!

రాజన్‌తో పరిచయమయ్యేనాటికి "సునీల్ బాబు"కు అయిదేళ్ళు.

"వీడెవడు?"అన్నాడు రాజన్.

"మా తమ్ముడు"అన్నది కళ్యాణి.

"ఓహెూ!"అన్నాడు రాజన్.

ఆ తరువాత అసలు సంగతి కాస్తా రాజన్ చెవిన వేశారు. మొదట్లో రాజన్ నమ్మలేదు.

''కావలిస్తే మీరు నిగ్గతీసి అడగండి. అబద్ధమయితే నన్ను చెప్పుచ్చుకు కొట్టండి''

''అలాగే''అన్నాడు రాజన్.

అతను కళ్యాణిని అడిగినప్పుడు ఆవిడ వొప్పుకోలేదు సరిగదా, రాజన్‌నే ముక్కచీవాట్లు వేసింది.

''అసలు మీ మొగజాతే దౌర్భాగ్యపుజాతి. అందులోనూ వ్యాపారస్తులున్నారే-సరేసరి! అదీగాక మనమిద్దంర శాస్త్రోక్తంగా పెళ్ళాడిని భార్యాభర్తలం కాము. నన్ను మీరెన్నయినా అడగొచ్చును. నేనేం చెప్పినా మీరు అబద్ధమనీ అనొచ్చును'' అన్నది కళ్యాణి.

''నువ్వునిజం చెప్పాలేగానీ, నేనెందుకు కాదంటాను?''అన్నాడు రాజన్.

''కాదంటారు-నేను మీ పెళ్ళాన్ని కాదుగా మరి''అన్నది కళ్యాణి.

రాజన్ ఏదో అనబోయి-ఏమనుకొన్నాడోగానీ మళ్ళా ఆ మాటను మింగేశాడు.

''నాకో కొడుకున్నమాట నిజమే! వాడు పోయాడు ఉన్నట్లయితే''అని కళ్ళొత్తుకుంది కళ్యాణి.

''నీ అక్క కొడుకని చెప్పావుటగా కొందరికి?''

''మా అమ్మ చనిపోయేనాటికి సునీల్‌కు రెండేళ్ళు.అప్పణ్ణించి వీడు మా అక్క దగ్గరే పెరిగాడు. ఆమెనే ''అమ్మా''అని పిలిచేవాడు. అంతలోకే మావాడు పోయాడు. ఆ బెంగతో డీలపడిపోకుండా ఉండేదుగ్గాను, మా అక్కా వీడూ చాలాకాలం ఇక్కడే వున్నారు. వాడు నాకెంత మాలిమయ్యాడంటే, నన్నే 'అమ్మ' అనుకొంటున్నాడు. అలానే పిలుస్తున్నాడు. అయిదేళ్ళ పసివెధవ ఎలా పిలిస్తే నేమని నేనూ పట్టించుకోవడం లేదు''.

రాజన్ ఈ మాట నామ్మడో లేదో భగవంతుడికి తెలియాలి. అతను మాత్రం సునీల్ ప్రస్తావన మళ్ళా తీసుకురాలేదు.

సునీల్‌ను ఇంకెక్కడన్నా ఉంచాలన్న ఆలోచన ఆతరువాతగానీ కళ్యాణికి రాలేదు. ఆ వాతావరణంలో ఆ కుర్రవాడుండడానికి కళ్యాణి మనస్సు అంగీకరించలేదు. క్షుద్రమైన తన బతుకును కొడుకు నుండి దాచుకోవాలనుకున్నది.

''నా దగ్గరకు పంపు, వాడూ నేనూ కలిసి వుంటాం''అన్నాడు పకీరయ్య.

''ఆలోచిస్తాను''అని సర్దిచెప్పింది కళ్యాణి.

అన్నదేగానీ ఆవిడకా ఆలోచనే లేదు. పకీరయ్య ఎంత నీచుడో తనకు తెలుసు. డబ్బుకోసం వాడు హత్యలు చెయ్యమన్నా నిస్సంకోచంగా చేస్తాడు. అలాంటివాడి సంరక్షణలో తన కొడుకుండటం కాన్న తన దగ్గిర ఉండటమే నయం! అదీగాక-తనకూ పకీరయ్యకూ ఉన్నసంబంధాలు మాత్రం ఏమిటి గనక? ఎప్పుడో తాలిగట్టాడు. పారిపోయాడు. తను రాజన్‌తో చేసిన కాపురంలో నాలుగోవంతు పకీరయ్యతో చెయ్యలేదు. వాణ్ణి నమ్ముకొని తన కొడుకును పంపడమంటే, అంతకన్నా అనుచితమైన కార్యమింకేదీ ఉండదు. పకీరయ్య దగ్గరకు సునీల్‌ను పంపడం సంగతి దేముడెరుగు-కనీసం వాడికంట తన బిడ్డపడటం కూడా తనకిష్టం లేదు.

ఉన్నట్టుండి ఓరోజున సునీల్‌ను వెంటతీసుకొని కళ్యాణి విమానమెక్కింది. నాలుగోరోజున వొంటరిగా తిరిగొచ్చింది.

"మీ తమ్ముడేడీ?"అన్నారెవరో.

"అక్కయ్య దగ్గర వొదిలివచ్చాను"అన్నది కళ్యాణి.

ఆ అక్కయ్యెవరో ఎక్కడుంటున్నదో యెవ్వరికీ తెలీదు.

"ఎక్కడకెళ్లావేమిటి?"అన్నాడు రాజన్ కళ్యాణి తిరిగి రాగానే.

"సునీల్‌ను మా అక్క దగ్గర దిగబెట్టి వచ్చాను"అన్నదావిడ.

"అదేం?"

"వాడిక్కడుండడం మీకిష్టంలేదుగా! వాణ్ణి చూస్తేనే పామును చూసినట్లుంటుందాయె మీకకు. మీ మనస్సు కష్టపెట్టడమెందుకని వాణ్ణి పంపించాను".

రాజన్ ఇంకేమీ అనలేదు.

అతనితో అలా అన్నదేగాని, నిజం అదికాదు. పకీరయ్యకు సునీల్‌ను చూస్తే అరికాలిమంట నెత్తికెక్కుతూ ఉండేది. వచ్చినప్పుడల్లా ఆ కుర్రవాణ్ణి రాచిరంపాన పెడుతూ ఉండేవాడు. రక్తపడేటట్టు కొడుతూ ఉండేవాడు. ఒకసారివాణ్ని మెట్లమీది నుండి కిందికి తోసేశాడు. అందుగ్గాను సునీల్ నెలరోజులపాటు ఆసుపత్రిలో ఉండవలసి వచ్చింది.

"వాడికింకా భూమ్మీద నూకలున్నాయి. గనక సమయానికి నువ్వొచ్చావు. ఎప్పుడో వొకప్పుడు వాడిచావు నా చేతుల్లోనే ఉంది"అన్నాడు పకీరయ్య.

ఆ తరువాతనే కళ్యాణి తన కొడుకును ఎక్కడికో పంపేసింది!

అని ముగించాడు చలపతి.

మంజరి నీరసంగా సోఫాలో లేచికూచున్నది.

"ఊఁ-తరువాత?"అన్నదావిడ.

"తరువాత ఏమీలేదు. నన్నడిగితే కళ్యాణి చాలా దురదృష్టవంతురాలంటాను. ఆవిడకు కావలసినవేవీ జీవితంలో లభించలేదు. అందుకోసం కళ్యాణి ఆత్మ ఎంతగా ఘోషించిందో నీకు తెలీదు; నాకు తెలుసు"అన్నాడు చలపతి.

"సునీల్ ఏమయ్యాడు?" అన్నది మంజరి ఆదుర్దాగా.

"ఏమవుతాడు మంజరీ! ఏం కావాలో ఆదే అయ్యాడు. బొంబాయిలో అదేదో హాస్టల్ ఉంచింది. అడిగినప్పుడల్లా డబ్బు పంపించింది. అల్లారుముద్దుగా పెంచింది. వాడెందుకూ కొరగానివాడయ్యాడు" అన్నాడు చలపతి.

"ఏమిటో మంజరీ! ఈ డబ్బుమీద కాపీనంతో మనిషి చేసే అఘాయిత్యాలు చూస్తుంటే - గుండెలు బాదుకొని ఏడవాలనిపిస్తుంది. ఇంతగా దిగజారిపోయి, ఇన్ని బాధలుపడి సంపాదించిన డబ్బు - చచ్చిన్నాడు వెంటవొస్తుందా? అదీలేదు. మరెందుకిన్ని ఛండాలప్పనులు చేయడం? ఏమాశించి? తృప్తికరమైన జవాబు చెప్పుకోలేం! సాధారణంగా - సినిమా తారలు ఎక్కువగా సంపాదిస్తారనుకొంటారు గానీ - అది నిజం కాదు. మీ కన్నా ఎక్కువ సంపాదనపరు లున్నారు. వాళ్ళు మీకన్నా బాగా నటిస్తారు. మీకన్నా బాగా"

''ఎవరు?'' అన్నది మంజరి.

చలపతి అటూ ఇటూ చూసి ''గూఢచారులు'' అన్నాడు. ''సునీల్ చివరికి ఆ ముఠాలో చేరాడు. మన శత్రువులకు ఉపయోగపడే రహస్యాలను సేకరించి, వీరు ఎక్కువ డబ్బుకు అమ్ముతుంటారు. అదో వ్యాపారంగా చేస్తున్నవారు చాలా మంది ఉన్నారు''

మంజరి కళ్ళు భయంతో నిండిపోయాయి.

''ఏమిటి మంజరీ!'' చలపతి ఆవిడ భయపడటం గమనించి.

''ఏమీ లేదుగానీ- నువ్వెప్పుడన్నా కళ్యాణి కొడుకును చూశావా?'' అన్నది మంజరి.

చలపతికామాటల్లో విశ్వాసం కుదరలేదు. అతగాడు మంజరికి తెలుసుననీ, ఆవిడ కావాలనే అబద్ధమాడుతున్నదనీ చలపతి గ్రహించాడు.

''తెలియని దానివయితే అతని కళ్ళను గురించి నువ్వడిగే ఉండవు మంజరీ! ఈ దశలో కూడా నన్నెందుకు బుకాయిస్తున్నావో అర్థం కాదు'' అన్నాడు చలపతి.

''మీరలా ప్రతి దానికీ సాగదీస్తూ కూచుంటే నేను చెప్పలేను. అప్పుడెప్పుడో కళ్యాణీ, నేనూ ఓ స్టూడియోలో ఉండగా ఓ పిల్లికళ్ళ కుర్రవాడొచ్చాడు. ఇప్పుడే వస్తానని కళ్యాణి ఆ కుర్రాణ్ణి తీసుకొని వెళ్ళిపోయింది. మీరా సంగతి చెబుతుంటేనూ- ఎందుకో ఈ సంఘటన జ్ఞాపకమొచ్చింది' అన్నది మంజరి.

చలపతి ఇంకేమీ అనలేదు.

''పకీరయ్య ఎలా ఉంటాడు?'' అన్నది మంజరి.

''ఎలా ఉన్నా అతను చేస్తానన్నదేమిటో చేశాడు మంజరీ! నేను కాస్త కనుకలిగి ఉన్నట్లయితే కళ్యాణికీమరణం సంభవించి ఉండేది కాదు. నేనూ అనుమానించానేగానీ- ఇంత అఘాయిత్యానికి అతగాడు పూనుకొంటాడనుకోలేదు. సరే- జరిగిందేదో జరిగింది. ఇప్పుడెవరు వచ్చినా కళ్యానిని బతికించలేరు. కావలసిందల్లా- మనమీ వ్యూహంలో చిక్కుకోకుండా ఉండటం'' అన్నాడు చలపతి.

''మనకేం సంబంధం చలపతీ? మనమెందుకు చిక్కుకొంటాం?'' అన్నది మంజరి.

''రామాయణమంతా విని కూడా సీతకూ రాముడికీ ఉన్న సంబంధమేమిటంటే నేనేం చెప్పనమ్మా? కళ్యాణి సహజంగా మరణించలేదనీ, ఎవరో ఆమెను హత్య చేశారనీ అందరూ అనుమానిస్తున్నారు. హంతకుడెవరో కూడా పోలీసులు కొద్ది రోజుల్లో తెలుసుకుంటారు. నీకూ, ఆవిడకూ మాంఛి దోస్తీ ఉంది గనక నీనించి ఈ కేసుకు సంబంధించిన సమాచారమేమన్నా రావచ్చునని పోలీసులనుకోవడంలో తప్పులేదు. వాళ్ళడిగే ప్రశ్నలెలా ఉంటాయంటే- చివరికి నువ్వే కళ్యాణిని హత్య చేసినట్టు- నీ చేతనే చెప్పిస్తారు. జాగ్రత్తగా ఉండటం మంచిది'' అన్నాడతను.

''నాకేమీ పాలుపోవడం లేదు చలపతీ! అంతా అయోమయంగా ఉంది. ఏమనాలో, ఏ మనగూడదో కూడా నాకు తోచకుండా ఉంది. ఈ క్షణాన నేనుత్త రబ్బరుబొమ్మను. నువ్వే దారం లాగితే, ఆ భాగం కదులుతుంది. నాకేమీ తెలీదు. నువ్వేం చెయ్యమంటే అదే చేస్తాను. ముంచుతానో, తేలుస్తానో నీదే భారం?'' అన్నది మంజరి కళ్ళు మూసుకొని.

చలపతి కింది పెదవి కొరుక్కొంటూ తనలో తనే నవ్వుకొన్నాడు.

❦❦❦❦❦❦❦❦

# 20

మంజరిమీద తనకున్న యావత్తు కసినీ తీర్చుకోవడానికింతకన్నా మంచి సమయం చలపతికి మరి లభించదు. అతనిక్కూడా వొకటి రెండుసార్లు మంజరిని దెబ్బతీద్దామా అనిపించింది. కానీ ఆ ఆలోచనను అతను అణగదొక్కిపారేశాడు. పగ తీర్చుకోవాలన్న స్వభావం మనిషిలో ఉండటం అతని అభివృద్ధికెంతమాత్రం దోహదకారి కాదన్న సత్యం అతను అనేక సందర్భాలలో రుజువు చేసుకొన్నాడు. ముఖ్యంగా సినిమా రంగంలో 'ఢీ' అంటే 'ఢీ' అనడం బొత్తిగా లాభం లేదు. ఏ నిమిషాన, ఎవరు ఏమవుతారో తెలీదు. ఇవ్వాళ ఎందుకూ పనికిరాడనుకొన్న వాజమ్మ ఆ మర్నాటి ఉదయానికల్లా ప్రముఖవ్యక్తయి కూచుంటున్నాడు. ఈ రోజు రాత్రి పది రూపాయలు వొళ్ళప్పగించినావిడ, రేపీ వేళకు గొప్ప స్టారయికూచుంటున్నది. నిన్న ఒక్క పిక్చరుకు యాభైవేలు తీసుకొన్న డైరెక్టరుకు రేపు మంచినీళ్ళు పుట్టకపోతే ఆశ్చర్యం లేదు. ఇదేమిటన్న ప్రశ్నకు జవాబు లేదు, ఇదింతే!

మంజరిని తక్కువ అంచనా వేయడం పొరబాటని చలపతికేనాడో తెలుసు. తన శత్రువును గురించి సరైన అంచనా వేసుకోలేనివాడు, పోరాటంలో ఛస్తే విజయాన్ని సంపాదించుకోలేదు. ఆవిడకున్న పరపతి కూడా తక్కువది కాదు. ఇప్పటికయినా మంజరికొచ్చిన చిక్కులేమీ లేవు. పోలీసులు తమ వృత్తి ధర్మంగా అందరితో బాటు మంజరిని కూడా అనుమానించారు. రేపో ఎల్లుండో నిజం తెలియకపోదు. మంజరి మీదున్న అనుమానం రహితం కాకపోదు. చిక్కల్లా అసలైన హంతకుడు పట్టుపడటం వరకే! అదేదో ఈసరికే ప్రారంభమయింది. పోలీసుకుక్కల కోసం కబురు వెళ్ళింది కూడాను.

ఈ కాస్త భాగ్యానికి గాను తను మంజరిని నొక్కి పారేయడం సబబు కానేకాదు. సమయం చిక్కినప్పుడు తనను నామరూపాలు లేకుండా మంజరి చేయగలదు. తనెప్పుడో చేసిన పనికి కళ్యాణి- చచ్చిందాకా తనను సాధిస్తూనే ఉంది. ఆ అనుభవంనుండి తను పాఠాలు చేర్చుకోకపోవడం అనుచితం.

"ఏమిటాలోచిస్తున్నావు?" అన్నది మంజరి.

చలపతి సిగరెట్ వెలిగించాడు.

"ఏదీ?' అంటూ చెయ్యి చాపింది మంజరి.

చలపతి ఆవిడ పెదవులకు తనే సిగరెట్ అందించి లైటర్‌తో వెలిగించాడు.

"మనిషి- అలవాట్లకు ఎంతగా బానిసయిపొయ్యాడో చలపతీ! ఇందాకణ్ణించీ సిగరెట్ కాల్చకపోయేసరికి నరాలన్నీ జివజివలాడిపోతున్నాయి. ఈ పంపిణీమీద ఆలోచిస్తే మనమెక్కడ తేలతామో బోధపడటం లేదు" అన్నది మంజరి.

చలపతికెందుకో నవ్వొచ్చింది, అతనేదో అనబోయాడు, అంతలోనే ఫోను మోగించి.

"చూడు" అన్నది మంజరి.

చలపతి ఆవిడ కళ్ళల్లోకి చూశాడు.

"అలా చూడకు బాబూ! ఈ క్షణాన, నేను సముద్రమంత భయంతో మునిగి ఉన్నాను. ప్లీజ్- అదేదో చూడు. నా ప్రాణాలింకా తోడేయకు"

చలపతి లేచి రిసీవర్ అందుకొన్నాడు. "హలో' అని అవతలనించి మాట్లాడే గొంతు విని, నిర్విణ్ణుడయిపోయాడు. ఒక్కసారిగా అతనిలో వచ్చిన మార్పు చూసి, మంజరి జావలాగా జారిపోయింది.

"ఎవరు?" అన్నది మంజరి పొడారిపోయిన గొంతుకతో. "మళ్ళీ పోలీసులు గానీ-"

చలపతి మౌత్‌పీస్‌కు చెయ్యడ్డు పెట్టి "కాదు మంజరీ, పకీరయ్య!" అన్నాడు.

మంజరి కళ్ళు భయంతో ఎరుపెక్కిపోయాయి.

"ఏదో మాట్లాడేసెయ్యి, అంతే!" అని సోఫాలో బారుగా పడుకొని, ముఖాన్ని చేతులతో కప్పేసుకొన్నది.

"ఈలోగా అవతలనించి 'హలో హలో హలో' అని ఒకటే గోల. చలపతికింకేమీ తోచలేదు. మౌత్‌పీసుకు అడ్డున్న చెయ్యితీసి "చెప్పండి" అన్నాడు.

"హలో అని ఇంతసేపాగారేం? సరే- మీరూ, మంజరీ వోసారి కళ్యాణి ఇంటికి రండి! డాక్టరు పరీక్ష అయిపోయింది. అనుమానితుల్లో కొందర్ని అరెస్టు చేశాం. ఇంకొందరి కోసం వెదుకుతున్నాం" అన్నది అవతలి గొంతు.

"మంజరి రాలేదు. నేనొక్కణ్ణి వస్తాను. సరిపోదా?" అన్నాడు చలపతి.

"ఏమిటది?" అన్నది మంజరి లేచి కూచుని.

చలపతి మౌత్‌పీస్‌కి మళ్ళా చెయ్యడ్డు పెట్టాడు.

"పకీరయ్య- నిన్నూ నన్నూ రమ్మంటున్నాడు. అడ్రసు కూడా చెప్పాడు. మనతో ఏదో మాట్లాడాలిట. వెంట ఎవర్నీ తీసుకు రావద్దనీ, వొంటరిగా రమ్మనీ అంటున్నాడు. నీవు రాలేవన్నాను' అన్నాడు చలపతి.

"నువ్వూ పోవాకు చలపతీ!" అన్నది మంజరి.

ఈలోగా అవతలనించి వొకటే పిలుపు.

"మీ ధోరణిని చూస్తుంటే ఏదో కుట్ర చేస్తున్నట్టుగా ఉన్నది. అడిగిందానికి సమాధానమ్విడానికి ఇంత ఆలస్యం దేనికీ?" అన్నాడు పోలీసాఫీసరు.

"మరేం లేదండీ! మీరు చెప్పిన సంగతులు మంజరిగారికి చెబుతున్నాను... ఆమె బాగా తీసిపొయ్యారు. తను రాలేనని మీకు ప్రత్యేకంగా చెప్పమన్నారు... సరే! అలాగే!" అని ఫోను పెట్టేశాడు చలపతి.

పది నిమిషాలకల్లా పోలీసు వాను రావడం మంజరి చూసింది.

"మళ్ళా పోలీసులొచ్చారు" అన్నదావిడ విహ్వలస్వరంతో.

"వస్తారు. ఈ గొడవ ఏదో విధంగా తీరిపోయేవరకూ మనకీ బెడద తప్పదు" అన్నాడు చలపతి. "ఊఁ... బయలుదేరు. బహుశా మన కోసమనే వచ్చుంటారు... లాభం లేదు మంజరీ! మన యిబ్బందులేవీ పోలీసులకు పట్టవు. వాళ్ళ డ్యూటీకి భిన్నం కాకుండా వాళ్ళు చూసుకోవాలిగదా!"

తలుపు చప్పుడయింది.

“పోలీసులొచ్చారు. వాకిలిదగ్గరున్నారు’ అంటూ తలుపు తీశాడు చలపతి. అతనన్నది నిజమే! ఇద్దరు పోలీసులు వాకిలి దగ్గర నిలబడి, మంజరికీ, చలపతికి శాల్యూట్ చేశారు.

“అయ్యగారు రమ్మంటున్నారండీ!”

మంజరీ, చలపతీ నిశ్శబ్దంగా మెట్లు దిగారు. కారులో కూడా ఎవ్వరూ మాట్లాడలేదు. మంజరి కారు కుదుపుకు జోగిపోతూ ఉంది. చలపతి పెదవులు ఎండిపోయాయి.

“రండీ!” అంటూ తలూపాడు పోలీసాఫీసరు. “మీరింక దహనానికి ఏర్పాట్లు చేసుకోండి. ప్రస్తుతానికింతే! అవసరమైనప్పుడు కలుసుకొంటాను”

“అదేదో నువ్వే చూడు చలపతీ!” అన్నది మంజరి.

“అలాగే!” అన్నాడతను, మంజరి కళ్ళల్లోకి చూస్తూ.

“ఊఁ- డబ్బా?” అన్నది మంజరి సన్నగా నిట్టూర్చి. “నా బాగ్‌లో కీ ఉంది. బీరువాలో డబ్బుంది... నేనిక్కడే ఉంటాను- నువ్వింటికెళ్ళి పట్టుకురా. నే రాలేను, వోపిక లేదు”.

“మరీ నీరసంగా ఉన్నారు? ఏమన్నా తీసుకొంటారా?” అన్నారెవరో.

“ఊఁహు”.

మళ్ళీ ఈగలు ముసిరినట్టు జనం మూగుతున్నారు. చాలా మంది సినిమా వారు రావడమూ - మంజరిని పలకరించడమూ - ఆవిడేదో సమాధానం చెప్పడమూ - మంజరికి శోషొస్తున్నట్లనిపించింది. సమాధానం చెప్పకపోవడం సాంఘిక మర్యాద కాదు. చెప్పడానికి వోపిక లేదు. జీవితం ఇంత ఇరుగ్గా ఎందుకుంటుందోననుకొన్నది మంజరి.

చలపతి రావడానికి పక్కా రెండు గంటలకు పైగా పట్టింది. అతను వస్తూ వస్తూ చాలా ఏర్పాట్లను చేసుకొచ్చాడు. అదేదో కంపెనీవారికి ఫోన్ చేసి, కళ్యాణి అంత్యక్రియలను షూట్ చెయ్యమన్నాడు. ప్లేబాక్ ఆర్టిస్టునూ, ఆర్కెస్ట్రావారినీ, మ్యూజిక్ డైరెక్టర్లనూ పిలిచి, కళ్యాణి ఇంటినుంచి శ్మశానందాకా పాటలు పాడేందుకు ఏర్పాటు చేశ్శాడు. ఇద్దరు కవులు అప్పటికే పాటలు రాసి సిద్ధంగా ఉన్నారు. శర్మగారితోనూ, బ్రహ్మంగారితోనూ, హనుమంతరావుగారితోనూ కళ్యాణి మరణాన్ని గురించి ప్రత్యేక సంచికలు వేయమన్నాడు. అందినంతవరకూ పూలూ పూలదండలు కొనిపారేశాడు. ప్రతి పాతిక గజాలకూ కళ్యాణి శవంమీద పూలు చల్లడానికి, ప్రతి ఫర్లాంగుకూ పూలదండలు వేయడానికీ జనాన్ని బుక్ చేశాడు.

“అలా ఉన్నావేం?” అన్నాడతను మంజరిని చూసి.

“నాకు నిద్ర ముంచుకొస్తున్నది” అన్నదావిడ.

రెప్పలకు రాళ్ళు కట్టినట్లుగా అవి కిందికే వాలిపోతున్నాయి.

“ఇహ నావల్లకాదు. నేను లేచి నిలబడను కూడా లేను”అన్నది మంజరి.

“అవునుగానీ, అతనెవరో చెప్పగలవా? నీవేపు అదేపనిగా చూస్తున్నాడు”

మంజరి అటు దిక్కుగా చూసింది.

“అబ్బ! భగవంతుడు ఇన్ని పరీక్షలు ఎందుకు పెట్టినట్లు చలపతీ! వాడి చూపులు నన్ను చీలుస్తున్నట్లుగా ఉన్నాయి. వాడు-” అని ఊరుకొన్నది మంజరి.

"అవునవును, కళ్యాణి కొడుకు! నువ్వు గుర్తించావో లేదోనని అడిగాను"

"ఈ ఏర్పాట్లన్నీ అతను చేసుకోలేడూ! మనం వైదొలిగితేపోదా?" అన్నది మంజరి.

"అతను కళ్యాణి కొడుకో కాదో కోర్టు తేల్చవలసి ఉంది. అది మరో చిక్కుల మాది వ్యవహారం. ప్రస్తుతానికి మనం నడుం కట్టుకోకపోతే కళ్యాని శవాన్ని కుక్కలూ నక్కలూ పీక్కుతింటాయి. ఓపిక ఉన్నా లేకపోయినా, మనమీపని చేయకతప్పదు" అన్నాడు చలపతి.

మంజరింకేమీ పలకలేదు.

అనుకొన్న పనులన్నీ తు - చలు తప్పకుండా అయ్యాయి. కొన్ని వేలమంది ప్రజలు దోవపొడుగునా నిలబడ్డారు. శవానికి ముందుగా మంజరీ చలపతీ నడిచారు.

తల దగ్గర నిప్పు ముట్టించబోయేముందు ఆఖరిసారిగా కళ్యాణి ముఖం చూసింది మంజరి. ఆ ముఖమిపుడు పూర్తిగా రంగు మారిపోయింది. పూలదండల అడుగున, పేగుల కుప్పలు, మాంసపు ముద్దలు చిత్తవత్తుగా పడివున్నాయి. డాక్టర్లు పరీక్ష నిమిత్తం కళ్యాణి శవాన్ని కోశారని మంజరి విన్నదేగానీ, ఆ దృశ్యాన్ని ఆవిడ ఊహించలేదు. ఇప్పుడు ప్రత్యక్షంగా చూసి, విహ్వాలురాలయింది.

తలదగ్గిర నిప్పు పెట్టబోయేముందు మంజరి చేతులు వణికాయి. అంతదాకా ఎక్కడో అణిగి మణిగి ఉన్న దుఃఖం కట్టలు తెంచుకొని ఉరికింది. అంత భయంకరంగా, హృదయ విదారకంగా మంజరి ఎప్పుడూ ఏడ్చి ఉండలేదు.

"త్వరగా కానియ్. చాలా మంది ఇందుకోసం ఉన్నారు" అన్నాడు చలపతి.

మంజరి కొయ్యలన్నీ తొలగించి, కళ్యాణి ముఖాన్ని రెండు చేతులలోకి తీసుకొని మరోమారు భోరుమని ఏడ్చింది.

ఎవరెవరో వచ్చారు, మంజరిని ఇవతలికి తీసుకొచ్చారు. ఆవిడ తరపున, ఆవిడ సమక్షంలో, చలపతి నిప్పు ముట్టించాడు. మంటలు మెలి తిరుగుతూ పైకి లేచాయి. గుప్పుమని పొగమబ్బులు, కట్టెల్లోంచి శవం మీదుగా పైకి లేచి, శ్మశానమంతటా కమ్ముసాగాయి. ఇంకెవరో వచ్చి ఇంత నూనె చల్లారు. ఈసారి మంటలు ఆవురావురుమంటూ శవం మీదికి ఎగబాకాయి. అయిదారు నిమిసాలకల్లా ఒక్క మంటలు తప్ప, ఇంకేమీ కనిపించడం లేదు.

మంజరి గిరక మీద పడుకొని, మంటలకేసి చూస్తున్నది.

"పోదామా?" అన్నాడు చలపతి.

మంజరి మాట్లాడలేకపోయింది. చేత్తో సైగ చేసింది, పోదామన్నట్లుగా.

❦❦❦❦❦❦❦❦

ముందుగా పోలీసులు పది పదిహేనుమందిని అరెస్టు చేశారు. వారందరూ కళ్యానిని చంపడానికి కారణాలున్నాయి. అయితే వారందరూ హంతకులని పోలీసు శాఖ కూడా అనుకోలేదు. అసలు హంతకుడెవరో తెలుసుకోవడానికి ముందు ఇలాంటి చిల్లరమల్లర పనులు కొన్ని ఎటూ కూడీ చెయ్యాలి. ఇందువల్ల ఎన్నో ప్రయోజనాలున్నాయి. పోలీసుల దృష్టి ఇంకో వేపు మళ్ళిన కారణంగా అసలు హంతకుడు కాస్తంత అజాగ్రత్తగా ఉండటం సహజం. అలాంటి దశలో అతన్ని పట్టుకోవడం సులభమవతుంది. ఇంకోటేమిటంటే, చిల్లరమల్లర అరెస్టుల్లో అసలు హంతకుడికి సంబంధించిన

సమాచారం ఒక్కొక్కసారి లభిస్తుంది. ఏ మాత్రం ఆచూకీ దొరికినా, డొంకంతా కదపవచ్చు మరి!

ఈసారీ అలానే జరిగింది. పోలీసులు అరెస్టు చేసిన వారిలో పకీరయ్య స్నేహితుడొకడున్నాడు. వాడు హత్య సంగతి చెప్పలేదుగానీ, పకీరయ్యను గురించి చాలా చెప్పుకొచ్చాడు.

"అతనికేమీ పనిలేదు. కానీ చాలా కులాసాగా ఉండేవాడు. ఎక్కణ్ణించో ప్రతి నెలా రెండు మూడు వందల రూపాయలు వస్తుండేవి. అప్పుడప్పుడు అతను కూడా మద్రాసు పోతుండేవాడు వచ్చేప్పుడు బాగా డబ్బు తెచ్చేవాడు" అన్నాడతను.

"అసలు నీకూ అతనికి స్నేహమెలా కలిసింది?" అన్నారు పోలీసులు.

"ఇద్దరం పేకాటలో కలుసుకొనేవాళ్ళం" అన్నాడతను.

పకీరయ్య సాధారణంగా ఎక్కడెక్కడ వుండేదీ అతనే చెప్పాడు. నాలుగు రోజులపాటు - మద్రాసులోనూ, చుట్టుపక్కలా పోలీసులు గాలించి పారేశారు. ఆఖరికి మంజరి ఇంటి సమీపంలో పకీరయ్యను అరెస్టు చేశారు. ఆ సమయాన పకీరయ్య దగ్గర ఎలాంటి ఆయుధమూ లేదు.

అతను అనుమానాస్పదంగా తిరుగుతున్నాడు. అదీగాక అతనికి నాలుగు గజాల దూరంలో తొమ్మిదంగుళాల పొడవు కలిగిన కత్తి దొరికింది.

పకీరయ్య కళ్యాణిని హత్య చేశాడని పోలీసులు కేసు నమోదు చేశారు. కళ్యాణి గదిలోని అడుగుల ముద్రలు, పకీరయ్య అడుగుల ముద్రలూ తీశారు. అవి సరిపోయాయి. కళ్యాని గొంతుమీదా, టెలిఫోనుమీదా పకీరయ్య వేలిముద్రలున్నాయి. కళ్యాణి అతనికి చేసిన మనియార్డర్ల వివరాలు, రసీదు నెంబర్లు కూడా పోలీసులు ప్రొడ్యూస్ చేశారు. పీకరయ్య రౌడీ అనీ, బ్లాక్‌మెయిల్ చేసి సినిమా వాళ్ళను ఏడిపించి డబ్బు పిండుతూ ఉంటాడనీ, తాగుబోతనీ, కొన్ని హత్యలలో అతనికి పరోక్షంగా సంబంధాలున్నాయనీ, ఇంకా శతకోటి కారణాలను పోలీసులు పోగుచేశారు.

"మనం కూడా కోర్టుకు హాజరుకావాలి. పోలీసులు మనల్ని సాక్ష్యం కోసం తప్పకుండా పిలుస్తారు" అన్నాడు చలపతి.

"తప్పుకోడానికింకే మార్గమూ లేదా?" అన్నది మంజరి.

చలపతి నవ్వాడు.

"లేదు మంజరీ! కోర్టును కాదనడం ఎంత పెద్ద నేరమో నీకింకా తెలియదనుకొంటాను. మనమయినా చాలా జాగ్రత్తగా ఆలోచించి సమాధానాలు చెప్పాలి. డిఫెన్సు లాయర్లు అఖండులున్నారు. మన నోటిమీదుగా మనమే కళ్యాణిని హత్య చేసినట్లు వారు చెప్పించగలరు. అందుకని మనం కూడా ఓ క్రిమినల్ లాయర్‌ను కన్సల్టు చేదాం" అన్నాడతను.

"అలాగే చెయ్యి ఇలాంటి విషయాల్లో నన్ను సంప్రదించనవసరం లేదు చలపతీ! నీకేది సబబుగా తోస్తే అలా చెయ్యి నేను కాదనను" అన్నది మంజరి.

"నా చిట్టి తల్లీ! అలా దిగిరావే" అనుకొన్నాడు చలపతి.

కళ్యాణిపట్ల సానుభూతి ఉన్నా లేకపోయినా, మంజరంటే గిట్టనివారు కొందరు పకీరయ్యను కలుసుకొని ఉబకేశారు.

"నీకొచ్చిన భయంలేదు. నీ వెనక మేమంతా వున్నాం. కళ్యాణిని నువ్వు చంపలేదని మాకందరికీ తెలుసు. అథవా చంపావనుకో - ఆ పని చెయ్యమని నిన్ను ప్రోత్సహించినావిడ మంజరేగదా! అందుకోసం నీకు మంజరి చాలా డబ్బు కూడా ఇచ్చింది. నువ్వు హత్య చేశావు. చెయ్యకపోతే నీమీద దొంగకేసు పెట్టిస్తానన్నది. నిన్ను తన్నిస్తానన్నది. ఆత్మరక్షణకోసం, నువ్వు ఈ పని చేశావు. అదైనా కళ్యాణిని చంపడం నీకిష్టం లేదు. కొడదామని వెళ్ళావు. కొట్టావు. పొరబాటున తగలరానిచోట దెబ్బ తగిలింది. కళ్యాణి చనిపోయింది" అని నూరిపోశారు వారు.

"ఇందువల్ల లాభముంటుందా?" అన్నాడు పకీరయ్య.

"ఆఁ" అన్నారు వారు.

"అయితే చెబుతా"నన్నాడు పకీరయ్య.

హఠాత్తుగా అనుకోని మలుపులోకి తిరిగింది కేసు. డిఫెన్సు లాయరు అడుగుతున్న ప్రశ్నలకు మంజరి హడలిపోసాగింది. అతను రకరకాల ప్రశ్నలు వేసి, పకీరయ్య చాలా కాలం నుండి తెలుసుననిపించాడు ఆమెచేత. మొదటి రోజున ఈ మాట అనిపించిన వాడు ఆఖరి రోజుకు ఇంకేమన్నా అనిపిస్తాడు. అందులో సందేహమేమీ లేదు.

ఈ కేసునూ, కోర్టులో జరిగే విచారణనూ పత్రికలు వైన వైనంగా ప్రకటించసాగాయి. డిఫెన్సు లాయరడిగే ప్రశ్నలకు హెడ్డింగువేసి, మంజరి నేరస్తురాలన్న భ్రమను కొన్ని పత్రికలు కలగచేశాయి.

ఆ పత్రికల వాళ్ళకు కబురు చేసి మంజరి మాట్లాడింది.

"మీరలా ప్రతి చిన్న విషయానికి కలగజేసుకోకండమ్మాయిగారూ! మేమీ పని చేయడం మా కిష్టమయి కాదు. సెన్సేషనల్ న్యూస్ వేస్తే జనం కొంటారని మీకు తెలీదా?" అన్నారు వారు.

మంజరి మాట్లాడడానికేమీ మిగల్లేదు.

ఈ పంకంలోనుండి బయట పడడానికి దాదాపుగా అయిదారుమాసాల టైం పట్టింది. ఈలోగా మద్రాసు కంపెనీలు అయిదారు, బొంబాయి కంపెనీలు మూడూ మంజరిని కొత్త బుకింగులకోసం వత్తిడి చెయ్యసాగాయి.

"నా మనస్సేమీ బావోలేదు. నేనిప్పుడప్పుడే ఏమీ చెప్పలేను. నాక్కొంత వ్యవధి కావాలి. నన్ను తొందరపెడితే - కాదనాలిసొస్తుంది" అన్నది మంజరి.

"అంటే, మీరు సినిమా ఫీల్డునుంచి తప్పుకొంటున్నారా?" అన్నాడొకాయన.

మంజరికి ఎక్కడ ముండాలో అక్కడే ముండింది. ఆవిడ కోపం చూసి ఏం కొంపముంచుతుందోనని చలపతి చక్రం అడ్డుపెట్టాడు.

"అబ్బే, అదేం కాదండీ! తనకు మనస్సు బావులేదంటున్నారామెగారు. కళ్యాణి మరణం మంజరిని బాగా దెబ్బతీసింది. కోలుకోవడానికి కొంత వ్యవధి ఉంటే మంచిదని వారభిప్రాయం. మీరీలోగా అన్నీ సిద్ధం చేసుకోండి" అన్నాడు.

"కథ రెడీగా ఉంది, మొన్ననే బెంగాల్ నుంచి కొనుక్కొచ్చాను. ఇతర ఆర్టిస్టులను కూడా అడిగాను" అన్నాడతను.

"అలాగా!" అంటూ చలపతి ఆ పెద్దమనిషిని ఇవతలికి తీసుకొచ్చి, సున్నితంగా చీవాట్లు

వేశాడు.

"అది కాదయ్యా బాబూ! నువ్వు బెంగాల్ నుండి తెచ్చినా, బొంబాయి నుండి తెచ్చినా ఆ కథ మంజరికి నచ్చాలి. ఇది మొదటి పాయింటు. రెండోదేమిటంటే - ఆమె నడక్కుండా మీరు హీరోనుగానీ, ఇతర ఆర్టిస్టులనుగానీ బుక్ చెయ్యడానికి లేదు".

"అదేం?" అన్నాడతను దిమ్మరపోయి.

"అదంతే! దానికిష్టమయితేనే మీరు మంజరిని బుక్ చేసుకోండి. లేకుంటే ఇంకెవరినన్నా చూసుకోండి" అని ఖండితంగా చెప్పేశారు చలపతి.

ఆ పెద్దమనిషి కాస్సేపు ఆలోచించి, ఏమనుకున్నాడో మరి - 'మళ్ళా కలుస్తాను' అని వెళ్ళిపోయాడు.

మిగతా కంపెనీలవాళ్ళు చాలా తెలివిగా వయవహరించారు.

"మంజరిగారు 'సరే'నంటే ఇంకో ఆరుమాసాలపాటు ఆగడానికయినా మాకభ్యంతరం లేదు" అన్నారు వారు.

ఈ విషయాలన్నీ మంజరికి చెప్పినప్పుడు ఆవిడంత ఉత్సాహాన్ని చూపించలేదు.

"ఎందుకొచ్చిన లాయలాస ఇదంతా చలపతీ! ఇప్పుడు మనం కూటికీ గుడ్డకూ మొఖం వాచిపోతున్నదేమీ లేదు. ఉన్నదాన్ని జాగ్రత్తగా వాడుకొంటే నాకు సరిపోదా? నాకీ సినిమాలమీదా బతుకుమీదా రుచి తప్పిపోయింది" అన్నది మంజరి.

"అలా అనకు. కేవలం బతకలేకనే మనమిదంతా చేస్తున్నామనుకోవడం తప్పు. గొప్ప గొప్ప విజయాలు సాధించే అవకాశాలు జీవితంలో ఎప్పుడో గానీ తటస్థపడవు. అదీ - అందరికీ - అలాంటి అవకాశాలు కూడా దొరకవు. భగవంతుడు నీకలాటి వరమిచ్చాడు. నువ్వింకా ఉన్నత స్థానానికి వెళ్ళాలి. వెడతావు కూడాను. తాత్కాలికమయిన ఇబ్బందులను దృష్టిలో ఉంచుకొని శాశ్వత ఫలితాలను పాడుచేసుకోవడం తెలివైన లోణం కాదు... విచారమంటావా? అది అందరికీ అంతో ఇంతో ఉంటుంది. అందులోంచి త్వరగా బయటపడి, తిరిగి మామూలు మనుషులం కావడం మీదనే మన వ్యక్తిత్వం ఆధారపడి ఉంటుంది" అనాడు చలపతి.

"కాబట్టి?" అన్నది మంజరి కనుబొమలు చిట్లించి.

"మళ్ళీ నువ్వు మామూలుగా సినిమాల్లో ప్రవేశించింది.. అయితే ఈసారి ఇంకో చిన్న గమ్మత్తు చేద్దాం. ఇక నుండి నేను ఏడాదికి నాలుగు సినిమాల్లోకన్నా ఎక్కువగా బుక్ కాననీ, అందులో రెండింటిని మద్రాసు కంపెనీలకూ, మిగతా రెంటినీ బొంబాయి కంపెనీలకూ ఎలాట్ చేశాననీ ప్రకటించు. కేవలం ఆరోగ్య కారణాలవల్లనే ఇలా చేయవలసి వచ్చిందను. రిజల్ట్సు ఎలా ఉంటాయో చూడు" అన్నాడు చలపతి.

"ఇదేమీ కొత్త ఆలోచన కాదు. లోగడ మనమిలా అనుకొన్నామని నా జ్ఞాపకం" అన్నది మంజరి.

"నువ్వేమన్నా అనుకున్నావేమో నాకు తెలీదు. ఒక వేళ నేనే ఈ ఐడియాను బయటపెట్టానేమో కూడా నాకు జ్ఞాపకం లేదు. ఏమయినా ఇలాంటి ప్రకటన ఇప్పుడు చేయడంలో ఉన్న మజా వేరు.

ఇందువల్ల కంపెనీల సంఖ్య తగ్గేమాట నిజమేగానీ, ఆ వార నీకు డబ్బు ఎక్కువగా ముడుతుంది. డిమాండ్ కూడా పెరుగుతుంది... ఈ ఆరుమాసాల మధ్యలో ఇలాంటి పబ్లిసిటీ ఇంకెవరూ ఇచ్చుకోలేదు. చేతులారా ఈ అవకాశాన్ని పాడుచేసుకోవద్దని నా అభిప్రాయం. తరువాత నీ ఇష్టం!'' అన్నాడు చలపతి.

''సరే, ఏదో కానివ్వండి!'' అన్నది మంజరి.

అన్న తరువాత కూడా మంజరి మళ్ళీ మళ్ళీ ఆలోచించింది. ఇలాంటి షరతులు పెట్టడం వలన లాభమేగానీ, నష్టమేమీ మంజరికి కనిపించలేదు. చలపతి చెప్పాడన్న అభిప్రాయంతో తనేపనీ గట్టిగా చెయ్యలేదు. ఇక ముందు కూడా చెయ్యబోదు. అది మంచిదై ఉండాలేగానీ, ఎవరు చెప్పిన పనైనా తను చెయ్యడానికి సిద్ధంగా ఉంది. వాస్తవానికి చలపతి బంగారంలాంటి సలహా ఇచ్చాడు. తను 'సరే' అన్నది.

తనకసలు సినిమాలమీద క్రమంగా అభిరుచి తగ్గిపోతున్నదేమోనన్న అనుమానం ఉన్నది. మనుపటంత ఉత్సాహం కానరావడం లేదు. కానీ- అది తాత్కాలికం మాత్రమే! ఎక్కడన్నా మంచి సినిమా చూసినప్పుడు- ఎవరికన్నా మంచి రోల్ దొరికినప్పుడు - ప్రాణం జివజివపోతుంది. పదివేలు తక్కువైనా అలాంటి వేషం దొరికితే బావుండుననిపిస్తుంది. అంటే, డబ్బును మించిన శక్తేదో ఇంకా తన నీ పరిశ్రమను కట్టిపడేసి ఉంచుతున్నది. దాన్ని కీర్తి దాహమను, ఇంకోటను, ఇంకోటను- తనకభ్యంతరం లేదు.

చెత్తాకానీ పిక్చర్సు పదింటిలో పనిచెయ్యడంకన్నా మంచి సినిమాలు నాలుగు చేతిలో ఉంటే చాలుననుకోవడానికిదో కారణం కూడా ఉన్నది. కేవలమూ డబ్బుకోసమని, ప్రతి బాడోవ్ పిక్చర్లోనూ వేషం వేయడం వలన, డబ్బు కాళ్ళముందు కొచ్చిపడినా, పేరు పోవడం ఖాయం అటువంటి తుక్కు సినిమాలు నాలుగ్గనక వరసాగ్గా తగిలాయో - ఆ ఆర్టిస్టు గోవిందా! మళ్ళా ఆ చావుదెబ్బనుండి కోలుకోవడానికి నాలుగు రెళ్ళు ఎనిమిదేళ్ళు పట్టొచ్చు. ఈ లోగా కొత్తజనం వచ్చారంటే మొత్తం కుదేలవుతుంది.

మంజరి తన నిర్ణయాన్ని అధికారయుతంగా ప్రకటించడానికి నిర్ణయించింది. ఆరేడు మాసాల ఈ మధ్య ఆవిడ పత్రికలవారితో అంతగా సంబంధాలు పెట్టుకోలేదు. వారిక్కావలసిన కేసు తాలూకు వివరాలేవో కోర్టునుండీ, పోలీసు రికార్డులనుండీ తీసుకొన్నారు. దానిమీద తన అభిప్రాయాలుగానీ, తనకు తెలిసిన ఇతర విషయాలుగానీ మంజరి వెల్లడించలేదు. అలా చెయ్యకూడదని చలపతి గట్టిగా చెప్పాడు.

''కోర్టులో కేసున్నప్పుడు, దానిమీద మన ఇష్టం వచ్చిన అభిప్రాయం ప్రచారం చేయడం నేరమవుతుంది'' అన్నాడతను.

మంజరి కూడా 'అలాగే' అన్నది. మంజరి చలపతితో చెప్పి, ఫలానా తేదీన పత్రికలవారి సమావేశం ఏర్పాటు చేయమనీ, మంచి పార్టీ కూడా ఒకటి ఇద్దామనీ అన్నది. ఈలోగా రాజన్‌కు కబురు పెట్టి, అతన్ని కూడా పిలిపించింది.

''నువ్వెందుకిలా దిగజారిపోతావు మంజరీ! నీ కోసం పది పదిహేను కంపెనీలు కాచుకొన్నాయి.

అందులో ముగ్గురు నలుగురు నన్ను కూడా అప్రోచ్ అయ్యారు. నేను తప్పకుండా చెబుతానన్నాను. హఠాత్తుగా నువ్విలా అనడం బావుండదు'' అన్నాడు రాజన్.

అతనన్నమాటలన్నింటినీ మంజరి ''అవునవు''నంటూ ఆమోదిస్తూనే తన వాదన వినిపిస్తుంది. తన కసలు ఆరోగ్యం బావోలేదనీ, లేనిపోనివన్నీ నెత్తిమీదికి తెచ్చుకొని ప్రాణం హైరానా పెట్టుకోవడం తనకిష్టం లేదని అన్నది మంజరి.

''నాకోటి అనిపిస్తున్నదండీ! క్షణం విశ్రాంతి లేకుండా రెయ్యింబవళ్ళూ పని చేసి ఎవర్ని ఉద్ధరించడానికట? ఉన్నదేదో ఉంది- దీంతో ఎలా కాలక్షేపం చేసినా నాకు చాలు. అదీగాక - క్రమంగా నేనీ సినిమా గొడవలన్నీ మానేదామనుకొంటున్నాను'' అన్నదావిడ.

''మానేసి?'' అన్నాడు రాజన్.

''గృహిణినవుదామనుకొంటున్నాను''

ఓసారి అటూ ఇటూ చూసి మంజరిని తేలిగ్గా కావలించుకొన్నాడు రాజన్.

''నువ్వెంత మంచిదానివి మంజూ!'' అన్నాడతను చెవిలో.

మంజరి నవ్వింది.

రాజన్ అక్కడుండగానే పత్రికలవారి సమావేశం జరిగింది. అలాంటి సమావేశాల్లో సర్వసాధారణంగా అడిగే ప్రశ్నలూ వాటి జవాబులూ, శర్మగారు రాసుకొచ్చారు. వాటిని నాలుగైదుసార్లు చూసుకొన్నదావిడ.

శర్మగారు, దాదాపుగా - తను రాసిచ్చిన వాటినే అడిగాడుగానీ, ఇతరులు కాస్తంత పెడకు లాగారు. అందులో అపొజిషన్ పార్టీవారి పత్రిక తాలూకు విలేకరి గుడ్లు వెళ్లకొచ్చే ప్రశ్నలెన్నో వేశాడు.

''మీకు డబ్బుమీద ఉన్నంత యావ, కళమీద లేదని విన్నాను. అది నిజమేనా?'' అన్నాడతను.

మంజరి భగ్గుమన్నది. ఆవిడ ముఖం కోపంతో గండరించిపోయింది. ఏదో ఫెడీమని చెబుదామనుకొన్నది. ప్రక్కనే ఉన్న చలపతి అడ్డుపడి వాతావరణాన్ని చల్లబరించాడు.

''మీరు వినలేదని కాదనుకోండి. ఆ మాటకొస్తే మేము కూడా అలాంటి అర్థం వచ్చే మాటలు విన్నాం. ఇహ- వాటి నిజానిజాలంటారా? అది మేము చెప్పడం బావుండదు, మీకేది నిజమనితోస్తే అదనుకోండి'' అన్నాడు.

ఆ కరస్పాండెంట్ అంతటితో వదల్లేదు.

''అలా కాదు. నా తెలివితక్కువతనంచేత నేను పొరపాటుగా అనుకోవచ్చు. నిజమేదో మీరు చెప్పడమే బావుంటుంది'' అన్నాడతను.

''మీరిలా అనే అవకాశమున్నదని నాకు ముందుగానే తెలుసు. మాకై మేమో అభిప్రాయాన్ని మీలో కలిగించడం కన్నా, మమ్మల్ని అర్థం చేసుకునేందుకు మీకు తగినింత అవకాశమివ్వడం మంచిదని, ఇప్పటికీ మా అభిప్రాయం!''

''మా అభిప్రాయమంటే?'' అని రెట్టించాడతను.

''నాదీ, మంజరిగారిది కూడానూ!'' అన్నాడు రాజన్.

''ఓహో! అలాగా!!'' అన్నాడతను తలపంకిస్తూ. ''చూడండమ్మా! ఓ ప్రొడ్యూసరొచ్చి పాతిక వేలిస్తానన్నాడు. ఫలానా వేషం వెయ్యాలన్నాడు. మీరు కాదన్నారనుకోండి. అతను ఇంకో పదిపదిహేను వేలిస్తానంటే, అదే వేషాన్ని మీరు వేస్తారా?''

మంజరి సన్నగా నవ్వింది.

''నేనుత్త డబ్బు కక్కుర్తి మనిషినని ఈ నలుగురు ముందూ నన్నొప్పించాలని మీరీమాట అడిగి ఉంటారు, అవునా? పోన్లెండి! మరి - దానికి నా సమాధానం కూడా వినండి! డబ్బంటే నాకు చేదు కాదు. అలాగని డబ్బుకోసం నేను కక్కుర్తి పడింది కూడా లేదు. తొలి రోజుల్లో ఈ పరిశ్రమలో నాకింకా స్థానమనేదే లేనప్పుడు ప్రొడ్యూసర్లు ఇచ్చిన వేషాలు వేశాను. నేను వేసిన వేషాలన్నీ నాకు నచ్చినవి కావు. అలాగని - ఆ వేషాలు వేసినందుకు నేను అదనంగా తీసుకొన్నదేమీ లేదు. ఇలాంటి సంఘటనలు లోగడ కొన్ని జరిగాయి. వాటి సంఖ్య తగ్గించడం కోసమనే నేనిలాంటి నిర్ణయం తీసుకొన్నాను'' అన్నది మంజరి.

''ఈ రకంగా మీరు ప్రకటించడం ద్వారా ఇండస్ట్రీలో డిమాండ్ పెంచుకొందామని చూస్తున్నారా?'' అని రెట్టించాడతను.

''నేను 'యస్' అంటే, ఇంతకుముందు నాకు డిమాండ్ లేదని ఇన్‌డైరెక్టుగా ఒప్పుకొన్నట్లవుతుంది'' అన్నది మంజరి.

''అంటే, 'నో' అంటున్నారా?'' అన్నాడతను మళ్ళా.

''కాదు'' అన్నది మంజరి. ''ఇందులో డిమాండ్ ప్రసక్తే లేదు. నామీద ఉన్న ప్రెషర్‌ను తగ్గించడం కోసం నాకై నేను కొన్ని నిబంధనలు, నియమాలు విధించుకొనే ప్రయత్నమిది. నేను వల్లకాదంటున్నా వినకుండా నామీద వత్తిడి చేస్తున్నారు ప్రొడ్యూసర్లు. ఇంతకన్నా ఎమంచి మార్గమేదన్నా సజెస్టు చేస్తే, నేనీ నిర్ణయాన్ని విత్ డ్రా చేసుకొంటాను''.

''అంటే - మీరడిగినంత డబ్బివ్వగలిగిన చాలా పెద్ద కంపెనీలకు తప్ప - మీరికముందు దొరకరన్నమాటేనా?'' అన్నాడింకో కరస్పాండెంట్.

వాళ్ళిద్దరూ ఒక గ్రూప్‌వారేననుకొన్నది మంజరి.

''ఇందులో డబ్బును గురించిన గొడవేమీ లేదు బాబూ! ఇప్పటికే చాలా మందికన్నా నేనెక్కువ తీసుకొంటున్నాను. ఆ మొత్తం కాస్త ఎక్కువే అయినా- అది న్యాయమయిందని కూడా నేననుకొంటున్నాను. ఇంకా ఎక్కువ డిమాండ్ చేసి పుచు& చకొందామన్న తలంపు ప్రస్తుతానికి లేదు... ఇందువల్ల ఆటోమేటిగ్గా రేటు పెరుగుతుందంటారా? అది నా తప్పు కాదు. ధరలు అదుపులో ఉంచడానికి గవర్నమెంటు కంట్రోల్స్ పెడుతున్నది. అందువల్ల ధరలు పెరిగాయి గనక కంట్రోల్స్ వద్దనడం భావ్యమా మరి?'' అన్నది మంజరి.

మొదటి విలేకరి ఓసారి భుజాలెగరవేసి నవ్వాడు.

''భావ్యం కాదు... మీరిచ్చిన పోలిక కూడా సరిగ్గా లేదు. మీరు రేటు పెంచిందేమున్నది? మీ భాషలోనే చెప్పాలంటే - ఓ సరుకు రేటును పెంచకుండా సరఫరాను కంట్రోలు చేసినట్లయింది. అంటే రేషనింగ్ అప్లయ్ చేశారన్నమాట. రేషన్ కార్డుమీద చాలినంత సరుకు దొరకనివాడు రెట్టింపు రేటు చెల్లించి బ్లాకులో తనక్కావలసిన సరుకును కావలసినంతా కొనుక్కుంటున్నాడు... అలాగే

మీరూ చేశారు. ప్రతి కంపెనీకి మీరు అందుబాటులో లేకుండా ఉండేందుగ్గాను...''

''నా ఉద్దేశం అది కానప్పుడు, మీరు ఆ పాయింటుమీదనే స్ట్రెస్ చేస్తారెందుకని?'' అన్నది మంజరి.

''మీ ఉద్దేశమేదో మీరు స్పష్టంగా చెప్పందే మరి?'' అన్నాడతను కూడా చిరచిరలాడుతూ. ''మామూలుగా మీరు తీసుకొనే రేటు ఇస్తామని పది కంపెనీలు మీ దగ్గరకొచ్చాయనుకోండి - మీరు అందులో ఏ రెండు కంపెనీలో సెలక్టు చేసుకొంటారనుకోండి. ఆ సెలక్షన్‌కు బేసిస్ ఏమిటంటారు?''

మంజరి ఉక్కిరిబిక్కిరయిపోవడం చలపతి గమనించి, తను ముందుకొచ్చాడు.

''ఇంతవరకూ చెప్పని దోషానికి మిమ్మల్ని మన్నించమని వేడుకొంటూ ఇప్పుడు చెబుతున్నాం. మంచి పిక్చరన్నా, ఎక్కువ మొత్తం డబ్బన్నా మాకు ఇష్టంలేదనుకోకండి. మామూలు ప్రొడ్యూసర్లకు దూరంగా ఉండడం కూడా మా ఉద్దేశం కాదు. ఆరోగ్యం దృష్టి తనమీద వత్తిడిని కొంతకుకొంత తగ్గించుకోవడం మంజరికి తప్పనిసరైంది. అదీగాక - సినీ పరిశ్రమలో మళ్ళా నిలవనీరు చాలా చేరిపోయింది. ఇది తెట్టలు గట్టి, గవులెత్తి పోతున్నది. కొత్తనీరు రావాలంటే ఉన్న నీరు పోవాలి. ఇది పోవాలంటే...''

మధ్యలోనే రెండో విలేకరి, చలపతి మాటలకు అడ్డుపడ్డాడు.

''మీరు పరిశ్రమ బాగోగుల్ని గురించి ఉపన్యసించడానికి మమ్మల్ని పిలిచారా? మంజరిగారి నిర్ణయాన్ని ప్రచారం చేయిద్దామని పిలిపించారా?'' అన్నాడు ముఖమాటం లేకుండా.

''మంజరిగారి నిర్ణయం మీద పరిశ్రమ బాగోగులు ఆధారపడి ఉన్నాయనుకోండి. అప్పుడేమంటారు?'' అన్నాడు శర్మ.

''నేను ఓ పత్రిక తరపున దాని ప్రతినిధిగా వచ్చాను. నా పాఠకులకీ విషయాలన్నీ నేను చెప్పాలి. ముందుగా నాకున్న అనుమానాలన్నీ రహితమైతే తప్ప, నేనేమీ రాయలేను. కడుపులో బండెడు కుళ్ళుంచుకొని పైకి 'ఓహో ఆహా' అనడం నా వల్ల కాదు... శర్మగారూ! నేనేదో మంజరి నడగడం, వారు చెప్పడం సరేననుకోండి. మధ్యలో మీరెందుకు జోక్యం చేసుకోవడం?'' అన్నాడు మొదటి విలేకరి.

''నువ్వు విషయానికి సంబంధంలేని ప్రశ్నలడుగుతున్నావు'' అన్నాడు శర్మ.

''వాటికి జవాబు చెప్పకుండా మంజరిగారు రెఫ్యూజ్ చెయ్యవచ్చు. అది - వారికీ నాకూ సంబంధించిన విషయం. నేననేదేమిటంటే, నాకూ ఆర్టిస్టుకూ మధ్య మీరెందుకు జోక్యం చేసుకుంటున్నారూ - అని?'' అన్నాడతను.

చలపతి ఎవరూ చూడకుండా శర్మకు కన్ను మలిపాడు.

''మరేంలేదు బాబూ! శర్మగారు పార్టీకోసం తొందరపడుతున్నారు - అంతే!'' అన్నాడు చలపతి.

అందరూ గొల్లుమన్నారు.

నవ్వులు చల్లారాక -

''అడగండి బాబూ!'' అన్నాడు చలపతి.

''ఇంకేంలేదు, కానివ్వండి'' అన్నాడు మొదటి విలేకరి.

రెండో అతను కూడా పెదవి విరిచాడు ఏమీ లేవన్నట్లుగా.

''కోపం వచ్చిందా బాబూ?'' అన్నది మంజరి కూడా రవంత చలించి.

తరువాత, వారందరికీ నమస్కారం చేసిందావిడ.

''మీలో ఏ ఒక్కర్నీ నొప్పించాలని నా ఉద్దేశం కాదు. మీకు లేనిపోని మోటివ్స్ అంటగట్టడం కూడా నా కిష్టం లేదు. అనేక కారణాలవలన నేను మానసికంగా దెబ్బతిన్నాను. అవన్నీ మీకు తెలుసు. అజ్ఞానం వల్ల నేనేదన్నా పొరబాటుగా చెప్పి ఉంటే మన్నించండి. ఉద్రేకం వల్ల, ఆవేశం వల్ల సాధించేదేమీ ఉండదని నాకు తెలిసినా, ఈ పూట కాస్తంత ఉద్రేకపడ్డాననిపిస్తోంది. ఇది కేవలం నా బలహీనత, అందుకు నన్ను క్షమించాలి'' అన్నది మంజరి సవినయంగా.

అందరూ ''ఫర్వాలేదు, ఫర్వాలే''దన్నారు.

తరువాత పార్టీ జరిగింది. అంతు ముందేమీ జరగనట్లుగానే అందరూ యికయికలు, పక పకలతో గడిపేశారు.

తన నిర్ణయాన్ని గురించి మిగతా పత్రికలన్నీ ఆకాశానికెత్తేస్తాయనీ ఆ రెండు పత్రికలు మాత్రం దుయ్యపడతాయనీ మంజరి ఊహించింది. చలపతి కూడా ఆవిడ ఊహను బలపరిచాడు. అయితే అందులో సగమే నిజమయింది. మిగతా పత్రికలన్నీ ఆకాశాని కెత్తకపోయినా, వార్తకున్న ప్రాముఖ్యమిచ్చి, ప్రకటించనన్నా ప్రకటించాయి. ఆ రెండు పత్రికలూ అసలు మంజరి పేరే ఎత్తలేదు. ఇక పత్రికలోగావును 'త్రినేత్రుడు' అనే పేరుగల వ్యక్తి రాసిన 'సూచనలు సలహాలు' అన్న స్కెచ్ అచ్చయింది. అందుల 'వర్మ' అనేవాడు 'కాకా'పడుతూ పొట్ట గడుపుకోవడం హాస్యధోరణిలో చిత్రించారు. ఆఖరికి వాడికి 'పరమ వీరకాకా' అనే బిరుదు ఇవ్వాలని రచయిత సిఫార్సు చేస్తాడు. ఇదీ ఇతివృత్తం. ఆ 'త్రినేత్రుడు' బహుశా, ఆ రోజు వచ్చినవాడై ఉండాలనుకొన్నది మంజరి. అందులోని 'వర్మ' మన శర్మ అయి ఉండాలన్నది చలపతితో.

''నేనింకా పేపరు చూడలేదు. నువ్వన్నదే కరెక్టు... ఈ పత్రికల వాళ్ళున్నారు చూశావూ మంజరీ! ఒకరంటే ఇంకొకరికి ఛస్తే గిట్టదనుకో'' అన్నాడు చలపతి.

అతను ఊహించిందంతా నిజమయింది. మంజరిమీద ఆశలు పెట్టుకొన్న చాలా కంపెనీలు, ఒక్కసారిగా గగ్గోలెత్తిపోయాయి.

వారందరూ ఏదో వో సందర్భంలో మంజరిని కలుసుకొని ఆ నిర్ణయాన్ని ఉపసంహరించు కోవాలని కోరసాగారు.

''మీరలా ఆకాశానికెళ్ళిపోతే మేమంతా ఏం గావాలి?'' అన్నాడు భద్రాచలం అన్న ప్రొడ్యూసరు.

అతను రాజమంరడినుండి ఆ మధ్యనే మద్రాసు వచ్చాడు. లోగడ జర్మనీ సిల్వర్ పళ్ళాలు, తప్పాళాలు, గ్లాసులు, లోటాలు మ్మేవాడు. ఇప్పుడు ఫిలిం తీసి కళాసేవ చేద్దామనుకొంటున్నాడు.

''చాలా మంది కొత్త ఆర్టిస్టులున్నారు. బుకింగ్స్ లేనివాళ్లున్నారు. వాళ్ళనన్నా బుకక్ష్ చెయ్యొచ్చుగా!'' అన్నది మంజరి.

''చెయ్యొచ్చు. కానీ డబ్బురాదు. కనీసం మీరుంటే వొచ్చినంత డబ్బురాదు. నిజమేనంటారా?''

అన్నాడు భద్రాచలం.

"నేనున్న పిక్చర్సు చాలా ఫెయిలయ్యాయే!" అని ఓ ముక్క విసిరి చూసింది మంజరి.

"కథ  బావోలేనప్పుడు మీరు మాత్రం ఏం చేస్తారు?" అన్నాడు భద్రాచలం.

ఈ పంపిణీ మీద మంజరి చాలా మందితో మాట్లాడి చూసింది. ఒకరితో మాట్లాడినట్లు ఇంకొకరితో మాట్లాడలేదు. ఒకరికి చెప్పిన కారణం ఇంకొకరికి చెప్పలేదు.

ఈ కారణాలన్నీ ఎదుటివారు నమ్మారో లేదోనన్న సందేహం ఆవిడకు రాలేదు. ఆవిడ ముందు ప్రతివారూ తలలూపినవారే! ఆవిడన్న ప్రతిదానికీ 'యస్' అన్నవారే! మంజరికి బదులుగా చలపతికి అనుమానం కలిగింది. చాలా మంది లౌక్యం కోసం తలలూపేవారే తప్ప, ఈ కారణాలేవీ ఎక్కువమందిని నమ్మించలేదని అతను రుజువు చేసుకొన్నాడు. ఎందుకైనా మంచిదని, అతనీలోగా మంజరిని సంప్రదించి, మెహతాతో మాట్లాడటం ఉత్తమమనుకొన్నాడు.

"అవసరమా?"  అన్నది మంజరి.

"మరి కాదా?" అన్నాడు చలపతి.

"మనమెంత గింజుక చచ్చినా పిక్చర్‌కు ఫైనాన్స్ చేస్తున్నవాడు డిరస్టిబ్యూటరే! అతనా స్థానంలో ఉన్నంత కాలం, సమస్త గ్రహాలూ, అతని చుట్టూ ప్రదక్షిణం చేయక తప్పదు. మనం దానికి అతీతులంకాదు కాబట్టి - " అన్నాడు చలపతి.

"అయితే నేను వెళ్ళిరానా?" అన్నది మంజరి.

చలపతి కాస్సేపు ఆలోచించాడు.

"నువ్వెళ్ళకు, అతన్నే ఇక్కడకు పిలిపించు. లేదా ఫోన్‌లో మాట్లాడు. అప్పటికీ పనిగాకపోతే చూసుకొందాం" అని సలహా ఇచ్చాడు చలపతి.

మెహతా రానూ వచ్చాడు, మంజరి అతన్ని అడగనూ అడిగింది. అతను కాస్సేపు ఆలోచించి 'రైటే' అన్నాడు. 'అయితే ఇంకో షరతు కూడా చేర్చ'మన్నాడు.

"తప్పకుండానూ, ఏమిటది?" అన్నది మంజరి.

"ఫలానా కంపెనీ డిస్ట్రిబ్యూట్ చేసే సినిమాల్లో తప్ప వేషాలెయ్యనను" అన్నాడు మెహతా.

మంజరి పలుకలేదు.

"నా దగ్గరకొచ్చే కంపెనీలక్కూడా నే నిదే మాట చెబుతాను. ఫలానా మంజరిని బుక్ చెయ్యమనీ, ఆవిణ్ణి బుక్ చేస్తే ఎంత ఎమౌంట్ అయినా ఇస్తానని అంటాను. ఇది ఉభయతారకంగా ఉంటుంది" అని బేరం చేశాడు మెహతా.

ఈ బేరానికి మంజరికూడా ఒప్పుకున్నది. మెహతా వెడతానన్నాడు. 'సరే వెళ్ళ'మన్నది మంజరి. ఆవిడ ఉండమంటే ఉండిపోదామనుకొన్నాడు మెహతా, తనంతట తానుగా అడిగితే తప్ప, లేకపోతే ఉండమని అడగనే కూడదనుకొన్నది మంజరి.

మెట్లు దిగుతూ కూడా 'మరి వస్తాను' అన్నాడు మెహతా.

"అలాగే, వెళ్ళిరండి!" అని నమస్కారం చేసింది మంజరి లోలోపల నవ్వుకొంటూ.

ఆ ఒప్పందానికి కట్టుబడి ఉండడంలో ఎవరి కారణాలు వారికున్నాయి. మెహతాలాంటి

డిస్ట్రిబ్యూటర్ తన గుప్పిట్లో ఉండటం ఎంత అవసరమో మంజరికి తెలుసు. సంవత్సరానికి పాతిక పిక్చర్లొప్పుకొని, నాలుగొకట్లు నాలుగో - నాలుగు వొకటిన్నరలు ఆరో - తీసుకోవడం నయం కదా!

మెహతా కూడా కేవలం స్వార్థంతోనే ఇందుకొప్పుకొన్నాడు. ఎవ్వరూ అడగలేదుగానీ, అడిగినట్లయితేఈంతే అతగాడు స్పష్టంగా చెప్పేవాడు కూడానూ!

మంజరికున్న డిమాండ్ ఎవరుగానీ, దాయడానికి సాధ్యమయ్యేది కాదు. మిగతా హంగుల్లో ఎలాంటి లోపమున్నా, మంజరి ఉంటే అవన్నీ కప్పబడిపోతాయి. అదేదో తమిళ పిక్చర్, పరమబోరుగా ఉంది. తుక్కు కత, బేవార్స్ పాటలు. అందులో మంజరి ఉంటున్న దొక్కటే తన ధైర్యం. ఏమయితే అదే అవుతుందని ఫైనాన్స్ ఏశాడు. చచ్చేట్టు పే చేసింది. అంటే ఏమిటన్నమాటా! కొంతకాలంపాటు మంజరికి వల్లమాలిన డిమాండ్ ఉంటుందన్న మాట. కేవలం ఆవిడ పేరు టైటిల్సులో చూసి, జనం చప్పట్లు కొడుతున్నంతకాలం అవిడ మీద పెట్టిన పెట్టుబడికి డోకా లేదు. తనక్కా వలసింది కూడా ఇదే!

తన దగ్గరకొచ్చిన ప్రొడ్యూసర్లందరకూ మెహతా వొకేరకమైన సమాధానం చెప్పేవాడు.

"కథ నచ్చింది, పాటలు బావున్నాయి. మీ హీరోయినెవరో చెప్పండి" అనేవాడు మెహతా.

"ఫలానా" అన్నాడనుకోండి ప్రొడ్యూసరు.

వెంటనే మెహతా పెదవి విరిచేవాడు.

"అయితే నేను లక్షకన్నా ఎక్కువ పెట్టలేను. నాకు ధైర్యం చాలదు. ఇంకెవరన్నా ఎక్కువిస్తానంటే బొమ్మ వారికిచ్చుకోవచ్చు" అనేవాడు.

ఏ అయిదారు లకారాలో ఇస్తాడనుకొన్న డిస్ట్రిబ్యూటరు ఇలా అనేసరికి ప్రొడ్యూసరు గుండెలు జారిపోయేవి. అతనికేమి చెయ్యడానికీ పాలుపోక బెంబేలెత్తిపోయేవాడు. 'పాహిమాం' అంటూ డిస్ట్రిబ్యూటర్ ముందు సాష్టాంగపడిపోయేవాడు.

అప్పుడు తన 'మాయసంచి' విప్పేవాడు మెహతా.

"మీరు మంజరిని బుక్ చేసుకోండి. ఓ లక్షరూపాయలు బ్యాంకులో వేసుకోండి. నేను స్వయంగా దగ్గరుండి మీకు బొమ్మ తీయించి పెడతాను. మీ రూపాయి మీరు తీసుకోండి, నా పావలా నాకు పారేయండి" అనేవాడు మెహతా.

"మంజరికన్నా బాగా చేసేవాళ్ళు చాలా మంది ఉన్నారుగదా?" అన్నారనుకోండి ఎవరన్నా మెహతా వెంటనే జవాబు చెప్పవాడు. "చిట్టినాన్నా! మంజరి బ్రహ్మాండంగా యాక్ట్ చేస్తుందన్న నమ్మకం నాకు లేదు. నన్నడిగితే ఆవిడసలు ఆర్టిస్టే కాదంటాను. కానీ జనానికి ఆవిడ కావాలి. ఆవిడ ముఖం కనిపిస్తే, నవ్వితే, చెయ్యి ఊపితే ప్రజలు విరగబడి పోతున్నారు. మరి నన్ను చావమంటారా?" అనేవాడు మెహతా.

మంజరి దగ్గరకెడితే, ఆవిడ విషమ షరతులన్నీ పెట్టేది.

ఆ షరతులన్నింటికీ ప్రొడ్యూసరు వొప్పుకొని, మంజరిచేత 'సరే'ననిపించుకొని మళ్ళా డిస్ట్రిబ్యూటర్ దగ్గరకొచ్చినపుడు, పద్మవ్యూహం ప్రత్యక్షమయ్యేది. ఏయే ఖర్చులు ప్రొడ్యూసరు భరించాలో, వేటిని డిస్ట్రిబ్యూటర్ పెట్టుకొంటాడో, ఉమ్మడిగా పెట్టవలసిన ఖర్చులేవో, ఏయే దశల్లో

ఎంతెంత డబ్బు ఇవ్వడం జరుగుతుందో, పబ్లిసిటీ ఖర్చులు ఏపాటి ఉంటాయో- ఇవన్నీ చర్చించుకొనేవారు. నిజానికి పబ్లిసిటీ ఖర్చులు ఏ పాటి ఉంటాయో- ఇవన్నీ చర్చించుకొనేవారు. నిజానికి ప్రొడ్యూసరు ఆ దశలో అనడానికేమీ ఉండదు. ఎందుకంటే, సినిమాకని తెచ్చిన డబ్బులో సగభాగం అప్పటికే అయిపోయి ఉంటుంది. మిగిలిన సగం తీసుకొని ఊరెళ్ళడానికి చిన్నతనం. ఆ డబ్బుతో సినిమా తీయడమూ సాధ్యం కాదు. అంచేత పద్మవ్యూహంలోకి- ఇష్టమున్నా లేకపోయినా, ప్రదేశించిక తప్పదు. ఉక్కిరిబిక్కిరి కాక తప్పదు. చాలా మంది ఆలోపల ఇమడలేకా, బయటకు రాలేకా, ఉడ్డుకుడిని అక్కడే దారుణంగా నశించిపోగా, చాలా కొద్దిమంది మాత్రమే ఎలాగో తప్పుకొని బయట పడగలుగుతున్నారు. ఇక విజయం సాధించిన వారిని, వేళ్ళమీద లెక్కబెట్టవచ్చు. పిక్చర్ తీసి నష్టపోయినవాడూ, బోలెడన్ని లాభాలు తీసినవాడు కూడా ఒకేస్థాయిలో ఉన్నాడు. ఇదెందుకు జరుగుతుందో అందరికీ తెలుసు. కానీ, ఏ వొక్కరూ ఆ కారనాలను తొలగించేందుకు పూనుకోవడం లేదు. ప్రతి వారూ తనకెందుకనుకోవడం వల్ల సంవత్సరాలపర్యంతం, ఈ విధానం అవిచ్ఛిన్నంగా సాగిపోతూ ఉంది!

# 21

మంజరి నిర్ణయం ఆవిడకెంతగా ఉపయోగపడిందో, అంతకన్నా ఎక్కువగా ఆవిడ విరోధులకుపయోగించింది. పనిగట్టుకొని, విరోధులంతా ఏకమయి, ఆమెనుగురించి చిలవలూ పలవలూ అల్లి ప్రచారం చెయ్యసాగారు. అలాంటి పుకారులు ఎంత వేగంగా వ్యాపిస్తాయో అనుభవమున్న వారికిగానీ తెలీవు.

మంజరికి చిన్నా పెద్దా తారతమ్యం పోయిందనీ, తోటి ఆర్టిస్టులను పురుగులను చూసినట్టు చూస్తున్నదనీ, ప్రొడ్యూసర్లను కుక్కను విదిలించినట్లు విదిలించిపారేస్తున్నదన్న ప్రచారం సాగించారు. ఆవిడకు తలబిరుసుతనం పెరిగిందన్నారు. కళ్ళకు పొరలు కమ్మాయన్నారు. తన అభివృద్ధికి కారణమయినవారినే తూలనాడుతున్నదనీ, ప్రేక్షకులను నరసిస్తున్నదనీ అనేశారు.

ఆ ప్రచారం మంజరిదాకా వచ్చినపుడు ఆవిడ రవంత కలవరం చెందింది.

"నా జాతకం బావోలేదు చలపతీ! నా మంచితనం మట్టిలో కలిసిపోతున్నది. నేనేమన్నా నలుగురూ అపార్థం చేసుకొంటున్నారు" అని వాపోయింది.

చలపతి ఏమీ అనలేదు.

"దీనికెవరు కారణమంటావ్ చలపతీ?" అన్నది మంజరి.

"మీకు నిజంగా తెలీదా?" అన్నాడు చలపతి.

ఆవిడ తెలీదన్నాక చెప్పుకొచ్చాడు.

"ఇంతకుముందు నువ్వన్నమాటే ఇప్పుడు నేనూ అంటున్నాను. నా మాటలు నువ్వపార్థం చేసుకోనని హామీ ఇస్తే తప్ప నేనేమనడానికీ ధైర్యం చాలదు" అన్నాడు చలపతి.

ఇదేదో పెద్ద విషయమేననుకొన్నది మంజరి.

"చెట్టువెళ్ళిగొడ్డలిలో ఇరుక్కొంటే తప్ప, అది కొమ్మల్ని నరకలేదని తెలుసుకొంటే దీనిక్కారణం

నీకూ తెలిసొస్తుంది. మనవాళ్ళు మనవాళ్ళుగా ఉండాలిగానీ విభీషణులుగా మారిపోకూడదు. బ్రహ్మాండమైన లంకానగరమే నాశనంకాగా లేనిది, ఓ మంజరిమీద ఇన్ని రాళ్ళు పడటంలో ఆశ్చర్యమేమీ లేదు'' అన్నాడతను.

వసంతనూ, రాజమణినీ దృష్టిలో ఉంచుకొని చలపతి మాట్లాడుతున్నాడని మంజరి గ్రహించింది.

''అయితే ఇప్పుడేం చేద్దాఅం?''

చలపతి సన్నగా నవ్వాడు.

''ఇలాంటి సందర్భాల్లో ఇంకొకరిని సలహా అడక్కూడదు మంజరీ! మన మనస్సేంచెబితే అదే చేయాలి. దాని ఫలితాలకు మనమే బాధ్యత తీసుకోవాలి. సలహాలిచ్చే ఘట్టం ప్రాణం మీదికి తెలుస్తుంది''

''వారిని వెళ్ళగొడితేనో?'' అన్నది మంజరి, అతన్ని ఓరగా చూస్తూ.

చలపతి నవ్వి, మరో సిగరెట్ వెలిగించుకొని కిటికీలోంచి దూరంగా చూడసాగాడు.

''మాట్లాడవేం చలపతీ?'' అని రెట్టించింది మంజరి.

''ఏం మాట్లాడాలో తోచందేమరి'' అన్నాడు చలపతి. ''అదేదో నువ్వే ఆలోచించడం మంచిదమ్మా! నేను విన్నదేదో నీకు చెప్పాను. నేను చెప్పిందే నిజమనుకోకు. నువ్వూ నిజానిజాలు ఆలోచించాలి. ఆ పైన - ''

''నీ మాటమీద నాకు విశ్వాసం ఉన్నది.''

''ఎప్పణ్ణించి?' అందామనుకొన్నాడు చలపతి. ఆ మాట అని ఆవిణ్ణి మరింత గాయపరచడం ఉచితంగా ఉండదనిపించి అనడం మానేశాడు.

మంజరి ధర్మమా అంటూ, ఎన్నడూ లేని ఐకమత్యం ఆనాడు పరిశ్రమలో ఏర్పడింది. మంజరిని చూసి అసూయపడుతున్నవారూ, గిట్టనివారందరూ ఏకమయ్యారు. తమకు అండగా కొన్ని పత్రికలను కూడా ఎన్నుకొన్నారు. మంజరిని అధఃపాతాళానికి తొక్కెయ్యడానికి కావలసిన సరంజామా అంతా సిద్ధం చేసుకొన్నారు.

చిత్రమేమిటంటే - గత పదిహేనేళ్ళుగా ఏ నిమిషానా కలవని రావుగారి ముఠా, మూర్తిగారి ముఠా, మంజరి విషయంలో చేతులు కలిపాయి. రావుగారూ, మూర్తిగారూ కలుసుకొని మాట్లాడుకొన్నారు.

''మనమందరం పనికిరానివాళ్ళమైనట్టూ- పెద్ద తనకేదో ఈ పరిశ్రమలో చచ్చినంత పలుకుబడి ఉన్నట్టూ మంజరి ప్రవర్తించడం అసహ్యంగా ఉంది'' అన్నాడు మూర్తి.

''అవును, ఆవిడకు కాళ్ళు తెచ్చింది మీరే'' అన్నాడు రావుగారు.

ఆయన చాలా తెలివైనవాడు. పిల్లి కాలుతో పొయిలోని జీడిపిక్కలు తీసే కోతిమనస్తత్వం వారిది! ఇలాంటి విషయాల్లో చప్పున తేలడు.

''అది పాపమే అయితే, అందులో మీకూ భాగమున్నది, మనిద్దరం కలిసి ఆవిడకు కాళ్ళు తెచ్చామడనం ధర్మం'' అన్నాడు మూర్తి.

''ఏం చేదాం?'' అన్నాడు రావు.

''మంజరికిక్కడ మంచినీళ్లు పుట్టకుండా చేయాలి. ఆవిడకొక్క బుకింగ్ కూడా లేకుండా పోవాలి'' అన్నాడు మూర్తి.

''అదెలా సాధ్యం?'' అన్నాడు రావు అమాయికత్వం నటిస్తూ.

''మీరూ నేనూ ఒక్క మాటమీద నిలబడితే, ఈ ఇండస్ట్రీలో సాధ్యం కానిదేమీ లేదు... అదీగాక మనిద్దరం ఒక జిల్లా వాళ్ళం. ఒకే కులం వాళ్ళం. మనలో మనకు భేదాభిప్రాయాలుంటే అది మన అంతరంగికమైన విషయస్త్రంగానీ, ఇంకొకరొచ్చి చెప్పవలసింది కాదు'' అన్నాడు మూర్తి.

''ఎంత బాగా చెప్పావన్నాయ్!'' అన్నాడు రావు, అతన్ని ఆలింగనం చేసుకుంటూ.

''నేననుకొన్నదేమిటంటే- మంజరి నటిస్తున్న ఏ పిక్చర్‌లోనూ నేను వేషం వెయ్యకూడదనుకొన్నాను''.

''అరే! నిజమా?'' అని ఆశ్చర్యం నటించాడు రావు.

''యస్''.

''బ్యూటిఫుల్'' అంటూ చేతులు కలిపాడు రావు.

''నువ్వు బృహస్పతిలాంటివాడివి మూర్తన్నాయ్! నాకీ ఆలోచనే రాలేదు సుమా!'' అని ఎక్కేశాడు రావు.

మూర్తిగారు, ఓ గ్లాసు చిక్కని మజ్జిగ పుచ్చుకొని చెప్పసాగాడు.

''ఇందువల్ల నాకు రావలసిన పిక్చర్లు తగ్గిపోతాయి. అయినా నాకు బాధ లేదు. మరి నీ అభిప్రాయమేమిటో చెబితే విందామని ఉంది'' అన్నాడు. మూర్తి.

''మనిద్దరిదీ చెరొకదారీ కాదు. నీ అభిప్రాయమే నా అభిప్రాయం. నేను కూడా ఆవిడున్న పిక్చర్‌లో ఉండను'' అని చేతులు కలిపాడు రావుగారు.

ఆ రోజు సాయంత్రమే పత్రికల వాళ్ళను పిలిచి ఒక సంయుక్త ప్రకటనను విడుదల చేశారు వారు. అందులో 'మంజరి' అన్న పేరు లేకుండా 'ఓ పేరు పొందిన ఆర్టిస్టు' అంటూ, ఆ ఆర్టిస్టును ఎడాపెడా ఏకి పారేశారు. చివరికి అనివార్య కారణాల వలన మంజరి బుక్కయిన చిత్రాల్లో తాము నటించబోవడం లే'దని చెప్పారు.

పత్రికలవారికిదో పిడుగుపాటులాంటిది. వారు ఊహించని విధంగా ఇది జరిగిపోయింది.

''ఎందుకని?''

ఈ ప్రశ్న చాలా మంది అడిగారు.

''ప్రస్తుతం అంతకన్నా మేము ఎక్కువ చెప్పగలిగిందేమీ లేదు. మా నిర్ణయానికి తిరుగు కూడా లేదు. ఇందులో ఎవరినీ నొప్పించడంగానీ ఇబ్బంది పెట్టడం గానీ మా అభిప్రాయం ఎంత మాత్రం కాదు'' అన్నాడు రావు.

''ఈ శపథం ఎంతకాలమంటారు?'' అన్నాడు శర్మ.

రావుగారూ అతనికేసి నిశితంగా చూశాడు.

''చెప్పలేరా?'' అన్నాడు శర్మ.

"చెప్పకేం? మంజరిగారో, మేమో మారాలి. ఎదటివారితో గౌరవంగా మెలగడం తెలీనివారితో కలిసి పనిచేయడం మా వల్ల కాదు... ఇదేమీ అపురూపమైన విషయం కాదే! మనకు తెలీని ఎన్నో విషయాలు, మనం ఎదటవారినుండి నేర్చుకొంటున్నాం. మంజరిగారు కూడా నేర్చుకోవచ్చు" అన్నాడు రావు.

మూర్తిగారేమీ పలకలేదు.

పత్రికలవారికి- ముఖ్యంగా సినిమా పత్రికలవారికి - కావలసినంత మేటర్! ఈ నిర్ణయాలను ఆధారం చేసుకొని, చిలవలూ పలవలూ కల్పించి ప్రచారం చేసుకోవడానికి ఇప్పుడున్నంత ఛాన్స మరెప్పుడూ ఉండదు.

మంజరికీ సంగతి ముందుగా అందజేసిన వాడు శర్మ. ఆయన సమావేశంనుండి సరాసరిగా మంజరి యింటికొచ్చి, టాక్సీ డబ్బులు కూడా ఆమె చేతనే ఇప్పించాక, కుర్చీలో జారగిలబడిపోయాడు. ఏదో కొంప మునిగిందని మంజరి అనుకొనే అనుకొన్నది. ఆమె చేత బ్రతిమలాడించుకొనిగానీ శర్మ అసలు సంగతి బయటపెట్టలేదు.

మంజరి ముఖం మారిపోయింది. "ఇలా జరుగుతుందనుకోలేదు శర్మాజీ!" అన్నది మంజరి.

"నాకూ తెలీదు. అయితే ఈ నిర్ణయం హఠాత్తుగా జరిగింది కాదు. చాలా కాలం నుండీ నలుగుతూనే ఉండాలి. పెద్ద పెద్ద ఆర్టిస్టులనుగురించి, రకరకాల పుకార్లు ప్రచారం కావడం అబ్బురం కాదుగానీ, ఇంతకుముందెప్పుడూ కలగని పరినామాలు ఇప్పుఒచ్చి కూచున్నాయి. ఇలా- ఒక ఆర్టిస్ట మీదు పరిశ్ర ఎమంతా విరుచుకుపడడం ఇదే తొలిసారి" అన్నాడు శర్మ.

"నాకేమీ తోచడం లేదు శర్మాజీ!" అన్నది మంజరి.

"మీమీదగల అసూయ కారణమనుకుంటాను. మీరంటే కిట్టనివాళ్ళు చాలా మంది ఉన్నారు. మీకన్నా ముందునుండీ ఈ మద్రాసులో ఉన్నవారికి, మీకొచ్చిన పిక్చర్సులో నాలుగో వంతు రాలేదు. మీకున్న కీర్తిలో పదోభాగం లేదు. చాలా మంది ఇంకా అద్దెకొంపల్లోనే ఉంటుంటే మీరు రాజభవనాల వంటివాటిని కొనిపారేశారు ఎవరికయినా కన్నుకుట్టిందంటే ఆశ్చర్యమేముందీ?" అన్నాడు శర్మ.

"మనమేం చేదామంటారు?" అన్నది మంజరి, గోళ్ళు కొరుక్కుంటూ. "రావుతోనూ, మూర్తితోనూ మాట్లాడి చూడమంటారా? పోనీ - నేనే వారిదగ్గరకెడతాను"

"ఛ ఛ" అనేశాడు శర్మ.

మంజరి కిమ్మనలేదు.

"అంతకన్నా పరువు తక్కువపని ఇంకొకటి లేదు. శత్రువులతో రాజీపడటం కన్నా ఆత్మహత్య చేసుకోవడం నయం- నువ్విలా ప్రతిదానికీ బెదిరిపోకూడదు. గట్టిగా నిలబడి వుండు... ఈ క్షణం నుండీ నొక్క పిక్చర్ రాకపోయినా ఫర్వాలేదు. మూడు తరాలదాకా సరిపడేంత సంపాదించావు- అయినప్పుడు భయపడడడంలో అర్థం లేదు" అన్నాడు శర్మ.

"నా జాతకం బావోలేదు శర్మాజీ! భగవంతుడు నాకు విషమపరీక్షలన్నీ ఏరికోరి పెడుతున్నాడు. నన్నుక్కిరిబిక్కిరి చేసిపారేస్తున్నాడు. మెదడంతా నిప్పుల కుంపటిలా మండిపోతున్నది" అన్నదావిడ.

అప్పుడే వచ్చిన చలపతి పత్రికల్లో వ్యాసాలు రాయిద్దామన్నాడు.

''అదెంతవరుపయోగిస్తుందో చూడాలి. అసలు ఎమనతరపున నిలబడే పత్రికలేపాటివో ముందు తెలుసుకోవాలి. మన శత్రువులు మనకన్నా బలంగా ఉన్నప్పుడు తలపడడం తెలివి తక్కువవుతుంది. అలాని లొంగిపోవడమూ మంచిదికాదు'' అన్నాడు శర్మ.

''ముక్కు మూసుకొని మూడు నిమిషాలూరుకోవడం తప్ప మరో గత్యంతరం లేదు'' అన్నాడు చలపతి కసిగా.

శర్మగారేదో అనబోయి మానేశాడు.

''మనమేం చేస్తే బావుంటుందో చూడరూ మరి?'' అన్నది మంజరి ఆ ఇద్దర్నీ ఉద్దేశించి.

''రావుగారూ, మూర్తిగారూ చేతులు కలపడం మన దురదృష్టం. వారిద్దరూ ఎడమొఖం పెడమొఖంగా ఉంటున్నంతకాలమూ మన ఆటలు సాగుతాయి. అయినా - ప్రాణాలు పోయేదేమీ లేదు. చూదాం! కాస్త ఆలస్యంగానైనా మంచి స్టెప్ తీసుకోవడం అవసరం'' అన్నాడు శర్మ.

మంజరిగానీ, చలపతిగానీ పలకలేదు.

''మరి నేను వెళ్ళనా?'' అన్నాడు శర్మ. లేచే ప్రయత్నమేమీ చెయ్యోష్ట్ర్యకుండానే.

అంటే - డబ్బుకావాలని అర్థం.

''చూడండీ చలపతీ! కేకినీ ఫాంటసీస్ వారి ఫైల్ చూడాలనుకొన్నాం కదూ, దాన్ని తీస్తారేమిటి?'' అన్నది మంజరి.

చలపతి రుసరుసలాడుకొంటూ కిందివెళ్ళాడు.

''నాకో రెండొందలు కావాలి. అయిదో తారీఖున రావలసిన పత్రిక ఇంకా ప్రెస్‌కు కూడా పోలేదు. పేపరుకే నూటయాభైదాకా కావాలి. ప్రింటింగూ, పోస్టేజీ -'' అన్నాడు శర్మ.

''అంతదాకా దొరకవేమో!'' అంటూ మంజరి బీరువా తెరిచి వెతికి ''ఓ యాభై ఉన్నాయండీ! సరిపెట్టుకోలేరా?'' అన్నది.

''మీరసలేమీ ఇవ్వకపోయినా నా పత్రిక వస్తుంది'' అంటూ లేచాడు శర్మ.

మంజరి ఫక్కున నవ్వి, బీరువా తలుపు మూసేసింది.

''కోపంలో నీ ముఖం ఎంత అందంగా ఉంటుంది శర్మాజీ! ఇంత చిరాకులో ఉన్నామా - రిలీఫ్ ఉంటుందని ఈ ముక్క విసిరాను వెరీగుడ్! ఇంద - తీసుకెళ్ళు'' అంటూ ఓ కవరిచ్చింది మంజరి.

శర్మాజీ నిశ్శబ్దంగా దాన్ని జేబులో పెట్టుకొన్నాడు.

''అయిదొందలున్నాయి. వాడుకో, నీకెప్పుడు ఎంత కావాలన్నా, మొఖమాటపడకుండా నన్నడుగుతుండు. అవునుగానీ శర్మాజీ! నేనిలా డబ్బిస్తున్నానని చలపతితో అనడం అలవాటా నీకు?'' అన్నదావిడ.

''లేదే!''

''బతికాం. ఇలా ఇస్తున్నట్లు చెప్పకు, ఏడిచిపోతాడు''.

ఈల వేసుకొంటూ శర్మ వీధిలో కొచ్చాడు. సరాసరి రూముకెడదామా అనుకొన్నాడు. వెళ్ళి

చేసేదేమీ కనపించలేదు. జేబులోంచి కవరు తీసి చూసుకొన్నాడు. అందులో వందరూపా యలనోట్లు అయిదుకాదు- ఆరున్నాయి. మంజరి తనతో అయిదేనని చెప్పినట్టు గుర్తుకొచ్చింది. అంటే - వంద రూపాయలకు మంజరి దృష్టిలో పెద్ద విలువేమీ లేదన్నమాట!

రూముకెళ్ళడానికి బదులుగా అతను సరాసరి జయరాం ఇంటికొచ్చాడు. ఆ వేళకు జయరాం కుర్చీలో కూచుని బీడీ కాల్చుకొంటున్నాడు.

''నేను పనిమాలా మీకోసం వచ్చాను'' అన్నాడు శర్మ.

జయరాం ఇంకో కుర్చీ తెచ్చి వేశాడు. శర్మ కూచున్నదాకా ఆగి, తరువాతనే తాను కూచున్నాడు.

''చెప్పండి!'' అన్నాడు జయరాం.

''ఏం లేదుగానీ జయరాంగారూ, మీరు ఆఖరిసారిగా పిక్చర్‌లో బుక్కయి ఎన్నేళ్ళయింది?'' అన్నాడు శర్మ.

''అయిదారేళ్ళపై చిల్లరమాట!'' అన్నాడతను.

''ఈలోగా మీకు పిక్చర్లెందుకు లేవుట?'' అన్నాడు వర్మ.

జయరాం పలకలేదు.

''ఫర్వాలేదు చెప్పండి'' అన్నాడు శర్మ.

''ఏం చెప్పను శర్మగారూ! ఈ లోగుట్టు వ్యవహారాలు అందరికీ తెలిసినవే! కడుపుచించుకొంటే కాళ్ళమీద పడుతుంది. అంతకుముందు దాకా, ఫైలంతా నాదే. అంతా ఓ పదేళ్ళనుండి చక్రం అడ్డంగా తిరిగిపోసాగింది. మరీ - అయిదేళ్ళనుండి కేకేసినవారే లేదరు- కారనాలు ఏమని చెప్పనండీ? కుల ప్రభావం. నా కులం వారు వొక్క డైరెక్టరు లేడు. వొక్క ప్రొడ్యూసరు లేడు. కనీసం ఏ డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీలోనైనా భాగస్థుడుగా కూడా లేడు. ఇక నన్ను పిలిచేదెవరు చెప్పండి?'' అన్నాడు జయరాం.

''నేను మీమీద కొన్ని ఎక్సపెరిమెంట్లు చేదామనుకొన్నాను' అన్నాడు శర్మ.

''ఏం చేసినా నా జాతకం మారదనుకొంటాను బాబూ! ఈ అయిదారేళ్ళనుండీ, వేషాలకోసం తిరిగి తిరిగి విసుగెత్తిపోయాను. బాగా ఉన్న రోజులనాటి అలవాట్లు మానుకోడానికి లేదు. అమ్మడానికి వీలయినవన్నీ అమ్మేశాను. మేడ, కారు కుదువబెట్టాను. రెండింటినీ అమ్మితే తప్ప అప్పులు తీరవు'' అన్నాడు జయరాం.

''అదే చూదాం'' అన్నాడు శర్మ.

''ప్రస్తుతం మనకున్న ఇద్దరు హీరోలు మంజరిమీద పంతం కట్టారు. ఆవిడున్న పిక్చర్‌లో వేషం వెయ్యమన్నారు. వేయరుకూడాను. వేషం వెయ్యకుండా నేను చూసుకొంటాను. మంజరి కావాలనుకొనే ప్రొడ్యూసర్లు చాలా మంది ఉన్నారు. వారందరూ మంజరికోసం హీరోలను వదులుకోడానికి సిద్ధపడతారు. మరి- మీరు ప్రయత్నం చెయ్యరాదా? మనం ఒకే జిల్లావాళ్ళం. తాలూకాలు కూడా పక్కపక్కనే! తిరగేస్తే మీకూ మాకూ బంధుత్వం ఉండకపోదు. వీటన్నింటికన్న మీ ఆర్థిక బాధలు నన్ను మరీ కలవరపెడుతున్నాయి. ఈ దెబ్బతో మీకు పది బుకింగ్‌లు దొరికితే దరిద్రం వొదిలిపోతుంది'' అని సలహా యిచ్చాడు శర్మ.

జయరాం కళ్ళు ఆనందంతో మిలమిలలాడాయి. అతను అమాంతం శర్మను

కావలించుకొన్నాడు.

“నీ మాట పుణ్యాన అలా జరిగితే, నా చర్మంతో మీకు చెప్పులు కుట్టిస్తాను శర్మాజీ!” అన్నాడు జయరాం.

“అలాగే చూదాం. ముందు పని కానివ్వండి. ప్రపంచమంతా పెడదారిన పోతున్నప్పుడు, మీరూ నేనూ మడిగట్టుక్కూచుని లాభం లేదు. మనం కూడా మందతో పాటు కలిసిపోవలసిందే” అన్నాడు శర్మ.

తను పూర్తిగా ఫూల్ అయిపోయినట్లు తెలుసుకోవడానికి రెండు రోజులకన్నా అవసరం లేకపోయింది శర్మకు. ఈ తగాదాను తనకూ తనవారికీ అనుకూలంగా వాడుకొందామని శర్మ కన్న కలలన్నీ కరిగిపోయాయి. మాజీ “అందాల నటుడు” జయరాం నడుం బిగించి రంగంలోకి దిగేవేళకు అతనికి పోటీగా ఇంకో ముగ్గురు రంగంలో కనిపించారు. ఆ ముగ్గురూ కొత్తగా ఈ రంగంలో కొచ్చినవారు. అట్టే పేరు ప్రతిష్టలు లేనివారు. తొలిసారిగా హీరో వేషాలు వేసినవారు. ఆ కారణంగా బాధపడుతున్నవారు కూడా వారే!

ఏ డబ్బు దగ్గరో, కథ దగ్గరో పేచీ వచ్చినప్పుడల్లా, గుండె గల ప్రొడ్యూసరు, పాత హీరోను కాదని, ఓ కొత్త ముఖాన్ని పట్టుకొచ్చి హీరో వేషం ఇవ్వడమూ, ఆ కొత్తవాడు బాగా చేసినా చేయకపోయినా, అదే అతని ఆరి పిక్చరు కావడమూ, కొంతకాలం కిందట ఈ పరిశ్రమలో జరిగింది. ఇంకో కొత్తవాడు తమకు పోటీగా రావడం అటు రావుగారికిగానీ, ఇటు మూర్తిగారికి గానీ ఇష్టం లేదు. అందుకని ఇద్దరూ కూడబటుక్కుని పై వాడెప్పుడూ రాకుండా పకడ్బందీగా ఏర్పాట్లు చేసుకొన్నారు. అలాంటి ఏర్పాట్లు జరగనప్పుడు వచ్చినవారే ఆ మగ్గురూ. వారిలో ప్రతిభ లేదనడం అన్యాయం. ఇప్పుడు పేరు ప్రతిష్ఠలు సంపాదించిన వారందరూ తొలిసారిగా ఇంతకన్నా బాగా నటించారనడానికి దాఖలాలు లేవు. కానీ- లోలోపల రాజకీయావల్ల, కుట్రలు, కుహనాలవల్ల, కుళ్ళు వల్ల ప్రతిభావంతుడైనవాడు కూడా నెగ్గుకు రాలేకపోతున్నాడు. అదీగాక- తన శక్తి సామర్థ్యాలను చూపుకొనేందుగ్గూడా వారికి అవకాశాలు లభించలేదు. బాగా చెయ్యనివారికి ధారకం లేకపోవడంలో తప్పలేదు గానీ - “మోహన్” బాగా చేశాడని పత్రికలూ, ప్రజలూ కూడా అన్నారు. కానీ అతనిక్కూడా రెండో బుకింగ్ లేదు. అతని కులం అతని వృత్తిని, ప్రతిభను చావుదెబ్బ తీసింది. ‘రాజు’ కూడా మంచి ఆర్టిస్టే! అతను తొలిసారిగా ‘బరువైన పాత్ర’ తీసుకొని ఎంతో అనుభవం ఉన్నవాడిలాగా పనిచేశాడు. అతనికి బుకింగ్ లేకుండా పోవడానికి అతని ప్రతిభే కారణమయింది. రాజు ఎక్కిరావడం ఎంత ప్రమాదమో గ్రహించినవారు అతనికి రెండో పిక్చరు దొరక్కుండా చేశారు. ఎంత ప్రమాదమో గ్రహించినవారు అతనికి రెండో పిక్చరు దొరక్కుండా చేశారు. అతనికిచ్చే డుజబ్బుకే తాము కూడా వేషాలేస్తామన్నారు. అయినప్పుడు కొత్తవారిమీద లోలు ఖర్చు చెయ్యాలని ఎవరికిగానీ, ఎందుకంటుందట! మూడో వాడు చంద్రం - తొలి, మలి పిక్చర్సులో హీరోగా వేశాడు. అతను బాగానే పనిచేసినా అసలు పిక్చరే పరమ బోరుగా ఉండటం వల్ల, డబ్బాలు వారం లోపుగా తిరిగొచ్చాయి. చంద్రం జాతకం దరిద్ర జాతకమనీ, అతనున్న పిక్చరు ధ్వంసమయి తీరటం ఖాయమనీ ఓ వాదు ప్రచారంలో ఉన్నది. అందువల్ల చంద్రానికి కూడా బుకింగులు లేవు. ఏదో చిన్న చిన్న కంపెనీలు

తరువాత డబ్బిచ్చే పంపిణీ మీద వారికి బుక్ చేయడానికి చూశాయి. అయితే ఆ కంపెనీలిచ్చిన వేషాలు వేయడానికి వారు సిద్ధంగా లేరు. సినిమా ప్రపంచంలో హీరోగా అడుగు పెట్టిన వాడు హీరోగానే ఉండాలిగానీ, దిగజారడం ప్రారంభిస్తే, ఆ పతనానికి అంత ఎమంటూ ఉండదు. తొలిసారిగా హీరో వేషం వేసినవాడు, ఆ దరిమిలా చిన్న చిన్న చిల్లర వేసాలు వేయడానికి అంగీకరించడం అసాధ్యం. కనుక- ఆ కారణంగా కూడా వారికి పిక్చర్లు లేకుండా పోయాయి.

ఆ ప్రత్యర్థులను తను వోడించగలనన్న నమ్మకం జయరాంకు లేదు. ఎందువల్లనోగానీ, అతనికి లోలోపల, తనీ పోటీలో గెలవడం అసంభవమన్న భావం పదే పదే మెదలసాగింది.

జయరాంను వెంటదీసుకొని శర్మగారు మంజరిని కలుసుకోవడానికి నలభై గంటలు ముందుగా, చంద్రం ఓ పెద్దమనిషి దగ్గరనుంచి ఉత్తరం తీసుకొని ఆమె దర్శనం చేసుకొన్నాడు.

"ఏమిటి?" అన్నది మంజరి అంత దూరంలోనే ఆపి. చంద్రం ఆమెకు జాబిచ్చాడు.

పై అడ్రసు చదివి - "కూర్చోండి" అన్నది మంజరి. తరువాత ఉత్తరం తీసింది అందులో నాలుగంటే నాలుగే పంక్తులున్నాయి.

"చంద్రం మనవాడు, నాకు ఆప్తుడు. నీకూ, హీరోలకూ పడకపోవడం దురదృష్టం. నీ దగ్గర కొచ్చిన కంపెనీలకు, చంద్రాన్ని రికమెండ్ చెయ్యి- మణ్యం'

కాగితం మడిచి పక్కనే ఉంచింది మంజరి.

"మీకు మణ్యంగారు తెలుసా?" అన్నదావిడ ఆప్యాయంగా.

"మా బంధువేనండమ్మాయిగారూ!" అన్నాడు చంద్రం.

"కాఫీ తాగుతారా?... గుడ్ తెప్పిస్తాను" అంటూ మంజరి బెల్ నొక్కింది.

చంద్రం చాలా జాగ్రత్తగా ప్రారంభించాడు.

"మీకు చెప్పవలసిందేమీ లేదనుకోంఈ అమ్మాయిగారూ! ఈ ఫీల్డంత చిత్రమైనది ఇంకోటి లేదు. ముఖ్యంగా అన్ని చోట్లా వాళ్ళే ఉంటున్నా, మొన్న మొన్నటిదాకా మనవాళ్ళు అసలే లేరు... అంతా ఓ పది పదిహేనేళ్ళనుండచీ... ఏం ఏడిచిపోతున్నార్లెండి. మరీ మీకు బొంబాయి ఫీల్డులో గిరాకీ ఉన్నదని తెలిశాక, చాలా మందికి కడుపులు భగ్గున రగిలిపోయాయంటే నమ్మండి! మరీ - ఫస్టుక్లాస్ ఆర్టిస్టులు వలవలా వొకటే ఏడ్చిపోవడం. దానికి మనం మాత్రం ఏం చెయ్యగలం? వాళ్ళను బొంబాయి పోవద్దన్నదెవరు? పిక్చర్లు తెచ్చుకోవద్దన్నదెవరు?" అన్నాడు చంద్రం.

కాఫీ తీసుకొండి!" అన్నది మంజరి, తను కూడా కప్పునందుకొంటూ.

చంద్రం సగం తాగి కప్పును సాసర్‌లో పెట్టేశాడు.

"మనమెక్కడ ఆగిపోయాం?" అన్నది మంజరి, అతన్ని మాట్లాడించాలని.

"రావుగారూ, మూర్తిగారూ మీరంటే హడలుకుపోతున్నారు అమ్మాయిగారూ! మీ పక్కన యాక్ట్ చెయ్యాలంటే వారికి భయంగా ఉన్నదిట. అయినప్పుడు ఆ మాటే అనొచ్చుగా? దానికి మసిపూసి మారేడు కాయ చెయ్యడ మెందుకుట? మీ మీద లేనిపోని అభాండాలు వెయ్యడమెందుకుట? మిమ్మల్ని గురించి అవాకులూ చెవాకులూ పత్రికల్లో రాయించడమెందుకుట?" అన్నాడు చంద్రం.

"చెప్పండి, వింటున్నాను" అన్నది మంజరి.

"మీమీదకు పెద్ద సన్నాహంతో రాబోతున్నారు అమ్మాయిగారూ! ఏనాటికైనా మీరే లొంగి రావాలంటున్నారు- వారి దగ్గరకొచ్చి మన్నించమని మీరు వేడుకోవాలిట. అప్పటిదాకా మీదో మాట్లాడరట!" అని మంటను ఇంకాస్త ఎగదోశాడు చంద్రం

మంజరి హృదయం క్రోధంతో జ్వలించిపోయింది. ఆమె కన్నులు కెంపుల్లా అరుణారుణాలయ్యాయి.

"ఈ వెధవలు మాట్లాడకపోతే నాకు అడ్డిపోయిందేమీ లేదు" అన్నది.

ఆ తరవాతగానీ ఆమె పస్తాయించలేదు. అసలు- అంత కోపం రావడమే తప్పు. వచ్చినా బయటపెట్టుకోవడం అంతకన్నా తప్పు, కోపం పెంచుకొని తాను సాధించేదేమీ లేదని తనకు తెలుసు. అయినా ఈ బలహీనత తనను వేధిస్తూనే ఉన్నదనుకొన్నదావిడ.

"ఇంతకన్నా వేరే కారణమేమీ లేదంటారా?" అన్నది మంజరి ఉద్రేకాన్నుండి తేరుకొని.

చంద్రానికా ప్రవ్న అర్థం కాలేదు.

"అదేనండీ! రావుగారు, మూర్తిగారు నామీద కక్షగట్టడానికి ఇంకేమన్నా కారణాలున్నాయంటారా?" అన్నది మంజరి మళ్ళీ.

చంద్రం రవంత కంగారు పడ్డాడు.

"అమ్మాయిగారూ! నాకు తెలిసినంత వరకూ కారణాలివే! అసూయ మనుషులచేత ఎంత అఘాయిత్యమైనా చేయిస్తుందండీ అమ్మాయిగారూ! మీఉ తెలియందేముంది చెప్పండి?"

మంజరి కళ్ళు మూసుకొని, సోఫాలో చేరగలిలబడిపోయింది. కాస్సేపయ్యాక సన్నగా నిట్టూరుస్తూ ముందుకు వంగింది.

ఆవిడేదో చెప్పబోతున్నదనుకొని చంద్రం ముందుకు వంగాడు.

"మీకు మణ్యంగారు బాగా తెలుసా?"

"మరేనండీ అమ్మాయిగారూ!"

"ఇప్పుడు వారి వ్యాపారం ఎలా ఉంది?" అన్నది మంజరి.

"బాగానే ఉందండీ! ఈ మధ్యనే రష్యాకు యాభై వేల బేళ్ళ చవకరకం పొగాకు ఎగుమతి చేయడానికి పర్మిట్ సంపాదించారు. ఇహ రెండు చేతులా డబ్బేననుకోండి!" అన్నాడు చంద్రం.

మంజరికి పాతకాలపు సుబ్రహ్మణ్యం జ్ఞాపకం వచ్చాడు. ఆ రోజుల్లో తను నాగమణిదగ్గర ఉంటుండేది. సుబ్రహ్మణ్యం ఏదో పొగాకు కంపెనీలో ట్రేడింగ్ మేస్త్రీగా ఉంటుండేది. నెలకో అయిదారుసార్లు తన దగ్గరకొస్తుండేవాడు. అతనిదగ్గర ఎప్పుడూ పొగాకువాసనే వస్తుండేది! బేడ దగ్గర్నించి గీసి గీసి బేరమాడుతుండేవాడు. ఒకసారి "పూలు కొనుక్కొంటాను, ఓ అణా ఇవ్వ"మని అడిగింది తను. దాని కత నిచ్చిన జవాబు ఇప్పటికీ జ్ఞాపకం ఉంది.

"బేరం ప్రకారం ఇవ్వవలసినదంతా నాగమణికిచ్చాను. మధ్యలో ఈ కొసర్లు నా దగ్గర పనికిరావు. ఇంకో గంట సేపే నేనీ గదిలో ఉంటానంటే నువ్వొప్పుకోవు గదా? మరో అణాకాసు అదనంగా నీకెందుకివ్వాలిట?" అన్నాడు సుబ్రహ్మణ్యం.

తన మనస్సు చివుక్కుమన్నది.

"వ్యాపారంలో ఘటికుడే గదూ?" అన్నది మంజరి.

"చాలా గట్టివాడండి అమ్మాయిగారూ! వ్యాపారంలో ఉండే లగువు బిగువులన్నీ అతనికి తెలుసు. పదేళ్ళక్రిందట ఆయన గ్రేడింగ్ మేస్త్రీగా ఉండేవాడుట. ఇవ్వాళ ఎంత హీనంగా చూసుకొన్నా ఏడెనిమిది లకారాలు సంపాదించాడు. అదీగాక, రాష్ట్రంలోనూ, సెంట్రల్‌లోనూ ఆయనకు చాలా పలుకుబడి ఉంది!"

మంజరి పెదవులు బిగబట్టి అతను చెబుతున్నదంతా శ్రద్ధగా వింటున్నది.

"సరే లెండి!"అంటూ మంజరి హఠాత్తుగా లేచి నిలబడింది.

చంద్రం కూడా నించున్నాడు.

"మీరు అప్పుడప్పుడు కనిపిస్తూ ఉండండి. మీ అడ్రస్‌ను చలపతి గారికిచ్చిపోండి... మీకు ఫోన్ ఉందా? - ఫర్వాలేదు."

"సుబ్రమణ్యంగారు ఏ సంగతీ రాయమన్నారండీ అమ్మాయిగారూ!"అన్నాడు చంద్రం.

"నేనీపూట వారికి ఉత్తరం రాయాలనుకొంటున్నాను. అందులో - మీరిలా వచ్చి కలుసుకొన్నారని రాస్తాను.... దట్సాల్ రైట్... మీరు వెళ్ళండి! అవసరయితే నేనే కబురు పంపుతాను..."

చంద్రం నమస్కారం చేసి బయటపడ్డాడు.

మంజరి కబురు పెట్టిందాకా అతనూరుకోలేదు. అలా ఊరుకోవడం పైకొచ్చేవాడి లోనాలు కూడా కాదుమరి! పని ఉన్నా లేకపోయినా అతను మంజరిని కలుసుకొంటూ ఉండేవాడు. కలుసుకొన్న ప్రతిసారీ ఏదో కొత్తవార్తను మోసుకొస్తూనే ఉండేవాడు ఆ వార్తలు వింటూ ఉంటే మంజరికి గంగవెర్రులెత్తుతూ ఉండేవి.

"రావుగారూ, మూర్తిగారూ గత మూడు రోజులనుండి షూటింగ్సు కెళ్ళలేదండీ! ఉన్న కాల్‌షీట్సన్నీ కాన్సిల్ చేసేశారండీ!" అన్నాడొకసారి.

"ఎందుకని?" అన్నది మంజరి.

"వారు పనిమాలా ప్రతి కంపెనీకి వెళ్ళి, మిమ్మల్ని బుక్ చెయ్యొద్దని కాన్వాస్ చేశారండీ! ఇంకా చేస్తూనే ఉన్నారండీ!" అన్నాడు చంద్రం.

మంజరి ఏమవ్వాలో అదే అయింది.

"వాళ్ళకు సుఖపడే గీత లేదనుకొంటాను. చంద్రంగారూ! ఈ ఇండస్ట్రీ అంతా వారి చేతుల్లోనే ఉన్నదనుకోవడం భ్రమ! వారి మాట వినే కంపెనీలు కొన్ని ఉన్నట్లే నా మాట ప్రకారం నడిచేవి కూడా కొన్ని ఉంటాయని వారికి తెలీకపోవడం దురదృష్టం. నేనింతకాలం అట్టే పట్టించుకోకుండా ఉన్నాను. వాళ్ళ అంతు నేనూ తేల్చుకొంటాను" అన్నది మంజరి.

అంతకన్నా మంచి అవకాశం దొరకదనుకొన్నాడు చంద్రం. ఉన్నవీ లేనివీ పోగుచేసి, మంజరికి అంటించాడు. మంటను ఇంకాస్త ఎగసన దోశాడు. చంద్రం ఊదుతున్నకొద్దీ మంజరి కోసం జ్వలింపసాగింది. వారిని నిలబెట్టి కాలరాచిందాకా తమ నిరదపోనన్నది మంజరి.

"బాగా అన్నారండి అమ్మాయిగారూ! దూరంగా ఉండి చూస్తున్న నాకే కడుపు మండిపోతూ ఉంటే, నిజంగా అనుభవిస్తున్న మీకెలా ఉంటుందో ఊహించగలను. ఈ దెబ్బతో ఎవరి

బలాబలాలేపాటివో తేల్చుకోవలసిందే! సత్తువున్న వాళ్ళుంటారు, లేనివాల్ళు తోకముడుచుకుపోతారు'' అన్నాడు చంద్రం.

''ఎవరు తోకముడుచుకొనేదీ చూద్దాం'' అన్నది మంజరి బుసలు కొడుతూ.

అంతటితో చంద్రం ఊరుకోలేదు. ఈ సంఘటనలను చిత్ర విచిత్రాలుగా మార్చి అతను పనిమాలా ప్రచారం చేశాడు. తనను మంజరి పిలిపించిందనీ, అనేక విషయాలను గురించి సంప్రదించిందనీ చంద్రం చెప్పుకొన్నాడు. మంజరి మిగతావారనుకొంటున్నంత అమాయకురాలు కాదన్నాడు. ఇంకొద్ది రోజుల్లో కనీవినీ ఎరుగని అద్భుతాలు జరుగుతాయన్నాడు. అవేమిటని అడిగితే మాత్రం చెప్పేవాడు కాదు.

అందువల్ల మంజరికీ అతనికీ పరిచయమున్నదని ఇప్పుడు చాలా మందికి తెలిసిపోయింది. సామాన్యులు ఆ పరిచయాన్ని భూతద్దంగుండా చూసి దడుచుకొన్నారు. తెలివైనవాళ్ళు తమలో తాము నవ్వుకొన్నారు.

''మంజరి వీణ్ణెందుకు చేరదీసిందీ ఇంకా తెలిసినట్లులేదు. వీడిమీద ఆధారపడేటంత తెలివి తక్కువదయినట్లయితే, ఈ ఫీల్డులో అసలు ఎక్కి వచ్చేదికాదు. ఈ వెధవ బుక్కింగ్స్ కోసం ఆవిడ చుట్టూ తిరిగి ఉంటాడు. ఇప్పుడున్న హీరోలమీది కోపం వల్ల- బహుశా మంజరి వీణ్ణి ప్రొడ్యూసర్లకు రికమెండ్ చేసినా చెయ్యొచ్చు. అంతేగానీ - '' అన్నాడొకాయన.

ఆయన చాలా కాలం నుండి పరిశ్రమలో పాతుకుపోయినవాడు. ఆయన అంనా అక్షరాలా సత్యమే.

తనను బుక్ చెయ్యడానికొచ్చిన ప్రొడ్యూసర్లతో మంజరి ఈ విషయం స్పష్టంగా చెప్పింది.

''నేను కేవలం డబ్బు మనిషినేగాను, పిక్చరు బాగుండాలి. ప్రొడ్యూసరుకు పది రూపాయలు రావాలి. నాకేమిచ్చారన్నది ముఖ్యం కాదు, రపొడ్యూసరు కేం మిగిలిందన్నదే ముఖ్యం. ఫీల్డులోకొచ్చిన ప్రొడ్యూసర్లందరూ అణగారి పోతుంటే ఇండస్ట్రీ నాశనం కావడం తథ్యం. పొదుగుకోసుకొని పాలు తాగడం ఎవ్వరికీ మంచిది కాదు... మీరు పదివేలు తక్కువిచ్చినా మాబాగేకానీ, వారితో మాత్రం పనిచెయ్యను. మీఉ నేను కావాలో, వారు కావాలో ఆలోచించుకోండి'' అన్నది మంజరి.

ప్రొడ్యూసర్లు ఏమీ అనలేకపోయారు.

''మీరు చంద్రంగార్ని బుక్ చెయ్యరాదా? వాళ్ళు తీసుకునే దాంట్లో సగం మొత్తానికే వస్తాడు. కష్టపడి పనిచేస్తాడు. అవసరమయితే నేనూ అతనితో చెబుతాను''.

''అతను పనిచేసిన పిక్చర్లు ఫెయిలయ్యాయండీ! అతని పాదం మంచిది కాదంటున్నారు చాలా మంది. అతను అడుగు పెట్టిన చోట నిప్పచ్చరం అయిపోయిందట.... అది నిజం కూడాను. చంద్రంగారు లోగడ పనిచేసిన రెండు కంపెనీలు అయిపూ ఆనమలూ లేకుండా పోయాయి'' అని ప్రొడ్యూసర్లు గోలకెత్తారు.

''అప్పట్లో అతని జాతకం బాగా ఉండనిమాట నిజమే! అందుకనే అతనింతకాలమూ దిక్కుమొక్కు లేకుండా ఉన్నాడు.... మొన్ననే సాయిబాబా భక్తుడొకాయన్ని పిలిపించి అడిగాను. అతని కా పిరేడ్ పోయిందట. ఇకనుండీ వేస్తే వేయి రూపులుగా ఉంటుందట. అవన్నీ విచారించాకనే

మీకు చెబుతున్నాను..."

ప్రొడ్యూసర్లు కాదు... ఎవరయితే మట్టుకు ఏమనడానికైనా అవకాశమేదీ?

మంజరి ఉంటే చాలుననీ, ఆమె పేరుమీద లక్షలు పోగుచేసుకోవచ్చుననీ అనుకొన్నారు. ఆమెను హీరోయిన్‌గానూ, చంద్రాన్ని హీరోగానూ బుక్ చేసుకొన్నారు. మెహతా కంపెనీకే పిక్చర్సు డిస్ట్రిబ్యూటింగ్‌కిచ్చారు.ఆమె షరతులన్నింటినీ పాటించారు.

తనీ పరిశ్రమలో స్థిరపడడానికి ఇంతకన్నా మంచి అవకాశం ఉండదని చంద్రానికీ తెలుసు. ఉన్న అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవడంలో అతనేమాత్రం ఏమరలేదు. తను నూటికి నూరుపాళ్ళూ మంజరి మనిషినన్న అభిప్రాయాన్ని స్థిరపరిచాడు. రావుగారికీ, మూర్తిగారికీ ప్రత్యర్థిగా నిలిచాడు. ఫలితంగా అతనికి అయిదారు పిక్చర్లు చేతికొచ్చాయి. వీటన్నింటినోనూ మంజరి హీరోయిన్‌గా పనిచేస్తూనే ఉంది.

"మీరు నాకు చేసిన ఉపకారం జన్మ జన్మలకూ మరచిపోలేనండీ అమ్మాయిగారూ! మీరు చేయూతనివ్వకపోతే, ఈ మద్రాసులో నాకు మంచినీళ్ళు కూడా పుట్టేవికావు" అన్నాడు చంద్రం.

మంజరి కళ్ళు మిలమిల్లాడాయి.

అయినా పైకి నిర్లక్ష్యంగా నవ్వేసింది.

మంజరి ప్రయత్నాలు, అన్ని విఘ్నాలనూ అధిగమించి, ఫలప్రదం కావడం రావుగారూ, మూర్తిగారూ చూశారు. ఆవిడ చంద్రాన్ని దగ్గరకు తీసిందనీ, ప్రొడ్యూసర్లకు అతన్ని రికమెండ్ చేస్తూ ఉన్నదనీ ఎవరో చెప్పారు.

"ఇప్పుడేం చేదాం?" అన్నాడు రావుగారు.

ఫలానా విధంగా చేదామని రావుగారే అనవచ్చు. కానీ అలా అనడం వల్ల ఆ పని తాలూకు ఫలితాలకు బాధ్యత వహించాలిసొస్తుంది. అంత దాకా రాకుండా చూసుకోవడం మంచిది. ఎందుకంటే, ఫలితం ఎలా ఉంటుందో ముందుగా ఊహించడానికి లేదు. అయినప్పుడు ఈ లేనిపోని బరువును నెత్తికెక్కించుకోవడం ఎందుకుట?

"నాకేమనిపిస్తుందంటే" అంటూ ప్రారంభించాడు మూర్తి. "మనం కూడా మంజరిలాగానే ప్రతి కంపెనీకీ తిరుగుదాం. ఆవిడీమధ్య మూడు నాలుగు రోజులపాటు షూటింగులన్నీ మానేసుకొని, ఇదే పనిమీద తిరుగుతున్నదని విన్నాను. ఇది నిజం కూడా నేమో! మనకు వ్యతిరేకంగా ఆవిడ పనిచేస్తున్నప్పుడు, మనం చేతులు ముడుచుకు కూచోకూడదు."

"అలాగే చేదాం అన్నాయ్!" అన్నాడు రావు.

"ఈ దెబ్బతో కళ్ళు తిరిగి ముచ్చిలిగుండులోకి రావాలి" అన్నాడు మూర్తి.

"వెరీ గుడ్, వెరీ గుడ్! బ్యూటీఫుల్ ఇమాజినేషన్" అన్నాడు రావు తన సహనటుణ్ణి ఉబకేస్తూ.

రావుగారూ, మూర్తిగారూ చేసుకొన్న ఆ నిర్ణయాలను గురించి, ఆయా ముఠాలు చిలవలు పలవలు కల్పించి ప్రచారం చేశాయి.

"ఇహ జన్మలో మా వాళ్ళు మంజరి మొఖం చూడరు. మద్రాసుకూ ఆవిడకూ చెల్లిపోయింది... ఉన్నంతకాలం సంపాయించిందీ మార్చుకొంటూ తింటుంది. ఆఖర్న ఇల్లు, కారు అమ్ముకొనిపోతుంది.

ఆవిణ్ణు బుక్ చేస్తామన్న వాళ్ళే లేరుట... నిన్నో కంపెనీకి పనిమాలా పోయి వేషం అడిగిందంట - వాళ్ళేమో "ఛీ ఫో" అన్నారట... ఆవిడకిహ మద్రాసులో మంచినీళ్ళు కూడా పుట్టవు... మనవాళ్ళతో విరోధం పెట్టుకొని గెలుస్తాననుకోవడం భ్రమ... గుంటూరుకు టికెట్ బుక్ చేసిందిటగా..."

ఈ ధోరణిలో ప్రచారం ముమ్మరంగా సాగిపోతూ ఉంది.

"ఇంతట్లో రాజీ కుదరడం అసంభవం" అన్నారు తటస్థులు.

సరిగ్గా ఆ సమయంలోనే -

విజయ అనే అమ్మాయికో ఆలోచన వచ్చింది. నిన్న మొన్నటి దాకా, "సాంబారు సాదం" పొట్లాలు కొనుక్కున్న చంద్రం జేబులో ఇప్పుడు వందరూపాయలనోట్లు నలుగుతున్నాయి. మంజరి బుక్కయిన ఆరు సినిమాల్లోనూ అనతిప్పుడు హీరో వేషాలేస్తున్నాడు. ఇంతకాలం నుండీ, పిలిచినా పలికే దిక్కులేని చంద్రానికి హఠాత్తుగా ఇంత లిఫ్ట్ రావడానికి మంజరి కారణమని తను అనుకొంటున్నది. అయితే మంజరి ఇతనికెందుకు సాయం చేసినట్లు? ఇతన్ని చేరదీసిందని చాలా మంది అంటున్నారు. అది పూర్తిగా అబద్ధం. ఎందుకంటే, ఆవిడ చేరదియ్యడానికి ఇంతకన్నా యోగ్యుడు లేడనడంకన్నా ఆవిణ్ణు అవమానించడమింకేమీ ఉండదు. అదికాదుగానీ - అంతుమించినబలమైన కారనమేదో ఉండి ఉండాలి.

అదేదో తెలుసుకొందామనుకొన్నది విజయ.

చంద్రం అప్పుడే ఎక్కణ్ణుంచో వచ్చాడు. విజయను కూచోమని పావుగంటకల్లా డ్రెస్ మార్చుకొచ్చాడు.

విజయ సరాసరిగా విషయంలోకి వచ్చేసింది.

"ఆఁ" - "ఊఁ"అని చంద్రం కాసేపు గుసుకులాడాడు.

"మీరలా నానుపుడు పెడితే నాకర్థంకాదు. కాస్త నాకు తెలిసేటట్లు చెప్పండి" అన్నది విజయ.

చంద్రం కళ్ళల్లోకి మెరుపు వచ్చింది.

"ఆ కిటుకేదో నీకు తప్పకుండా చెబుతాను విజయా! అయితే మరి నా ప్రతిఫలం మాటేమిటి?" అన్నాడు చంద్రం నవ్వుతూ.

"అంటే" అని ఓ క్షణం ఆగి "ఓహో! అదా!" అని విరగబడి నవ్వింది విజయ.

ఆమెకు అప్పుడెప్పుడో జరిగిన వో సంగతి ఛటుక్కున జ్ఞాపకం వచ్చింది. ఓ పిక్చరులో తను, చంద్రం కలిసి పనిచేశారు. చంద్రం జమీందారుగారబ్బాయి, తను డాన్సర్. డాన్సు చేస్తూ చేస్తూ తూలి పడబోతుంది. జమీందారుగారబ్బాయి వచ్చి పడకుండా పట్టుకొంటాడు. ఆ పట్టుకోవడం, రెండు చేతులతోనూ జరిగింది. అవసరాన్ని మించి గట్టిగా పట్టుకొని, రిహార్సల్లో లేని 'దగ్గరకు తీసుకోవడం' కూడా చంద్రం చేశాడు. తను ముఖం చిట్లించింది.

"మార్వొలెస్!" అని అరిచాడు డైరెక్టర్.

"ఏదన్నా పిక్చర్‌కు పోదాం" అన్నాడు చంద్రం అప్పుడే! అతనికింకా 'జ్వరం' తగ్గలేదని విజయ గ్రహించింది.

"ఇప్పుడు కాదు" అన్నదావిడ మెల్లిగా.

"ఎప్పుడు మరి?" అన్నాడు చంద్రం.

"నేనే కబురు చేస్తాను"

అంతే!'

విజయ కబురు చెయ్యనేలేదు. మళ్ళా వాళ్ళిద్దరూ కలిసి పని చెయ్యవలసిన సందర్భం కూడా తటస్థపడలేదు.

"ఏమిటాలోచిస్తున్నావ్?" అన్నాడు చంద్రం.

తనేమాలోచిస్తున్నదీ చెప్పడం విజయకు ఇష్టంలేదు. అందుకని ఆవిడ ఉలిక్కిపడినట్లుగా, కళ్ళింత చేసుకొని అతనికేసి చూసింది.

"నేనా?" అన్నది విజయ రొమ్ములమీద అరచేతినుంచుకొంటూ.

"నేనాలోచించడమేమిటండీ నా ముఖం! మీరేదన్నా చెప్పబోతున్నారేమోనని ఇందాకణ్ణించీ నోరు తెరచుకుని నేను చూస్తుంటేను!"

చంద్రం ఫక్కుమని నవ్వాడు.

"ఏమిటది?" అన్నది విజయ.

అతనో క్షణం పాటు "చెబుదామా" అనుకొన్నాడు - తనెందుకు నవ్విందీ 'తెరుచుకొని చూస్తుంటేను' అని విజయ అన్న తరువాత, తన మనసులో మెదిలిన బొమ్మను ఆమెకు తెలియజేయడం భావ్యం కాదనిపించింది. అందుకని, "ఏంలే"దని మాటను తప్పించేశాడు.

"మీరేదో దాచిపెడుతున్నారు"అన్నది విజయ.

"నువ్వెన్నిసార్లడిగినా అదే అడుగుతావుగానీ, నా మాటకు సమాధానం చెప్పవేం?" అన్నాడు చంద్రం.

అతను "ప్రతిఫలం" గురించి అడుగుతున్నాడని విజయ రూఢి చేసుకుంది.

"మీరాట్టే ధైర్యం ఉన్న మనుషులుకారండీ చంద్రంగారూ! అప్పుడెప్పుడో నన్ను పిక్చరుకు తీసుకెళతామన్నారు. నేను తరువాత చూదామన్నాను. మళ్ళా మీరాప్రసక్తే తీసుకురాకపోతిరి. ఇంతకాలానికి, నా అంతట నేనొస్తే తప్ప, మీకా విషయం జ్ఞాపకం రాకపోయె. అంత 'ఇది' ఉన్న మనుషులు మా ఇంటికి రాకపోయారా?" అన్నది విజయ

"నువ్వే నాకు కబురు చేస్తానన్నావుగా మరి?" అన్నాడు చంద్రం.

విజయ అతనికళ్ళల్లోకి చూసింది. అక్కడ మండుతున్న కోర్కెను చూసింది. సుతారంగా కింది పెదవి కొరుక్కొంటూ నవ్వింది.

"మీరా పరమరహస్యమేదో చెబుతారని వచ్చానుగానీ, ఇలా వంటరిగా నన్ను చిక్కించుకొని నిర్బంధం చేస్తారని రాలేదు. అదికాదండి బాబూ! నా ఎడ్రస్ మీకు తెలుసుగదా? ఎప్పుడన్నా రాకపోయారా? మీరు నాతోబాటు పిక్చర్ చూడాలంటే, నేనెప్పుడూ కాదనేదాన్ని కాదే! పోనీ పది పిక్చర్లున్నాయమ్మ, ఊపిరి తిరగనంత పని ఉందనుకోవడానికీ లేదు. ఎప్పుడో పిట్ట బెదిరినట్లు అక్కడో చిన్న వేషం, ఇక్కడో చిన్న డాన్సు ఉంటే ఏమవుతుందిట? అసలు పొరబాటు నాదేలెండి. కబురు చేస్తానన్న తరువాత, మీరొస్తారనుకొన్నానుగానీ, నేనే స్వయంగా మిమ్మల్ని బొట్టూ కాటుకా పెట్టి ఆహ్వానించవలసి వస్తుందనుకోలేదు.... సరే, మీ సంగతేమిటో ఇప్పుడు తెలిసిందిగా! నేనీ

నిమిషాన రెడీగా ఉన్నాను. మీరే పిక్చరుకు తీసుకుపోతారో తీసుకుపోండి'' అన్నది విజయ, కళ్ళనిండుగా చంద్రాన్ని చూస్తూ.

చంద్రం తన్మయుడైపోయాడు.

పనివాడు తెచ్చిన కాఫీని విజయకో కప్పిచ్చి, తొనకటి అందుకొన్నాడు చంద్రం.

ఆ తరువాత అతనొక అరగంట సేపు మాట్లాడాడు. మధ్యలో ఎక్కడా ఆగలేదు. మాట్లాడుతున్నంతసేపూ అతని కళ్ళు కోపంతో మండుతూనే ఉన్నాయి. ముఖం కందగడ్డలా ఎర్రబడిపోయింది, పెదవులు వణికాయి.

''కాలానికి ఎదురీది పైకిరావాలనుకోవడం పొరబాటు విజయా! సమయం వచ్చినప్పుడే విజృంభించాలి... నేనోమాట అంటున్నందుకు నువ్వు బాధపడకు. ఇంతకుముందు మాట్లాడుతూ నాకోసం చాలా రోజులపాటు ఎదురు చూశాననీ, రాకపోవడం నీ తప్పు కాదనీ అన్నావు. నేనెప్పుడొచ్చినా తలుపులు తెరవడానికి అభ్యంతరం లేదన్న ధోరనిని వెలిబుచ్చావు. నిజానికీ మాటలన్నీ నువ్వు మనస్ఫూర్తిగా అన్నదీ లేనిదీ నాకు తెలీదుకానీ ఈ మాటలంటే నేను సంతోషిస్తానని నీకు తెలుసు. అలా నన్ను సంతోషపెట్టి, నీ పనులేవో చేయించుకొందామని నీ అభిప్రాయం. అవునా విజయా?'' అన్నాడు చంద్రం.

హఠాత్తుగా వాతావరనంలో ఇలాంటి మార్పు కలిగినందుకు విజయ లోలోపల చింతించింది. చంద్రాన్ని అలా మాటలతో బులిపించి పని సానుకూలపరచుకొందామనే తనొచ్చింది. కానీ - ఆ మాట, అంత స్పష్టంగా తను అనెయ్యడం నాగరికత అనిపించుకోదు.

''నువ్వు దీనికి సమాధానం చెప్పవనీ, మౌనంగా ఉండిపోవడమో చిరునవ్వు నవ్వడమో చేస్తావనీ నేననుకొన్నాను. నువ్వు మౌనంగా ఉండిపోయావు - నేననేదేమిటంటే - మనిషిక్కావలసింది ఆ అంచనా! నీ పద్ధతి మంచిదే! నేనూ అదే మార్గాన్ని అనుసరించాను... మంజరికి నచ్చే మాటలే చెప్పాను. ఆవిడకు గిట్టవనుకొన్నవి నేనసలు మాట్లాడనే మాట్లాడను. ఆమెకూ, హీరోలకూ రాజీ కుదిరే అనుమానం కలిగినప్పుడు ఆ అవకాశాలను ధ్వంసం చేశాను. కావాలని ఉన్నవీ లేనివీ చెప్పాను. ఏం జరిగిందట. మంజరి పక్కన హీరోగా బుక్కయ్యాను. ఇప్పుడు ఆరు పిక్చర్లు నాకున్నాయి. ఇవ్వాళో రేపో మరో రెండు కంట్రాక్టులమీద సంతకం చెయ్యబోతున్నాను. ఇదంతా నా ప్రతిభవల్లనేనని నేను ఛస్తే అనుకోను. ఇంకోరు అన్నా- నేను నిజమని నమ్మను. ఇంతకాలంగా నాలోలేని నైపుణ్యం ఇప్పుడు హఠాత్తుగా మొలచుకొచ్చిందా? లేదే? ఇన్ని రోజులుగా అవకాశం కోసం ఎదురు చూస్తున్నాను. ఇప్పటిగ్గానీ అది చేతికి చిక్కలేదు''.

చంద్రం జేబుగుడ్డతో వొకసారి ముఖ మంతా తుడుచుకొన్నాడు.

''పాపం, పుణ్యం, ధర్మం, న్యాయధిదంతా ఎందుకూ పనికిరాని పరమ చెత్త విజయా! తీరికూర్చుని కాలక్షేపం కోసం చరి&ంచచుకోవడానికి తప్ప జీవితంలో వీటి ఉపయోం అట్టే ఉండదనుకొంటాను... ఈ ప్రపంచం డబ్బు చుట్టూ తిరుగుతున్నది. డబ్బే పుణ్యం, డబ్బే న్యాయం, డబ్బే ధర్మం, సమస్తమూ డబ్బే! ఆ డబ్బుకోసం మోసం చెయ్యవలసి వస్తే చేదాం, అబద్ధాలాడవలసి వస్తే ఆడదాం; హత్య చెయ్యాలంటే చేదాం! నువ్వందుకు సిద్ధంగా ఉంటే, ఈ రంగంలో నీ

కెప్పటికయినా విజయం లభిస్తుంది. మీనమేషాలు లెక్కిస్తూ కూచుంటే, నీకు మీనమున్నూ మరియు మేషమున్నూ లభించును!'' అన్నాడు చంద్రం.

ఆ చివరి వాక్యం విని అదోలాగా నవ్వింది విజయ.

''సాధారణంగా అవకాశాలు ఎప్పుడోగానీ మనదాకా రావు. మనమే వెదుక్కుంటూ వాటికోసం పోవాలి... నేను గ్రహించిన సత్య మిది! మంజరి నాకు లిఫ్ట్ ఇచ్చినట్లే, రావుగానీ, మూర్తిగానీ నీకో ఛాన్స్ ఇవ్వవచ్చు. వెళ్ళి ప్రయత్నిం చెయ్యి'' అని సలహా ఇచ్చాడు.

''నేనెప్పుడూ వారిని ఏదీ అడగలేదండీ!'' అన్నది విజయ సంకోచిస్తూ.

''ఇంతసేపణ్ణించీ నేను చెబుతున్నదంతా విని గూడా అలా మాట్లాడితే నే నేమనను విజయా! ఇదివరకు నువ్వేమీ వారిని అడగకపోవడం కూడా మచిదే! కనీసం ఆ మోమాటం పనిచేసినా చాలు... మనమైనా అనర్హులకు సాయం చెయ్యమనడం లేదుగా? అవకాశం లేనివారికి సాయం చేయమంటున్నాం, అంతే'' అన్నాడు చంద్రం.

''చూస్తాను'' అన్నది విజయ.

''అలా చులాగ్గా తీసుకోకు. చెయ్యదలచిన ప్రయత్నమేదో గట్టిగానే చెయ్యి ఫలించిందో నీ జాతకం అద్భుతంగా మారిపోతుంది. ఏమీ కాలేదనుకో - ఇప్పుడున్న నీ స్థితికొచ్చిపడే నష్టమేమీ లేదు''

విజయ లేచి నిలబడింది.

ఆమెను వీధి మెట్లదాకా సాగనంపాడు చంద్రం.

''వస్తానండీ!'' అని నమస్కరించిందావిడ.

చంద్రం ప్రతినమస్కారం చేశ్యాడు నవ్వుతూ.

''కనీసం ఈసారన్నా నా ప్రతిఫలం మరచిపోకపోతే - నాకదేచాలు''.

ముందుకు పోతున్నదల్లా ఆగి, విజయకూడా మందహాసం చేసింది.

''అదేదో మీకు ముట్టచెప్పిందాకా నాకూ మనశ్శాంతి లేకుండా చేసిపారేశారు. నేను సాయంత్రంలోగా ఎక్కణ్ణించయినా ఫోను చేస్తాను. మీకు వేరే పనిలేదుగా?''

''ఎందుకూ!'' అన్నాడు చంద్రం.

''మీ ముడుపు మీకు చెల్లించేందుకు''

ఆ చివరి మాట అంటున్నప్పటి హంగిమ అతణ్ణి ముగ్ధుణ్ణి చేసింది.

విజయ మనస్సు గాలిలోకి ఎగిరిపోతున్నట్లుగా ఉన్నది. తలొంచుకొని వీధి చివరి దాకా వచ్చింది. ఇంకో రెండు ఫర్లాంగులన్నా నడిస్తేగానీ బస్‌స్టాండ్ రాదు. పోనీ టాక్సీ ఎకికపోదామంటే పోవచ్చుగానీ, రేణ్ణించీ కుండల్లో గుర్రాలు దౌడుతీయాలిసొస్తుంది. అక్కడికీ తనెంతో జాగర్తగా వాడుకొస్తూంటేనే... ఈ మాత్రం అలాయి బులాయి ఖర్చులన్నీ చేస్తూ కూచుంటే, సాయిబు సంపాదన బూబమ్మ కుట్టుపూసలక్కూడా చాలకుండా పోతుంది.

ఏదయినా అదే అవుతుందని విజయ తెగించి, పోతున్న టాక్సీని ఆపింది. తన దగ్గరింకా నాలుగు రూపాయలున్నాయి. అవి టాక్సీ ఫేర్‌కు సరిపోతే తనెల్లాగయినా రేపటికి

సంపాదింపగలుగుతుంది.

విజయ లోపలికొచ్చి కూచున్నది.

డ్రైవరు పది గజాలు కారు పోనిచ్చి "తలుపు సరిగ్గా పడలేదు, గట్టిగా లాగి వేయండి" అన్నాడు. విజయ కామాట లెందుకనో సిగ్గు తెప్పించాయి. లాగి తలుపువేశాక-

"ఎక్కడికమ్మా?" అన్నాడు డ్రైవరు.

"మూర్తిగారింటికి, టి.నగర్".

పది నిమిషాలకల్లా కారు మూర్తిగారింటి ఆవరణలో ఆగింది. చెట్లకిందో డనుకార్లదాకా ఉన్నాయి. మీటరు 3.80 దాకా తిరిగింది. నాలుగు రూపాలిచ్చి చిల్లరకోసం ఎదురు చూడకుండానే పి.ఏ దగ్గరకొచ్చింది విజయ.

"కూచోవమ్మా" అంటూనే భుజాలు ఎగరేశ్శాడు మూర్తిగారి పి.ఏ. "ఎన్నడూ లేనిది ఇవావ్వళ ఇలా వచ్చావేమిటి?దోవగానీ తప్పలేదుగదా!"

"లేదు" అన్నది విజయ.

పి.ఏ వోసారి ఆమెకేసి ఎగా దిగా చూసి ధోరణి మార్చేశాడు.

"చూడమ్మాయి! ఈ మధ్య ఏమన్నా పిక్చర్లున్నాయా?" అన్నాడు మామూలుగా.

"లేవండి బాబూ! ఎప్పుడో పిట్టబెదిరినట్టుగా ఏడాదికో సినిమా వొస్తే అందులో వచ్చేది, ఆ నాలుగు రోజులకే చాలదు..."

"మొన్నా మధ్య మూర్తిగారెందుకో మీ ప్రసక్తి తీసుకొచ్చారమ్మా!" అన్నాడు పి.ఏ.

విజయ కళ్ళు మెరిశాయి.

"నాతో ఏం పనండీ బాబూ? ఏమిటి ఆ సందర్భం? మీకు జ్ఞాపకముందా?"

"ఎన్నని జ్ఞాపకం పెట్టుకోను చెప్పు తల్లీ! పదిమంది బుర్రలు చేయవలసిన పని నేనొక్కణ్ణీ చేసుకొస్తున్నాను"

"!నండీ బాబూ! మేమందరం అప్పుడప్పుడు అనుకొంటూనే ఉంటాం మీ గురించి" అన్నది విజయ.

"ఏమనుకొంటే ఏముందిలే అమ్మాయ్! అసలాయనకు నా సంగతి పట్టకుండా ఉంది. ననాలుగేళ్ళనుండి పది రూపాలయ ఇంక్రిమెంటు లేదు. 'ఏమండీ' అంటే 'ఇంకింతకన్నా మంచి జీతమిచ్చేవారుంటే వెళ్ళండి' అన్నారొకసారి".

"పోనీ - ఇంకెక్కడన్నా ప్రయత్నం చెయ్యకపోయారాండీ?" అన్నది విజయ.

పి.ఏ గారు ఏ సమాధానం చెప్పేవారోగానీ, అంతలోనే మేడమీది నుండి మూర్తిగారు మరో పదిమందితో కలిసి, ఇల్లెగిరిపోయేలాగా నవ్వుతూ కిందికొచ్చారు. పి.ఏ తాగుతున్న సిగరెట్‌ను చెట్లలోకి గిరాటెట్టి గబగబా తన సీట్ దగ్గరకు చేరుకొన్నాడు.

విజయ విజిటర్స్ రూపం దాపులో నిలబడింది.

అందరూ వెళ్ళాక "ఎంతసేపయింది మీరొచ్చి?" అన్నాడు మూర్తి.

విజయ చెప్పింది.

"ఏమన్నా మాట్లాడాలా?.... రండి మరి!"

మూర్తిగారు రెండు కాఫీలు తెప్పించి, తానకటి తీసుకొని, విజయకో కాఫీనిచ్చారు.

"చెప్పండి!" అన్నాడాయన, గడియారం కేసి చూస్తూ.

"ఏంలేదు బాబుగారూ! మీకు నేను చెప్పదగిందాన్ని కాదు. నాకన్నా అనేక విషయాల్లో మీరు పెద్దవారు. ఈ ఇండస్ట్రీలో ఉన్న లోతుపాతులన్నీ మీకు తెలుసు. మీ అనుభవంలో నాకు పదో వంతు అనుభవం కూడా లేదు. ఐనా మీ క్షేమం కోరి ముఖ్యంగా నేను రెండు మాటలు చెబుదామని వచ్చాను" అన్నది విజయ, చాలా జాగర్తగా మూర్తిగారి ముఖాన్ని వెదుకుతూ.

మూర్తిగారి కన్నులు కెంపురంగుకు తిరగడం ఆవిడ గమనించింది. మెల్లగా కొనసాగించింది.

"వియ్యమయినా, కయ్యమయినా సరివారితోగానీ, లేకిమనుషులతో పనికిరాదని మన పెద్దవాళ్ళు చెప్పారు. ఎంతో అనుభవంమీద వారామాట చెప్పారనుకొంటాను బాబుగారూ! ఏ కారనం వల్లనోగానీ మీరా పెద్దల మాటను మనసుకు పట్టించుకోలేదు. జులాయి మనుషులతో కీచులాట పెట్టుకొన్నారు. ఇందువల్ల మీరెంత నష్టపోతున్నారో మీకు తెలీదు" అన్నది విజయ.

మూర్తిగారు కోపాన్నంతా దిగ మింగుకొని, సన్నగా నవ్వి "ఏమయిందేమిటి?" అన్నారు, ఏమీ ఎరగనట్టు.

విజయ కాస్పేపటిదాకా, ఆ విషయమేదో బయటపెట్టడం తనకిష్టం లేనిదానిలాగా మెలిపెట్టింది.

"ఫర్వాలేదమ్మా! నీ ద్వారా ఈ మాట బయటకొచ్చినట్టు నేనెక్కడా అనను. మంజరి ఏమన్నదేమిటి?" అన్నాడు మూర్తి.

"నిన్ననూ - ఏదో పనుండి వెళ్ళాను బాబూ! ఆవిడకు గంగవెర్రులెత్తిపోయాయి. అడిగినవారికి అడగనివారికి కూడా ఈ తగాదాను గురించి ఆవిడ చెప్పుకొస్తున్నది. తనుట, ఏడేడు పధ్నాలుగు జన్మలెత్తినా మీదో కలిసి పనిచేయదట. ఇంతవరకూ పనిచేసినందుకే పశ్చాత్తాప పడుతున్నదట. తన దగ్గర కొచ్చిన ప్రొడ్యూసర్లందరికీ తనీమాటే చెబుతున్నదిట. తను కావాలంటే మిమ్మల్ని చుప్తాగా వదులుకోవాలిట. అట్లాగన్నా కొన్ని కంపెనీలు తిరిగి పోతాయేమోనని తను అనుకొన్నదిట గానీ, రాను రాను పిక్చర్ల సంఖ్య పెరుగుతున్నదే గానీ, తరగడం లేదుట. ఏమిటోలెండి బాబూ! తెగించినవాడికి తెడ్డే లింగమని ఆ తరహా మనుషుల నోటికి అడ్డేమున్నది చెప్పండి?" అన్నది విజయ.

మూర్తిగారికి పట్టరానంత ఆగ్ర హం వచ్చింది. ఆయనగారికి ఉద్రేకాలు దాచుకోవడమంటే ఏమిటో తెలియదు. అనుములు తింటూ మినుములు చేతిలో పెట్టడం ఆయనవల్లకాదు. ఆ విద్యలో ఆరితేరినవాడు రావుగారు.

"ఇంకా? ఇంకేమన్నది?"

"ఆఁ... మేయినా అంటుంది పోనిస్తురూ!" అన్నది విజయ.

మూర్తిగారిచేత ఓ నిమిషం పాటు బతిమిలాడించుకొని తిరిగి చెప్పసాగింది విజయ.

"మనుషులకన్నా కుక్కలెంతో నయం బాబుగారూ! ఒక్కసారి పిడికెడు మెతుకులు వేస్తే, మనల్ని చూడంగానే విశ్వాసంతో తోకాడిస్తుంది. ఈ మనుషులకు ఆ మాత్రం జ్ఞానం కూడా ఉండదు" అన్నది విజయ సన్నగా నిట్టూరుస్తూ. "నేనప్పటికి మద్రాసు వచ్చి కొన్ని వారాలు మాత్రమే

అయింది. మంజరిగారికింకా మార్కెట్లో ఉప్పు పుట్టడం లేదు. ఆవిడకింకా కొమ్ములు మొలిచే లక్షనాలు కూడా లేవు. ఆ రోజుల్లో ఆవిడ మీ చుట్టూ ఎన్నిసార్లు తిరిగిందో నాకు తెలుసు. పాపమని దయతలచి, మీరు పది కపంఎనీలకు రికమెండ్ చేయడం నాకు తెలుసు. ఆ కంపెనీలతో ఆవిడ తగాదా పడటం నాకు తెలుసు. మీరు సర్దుబాటు చేయడమూ నాకు తెలుసు.''

''మరి- మీరడక్కపోయారా?'' అన్నాడు మూర్తిగారు.

''అడిగానండీ బాబూ! నేను చేసిన పొరబాటే అది! నిజం అడిగినందుగ్గాను ఆవిడ తారామండలానికి లేచిపడింది. నన్ను నానా మాటలూ అన్నది. నేనుట, మీతరపున గూఢచారిగా పనిచేస్తున్నానట. ఇంకోసారి తన గడపతొక్కితే కాళ్ళిరగకొట్టిస్తానన్నది, నీ గడపకాదు సరేకదా- నువ్వున్న వీధిక్కూడా రానన్నాను. అంత అహంకారం పనికిరాదన్నాను. దేవుడు నీ అహం అణచకపోతే అప్పుడడగమన్నాను. నీ పిల్లి మంత్రాలకు చింతకాయలు రాలవన్నది. కడుపుమండి, అడగవలసిన నాలుగూ అడిగేసి వచ్చాను'' అన్నది విజయ.

''మంచిపని చేశావు'' అన్నాడు మూర్తి.

విజయ ఓ నిమిషంపాటు కళ్ళు మూసుకుని సన్నగా నిట్టూర్చింది.

''ఈ తగాదా మన పరిశ్రమకే మంచిది కాదు బాబూ! ఆవిడ ధోరనిని చూస్తుంటే చాలా కంపెనీలు ఆవిడచుట్టూ తిరుగుతున్నాయనిపిస్తుంది. మంజరిని హీరోయిన్‌గా బుక్ చేస్తున్న వారందరూ మిమ్మల్నీ, రావుగారినీ మినహాయిస్తున్నారు. ఇలా కొంతకాలం సాగితే మీకసలు కంపెనీలే ఉండవేమోనని భయమేస్తూ ఉంది'' అన్నది విజయ.

''అందుకని?'' అన్నాడు మూర్తి కొనుబొమలు క్లోజప్ కోసం ముడిచినట్లుగా ముడిచి.

''ఏదో విధంగా రాజీపడటం మంచిదేమో ఆలోచించండి!''

మూర్తిగారు విలనిక్‌గా నవ్వాడు.

''ఈ బొందిలో ఊపిరున్నంతవరకూ అది అసంభవం విజయా! ఈ ఇండస్ట్రీ మొత్తం తనకోసం కలవరిస్తున్నదనుకోవడం భ్రమ. మొన్నమొన్నటిదాకా కొత్త ముఖాలేవీ దొరక్క, అన్ని కంపెనీలూ మంజరికోసం పరుగెత్తాయి. అదృష్టవశాత్తూ మంజరి అందంగా ఉంటుంది. దానికి తోడు చురుకైన తెలివితేటలున్న మనిషి. గబగబ పైకిపాకింది. ఇవ్వాళ మంజరిని తలదన్నగలవారు చాలా మంది వచ్చారు. వారిమీద ఎక్స్‌పెరిమెంటు చెయ్యడానికి కంపెనీలు కాస్త జంకుతున్నాయి. కొత్తవారితో పనిచెయ్యడానికి నేనూ, రావుగారూ వొప్పుకుంటామో లేదోనని చాలా భయపడుతున్నారు. మేము 'సరే'నంటే, 'పొలో'మంటూ పాతికమంది కొత్త హీరోయిన్లు రంగంలోకి దిగుతారు'' అన్నాడు మూర్తి.

''అలా దిగరని మంజరి గట్టిగా విశ్వసిస్తున్నది. తను తప్ప ఈ మద్రాసు పరిశ్రమకు మరో దిక్కులేదని ఆవిడకు నిక్కు. దాన్ని ఎంత తొందరగా వదిలిస్తే అంత మంచిది'' అన్నది విజయ.

''చూదాం'' అన్నాడు మూర్తి.

''అలా అనకండి బాబూ! నే నావిడతో సవాల్ చేసివచ్చాను. తన కోడీతన కుంపటీ లేకపోయినా, తెల్లవారుతుందని మంజరికి తెలియాలి. అలా తెలియడం చాలా అవసరం. మీరుగనక 'ఆఁ పోనిస్తురూ' అని ఉదాసీనంగా ఊరుకొంటిరా - నేనిక తలెత్తుకొని తిరగలేను. కనీసం నా పరువు కోసమయినా,

మీరేదో వో ప్రతీకారం తీసుకోవాలి'' అన్నది విజయ.

''నాకు లేని పట్టుదల నీకెందుకమ్మా?'' అన్నాడు మూర్తిగారు నవ్వుతూ.

''మీలాగే నేనంత తుస్కాళంగా ప్రతిదాన్నీ తీసుకోలేను బాబుగారూ! ఏదో విధంగా నా కసి తీరిందాకా, నాకు జ్వరం తగిలినట్లుగా ఉంటుంది. మీరన్నట్లు మద్రాసు సినిమా పరిశ్రమ అంతగా గొడ్డుపోలేదు. ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు కాస్త జాగర్తగా చూస్తే హీరోయిన్ వేషాలకు పనికొచ్చే ఆర్టిస్టులు అరడజనుమంది దాకా ఉన్నారు. వాళ్ళల్లో ఎవరినన్నా మీరు మంజరికి పోటీగా నిలబెట్టండి. మేమందరం ఆ కొత్తహీరోయిన్‌కు సపోర్లింగా ఉంటాం. మంచీ మర్యాదా తెలీనివారికి ఈ ఇండస్ట్రీలో చోటు లేదని తెలియచేయడం ముందవసరం.''

మూర్తిగారు ఓ నిమిషం పాటు విజయకేసి చూసి, తలపంకించాడు.

''మీరిప్పుడు సరాసరి ఇంటికే పోతారా?'' అన్నాడు మూర్తి.

తనిక బయలుదేరవలసిన టైమయిందనుకొన్నది విజయ.

''అవునండి బాబుగారూ! నేను ఆఖరిసారిగా కెమేరాముందు నిలబడి నాలుగు మాసాలయింది''.

''అలాగా!'' అన్నాడు మూర్తి. ''మీరు పోయేటప్పుడు పి.ఏగారికి ఎడ్రసిచ్చి వెళ్ళండి. డ్రైవర్ మిమ్మల్ని డ్రాప్ చేస్తాడు''

''బతికాను' అనుకొన్నది విజయ.

ఆవిడ దగ్గర వొట్టు పెట్టినట్లుగా చిల్లికానీ కూడా లేదు. మూర్తిగారు తను కారుమీద డ్రాప్ చెయ్యడమన్నదే జరక్కపోతే తను కాళ్ళు కాళ్ళు కొట్టుకొంటూ రోడ్డంట కోడంబాకందాకా నడవవలసిందే! పోనీ మధ్యలో దిగి చంద్రం దగ్గర కెడదామా అనుకొన్నది. వెళ్ళాక, 'ఏమయిం'దని అతను అడగక మానడు! తనేమని చెబుతుంది? అదీగాక, తనంతట తను చంద్రం దగ్గరకెళ్ళడమేమిటి నాన్‌సెన్స్! తనంటే మోజున్నవాడడు తనకోసం ఎప్పుడైనా రావచ్చునే! తను ఓ యింటికైన ఇల్లాలు కాదుగదా భయపడటానికి!

మూర్తిగారు పోర్టికోదాకా వచ్చాడు. డ్రైవర్ వెనుక తలుపు తీసి పట్టుకునుంచున్నాడు.

''నమస్కారమండీ! మరి సెలవు!'' అన్నది విజయ, రెండు చేతులూ జోడించి.

మూర్తిగారు, ''నమస్కారం'' అనడానికి బదులు తలొంచారు. విజయ కారులో కూచున్నది. డ్రైవర్ తలుపువేసి నొక్కాడు. విజయ చిరు చెమటలు తుడుచుకొని చూసింది. మూర్తిగారు కారులోకి వంగి కనిపించారు. ఆయన చేతిలో ఏదో కవరున్నది.

''ఎక్కడా వేషాలేల్వంటున్నారు. ఎంత బాధపడుతున్నారో నాకు తెలుసు. ప్రస్తుతానికి ఈ అప్పు తీసుకోండి. తిరిగి మీ దగ్గరకు డబ్బు రాగానే నా బాకీ నాకు తీర్చేద్దురుగానీ, ఇంకేం అనుకోకండి. అడ్రసిచ్చారుగా?'' అన్నాడు మూర్తి.

''ఆఁ.''

''దట్సాల్!''

అని మూర్తిగారు పాంటు జేబుల్లో చేతులుంచుకొని, వెనక్కు తగ్గారు. కారు ఓ కుదుపు కుదిపి ముందుకు సాగిపోయింది.

❦❦❦❦❦❦❦❦

# 22

అయిదారు రోజులపాటు విజయ మాంచి ఉద్వేగంలో ఉంది. తనకు మూర్తిగారినుండి ఏ నిమిషాన్నయినా పిలుపు రావచ్చునని ఆవిడకు అంతరాత్మ చెబుతున్నది. తను చాలా మంచి దోవలో ఉన్నాననీ, తను చేసిన ఎత్తు అమోఘమయిందనీ విజయ భావించింది. తను జాతకురాలో కాదో ఈసారి తేలిపోవడం ఖాయమని కూడా ఆవిడనుకొన్నది.

"ఈ దెబ్బతో ఏమన్నా పుంజుకుంటారా సరేసరి! లేదా - ఈ సినిమాలకో సలాం కొట్టి, ఏ అయ్యానన్నా నమ్ముకొంటాను" అన్నది విజయ తన స్నేహితురాలితో.

ఎందుకయినా మంచిదని ఓసారి రావుగారితో కూడా మాట్లాడి వచ్చింది. అయితే ఇక్కడి ధోరని వేరు! ఎమంజరికి సంబంధించినంతవరకూ ఆ ధోరనిలో భేదమేమీ లేదు. ఆ మిగతా దానిదగ్గరే విజయ తెలివిగా వ్యవహరించింది.

"ఆ తగాదాలేమన్నా ఉంటే, మూర్తిగారూ, మంజరిగారూ పడేవారు - మధ్యలో మీరెందుకు తల దూర్చారు రావుగారూ!" అన్నది విజయ ఎంతో లాలనగా.

"ననా?" అని నవ్వారాయన, ఎటూ తేలకుండా.

"అవునండీ! మీ కోసమనే సినిమా తీసే కంపెనీలున్నాయి. మీరున్నారంటే చాలు, లక్షలు అడ్వాన్సులిచ్చే డిస్ట్రిబ్యూటర్స్ ఉన్నారు. మీ ద్వారా ఈ ఇండస్ట్రీకి జరగవలసిన పనులు చాలా ఉన్నాయి. మీరింకా జయించవలసిన ఫీల్డు - అలా - బోలెడంతగా పడి ఉన్నది. అన్ని మహాకార్యాలు ముందుంచుకొని, మీరీ అల్పమైన తగాదాలో తలదూర్చడం బావోలేదు. అయితే ఒకటి మాత్రం నిజం! మంజరికి మీరన్నా సదభిప్రాయం లేదు. ఆ మహాతల్లికి ఎంతగా విచక్షణాజ్ఞానం లోపించిందంటే - మిమ్మల్నీ మూర్తిగారినీ వొకటే గాటన కట్టివేస్తున్నది!" అన్నది విజయ.

"మీరన్నది సరికాదనుకొంటాను. నేను చెయ్యవలసిన ఘనకార్యాలంటూ ఈ ఇండస్ట్రీలో ప్రత్యేకంగా ఉన్నాయంటారా? ఏమో, నేను చెప్పలేకుండా ఉన్నాను. అలాంటివేమన్నా ఉండటమే నిజమౌతే, ఆపాటి ఘనకార్యాలు ఎవరయినా చేయగలరనుకొంటాను. ఇక తల దూర్చట ఎమంటారా? అది తప్పనిసరైంది. మూర్తిగారొచ్చి పనిమాలా నన్ను అడిగి మరీ వెళ్ళారు. నేనూ మొహమాటానికి లొంగి కాదనలేకపోయాను. మీకు మల్లేనే చాలా మంది మిత్రులు నన్నీ విషయంలో పట్టుదల వదలుకోమన్నారు. ఒకప్పుడైతే ఆలోచించడానికన్నా అవకాశముండేదేమో! ఇప్పుడదీ లేదు. మంచికో చెడ్డకో ఇదొచ్చింది. మధ్యలో చేతులు ముడుచుకోవడమన్న ప్రసక్తేలేదు" అన్నాడు రావుగారు.

అప్పటికేమీ అనలేకపోయినా, అతనెంత తెలివిగా వ్యవమరిస్తాడో మరోసారి తెలిసి విజ అయ ఆశ్చర్యపోయింది.

"పైగా బోలెడంతగా చదువుకొన్న మనిషి కూడా కాదు. మద్రాసు వచ్చే నాటికి అతనికి తెలిసిందేమీ లేదు. ఇవ్వాళ, అతనో రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉండి, నడపగలరు" అన్నారెవరో రావుగార్ని గురించి.

అతను అనుదిన జీవితం నుండి చాలా నేర్చుకొన్నాడు. ప్రతి అనుభవాన్నుండీ పాఠం నేర్చుకొన్నాడు. బతుకులోని వెలుతురు, చీకటి తెలుసు. మనుషుల్ని అర్థం చేసుకోవడంలోనూ అంచనా వేయడంలోనూ దిట్ట. సర్వ సాధారణంగా, అతని అంచనాలు తప్పిపోవు.

ఇవన్నీ నిజమేననిపించింది విజయకు. తను మూర్తితో మాట్లాడిన కాస్సేపట్లో అతని ఉద్రేకాలను చేజిక్కించుకొని, ఇష్టం వచ్చినట్లు ఆడించగలిగింది. అదే అస్త్రం రావుగారి దగ్గర ఎందుకూ పనికిరాలేదు. అతనికి మంజరితో విరోధమున్నదో లేదో తెలియదు. మూర్తిగారితో విహితం ఉన్నదో లేదో అంతకన్నా తెలీదు. మంజరితో విరోధమంటూనే, ఆవిణ్ణి ఆకాశానికెత్తడం, మూర్తిగారు నా అన్న అంటూనే వాజమ్మకింద జమచేసి మాట్లాడడం విజయ అవగాహన చేసుకోలేకపోయింది.

''ఇతనో చాణక్యుడు. ఈ జన్మలో నేనితన్ని అర్థం చేసుకోలేను''అనుకొన్నది విజయ.

మూడో రోజునో, నాలుగో రోజునో - చంద్రం కనిపించి లిఫ్ట్ ఇచ్చాడు విజయకు.

''ఇప్పుడేమన్నా బిజీగా ఉన్నావా?'' అన్నాడు చంద్రం.

విజయ నవ్వి ''లే''దన్నది.

''మీదో అన్న విషయం జ్ఞాపకం ఉన్నది. ఆ రోజున మీకు ఫోన్ చెయ్యకపోవడానికి చాలా కారణాలున్నాయి''

''ఒకటి - నీ దగ్గర డబ్బులేదు. రెండు-''

''కాదు'' అన్నది విజయ. ''అవ్వేళ నా దగ్గర అయిదొందలున్నాయి అడిగితే నీకయినా అప్పు పెట్టేద్దును అందుక్కాదుగానీ - నే వెళ్ళిన పని కాయో పండో అప్పటికింకా తేలలేదు... చిత్రమేమిటంటే, చంద్రం- ఆ వ్యవహారం ఆ రోజు నెక్కడున్నదో ఇప్పటికీ అక్కణ్ణే ఉన్నది. ఈలోగా ఆ గొంగడి అంగుళం మేర కూడా అటో ఇటో కదల్లేదు. అదో కొలిక్కి వస్తే మనస్సుకు హాయిగా ఉంటుంది. అదేమీ తేలకుండా ఉన్నదే భగవంతుడా! అని లోలోపల మల్లగుల్లాలు పడుతూ, నీ దగ్గరకొచ్చినా, నువ్వుగానీ, నేనుగానీ సుఖపడేదేమీ ఉండదనిపించింది... అరె...మనం మౌంట్‌రోడ్‌దాకా వచ్చేమే?''

''స్పెన్సర్‌లో కొద్దిగా పనుంది. చూసుకొని పోదాం''

విజయ తిరిగి కోడంబాకం వచ్చేసరికి తొమ్మిది కావస్తూంది.

నన్నా చెట్టు దగ్గర డ్రాప్ చెయ్యి చంద్రం, నేనెడతాను''అ న్నది విజయ.

''ఫర్వాలేదు, ఇంటి దాకా -''

విజయ ఇబ్బందిపడుతున్నదని చంద్రం గమనించి ''ఏం?'' అన్నాడు.

''అక్కడిదాకా కారు పోదు, పోయినా తిరిగి రాదు.''

విజయ కారు దిగింది.

చంద్రం వెళ్ళిపోయాడు.

బురదలో కాలు జారకుండా ఆవిడ అడుగులో అడుగువేసుకుంటూ ఇంటిదగ్గరకొచ్చేసరికి, అరుగుమీద మసక వెలుతుర్లో ముగ్గురు మనుషులు కూచుని వున్నారు.

''ఎవరూ?'' అన్నది విజయ, అరుగుకు అల్లంత దూరంలోనిలబడి.

‘‘విజయగారా? నమస్కారమండీ! నేనూ!’’ అంటూ మూర్తిగారి పి.ఏ పీరుకుమల్లే లేచి నిలబడ్డాడు.

విజయ గుండెలు ఒక్కసారిగా గుబగుబలాడాయి. జరగకూడనిదేదో జరిగిపోయినట్లనిపించిందామెకు.

విజయ తాళం తీసి, తను ముందుగా వెళ్ళి లైటు వేసింది. ఉన్న నాలుగు కుర్చీలు దుమ్ము దులిపి, అతిథుల్ని ఆహ్వానించింది.

‘‘ఆలస్యమయిపోయింది, మన్నించాలి. ఇవ్వాళ మా స్నేహితురాలు పుట్టినరోజు పండుగ చేసుకొంటున్నదండీ! బలవంతం చేస్తే వెళ్ళక తప్పిందికాదు’’ అని సంజాయిషీ చెప్పుకొన్నది విజయ.

మూర్తిగారు పి.ఏ సరాసరిగా వ్యవహారంలోకి దిగాడు.

‘‘ఈయగనారు యాజులు. పూర్తి పేరు సోమయాజులు. పీయూషా పిక్చర్సులో ప్రొడక్షన్ మేనేజర్‌గా ఉంటున్నారు. వీరి పేరు సత్యనారాయణ వీరి వెంకటవరప్రసాదమూర్తిగారు. మామూలుగా మేమందరం ‘తస్యం’గారంటూ ఉంటాం. పీయూషా పిక్చర్‌ఎస మేనేజింగ్ పార్ట్నర్‌గారి తోడల్లుడు’’ అని పరిచయం చేశాడు మూర్తిగారి పి.ఏ.

‘‘చాలా సంతోషమండీ! మిమ్మల్నందర్నీ ఈ రోజున ఇలా కలసుకోగలగడం నా అదృష్టిం! - మీరలా మాట్లాడుతూ కూచుంటారా, పది నిమిసాల్లో కాఫీ కాచుకొచ్చేస్తాను’’ అన్నది విజయ.

మూర్తిగారి పి.ఏగారు వల్లకాదంటే కాదన్నారు. ఆ పని ఇంకో దఫా చూచుకొందామన్నారు.

‘‘పీయూషా పిక్చర్స్ వారో సాంఘికం తీస్తున్నారు. కథ, సాంగ్సు, డైలాగ్స్ అన్నీ రెడీగా ఉన్నాయి. మూర్తిగారితో మూడు రోజులుగా డిస్కషన్స్ జరుగుతున్నాయి. వారు హీరోగా ఉంటున్నారు. మిమ్మల్ని హీరోయిన్‌కు సజెస్టు చేశారు. ఫైనల్ డెసిషన్‌కు ముందు మిమ్మల్నోసారి కలుసుకుందామని యాజులుగారు, సత్యంగారు వచ్చారు’’ అన్నారు మూర్తిగారి పి.ఏ.

‘‘నాకు మూర్తిగారి మాటంటే వేదవాక్యం. వారేం చెబితే అది చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను’’ అన్నాడు సత్యం.

అతనికి విజయను చూస్తూనే మతిపోయింది.

‘‘మరి మీరేమంటారు?’’ అన్నాడు పి.ఏ యాజులుకేసి చూస్తూ.

‘‘నేనింకా అనేదేమిటండీ మహానుభావా? మీరూ భలేవారేనే!’’ అన్నాడు సోమయాజులు.

అంటే ఏమిటో ఆ యాజులుగారికే తెలియాలి.

‘‘ఇవ్వాళ మళ్ళా మూర్తిగార్ని ప్రొడ్యూసర్లు కలుసుకోబోతున్నారు. రేపటి ఉదయానికల్లా మీకే సంగతీ తేలిపోతుంది. ఉదయం మీకు షూటింగేమీ లేకపోతే, ఓసారి అలారండి, ఏమయిందీ నేనే చెబుతాను’’ అన్నాడు మూర్తిగారి పి.ఏ.

‘‘ఇంకా అయ్యేదేమిట్లెండి! ఈమెను కాయం చెయ్యాలిసిందే! ఇప్పటికే మేమొచ్చి నాలుగు మాసాలయింది. నా అంచనా ప్రకారం ఈసరికి మా మొదటి పిక్చర్ రిలీజయి, రెండోది సగం పైబడి షూట్ అవుతూ ఉండాల్సింది. అలాంటిది ఇంతవరకూ ఏమీ లేకపోయే’’నని విసుక్కొన్నాడు సత్యం.

“చిత్తం! అనవసరంగా చాలా కాలయాపన జరిగిందండీ!” అన్నాడు యాజులు.

వస్తూన్న నవ్వును అతి ప్రయత్నింమీదగానీ విజయ ఆపుకోలేకపోయింది. తన కర్మగాలితే, రేపణ్ణించి, ఈ సత్యంగాడికి తను జోహుకుం అంటూ బతకాలి. వాడొచ్చి పట్టుమని పావుగంటన్నా కాలేదు. ఈలోగా నాలుగుసార్లు తన చేతిని తాకాడు.

వెళ్ళేలోగా తనమీద విరుచుకుపడినా తను ఆశ్చర్యపడదు. ఇటువంటి సజ్జు ఈ రంగంలోకి వస్తున్నప్పుడు, మంచి సినిమాలు రావాలంటే ఎలా వస్తాయి?

“మరి మనం బయలుదేరదామా?” అన్నాడు మూర్తిగారి పి.ఏ లేచి నిలబడుతూ.

“సరే పదండి!” అన్నాడు సత్యం తను మాత్రం లేచే ప్రయత్నం చెయ్యకుండానే.

యాజులు ఆ సంగతి గమనించనివాడికి మల్లే వీధిలోకి వెళ్ళిపోయాడు.

విజయకిప్పుడు పచ్చి వెలక్కాయ గొంతున పడినట్లయింది. తను సత్యాన్ని వెళ్ళిపొమ్మనడం అమర్యాదగా ఉంటుంది. అంత మాట అన్నదాకా అతగాడు కదిలే ధోరణిలో లేడు. ఈ యాజులుగాడేమో చల్లగా తప్పుకొన్నాడు. ఈ పి.ఏ కూడా జరుకొన్నాడంటే తనకీ రాత్రి, ఈ సత్తిగాడితో ‘యాతన’ తప్పదు. ఓ రాత్రి- సత్యమనే పేరు గలిగిన ఓ పైత్యకారి మనిషి- తనింట్లో ఉండటానికి తనకెలాంటి అభ్యంతరమూ లేదు. కానీ - అసలీ వ్యవహారానికంతా మూల పురుషుడైన మూర్తిగారి పి.ఏ ముందు ఇలా జరగడం ఎంత మాత్రం భావ్యంకాదు.

ఆవిడ సత్యానికి తెలియకుండా మూర్తిగారి పి.ఏకు సైగ చేసింది, అతన్ని కూడా వెంట తీసుకెళ్ళమని.

“మరి వస్తామమ్మా! ఈ కంపెనీ వ్యవహారాలన్నీ నా నెత్తినా, మా సత్యంగారి నెత్తినా ఉన్నాయి. మాకేమో ఊపిరి పీల్చడానిక్కూడా తీరిక లేదంటే నమ్మండి. మధ్యాహ్నంనుండీ, ఇలా కాలు మడతపెట్టకుండా తిరుగుతున్నాం. ఇప్పుడు దాదాపు తొమ్మిదిన్నర కావస్తూందా - రెండు మెతుకులు తిని పండుకోవడానికీ లేదు. కవిగార్ని కలుసుకొని రేపటికల్లా రెండు పాటలు పేనమని చెప్పాలి... చచ్చిపోతున్నామనుకోండి... మరి... రండి బాబూ! మనమిలా బద్దకిస్తే లాభం లేదు” అంటూ మూర్తిగారి పి.ఏ గారు సత్యంగారి భుజం మీద చెయ్యి వేసి బలవంతాన లేవదీశాడు.

సత్యానికిక లేవక తప్పలేదు.

“బతికిపోయాను” అనుకొన్నది విజయ.

అందరూ వీధిలోకెళ్ళాక, ఆవిడ చప్పట్లు చరిచి పి.ఏను పిలిచింది.

“ఏమిటి?” అన్నాడతను అక్కణ్ణించే.

“జేబుగుడ్డ వదిలేశారు” అన్నది విజయ బిగ్గరగా.

అతను గబగబా వరండాలో కొచ్చాడు. ఈలోగా విజయ గదిలోకి తప్పుకొన్నది.

“ఏదీ?” అంటూ పి.ఏ నవ్వుతూ లోపలికొచ్చాడు.

“అవునుగాని, మీ కీపూట అర్జంటు పనులేమన్నా ఉన్నాయా?” అన్నది విజయ.

“ఏం?”

“లేకపోతే, వారిని పంపేసిరండి. ఈలోగా నేను కారియర్ తెప్పిస్తాను. ఇద్దరం కలిసి భోంచేసి-”

"ఊం... తరవాత?" అని నవ్వాడు పి.ఏ.

"నేను చెప్పను!" అని బుంగమూతి పెట్టింది విజయ. "మీ రెలాగైనా నాకీ అవకాశం ఇప్పించాలండీ! చాలా కాలంగా నాకసలు పిక్చర్లనేవే లేవు... మీ దగ్గరకు చాలా మంది ప్రొడ్యూసర్లు వొస్తూ ఉంటారు గనక, కాస్త నలుగురితోనూ నా గురించి చెప్పండి..."

"అలాగే!" అన్నాడతను.

విజయ అతన్ని గట్టిగా కావలించుకొని బుగ్గమీద చిన్న చిటిక వేసి "వాళ్ళను పంపేసి వస్తున్నారు కదూ!" అన్నది మెల్లిగా.

"ఇవ్వాళకాదు రేపొస్తాను. ఆ సత్యంగాడు ఆంబోతులాగా నా వెంట పడ్డాడు. ముందు వాడి బాధ వదిలించుకోవాలి... అదుగో! నన్నొదులు, ఎవరో వస్తున్నారు" అని వదిలించుకొన్నాడు పి.ఏ.

అతను వసారాలోకొచ్చేసరికే యాజులు, సత్యం ఎదురొస్తున్నారు.

"ఇంతసేపేం చేస్తున్నారండీ?" అన్నాడు సత్యం. పి.ఏను దొంగను చూసినట్లు పైకీ కిందికీ చూస్తూ.

యాజులు గతుక్కుమన్నాడు.

పి.ఏ అదేమీ గమనించకుండా, ఈల వేసుకొంటూ పెద్ద పెద్ద అంగలతో వీధిలోకొచ్చి పడ్డాడు.

# 23

ఆ మర్నాడు సత్యంగారు, యాజులుగారు, మూర్తిగారింట్లో సమావేశమయ్యారు.

"నిన్న మీరు వెళ్ళారా?" అన్నాడు మూర్తి.

ఏమంటే ఏమవుతుందో తెలీదుగనక, యాజులు అటూ ఇటూ అర్థమొచ్చేలాగా తల పంకించాడు. మూర్తిగారు సత్యం కేసి చూశాడు.

"వెళ్ళాం" అన్నాడు సత్యం.

"ఎలా వుంది?" అని మూర్తిగారడగలేదు. సత్యమే చెప్పుకొచ్చాడు.

"మిమ్మల్ని అంచనా వేయడం చాలా కష్టమండీ మూర్తిగారూ! అంతంతమాత్రపు వాళ్ళయితే మీరు రికమెండ్ చెయ్యరనీ నాకూ తెలుసుననుకోండి! కానీ ఏమూలనో రవంత అనుమానం పట్టుకు పీడిస్తోంది. నిన్నావిణ్ణి చూశాక - " అని ఆగిపోయాడు సత్యం.

అంటే విజయ, మనవాడికి నచ్చినట్లేనని అర్థం చెప్పుకొన్నాడు యాజులు.

"ఎందుకైనా మంచిదని నిన్న బాస్‌గారూ, నేనూ, తమ పి.ఏగారూ ఆ అమ్మాయిగార్ని చూడ్డానికి వెళ్ళామండీ! ఓహో హో! ఏం స్ట్రక్చర్, ఏం ఫినిషింగ్, ఏం బ్యూటీలెండి! వాయిస్ ఎలా ఉంటుందోనని నాలుగైదు నిమిషాలు సత్యంగారు మాట్లాడించి చూశారు. గొంతుకూడా వారికి బాగా నచ్చింది. లెండి!" అన్నాడు యాజులు.

మూర్తిగారు నవ్వి లోపలకు వెళ్ళారు.

''బాబుగారు ధర్మరాజు లాంటివారు సత్యంగారూ! కొత్త కంపెనీ వాళ్ళొస్తే వారికి చాతనయినంత సాయం చేయందే నిద్రపట్టదాయనకు. అదే ఆ రావుగారయితేనా- ఇప్పటికే మిమ్మల్ని పీల్చి పిప్పిచేసి ఉందురు. ఆ పుణ్య పురుషుడికి డబ్బు తప్ప మరో యావే లేదు. రూపాయి ఖర్చు చేస్తున్నాడంటే, దాని మూలంగా పది రూపాయలు వస్తున్నాయో లేదో చూస్తాడు. అంతా బిజినెస్ ఔట్‌లుక్ - మన అయ్యగారున్నారు చూశారా- ఫక్తుదానికి వ్యతిరేకం! పది రూపాయలివ్వడమే తెలుసుగానీ, పది పైసలు లాభం వస్తుందో లేదో వారు చూడరు... బాబూ! అనకూడదుగానీ... మూర్తిగారు ఈ చేత్తో సంపాదించి ఆ చేత్తో అలా ఖర్చు చేస్తూ తుంటారు. అంచేత మనవాడిదగ్గర ఎప్పుడూ వందలే తప్ప వేలు ఉండవు. అయ్యబాబో! వారిది ఎముకలేని చెయ్యి కాదుటండీ!''

పి.ఏ గారి ధోరణికి అంతూ వంతూ కనిపించడంలేదు. ఈ పంపిణీ మీద ఆయనగారెంతసేపయినా మాట్లాడగలరు. ఐతే అసలీ ధోరనికి కారణమేమిటో యాజులకు తెలియలేదు. ఆయనోసారి చుట్టూ చూశాడు. మేడమీది కిటికీలో మూర్తిగారి తమ్ముడు కూచుని ఉన్నాడు.

పి.ఏ సన్నగా నిట్టూర్చి, పైకి చూశాడు. మూర్తిగారి తమ్ముడు కిటికీ రెక్కలు మూసేశాడు.

''ఊఁ - తరువాత?'' అన్నాడు యాజులు విషయాన్ని కదలేస్తూ.

''మనం రేపో ఎల్లుండో మంచిరోజు చూసుకొని, విజయతో ఎగ్రిమెంటు రాసుకొందాం. అప్పుడే - ఎంతో కొంత ఎడ్వాన్స్‌గా ఇచ్చేదాం'' అన్నాడు పి.ఏ.

''పిక్చర్‌కి ఏ మాత్రం ముట్టచెబితే బావుంటుందో కూడా తెలిస్తే తీరిపోనే!'' అన్నారు యాజులు.

పి.ఏ గారు సత్యం చూడకుండా యాజులకు కన్ను మలిపాడు. అతగాడు పిల్లిదగ్గులు దగ్గుకుంటూ అవతలకు వెళ్ళాక పి.ఏ సరాసరిగా సత్నాఇ్న మగ్గులోకి దింపాడు.

''నాకు తెలియదు'' అన్నాడు సత్యం.

''తెలీకపోవడానికిదేమన్నా బ్రహ్మ విద్య గనకనా సత్యంగారూ! విజయ మన ఆర్టిస్టు. ఈ రోజునుండీ మన చెప్పుచేతల్లో ఉండే మనిషి! చూశారుగా, ఎంత స్పోర్టివ్‌గా ఉంటుందో! మనమో వెయ్యి అదనంగా పారేస్తే పొయ్యేదేమీ లేదు. ఆ వార మీకు ఏదో రూపంలో ముట్టనే ముడుతుంది. ఆర్టిస్టును ఉల్లాసపరిచి, మనం వ్యవహారాలు నడుపుకోవాలిగానీ- మరీ గిరిగీసినట్టుగా ఉన్నామనుకోండి, ఆవిడా అలాగే వుంటుంది'' అని సలహా యిచ్చాడు పి.ఏ.

''అసలెంత ఇద్దామంటారు?'' అన్నాడు సత్యం.

''ఆ అంకె ఏ మాత్రముంటుందో మూర్తిగారినే చెప్పనిద్దాం. మన కంపెనీకోసం ఇన్ని పనులు చేసి పెట్టినవారు, ఈ కాస్తపనీ వారు చెయ్యకపోరు. వారు చెప్పిన అంకెమీద- ఉపరిగా మనమో వెయ్యి పారేస్తే - మనిషి మన డిస్పోజ్‌లో ఉంటుంది''

''విజయ చాలా బాగుంటుంది గదూ?'' అన్నాడు సత్యం మధ్యలో అడ్డుపడి.

ఆవులించకపోయినా పేగులు లెక్కపెట్ట గలిగిన పి.ఏగారు, సత్యంలో కలిగిన మార్పును పసికట్టాడు.

''నేనొక్కటి చెబుతాను వినండి సత్యంగారూ! ఈ ఇండస్ట్రీలో పైకి రావడానికి లక్ కావాలి.

మిగతావేమీ దమ్మిడీకి పనికిరావు. ఇప్పుడు ఫైల్లో ఉన్న ఏ హీరోయిన్‌కూ విజయ తీసిపోదు. మేకప్‌లేకుండానే ఆవిణ్ణి షూట్ చెయ్యవచ్చు. మార్వెలెస్ బ్యూటీ! కానీ అదృష్టం లేక అలా మూలన పడిపోయింది. నేనన్నానని కాదుగానీ మీరే చెప్పండి! చాలా మంది స్టార్స్‌కన్నా విజయ అందంగా ఉంటుందా, లేదా?'' అన్నాడు పి.ఏ.

సత్యం ఏమీ మాట్లాడకుండా తలవూపి, హఠాత్తుగా పి.ఏ వేపు కొరకొరలాడుతూ చూశాడు.

''నిన్న మిమ్మల్ని వెనక్కి పిలిచిందిగదా విజయ, ఎందుకండి?'' అన్నాడు సత్యం.

''ఆవిడే చెప్పందిగా జేబుగుడ్డ కోసమని''

''చెప్పిందనుకోండి. దానికోసం అంత ఆలస్యమయిందెందుకు?'' అన్నాడు సత్యం.

''ఈ చవట రాత్రల్లా దీన్ని గురించే ఆలోచించి వుంటా''డనుకొన్నాడు పి.ఏ అతనో క్షణం ఆలోచించి మందహాసం చేశ్వాడు.

''మీరిలా ప్రతిదాన్నీ నిగ్గదీసి అడిగితే, నాబోటివాడు చచ్చిపోతాడు సత్యంగారూ!... ఇంకో సంగతేమిటంటే- కొన్ని విషయాలు ముందుగా చెప్పడం వల్ల అనేక చిక్కులొస్తాయి -''

''ఏమిటో చెప్పితీరాలి'' అన్నాడు సత్యం.

పి.ఏగారు అటూ ఇటూ ఎవరన్నా ఉన్నారేమోనన్నట్లుగా చూసి, కుడిచేతిని ముందుకు చూపుతూ ''మళ్ళీ ఎక్కడా అనరుగదా?'' అన్నాడు.

సత్యం చేతిలో చెయ్యివేశాడు.

''నాకైతే ఆవిడ మనసులో ఉద్దేశం తెలీదు. మీ ఎడ్రస్ మాత్రం నన్నడిగింది. నాకు తెలీదన్నాను. జ్ఞాపకం చేసుకొని చెప్పమన్నది. రేపు చెబుతానన్నాను. 'రేపటిదాకా ఆగవలసిందేనా' అన్నట్టు చూసింది'' అన్నాడు పి.ఏ.

సత్యం శరీరం గగుర్పొడవటం పి.ఏ గమనించాడు.

''నా ఎడ్రస్ ఎందుకండీ? పనేమిటో అడక్కపోయారా పోనీ?'' అన్నాడు సత్యం.

పి.ఏ ఓ నమస్కారం చేసి చెంపలు వాయించుకొన్నాడు.

''సత్యంగారూ! నాలాంటివాడు అంతదూరం వెళ్ళడం భావ్యంకాదు''

''అయితే ఇప్పుడు నన్నోసారి వెళ్ళమంటారా ఏమిటి?'' అన్నాడు సత్యం.

''ఈ వేళప్పుడు విజయ ఇంట్లో ఉంటుందనుకోను. ఆవిడకేదో పిక్చర్‌లో చిన్న వేషమున్నదట... పోనీ రాత్రికి వెళ్ళండీ - లేదా - రెండు రోజులు ఓపికపడితే, మన ఆఫీసుకే వస్తుంది!''

''అనవసరంగా టైం వేస్తు కావడం నా కిష్టంలేదండీ! ఇవ్వాళే వెడతాను'' అన్నాడు సత్యం.

''నీ రోగం కుదిర్చాలే గాడిదకొడకా, నువ్వింతట్లో మనిషివికావు'' అనుకొన్నాడు పి.ఏ.

అతనికక్కడ కూచోబుద్ధికాలేదు. తలలో కందిరీగల రొదలాంటిదేదో బయలుదేరింది. మధ్యాహ్నం నుండి తను రానని మూర్తిగారికి చెప్పేసి బయలుదేరాడు. తిన్నగా విజయ ఇంటికొచ్చాడు.

''రండి రండి!'' అన్నది విజయ నవ్వుతూ. ''మీకోసమనే ఎదురు చూస్తున్నాను. ఇంతాలస్యమయిందేం?''

''నేనీపూట వస్తానని అనలేదే!'' అన్నాడు పి.ఏ

''అనలేదు గానీ- అరే - నిలబడే ఉన్నారేమండీ, ముందు కూచోండి!''

పి.ఏ వసారాలో కూచోలేదు. సరాసరి గదిలో కొచ్చి, వాకిలికి నో పక్కగా కుర్చీ లాక్కుని కూచున్నాడు.

''మీరింకా భోజనం చేసినట్లు లేదు. పోనీ -''

''నా కాకలిగా లేదు'' అన్నాడు పి.ఏ.

''అదేం?'' అన్నది విజయ.

''నిజం చెబుదామా?'' అనుకొన్నాడతను. కానీ ''నిన్ను చూశాక ఆకలికాస్తా ఎగిరి చక్కాపోయిం''దనడం మర్యాదగా ఉంటుందా?

''మాట్లాడరేమండీ బాబూ! ఆ దిక్కుమాలిన ఆఫీసు వ్యవహారాలు కాస్సేపు మరిచిపోదురూ!... మరి వడ్డించేస్తున్నాను, మీరొస్తారుగదాని నేనూ అన్నం తినకుండా కూచుంటే, మీరేమో ఆకలిగా లేదంటారేం! ఉన్నంత వరకే తినండి! పోనీ - చారూ, పెరుగుతో రెండు ముద్దలు తినేద్దురుగానీ!''

''వొద్దులెస్తూ!'' అన్నాడు పి.ఏ.

నిజంగా అతనికి అన్నం మీద ధ్యాస లేనేలేదు.

''నేను గోరుముద్దలు తినిపించాననుకోండి! అప్పుడూ వద్దంటారా?''

అతగాడికి పిచ్చెత్తేందుకు ఆ వొక్క వాక్యమూ చాలు!

''వీధి తలుపులు తీసే ఉన్నాయే!'' అన్నాడు పి.ఏ.

విజయ విరగబడి నవ్వింది!

''మీరన్నం తినడానికీ, వీధి తలుపులు తీసి ఉంచడానికీ సంబంధమేమిటండీ నా తలకాయ! తలుపులు తీసుంటే మాత్రమేం, అన్నం వరకూ తినొచ్చుగా?'' అన్నది విజయ.

పి.ఏ సమాధానం చెప్పలేకపోయాడు. విజయ అతనికేసి చూసి మరోసారి నవ్వింది.

''పోన్లెండి! మరీ మీరంతా సిగ్గుపడేట్లయితే తలుపులు వేసే వస్తాను. మీరైనా అన్నం తినడమేగదా చేస్తారు?''

విజయ వీధి తలుపుకు గడియపెట్టి గదిలో కొచ్చింది. పి.ఏ లేచి నిలబడ్డాడు. అతని కాళ్ళు సన్నగా వణుకుతున్నాయి. నిలదొక్కుకొని గది తలుపులు చేరవేశాడు.

''అదేమిటి?'' అన్నది విజయ ఆశ్చర్యపోయినట్టు.

ఆవిడ పెదవులు నవ్వును దాచిపెట్టడానికి ప్రయత్నిస్తున్నట్లు పి.ఏ గ్రహించాడు.

''రాత్రి నేను నిద్రపోలేదంటే నువ్వు నమ్ముతావా?'' అన్నాడు పి.ఏ విజయను దగ్గరగా తీసుకొంటూ.

''నమ్ముతాను. ఎందుకంటే రాత్రల్లా నాకూ సరిగ్గా నిద్రపట్టలేదు. మిమ్మల్ని నిన్న సాయంత్రమే నేనుండి పొమ్మన్నాను. ఆ చీంబోతు వెధవ ఉన్నాడని మీరు మానేశారు... మీరేగనక ఉన్నట్లయితే, ఇలా జరిగేదనీ, అలా జరిగేదనీ అనుకొంటూ రాత్రల్లా - అయ్యోరామ- అదేమిటండీ - పట్టపగలా - ఉండండి చెబుతాను- ఛీ ఛీ- ఆఁ, నా బొంద - అబ్బా- నన్ను మత్తులో ముంచేశావు చిన్నీ!''

పి.ఏ కళ్ళు మూసుకుపోయాయి. అతను వెచ్చని ఊపిరి ఆమె చెంపల్ని కాల్చింది. విజయ

రెండు చేతులూ అతని భుజాలవెనక కలుసుకొన్నాయి. అతను ఆత్రంగా విజయ చెక్కిళ్ళకోసం వెదుకుతున్నాడు. ఓసారి అతనికేసి చూసి తనలో తనే నవ్వుకొన్నది విజయ.

పీయూషా పిక్చర్స్‌వారు విజయతో ఎగ్రిమెంట్ చేశారు. మూర్తిగారు డబ్బు విషయం కూడా తేల్చి పారేశారు. తొలిసారిగా హీరోయిన్ వేషం ఇస్తున్నారుగనక, అయిదు వేలకు పనిచెయ్యమని విజయతో చెప్పాడు. అలాంటి ఆర్టిస్టుకు పదివేలిచ్చినా దండగలేదనీ, కంపెనీ కొత్తది గనక- అందులో సగమిస్తే పనిచెయ్యడానికి విజయను వొప్పించాననీ సత్యంతో చెప్పాడు.

సత్యం ప్రస్తుతమున్న ఊపులో అయిదువేలుకాదు, అయిదయిదులు ఇరవయ్యయిదు వేలివ్వడానికి సిద్ధంగా ఉన్నాడు. విజయ వాణ్ణి సుఖసముద్రంలో ముంచి లేవనెత్తింది. వారం రోజులు తిరక్కుండానే సత్యం తను మకాంను విజయ ఇంటికి మార్చేస్తానన్నాడు.

“అలా వొద్దులేండి!“ అన్నది విజయ

“ఎందుకని? మనమిద్దరం ఒకటేగా. మన శరీరాలు వేరయినా, మనస్సు ఒక్కటేనని రాత్రేగా అన్నావు. ఇంతలోకే మర్చిపోయావా?” అన్నాడు సత్యం.

విజయ చాటుకు తిరిగి నిట్టూర్చింది.

“మాట్లాడవేం విజ్జీ!” అన్నాడు సత్యం మళ్ళా.

“అందుక్కాదు నానీ! మాంసం తింటున్నామనీ, ఎముకలు మెళ్ళో వేసుకొని తిరగం గదా! కొంతకాలం జరగనీండి! ఏదో ఓ మంచి ముహూర్తం చూసి కలిసి కాపరం పెట్టేద్దాం!” అన్నది విజయ అతని చొక్కా గుండీలు మెలిపెడుతూ, “ఇప్పుడు మీకేం తక్కువయింది చెప్పండి! మీరే నిమిషాన్నయినా ఇక్కడికి రావచ్చు”.

“నీ కళ్ళు ఎంత బావుంటాయి విజయా?” అన్నాడు సత్యం మెల్లిగా.

“అబ్బ! మీరలా చెవులో నోరు పెట్టి గుసగుసలాడకండి! నా కసలే చక్కిలిగిలి” అన్నది విజయ పకపకా నవ్వుతూ.

ఈ దెబ్బతో సత్యం చిత్తుచిత్తయిపోయాడు.

పి.ఏ అన్ని విషయాలూ ముందుగానే విజయకు చెప్పడం మేలయింది. అందువల్ల ఆవిడ దేనికీ తడువుకోనవసరం లేకపోయింది. కార్యక్రమమంతా అనుకొన్న ప్రకారం చకచకా సాగిపోతూ ఉంది!

“ఆ చీంబోతుగాడ్ని, నీకో వెయ్యి రూపాయలు అదనంగా ఇవ్వమన్నాను. వాడు ‘సరే’ నన్నాడు. అయితే నీ అంతట నువ్వేమీ బయటపడవాకు. వాడిస్తానంటే మాత్రం తీసుకో- నువ్వంటే పడిఛస్తున్నాడు. ఇరవయ్ నాలుగ్గంటలూ నీ స్మరణేననుకో!” అన్నాడు పి.ఏ.

“ఇక నా కొంపచుట్టూ తిరిగి ఛాస్తడల్లే ఉంది! ఈ పీడా నెందుకు తగిలించారండీ బాబూ! వీడి ముష్టి వెయ్యీ లేకపోతే పీడాబోయిరి. ఎందుకొచ్చిన హైరానా ఇదంతా?” అన్నది విజయ.

ఆవిడ నయగారాలు పోతున్నదని పి.ఏకి తెలిసిపోయింది.

"నువ్వు వెయ్యి పుచ్చుకొన్నా, పుచ్చుకోకపోయినా అతన్ని కాదని అతని కంపెనీలో వేషం వెయ్యలేవు. వెయ్యగలననుకోవడం భ్రమ! ఐనామరి! ఎటుకూడీ తప్పఇసరిగా చెయ్యవలసిన వో పని చేసినందుకు అదనంగా వెయ్యి రూపాయలొస్తున్నాయనుకో- తప్పేముంది!" అన్నాడు పి.ఏ.

"అబ్బ, మీకెంత కోపమండీ?" అన్నది విజయ. అతని రెండు చెంపలను అరచేతులతో రాస్తూ.

"నేనింకో కంపెనీవారితో కూడా చెప్పాను. అయితే - పీయూషావారి రషెస్ చూసిందాకా ఏ మాటా చెప్పలేమన్నారు. నువ్వు కాస్తంత కష్టపడి పనిచేశావంటే- పది కంపెనీలు నిన్ను పిలుస్తాయి. ఎవరైనా నీకు నిచ్చెనివ్వగలరేగానీ, మెట్లమీదుగా ఎక్కించలేరు!" అని హితోపదేశం చేశాడు పి.ఏ.

విజయ చేతులు ముడుచుకు కూచోలేదు. పీయూషా పిక్చర్స్‌వారు హీరోయిన్ వేషమిచ్చారనీ, అందుక్కారణం మూర్తిగారనీ ఆవిడ చాలా మందికి పనిమాలా చెప్పింది. మూర్తిగారి మనుషులు ఈ వార్తను అదే పనిగా కొన్ని రోజులపాటు ప్రచారం చేశారు.

"మూర్తిగారు మాటల మనిషికాదు, చేతలమనిషి. ఆయన సాధారణంగా నోరుజారడు. జారాడంటే అన్నదానికి కట్టుబడి ఉంటాడు. విజయకు లిఫ్ట్ ఇస్తానన్నారు. వారం తిరక్కుండానే హీరోయిన్ వేషం ఇప్పించారు. ఇప్పుడావిడ మూర్తిగారి పక్కన వేషమేస్తున్నది!"

విషయం ఇదే! దీన్నే రకరకాలుగా ప్రచారం చేస్తున్నారు. మూర్తిగారు, ఆవిడకు బ్రహ్మాండమైన ఉపకారం చేశాడని మాత్రమే కాదు, రావుగారేమీ చెయ్యలేదన్న ధ్వనికూడా అందులో గర్భితమై ఉన్నది. మంజరి అహం అణచడమే కాకుండా, పనిలో పనిగా రావుగారిమీద ఇంత దుమ్ము చల్లడానికి కూడా, మూర్తిగారి మనుషులకిప్పుడు అవకాశం చిక్కింది!

ఈ విషయాలన్నీ ఎప్పటికప్పుడు రావుగారికి తెలుస్తూనే ఉన్నాయి. ఆయన చిరాకు పడుతూనే ఉన్నాడు.

"అసలు మంజరితో తగాదా పెట్టుకోవాలని నాకు లేనేలేదు. మూర్తిగారే, లేనిపోని పేచీలన్నీ లేవదీసుకొచ్చాడు. మానవుడన్న తరువాత ఉద్రేకాలు రావడమూ సహజమే, అప్పుడో మాట- అనకూడని మాట తూలి అనడమూ సహజమే! ఇలా మనం ప్రతిదానికీ గింజుకొంటూ కూచుంటే లాభం లేదు... మనలో మనం దెబ్బలాడుకొంటే, మంజరికి చులకనయి పోతామని చూస్తున్నానుగానీ, ఈ మూర్తిగాడి వ్యవహారం తేల్చడం గంటల్లో పని!" అన్నాడు రావుగారు.

"ఆయనగారు విజయకు మంచి వేషం ఇప్పించారుట. ఓహ్ - దాన్ని గురించి వొకటే టాం టాం కొట్టుకొంటున్నారు!" అన్నాడొక బంటు.

"మనం దాని బాబులాంటి వేషం ఇంకో అమ్మాయికి ఇప్పిస్తాం. అదే ఎమంత ఘనం గనక?" అన్నాడొకాయన.

"ఇంకో అమ్మాయికిప్పిస్తే మన గొప్పతనమేముంది సార్! ఆ విజయనే పిలిపించండి! మూర్తిగారిప్పించిన వేషంకన్నా, మాంచి రోల్ ఇప్పించండి. అంతకన్నా రెండు మూడు వేలు ఎక్కువ ఇవ్వమనండి! ఒక్క దెబ్బతో రెండు పిట్టలు ఠాఁమంటాయి. మూర్తిగారి విర్రవీగుడుకు విరుగుడు వేసినట్లు అవుతుంది; మంజరి డొక్కలో కత్తిలాగా విజయ నిలబడనూ నిలబడగలుగుతుంది!" అని సలహా ఇచ్చాడు బంటు.

"వెరీ గుడ్!" అన్నాడు రావుగారు.

ఆ వార్తను అరగంటకల్లా విజయకు చేరవేశాడు బంటు.

"బాగా 'కీ' యిచ్చాను. ఇహ చచ్చేటట్టు పనిచేస్తాడు. బముశా నాలుగైదు రోజుల్లో నీకు కబురుగానీ చేస్తాడేమో! ఈలోగా నువ్వోసారి వారిని కలుసుకో, రావుగారు ఎలాంటి మనిషో నీకు తెలుసు. వీళ్ళల్లో చేపల అడుగు జాడల్ని గుర్తుపడతాడాయన. చాలా జాగ్రత్తగా మాట్లాడాలి... నేను చెయ్యగలిగిందేదో చేశాను" అన్నాడు రావుగతారి బంటు.

విజయ బీరువా లోంచి, పది రూపాయల నోట్లు తీసి 'బంటు'కిచ్చింది.

"ఇప్పటికి దీనితో సంతోషించు. రావుగారి ద్వారా పిక్చరేమన్నావస్తే నిన్ను మరచిపోను. అప్పుడప్పుడు కనిపిస్తూ ఉండు" అని పంపేసింది విజయ.

పీయూషా పిక్చర్సువారు మూడు రీళ్ళు తీసేనాటికీ, విజయ ఆరు కంపెనీలతో ఎగ్రిమెంట్సు కుదుర్చుకున్నది. అందులో నాలుగు కంపెనీలకు మూర్తిగారు రికమెండ్ చేశారు. ఒక కంపెనీకి రావుగారు రికమెండ్ చేశారు. ఆరో కంపెనీవారు స్వయంగానే విజయను కలుసుకొని మాట్లాడారు. ఆవిడ 'సరే'నన్నది. ఓ వెయ్యి రూపాయలు అడ్వాన్సిచ్చి రసీదు తీసుకొన్నారు. అప్పటికింకా కతే తయారు కాలేదు. ఎవరెవర్ని బుక్ చెయ్యాలో నిర్ణయించుకొంటే తప్ప కథ తయారు చేసుకోవడానికి లేదు. ఆర్టిస్టుల్ని బట్టి కథ మార్పులు చేసుకోవాలి. కథననుసరించి ఆర్టిస్టుల్ని బుక్ చేసుకోవడమన్న పద్ధతిపోయి చాలా రోజులైంది.

వాళ్ళు మూర్తినిగానీ, రావునుగానీ హీరోగా తీసుకోదలచలేదు. లోగడకన్నా అయిదారువేలు తక్కువకే వస్తాయి. కానీ కాల్‌షీట్స్ దొరకవు. దొరికినా సమయానికి రారు. ఎనిమిది గంటల కాల్‌షీట్‌లో రెండు గంటలయినా పనికాదు. వీటన్నిటినీ సహించినా డైరెక్టరన్నవాడిమాటకు బొత్తిగా విలువ లేకుండా పోయింది. కొమ్ములు తిరిగిన డైరెక్టర్లను ఈ హీరోలు వణికించారు. అతగాడేమన్నా చెబితే వీళ్ళు కాదనేవాళ్ళు. "ఇలా డైలాగ్ అనవయ్యా బాబు!" అంటే వల్లమాలిన కోపం వచ్చేది. వాల్ళు చెప్పిందాన్ని కాదనడమంటే, వాళ్ళను అవమానించడం కిందనే జమ. గట్టిగా ఏమన్నా అంటే "మూడ్స్ బావోలేవు" అంటూ వెళ్ళిపోతారు. ఇహ మళ్ళీ ఎంతకాలానికి వాల్ళు ప్రసన్నులవుతారో ఎవ్వరూ చెప్పలేరు. అందాకా వేసిన సెట్‌ను డిస్‌మాంటిల్ చెయ్యడానికి లేదు. స్టూడియోవాళ్లు వేలకు వేలు గుంజిపారేస్తారు. కంపెనీ "గోవిందా" అంటుంది.

అంచాతనే ప్రొడ్యూసర్లు చాలా మంది, ఫ్లెక్సిబుల్‌గా ఉండే డైరెక్టర్లనే పెట్టుకొంటారు. వీల్ళు చవగ్గా పనిచెయ్యడమే కాదు, హీరోలు చెప్పిందానికల్లా "అహహా... ఓహెూహెూ" అంటూ ఉంటారు. అటు వాల్ళపనీ సులువవుతుంది; ఇటు డైరెక్టర్లకీ మంచి పేరొస్తుంది. ఫలానా ఫలానా డైరెక్టర్, ఏడాదికల్లా సినిమా తీశాడంటే మాటలామరి! చెప్పినట్లు వినే డైరెక్టర్లే కావాలని పెద్ద ఆర్టిస్టులు కోరడం ఇందుకే పిక్చర్ ఏగంగలో కలిస్తే ఎవడిక్కావాలిట!

విజయ దగ్గరకు స్వయంగా వచ్చిన ఆరో కంపెనీ - పద్మా ఫాంటసీస్- వారు ఈ బాధలన్నీ పడటానికి సిద్ధంగా లేరు. హేమాహేమీల్లాంటి ఆర్టిస్టులను వారసలు పలకరించలేదు. కాస్త పేరున్న విజయలాంటి కొత్త హీరోయిన్నూ, చంద్రంలాంటి హీరోనూ బుక్ చేసి, కథా బలంమీద పిక్చర్‌ను సక్సెస్ చేయాలని నిశ్చయించారు.

తీరా చంద్రాన్ని కలుసుకొని మాట్లాడాక, అతనంత తేలిగ్గా లేడని వారికనిపించింది.

"మంజరికిప్పుడు పన్నెండు పిక్చర్లున్నాయి. వాటన్నింటినోనూ నేను హీరోగా ఉన్నాను. వీటిని త్వరగా ఫినిష్ చెయ్యాలని అమ్మాయిగారు తొందరపడుతున్నారు. ఆమె కోసం బొంబాయి నుండి ఉత్తరాలమీద ఉత్తరాలు, టెలిగ్రాములు దూకుతున్నాయి" అన్నాడు చంద్రం.

"ఆవిడ బిజీగా ఉంటే ఉండనివ్వండి. ఆవిడకు బొంబాయి నుండి టెలిగ్రాములొచ్చినా, హాలీవుడ్ నుండి వచ్చినా మాకేమి అభ్యంతరం లేదు. ఆమెను మేము బుక్ చెయ్యబోవడం లేదు కూడాను. మీ సంగతేమిటో చెప్పమనే మేమడుగుతున్నాం!" అన్నాడొకాయన.

"అవుననుకోండీ! ఏ సంగతీ నేను అమ్మాయిగార్ని కనుక్కొనిగానీ చెప్పలేను. ఎందుకంటే-"

"కారణం నేనడగలేదు. మీరు చెప్పనవసరమూ లేదు. ఇదిగో- ఇదీ మా ఆఫీసు ఎడ్రసు. రెండు మూడు రోజుల్లోగా ఏ సంగతీ మాఉ ఫోన్ చెయ్యండి... మీరు రానవసరం లేదు. మంజరి పర్మిట్ చేస్తే చెప్పండి- మేమే వొచ్చి మిగతా విషయాలు మాట్లాడుతాం" అన్నాడొకాయన.

ఇలాంటి దోరనిని చంద్రం ఈ మద్య కాలంలో చూడలేదు. అతను ఆశ్చర్యంతో ఆయనకేసి చూడసాగాడు.

"అన్నట్టు ఇంకో సంగతి. యిప్పుడు మీరెంత డిమాండ్ చేస్తున్నారు?" అన్నాడాయన, చంద్రం కేసి గుచ్చి గుచ్చి చూస్తూ.

"మొత్తం పదిహేను తీసుకొంటున్నాను. అయిదు ఎగ్రిమెంటు ప్రకారం, మిగతాది ముందుగా ఇవ్వాలి!"

అతనోసారి కళ్ళెగరేసి, పెదవి విరిచాడు.

"సరే లెండి! మీరు చెప్పిన అంకె పెద్దదనిపించింది మాకు. ఏదైనా ముందు "అమ్మాయి మణిగారు" అనుమతిస్తేగదా ఈ గొడవలన్నీనూ!" అంటూ ఆయన బయటుదేరారు. "మీరు అట్టే టైం తీసుకోకండి! విషయాన్ని నానబెట్టడం నాకు బొత్తిగా యిష్టం లేదు. మీరు 'యస్' అన్నా 'నో' అన్నా నాకభ్యంతరం లేదు. ఏ సంగతీ తేలడమే నాకు ముఖ్యం"

ఆయన వెళ్ళిపోయాడు.

చంద్రం చాలా సేటిదాకా అతన్ని గురించే ఆలోచిస్తూ కూచున్నాడు. అతనన్న మాటలు జ్ఞాపకం వస్తున్న కొద్దీ చంద్రం మనస్సు చిన్నపోసాగింది. తనకు వ్యక్తిత్వమనేదే లేదనీ, తను మంజరి చేతిలో కీలుబొమ్మననీ, ఆవిడ ఆడించినట్టల్లా ఆడటం తప్ప తనకు వేరే 'జీవితం' లేదనీ అతనొచ్చి స్పష్టం చేశాడనిపించింది. చిత్రమేమిటంటే ఈ సంగతులేవీ తనకు కొత్తకాదు. ఇవన్నీ రోజూ తను అనుకొంటూ ఉన్నవే! అయితే- అవేమాటలు ఎదటివారి నోటినుండి వచ్చేసరికి తను భరించలేకపోయాడు. అతనైనా కోపంగా అన్నదేమీ లేదు. చాలా మెత్తగా, సున్నితంగా మాట్లాడాడు. తనిలాంటివాటికి బాధపడకూడదని చాలాసార్లు అనుకొన్నాడు. అంతరంగికమయిన విలువలకన్నా, బాహిరమైన విలువలకే సమాజం తలొగ్గుతుందని తనకు తెలుసు. తను వ్యక్తిత్వం కోసం నిలబడినంతకాలం మట్టిగొట్టుకుపోయాడు. 'మ్మాయి'గారి సేవచేయడం ప్రారంభించాక పచ్చబడ్డాడు. తనకిప్పుడో సొంతకారుంది, ఫోనుంది. తనకోసం మనుషులొచ్చి కాచుక్కూచుంటున్నారు. తన సంతకానికి ఈ క్షణాన ముప్ఫయ్యాఇదు

వేల పై చిల్లర విలువ వున్నది. తనో గంట ఆలస్యంగా వెడితే లబ్బుమని గోలకెత్తే ప్రొడ్యూసర్లున్నారు. తనీరోజున ఏ చెత్త మాట్లాడినా 'న్యూస్' అవుతుంది. దీనిక్కారణం. తన ప్రతిభ అనుకునేవాళ్ళు మూర్ఖులు. అసలు సంగతి తనకు తెలుసు. తను వ్యక్తిత్వాన్నీ విలువల్నీ చంపుకొన్నాడు. తన జీవితం తను జీవించడం మనేశాడు. ఇంకొకరు 'ఔ'నన్నదాన్ని తనూ 'ఔ'నన్నాడు. వాళ్ళు 'కా'దన్నదాన్ని, తనూ 'కా'దన్నాడు. ఇందువల్ల నిజమయిన చంద్రం చచ్చిపోయిన మాట నిజమే; కానీ, వాడు ఉండి తనకు వొరగపెట్టిందేమీ లేదు. వాడున్నంతకాలం తనను నానా బాధలూ పెట్టాడు. వాణ్ణి చంపేశాకనే తన జాతకం తిరిగింది.

మనిషిక్కావలసిందేమిటి?'' అని ప్రశ్నించుకొన్నాడు చంద్రం.

''పైకి రావడం! ఎలా పైకొచ్చానన్న ప్రశ్నకు తానే లేదు. పైకొచ్చావా, లేదా అన్నదే ముఖ్యం. అందుకు నువ్వు చెల్లించిన మూల్యం లెఖ్కలోకి రాదు. ఒంటరిగా కూచుని నువ్వు కార్చిన కన్నీరు లెఖ్కలోకి రాదు. నీ భౌతిక జీవితం మాత్రమే లోకులు చూస్తారు. నీకున్న డబ్బు, మేడలు, కార్లు, హోదా, కీర్తిప్రతిష్టలు- ఇవీ లోకులు గమనిస్తారు. వీటినిబట్టి నీగురించి భజనలు చేస్తారు. వీటినిబట్టే నీ గొప్పతనాన్ని అంచనా వేస్తారు. వ్యక్తిగత విలువలు గొప్పవనుకొంటే మాడి చావు చివరికి 'పాపం' అనేవాడుకూడా నీకు దొరకడు. అంతరాత్మ పెట్టే ఘోషకు చెవులు మూసుకొన్నావోన్నిందరూ అందలం ఎక్కిస్తారు'' అనుకొన్నాడు చంద్రం.

అతనికి పాతరోజులు జ్ఞాపకం వచ్చి జలదరించిపోయాడు.

''నిజాయితీగా ఉన్నాననుకొని దుస్సహమయిన దరిద్రం అనుభవించడం కన్నా మరొకవిధంగా పది రూపాయలు సంపాదించడం మెరుగు.''

చంద్రానికి ఆ పెద్ద మనిషి ఇందాక అన్నమాటలు జ్ఞాపకం వచ్చి నవ్వుకొన్నాడు.

''అతను శుద్ధ తెలివి తక్కువ సన్యాసన్నా కావాలి'', లేదా గొప్ప మేధావైనా కావాలి. వీళ్ళిద్దరూ ఈ సినిమాలకు పనికిరారు''

అతనికేదో సరదా వేసింది. చిరునవ్వు నవ్వుకొంటూ ఓ నంబరు డయల్ చేశాడు. అవతలనుంచి ''హలో అని వినిపించింది. చంద్రం ముఖంలోంచి చిరునవ్వు మాయమయింది. అవతలనుండి ''హలో హలో'' అని గోలకెత్తుతున్నా వినిపించుకోకుండా అతను ఫోను పెట్టేసి, చేతివేళ్ళు విరుచుకొన్నాడు.

# 24

సత్యం వెళ్ళిపోయాడు. అతను పోయినవేపే కన్నార్పకుండా చూసి, వీధి గడప దాటాక తుభుక్కున ఉమ్మివేసింది విజయ. ఆమె కళ్ళు అసహ్యంతో మండిపోతున్నాయి. అయిష్టాన్ని లోపల ఇముడ్చుకోలేక, బయటికి కక్కనూ లేక విజయ మల్లగుల్లాలు పడిపోతోంది. పనిమనిషి కాఫీ తెచ్చి బల్లమీద పెట్టి కూడా పది నిమిషాలయింది. ఆవిడకెందుకో కాఫీ సైతం తాగబుద్ధి కాలేదు. అలానే కుర్చీకి చేరగిలబడిపోయింది.

కిటికీలోంచి ఎదర గోడమీది సినిమా పోస్టరు కనిపిస్తోంది. మంజరి చిరునవ్వుతో చంద్రంకేసి చూస్తూంటే, అతగాడు రెడు చేతులతోనూ ఆమె నడుమును చుట్టేసి దగ్గరకు తీసుకుంటున్న దృశ్యమది.

తను చంద్రాన్ని కలుసుకోవడానికి చాలాసార్లు ప్రయత్నించింది.

తనకు తీరుబాటుగా ఉన్నప్పుడు అతనికి తలమునగా పనులున్నాయి. చంద్రానికి రవంత వెసులుబాటుగా ఉండి తనకు ఫోన్ చేసినప్పుడు, తను స్టూడియోకు బయలుదేరుతూనో, అప్పడే షూటింగ్ నుండొచ్చి రంగు కడుక్కుంటూనో ఉన్నది. రెండు మూడు దపాలు సత్యంగాడున్నప్పుడు చంద్రం ఫోన్ చేశాడు. తను 'రా'ననడానికి ప్రాణం వొప్పిచావదు. 'వస్తా'ననడానికి సత్యం ఉండిపోయాడు.

తన కనేకసార్లు చంద్రం జ్ఞాపకం రావడానికి కారనాలేమిటో చాలా రోజులపాటు విజయ చెప్పుకోలేకపోయింది. అతని పేరు విన్నా, అతని గొంతు విన్నా, ఆవిడకు ప్రాణం లేచివచ్చేది. చంద్రం కోసం వాల్యూ నరాలూ పీక్కుపోయిన సందర్భాలు కూడా ఉన్నాయి. మిగతా వారందరికన్నా ఈ చంద్రంగారు వొరిగించిందేమిటన్న ప్రశ్నకు విజయ జవాబు చెప్పుకోలేదు. కానీ, ఆ అనుభవం మాత్రం వాస్తవమే.

"నేనుగానీ చంద్రాన్ని..." అని విజయ చాలాసార్లు తనలో తను గొణుక్కున్నది.

సత్యం తనదగ్గరకొచ్చి, తన నడుంచుట్టూ చేతులు వేసినప్పుడూ, మొఖంలో మొఖం పెట్టినప్పుడూ, కళ్ళల్లోకి చూసిన్పుడూ... ఆ స్థానంలో ఉన్నది సిత్యం కాదనీ, చంద్రమనీ తను భావించినప్పుడు, మనస్సు గాలిమీద తేలిపోతున్నట్లనిపించేది. శరీరం నిండా తియ్యని ప్రవాహాలేవో పరుగెత్తినట్లనిపిచేది. ఆ సుఖం కోసం, సరిగ్గా అలాంటి అనుభవంకోసమే, ఆవిడ ఆత్మ ఘోష పెట్టేది. పగటికల అన్నీ తెలసి కూడా- చంద్రం గురించి వైన వైనాలుగా కలలు కన్నది విజయ. అందులో ఆవిడ పోయిన వయ్యారాలు ఇన్నీ అన్నీ కావు.

చంద్రమున్నాడేమోనని విజయ ఫోను చేసింది.

"హలో! నీకోసమనే ఇంతకు ముందు ఫోను చేశాను; ఎవడో పలికాడు, భయం వేసి మానేశాను... హలో... హలో వింటున్నావా?" అన్నాడు చంద్రం.

"ఆఁ."

"పరధ్యానంగా ఉన్నావా? నవ్వుతున్నావేం?" అన్నాడు చంద్రం.

"ఆ ఫోను చేసిందెవరని సత్యం నన్ను రాచి రంపాన పెట్టాడు. నేనేం చెప్పను చంద్రం? నువ్వని తెలిసినట్లయితే వెధవకు రోగం కుదిర్చేదాన్ని!" అన్నది విజయ.

"ఏం చేసేదానివి?"

"నువ్వు మా ఆయనని చెప్పేదాన్ని! ఆయనొస్తున్నాడనీ, చూస్తే చీల్చేస్తాడనీ, ఏ చాపలోనో చుట్టి మూలకు నిలవేసి వుండేదాన్ని!" అన్నది విజయ.

చంద్రం విరగబడి నవ్వడం విని తను కూడా నవ్వింది విజయ.

"నాకీ పూట మనస్సేమీ బాగాలేదు విజయా! ఇప్పుడే మంజరి దగ్గర కెళ్ళొచ్చాను. ఆవిడ నన్ను గానుగాడినంత పనిచేసింది. కాస్సేపు నన్ను నేను మరిచిపోతే బావుండుననిపించింది.

అదృష్టవశాత్తూ నువ్వు ఫోను చేశావు''

విజయ కళ్ళు మిలమిల్లాడాయి.

''నీకేమన్నా పని ముందా?'' అన్నాడు చంద్రం.

''లేదు... ఉన్నా నీకోసమని నేనీ పూట మానేస్తున్నాను. నువ్వు అజంతాకు రాగలవా చంద్రం?... ఆల్ రైట్ .... నేనిప్పుడే...''

చంద్రం ఫన్ పెట్టిన చప్పుడు వినిగానీ విజయ ఫోను పెట్టింది కాదు.

అసలేం జరిగింది చంద్రం?''' అన్నది విజయ గంట తరువాత అతన్ని అజంతాలో కలుసుకోగానే.

చంద్రం ఎంతగా కుంగిపోయాడో అతన్ని చూసిందాకా విజయ ఊహించలేకపోయింది. చంద్రం కాస్సేపు ఆవిడ కళ్ళల్లోకి చూసి, తలొంచుకొన్నాడు. ఆ చూపుల్లో పిచ్చితనం ఉన్నదనుకొంది విజయ.

''నేనెంత బుద్ధి తక్కువ వాణ్ణంటే విజయా! ఉదాహరణ యిచ్చుకోవడానిక్కూడా నేను తప్ప మరో ప్రాణిలేదు. ఎంత బండతనం తెచ్చి పెట్టుకొన్నా జన్మ సిద్ధమైన గుణమేదో పైకుబికి నన్ను చిరాకు పెడుతోంది'' అన్నాడు చంద్రం.

విజయ ఏమీ అనలేదు. ఊరికే వింటూ కూచున్నది.

''ఇటువంటి సమస్య ఏదో వొకనాడు ఎదురవుతుందని నాకు తెలుసు. దాన్నెదుర్కోవడానికి నేను సిద్ధంగా కూడా ఉన్నాను. కానీ గమ్మత్తేమిటంటే విజయా! ఆ సమస్య నేను ఊహించనిరూపంలో ఎదురయి నన్నుక్కిరిబిక్కిరి చేసింది'' అన్నాడు చంద్రం.

విజయ అలానే చూస్తూ కూచున్నది.

''మంజరికీ నాకూ ఈ పూటతో రాం రాం'' అన్నాడు చంద్రం.

''హమ్మయ్య'' అనుకొన్నది విజయ.

''ఏం జరిగింది చంద్రం? అసలంతదాకా ఎందుకొచ్చిందట?'' అన్నది తాపీగా.

చంద్రం పద్మా ఫాంటసీస్‌వారి సంగతి చెప్పుకొచ్చాడు.

''తనందులో ఉండటం లేదు గనక నన్ను ఉండొద్దంటుంది. నువ్వు హీరోయిన్‌వని చెప్పాక, మరీ మండిపోయింది. నువ్వా దిక్కుమాలినదాని సరసన పనిచెయ్యడానికి వీల్లేదంటుంది. ఎందుకమ్మా అంటే - ఆవిడ చెప్పిన సమాధానం మహాగోరం!'' అన్నాడు చంద్రం.

విజయ ఏమీ అనకుండా తలపంకించింది.

''నీ పక్కన హీరోగా ఉన్న మనిషితో పనిచేయడానికి ఆవిడ సిగ్గుపడుతుందట! తనమాటే శాసనమనీ దాన్ని దాటడానికి వీల్లేదనీ అన్నది. నిజంగా నాకు కోపం రావలసింది కాదు- ఆవిడ నోటంట అంతకన్నా భయంకరమైన మాటలు విన్నాను. అప్పుడెప్పుడూ రానంత కోపం నాకా సమయంలో వచ్చింది.''

అతని కళ్ళు నీటితో నిండిపోయాయి.

''లాభం లేదు విజ్జీ నేనిందుకు పనికిరాను. బొత్తిగా పనికిరాను. ఈ సినిమాలూ, ఈ మనుషులూ, ఈ డబ్బూ, ఈ క్షుద్రమైన సంబంధాలూ, ఈ మురుగూ - నేను భరించలేను. బేడతో సాంబారన్నం పొట్లం కొనుక్కుతిని, పానగల్ పార్కులో పడుకొన్న రోజులు నాకెంతో హాయిగా ఉన్నాయి. మళ్ళా

నాకా రోజులొస్తే - వచ్చే అవకాశమే ఉంటే నేనింకేమీ కోరను.''

చంద్రం కళ్ళు మూసుకొనే ఉన్నాయి. ఆ కనురెప్పలనుండి నీటి ధారలు స్రవిస్తున్నాయి. విజయ అతని తలను గుండెలకు హత్తుకొన్నది. బలవంతాన కన్నీటిని ఆపుకోడానికి ప్రయత్నిస్తున్నది.

ఈ సంఘటన తెలుగు సినిమా చరిత్రలో ఒక అద్భుతమైన పరిణామానికి పరోక్షంగా కారణభూతమయింది. అప్పటికే అటు మంజరీ, ఇటు మూర్తి, రావుగారలూ ఈ గొడవల వల్ల మనశ్శాంతిని పూర్తిగా కోల్పోయారు. ఎవరన్నా మధ్య వర్తులు వచ్చి సంప్రదింపులు ప్రారంభిస్తే బాగుండునని ముగ్గురూ సన్నిహితులైన వారిదగ్గర బయటపడ్డారు. అంచెలమీద ఈ కబురు అందరికీ పాకుతుందని వీరందరికీ తెలుసు. పైకి మాత్రం ఎవరికివారే బెట్టు తగ్గకుండా, మరీ బిగతీసుకుపోయినట్లుగాకుండా, నటిస్తున్నారు. ఈ ముగ్గురితోనూ అసలైన సంభాషణలు ప్రారంభం కావడానికి ముందు ఎంతో తతంగం జరిగింది.

''ఏమిటిదంతా?'' అన్నది మంజరి.

చలపతి మెల్లగా ఆమెను ముగ్గులోకి దించాడు.

''క్షుద్రమైన ఆవేశాలవల్ల ఎటువంటి దుష్పరిణామాలు కలుగుతాయో తెలుసుకోవడానికి ఇంతకన్నా వేరే నిదర్శనం అవసరం లేదు. హీరోలతో మనకెందుకు తగాదా వచ్చిందన్నది ముఖ్యం కాదు. దాని ఫలితమేమిటన్నదే ముఖ్యం'' అన్నాడు చలపతి సీరియస్‌గా.

''చెప్పండీ!'' అన్నది మంజరి చాలా తాపీగా.

ఆ ధోరణీ, అప్పటి ముఖ కవళికా చూస్తుంటే తను చెబుతున్నది మంజరికి విహితంగా లేదని చలపతి గ్రహించాడు.

''నేను చెప్పను మన మింకోదాన్ని గురించి మాట్లాడుదాం!''

''అదేం?'' అన్నది మంజరి.

''నేను బాధపడిపోతానని వింటున్నదానికి మల్లే ఉన్నావుగానీ, నిజంగా నా సలహా కావలసినదానివిగా లేవు. నీ వ్యవహారం చూస్తుంటే నా కదే అనిపించింది!'' అన్నాడు చలపతి.

సమయం చూసి చలపతి తనను సాధిస్తున్నాడని గ్రహించడానికి మంజరికెక్కువ కాలం పట్టలేదు. అయినా ఇది తొందరపడతగిన సమయం కాదనీ, తను వోపిగ్గా అన్నీ వినవలసిందేనని ఆవిడనుకొన్నది.

''నిజంగా నా మనస్సేమీ బావోలేదు చలపతీ!'' అన్నది మంజరి. ఎదురుగా వున్నఅద్దంలో తనను తాను చూసుకొంటూ, ''ఇంతకుముందు చంద్రంగాడొచ్చాడు.''

''నాకు తెలీదే!'' అన్నాడు చలపతి.

''నువ్వప్పటికి రాలేదు'' అని మళ్ళా ప్రారంభించింది మంజరి. ''వాణ్ణి గురించి నాకు సదభిప్రాయం ఏనాడూ లేదు చలపతీ! కానీ ఇంత నీచుడని కూడా నేననుకోలేదు. కుక్కకున్న విశ్వాసంలో నూరోవంతు వాడికుంటే నేనింత బాధపడకపోదును.''

''ఏం జరిగింద''ని చలపతి అడక్కముందే మంజరి చెప్పుకొచ్చింది.

"చంద్రంగాడికి కొమ్ములొస్తాయని ఏ మాత్రం పసిగట్టినా, వాణ్ణి ఎక్కడుంచాలో అక్కణ్ణే ఉంచేదాన్ని వాడికేమో నేను లిఫ్టు ఇస్తే -"

చలపతి మాట కడ్డొచ్చి నవ్వాడు.

"అసలు లిఫ్టు ఇచ్చిందే నువ్వు మంజరీ! అంతకుముందు వాడు సాంబారు పాదం పొట్లాలు కొనుక్కుతినేవాడు. ఇవ్వాళ రావు, మూర్తి తరవాత వాడే హీరో!" అన్నాడు చలపతి.

మంజరి కళ్ళు కెంపుల్లా ఎర్రనయ్యాయి.

"ఆ సంగతులన్నీ వాడు మరచిపోయాడు చలపతీ! పదిపిక్చర్లు చేతికొచ్చేసరికి గొప్పవాణ్ణయిపోయాననుకొన్నాడు. వెధవకు... కళ్ళు నడినెత్తిమీదికొచ్చాయి.

నిన్నటిదాకా నా బూట్లు మోసిన సంగతి లోకానికి తెలుసు, వాడికీ తెలుసు..." అన్నది మంజరి.

"ఎవ్వరికి తెలిసినా, యిప్పుడు నువ్వేమీ వాణ్ణి కదిలించలేవు. నీకిష్టమున్నా లేకపోయినా, చంద్రాన్ని బుక్ చేయడానికి కొన్ని కంపెనీలు సిద్ధంగా ఉన్నాయ"న్నాడు చలపతి.

"ఉన్న పేచీయే అది!" అన్నది మంజరి. "అదేదో ఫాంటసీస్ - పద్మాఫాంటసీస్ - మంచి పిక్చరేదో తీస్తున్నారనీ, విజయను హీరోయిన్‌గా బుక్ చేశారనీ, తనను హీరోగా ఉండమన్నారనీ చెప్పాడు. నేను వద్దన్నాను. వాడు కాదన్నాడు. ముఖాన ఉమ్మేసి పొమ్మన్నాను. ఇహ జన్మలో నీ ముఖం చూపబోకన్నాను.... కనీసం పశ్చాత్తాప పడినా బాగుండిపోను. 'చూదాం' అంటూ వెళ్ళిపోయాడు."

చలపతి పొర్లి పొర్లి నవ్వేశాడు.

"నువ్వెంత పిచ్చిదానివి మంజరీ? ఒక్కోసారి పసిపిల్లకన్నా అధ్వాన్నంగా నువ్వు బిహేవ్ చెయ్యడం చూస్తుంటే నిన్నేమనాలో బోధపడదు. ఒక చెంప రావుతోనూ, మూర్తితోనూ వచ్చిన గొడవలనే సర్దుకోలేక చస్తుంతే, ఈ చంద్రంగాడితో కూడా పేచీకి దిగావేం?" అని కోపగించుకొన్నాడు చలపతి.

"ఏం? తలగొట్టి మొలేస్తాడా?" అన్నది మంజరి.

"నువ్వొక్కనాటికీ ఆ పని చెయ్యలేవని రాసిస్తా"

మంజరి దిమ్మరపోయి అతనికేసి చూసింది.

"అతనూ నువ్వూ కలిసి పనిచేస్తున్న పిక్చర్లు పది పన్నెండుదాకా ఉన్నాయి. అతనితో నీకు పేచీ వచ్చింది కనక, నీకోసమని ఆ కంపెనీలు చంద్రాన్ని వదులుకొంటాయని నేననుకోను. నీ సంతృప్తికోసమని ఇన్ని లక్షల పెట్టుబడిని వారు గంగలో కలుపుకొంటారనడం కన్నా బుద్ధి తక్కువను నేనూహించలేను. నీకిష్టమున్నా లేకున్నా ఈ పిక్చర్లు అయిందాకా నువ్వతనితో ని చెయ్యవలసిందే!" అన్నాడు చలపతి.

"చెయ్యకపోతే?" అన్నది మంజరి.

దయ్యాన్ని చూసినట్లు ఆమెను చూశాడు చలపతి.

"నువ్వేమీ అనుకోకపోతే నేనో మాట అంటాను."

"చెప్పు"మన్నట్లు కళ్ళెగరేసిందావిడ.

చలపతి ఆవిడ కళ్ళలోకి చూసి, పెదవి కొరుక్కొన్నాడు.

'నిజంగా నెత్తిమీద కొమ్ములు మొలిచింది నీకేననీ, చంద్రానిక్కాదనీ నా నమ్మకం! నువ్వు పిచ్చిదానివైతే తప్ప, ఇలా మాట్లాడి ఉండవు. నువ్వేమాత్రం మెసలడానికీ వీల్లేకుండా ఎగ్రిమెంట్సున్నాయి. చంద్రంతలో పనిచెయ్యనని నువ్వు మొరాయించిన రోజున ఏ కంపెనీవాడయినా నీ మీద దావా వేసి కోర్టుకెక్కించవచ్చు'' అన్నాడతను.

మంజరి తిక్క సగం దిగిపోయింది.

''నువ్వయినా కోపంతో అలా అన్నావుగానీ, నిజంగా చంద్రం ముఖం చూడటం ఇష్టంలేక కాదని నేననుకొంటాను. సరే, సినీ ఆర్టిస్టులుగా మనకందరూ వొకటే! రావుగారు, మూర్తిగారు మనకు చుట్టాలు కారు. ఈ చంద్రం మనకు జ్ఞాతికాడు అందరం ఎక్కడెక్కణ్ణించో వచ్చాం. రపాప్తమున్నంతకాలం ఈ మరదాసులో ఉంటాం అంతే!!''

''అవుననుకో'' అన్నది మంజరి. ''కానీ - ఇలా ఎదురు తిరుగుతాడనుకోలేదు చలపతీ! ఆలోచిస్తే, వాడికి నేనెంత చేసిందీ జ్ఞాపకం రాదా? నేను చెప్పకపోతే, వీడింకా ఆ ఎక్స్ట్రా వేషాలు వేసుకుంటూ ఉండకపోనా?''

చలపతి నవ్వాడు.

''ఎదటివారి కంట్లో నలుసును గురించి మాట్లాడబోయేముందు మన కంట్లోని దూలం గురించి ఆలోచించుకోమని వో సామెత ఉంది. వాడికి నువ్వుపకారం చేసిన మాటా, వాడు నిన్నెదిరించిన మాటా నిజమే మంజరీ! నీ సీ&జతతిలో నేనున్నా, నీకు మించిన కోపం వస్తుందని కూడా నే నొప్పుకొంటాను. కానీ- మనం కూడా కాస్త వెనక్కు తిరిగి ఆలోచించాలి. రావుగారు, మూర్తిగారు నీ మట్టుకు నీకు ఎంత మేలు చేశారో జ్ఞాపకం చేసుకో. అలాంటి వారితో నువ్వు పేచీకి దిగావా లేదా? వారున్న పిక్చర్లో ఉండనన్నావా లేదా? అదే విధంగా చంద్రమన్నప్పుడు నువ్వెందుకు బాధపడాలట? కడుపు మండిపోయిందంటావు. నిజమే గానీ, మరి వారికి మాత్రం కడుపు మండిపోదా?'' అని ముక్క చివాట్లు పెట్టాడు చలపతి.

మంజరి అహంకారం తీవ్రంగా గాయపడింది.

''ఈ సంగతి మొదట్లోనే చెప్పకపోయావా చలపతీ! ఇంతదాకా రాకపోనుగదా?'' అన్నది మంజరి. ఆమె గొంతు గాద్గదికమయింది.

''నా జ్ఞాపకం ప్రకారం, నువ్వూ నన్ను ప్రోత్సహించావనుకొంటాను. రావుతోనూ, మూర్తితోనూ కలిసి పనిచేయవద్దని శర్మగారితో పాటుగా నువ్వూ సలహా ఇచ్చావు'' అన్నది మంజరి.

''ఇచ్చాను'' అన్నాడు చలపతి. ''అప్పటి పరిస్థితులెలా ఉన్నాయో నాకు తెలుసు. నీ మాటను కాదని మేమేం చెప్పినా తుపాకీ ముందులాగా పేలిపోతున్నావు. కన్ను పోయేటంత కాటుక పెట్టుకోడం నాకేనాడూ ఇష్టం లేదు''.

మంజరి చాలా సేపటిదాకా పలకలేదు.

''చాలా విషయాల్లో నేను గెలిచానుగానీ, ఈ విషయంలో వోడిపోయాను'' అని గొణిగింది మంజరి.

''ఒక సంఘటన తాలూకు జయాపజయాలు, పాలమీద మీగడలా అలా తెట్టకట్టుకోనుండవు మంజరీ. నువ్వు వోడిపొయ్యాననుకోవడంలో అర్థం లేదు. నిజానికి నువ్వే గెలిచావు. రావుతోనూ మూర్తితోనూ, పందెం కట్టావు. వారికి పోటీగా చంద్రమనేవాణ్ణి తయారు చేసి నిలుచోబెట్టావు. ఈ ధాటికి ఆగలేక వారు రాజీ అంటూ ఆక్రందించారు నువ్వు తలూపావు. అంటే- ఎవరు గెలిచారో నువ్వాలోచించు''

ఈ ధోరణిలో సమయం చిక్కనప్పుడల్లా చలపతి బోధ చేయసాగాడు. మంజరి క్రమక్రమంగా ఒక్కో మెట్టే దిగసాగింది.

తంగవేలు అనే పెద్ద మనిషి మంజరిని కలుసుకుని సంప్రదింపులు జరిపాడు.

''ఈ తగాదావల్ల మీరుగానీ, వారుగానీ లాభపడిందేమీ లేదు. వారిమీద కోపంతో చంద్రాన్ని మీరు తయారు చేశారు. మీకు పోటీగా వారు విజయను నిలబెట్టారు. ఫలితంగా అటు చంద్రం, ఇటు విజయ బాగా కాలూని నిలబడగలిగారు. అంటే - ఆ మేరకు మీ ఆదాయం పడిపోయింది. ఇండ్రస్టీ మీద మీకున్న గ్రిప్ సడలిపోయింది'' అన్నాడు తంగవేలు.

''నిజమే! మేం కూడా అంత దూరం ఆలోచించలేదు'' అన్నాడు చలపతి, మంజరి తరఫునా, తన తరఫునా కలసి మాట్లాడుతూ.

''సినిమాలను ఉద్ధరించడానికీ, ప్రొడ్యూసర్లను ఉద్ధరించడానికీ మిమ్మల్ని రాజీ పడమని వొక్కనాటికీ అనను. మీరూ, వారూ లేకపోయినా పిక్చర్లు తీస్తారు. జనం చూస్తారు. అందుగ్గాదు నే ననేది!''

''నిజమేననుకోండి! ఉభయులకూ గౌరవంగా ఉండే పద్ధతిమీద, రాజీ వ్యవహారాలూ నడపండి! తగాదా లాడాలని మాకెంతమాత్రం ఇష్టంలేదు. వారు కాలు దువ్వారు గనుక, మేము కూడా 'సైఁ' అనక తప్పింది కాదు'' అన్నాడు చలపతి.

''అవును'' అని మాత్రం అన్నది మంజరి.

''అయినప్పటికీ, ఆ పాతపురాణమంతా తవ్వడంలో అర్థం లేదు. మేమా గొడవను మనస్ఫూర్తిగా మరచిపోతున్నాం. వారు కూడా మరచిపోవాలని కోరుతున్నాం'' అన్నారు చలపతి.

అతను క్రమక్రమంగా తననే స్థాయికి దిగలాడుతున్నదీ మంజరి గమనిస్తూనే ఉంది. చిత్రమేమిటంటే - తను 'కా' దనటానికి అవకాశం లేకుండా చలపతీ, తంగవేలూ కలగలపుకొని మాట్లాడేసుకొన్నారు.

''నేనింకా వారితో మాట్లాడలేదు'' అన్నాడు తంగవేలు.

''అబద్ధం'' అనుకొన్నది మంజరి.

''మాట్లాడి చూడండి వారంగీకరిస్తే మాకభ్యంతరం లేదు. అందుకని ఎవరుగానీ వారిని బతిమిలాడనవసరంలేదు. పోటీలవల్ల, స్పర్థల వల్ల నష్టపోయేది మేమే కాదు - వారికీ నష్టమే'' అన్నాడు చలపతి.

''మంజరి సంస్కారమున్న మనిషని నాకు తెలుసు. ఆమె చప్పున వప్పుకుంటుందని కూడా

నేననుకొన్నాను. మరి - ఆ జనం అటువంటివారు కాదు. అయినా ప్రత్నిద్దాం. పోతూ పోతూ - వీలుంటే కలుసుకొంటాను'' అని లేచాడు తంగవేలు.

మంజరి అతన్ని మెట్లదాకా సాగనంపింది.

నిజానికి ఇంతకన్నా ఎక్కువగా రావుగారూ, మూర్తిగారూ ఆరాటపడిపోతున్నారు. తమ కళ్ళముందే చంద్రం చకచకా పైకొస్తున్నాడు. ఇప్పటికే అతని కోసం కొన్ని కంపెనీలు పడిగాపులు కాస్తున్నాయ.ఇ రషెస్ చూసినవారు చంద్రం బాగా చేస్తున్నాడంటున్నారు. అతనికేగానీ సరైన రోల్ ఇస్తే - గ్రెగరీ పెక్‌ను బీట్ చేస్తాడని కూడా ఓ డైరెక్టరన్నాడు. అతను ఆషామాషీగా అనేవాడు కాడు. బోలెడంత అనుభవమున్న మనిషి!

''ఉన్న ఫీల్డయితే ఇదే! ఈ కాస్తంత జాగాలో మంది బలిసిపోకూడదు. అనవసరంగా మీరు చంద్రాన్ని పైకి రానిచ్చారు. ఇప్పుడతను ఏకుమేకై కూచున్నాడు'' అన్నాడు తంగవేలు.

''నిజం!'' అన్నాడు మూర్తి.

''నిజం!'' అన్నాడు రావు. ''అతనైనా పరాయివాడు కాదు. మా వాడే! తిరగేస్తే నాకూ, మా మూర్తన్నయ్యగారికీ చుట్టరికం కూడా కలుస్తుందనుకొంటాను. అసలు చంద్రాన్ని మేమే లాగుదామనుకొన్నాం. సమయం కోసం చూస్తూ వున్నాం. అదృష్టవశాత్తూ- పోనీ - దురదృష్టవశాత్తూ అనండి - మంజరి మాతో దెబ్బలాడింది. ఇంతకన్నా మంచి సమయం దొరకదనుకొని చంద్రానికి నేనే సలహా ఇచ్చాను. అతనా సలహాను అక్షరాలా పాటించాడు. తారాజువ్వలా పైకొచ్చాడు. చంద్రం వచ్చినందుకు నాకు గానీ, మా మూర్తన్నయ్యకుగానీ కోపం లేదు. అసూయ అంతకన్నా లేదు''.

''ఓహ్హో హ్హో హ్హో!ఓ హాహా హా!'' అని నవ్వాడు మూర్తిగారు.

''అవునా! మంజరి అంతకన్నా చిత్రమైన సంగతి నాతో చెప్పింది''అని ప్రారంభించాడు తంగవేలు. ''విజయకు ఏదన్నా మంచి అవకాశం యిప్పించాలని ఆవిడ చాలా కలం నుండి అనుకొంటున్నదిట. చిన్న చిన్న వేషాలు ఎన్ని వేసినా లాభంలేదనీ, ఏదన్నా మంచి రోల్ ఉంటే తప్ప పైకి రావడం కష్టమని అనుకొని మీకు మల్లేనే - ఆవిడ కూడా అవకాశం కోసం ఎదురు చూస్తున్నదట. మీతో తగాదా వచ్చాక తనే విజయను మీదగ్గరకు పంపిందట. విజయ పైకి రావడం కాన్న తనకింకా జీవిత ధ్యేయం లేదన్న ధోరణిలో మంజరి మాట్లాడింది. దీనికి మీరేం చెబుతారు?''

తంగవేలు కేసి తిరిగి, రావుగారు చూడకుండా కన్ను మలిపాడు మూర్తి.

''అబ్బా, మీరు అసాధ్యులండీ'' అని నవ్వేశాడు రావు.

తంగవేలు దులిపిన దులుపుడుకు, ఇదెలాంటి సమాధానమో ఆ భగవంతుడికే తెలియాలి.

- ఆ సమయానికే అంతర్జాతీయ చలనచిత్రోత్సవాలు మద్రాసులో ప్రారంభమవుతున్నాయి. తలలున్నవారూ లేనివారూ కూడా ఆ హడావుడిలో మునిగిపోతున్నారు. ఎక్కడ చూసినా వల్లమాలిన సందడి. ముఖ్యంగా డైరెక్టర్లు, ప్రొడ్యూసర్లు, కవులూ ఆ సినిమాలన్నింటికీ హాజరవడానికి నిర్ణయించుకొన్నారు. ఆ సినిమాల్లోంచి మనకు ఉపయోగపడగలిగినంత సరుకులు

పట్టించుకోవడానికి అంతకాన్న మంచి అవకాశం మరి దొరకదు.

తంగవేలు ఈ సందర్భాన్ని అద్భుతంగా అద్భుతంగా వినియోగించుకొన్నాడు. మోహన్ స్టూడియోస్‌లో ఏర్పాటైన ఆ ఉత్సవాలకు అందరితోబాటు రావును, మూర్తిని, మంజరిని కూడా ఆహ్వాని ఆందించాడు. వారెవరో క్రొత్తవారైనట్లూ, అప్పుడే కలుసుకొన్నట్లూ ఒకరినొకరికి పరిచయం చేశాడు తంగవేలు.

ఆ ధోరణిని చూసి-

ముందుగా చుట్టూ ఉన్నవారే నవ్వారు.

మంజరి నవ్వింది.

రావు నవ్వాడు.

మూర్తి నవ్వాడు!

''ఇదే సినిమాలోనోనయితే, ఈ పాటికి పూలవాన కురిసేది'' అన్నాడొకాయన.

# 25

అయిదారు వారాలపాటు సినిమా జర్నలిస్టులకు ఊపిరాడనంత పని తగిలింది. వాళ్ళు కలాలూ, కెమేరాలూ వెంటేసుకొని, హీరోద్వయాన్నీ ఏకైక హీరోయిన్నూ ఇంటర్వ్యూలు చేశారు. ఫోటోలు దీశారు. రకరకాల ప్రశ్నలతోనూ వారి ప్రాణాలు తీశారు. ఎన్ని ప్రయత్నాలు చేసినా, ముగ్గురూ సున్నితంగా తప్పకుపోయారేగానీ, నిలబడినవారుగానీ, తగిన సమాధానం చెప్పినవారుగానీ లేరు. ఎవరయినా ఎలా చెబుతారు? మానిపోయిన పుండును - కనీసం మానినట్లు కనిపిస్తున్న పుండును మళ్ళా కెలకడం ఏ వొక్కరికీ ఇష్టంలేదు.

ఈ సందర్భంలో, శర్మనుండి ఎక్కువ సపోర్టును ఆశించింది మంజరి. అతనికోసం స్వయంగా కబురు పెట్టింది. ఇంకోసారి చలపతిని పంపించింది. అతను వెళ్ళి ముఖం వేళ్ళాడేసుకొని వచ్చాడు.

''ఏమయింది?'' అన్నది మంజరి.

అతను చెప్పే సమాధానం ముందుగా తెలిసి కూడా, ఆమెకింకా ఆశ చావలేదు.

''నాకు కాఫీ కావాలమ్మడూ!'' అన్నాడు చలపతి.

''అలాగే!'' అన్నది మంజరి.

ఈసారావిడ బెల్ నొక్కలేదు. తనే లోపలికెళ్ళి, రెండు కప్పులతో కాఫీ పట్టుకొచ్చి, వొకటి చలపతికిచ్చి మరొకటి తను తీసుకుంది.

''ఏదన్నా అర్జంటు పనిమీదగానీ ఉన్నాడా?'' అన్నది మంజరి, తిరిగి శర్మగారి విషయాన్ని కదుపుతూ.

''లేదు...'' అన్నాడు చలపతి, పంచెమీద పడిన కాఫీ చుక్కను జేబు గుడ్డతో అద్దుతూ. ''బహుశా అతను మనింటికి రాడనుకొంటాను మంజూ!''

''అదేం?'' అన్నదావిడ, చాలా తాపీగా.

''ఈ ప్రశ్న నేనూ అడిగాను. అతను రెండుపేజీల కారణాలు చెప్పుకొచ్చాడు. ఇంతకాలం నుండీ తను జ్ఞాపకం రాకుండా, అంతర్జాతీయ ఫిలిం ఉత్సవాలు జరుగుతున్నప్పుడే శర్మ జ్ఞాపకం రావడానికి కారణాలేమిటన్నాడు. తన కలాన్ని కానీకి, అర్ధణాకూ అమ్మదలుచుకొనలేదన్నాడు. ఏది న్యాయమయితే అదంతా రాస్తాననీ, ఇందులో వ్యక్తిగత అభిమానాలకు చోటివ్వబోననీ అన్నాడు''

మంజరి ఏదో ఆలోచిస్తూ సన్నగా నవ్వి, ''ఊఁ- ఇంకా?'' అన్నది.

''నవ్వులాట కాదు మంజూ! అతను అన్నంతపనీ చెయ్యగలడు''

''నెవర్'' అన్నది మంజరి. ''ఈ జన్మలో వాడు మారడు. ఎందుకని నన్నడక్కు చలపతీ! ఆ కారణాలేమో నీకు తెలుసు. కానీకి, అర్ధణాకూ, అతను కలం అమ్మకపోతే, రూపాయికి అమ్ముతాడు. లేదా పదికి, కాదుకూడదంటే, వందరూపాయలకు అమ్ముతాడు. ఒకసారి-కిందికి జారడం మొదలయ్యాక - దానికిక అంతమంటూ ఉండదు. మన మీలాంటి మేకపోతు పట్టుదలల్ని ఎన్ని చూశాం కాదు గనక! వీడు - వాళ్ళందరికన్నా ఘనుడనుకోను - ''

''అయినా మనం బతిమాలో బామాలో అతన్ని మంచి చేసుకొనవలసినంత అవసరమేముందీ!'' అన్నాడు చలపతి.

మంజరి అతన్ని ముఖాన్ని ఎందుకోసమో వెదికింది! తరువాత కింది పెదవి సుతారంగా కొరుక్కొంటూ రెండు చేతులూ సోఫాకు అటూ ఇటూ చాపి, కాళ్ళూపుకొంటూ మాట్లాడసాగింది.

''ఈ సంగతులన్నీ నీకు తెలియవని నేనెలా అనుకోను చలపతీ! నువ్వుకాదని వాదించకు గాని నిస్సందేహంగా నువ్వు కింగ్ మేకర్వి. రాతిని రత్నంగా, రత్నాన్ని రాతిముక్కగా నువ్వు చేయగలవు చలపతీ! నాకా సంగతి చాలా కాలం క్రిందటే తెలుసు.''

''నా కొంప మునిగింది!'' అనుకొన్నాడు చలపతి. ''ఏదోలే మంజూ! అదంతా పాతకాలపు ముచ్చట'' అన్నాడు పైకి చాలా జాగ్రత్తగా ఆచి తూచి పదాలు వేస్తూ.

''కాదు. నీలో ఇప్పటికీ, ఆ శక్తి సామర్థ్యాలున్నాయి. కాకపోతే - నేనేమన్నా అనుకొని పోతానేమోనని, నువ్వు తొలగి తొలగి మాట్లాడుతున్నావు. నాకా సంగతి మనస్సులో మెదిలినప్పుడల్లా, ఎంత క్షోభించిపోతానో నీకు తెలీదు... చెప్పవచ్చిందేమిటంటే- శర్మతో మనకీనాడున్నంత అవసరం మునుపెన్నడూ లేదు. ఇంటర్నేషనల్ ఫిలిం ఫెస్టివల్కు చాలా దేశాలనుండి ఫిలిం పెర్సనాలిటీస్ వస్తున్నారు. వారందరితోనూ మనం పరిచయం చేసుకోవాలి. ఆ ఇంట్రడక్షన్, ఆ దరిమిలా మనకెందుకైనా ఉపయోగపడవచ్చు. పోనీ- ఎందుకూ పనికిరాదనుకో - మనకు నష్టం కూడా ఏమీ లేదు. అవునా'' అన్నది మంజరి.

''అవును'' అన్నాడు చలపతి ముక్తసరిగా.

మంజరి మరోసారి ఫక్కున నవ్వి, వేళ్ళు మొటికలు విరుచుకొన్నాది.

''నువ్వలా ముభావంగా ఉంటే ఎలా నానీ! నామీద ఏదన్నా కసి ఉంటే ఇంకో

సమయంలో తీర్చుకోరాదా? ఆ మాటకొస్తే- నాకింత పొగ రెక్కడానిక్కూడా నువ్వే కారణం! నేనేదన్నా పొరబాటు పనిచేసినప్పుడు ఆ నిమిషానే నా ముఖం తిరిగిపోయేలా సరిదిద్ది ఉండవలసింది.తీరా ఇంకోసారి అదే పొరబాటు కమిట్ చెయ్యకుండా ఉండేలాగా చూడవలసింది నువ్వే! నేనన్న ప్రతిదానికీ నువ్వు గంగిరెద్దులాగా తలూపడం మొదలెట్టావు. నాలో అహం పెరిగిందంటే - పెరగదా? దానిక్కారణం నేనా?'' అన్నది మంజరి.

ఈ ధోరణి చూసి చలపతి ఉక్కిరిబిక్కిరయ్యాడు. ఈ వాగుడంతా నిజమో అబద్ధమో తేల్చుకోవడం అతనిక్కూడా సాధ్యం కాలేదు. గుడ్లప్పగించి చూస్తూ కూచున్నాడు.

''మాట్లాడవేం చలపతీ?'' అన్నది మంజరి.

''వింటున్నాను మంజూ!''

''అది కాదు చలపతీ! మనం చాలా రోజుల కిందట ఫారెన్ టూర్‌ను గురించి ఏదో అనుకొన్నామనుకొంటాను. ఆ ఆలోచనను మెటీరియలైజ్ చెయ్యడానికి ఇదే మంచి తరుణం. అదేమన్నా మనం చెయ్యగలమో లేదో ఆలోచించాలి'' అన్నది మంజరి.

''తప్పకుండా చేద్దాం''

''అలాకాదు. ఇలా చేదాం- చూదాం మాటలంటే నాకు బొత్తిగా గిట్టదు. చెయ్యదలిస్తే, గట్టిగా నిలబడి చెయ్యడమే. లేదా- ఆ ఛాయలక్కూడా పోకూడదు. కానీ- ఒక్క సంగతి మాత్రం గుర్తుంచుకోవడం అవసరమనుకొంటాను చలపతీ! ఏదైనా పోటీలో మనం పాల్గొనడమంటూ జరిగితే- గెలుపు ఖాయమని తెలిస్తే తప్ప- అంత గ్యారంటీ ఉంటే తప్ప- లేకపోతే అటుకేసి పోనన్నా పోగూడదు. పోటీలో నిలబడి వోడిపోవడం కన్నా అసలు అందులో వేలు పెట్టకపోవడమే మంచిది'' అన్నది మంజరి.

''దీనికెవరన్నా పోటీ వుంటారా?''

''నేను పిచ్చిదాన్ననుకొంటే తప్ప నువ్వా ప్రశ్న అడిగి ఉండవు చలపతీ! ఎంతమంది ఎన్ని రకాలుగా ప్రయత్నిస్తారో తెలియనంత అమాయకుడివా నువ్వు? కాలేకాదు. నా లోతులేమిటో తెలిసికోడానిగ్గాను ఇలా కూపీలు తీస్తున్నావు'' అన్నదావిడ.

''వాళ్ళకసలా ఉద్దేశమున్నదో లేదో మనకింకా తెలీదు. ఒక వేళ వున్నా ఏ సంస్థవారు ఫలానావారిని పంపాలని నిర్ణయిస్తారో మనకు తోచదు. దీనికొక పద్ధతంటూ ఉంటుందో లేదో, ఏ విధానం మీద ఈ ఎంపికను జరుపుతారో తెలియాలి. ఒక వేళ ప్రభుత్వమే పంపడం జరిగితే మనం ఇతర దేశాలవారికి హారతులివ్వడంలో అర్థం లేదు. అప్పుడు ఢిల్లీ దేవతల్ని ప్రసన్నం చేసుకోవాలి. దానికిది మార్గం కాదు. బొంబాయిలో నీకు తెలిసినవారు చాలా మంది ఉన్నారుగదా! వారికి తెలిసిన యంపీలు తప్పకుండా ఉంటారు. వారి ద్వారా అలా అలా ప్రయత్నాలు చేసుకుంటూ వెళ్ళాలిగానీ'' అన్నాడు చలపతి.

''యస్'' అన్నది మంజరి చిటికవేసి. ''జగన్నాథరథం ఇప్పటికి కదిలిందన్నమాట... హమ్మయ్య'' అని నిట్టూర్చిందావిడ. ''పోన్లేగానీ బాబూ! అసలు సంగతేదో నీతో చెప్పాను. దీనికి ఇక్కడే మనం తంటాలు పడాలో, ఢిల్లీదాకా పోవాలో నాకు తెలీదు. ప్రభుత్వానికి వో కల్చరల్ డెలిగేషన్‌ను ఇతర

దేశాలకు పంపవలసిందిగా మనం చెప్పడం బావుండదు. పత్రికలు చెబుతాయి. ఆ విషయమై ప్రత్యేక వ్యాసాలు రాస్తాయి. అందుకు ప్రభుత్వం వొప్పుకొంటే-''

చలపతి వింటూనే హఠాత్తుగా లేచి కూచున్నాడు.

మంజరి తన ప్రవాహాన్ని ఆపి అతనికేసి చూసింది.

''ఇంకో ప్రమాదం కూడా వున్నది మంజూ!ఆ డెలిగేషన్‌లో నువ్వు ఉంటావన్న గ్యారంటీ ఎక్కడిదిట? మనం నిర్మొహమాటంగా చెప్పుకోవాలంటే - ఉత్తరాది ఆర్టిస్టులకు మనకన్నా ఎక్కువ ప్రాఫిన్సు ఉంటుందా డెలిగేషన్‌లో. నువ్వందులో వున్నా '' మొదలైనవారు''లో ఉంటావుగానీ, డామినేటెడ్ ఫిగర్‌గా కనిపించవు అయినప్పుడు - నువ్వా మందలో కలిసినా, కలవకపోయినా ఒకటే'' అన్నాడు చలపతి.

అతని ఆలోచనా ధోరణి చూసి మంజరి నిజంగానే విస్తుపోయింది. ఆవిడకు ఫారెన్ వెళ్ళాలన్న ఉబలాటమేతప్ప, ఈ సాధకబాధకాలేమీ ఆలోచించలేదు.

''నిజమేననుకో చలపతీ! దీనికేమిటి చెయ్యడం?'' మంజరి ఈసారి బెల్‌కొట్టి తాయారును పిలిపించింది. అదొచ్చాక ''రెండు స్ట్రాంగ్ కాఫీ - సిగరెట్లు, లైటర్, టాబ్‌లెట్సు తీసుకురా'' అన్నది మంజరి.

చలపతి ఏదో అనబోతుంటే మంజరి వారించింది.

''ముందు కాఫీ తీసుకొని, సిగరెట్ కాల్చనీ చలపతీ! కొంచెం రీఫ్రెష్ అవుతాం.''

''అలాగే'' అన్నాడు చలపతి.

మంజరి స్వయంగా వో కప్పు చలపతి కందించింది. తనోటి తీసుకొంది. సీసాలోంచి పసుపుపచ్చని బిళ్ళలు రెండు తీసుకొని కళ్ళు మూసుకొని మింగి, కాఫీ చప్పరించింది.

''నేనిప్పుడే అలా వెళ్ళొస్తాను'' అని లేచాడు చలపతి.

''ఫర్వాలేదు. అదో సిగరెట్- కాల్చు'' అన్నది మంజరి.

తను కూడావొకటి అంటించి, రింగురింగులుగా పొగవదిలిందావిడ.

''మనమిప్పుడెక్కడున్నామంటే - '' అని క్షణకాలం ఆలోచించిందావిడ. ''అవును గదూ! ఆ మందలో నేనున్నా లేకపోయినా ఒకటేనని నువ్వన్నావు. అది నిజమేగానీ ఏదీ కాకపోవడం కన్నా, ఆ మాత్రమైనా ఉండడం నయం కాదా?'' అన్నది మంజరి.

''నా ఆంతర్యం కనుక్కోవడం కోసం అలా అన్నావేగాని, నిజంగా మందలో వొకదానివిగా ఉండాలని నీకున్నదా మంజరీ? నిజంగా చెప్పు అదే నీ ఉద్దేశమయితే - దానికోసం అట్టే ప్రయత్నాలేవీ అవసరం లేదు.''

''మరింకేం చెయ్యను చెప్పు?'' అన్నది మంజరి, ముక్కుల్లోంచి పొగను వదిలేస్తూ.

''అంతదైనం మనం వెళ్ళకుండా చూడాలి. ఇన్ని నయామీడియాల మీద అయ్యేపనులు సాధారణంగా వొడ్డెక్కవు. అందుకొక్కటేమార్గం - మనం చెయ్యగలిగిందేమన్నా ఉంటే - ఇక్కడే చేద్దాం.''

''అదే - ఏం చేద్దామని?'' అన్నదావిడ.

“వస్తున్నాను” అంటూ చలపతి సిగరెట్ నుసిని యాష్‌ట్రేలోకి రాల్చాడు. “ప్రభుత్వం సంగతి వదిలేస్తే - మనకు మిగిలిందల్లా ఆయా దేశాలు మనల్ని ఆహ్వానించడం. అందుగ్గాను ఆయా దేశాలు - అవునుగానీ మంజరీ! నువ్వసలు విషయం యింకా స్పష్టంగా తేల్చనేలేదు. నీకే దేశం వెళ్ళాలని వుంది? ఎంతకాలం ఉందామనుకుంటున్నావు?” అన్నాడు చలపతి.

“ఓ రెండు మూడు మాసాలైనా ఉందాం. ఏ దేశాలంటే -హాలీవుడ్ వెళ్ళాల్సిందే గదా!”

చలపతి నవ్వాడు.

“హాలీవుడ్ దేశం కాదు మంజరీ! అమెరికాలోని వో భాగం మనకు మద్రాసు, ఉత్తరాదివారికి బొంబాయి ఎలాంటిదో, అమెరికాకు హాలీవుడ్ అలాంటిది!”

“పోనీ అమెరికాయే వెడతాను. వస్తూ వస్తూ, మిడిలీస్టు కంట్రీస్ - ముఖ్యంగా ఈజిప్టు చూడాలి. అక్కడి పిరమిడ్సూ, స్పింక్స్, నైల్‌నదీ చూడాలని ఉంది. ఇటాలియన్ తారలను కలుసుకోవాలి. అమెరికాలో రెండు నెలలుండి, రష్యామీదుగా వచ్చి, సిలోన్‌లో కొద్ది రోజులన్నాక, తిరిగి - అదీ - నా ప్లాను” అన్నది మంజరి.

మధ్యనుండే నవ్వడం ప్రారంభించిన చలపతి, ఆవిడ ఆఖరువాక్యం కూడా అనేశాక, బలవంతాన నవ్వు ఆపుకొన్నాడు.

“ఏమిటమ్మా అదీ! మరీ నన్నంత తెలియనిదాన్నిగా చెయ్యకు” అని గారాలుపోయింది.

అతిగా నవ్వడం వల్ల చలపతికి కళ్ళల్లో నీటిజీరలు ఏర్పడ్డాయి. పంచె చెరగుతో అతడు వాటిని అద్దుకొన్నాడు.

“ఒక్కోసారి నిన్ను చూస్తుంటే - పసిపిల్లకన్నా ఆద్వాన్నంగా కనిపిస్తావు మంజరీ! ఇన్ని దేశాలు తిరగడానికి, ఆయా దేశాల వారందరూ నీకు ‘వీసా’లివ్వాలి. ముందుగా మన ప్రభుత్వం, నీకు పాస్‌పోర్టు శాంక్షన్ చెయ్యాలి. నీ ప్రయాణానికి ఫారెన్ ఎక్స్ఛేంజిని గ్రాంటు చెయ్యాలి. దీనికంతా బోలెడంత తతంగం ఉంటుంది” అన్నాడు చలపతి.

“అయితే, మనకా ఆశ లేదన్నమాటేగా!”

“అలా కాదు. ముందుగా నువ్వు ఏదో వో దేశం వెళ్ళిరా. తరువాత సంగతి చూచుకొందాం,” అన్నాడు చలపతి. అతను సిగరెట్‌ను యాష్ ట్రేలో పడేసి పొగరాకుండా, పైన అగ్గిపెట్టెను మూతగా పెట్టాడు. “ఎవరు ఏ రోజు కెలా మారుతారో, మనం చెప్పలేం మంజరీ! అదృష్టవశాత్తూ ఈ ప్రయత్నం సక్సెస్ అయితే - మొట్టమొదటిసారిగా విదేశాలకెళ్ళిన తెలుగు ఆర్టిస్టువు నువ్వే అవుతావు” అన్నాడతను.

“అదంతా నీ చేతుల్లోనే ఉన్నది చలపతీ” అన్నది మంజరి ఇంకాస్త ‘కీ’ ఇస్తూ- “అవసరమైతే మనం కొంత ఖర్చు పెడదాం... ‘ఎంత’ అని అడక్కు. ఎన్నివేలయినా వెనక్కు చూడకు. మన డబ్బుతో మనం వెళ్ళి చూసి రావడం కన్నా, ఇంకో దేశంవారు వారి ఖర్చులమీద మనల్ని తమ దేశంలో పర్యటించమని ఆహ్వానించటమే మనకు గొప్ప అలా జరిగేలా మనం చూసుకోవాలి. - ఇంద... ఈ చెక్కులన్నింటిమీదా సంతకాలు చేశాను. ఎంతున్నదీ నీకు తెలుసుగదా! అలా చేస్తే పనవుతుందో, అలా చెయ్యి.”

చెక్‌బుక్ అతనున్న సోఫామీదికి విసిరేసింది మంజరి. అతనోసారి దానికేసి చూసి, తిరిగి ఇంకో

సిగరెట్ అంటించాడు.

"ఈ ఆలోచన మనొక్కరికే వచ్చి ఉంటుందని నేననుకోను" అన్నాడు చలపతి మెల్లగా.

"నిజమే! మనకన్నా తెలివైనవారు చాలా మంది మద్రాసులో ఉన్నారు చలపతీ! వాళ్ళల్లో కొందరీపాటికే గాలాలూ, వలలూ విసిరికూడా ఉండవచ్చు. మనం ఆలస్యంగా నడక ప్రారంభించాం. వారిని కలుసుకోవడమేకాదు- వారికన్నా ముందుగా మనం పోల్‌ను తాకాలి. అంటే 'తరాట్' మానేసి 'గాలప్' కొట్టాలన్నమాట!" అని సలహా ఇచ్చింది మంజరి.

చలపతి చెక్‌బుక్‌ను చేతికి తీసుకొని, ఓ క్షణం దానికేసి చూసి, మంజరికివ్వబోయాడు.

"నీ దగ్గర ఉంచుకో చలపతీ!" అన్నది మంజరి, కళ్ళింత చేసుకొని.

"ఎక్కడున్నా వొకటే! అవసరమైనప్పుడల్లా నేను నిన్నడిగి తీసుకొంటూనే ఉంటానుగా!" అన్నాడు చలపతి ఆమె కళ్ళల్లోకి గుచ్చి గుచ్చి చూస్తూ.

మంజరి మాట్లాడలేదు. సోఫాలోంచి లేచి, కిటికీ దగ్గరకెళ్ళి నిలబడింది. రోడ్డుమీద ఓ యాభై మంది కుర్రకారు ఆమెను చూడాలని కనిపెట్టుకొని ఉన్నారు. మంజరి ముఖం కిటికీలోంచి కనబడగానే, వారందరూ ఒక్కసారిగా గొల్లుమని అరిచారు. మంజరి తపీమని రెక్కలుమూసి ఇవతలికొచ్చింది. ఆవిడ కళ్ళనిండా నీరు నిండి, పొర్లిపోవడం చలపతి చూశాడు.

"ఇదేమిటీ?" అన్నాడతను, ఒకడుగు ముందుకొచ్చి.

మంజరి పలకలేదు. గబగబా అతనిదగ్గరకొచ్చి, చేతిలోంచి చెక్‌బుక్ లాక్కుని దూరంగా విసిరి పారేసింది.

"వెళ్లు, తక్షణం ఇక్కణ్నించి వెళ్ళిపో. నాకు ఎక్కడికెళ్ళాలనీ లేదు. ఏమి చెయ్యాలనీ లేదు, నీ ముఖం నాకిక చూపించక పో, పోవేం?" అన్నది భోరుమని ఏడుస్తూ.

చలపతి తలొంచుకొన్నాడు. అతని ముఖం చిన్నబోయింది. మంజరి వో అడుగులో అతని దగ్గరికొచ్చింది.తీరా రెండు చేతులూ అతని రెండు భుజాలమీద వేసి గుండెలమీదవేసి తలపెట్టి 'ఫో - ఇక్కణ్ణించి వెంటనే ఫో' అంటూ ఏడవసాగింది.

చలతపి ఆమె ముఖాన్ని తనవైపు తిప్పుకొని, కుచ్చిళ్ళ చెంగుతో కన్నీరు తుడిచాడు. ఆ క్షణాన అతనిలోని ఉద్రేకాలన్నీ నిద్రపోతున్నాయి.

❦❦❦❦❦❦❦❦

శర్మను రప్పించడం కోసం, మంజరి మరొకసారి చలపతిని పంపి చూసింది. అయినా శర్మ రాలేదు. తను రానని కూడా స్పష్టంగా ఎప్పాడు.

"ఆఖరిసారిగా నేనూ ప్రయత్నించి చూస్తాను" అన్నది మంజరి.

"నువ్వా? వాడికోసం పోతావా?" అన్నది మంజరి.

"ఏం?" అన్నది మంజరి.

"వాడి దృష్టిలో చులకనయిపోమా?" అని తన సందేహాన్ని వెల్లడించాడు చలపతి.

"మహమ్మద్ కొండ దగ్గర కెడితే కొండకే నామోషీగానీ, మహమ్మద్ కేమీ అగౌరవం కాదు. మన కతనితో కట్టుకుపోయినంత పని ఉంది. సమయం చూసి బెట్టు చేస్తున్నాడు. మన

పని తీరిందాకా మనకు తప్పదు మన పనయ్యాక, మళ్ళా లేవకుండా తొక్కేద్దాం. నా మంచితనమే వాడికి తెలుసుగానీ, రెండో భాగం తెలీదు. ఆ తడాఖా ఏమిటో వోసారి రుచి చూపిస్తాను'' అన్నది మంజరి.

''కొంపదీసి వాడితో దెబ్బలాడిగానీ రావుగదా?'' అన్నాడతను.

''దానికైనా వాడికి కొంత యోగ్యత ఉండాలి. ఈ శర్మకది కూడా ఉన్నదనుకోను.''

మంజరి మేకప్ కావడానికి పక్కా గంట పట్టింది. పోర్టికోలో కారు వచ్చి ఆగింది. డ్రైవర్ తలుపులు తెరచి సిద్ధంగా ఉన్నాడు. మంజరి మెట్లు దిగడం చలపతి చూశాడు. ఛరాలునలేచి, మెట్లచివరకొచ్చి నిలబడ్డాడు.

''అతను రానంటాడేమోనని భయంగా ఉంది. అనవసరంగా నీ మనస్సు నొచ్చుకోవడం నాకిష్టంలేదు'' అన్నాడు చలపతి.

''చూస్తాను'' అన్నది మంజరి.

కారు ఓ చిన్న కుదుపు కుదిపి, సిమెంటురోడ్డు మీదుగా, వీధి గేటు దగ్గరకొచ్చింది. అక్కడ చాలా మంది, ఆమె దర్శనంకోసం పడిగాపులు కాస్తున్నారు. గుర్ఖావాళ్ళు అదిలించినా కదలడంలేదు. తనను చూసి 'ఓ' యని గోలచేసిన వారందరివేపూ తిరిగి, మంజరి 'టా టా' చెప్పి, నవ్వు కుంటూ సీటుకు చేరగిలబడింది.

స్పీడు తగ్గించి మంజరి వేపు తిరిగాడు డ్రైవరు.

''శర్మ దగ్గరకు - అదే పేపరు శర్మ''

డ్రైవర్ యాక్సిలేటర్ మీద వత్తిడి ఎక్కువ చేశాడు. కారు సర్రున రోడ్డుమీద జారిపోతోంది!

''తలుపులు వేసువున్నాయండీ!'' అన్నాడు డ్రైవరు రూము కేసి చూస్తూ.

''ఈ వేళప్పుడు ఎక్కడికీ వెళ్ళడు. ఒక వేళ లోపలగానీ నిద్ర పోతున్నాడేమో మరి - అదేం - తాళం కూడా వేసినట్లు లేదే!''

ఆవిడన్నదంతా నిజమే! అమ్ముడుగాని పేపర్లను పక్కగా పరుచుకొని శర్మ నిద్రపోతున్నాడు. అలాంటివే రెండు కట్టలను తలకిందొకటి, కాళ్ళకిందొకటి వేసుకొన్నాడు.

''మీకోసం అమ్మగారొచ్చారు'' అన్నాడు డ్రైవర్.

శర్మకు మత్తంతా వొదిలిపోయింది.

''వస్తున్నానని చెప్పు'' అంటూ డ్రైవర్ని పంపేశాడు.

గబగబా కూజాలో నీళ్ళు గ్లాసులో వొంపుకొన్నాడు. ముఖం కడుక్కుందామంటే, తలుపు తీసుకొని బయటికి పోవాలి. బయట మంజరి ఉన్నది. ఈ ఆకారంలో ఆమెకు కనిపించడం శర్మకిష్టంలేదు. లోపల కడుక్కుందామంటే, గదినిండా పత్రికలే! అందుకని, జేబుగుడ్డ గ్లాసులో ముంచి ముఖం తుడుచుకొన్నాడు. పైజమా వేసుకొన్నాడు. లాల్చీ తొడుక్కొన్నాడు. ఓ పేపరు పెట్టి చెప్పుల మీద దుమ్ము దులుపుకొన్నాడు. గబగబా తలకింత నూనె పట్టించి, నున్నగా దువ్వుకొన్నాడు.

ఈలోగా డ్రైవర్ నాలుగయిదు సార్లయినా హారన్ మోగించి ఉంటాడు.

వర్మ గదికి తాళం వేసి, తాళం చేతులు వేలికి తగిలించుకొని గుండ్రంగా తిప్పుతూ, దూరం నుండే 'హలో' అన్నాడు.

మంజరి తను పక్కకు జరిగి కారు తులపు తీసింది.

శర్మ కారుదగ్గరకొచ్చి, వంగి మంజరికి నమస్కారం చేశాడు.

"నమస్కారం శర్మగారూ! బాగున్నారా?" అన్నది మంజరి.

"మీ దయవల్ల- ఇలా ఉన్నాను" అన్నాడు శర్మ పొడి పొడిగా. "ఇలా దయచేశారేం! ఏదన్నా పనిమీద పోతూ - "

"కాదయ్యా శర్మాజీ! మీ కోసమే వచ్చాను... రండి! ముందు కాఫీ తాగాలి."

"నే రాను" అందామనుకొన్నాడు శర్మ.

కానీ, ఆ మాట అనలేదు. నిశ్శబ్ధంగా కారులోకొచ్చి మంజరి సరసనే కూర్చున్నాడు.

"హొటల్ పెగాపస్" అన్నది మంజరి.

శర్మ ఇంకా తాళం చెవులు, వేలికి తగిలించుకొని తిప్పుతూనే ఉన్నాడు.

మంజరి నవ్వునాపుకొంటూ "ఇంకా చిన్న పిల్లల చేష్టలు పోకపోతే ఎలా శర్మాజీ! ఆ తాళాలు తిప్పడం మనేయలేవూ?" అన్నది.

శర్మ వాటిని జేబులో వేసుకొన్నాడు.

"అలాగే ఇంకో చిన్న రిక్వెస్టు"

శర్మ మాట్లాడలేదు. ఊరికే ఆమె కేసి చూశాడు.

"మీరు తల దువ్వుకోడం మానేయాలి. నున్నగా తల దువ్వుకుంటే మిమ్మల్ని గుర్తు పట్టడం చాలా కష్టం. అదీగాక - నూనె రాసో, రాయకుండానో - జుట్టు - ఇంతెత్తున ఈతపొదలాగా ఉంటే తప్ప జర్నలిస్టని లోకం అనుకోదు. మిమ్మల్ని చూస్తుంటే- ఏ సమస్యాలేనివారికి మల్లే- చాలా తాపీగా -"

పెగాసస్ గార్డెన్‌లో కారాగింది.

"నువ్వెళ్ళు. కారు నేను తీసుకొస్తాను" అన్నది మంజరి.

డ్రైవర్ 'కీ' యిచ్చి, సలాంచేసి మరీ పోయాడు.

"రూం నెంబర్ ఫార్టీత్రీ ఈజ్ ఎవైలబుల్ మేడం" అన్నాడు హొటల్ మేనేజర్.

"రూమెందుకూ? మనం వెంటనే పోతున్నాంగా!" అన్నాడు శర్మ.

"ఈ కాస్సేపే అక్కడ కూచుందాం" అన్నది మంజరి.

అప్పటికే హొటల్లో జనం చూపులు ఆమె చుట్టూ వలల్లాగా అల్లుకుపోతు న్నాయి. మంజరి తలొంచుకొని 43వ నెంబరు గదికేసి నడిచింది.

"ఏమిటిదంతా?" అంటున్నాడు శర్మ.

దానికి సమాధానం, ఆవిడ గదిలోకొచ్చి కుర్చీలో కూచున్నాక గానీ చెప్పలేదు.

"ఎందుకయ్యా శార్మజీ, అలా భయపడిపోవటం? నేను నిన్నేం చేస్తాను గనక? యస్... కమిన్" అన్నది మంజరి.

బాయ్ తలుపు కొద్దిగా తెరచి, మెనూకార్డు ట్రేల్ పట్టుకొచ్చాడు.

"ఏం కావాలి శర్మాజీ?"

"ఏదో చెప్పండి!"

"నాకు చెత్తపడాలి. ఆకలేస్తున్నది బాబూ! స్ట్రాంగ్ టిఫెను- నీ యిష్టం వచ్చిందేదో పట్టుకురా, కాఫీ కూడా."

"ఈ కాస్త భాగ్యానికి రూమెందుకండీ తీసుకోవడం?" అన్నాడు శర్మ.

"అంటే?" అన్నది మంజరి సుతారంగా నవ్వుతూ. "కనీసం రూం తీసుకొన్నందుకైనా, ఇక్కడేదో అఘాయిత్యం నామీద జరగాలంటావు అంతేనా?"

ఇలా వ్యవహారం పెడతిరుగుతుందని శర్మ అనుకోలేదు. అతను కూడా నవ్వాడు.

"ఇదివరకెప్పుడో నీతో అన్నానుకొంటాను, నువ్వు నాకన్నా చిన్నవాడవుకాకపోతే నిన్ను పెండ్లాడి ఉందునని. ఆ మాటలకు నేనిప్పటికి కట్టుబడే ఉన్నాను" అన్నది మంజరి పకపకా నవ్వుతూ. "నామీద కోపంతో మా యింటికి రాకపోతే పోయావు. కనీసం మా వసంత కోసమన్నా రాకూడదా? అదేమో నువ్వంటే అంగలార్చుకు పోతుంటుంది. మరి- తమరేమో ఇలా చెట్టుకొమ్మెక్కి కూచుంటున్నారు."

బాయ్ టిఫెనూ, కాఫీ కూడా పెట్టిపోయాడు.

"నీకు ఫోను లేకపోవడం నా ప్రాణానికొచ్చింది శర్మాజీ! నా సుఖం కోసమైనా నీ గదికి ఫోన్ పెట్టించాలి... చలపతికి యింకా మానర్స్ తెలీకపోవడం నా ఖర్మం. ఎవరితో ఎలా మాట్లాడాలో వాడికి తెలీదు. ఆ మాటంటే వల్లమాలిన కోపం. నీకేదో అది చేశాననీ, యిది చేశాననీ లగ్గలకెత్తిపోతాడు. పోనీ పంపేద్దామంటే, నీబోటి వాళ్ళంతా చీవాట్లు వేస్తారేమోనని భయంగా ఉంది."

"ఏమయింది?" అన్నాడు శర్మాజీ.

"తెలివితక్కువ వెధవల్ని ఎక్కడికి పంపినా ఏమవుతుందో అదే అయింది. నిన్ను తీసుకురమ్మని అరడజనుసార్లు పంపించాను. నువ్వు రానన్నావని చెబుతాడు. "ఎందుకని?" అంటే చెప్పడు. ఏదన్నా పని తొందరలో ఉండి రానని నువ్వన్నావే అనుకో - తీరాకనే రమ్మని చెప్పొచ్చుగదా! కనీసం ఆ తెలివి కూడా మా వాడికి లేదనుకో శర్మాజీ!" అన్నది మంజరి.

శర్మ ఏమనుకున్నాడోగానీ, ఏమీ మాట్లాడలేదు.

"నీతో మరో పనేదో ఉండి కాదు. నువ్వు అయిదారు మాసాలనుండి సరిగ్గా మా యింటికి రావడం లేదు. లేదని మా వసంత కూడా చెప్పింది. ఎక్కడన్నా కలిస్తే రమ్మనమని కూడా దానితో అన్నాను. అది కూడా ఆట్టే బయటికి పోవడంలేదు. నాకీ దిక్కుమాలిన సమస్యలతో తల వేడెక్కిపోయింది. ఏ గోడకన్నా తలబాదుకొని చచ్చిపోదామనిపించింది శర్మాజీ! నీ కోసం రెండు మూడు దఫాలు మనిషిని పంపించాను; ఓసారి నేనే వచ్చాను. తలుపులు తాళాలు వేసి వున్నాయి. 'మామ్మ' నడిగితే 'తెలియద'దంటుంది. నువ్వు మరీ నల్లపూసయి పోయావేం? నామీదగానీ కోపమా?" అన్నది మంజరి.

''కోపమే!'' అన్నాడు శర్మ.

మంజరి నిర్ఘాంతపోయింది.

''మీరు పెద్దవారు, నేను అల్లుణ్ణి. మీకు కోపం వచ్చినా కాకు కోపం వచ్చినా నేనే తగ్గి ఉండాలి. అదీగాక- నాతో అవసరం మీకింకా ఉన్నదని నేననుకోవడం లేదు. ఎప్పుడో వొకప్పుడు మీదోవ ''వెళ్ళి రండి'' అన్న ముక్క అనిపించుకోవలసినవాణ్ణే. ఆ మాట మీరనకముందే నేను జాగ్రత్తపడ్డాను. ఇందులో తప్పేమిటిట?'' అన్నాడు శర్మ.

క్షణంలో అతని కళ్ళు కోపంతో భుగభుగలాడాయి. మంజరి నవ్వింది. అయితే అది నవ్వుకుమల్లే లేదు. ఇంకేమీ చెయ్యలేక చేసిన పనిలాగా ఉన్నదా నవ్వు.

''పొరబాట్లు జరగవనికాదుగానీ శర్మగారూ! ఎక్కడ జరిగిందో చెబితే సరిదిద్దుకోవ డానికి అవకాశమిచ్చినవారవుతారు. అదేమిటో బయటపెట్టకుండా నన్నిలా కొరత వేయడం ధర్మంకాదు'' అన్నది మంజరి.

శర్మ మరింత రెచ్చిపోయాడు. కోపంతో అతని చేతులు, కాళ్ళు వణకడాన్ని మంజరి గ్రహించింది.

తను విదిపే ఎంగిలిమెతుకులు ఏరుకుతిని, తోకాడించవలసిన కుక్కలాంటివాడీ శర్మ. తనమీద కారాలూ, మిరియాలూ నూరుతున్నాడిప్పుడు. తను - సాచి లెంపకాయకొడితే అడిగే దిక్కులేదు. ఆ వనజాక్షిమల్లే నలుగుర్ని పెట్టించి కాలో, చెయ్యి విరిచేసిన అడిగే నాథుడు లేడు. కానీ - అంతదాకా పోవడమెందుకనే తన బాధ. సౌమ్యంగా ప్రయత్నించడానికింకా అవకాశాలున్నాయని తన నమ్మకం. ఆ ఆశ కాస్తా పోయిన మరుక్షణం, వీణ్ణి నల్లిని నలిపినట్లు నలపడం తనకు క్షణాలమీద పని.

''మాట్లాడరేం?'' అన్నాడు శర్మ పెద్దగా.

మంజరి సన్నగా నిట్టూర్చింది.

''ఏం చెప్పను శర్మాజీ! నాకు రోజులు బాగా లేవు. ప్రతివారూ నామీద పొగలూ, సెగలూ చెరిగిపోస్తున్నారు... వీటన్నింటికీ- ప్రత్యక్షంగా నేను కారణం కాకపోవచ్చు. కానీ బాధ్యత నాదే! అదేదో ఊరునుంచి, ఓ అభిమాని ఇప్పటికి 179 సార్లు నా ఫొటోకోసం ఉత్తరాలు రాశాడుట. ఆ ముక్క నేను నమ్మనేమోనని అతను సర్టిఫికెట్ ఆఫ్ పోస్టింగ్ కాగితాలన్నీ స్వయంగా పట్టుకొచ్చి నాకు చూపించాడు. అంతదాకా - నిజంగా నాకా సంగతే తెలీదు. ఇదేమిటయ్యాని చలపతిగారినడిగితే పలకడు. చివరికి అతన్ని క్షమాపణ వేడుకొని, అతనడిగిన ఫొటోలన్నింటిమీద సంతకాలు చేసి, రానూ పోనూ ఛార్జీలిచ్చి మరీ పంపించాను. నిజానికి చలపతి క్షమాపణ చెప్పాలి కానీ, నైతికంగా బాధ్యత నాది కనక నేనే ఆ పని చేశాను. ఎందుకు చెబుతున్నానంటే-'' అని దగ్గుతూ ఆగిపోయింది మంజరి.

''మీ ఇబ్బందులేవో మీకుంటాయనుకోండి. పీతకున్న సమస్యలు పీతకూ ఉంటాయి మరి. నేనూ కాదనడం లేదు...పోదామా?'' అని లేచి నిలుచున్నాడు శర్మ.

మంజరి అతని భుజాలమీద చేతులు వేసి, బలవంతాన అదిమి కుర్చీలో కూచోబెట్టింది.

తను కూడా అతనికి ఎదురుగ్గా కూచుంది. ఆమె దగ్గర సిగరెట్లు లేవు. వెదుక్కుంటుంటే శర్మ అందించాడు.

"ఏం? బ్రాండ్ మార్చారేం?" అన్నది మంజరి.

"డబ్బుల్లేక -" అన్నాడు శర్మ.

"ఏం చంపుతున్నారు శర్మాజీ మీరు. మాటలు ఇంత బలం వుంటుందని నేననుకోలేదు సుమా!" అన్నది మంజరి బెల్ నొక్కతూ. వెయిటర్ వచ్చాక, 'రెండు ప్యాకెట్లు సిగరెట్లు తీసుకురా బాబూ!" అని పురమాయించింది.

"మీరలా గుంభనగా ఉంచి నన్ను తుకతుకమని ఉడకపెట్టడం న్యాయం కాదు శర్మగారూ! తెలియక నేనేమన్నా పొరపాటు చేస్తే, క్షమించండి. నా వాళ్ళెవరన్నా మీపట్ల అగౌరవంగా ప్రవర్తిస్తే వారి తరపున నేను క్షమాపణ వేడుకుంటున్నాను... నాకొక్కటే సంగతి చెప్పండి! మీ రెందుకు రావడం మానేశారు? తీరిక లేదని చెప్పకండి! అసలు కారణం చెప్పండి - " అని గీమారింది మంజరి.

శర్మ చాలా సేపు గునిశాడు. "ఏమీ లేదన్నాడు." "అంతగా పనిలేక" అన్నాడు. "వచ్చినప్పుడు మీరు లే"రన్నాడు. వీటినేమీ మంజరి 'నమ్మ"నన్నది. "చెప్పకపోతే నామీద వొట్టే"నన్నది. "కాశీలో గోవును చంపినంత పాపం తగులుతుం"దన్నది.

శర్మ మెత్తపడ్డాడు.

మెత్తపడక అతను మాత్రం చేయగలిగిందేముందీ? ఎంతకాలమని ఈ అణాకానీ పత్రికను పెట్టుకొని వేళ్ళాడతాడు గనక! లోగడంటే ఫలానా ఆర్టిస్టుకూ, ఫలానా శర్మకూ మాంచి దోస్తీ వున్నదని అందరకూ తెలుసు గనక, సినిమా కంపెనీలవారూ, డిస్ట్రిబ్యూటర్లూ, ఆర్టిస్టులూ కూడా శర్మకు భజనచేస్తూ ఉండేవారు. ఎడ్వర్‌టైజ్‌మెంట్లు కూడా బాగానే దొరుకుతుండేవి. పత్రిక అమ్మినా అమ్మకపోయినా ఎడ్వర్‌టైజ్‌మెంట్సు రెవిన్యూ మీద బండి దొళ్ళిపోతూ ఉండేది. ఆరు మాసాలనుండి శర్మకూ మంజరికీ మాటలు లేవని ఫీల్డు అంతా గుప్పుమన్నది. అందరూ శర్మను కేటుగా చూడటం సాగించారు. ఇలాంటి పరిణామం వొస్తుందని శర్మాజీ ముందుగానే ఊహించాడు. కానీ అదింత శక్తిమంతంగా, విశాలంగా ఉంటుందని అతనూ అనుకోలేదు. మంజరితో సరాసరి రాయబారాలు జరపడానికి అతను ఇష్టపడలేదు. అలాగని - ఈ ఎడాన్ని పెంచుకోవడం కూడా అతనికిష్టంలేదు. అవకాశంకోసం అతనూ చూస్తున్నాడు. చలపతి వచ్చాడు. తను రానన్నాడు శర్మ. ఇద్దరూ గుసగులాడుకొన్నారు. "అలాకాదు ఇలా పో" అన్నాడు చలపతి. "భేషో గురో" అన్నాడు శర్మ. ఆ దోవ ఇక్కడిదాకా నడిపించుకొచ్చింది వ్యవహారాన్ని ఇంకా బెట్టు చేస్తే తీగె తెగిపోతుందనుకొన్నాడు శర్మ. తన కారణాల సంచిని విదిలించాడతను.

"నాకు బాగా తెలిసిన ఆర్టిస్టును మీకు రికమెండ్ చేదామనుకొన్నాను. అతను పాపం! చాలా బాధపడుతున్నాడు. అదీగాక, దూరంగా నాకు చుట్టం కూడాను. కానీ అప్పటికే మీరు చంద్రంగారికి మాటిచ్చేశారు. అలా ఇవ్వడానికి ముందు మీరు నన్ను సంప్రదిస్తారనుకొన్నాను - అది అత్యాశ కాదు. అంతకు ముందు మన మధ్యగల సంబంధాలనుబట్టి, అలా అనుకోవడంలో

న్యాయమున్నదని నా నమ్మకం. మీరిలా హఠాత్తుగా ఒక నిర్ణయానికి రావడానికి కారణాలేమిటి?'' అని నిగ్గతీశాడు శర్మ.

''మీరేమనుకొంటున్నారు?'' అన్నది మంజరి, సుతారంగా సిగరెట్ పొగను శర్మ ముఖంమీదికి ఊదుతూ.

అతనా పొగను చేతులతో పక్కకు తోశాడు.

''మీరేమనుకొన్నా, నేను నిజం చెప్పదలచుకొన్నాను. మనస్సుల్లో ఏదో దాచుకొని, పైకి ''అహాహా-ఓహెూహెూ'' అంటూ పూసుకు తిరగడం ఆరోగ్యంకాదు'' అన్నాడు శర్మ ఆవిడకేసి కన్నార్పకుండా చూస్తూ.

''ఊఁ - చెప్పండి!'' అన్నది మంజరి కూడాను.

''అతను మా చుట్టం కావడమే కారణమనుకొంటాను. అంటే... అతను బ్రాహ్మడన్న కారణంతోనే మీరు తొందరపడి ఆ నిర్ణయానికొచ్చారని నేనిప్పటివరకూ అనుకొంటున్నాను'' అన్నాడు శర్మ.

మంజరి కళ్ళు తెపతెపలాడాయి. ఆవిడ సిగరెట్‌ను నేలకేసి బాది కాలితో మట్టిగించి పారేసింది.

''ఇహ మనం వెళ్ళిపోదాం శర్మాజీ! నాకూ అవతల చాలా పనులున్నాయి'' అని లేచి నిలబడింది మంజరి.

శర్మకూడా నుంచున్నాడు. ఆవిడ కదలకుండా చెయ్యి చాపి, ''మరి మీ సమాధానం చెప్పకుండానే పోతారేం?' అన్నాడతను.

''ఈ ప్రశ్నకు నేను చెప్పవలసిన జవాబేమీ లేదు శర్మాజీ! ఇంతకాలంగా మనం స్నేహితులకన్నా సన్నిహితంగా వుంటున్నా, నా ఆంతర్యమెలాంటిదో మీరు తెలుసుకోకపోవడం నా దురదృష్టం. నాకు కల్లోకి కూడా రాని విషయాల్లో ఇదొకటి. ఇంకో సంగతేమిటంటే- ఈ పరిశ్రమలో, ఎవరెవరు ఏ కులానికి ,చెందినవారో నాకు తెలీదు. తెలుసుకోవాలని కూడా నాకు లేదు. డబ్బుకోసం, కీర్తికోసం ఇక్కడికొచ్చాం. ఎవరి కందినంత వారు రొళ్ళుకొంటున్నారు. అంతే'' అన్నది మంజరి.

''రొళ్ళుకోవడంలోనే ఈ ఛండాలమంతా బయటపడుతున్నదండీ! నేనూ, మీరూ ఒకే కులంవాళ్ళం గనక, ఆ వేషం నాకివ్వమనో, ఇప్పించమనో అడగడం ఇక్కడ చాలా రివాజు.సగం మంది ఈ పంపిణీ మీదనే ఇందులో ఉండగలుగుతున్నారు''

''నిజం కావచ్చు. నేను మాత్రం వీటికి దూరంగా ఉంటున్నా- కనీసం వుంటున్నాని నా నమ్మకం... పోతే చంద్రాన్ని నేను రికమెండ్‌ను చెయ్యడానికి వేరే కారణమున్నది. అదేమిటో నేను చెప్పడంకన్నా, ఆ పెద్దమనిషి రాసిన ఉత్తరాన్ని నువ్వు చూడటమే మంచిది. అతను నాకు బాగా తెలుసు. చంద్రశేఖరశాస్త్రిగారని చిలకలపూడిలో వొకాయనున్నారు. నాకు కూచిపూడి నాట్యం నేర్పిన జ్వాలాపతి లింగశాస్త్రిగారి తమ్ముడాయన. వారి దగ్గరనుండి ఈ 'చంద్రం' ఒక ఉత్తరం పట్టుకొచ్చాడు. జ్వాలాపతి లింగశాస్త్రిగారు నాకు తండ్రివంటివారు శర్మగారూ! రాయిలాంటి నన్ను తీర్చిదిద్దారు. ఈనాటి నా ఔన్నత్యానికి వారే ముఖ్య కారకులు. వారేది అడిగినా నేను కాదన్ను. నాకున్న ఆస్తిపాస్తులన్నీ విడిచిపెట్టి సన్యాసం తీసుకో మని వారంటే, నిస్సంకోచంగా

నేనందుకు సిద్ధపడతాను'' అన్నది మంజరి సన్నగా నిట్టూరుస్తూ. ''మనుషుల్లో ఎంత గొప్పవారుంటారో మనం ఊహించలేం శర్మగారూ! నేనిక్కడ స్థిరపడిన తరువాత, జ్వాలాపతి లింగశాస్త్రిగారికి ఐదు వేల రూపాయల డ్రాఫ్టు పంపించానొకసారి. దాన్ని తిప్పి పంపుతూ ఆయన రెండు లైన్లు రాశారు. ''నేను డబ్బుకోసం నీకు నాట్యం నేర్పలేదు. నాకన్నా పేదవారికోసం ఈ మొత్తం ఖర్చు చెయ్యి'' అన్నారాయన. అలాంటివారి పాదధూళిని నెత్తిన....''

నేన్నిన్ను అపార్థం చేసుకొన్నాను మేడమ్! చంద్రం బ్రాహ్మణేతరుడన్న కారణంతోనే మీరు వేషాలిప్పించారని ఇంతకాలంగా నేను గట్టిగా నమ్మాను... మనసులో వున్నదంతా మీముందు కుమ్మరించాను. పొరబాటు నాదే!'' అన్నాడు శర్మ.

''నాదీ పొరబాటే శర్మగారూ! ఇంతకాలంగా నా ఇంటికి మీరెందుకు రావడంలేదో నేను మాత్రం కొనుక్కొన్నానా? లేదే! అయితే - జరిగిందేమిటంటే, మనింట్లో వారిని ప్రతిరోజు మనం ''స్నానం చేశారా? అన్నం తిన్నారా? ఆరోగ్యం బావుందా?'' అని అడగుతూ కూచోము. అదే పరాయివారైతే - కాస్త దూరపు బంధువులైతే, పాటికి పదిసార్లు పరామర్శిస్తాం. నా ఖర్మ కాకపోతే నేను మిమ్మల్ని పరాయివాళ్ళకింద చూడటం మానేసి చాలా రోజులయింది. మీరిది గమనించి సర్దుకుపోవాలిగానీ, బయటివారికి జరిగినట్లు మర్యాదలు జరగడం లేదని గునిస్తే లాభంలేదు.''

శర్మ పలకలేదు. అతనికేసి కనుచివర్లనుంచి చూసి కింది పెదవి కొరుక్కున్నది మంజరి.

''ఇంకోసారి కాఫీ -''

''నో, థాంక్స్?'' అన్నాడు వర్మ.

ఇద్దరూ కౌంటర్ దగ్గరికొచ్చారు. శర్మ ముందుగా బిల్ పే చేశాడు.

మంజరి పలకలేదు.

కారెక్కాక డోర్ వేస్తూ, ''అలా చేశారేం శర్మగారూ!'' అన్నది మంజరి స్టీరింగ్ ముందు సర్దుకు కూచుంటూ.

''ఏది - ఓ - బిల్ విషయమా?'' అని శర్మ కూడా నవ్వాడు. ''నాదంతా చాలా చిత్రమైన వ్యవహారం మేడమ్! పట్టుమని పదిరూపాయలు, ఏనాడూ నా దగ్గరుండవు. కానీ, దేనికీ నేను ఇబ్బంది పడను... నా జాతకం అలాంటిది! ఎవరో ఏజంట్ నిన్ననే తొంభై రెండు రూపాయలు పంపించాడు... ఇతరులకు కాఫీ యిప్పించే అవకాశం నా కెప్పుడోగానీ దొరకదు. అంచాత -'' అని అర్థాంతరంగా ఆగిపోయాడు శర్మ.

అయిదారు నిమిషాలపాటు ఎవ్వరూ పలకలేదు. మంజరి వస్తున్న నవ్వును ఆపుకొంటూ, ''ఓ విషయం అడుగుతాను, నిజం చెప్పండి శర్మాజీ!''అన్నది.

''ఏమి''టన్నట్లు కళ్ళెగరేశాడు శర్మ.

''మీరు చాలా విషయాలు బయటపడకుండా దాచగలరుకదండీ?''

''కాదు!'' అన్నాడు శర్మ.

''అబద్ధం, మీరు చప్పున తేలరు. వసంత కూడ మీకు తగ్గదే! అది కూడా నాముందు నంగి నంగి వేషాలు వేస్తున్నది. చాలా కాలందాకా మీ చనువు సంగతి నాకు తెలీదు. మొన్ననేదో

సందర్భంలో మాట్లాడుతుంటే, మా రాజమణి అక్కయ్య, ఈ రహస్యం కాస్తా బయట పెట్టింది. ఆ పిచ్చిదేమో నాకీ సంగతి తెలిసే ఆమోదించి ఊరుకొన్నానని అనుకొంటున్నదిట. అందుకని నేను బయటపడ్డానుగానీ, లేకపోతే నోరెత్తకపోదునని అది గోల పెట్టింది... నిజమేనా శర్మాజీ?'' అన్నది మంజరి.

''నాకేం తెలీదు'' అన్నాడు శర్మ.

''నువ్వు భయపడుతున్నావనుకొంటాను శర్మాజీ! నా మనస్సునింకా నువ్వర్థం చేసుకోలేదు. వసంతను ఈ లైనులోకి దించడం నిజంగా నాకిష్టం లేదు. మా రాజమణి నా ప్రాణాలు నిలువునా తోడేసింది. అదీగాక వసంత చాలా అద్భుతంగా పాడుతుంది. దాని శక్తి సామర్థ్యాలు అలా వంటగదిలోనూ పడగ్గదిలోనూ నశించిపోవడం నాకు బాగనిపించలేదు. వసంత ఏం చెయ్యగలదో నేను ప్రపంచానికి చూపించాను. దానికిక పెళ్ళి చేసి, ఏదో ఇంత ఇద్దామనుకొంటున్నాను'' అన్నది మంజరి.

శర్మ అటూ ఇటూ మసలి కూచున్నాడు.

''నాకెందుకో ఈ రోజున మనస్సు చాలా తేలికపడినట్లనిపిస్తోంది శర్మగారూ! మీతో నా సోదంతా వెళ్ళబోసుకోవాలనిపిస్తోంది. మీకేమీ పనికలేకపోతే - ఆఁహ- అలాకాదు... ఏమన్నా సరే. ఈ పూట నాతో గడిపేయాలి'' అన్నది మంజరి -

కారు పోర్టికోలో ఆగింది. చలపతి సీట్లో లేడు.

ఇద్దరూ మంజరి ప్రైవేట్ రూంలో కొచ్చారు.

''కాఫీ - ''

''వొద్దండీ!'' అన్నాడు శర్మ.

''పోనీ, ఎనీ అదర్ డ్రింక్?''

''నో థాంక్స్!''

''అయితే కాఫీ తాగండి!''

అయిదారు నిమిషాలకల్లా, ఓ పెద్ద వెండి పళ్ళెంలో రెండు కప్పుల కాఫీ తెచ్చి బల్లమీద పెట్టింది తాయారు.

''నమస్కారం బాబయ్యగారూ! ఈ నడుమ మీరు అవుపియ్యనే అవుపియ్య కుంటిరి!'' అని పరామర్శ చేసింది తాయారు.

''అయ్య ఊళ్ళో లేడులేవే తాయారూ!''అని సమాధానం చెప్పింది మంజరి.

''నేను అట్టనే అనుకొన్నను లేరి. ఊల్లుంటే, రాకుండూరుకుంటారూ?''

తాయారు వెళ్ళాక, ''ఇలా చాలామంది నన్ను అడుగుతున్నారు శర్మాజీ! వీరందరికీ సమాధానం చెప్పలేక నేను చచ్చిపోతున్నాను'' అన్నది మంజరి.

శర్మ ఓ గుక్క తాగి, సిగరెట్ అంటించి, మరోగుక్కలో కప్పును ఖాళీ చేశాడు.

''నా కొక్కోసారి, ఏ రైలుకిందనో పడి ముక్కలు ముక్కలయిపోవాలనిపిస్తుంది శర్మగారూ!''

"ఏం తక్కువయి మేడమ్" అన్నాడు శర్మ, చిటికెనవేలితో సిగరెట్ నుసి కాల్చుతూ.

"ఏం తక్కువయిందో నాకు స్పష్టంగా తెలుసు. కానీ, నాకు తెలిసిందాన్ని నేను మాటల్లో పెట్టలేకపోతున్నాను. ఆ శక్తి నా కొచ్చినప్పుడు ముందుగా నేను చెప్పుకొనేది మీతోనే" అని ఓ నిమిషం సేపు ఆగింది మంజరి.

శర్మ అలానే ఆమెకేసి చూస్తున్నాడు.

"వసంత - వొకరకంగా నాకేమీ కాదు. కానీ, అది నాకు చెల్లెలు, నాకు కూతురు, నాకు వారసురాలు. పూర్వజన్మలో దానికి నేనో, నాకదో ఎంతో కొంత బాకీ ఉన్నాం. ఈ జన్మలో, ఆ రుణ విముక్తికోసం ఇలా కలిసిపోయామనిపిస్తుంది అప్పుడప్పుడు. ఇక రాజమణి సంగతి సరేసరి భగవంతుడు, నాకో వరంగా రాజమణిని ప్రసాదించాడని నా నమ్మకం. మేం ముగ్గురం అంతగా కలిసిమెలిసి పోయాం.... మీ దగ్గర నేను దాచుకోవలసిందేమీ లేదు శర్మగారూ! వసంతను వో ఇంటిదాన్ని చేదామనీ, అది బిడ్డలనెత్తుకొని తిరుగుతుంటే కళ్ళారా చూదామనీ నాకు చాలా కాలంగా ఉన్నది. వసంత సినిమాలకు పనికొచ్చే మనిషి కాదు. వాడెవడో మ్యూజిక్ డైరెక్టర్, దాని చెయ్యి పుచ్చుకు గీరాడుట. అది నలుగురిలోనూ వాణ్ణి ఎడాపెడా తిట్టిందిట. నా ముఖం చూసి వసంతను అతగాడేమీ అనలేకపోయా డనుకోండి! ఇలాంటి పిచ్చికొయ్య, ఈ ఫీల్డులో పైకొస్తుందంటారా మరి! ఒక్కనాటికీ నేన్నమ్మను... నా సంగతి వేరు. ఇష్టమున్నా లేకపోయినా, ఈ కూపంలోంచి బయటపడలేను. ఆయువున్నంత కాలం ఇందులోనే చావాలి. మరో తరుణోపాయం లేదు. మరి - మీ అభిప్రాయమేమిటో చెప్పండి" అన్నది మంజరి.

"ఏ విషయంలో?" అన్నాడు శర్మ.

"వసంతకు పెళ్ళి - "

"తప్పకుండా చెయ్యండి!" అన్నాడు శర్మ, కాళ్ళూపుతూ.

"వసంతను చేసుకోవడానికి, కో అంటే కోటి మంది దూకుతారు. దాన్ని మూడేసి సార్లు బంగారంతో తూచగలిగిన వాళ్ళు, పెద్ద పెద్ద ఉద్యోగస్తులూ వస్తారు. కానీ- దానికీ వ్యవహారాలేమీ నచ్చినట్లు కనిపించడంలేదు శర్మాజీ! మా రాజమణి నడిగితే, అది మీ పేరు చెబుతున్నది. నాతో కన్నా మా రాజక్కతో వసంతకు చనువు జాస్తి గదా మరి! రాజక్కయ్యామాట అన్నదంటే అది నిజమే అయి ఉండాలే!"

కాసేపు విని, శర్మ సన్నగా నవ్వారు.

"మీకైనా కులాల పట్టింపులున్నాయనుకోను... అయినా, మీ దరిద్రాన్ని చూసి, మిమ్మల్ని దూరంగా తోసిన మీ కులం మా దగ్గరున్న డబ్బును చూసి, దగ్గరకు జరుగుతుంది శర్మగారూ! ఈ రోజుల్లో కులం లేకపోయినా బతకొచ్చుగానీ, డబ్బు లేకపోతే బతకలేరు. నాకేపాటి ఆస్తిపాస్తులున్నాయో మీకు తెలిసిందే! పెళ్ళి సమయంలో సగం వసంతకూ దాని భర్తకూ కలిపి రాసిస్తాను. నా తదనంతరం మిగిలిన సగం, వసంత

పిల్లలకు గానీ, అప్పటికీ పిల్లలు లేకపోతే, సగంలో సగం ఓ అనాధశరణాలయానికీ, మిగిలిన సగభాగం ఏదన్నా విద్యాలయానికీ రాసిపడేస్తాను. ఏ కారణం చేతనన్నా వసంతా, దాని భర్తా విడిపోవలసి వస్తే వారికిచ్చిన ఆస్తిలో చెరి సగం, పంచుకొని విడిపోవాలన్న షరతు కూడా చేరుస్తాను.''

''మీరిలా ఇప్పుడే అంపకాలు చేస్తున్నారేమిటి?'' అన్నాడు శర్మ. ''ఏం లేదు శర్మాజీ! అన్ని రోజులూ మనవి గావు. ఎప్పుడు ఏం జరుగుతుందో మనం చెప్పలేము. ఆరోగ్యం బాగా ఉన్నప్పుడే ముద్దూ ముచ్చటా తీర్చుకోవాలనిపించింది... ఇవ్వాళ ఈ స్థితిలో మనం ఉన్నాం. రేపిదే వేళకు ఏం జరుగుతుందో మనం ఊహించలేం. మీరుండక పోవచ్చు. హఠాత్తుగా గుండె పోటొచ్చి నేనే దాటిపోవచ్చు. ఏ భూకంపమో వొచ్చి, ఈ మహాభవనమంతా ధ్వంసం కావచ్చు. చెప్పలేం!'' అన్నది మంజరి.

తలుపు కొద్దిగా తెరచి, ఎవరో లోపలకు తొంగి చూసి, ఠక్కున తలుపు మళ్లా నొక్కారు.

''ఎవరది?''

తలుపు వెనక గాజులు కదిలిన చప్పుడయింది.

''రావమ్మా వసూ! ఇక్కడ పరాయి వారెవ్వరూ లేరు.''

వసంత తలవంచుకొని లోపలికొచ్చింది. శర్మకేసి తిరిగి ఏదో అనబోయి, మానేసి ''నమస్కారం'' అని కూచున్నది.

''నా ప్రాణాలు, ఈ శర్మకోసం నిలువునా తోడేశావు వసంతా! అదేదో కథలో చెబుతారే - ఫలానా రాజకుమారుడు, సప్తసముద్రాల కవతల, కాకులు దూరని కారడవుల్లో, చీమలు దూరని చిట్టడవుల్లో, ఊడల మర్రితొర్రలో, గండభేరుండపక్షి... ఆ తర్వాత జ్ఞాపకం లేదు. నాకు - అక్కడిదాకా వెళ్ళి తీసుకొచ్చాను'' అన్నది మంజరి.

వసంత, అక్కకేసి వోసారి చూసి, శర్మవేపు తిరిగి నవ్వి తలొంచుకొన్నది.

''ఈ మధ్య ఇటుకేసి రావడమే లేదు...'' అన్నది చెరుకుగా.

''దాదాపు అయిదారు నెల్లనుండి ఈ పుణ్య పురుషుడు మనింటికి రావడం లేదు వసూ! ఎందుకు రావడం లేదంటే పలకడు. అదేమిటయ్యా అంటే, 'ఆ కారణాలు మీకు చెప్పేవి కాదులెండి'' అన్నాడు. సరే, ఆ పనేమిటో మా అమ్మాయే చూసుకొంటుందని నిన్ను పిలిపించాను. పిల్లా! ఇదీ సంగతి. నానా చెరలూ పడి, ఈయన్ను పట్టుకొచ్చి నీకొప్పగించాను. మళ్ళీ పారిపొయ్యాడంటే, వెదుక్కు రావడం నా వల్లకాదు. కాళ్ళకు సంకెళ్ళే వేస్తావో, గదిలో పెట్టి తాళాలే బిగిస్తావో నీ యిష్టం.'' అన్నది మంజరి.

శర్మ ముఖం విప్పారింది. అతని కళ్ళు వింత కాంతితో మిలమిలలాడసాగాయి, సిగ్గుతో పెదవులు తడిచేసుకొంటున్నాడు.

''అల్లాగా - అంత అమాయకంగా ముఖం పెట్టే, మా వసంతను మైదు చేసి ఉంటారు శర్మాజీ మీరు... మా పిచ్చిదేమన్నా అనుకొని పోతుందని గానీ, లేకపోతే, ఆ రెండు మగ్గులూ అలా పిండేసి, బూరెలొండి పెట్టేదాన్ని.''

"బూరె లొండటం నాకూ చాతవుతుంది" అన్నది వసంత.

"అంటే - ముగ్గులు పిండటం కూడానన్నమాట" అన్నది మంజరి నవ్వుతూ.

శర్మ అప్రయత్నంగా తన రెండు చెంపలనూ అరచేతుల్లో దాచుకొన్నాడు.

"శర్మగారు ఇక్కడే భోంచేస్తారు వసూ! ఇవ్వాళేదో సినిమాకు పోతానన్నావు కదూ! టైముంటే మాటినీకే వెళ్లండి... నీ కారింకా రిపేరయి రాలేదనుకొంటాను. క్రిజ్లర్ నాకుంచు, ప్లిమత్ నువ్వు పట్టుకుపో - శర్మగారు ప్యూర్లీ వెజిటేరియన్... అదేదో చూసి..."

వసంత లేచి నిలబడింది. శర్మ ఇంకా కూచునే ఉన్నాడు.

"రండి" అన్నట్లు సైగచేసింది వసంత.

మంజరి తనను గమనిస్తున్నదీ, లేనిదీ వోసారి చూశాడు శర్మ. ఆవిడేదో పేపరు చదువుకొంటున్నది. శర్మ మెల్లగా లేచి, నాలుగడుగులు వేశాడు. వసంత అతనికి తగిలేంత దగ్గరగా వచ్చి "నన్ను మరచిపోయారా?" అన్నది మెల్లిగా.

శర్మ, ఆవిడ ముజేయి పట్టుకొని మెత్తగా నొక్కాడు.

వసంత బుంగమూతి పెట్టి విదిలించి పారేసింది.

"కోపమా?" అన్నాడు శర్మ ఆవిడ చెవిలో.

"ఊఁ పోదురూ... పాపమనీ, నేను చెప్పను."

అన్నదే గానీ, శర్మ చెయ్యి పట్టుకొని, గబగబా ఆ గదిలోంచి బయటికి లాక్కుపోయింది.

వారుపోయాక, పొర్లి పొర్లి నవ్వింది మంజరి. ఒక దశలో ఆవిడకు గుండెలు డెక్కు పడతాయని కూడా అనిపించింది. కిందికి ఫోను చేసి, చలపతిని పిలిపించింది.

అతను వస్తూనే, నేలనంటి సలాములు చేసుకొంటూ వచ్చాడు. మంజరికి, అల్లంత దూరంలో చేతులు కట్టుకొని నిలబడ్డాడు.

"ఏమిటీ అభినయమంతా?" అన్నది మంజరి, కాస్త ఆశ్చర్యపడ్డట్లు ముఖం పెట్టి ప్రపంచంలో, ఇక ముందు కూడా నీకు 'అసాధ్యం' అన్నది లేనేలేదు. నీ ముఖం చూడకపోవడమే కాదు. నువ్వున్న వీధిలోకి కూడా అడుగు పెట్టనన్నాడు శర్మ అంతగా అవసరమొస్తే, ఏ బండికిందనో పడి చస్తానుగానీ, మంజరిని చూడటమనేది మాత్రం అబ్ధమని స్పష్టంగా చెప్పాడు."

"నాతోనూ చెప్పాడు" అన్నది మంజరి.

"చెప్పినవాడు ఎలా వచ్చాడుట మరి?" అన్నాడు చలపి.

"ఆ సంగతి శర్మనే అడుగు" అన్నది మంజరి.

చలపతి ఓ నిమిషం ఆలోచించి తల అడ్డంగా తిప్పాడు.

"లాభం లేదు. శర్మగారి నడిగినా, అతను చెప్పడు, చెప్పలేడు. ఎందుకంటే, ఎక్కడినుండీ తల పట్టుదల ప్రతిజ్ఞ, బీటలు తీశాయో, అతనిప్పుడు గుర్తించలేడు. అతనొక్క మాయా ప్రపంచంలో ముంచి నిద్రపుచ్చి ఉంటావు. ఏమంటాడు ఇన్నిటికీ?"

"నిద్ర పుచ్చానంటున్నావు గదా! అతన్ని మేలుకోనివ్వు మరి!" అన్నది మంజరి. "ఇప్పుడే

అతనూ, వసంతా అలా వెళ్ళారు. బహుశా సినిమాకుగానీ పోతారేమో నాకు తెలీదు.''

''మన ప్లానంతా చెప్పావా?'' అన్నాడు చలపతి ఆత్రుతగా.

''మన ప్లానా? అంటే?'' అని క్షణం ఆలోచించి, అప్పుడే ఆలోచన వచ్చిన దానిలాగా, భుజాలు కుదుపుకొన్నది మంజరి. ''నువ్వన్ని చోట్లా ఇలాగానే అంటున్నావా చలపతీ?''

ఇందులో ఉన్న తప్పేమిటో చలపతికి తట్టలేదు. వెర్రి మొఖం వేసుకొని మంజరివేపు చూశాడు.

''ఇది మన ప్లాను కాదు. నీ ప్లాను. అంటే! నా అంతట నేను ఫారిన్ టూర్ కోసం ప్రయత్నిస్తున్నానని తెలియకూడదు'' అన్నది మంజరి.

''ఇలాంటి భారీ యత్నాలు ఇంకో కంటివాడికి తెలియకుండా దాచడం అసంభవం!'' అన్నాడు చలపతి.

''నీకెలా అర్థమవుతుందో నాకు తెలీడం లేదు చలపతీ!'' అని నిట్టూర్చింది మంజరి. ''చేసేది నీవూ, ఆ శర్మగాడూ; కలిసి చేయండి. నీకు సాయంగా ఉండాలనేగదా, వాణ్ణి పనిమాలా తీసుకొచ్చి ఇక్కడ పడేసింది! రంగంమీద నేనెక్కడా కనిపించకూడదు. ఇదేదో నాకు తెలియకుండా, అంతా ఎవరెవరో కలిసి ఏర్పాటు చేసినట్లూ, నేను కాదనలేక ఇందుకు వొప్పేసుకొన్నట్లూ బయటివారికి బోధపడాలి. అంతేగానీ - ఆ దగ్గర నుండి హక్షలవరకూ, అన్నీ నేనే స్వయంగా చేసుకొన్నానని తెలిస్తే అప్పుడింత గ్లామర్ ఉండదు.''

''అవును'' అన్నాడు చలపతి.

''మనకిక ఎక్కువ టైం లేదు. పని త్వరగా ప్రారంభించాలి.... అరె... అదేమిటి చలపతీ! ఏమిటలా చూస్తున్నావ్?'' అన్నది మంజరి నవ్వుతూ.

''నేను ఎంత దాచుకొందామన్నా దాచుకోలేకపోయాను మంజూ! ఈ రోజున నువ్వెంత అందంగా ఉన్నావంటే, అలా నీవేపు చూస్తూ ప్రాణాలు వొదిలేయాలనిపిస్తోంది'' అన్నాడు చలపతి.

ఏమనుకొన్నదో ఏమోగానీ, మంజరి లేచి, అతని దగ్గరగా వచ్చి చెయ్యి ముద్దు పెట్టుకొన్నది.

''అతి చనువు వల్లనేమో, నేను మీ పట్ల చాలా దురుసుగా ప్రవర్తించాను. అది తలుచుకొని ఆ తరువాత, నేనెంతకాలం గుండెలు వచ్చిపోయేలాగా ఏడ్చావో ఆ భగవంతునికి తెలుసు... అమ్మా... ఇప్పుడు కాదు... నన్నొదులు...'' అన్నది మంజరి.

చలపతి బుసలుకొడుతూ ఆమె చేతిని విడిచిపెట్టాడు.

# 26

రెండు మూడు రోజులపాటు శర్మగారు అయిపూ ఆనమాలూ లేడు. వసంత కూడా పత్తా లేకుండా పోయింది.

"వాళ్ళేమయ్యారు?" అని మంజరి అడగనూ లేదు; రాజమణి సమాధానం చెప్పనూ లేదు.

అది ముందుగా ఇద్దరూ అనుకొని చేసిందే!

ఎప్పటికప్పుడు వసంత నుండి సమాచారం అందుతూనే ఉంది. ఆ సమాచారాన్ని ఆధారం చేసుకొని, మంజరి తగిన సూచనలు పంపుతూనే ఉంది.

ఒకసారి వసంత మాట్లాడుతూ మాట్లాడుతూ "వారూ నేనూ ఇప్పుడే పోట్లాడుకొన్నాం. ఆయన అలిగి అలా వెళ్ళిపోయారు" అన్నది ఫోన్‌లో.

మంజరికి ప్రాణాలు పోయినంత పనైంది. ఆవిడ ముఖంలో గోటిగాటుకు నెత్తురు చుక్కలేదు. పొడారిపోయిన పెదవులను, మెల్లగా స్వాధీనంలోకి తెచ్చుకొని-

"అదేం వసూ! ఎందుకలా చేశావమ్మా?" అని మాత్రం అనగలిగింది మంజరి.

"నేనెంత రాజీపడదామన్నా ఆయన తన పట్టుదలే నెగ్గాలని కూచున్నాడు. నేను వల్లకాదంటే కాదన్నాను...."

మంజరి సన్నగా నిట్టూర్చి, కుర్చీకి చేరగిలపడిపోయింది. ఆవిడ కళ్లు నీటితో నిండిపోయాయి. తనెన్నో ఆలోచించి, ఎంత దూరమో ఆలోచించి, ఆ శర్మను పిలుచుకొచ్చింది. ఆమె తోడు చేసి, ఆమె 'సేద' దీర్చమన్నది. ఈ పిచ్చిముండ అంకెకొస్తున్న మనిషిని అదలించి దూరం వెళ్ళగొట్టింది! మళ్ళా ఆ గొడ్డును కళ్ళంలోకి లాక్కురావడ ఎమంటే మాటలా? "అసలేం జరిగింది వసూ? ఎందుకలా తొందరపడ్డావమ్మా? నేనన్ని సంగతులూ నీకు ముందుగా చెప్పాను గదా! చేతులారా నోటి దగ్గర కొచ్చిన ఫలితాన్ని మట్టిపాలు..."

అవతల నుండి వసంత నవ్వు వినిపించి మరీ మండిపోయింది మంజరి.

"ఎందుకలా బెంబేలు పడిపోతావక్కా! శర్మను ఎంతగా వంగదీశానంటే - ఇంతకు ముందే వాడు నా శాండిల్స్ పట్టుకెళ్ళి పాలిష్ చేయించుకొచ్చాడు."

"మరి -;" అన్నది మంజరి.

"వచ్చే మాసంలో మంచిలగ్నాలున్నాయి గదా! మేం పెళ్ళి చేసుకోబోతున్నాం. రిజిష్టర్ మారేజ్‌కి ఆయన వొప్పుకోలేదు. నాకంతకన్నా ఇష్టంలేదు. మామూలు పెళ్ళి చేసుకొంటాం. అడయార్‌లో ఉన్న బిల్డింగ్ మా భాగం కింద నిన్నడిగి తీసుకొని అందులో మా కాపురం పెడతామన్నమాట! వారేమో, ఇప్పటి పత్రికను వారపత్రికగా మార్చేసి, నడుపుతారు. నేను వారికి అన్ని విషయములలోనూ సహధర్మచారిణిగా ప్రవర్తించి, భారతనారీ ప్రపంచమునకు ఆదర్శ మహిళనై... అదుగో వారొస్తున్నారు. పెట్టేయనా?"

"ఇద్దరు వోసారి రండి," అన్నది మంజరి.

ఆమె తలంతా నాడుతో నిండిపోయింది. కణతలు కటకటలాడిపోతున్నాయి. శరీరం, ఎముక వెన్నెముక మధ్యనా, సన్నని నొప్పితో విలవిల లాడుతోంది. ఎంత ఆపుకొందామన్నా ఆగకుండా, ఉప్పని నీరు నోట ఊరుతున్నది.

ఈ చిహ్నాల పర్యవసానం తనకు తెలుసు. అప్పుడెప్పుడో తన కిలాగే జరిగితే- కళ్యాణి దగ్గరుండి తనకు 'చికిత్స' చేయించింది. ఇప్పుడు మళ్ళా ఆ 'ఉపద్రవం' దాపరించింది. దీన్ని తను ఆదిలోనే తెంచుకోవాలి. తీరా నెత్తిమీదికొచ్చాక తను చేయగలిగిందేమీ లేదు. డాక్టర్నడిగితే అవే బిళ్ళలు వాడమంటాడు. తను వాడుతూనే ఉంది, కానీ - ఫలితమేదీ మరి?

దీనికి తోడు, చలపతిగాడు మరీ రెచ్చిపోతున్నాడు. అదను చూచి నొక్కిపారేసే తుచ్చగుణమంటే ఏమిటో, అదెలా మనుషుల్ని రాక్షసులకింద మారుస్తుందో ఈ చలపతిని చూస్తే బోధపడుతుంది. మొన్న మొన్నటి వరకూ తను కూచోమన్నా కూచోవడానికి భయపడ్డ మనిషి- కళ్యాణి చావడంతో, దగ్గరకు జరిగాడు. తనే జరగనిచ్చింది. ఈ అంతర్జాతీయ ఫిలిం ఉత్సవాల గొడవలో వాడికిక పట్టపగ్గాలు లేకుండాపోయాయి. వాటి సాయం లేకుండా, తనీపోటీలో గెలవడం అసంభవం! చలపతిని సాయం చెయ్యమనడమంటే - వాడడిగిన షరతులన్నింటికీ వొప్పుకోవడమన్న మాటే!

"ఎవరది?" అన్నది మంజరి, తలుపుదగ్గర అడుగుల చప్పుడు విని.

"నేనే!" అంటూ లోపలికొచ్చాడు చలపతి. "అలా ఉన్నావేం?" అని పలకరించాడు మంజరిని.

"ఎలా?"

"బాగా డస్సినట్టు కనిపిస్తున్నావేం?"

మంజరి నవ్వింది.

"ఎందుకు డస్సిపోయిందీ నీకు తెలీదా? లేకపోతే, నా నోటి మీదుగా చెప్పించాలనా?" అన్నది మంజరి.

చలపతి, ఆమె పక్కనే కూచున్నాడు. మంజరి, అతని భుజం మీద తల ఆనించింది!

"ఈ గొడవలన్నీ వొదులుకొని, మనుషుల్లేని ఏ మహారణ్యంలోకో వెళ్ళిపోదామని ఉంది చలపతీ!" అన్నది మంజరి.

"పద, నేనూ వస్తాను" అన్నాడు చలపతి, ఆమె ముంగురుల్ని మెల్లిగా పక్కలకు సర్దుతూ.

"వొద్దు చాలూ, వొద్దు. అక్కడా మీరే అయితే, నేనసలు అక్కడదాకా పోవడం మాత్రం ఎందుకట?" అన్నదావిడ ఆవలిస్తూ.

"నిద్ర చాల్లేదనుకొంటాను... పోనీ, నువ్వు కాస్సేపు కళ్ళు మూసుకో. నేను మళ్ళా వస్తాను, పెద్దగా చూడవలసిన ఉత్తరాలు కూడా లేవు."

"సగం నిద్రను నువ్వు పాడు చేశావు... మిగతా సగం నిద్రనూ ఆ జ్ఞాపకాలు పాడు చేశాయి... నువ్వు వెళ్ళబోకు, ఒంటరిగా ఉండేందుకు మరీ భయంగా ఉన్నది. మనుషుల మధ్యనయితేనేదో ధోరణిలో పడి కొట్టుకుపోతాం" అన్నది మంజరి.

"ఇలాంటి దానివి, మనుష్యుల్లేని మహారణ్యాల్లో ఎలా ఉంటావమ్మా?"

"ఉండను. ఉండలేను చలపతీ!" అన్నది మంజరి, తన బరువంతా అతనిమీద ఆన్చుతూ, "అలా ఉండలేవన్న సంగతి నీకూ తెలుసు, అందుకే నువ్వూ వొస్తానన్నావు" అని క్షణకాలమాగి, "నాగురించి నీకన్ని సంగతులూ తెలుసుగదూ చలపతీ" అన్నదావిడ.

చలపతి పలుకలేదు.

ఆవిడ తలను గుండెలకొత్తుకొని 'పిచ్చిపిల్ల' అనుకొన్నాడు లోపల.

మంజరి కళ్ళుమూసుకొనే ఉంది.

"నాటకాల్లో అందిన వేషాలన్నీ వేస్తూ, రంగులన్నా కడుక్కోకుండా, పరదాల చాటున నిద్రపోయిన సందర్భాలున్నాయి- ఈ రోజున ఎంత హీనంగా చూసుకొన్నా - లక్షలకు సరిపడా ఉన్నది నాకు. ఈ మధ్య కాలంలోని ప్రయాణమంతా, నీ భుజాలెక్కి చేశాను - నువ్వే లేకపోతే, మేయి ఉందునో ఊహించడానికే భయమేస్తోంది చలపతీ!"

"నేనున్నాను గదా! 'లేకపోతే' అన్న ప్రశ్నకే అవకాశంలేదు. అయినా ఇంకో సంగతి కూడా ఉన్నది మంజూ! ఒకరి అదృష్టానికి ఇంకొకరెప్పుడూ కర్తలు కారు. నువ్వు పైకి రాగలిగిన మనిషివి. తప్పకుండా పైకి పోతవు. నేను గాకపోతే, ఇంకో పుల్లాయెవడో వస్తాడు- అంతే!" అన్నాడు చలపతి.

మంజరి చాలా సేపు మాట్లాడలేదు.

"నేను- నాకు - ఫారెన్ వెళ్ళే అవకాశం ఉంటుందంటావా చలపతీ?" అన్నది మంజరి".

"తప్పకుండా వెడతావు. నేను నిన్ననే పరబ్రహ్మశాస్త్రిగారిని కలుసుకొన్నాను. మన ప్రయత్నాలేమవుతున్నాయని అడిగాను."

"ఏమన్నారు?" అన్నది మంజరి, కళ్ళు మూసుకునే.

"ఆయనగారు పక్కా రెండు గంటల సేపు చక్రాలు వేసి చూశాడు మంజూ! భవిష్యత్తు స్పష్టంగా తేలడం లేదనీ, ప్రయత్నం వల్ల కార్యం సానుకూల పడవచ్చుననీ చెప్పారు. తిరుపతి వెంకన్నకూ, సాయిబాబాకు మొక్కుకోమన్నాడు. పూజ దగ్గర కుంకుమ, అక్షింతలూ నీకిమ్మని పొట్లం గట్టిచ్చాడు!"

"ఒక పని ఏదో వొక వొడ్డున పడితే తప్ప, అటూ ఇటూ కాకుండా ఉంటే నాకు మహా చిరాకు. కప్పల తక్కెడ తంతు నాకు బొత్తిగా గిట్టదు చలపతీ! ఆ అవకాశం వస్తే సరే- రాదని స్పష్టంగా తేలినా సంతోషమే! కానీ ఇలా మధ్యలో ఇరుక్కొని మల్లగుల్లాలు పడటమంటే, నాకు అరికాలు మంట నెత్తికెక్కుతుంది!"

"అసలు మనమింకా ఏ ప్రయత్నమూ చెయ్యనే లేదు" అన్నాడు చలపతి.

"నీ ముఖం!" "ఏ నాడో ప్రారంభమయిందిరా నా తండ్రీ! ఇదంతా అందులోని భాగమేరా నాయనా!" అనుకొన్నదావిడ.

"అవును, ఇంకా ప్రారంభం కాలేదు. ఏమవుతుందోనని నేనెంత బెంగపడుతున్నానో చలపతీ!" అన్నది పైకి.

చలపతి ఏదో అనబోయాడు. తలుపు తోసుకొని వసంతా, శర్మా వచ్చారు. మంజరి చప్పున అల్లంత దూరానికి జరిగి కూచుంది.

"ఏం శర్మాజీ, అలా ఉన్నారేం?" అని కుశలమడిగింది మంజరి.

"మీ వసంత నన్ను తినేస్తోంది మేడమ్! తినడమంటే- అక్షరాలా - తి-న-డ-మే! ఇలాంటి దయ్యాన్ని నా మెడకు అంటగట్టడం కన్నా అన్యాయం మరోటుండదు" అన్నాడు శర్మ.

"అయితే- నీకు తగిన శిక్ష ఎన్నిక చేశానంటావు" అన్నది మంజరి.

వసంత అటూ ఇటూ చూచి, శర్మను మోచేత్తో సున్నితంగా పొడిచింది. శర్మ ఇంకోసారి మతిపోగొట్టుకొన్నాడు.

చలపతి పదినిమిషాలకన్నా వాతావరణాన్ని మార్చేశాడు.

"చెప్పండి?" అన్నాడు శర్మ.

"ఇందులో ఒకళ్ళు చెప్పేవాళ్ళు, ఇంకొకళ్ళు చేసేవాళ్లూ అంటూ లేరు. ఇదివరకు సంగతి ఏమయినా, ఇప్పుడిదొక కుటుంబ సమస్య కిందకు వొచ్చింది. మనం మంజరిని విదేశాలకు పంపించగలమా, లేదా అన్నదే ఇప్పుడు ముఖ్యం!" అన్నాడు చలపతి.

శర్మ చాలాసేపు ఆలోచించి, "చేయగలమనుకొంటాను" అన్నాడు.

"ఎలా?" అన్నాడు చలపతి.

"ఏ దేశం వెళ్ళాలనుకొంటున్నామో, ఆ దేశపు రాయబారి కార్యాలయంతో మనకు మంచి సంబంధాలుండాలి. వారు మన పేరును తమ ప్రభుత్వానికి సిఫారస్ చేయాలి" అన్నాడు శర్మ.

"మనకా వ్యవహారాలన్నీ తెలియవే!" అన్నాడు చలపతి.

"తెలియవలసిన అవసరం లేదు. మంజరిగారికి బొంబాయిలోని ప్రొడ్యూసర్లు, డిస్ట్రిబ్యూటర్లు చాలా మంది తెలుసు. ఫిలిం ఫైనాన్సర్స్ చాలా మందికి రాజకీయ నాయకులతో పరిచయాలుంటాయి. కాస్త పేరు, ప్రతిష్టలున్న పార్లమెంటు మెంబర్లను పట్టుకొని పని జరుపుకోవచ్చు, లేదా- చాలా దేశాల తాలూకు కాన్సులేట్లు- మద్రాసులో కూడా ఉన్నాయి. ఇక్కడీ కాన్సులేట్ జనరల్ ద్వారా ప్రయత్నం చేయవచ్చు."

మంజరి ముఖం విప్పారింది.

"ఇక్కడివాళ్ళు మీకెవరన్నా తెలుసా శర్మాజీ?" అన్నది మంజరి మామూలుగా.

"తెలుసుననుకోండి; అయితే ఆ పరిచయాలు, ఇలాంటి పనులు సాధించడానికి చాలవు మేడమ్! ఇలాంటి వ్యవహారాల్లో, మనం ఎంతో జాగ్రత్తగా ఉండాలి. విషయం అతి రహస్యంగా ఉంచడం చాలదు. మన ప్రతి అడుగునూ ఆచి తూచి వేయాలి. ఎక్కడ బెసికినా మొత్తం వ్యవహారం కుప్పకూలిపోతుంది. అందుకని మీరు ప్రయత్నించండి" అన్నాడు శర్మ.

"ఓసారి కాన్సులేట్ జనరల్ ఇంటికి పోయి వద్దాం. కొంతవరకూ-"

"సరే, ఏదో ఆలోచిద్దాం!" అన్నాడు శర్మ, వాక్యాన్ని మధ్యలోనే తుంచి వేస్తూ.

ఓ క్షణం శర్మకేసి చూసి, తల పంకించింది మంజరి.

''ఏం వసూ! నీకిదంతా అడివి మేళంలాగా ఉన్నది గదూ?-''

''మరే!'' అన్నది వసంత.

''వేళయింది గదా! అన్నానికి లేవరాదా?'' అన్నది మంజరి చలపతి కేసి చూస్తూ.

తను లేచాడు. వసంతా లేచి నిలబడింది.

''నాకిప్పుడవసరంలేదు, నేను తరవాత చేస్తాను'' అన్నాడు శర్మ.

వారు వెళ్ళిపోయాక -

''చెప్పండి!'' అన్నది మంజరి.

''ఇవన్నీ డొంకతిరుగుడు వ్యవహారాలు మేడమ్! ఇంతలో తేలేవీ పెట్టేవీ గావు. మనం సిన్సియర్‌గా చేయదలచుకొన్నప్పుడు ఇంతకన్నా దగ్గర దోవ ఉన్నదేమో చూడాలి'' అన్నాడు శర్మ.

''అదేదో నాకు తెలియదు. దీని బరువూ, భారమూ మీ మీద పెడుతున్నాను శర్మగారూ! గెలిచినా వోడినా మీరే బాధ్యులు'' అన్నది మంజరి.

శర్మ కాస్సేపు ఆలోచించాడు, కింద పెదవి కొరుక్కుంటూ, అతని కళ్ళిప్పుడు కాంతితో నిండిపోయాయి.

''భగవంతుని మీద భారం వేసి, ఇంకోపని చేదాం... ఇంతకన్నా మంచి పద్ధతి నాకు తోచటంలేదు...'' అన్నాడు శర్మ, సిగరెట్ పెదవుల మధ్యనుంచుకొని.

మంజరి, లైటర్‌తో అతని సిగరెట్ వెలిగించింది.

''ఏమిటంటే-''

అని ప్రారంభించాడు శర్మ.

మంజరి గడ్డంకింద రెండు చేతులు పెట్టుకొని వినసాగింది.

''దేశ దేశాలనుండి వచ్చే ప్రతినిధులకు వసతి సౌకార్యలు చాలా భారీ ఎత్తున ఉండాలి. అందరికీ ఒచే చోట వసతులు చూపించడం సాధ్యమయ్యే పనికాదు... మనం పోదలుచుకున్న దేశం తాలూకు ప్రతినిధి వర్గానికి మనింట్లో ఆతిథ్యమిద్దాం. అలా చెయ్యడానికి ముందు- మనం ఇక్కడి కాన్సులేటు జనరల్‌ను కూడా సంప్రదించాలి. అవసరమయితే ఆ వారం రోజులూ అతను కూడా మనతో బాటే ఉంటాడు. ఈ లోగా మనం అతన్ని కలుసుకొని మాట్లాడుదాం. మరోసారి బొంబాయి నుండి ఎవరెవరు వస్తున్నారో కనుక్కోండి. ప్రెస్‌వారితో మనకు ఆచలా పనులున్నాయి. ప్రెస్ కరస్పాండెంట్సుకు మనం హొస్టుగా ఉండగలిగితే- ఇంకా బావుండును. కానీ, అది సాధ్యమవుతుందనుకోను. మనం ఈ ఉద్దేశంతో ఈ పనులన్నీ చేస్తున్నామని ఇంకెవ్వరికీ తెలియకూడదు. చాలా పనులు పూర్తయిందాకా ఇంకో ప్రాణికి తెలియకపోవడం అవసరం. మీకు ఈ సంగతులన్నీ తెలియనివి గావు'' అన్నాడు వర్మ.

మంజరి లేచి నిలబడింది. శర్మా లేచాడు. ఆవిడ రెండడుగుల్లో శర్మను కలుసుకొని,

అతని చెంపలను అరచేతులతో రాసి, మెటికలు విరుచుకొన్నది. ఎనిమిది వేళ్ళూ చిటపటమంటూ విరిగాయి. అలాగే అతని తలను దగ్గరకు తీసుకొని, ''ఢక్కి' ఇచ్చింది మంజరి.

''నిన్ను చూస్తే అమాంతం కొరుక్కు తిందామనిపిస్తున్నది శర్మా! ఇంత చిన్న తలకాయలో ఇన్ని ఆలోచనలెలా పుడుతున్నాయో నాకు బోధపడకుండా ఉన్నది. ఇన్ని రోజులనుండి నాకీ వ్యవహారం శుద్ధ అయోమయంగా ఉన్నది. ఓ దారీ డొంకా కనిపించింది కాదు. నేను బొంబాయి పోలేను; ఢిల్లీ అంతకన్నా పోలేను. మనం చెయ్యగలిగిందేదో ఇక్కడే వుండి చేద్దాం... సాయంత్రం కాన్సులేటు జనరల్‌ను కలుసుకుందామా?'' అన్నది మంజరి.

''ముందుగా అడిగి చూడాలి. వాళ్ళకు లక్ష పనులుంటాయి.''

''అయితే చూడు మరి!''

శర్మ ఫోన్ చేసి కనుక్కొన్నాడు.

''ఈ రోజు తీరదన్నాడు. రేపు ఉదయం ఇంటి దగ్గర కలుసుకోమన్నాడు.''

''ఎక్కువ టైం లేదు''అని చప్పరించేసింది మంజరి.

''ఈ లోగా మనకేమీ పనిలేనట్లు మాట్లాడతావేం మేడమ్! నా పత్రికకు మేటర్ రాసి ప్రెస్‌లో పడేస్తాను. మిగతా వాళ్ళను కూడా కలుసుకుంటాను. మీరు శ్రీనివాస్‌కు ఫోన్ చేసి, అరేంజిమెంట్స్ ఎలా జరుగుతున్నాయో కనుక్కోండి. అతను రిసెప్షన్ కమిటీకి సెక్రెటరీ అనుకొంటాను...''

మంజరి అతన్ని ఇంకోసారి నిలువునా చూసి, పళ్ళు పటపట లాడించింది నవ్వుతూ.

''నువ్వు మా వసంతకు భర్తవయిపోయావుగానీ శర్మాజీ, లేకపోతే ఎప్పుడో నిన్ను-''

''ఆ పని మా వసంత చేస్తున్నది లెండి! ఇంకా మీ రెందుకు?'' అన్నాడు శర్మ.

''మా వసంత'' అని శర్మగారన్న మాటనే ఇంకోసారి లోలోపల అనుకొని నవ్వుకొన్నది మంజరి.

''నీలాంటివాడు నూటికి కోటికి ఒక్కడు కూడా ఉండడు శర్మాజీ! ఈసినిమా పరిశ్రమ నాకేమిచ్చినా ఇవ్వకపోయినా మీలాంటి ఉత్తములైన స్నేహితులను నాకిచ్చింది. అదే పదివేలు'' అన్నది మంజరి.

శర్మ ముఖం విప్పారింది.

❦❦❦❦❦❦❦❦

మంజరి అంచనాలు అక్షరాలా సరిపోయాయి. ఆవిడ, చాలా కాలంగా కంటున్న కలలకు వాస్తవిక రూపాన్నివ్వగలిగింది. మంజరి నాస్తికురాలు కాదు. ఆవిడకు దేవుడితోనూ అతనిశక్తి సామర్థ్యాలతోనూ ఏనాడూ పేచీ లేదు. అలాగని చేతులు ముడుచుకూచోవడం, ఆవిడ స్వభావానికే విరుద్ధం. భగవంతుడు ఉపకారం చెయ్యాలనుకొన్నా, సోమరిపోతులకు చేయడని ఆవిడ నమ్మకం.

''నా జాతకమే అలాంటిది! చివరి నిమిషందాకా చిత్రవధ జరిగితే తప్ప, నా కపనులూ కావు'' అన్నదొకసారి.

ఆ చిత్రవధ ఆవిడతోనే పోదు. ఆవిడ చుట్టూ ఉన్నవారు కూడా అనుభవించాలి. ఈ మధ్యలో అడ్డంకు మీద అడ్డంకు ఇసక పాతరకు మల్లే తవ్విన కొద్దీ వచ్చిపడుతూ ఉంటాయి. పోరుకాడినంత కాలం పోరుకాడుతుంది. ఇక వంట్లో ఉన్న ఓపిక కాస్తా అయిపోతుంది. కళ్లు మూతలు పడుతూ ఉంటాయి. కాళ్ళూ చేతులు తేలిపోతూ ఉంటాయి. ఈ నిముషమో, వచ్చే నిమిషమో, కాడి కింద పారేయక తప్పదనిపిస్తుంది. అప్పుడో అద్భుతం జరుగుతుంది. జారిపోయిన దారపు కొస చేతికి దొరుకుతుంది. కాలికింద కోసుకుపోతున్న ఇసకను బదులు, గట్టినేల తగులుతుంది. 'హమ్మయ్య' అని ఊపిరి పీల్చుకోవడానికి కాస్త జాగా దొరుకుతుంది!

చాలు!

ఆ మాత్రం వ్యవధి దొరికితే కోటలో పాగా వేయడం ఖాయమే! కానీ చాలా సందర్భాలలో తనకు ఊపిరి పీల్చుకొనే వ్యవధానం కూడా దొరకదు. రవంత వెసులుబాటు దొరుకుతుందను కొనేలోగా, మళ్ళీ పీకల దాకా కూరుకుపోవలసి వస్తున్నది. మళ్ళీ పెనుగులాట, మళ్ళీ పైకి రావడానికి ప్రయత్నాలు, మళ్ళీ వల్లమాలిన స్ట్రగుల్! చచ్చీ చెడీ వొడ్డెక్కేసరికి, ఇంకో అపాయం ఎదురుచూస్తూ ఉంటుంది! ఇలాగే బతుకంతా గడిస్తే ఇక సుఖపడేదెప్పుడు?

"నాకు సుఖమంటే ఏమిటో తోచడం లేదు. నన్ను చూసి చాలా మంది అసూయపడు తుంటారని నాకు తెలుసు. అది న్యాయం కూడాననుకొంటాను... ఒకప్పుడు నేనూ వారిలాగా అనుకొన్నదాన్నే! నేనిప్పుడు పడుతున్న బాధలు, ఇంతకు ముందు పడలేదు. ఇక ముందు రాబోవు కూడాను. డబ్బు లేకపోతే 'లేదు' అన్నదొక్కటే బాధ! కానీ డబ్బు పుష్కలంగా ఉండి, అది పెట్టే బాధను అనుభవిస్తే తప్ప, డబ్బు కూడటం ఎంత నరకమో చాలా మందికి తెలియదు. నేనా రెండు దశలూ అనుభవించాను. రెండేసి రోజులు నేను పస్తు పడుకొన్నాను. నా కళ్ళముందే, రకరకాల కూరలతో, బల్లలమీద ఆవిరిలెత్తుతున్న విస్తళ్ళను, అద్దాల తలుపులగుండా చూసి నా కడుపు మండిపోయేది. అమాంతం లోనికి దూకి, బల్లమీదివాణ్ణి కిందికి తోసి ఆ అన్నమంతా రెండు చేతులా బొక్కుదామనిపించేది! ఇప్పటి పరిస్థితితో పోల్చుకొంటే, నా బాధలో ఎంతో ఆనందమున్నదనిపిస్తోంది. నాకెదురుగా పంచభక్ష్యాలూ ఉంటాయి. వాటిని తినలేను. తింటే శరీరక లావెక్కి ఆరోగ్యం పాడయి, వేషాలకు పనికిరాను. అందుకని వాసన చూసి వొదిలేయాలి. లక్షల విలువచేసే బంగారు సొమ్ములు, డైమెండ్ నెక్లెస్‌లు ఉన్నాయి. కానీ, పెట్టుకొని బయట తిరగడానికి లేదు, 'ఎక్కడి'దని ఇన్‌కంటాక్సు వాళ్ళడుగుతారని భయం! సంపాయించకుండా ఉండేందుక్కూడా వీల్లేని దుర్దశ ఎలా ఉంటుందో, ఒక్కసారి చూద్దురుగాని రండి! ఎక్కువగా దానధర్మాలు చెయ్యమని మీరు రాశారు. కానీ అలా చేసేందుకు ప్రాణం వొప్పదు; వొప్పినా చట్టం వొప్పదు. ఇన్ని లక్షలు దానం చేయటానికి- నాకెంత సంపాదన ఉండాలో అధికారులు అంచనా కడతారు. ఆ సంపాదన మొత్తానికీ కలిపి వారు వేసే పన్నులు చెల్లించడానికి ఆ సంపాదన, ఇంకా అలాంటివి బోలెడన్ని సంపాదనలూ కావాలి... బంగారప్పంజరంలో, అజీర్తితో తీసుకోవడం కన్నా, ఆకలి కడుపుతో, నీడకోసం వెదుకుతూ, నాలుగు వీధులూ తిరగడం గొప్ప అదృష్టం! భగవంతుడు నన్నెంతగా శపించిందీ, నన్ను చూసిందాకా మీరు తెలుసుకోలేరు.

నా సంపాదన, నాకున్న డబ్బు, నా పలుకుబడి, నా ఆస్తి,, నా కీర్తి ఇవే మీకు కనిపిస్తాయి. వీటన్నింటి వెనుకనున్న వ్యక్తి పడే ఘోష మీకు తెలియదు. ఈ జాబు అందగానే మీరూ, రామచంద్రంగారూ బయలుదేరి రండి! 'టి.యంవో' పంపినందుకు అన్యథా భావించకండి! ఈ పాపిష్ఠి డబ్బు, అప్పుడప్పుడైనా ఇలాంటి సత్కార్యాలకు ఉపయోగపడకపోతే - దాన్ని భరించడం మరింత కష్టమైతుంది నాకు... ఇక్కడ అంతర్జాతీయ చలనచిత్రోత్సవాలు జరుగుతున్నాయి. దేశ దేశాల్లోని ఉత్తమ చిత్రాలు ప్రదర్శిస్తారు. మీ కోసం ప్రతిక్షణం ఎదురుచూస్తూ ఉంటాను. ఏవో ఇబ్బందులనకండి. తీరిక చేసుకోవాలనుకొంటే- దొరకనంత వత్తిడి పనులుంటాయనుకోను. తప్పకుండా రావాలి.''

కింద సంతకం చేసి, కవర్లో పెట్టి అంటించి, బల్లమీద పడేసింది మంజరి. కుర్చీకి జారగిలబడి, మెడనరాలు విరుచుకొన్నది. చేతులనూ, కాళ్ళనూ విదిలించి, బద్ధకాన్ని వొదిలించుకోవాలని ప్రయత్నించింది.

రెండు రోజులనుండీ మాధవరావుగారు రాసిన ఉత్తరానికి జవాబు రాయాలనుకొంటోంది. కానీ క్షణం తీరిక దొరకడం లేదు. ఈ రోజునసలు నాలుగు మెతుకులు తినడానికే వీలు లేకపోయింది. అడయార్‌లోని 'మంజరీ కుంజం'లో అమెరికాదేశపు ప్రతినిధులున్నారు. వారి యోగక్షేమాలన్నీ తను స్వయంగా చూడాలి. ఎక్కడా ఏ లోపమూ జరగకూడదు. బొంబాయి నుండి, కలకత్తా నుండీ నలభై తొమ్మిది మంది పత్రికా విలేకరులొచ్చారు. వారిని 'వసంత విహార్'లో ఉంచింది. అక్కడ పనులన్నీ శర్మగారూ, చలపతీ చూస్తున్నారు. పగలల్లా ఈ రెండు చోట్లకూ తిరగడంతోనూ, మీటింగులతోనూ సరిపోతోంది; రాత్రిళ్ళు-

నిన్న రాత్రి 'మంజరి కుంజం'కు తిరిగి వస్తుంటే - స్టూవర్టు అడిగాడు- ''డాన్సస్ తెలుసా?'' అని. తను 'తెలుసు' అన్నది. అయితే స్టూవర్టు ఇంకేమీ అనలేదు.

ఈ రోజు కంచి వెడదామనుకొన్నారు. కుదరలేదు. హంపిని గురించి అడిగారు ఏదో చెప్పింది. తీనా కాస్త ఈ హడావుడి తగ్గాక, ఇవన్నీ తిప్పి చూపించాలి. శర్మ ఇప్పటికప్పుడే తన వలను విసిరాడు. తన దేశపు కళాకారులు ఇంకో దేశపు కళాకారులను కలుసుకోవడం అవసరమనీ, అందువల్ల ఫిలిం పరిశ్రమను గురించి అవగాహన విశాలమవుతుందనీ, కొందరు విదేశీ ఆర్టిస్టులు ఈ దేశంలోనూ, ఇక్కడివారు విదేశాలలోనూ పర్యటించడం అవసరమని ప్రచారం ప్రారంభించాడు. దీని ప్రభావం ఈ ప్రతినిధి వర్గాల మీద బాగానే పనిచేయవచ్చు. దీన్ని ఆసరాగా చేసుకొని, తన పనులేవో సాధించుకోవాలి.

స్టూవర్టు, తనను వెర్రెత్తిపోయి చూస్తున్నాడు...

ఆలోచిస్తుంటే గాలి అనుకూలంగానే వీస్తున్నదనిపించింది మంజరికి.

ఆవిడ టైం చూసింది. తెల్లవారడానికింకా రెండు గంటల వ్యవధి ఉంది. ఈ కాస్సేపూ తను నడుం వాల్చినా ప్రయోజనం లేదు. అందుకని ఫ్రిజ్‌లోంచి ఓ సీసాను తీసి, కొద్దిగా గ్లాసులోకి వొంపుకొని, సోడా కలపకుండానే తాగేసి మూతి తుడుచుకొన్నది మంజరి.

ఆవిడ మనసిప్పుడు మబ్బుల మీదికి తేలిపోతూ ఉంది. సిగరెట్ వెలిగించి గుండెల నిండుగా పొగపీల్చి ఎదురుగావున్న అద్దం మీదికి వొదిలింది. పొగ చింది చెల్లాచెదురయింది.

"స్టూవర్టు, స్టూవర్టు" అని మెల్లిగా గొణిగాయి మంజరి పెదవులు.

ఆ పొగతో, తన భవిష్యత్తును కళ్ళు చించుకొని చూడసాగిందావిడ.

# 27

అంతర్జాతీయ చలన చిత్రోత్సవాలు అనుకొన్నదానికన్నా ఇంకో మూడు రోజులు అదనంగా జరిగాయి. ఉత్సవాల సమయంలోనూ, అవి అయిపోయిన వారందాకానూ, ప్రముఖులైన వారెవ్వరికీ తీరుబాటు లేకుండా పోయింది.

మంజరి సంగతి సరేసరి; ఆవిడ తన అతిథుల్ని "అన్ని విధాలా" సంతృప్తిపరచింద నడంలో సందేహం లేదు. ఇటు శర్మగారు కూడా జర్నలిస్టుతో చెప్పి బ్రహ్మాండంగా కాపు కాయించారు. చివరి రోజున దేశ దేశాల ఫిలిం ప్రముఖులు భారతీయుల ఆదరాభిమానాలను గురించి అతిథి సత్కారాల్లో వారికున్న ఆసక్తిని గురించీ ఆకాశానికెత్తుతూ మాట్లాడారు. స్టూవర్టు మద్రాసు సినీ పరిశ్రమవారికి కృతజ్ఞతలు చెబుతూ ప్రత్యేకంగా మంజరి పేరును పేర్కొన్నాడు.

"రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత దేశ కాలాలకున్న విలువల్లో చాలా మార్పులొచ్చాయి. మానవ జాతి మునుపెన్నడూ ఎరుగని నూతన వాతావరణంలో అడుగుపెట్టింది. 'ఇది నా దేశం' - 'ఇది నా సంస్కృతి' - 'ఇది నా ప్రత్యేకత' అని మడిగట్టుక్కూచోవడం ఈనాడు సాధ్యం కాదు. రాజకీయంగా, అంతర్జాతీయ స్థాయిలో సఖ్యాన్ని సాధించడానికి ఐక్యరాజ్యసమితి పాటుపడుతున్నట్లే, కళా సాంస్కృతిక రంగాలకు సంబంధించి కూడా అదే పంపిణీమీద వొక అంతర్జాతీయ వ్యవస్థ ఏర్పడడం అవసరం. వివిధ దేశాలలోని సామాన్య మానవుడు ఈనాడెదుర్కొంటున్న సమస్యలన్నీ దాదాపుగా వొకేరకంగా ఉన్నాయి. దరిద్రం, ఆకలి, నిరుద్యోగం, వ్యాధులు మొదలైన అరిష్టాలు అందర్నీ ఒకే విధంగా పీడిస్తున్నాయి. వీటిని తొలగించేందుకు కళాకారులంగా మనం చేయవలసింది ఎంతో ఉంది. రాజకీయాలతో ప్రమేయం లేనివిధంగా మనం 'ఐక్య చలన చిత్రమండలి' గానీ, లేదా అలాంటిదో ఇంకోటిగానీ ఏర్పాటు చేసుకొందాం. వివిధ దేశాల కళాకారులు, దర్శకులు, నిర్మాతలు కలిసి, మానవతలను పునరుద్ధరించగల చిత్రాలను నిర్మించడం వాంఛనీయం. అందుకు, ఈ సమావేశం పునాది కాగలదని మనం ఆశిద్దాం" అంటూ స్టూవర్టు తన ఉపన్యాసాన్ని ముగించాడు.

ఉత్సవాలు ముగిశాక మంజరి ప్రత్యేకంగా వొక విందును ఏర్పాటు చేసింది. అందులో అంతర్జాతీయ ఫిలిం ప్రముఖులే కాకుండా భారత చలనచిత్ర రంగంలోని వారు, ప్రముఖ రాజకీయ నాయకులు పాల్గొన్నారు. వారందరితోనూ మంజరి స్వయంగా పరిచయం చేసుకొన్నది. కొందరితో రెండు మూడు నిమిషాలు ఏకాంతంగా కూడా మాట్లాడింది.

"మొన్న పార్లమెంటులో ప్రతిపక్షాలకు మీరిచ్చిన సమాధానాలు చదివాను. బ్రహ్మాండంగా ఉన్నాయి" అని వొక మంత్రిగారితో అన్నది మంజరి.

ఒక ప్రముఖ రాజకీయ నాయకుణ్ణి చాటుకు పిలిచి-

"మీరు వారు చందా అడిగిన రోజున నా దగ్గర 20 వేలకన్నా ఎక్కువ లేవు. తరువాత కనుపించమన్నాను. మళ్లా రానేలేదు" అన్నది.

ఈ పంపిణీమీద వొకరితో అన్నమాట ఇంకొకరితో అనకుండా నెట్టుకొచ్చిందావిడ. వారందరూ కాకపోయినా, సగం మందైనా మంజరి తమ మనిషేనన్న విశ్వాసాన్ని కుదుర్చుకొన్నారు. ఒకానొక ప్రముఖుడు - పేరెండుకు లెండి - ఢిల్లీకి వచ్చినప్పుడు తనను తప్పకుండా కలుసుకోమన్నాడు.

"మీరు ప్రత్యేకంగా నన్ను బొట్టూ, కాటుగా పెట్టి పిలవనవసరంలేదు. ఢిల్లీకి వచ్చానంటే మీ ఇంట్లోనే మకాం వేస్తాను- మీరొద్దన్నా సరే!" అన్నది మంజరి నవ్వుతూ.

"బై ఆల్‌మీన్స్" అన్నాడతను.

మంజరి ఆ మాట అనేవేళకు ఆవిడ ఢిల్లీ వెళ్ళాలనుకోలేదు. అందరితో మంచిగా మాట్లాడినట్లే ఆ ఢిల్లీవాడితోనూ మాట్లాడింది. ఆ తరువాత మూడు రోజులకే ఆవిడకా ప్రయాణం వచ్చిపడ్డది.

అంతదాకా "నేనుకూడా ఎందుకండీ?" అన్నది మంజరి, ఆ ప్రయాణం ఇష్టం లేనిదానికి మల్లే.

"అలా కాదు, స్టూవర్టు నేరుగా ఢిల్లీ పోతున్నాడు. అతని విమానంలోనే నీకూ వొక సీటు బుక్ చేశాను. అతను ఢిల్లీలో రెండు రోజులుంటాట్ట. బొంబాయి మీదుగా వెళ్ళిపోతాట్ట... బొంబాయిలో అతనికే ప్రోగ్రామూ లేదు. ఆ సంగతి కూడా కనుక్కొన్నాను" అన్నాడు శర్మ.

"నేనిలా వస్తున్నానని స్టూవర్టుకు తెలుసా?"

"లేదు. అతనింకో గంటలో బయటుదేరొచ్చు. నువ్వో అరగంట తర్వాత ఢిల్లీకి వస్తున్నట్లు ఫోను చెయ్యి... ఇంకేం అనకు. అదే మంచి పద్ధతి" అన్నాడు శర్మ.

## 28

దాదాపుగా మూడు మాసాలు గడిచాయి. ఓ నెలరోజులపాటు మంజరి స్టూవర్టునుండి ఆహ్వానం కోసం చాలా టెన్షన్‌తో ఎదురు చూసింది. అతను రాసిన రెండు జాబుల్లోనూ, మామూలు క్షేమ సమాచారాలు తప్ప ఇంకో విశేషమేమీ లేదు.

మంజరికి విసుగెత్తిపోయింది. దీనికి తోడుగా 'ఆరోగ్యం' కూడా సరిగా లేదు. తను మామూలుగా వాడే బిళ్లలు వాడినందువల్ల ఫలితం కనిపించలేదు.

అందుకని, ఈ విషయాల్లో నిపుణుడైన డాక్టర్ని కలుసుకొంటే అతను పెద్ద తతంగం చెప్పాడు. దానికొప్పుకోవడంకంటే, పోనీ, ఏ 'చికిత్సా' లేకుండానే ఉండిపోదామా అనుకొన్నదావిడ. కానీ ఆలోచించి చూస్తే అదంత మంచి పద్ధతిగా అనిపించలేదు. తనింకా, ఇంకా విహాయవీధుల్లోకి పోవాలనుకొంటున్నది. ఇప్పటికప్పుడే ఇలాంటి బంధనాల్లో చిక్కుకోవడం క్షేమంకాదు. తను ఎక్కదలచుకొన్న మెట్లన్నీ ఎక్కాక, జీవితంలో స్థిరపడ్డాక, ఇలాంటి విషయాలను గురించి తాపీగా

అప్పుడాలోచించుకోవచ్చు.

తన 'ప్రతిభ' ప్రస్తుతానికి జేగంటలాగా మోగిపోతున్నది. అటు నిర్మాతలూ, ఇటు ప్రేక్షకులు కూడా తన కోసం పడిచస్తున్నారు. నిజమే గానీ, ఆ మోజు ఎంత కాలం ఉ ంటుందనేదే ప్రశ్న. తన ముందుతరంవారు తను వొచ్చాక పాత పడిపోయారు. ఇవ్వాళ వారిని అనుకొనే దిక్కులేదు. రేపు తననైనా అంతే. ఆ దశలో తను చేయగలిగిందంటూ ఏమీ ఉ ండదు. బహుశా చేయాలన్న ఉత్సాహం, కోరికా కూడా ఉండకపోవచ్చు. ఆ నిద్రాణ స్థితి దాపురించకముందే, తను కొండ శిఖరాన్నెక్కాలి. ఆ తరువాత విచారించితే ఏ ప్రయోజనమూ ఉండదు.

ఆ ఉద్దేశంతోనే తనీ భారీ ప్రాజెక్టు ప్రారంభించింది. మాద్రాసులో మరే ఆర్టిస్టూ చెయ్యడానికి సాహసించని పని తను చేసింది. ఇందులో తను విజయాన్నే సాధించిందో, అపజయాన్నే సాధించిందో, ఇప్పుడప్పుడే చెప్పలేదు. స్టూవర్టునుండి వచ్చే సమాధానం మీద ఈ పని తాలూకు జయాపజయాలు ఆధారపడి ఉంటాయి. అతను తనను మోసం చేసిందీ, లేనిదీ చెప్పలేని స్థితిలో తనిప్పుడు ఉన్నది. మద్రాసులోనే కాదు, ఢిల్లీలో ఉన్నప్పుడూ, ఆ దరిమిలా బొంబాయిదాకా అతనితో ప్రయాణం చేసినప్పుడు కూడా స్టూవర్టు తనకోసం ఆవురావురుమన్నాడు. తనను తప్పకుండా తమ దేశానికి ఆహ్వానిస్తానన్నాడు. ప్రభుత్వంలో తనకు తెలిసినవారు చాలా మంది ఉన్నారనీ, ఇదొక పెద్ద పని కానేకాదనీ స్పష్టంగా చెప్పారు. తను అంతర్జాతీయ స్థాయిలో ఫిలిం మండలిని ఏర్పాటు చేయాలనటం ఏదో లాంఛనంగా అన్నది కాదనీ, కనీసం ఇండియా - అమెరికా దేశాలు సంయుక్తంగా ఒక చిత్రాన్ని నిర్మించినా బాగున్నన్న ఉద్దేశంతోనే అలా అన్నాననీ చెప్పాడు. ఉభయ దేశాలకూ అన్వయించే కథావస్తువును గురించి తను ఆలోచిస్తున్నానన్నాడు. అతని ధోరణి చూశాక, అనుమానించడానికే ఆస్కారం లేకపోయింది!

అవునా మరి!

ఇంతవరకూ

ఇంతవరకూ జరిగిందేమీ లేదు. ఈ పేరుమీదుగా, దాదాపు పదిహేను పదహారు వేలదాకా ఖర్చయింది. ఈ పని కోసమనే ఊడిపోయిన శర్మను తెచ్చి కొంపలో ఉంచుకొన్నది. వాడూ ఆ వసంతా కలిసి రూపాయలను చిల్ల పెంకుల కింద మార్చేస్తున్నారు. ఇక చలపతి గాడు సరేసరి! ఎంత హీనంగా చూచుకొన్నా, వాడో వేయి, పదిహేను వందలన్నా, పీక్కి ఉంటాడు. అదీగాక ఈ వంకతో తన మీద బోలెడంత అధికారాన్ని చెలాయిస్తున్నాడు. వాణ్ణి చూరంగా తోసెయ్యడానికి లేదు. దగ్గరకు రానిస్తే మనుషుల్ని నమిలి మింగేస్తున్నాడు!

ఈ దిక్కుమాలిన గొడవల్లో పడి తను చాలా కాల్‌షీట్సు కాన్సిల్ చేసింది. ఆ కంపెనీల వారు గొల్లుమని గోల పెడుతున్నారు. అదేదో అరవ కంపెనీవాడు తనమీద దావా వేస్తానంటూ నోటీసు కూడా పంపించాడు. మెహతాతో చెప్పింది వాణ్ణి చల్లపరచేటప్పటికి తాతలు దిగొచ్చారు. బొంబాయి వాళ్ళ గోల సరేసరి! వీటన్నింటి మధ్యా పడి నలిగిపోతున్నది. ఓ క్షణం ప్రశాంతంగా

గడుపుదామంటే లేదు. ఇవన్నీ కాక-

ఒకసారి శర్మ ఆదరా బాదరా ఇన్ని పత్రికలు తీసుకొని రొజుకుంటూ వచ్చాడు. అతని ముఖం మాడిపోయినట్లుగా ఉంది. కళ్ళు పొడిపొళ్ళాడుతున్నాయి. నాలుకతో పెదవులు తడుపుకొంటూ సోఫాలో కూలబడిపోయాడు.

'ఏదో జరిగిం'దనుకొన్నది మంజరి.

'ఏమి'టని ఆవిడ అడగలేదు.

శర్మగారే ఓ పేపరును ఆమె మీదికి విసిరాడు.

మొదట పేజీలోని హెడ్డింగును చూస్తూనే మంజరి ముఖం మబ్బు కమ్మినట్లయి పోయింది. దాన్ని కప్పిపుచ్చుకోవడానికి ఆవిడ చేసిన ప్రయత్నం ఫలించలేదు.

"నటి మంజరి కామలీలలు!"

"ఏ.బి.సి-1234 నెంబరు కారులో అర్థరాత్రి గుసగుసలు..."

"గుంటూరు పొగాకు కంపెనీ డబ్బు కాజేసిన వైనం" అదీ శీర్షిక!

దానికింద అదే ధోరణిలో రెండున్నర కాలములదాకా ఏదో రాసి ఉంది. ఫలానా వారితో కారులో పోతున్నట్లు, గురువారం అర్థరాత్రి రెండు గంటలప్పుడు బీచిలో ఇంకెవరితోనో ఉండగా పోలీసు పట్టుకొన్నట్టు, నాలుగు వందలిచ్చి వదిలించుకొన్నట్లూ, ఆ పోలీసు నెంబరూ వగైరాలన్నీ రాశాడు. ఇదేమిటో మంజరికి బోధపడలేదు. కానీ యిలాంటి పత్రికలు కొన్ని ఉన్నాయనీ, అవి ఈ తరహా విషయాలను అచ్చేసి అమ్ముడవుతూ ఉంటాయని మంజరి విన్నది. ఇప్పుడెప్పుడో చలపతిగాడు ఈ పత్రికల వాళ్ళకు ఏదో ముట్టచెప్పి- రావుగారి మీదా, మూర్తిగారి మీదా రాయిద్దామని కూడా సలహా ఇచ్చాడు. అప్పుడు తనే వద్దని వారించింది. మనుషులమీదా కసి తీర్చుకోవలసిందేగానీ, దాని కిలాంటి క్షుద్రమైన మార్గాలు పనికిరాదవనీ, సింహంతో పోట్లాడేటప్పుడు సింహం లాగానే ఉండాలి తప్ప, గుంటచిక్కులు కల్పించకూడదనీ తను చలపతికి సలహా ఇచ్చింది. అయినప్పుడు ఈ చండాలమంతా ఏమిటిట!

మంజరి దిగజారిపోతున్న ముచ్చెమటలను తుడుచుకొన్నది. ప్రాణం అలసిపోయినట్లుగా డీలా పడిపోయింది.

"ఇదంతా ఏమిటంటారు శర్మాజీ?" అనగలిగింది మంజరి.

"నేనూ అదే ఆలోచిస్తున్నాను మేడమ్! మనమంటే గిట్టని వాళ్ళెవరో ఈ పని చేసి ఉంటారని నా అనుమానం" అన్నాడు శర్మ.

"మనకెవరితోనూ విరోధంలేదు. మూర్తిగారు, రావుగారు కూడా మనతో ఇప్పుడు హితంగానే ఉంటున్నారు. ఆఖరికి మనం 'ఛీ - ఛా' అని వెళ్ళగొట్టిన చంద్రం కూడా మొన్న కనిపించి దణ్ణం పెట్టి మరీ వెళ్ళాడు. అతనితో బాటు విజయ కూడా వచ్చింది. ఆ పిల్ల-" అని శర్మ కేసి చూస్తూ ఆగిపోయింది మజరి.

శర్మగారు మధ్యలోనే తల అడ్డంగా తిప్పేశాడు.

"ఏమో మేడమ్! నేనలాగని అనుకోను. మనం మాత్రం, మనకు గిట్టని వారితో ఆప్యాయంగా మాట్లాడుతున్నామా లేదా? మనం చాటునా మాటునా చేసే ప్రయత్నాలు చేయకుండా మానుకొంటున్నామా? లేదే? అలాగే మన చుట్టూ ఉన్నవారే మనకు విషం తలిచి ఉండవచ్చు."

మంజరి వింటున్నదల్లా తాచుపాములాగా ఖస్సుమని లేచిందొక్కసారిగా.

"నా సంగతి చాలా మందికి తెలియదనుకొంటాను శర్మగారూ! రేపీపాటికి వాణ్ణి, వాడి పత్రికనూ నడిసముద్రంలో పారేయించగలను. ఉపకారం చెయ్యమంటే చెయ్యలేంగానీ, మనిషిని నాశనం చేయడానికేం శర్మాజీ!" అన్నది మంజరి.

శర్మ చాలా తాపీగా నవ్వాడు.

"నీకలా చీటికీ మాటికీ కోపం పెరిగిపోతుంటే నిభాయించడం కష్టం. వళ్ళు తెలియని కోపంలో నువ్వొక్కోసారి అనకూడదని మాటలన్నీ అనేసి, పీకలమీదికి తెచ్చుకొంటూ ఉంటావు. నువ్వు డబ్బున్న దానివి గనుక, నీ డబ్బును చూసి అందరూ హడలుకు చావాలని కోరడంలో సబబున్నది. కానీ అలా చావవలసిన అవసరం అందరికీ ఉండదు. పదివేలు పారేసి నువ్వా పత్రికవాణ్ణి చంపించగలవు. ఇంకో పదివేలు పారేస్తే కేసులేకుండానూ చేసుకోగలవేమో, నాకు తెలీదు కానీ-"మధ్య నుండే నవ్వడం ప్రారంభించిన మంజరి, రాను రాను శర్మ ఉద్వేగాన్ని చూసి, విరగబడి నవ్వసాగింది. ఒక దశలో ఆవిడ నవ్వలేక, రెండు చేతులతోనూ పొట్టను అదుముకొన్నది కూడాను.

శర్మకీ దోరని బొత్తిగా అర్థం కాలేదు. మంజరికి పిచ్చిగానీ ఎత్తలేదుకదా అనుకొన్నాడు. ఎందుకంటే - ఈవిడ నిమిషానికో రంగు మారుస్తూ ఉంది. గడియకోమాట మాట్లాడుతూ ఉంది. ఎలా ఈవిడతో చావడం?

"ఎలాగైనా శర్మగారూ!..." అంటూ ప్రారంభించింది మంజరి. "మీ స్వాభిమానం పోనిచ్చారు కాదండీ బాబూ! ఆ వెధవ అన్ని అవాకులూ, చెవాకులూ రాస్తే రాశాడుగానీ, నేను వాణ్ణి సముద్రంలో పారేస్తానంటే కోపం వచ్చిందా మీకు?... ఇదివరకోసారి కోపం వచ్చినప్పుడు మీరు చాలా చాలా ముద్దొస్తుంటారని చెప్పాను జ్ఞాపకం ఉందా? మీరు ఇస్సురంటూ రావడం, కుర్చీలో కూచోవడం, పత్రికను నా మీదికి గిరాటెట్టడం, ఏదో కొంపమునిగిపోయినట్లు గిలగిల్లాడిపోవడం, ఇదంతా చూశాక, కాస్సేపు మిమ్మల్ని ఏడిపింతా మనిపించింది... ఏడిపించేశాను... నా సరదా మాత్రం బాగా తీరిపోయిందనుకోండి!... ఏమిటి శర్మా- మరీ అంత సీరియస్‌గా తీసుకొంటావేం ప్రతిదీనూ?" అని లాలించింది మంజరి.

ఆ దెబ్బతో శర్మ మరింత కుదేలైపోయాడు. ఇందాకటి కోపం నిజమా? ఈ లాలింపు నిజమా?

"ఇదంతా అబద్ధమని మనమో స్టేట్‌మెంట్ ఇస్తే బావుంటుందా?" అని సలహా అడిగింది మంజరి.

"ఏమీ వొద్దు. అలా చేయడం వల్ల మనం లేనిపోని ఇంపార్టెన్స్ ఇచ్చిన వాళ్ళమవుతాం. అంచాత ఇగ్నోర్ చేసేస్తే తీరిపోతుంది!"

"వాడు చివర్ని 'సశేషం' అని తగలేశాడు, మీరు చూశారా? ఇంకా ఏమేం ఛండాలాలు రాస్తాడోననిపిస్తూ ఉంది నాకు! పోనీ - వాడికేమన్నా కావలసి ఉంటే రారాదా, అడిగి తీసుకోరాదా?

ఈ రకంగా పత్రికల్లో రాసుకొంటే ఏమొస్తుందయ్యా శర్మా?'' అన్నది మంజరి, అంతలోనే చిరచిరలాడుతూ.

ఏమొస్తుందో శర్మ చెప్పలేదు- మంజరి మళ్లా అడగనూ లేదు. కానీ వొక మాట మాత్రం అన్నది.

''ఆ గుంటూరు పొగాకు కంపెనీ వాడున్నాడే- వాడెవడో తెలిస్తే బావుండును శర్మగారూ!''

''ఎందుకు?'' అన్నాడు శర్మ.

''ఎందుకేమిటండీ నా బొంద! ఆ ఆసామీ బాగా డబ్బున్న వాడల్లే ఉంది. వాడికి నా మీద మోజు ఉండొచ్చు. అలాంటప్పుడు వొచ్చి-''

అని ఫక్కున నవ్విందావిడ.

శర్మ పలకలేదు. అతనిక్కడ లేడనుకొన్నది మంజరి. బుద్ధిపూర్వకంగానే ఆవిడా విషయాన్ని మార్చివేసింది.

మరో అరగంటకల్లా ''ఆర్ముగం మూవిటోన్'' వారు షూటింగంటూ వచ్చి కూర్చున్నారు. మంజరి ఆ గొడవలో పడిపోయింది. వారేమో ఇవ్వవలసింది చాలా ఉంది. డబ్బయితే ''ఇదిగో ఇదిగో'' అంటూ తిప్పుతారు. కాల్‌షీట్సు మాత్రం తప్పకుండా తీసుకొంటారు. తన అంచనా ప్రకారం ఇంకొక్కటే సీన్ ఉంది. అందులో పనయిపోతే తన ముఖం చూడరు, తనకు డబ్బు కూడా రాదు.

ఆ సంగతే నిర్మొహమాటంగా అడిగేసింది మంజరి!

''ఆ డాడాడా!'' అంటూ నెత్తీ, నోరూ కొట్టుకొన్నాడు ప్రొడ్యూసరు.

''ఏమి''టని అడిగింది మంజరి.

డైరెక్టర్ చెప్పుకొచ్చాడు.

''ముందుగా అనుకొన్న కథ ప్రకారమయితే, మీరన్నట్లుగా ఈ ఒక్క సీనుతోనూ కథ అయిపోవలసిందేనండీ అమ్మాయిగారూ! కానీ - సపోర్టింగ్ కారెక్టర్ వేసే సంబంధ మొదలియార్ మొన్న కార్ యాక్సిడెంటులో చనిపోయాడు. దాంతో కథ యావత్తూ దేవుడా అంటూ మార్చుకోవలసి వచ్చింది. లోగడ- మనం - చివర కొస్తాయనుకున్న సీన్లు, ఇప్పుడు కథా ప్రారంభంలో ఉంటాయన్న మాట! ఇంకా బోలెడంత కథ ముందుగానే ఉందండీ!'' అని సంజాయిషీ చెప్పుకొన్నాడు డైరెక్టర్.

''మీరే గంగలో దూకినా నాకు సంబంధం లేదు. నా డబ్బు మాటేమిటి?'' అని నిక్కచ్చి చేసింది మంజరి.

''బ్యాంక్ సెలవు గనక డ్రా చెయ్యలేదనుకొంటాను... పోనీ వో పని చేస్తారా? ఇందాక నాకేదో అవసరముంటే మూడు వేలకో చెక్కు పుచ్చుకొన్నాను. మీరు డబ్బుకోసం మరీ అంత పర్టిక్యులర్‌గా ఉంటే - దాన్ని మీకు ఎండార్సు చేస్తాను. తీసుకోండి!'' అన్నాడతను.

మంజరి కాస్సేపు ఆలోచించి నిశ్శబ్దంగా బయలుదేరింది.

పది నిమిషాలనుకొన్న పని, పది గంటల దాకా పట్టింది. అప్పటికీ తను కాదు మొర్రో అని గోలెట్టినా లాభం లేకపోయింది. ఆ దిక్కుమాలిన సీనులో తనే ఉండాలట. డమ్మీనిబెట్టి పని జరుపుకోవచ్చునని చెప్పినా వినరు. అంతగా అవసరమయితే రెండు మూడు షాట్స్ విడిగా తీసుకొని

మాచ్ చేసుకోవచ్చునని కూడా చెప్పింది. అవన్నీ "నిజం నిజం" అంటూనే తనను బలవంతం చేశారు. "కంటిన్యూటీ పోతుం"దని ఒకడూ, "టెంపో" వస్తుందని ఇంకొకడూ - ఇలాగ ప్రాణాలు పిండేశారు. చన్నీళ్ళలో తను దిగి ఎంతకాలమయిందో, పోనీ - గోరు వెచ్చని నీరన్నా ఆ కొలనులో పోయమంది తను. ఆవిరులొస్తాయట, అందుకని వీల్లేదట. దాదాపు అయిదారు గంటల సేపు తను తడిబట్టతో నీళ్ళలో నానుతూ ఉండాలిసొచ్చింది! పనయిందాకా, అందరూ "అమ్మా - తల్లీ- బుజ్జీ" అని సున్నితంగా మాట్లాడారు, పావుతక్కువ పదింటికి ఆఖరుషాట్ "ఓ.కే" అయింది!

డ్రెస్ మార్చుకొని, డైరెక్టర్ కోసం వెదికింది మంజరి.

"లేరండీ! మీరు డ్రెస్ చేంజ్ చేసుకొంటున్నప్పుడే వెళ్ళిపోయారండీ!" అన్నాడు స్టూడియో కుర్రవాడు.

"అదేమిట్రా? నాకు డబ్బివ్వందే పోనన్నవాడు, ఎలా ఉడాయించాడట?" అన్నదావిడ చిర చిరలాడుతూ.

"నాకు తెలియదండీ అమ్మా!" అని తప్పుకెళ్ళాడు వాడు.

"అందుకే పైసాపడందే నేను అడుగు బయటికి పెట్టను... ఇప్పటికి పోతే పోయినట్లా? రేపణ్ణించీ ఈ వెధవల్ను ముక్కు నేల కానించి దేకించకపోతే నా పేరు మంజరే కాదు. చూసుకోండి తడాకా!"

దోవలో ఉండగా డ్రైవరు అసలు రహస్యం కాస్తా కక్కేశాడు.

"ఈ పిచ్చర్‌లో ఇదే ఆఖరి సీనటండీ అమ్మాయిగారూ! ఇక మీతో పనుండదని అనుకొంటున్నారు" అన్నాడు డ్రైవరు.

మంజరి భగ్గున మండిపోయింది. సంచీ తెరిచి చూసింది. సీసాలో అడుగున ఉగ్గిన్నెడు నల్లని ద్రవం ఉన్నది. అది కాస్తా గుటుక్కున తాగేసి - సీసాను రోడ్డుపక్కకు విసిరేసి సిగరెట్ వెలిగించింది మంజరి.

"ఇంటికాండీ?" అన్నాడు డ్రైవరు.

"కాదు, ఎటన్నాపోనీయ్. చాలా దూరం తీసుకుపో... మాంఛి స్పీడ్‌లో తోలెయ్? కారు గుల్ల గుల్లయిపోవాలి. నెత్తురు చర్మాన్ని తొలుచుకొని బైటికి చిమ్ముకురావాలి. అలా తోలు... నీ కొచ్చిన భయం లేదు... తెల్లవార్లూ, మళ్ళా నేను వొద్దన్న దాకా, అలా తోలుతూనే ఉండు" అన్నది మంజరి.

డ్రైవర్ పలకలేదు.

అద్దంలోంచి ఆవిడ బొమ్మకేసి చూసి, మెల్లగా ఏదో గొణుక్కున్నాడు.

# 29

ఇది జరిగిన మూడో రోజున మంజరి డాక్టర్ను కలుసుకొన్నది. ఆయన గారు, అధమం నాలుగు వారాలైనా తన నర్సింగ్‌హోంలో ఉండాలన్నారు.

"అది వీలుపడదు" అన్నది మంజరి.

"మరెలా?" అన్నాడు డాక్టర్.

''అంతకాలం హాస్పిటల్లో ఉంటే జనం ఎన్నన్నా అనుకొంటారు డాక్టర్ గారూ! అందుకని? ఆ చేసే ట్రీట్‌మెంటేదో ఇంటి దగ్గరే చెయ్యరాదా?'' అన్నదావిడ.

డాక్టర్ చాలాసేపు ఆలోచించి ''వీలుపడదేమో?'' అన్నాడు మెల్లిగా. ''పాత రోగులు చాలా మంది వస్తుంటారు. కొత్త కేసులు కూడా బోలెడన్ని వస్తుంటాయి... మరి... మీ కోసం పదే పదే రావడం పడదేమో!''

మంజరి అతన్ని ఎగాదిగా చూసి - తలపంకించింది.

''నా పని అయిందాకా మీరీ వ్యాపారాలన్నీ కాస్త తగ్గించుకోవాలి డాక్టర్‌గారూ! మరీ - అందరిలాగా నన్ను చూడకండీ! పది కేసులు చేసి పది పదులు వందతీసుకొనే దానికన్నా! మాంఛి కేసు వొక్కటి డీల్ చేస్తే చాలదా? ఎందుకొచ్చిన లాయలాసా బాబూ ఇదంతా?'' అన్నదావిడపైగా.

''సరే'' అన్నట్లుగా అతను తలూపి వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళాడని రూఢి చేసుకున్నాక, మంజరి అతడు వెళ్ళిన వేపుగా కాండ్రించి ఉమ్మింది!

''దగుల్బాజీ వెధవ! తనేదో గొప్పవాడయినట్లు, రోగులు తండోపతండాలుగా వచ్చి పడుతున్నట్లు నా ముందు పోజు పెడతాడు. ఇటువంటి పనులకు తప్ప వీడిదగ్గర కొచ్చేవారెవ్వరూ లేరని అందరకూ తెలుసు.''

ఆవిడ బెడ్‌మీద ఉండగానే మరుసటి సంచిక కూడా వచ్చింది. ఈ దఫా దాన్ని చలపతి తీసుకొచ్చాడు.

''నువ్వీ సమయంలో ఎక్సైట్ కాకూడదు మంజూ! బ్లడ్ డిశ్చార్జి ఎక్కువైతే లేనిపోని ట్రబుల్స్, ఫేస్ చెయ్యాల్సి వస్తుంది. కానీ - మరి - నీకీ సంగతి చెప్పకుండా దాచడం భావ్యంకాదు'' అంటూ ప్రారంభించాడు చలపతి.

''ఫర్వాలేదు... ఏమిటది?''అన్నది మంజరి లేవడానికి ప్రయత్నిస్తూ.

చలపతి ఆమెను సర్దిపడుకోబెట్టాడు.

అతను చెప్పకుండా ఏదో దాచి పెడుతున్నాడని వసంత గ్రహించింది. పనున్నదానిలాగా పక్కకు తప్పుకుంది.

''ఈ శర్మగాడు. ఆంబోతుకుమల్లే తిని తిరగడమే తప్ప ఇలాంటి సంగతులు కూడా పట్టించుకోకపోతే ఎలా మంజూ! ఈ పత్రికవాడు 'గత సంచిక తరువాయి' అని వేశాడు. నువ్వు చూశావా?'' అన్నాడు చలపతి.

''ఏదీ!'' అని చేయి చాపింది మంజరి.

ఈసారి వ్యాసంతో పాటుగా మంజరి బొమ్మ కూడా అచ్చయింది. బొమ్మకింద ''మదనజ్వర పీడిత మంజరి'' అని రాశాడు.

వ్యాసం మధ్యలో మంజరి ఎవరికోసమో తెపతెపలాడిపోయినట్లూ- వాడు నిరాకరించినట్లూ- చివరికి వాడికో వేయి రూపాయలు ఎదురొచ్చి, ఎ.బి.సి.1234 నెంబరు కార్లోనే వాడితో సరస సల్లాపాలు సాగించినట్టూ రాశాడు. వాడిపేరు సింగార మొదలియార్ అనీ- మంచి అందగాడనీ- చాలామంది

ఆడవాళ్ళు- ముఖ్యంగా డబ్బు అందం, పుష్కలంగా ఉన్నవాళ్ళు- సింగారమొదలియార్ కోసం పడిచస్తూ ఉంటారనీ ఆ పత్రిక వాడు రాశాడు. చివరన ''మరికొన్ని విశేషాలు వచ్చే సంచికలో'' అని కూడా రాశాడు.

నీరసంగా ఉండటం వల్లనేమో- మంజరి మునుపటిలాగా భగ్గుమని మండలేక పోయింది. ఆవిడ కోపమంతా కరిగిపోయి- కన్నీటి రూపంలో వెలికి వచ్చింది.

తనకు శరీర సౌఖ్యమంటే ఎంత ఏవగింపో చాలా మందికి తెలియదనుకొన్నది మంజరి. ఒక వేళ చెప్పినా అర్థం చేసుకోరనీ- కనీసం చేసుకోవడానికయినా ప్రయత్నించరనీ ఆవిడ గోల పెట్టింది. ఇందుక్కారణం తన వృత్తేననీ- ఇంతకాలంగా తను సినిమాల్లో కథానాయిక వేషాలే వేయడం వల్లా- ఆ కథానీయకులకు ప్రేమించుకోవడం తప్ప ఇంకో పనేదీ లేకపోవడం వల్లా- మామూలు జీవితంలో కూడా ఆ పాత్రధారులు అలాగే ఉంటారని ప్రజలు అనుకోవడంలో న్యాయం లేదనీ మంజరి వాపోయింది.

''దిక్కుమాలిన ప్రిస్టేజీని చూచి నోరు నొక్కుకోవలసి వస్తోందిగానీ - నాకు శరీర సౌఖ్యంమీద - గుంటూరు కోళ్ళగూడెంలో ఉన్నప్పుడే అసహ్యం వేసిందని ఓ స్టేట్‌మెంట్ ఇచ్చేద్దును'' అన్నదావిడ రాజమణితో. ''కానీ లాభం లేదు. అలా మనం అనకూడదు. అన్నా పత్రిక లేవీ అచ్చెయ్యవు'' అని గొణిగింది మంజరి.

రాజమణి ఓ గ్లాసెడు పళ్ళరసం ఇచ్చి- మెడదాకా శాలువా కప్పి వెళ్ళిపోయింది. ఆవిడ వెళ్ళిందాకా కళ్ళు మూసుకొన్న మంజరి - బల్లమీద పడున్న పత్రికను తీసి ఇంకోసారి చదువుకున్నది. చాలా సేపటిదాకా ఈ సింగార మొదలియార్ ఎవరో ఆవిడకు తట్టలేదు. కానీ ఆ పేరు తనకు మరీ కొత్తది కూడా కాదు. ఎప్పుడో ఎక్కడో తను విన్నది; అలాగని చాలా వెనకటి కాలంలో విన్న పేరుకూడా కాదు, అంతా ఈ మధ్యనే-

మంజరి కళ్ళు విప్పారాయి. ఇంకోసారి పత్రికకేసి చూసి- దాన్ని బల్లమీద పడేసింది. రెండున్నర మాసాల కిందట తను నైట్ షూటింగ్ నుండి వస్తున్నది. డ్రైవర్ను తనే పొమ్మన్నది కూడాను. షూటింగయ్యాక - రంగన్నా కడుక్కోకుండానే కారు దగ్గరకొచ్చింది. తను తలుపు తీస్తున్నప్పుడే వెనుకనించి ఎవరో వచ్చి నడుం చుట్టూ చేతులు చుట్టేశారు. మంజరి ప్రాణాలు లేచిపోయాయి. పెద్దగా అరవబోయింది. వాడు దవడలు నొక్కిపెట్టి- ముద్దు పెట్టుకొని, జుట్టు చిందరవందర చేసి చెట్లలోకి పారిపోయాడు. చీకట్లో వాడెలా ఉంటాడో కూడా తను చూడలేదు. కారు తీసుకొని అవతలి కొచ్చాక- స్టూడియో మేనేజర్ కనిపించి ''సింగారం అటుగాని వచ్చాడా?'' అనడిగాడు. తను 'రాలే'దన్నది. వాడు సినిమా పిచ్చోడనీ - అంతో ఇంతో ఉన్నడనీ, మతిచలించి పోయిందనీ- సినిమా వాళ్ళ వెంటపడుతూ ఉంటాడనీ చెప్పాడు స్టూడియో మేనేజర్. అవసరమనుకొంటే తను ఇంటిదాకా వస్తానని కూడా అన్నాడు. తనే ''అక్కరలే''దన్నది. ఆ సంఘటనకు మంజరి అట్టే ప్రాముఖ్యమేమీ ఇవ్వలేదు. కాకపోతే- ఆ రాత్రి - ఆ పైత్యపు వెధవ తనను కావలించుకొన్నందుకు కాదుగానీ- అటువంటి దశలో ఎవరన్నా చూడటమే తటస్థపడితే - తన పరువు ప్రతిష్టలు ఏమవుతాయన్న బెంగలో కునారిల్లిపోయింది.

అంతే.

ఆ తరువాత, ఆ గొడవే మరచిపోయింది.

మళ్ళీ ఇప్పుడు గాని- అదీ ఈ పేపరు చూడటం వల్లగానీ- వాడి పేరు తనకు జ్ఞాపకం రాలేదు. వాడికోసం తను అంగలార్చిందనీ- తన పంచ ప్రాణాలూ కొట్టుకుపోయాయనీ, ఈ పేపరు వాడు రాశాడు. పైగా వాడు చక్కగా ఉంటాడనీ- చాలా మంది ఆడవాళ్ళు వాడికోసం పడి చస్తుంటారనీ వీడంటున్నాడు. నిజమేనేమో మరి! కానీ తన విషయంలో అది అబద్ధం. తనకు మగవాళ్ళంటే ఉన్న జుగుప్స ఇంతా అంతా కాదు. పైగా తన శరీరం ఆశించే వాళ్ళు పురుగులకన్నా హీనంగా తనక్కనపడతారు. ఆ పురుగులకోసం, అవి ఎంత అందంగా ఉండనీ- తను డబ్బు ఖర్చు పెట్టాననడం అబద్ధం, అబద్ధం, అబద్ధం! మగవాళ్ళను గురించీ, శరీర సౌఖ్యాలను గురించీ తనకున్న అభిప్రాయాలేమిటో దాచకుండా బయట పెట్టిన మరుక్షణం, తనమీదికి కుక్కలను ఉసికొల్పి ముక్కలకింద చీల్చించి పారేస్తారు. లేదా రాళ్ళతో కొట్టి నడి వీధిలో చంపి పారేస్తారు. అందుకే తన ఆంతర్యమేమిటో తనెప్పుడూ బయటపెట్టలేదు. ఇక ముందు కూడా పెట్టదలచుకోలేదు.

''సింగార మొదలియార్'' అనే ఈ నవ మన్మధాకారుడెవడో, వాణ్ణి గురించి ఈ పత్రికలో రాయవలసిన అవసరం ఏమొచ్చిందో, శర్మ కూపీలు తీసి సమాచారం పట్టుకొచ్చాడు.

''వీడిది తిరుచునాపల్లి. తండ్రికి ఏదో వ్యాపారం ఉంది. అంతో ఇంతో ఆర్జన ఉన్న కుటుంబం. నలుగురు ఆడపిల్లల తర్వాత వీడు పుట్టాడు. అంచాత కాస్త గారాబం అధికం. చదువు వంటబట్టలేదు. తల్లి చాటునా, మాటునా అయిదూ పదీ అందిస్తూండేది. వాడా డబ్బంతా జులాయి వెధవల్ని చేర్చుకొని తగలేస్తూ ఉండేవాడు. వచ్చిన ప్రతి సినిమా చూడటం వాడి నిత్యనైమిత్తికాల్లో ఒక భాగం. రాను రాను వాడికి సినిమాల్లో వేషాలెయ్యాలనిపించింది. ఎవ్వరికీ తెలియకుండా నాలుగు వేలు లంకించుకొని మద్రాసుకొచ్చాడు. రెండు మాసాల్లో డబ్బయిపోయింది. వేషాలు దొరకలేదు. ఇంటికెడితే తండ్రి తన్ని వెళ్ళగొట్టాడు తల్లిగారే నెలకింత డబ్బుని పంపుతూ ఉంటుంది. అది తింటూ, స్టూడియోల చుట్టూ, స్టార్ల ఇళ్ళ చుట్టూ తిరుగుతుంటాడు. మనిషిది ఎర్రతోలు కనుక తనను చూసి ఆడవాళు ్ళ వెర్రెత్తిపోతూంటారని వాడికో భ్రమ ఉంది. దానిక్కూడా కారణం లేకపోలేదు. వాడి దగ్గర నాలుగువేలున్న రోజుల్లో వాడి చూట్టు చేరిన సజ్జు వాణ్ణి కంతుడనీ వసంతుడనీ పొగిడేసింది. ''నిన్ను చూస్తేనే స్టార్సంతా జావజావయిపోతా''రని ఉబకేసింది. డబ్బయితే అయిపోయిందిగానీ ''ఉబుకు'' మాత్రం తగ్గలేదు. ఇప్పటికీ సింగారంగాడు తనకోసం ఆడవాళ్ళు పడిఛస్తుంటారనే నమ్ముతున్నాడు... అవును గానీ మేడమ్! మరీ బోర్ చేసి వొదలుతున్నానా?'' అన్నాడు శర్మ, కాలుస్తున్న సిగరెట్‌ను దూరంగా విసిరేస్తూ.

''నోనో అదేంలేదు. ప్రొసీడ్!'' అన్నది మంజరి ఉత్సాహంగా.

''వాణ్ణి చూసీ, నన్ను చూసీ వెంటపడే ఆడవాళ్ళు ఈ దేశంలో ఉంటారని నేననుకోను మేడమ్!'' అంటూ ప్రారంభించాడు శర్మ.

''అలా కాదులెండి, మీకోసం వెంటపడే వాళ్ళున్నారన్నది రుజువయింది. మీరు వాడిసంగతి చెప్పండి!'' అన్నది మంజరి.

వసంత ఆ మాటలంటున్న మంజరి వేపు చూసి, కళ్ళు చికిలించింది. శర్మ పొంగిపోయాడు.

''ఊఁ... మళ్లా డైవర్టు కాకండి. చెప్పండి!'' అన్నది మంజరి తొందరచేస్తూ.

''మనమెంతదాకా వచ్చాం?'' అన్నాడు శర్మ- నిజంగా అతగాడింకా లింకు జ్ఞాపకం లేదు.

''వాణ్ణి చూసీ, మిమ్మల్ని చూసీ వెంటపడే ఆడవాళ్ళు ఈ దేశంలో ఉంటారని మీరనుకోవడం లేదు- అంతదాకా చెప్పారు. ఇహ కానివ్వండి!'' అని అందించింది వసంత.

మంజరి ''అలా కా''దన్నది.

''నువ్వు చెప్పింది. మీ ఆయనగారి కామెంటుగానీ, అసలు సబ్జెక్టు కాదు వసూ! కథలోని ఆఖరు వాక్యమేమిటంటే- 'ఇప్పటికీ సింగారం గాడు, తనంటే ఆడవాళ్ళు పడి ఛస్తుంటారనే నమ్ముతున్నాడనో లేదా లాంటిదో నువ్వన్నావు శర్మాజీ!'' అన్నది మంజరి.

''యస్ మేడమ్!'' అన్నాడు శర్మ కొత్త సిగరెట్టును వెలిగిస్తూ, ''దాన్నిబట్టే వాడెంత పిచ్చివెధవో మనం ఊహించవచ్చు! తీరవలసిన కోరికలు అపారంగా ఉండి, అవి తీర్చుకోవడానికి వేరే మార్గమంటూ లేనప్పుడు, ఆ కోరికలు అసహజమైన దోవలగుండా బయటపడుతూ ఉంటాయి... నువ్వేమీ అనుకోనంటే వొక్కమాటంటాను మేడమ్! అననా మరీ?'' అన్నాడు శర్మ.

''వై నాట్?'' అన్నది మంజరి.

శర్మ చెయ్యి చాపాడు.

మంజరి అతనిచేతిలో తన చెయ్యి వేసి, సున్నితంగా నొక్కి ''ఏమీ అనుకోను. చెప్పండి!'' అన్నది.

శర్మ ఏదో అనబోతున్నాడు-మధ్యలోనే మంజరి నవ్వి, అతని పొట్టమీద వేలితో పొడిచి కితకితలు పెట్టింది.

ఏమిటన్నట్లు తలెగరేశాడు శర్మ.

''నన్ను ముట్టుకోవాలనుకొంటే, ఆ ముక్క చెప్పరాదా శర్మాజీ! దానికోసం ఇంత నాటకం ఎందుకయ్యా?'' అన్నది మంజరి.

శర్మ కళ్ళింత చేసుకొని చూశాడే తప్ప, ఏమీ అనలేకపోయాడు.

''నేను సరదాగా అన్నాను శర్మగారూ! మరీ వారం రోజుల నుండీ మంచం సవారీ తీస్తున్నానేమో, ప్రాణం విలవిలలాడి పోతూ ఉంది. నేనేమన్నా, నావాళ్లు గనుక, మీ నలుగుర్ని అంటానుగానీ- పరాయివాళ్లను అంటానా, అనగలనా?... ఊఁ చెప్పకురండి! సూతుండవ్వాలి కథా వృత్తాంతఁ బేమని చెప్పందొడంగె?'' అన్నది మంజరి.

''అందుక్కాదు మేడమ్! నేను సరిగ్గా ఏ విషయం గురించి చెప్పదలచుకొన్నానో, మీరూ అక్కడికే వచ్చారు. ఇప్పుడు మీరన్నారు చూడండి, ముట్టుకోదలుచుకొంటే ఆ మాట చెప్పమనీ, దానికిన్ని నాటకాలు ఆడొద్దనీనూ- ఆ పాయింట్ మీదనే చెబుతాను. మిమ్మల్ని తాకాలని నాకు బాగా ఉన్నదనుకోండి. ముట్టుకొంటే మా వసంత, రాజమణి, చలపతి, తాయారు ఏమన్నా అనుకొంటారన్న భయంవల్లనో, మీరే చీవాట్లు వేస్తారన్న భయంవల్లనో ఆ పని నేను చేయలేనను కోండి! మిమ్మల్ని తాకాలన్న కోర్కెను నేను చంపుకోలేకపోయాననుకోండి. అప్పుడు నేను దొంగదోవలు

వెదుకుతాను. మీరన్నట్లుగా, ఏవో నాటకాలాడి మిమ్మల్ని తాకే అవకాశాలను కల్పించుకొంటున్నాను.. దగ్గరగా ఉన్నవాణ్ణి గనక నా కిది సాధ్యం. బొబ్బిలిలో ఉన్నవాడికో, శ్రీనగర్‌లో ఉన్నవాడికో, దిండివనంలో ఉన్నవాడికో మిమ్మల్ని తాకాలని ఉన్నదనుకోండి - ''

''మీరు మాటకు అడ్డొస్తున్నాను శర్మగారూ!'' అన్నది మంజరి వస్తున్న నవ్వును ఆపుకుంటూ. ''వీళ్లందరకూ నన్ను తాకాలని మాత్రమే ఉంటుందంటారా? నేన్నమ్మను. మీరేదో మొహమాటపడి చెప్పడం మానేస్తారుగానీ... అవునంటారా శర్మగారూ?''

''ఏమిటక్కాయ్, నువ్వు మరీనూ?'' అని మోచేతితో మంజరిని సున్నితంగా పొడిచింది వసంత.

శర్మ అగ్గిపుల్లతో చెవులో తిప్పుకొంటూ చెప్పడం సాగించాడు-

''వాళ్ళకు - దూరంగా ఉన్నవాళ్ళకు - నీ ఫొటోలే గతి! నీ బొమ్మలకోసం ప్రతి రోజూ వందలాది ఉత్తరాలు రాసే నీ అభిమానులు, నువ్వు పంపిన ఫొటోలను ఎలా వాడతారో నువ్వొక్కనాడూ ఊహించి ఉండవు. ఊహిస్తే నువ్వు ఒక్క కాపీ కూడా పంపివుండవని నాకు తెలుసు. కొంతమంది దేవుడి పఠాలకు మల్లే గూళ్ళల్లో పెట్టి, దీపారాధన చేసి పూజ చేస్తే, మిగతా వాళ్ళు చొక్కాల్లో దుప్పట్లలో దాచి - అదన్నమాట సంగతి. చెబుతున్న దేమిటంటే మేడమ్, ఇందులో జనం తప్పేమీ లేదని. వాళ్ళనలా వెర్రెత్తి పోయేలాగా చేసింది మనమే! వెర్రెత్తినవాడు వెర్రిపనులు చేస్తే ఆశ్చర్యందేనికట? సింగారంగాడు నువ్వున్న సినిమాలన్నీ చూశాడు. నీ డైలాగ్సు చాలా భాగం వాడికి కంఠతా వచ్చు. నువ్వు పాడిన పాటలన్నీ వాడు పాడతాడు. వాడిగదిలో నీ ఫొటోలు చాలా ఉన్నాయి. నీ బొమ్మ పడిన పత్రికలన్నీ కొని దాచాడు. ఇక పోస్టర్లకు అంతులేదు, అదీ పరిస్థితి. ఇన్ని దగ్గరపెట్టుకొన్నా- పాపం - వాడికి కుతి తీరలేదు. అందుకని ఈ పేపరువాణ్ణి పట్టుకొని ఇలా ఇలాగ రాయమని చెప్పుకొన్నాడు. పేపరువాడు రాసి పడేశాడు. ఇందువల్ల ఏం ఒరుగుతుందని నువ్వంటావు. ఏమీ ఒరక్కపోతే వాడలా రాయించడని నేనంటాను. తనకూ, నీకూ ఏవో సంబంధాలున్నాయని నలుగురూ అనుకోవడం ఆ సింగారంగాడిక్కావాలి. అప్పటికదో తృప్తి'' అన్నాడు వర్మ.

''లాగి రెండు తన్నక, వాడి వకల్తా పుచ్చుకొస్తారేమిటండీ?'' అన్నది వసంత.

''మీ అక్కయ్యను ముట్టుకోవాలనుకొన్న ప్రతివాణ్ణి తన్నవలసి వస్తే ఆ కార్యక్రమం ముందు నా దగ్గర్నించే ప్రారంభించాలిసొస్తుంది. ఎందుకంటే...''

''చూశావటే వసూ! మీ ఆయన ఎంత గడుగ్గాయో చూశావా! నాకీ ముసుగులో గుద్దులాట సంగతి ఇందాకనే తెలుసు. అందుకే, 'నాటకాలు ఆడ్డం మానేసి, ముట్టుకొని పోవయ్యా మహానుభావా! అన్నాను. అందుకేమో మూతి మూడొంకరలు తిప్పుతూ తెగబారెడు సమాధానం చెప్పుకొచ్చాడు.. అమ్మాయీ, ఇదేమీ బాగా లేదు. ఆయన గనక ఇంకెకు రాకపోయెనా- బాధ పడేది నువ్వే! కనక-'' అని చెవులు పిండమన్నట్లు సైగ చేసింది మంజరి.

శర్మ రెండు చెవులూ మూసుకొన్నాడు 'కుయ్యో' మంటూ.

❦❦❦❦❦❦❦❦

డాక్టర్ పెట్టిన గడువుకన్నా మంజరి ముందుగానే కోలుకొన్నది. అయినా ఆవిడ షూటింగులకు వెళ్ళడం లేదు. అథవా పట్టి బలవంతాన వెళ్ళినా, కాల్‌షీట్ టైమంతా ధ్వంసం కావడమే తప్ప

ప్రయోజనం లేకుండా పోతున్నది. చీటికీ మాటికీ చిర్రుబుర్రులాడటం, ప్రతిదానికీ ఖస్సుమని లేవడం ఆవిడకు అలవాటయిపోయింది. చిన్న చిన్న ప్రొడ్యూసర్లు, ఓ మాదిరి డైరెక్టర్లు ఆమె ముందు నోరెత్తలేకా, ఆ బాధలు పడలేకా ఉడ్డుకుడిచి పోతున్నారు.

"నేను బుద్ధి తక్కువై ఈ లైనులో కొచ్చాను. ఇప్పటికే నేను పెట్టిన డబ్బులో పదివేలు తగ్గించుకొని, ఎవడన్నా కేష్ పడేస్తే సర్వహక్కులూ అమ్మేసుకొని, మా వూరు చక్కాపోతాను" అన్నాడో ప్రొడ్యూసరు.

చాలా మంది చలపతినీ, శర్మనూ చాటుమాటుగా కలుసుకొని, కారణమేమిటని అడగను కూడా అడిగారు.

"అయ్యులారా! అవి మీరు ఆర్చేవీ తీర్చేవీ కాదు. అమ్మాయిగారు విదేశాలకు పోవాలనుకొంటున్నారు. వారి అంచనాల ప్రకారం ఎప్పుడో 'పిలుపు' అంది ఉండాలి. ఇంతవరకూ అలాంటిదేమీ లేదు. అందుగ్గాను వారు చిరచిర లాడిపోతున్నారు. దీనికి మీ దగ్గరేమన్నా విరుగుడున్నదా?" అన్నాడు చలపతి.

"చెప్పండి మరి" అన్నాడు శర్మ.

వచ్చినవాళ్ళు కిక్కురుమనకుండా వెళ్ళిపోయారు.

ఇందులో శర్మగానీ, చలపతి గానీ అనుచితంగా అన్నదేమీ లేదు. ఏదో ఒక ప్రయోజనం లేనిదే, మంజరి అమెరికా దేశపు ప్రతినిదులకు ఆతిథ్యం ఇవ్వదని అందరూ అనుకొంటూనే ఉన్నారు. కానీ దాని వెనుక ఉన్న అసలు సంగతి ఇది అని స్పష్టంగా ఎవ్వరూ పోల్చుకోలేక పోయారు. పక్కా పన్నెండు గంటల్లో ఈ వార్త కారుచిచ్చులా మద్రాసంతా వ్యాపించింది. అధమం ఓ వందమందైనా ఆవిడకు ఫోన్ చేసి, 'విషయమేమి'టంటూ అడిగారు. వారందరకూ ఏమని సమాధానం చెప్పాలో ఆవిడకు పాలు పోలేదు. 'ఔ'నంటే ఏమిచిక్కో, 'కా'దంటే ఏమి చిక్కో మంజరికి తోచలేదు.

"దీన్ని ఎంతో గుంభనంగా ఉంచుదామనుకొన్నాను. రహస్యం కాస్తా రచ్చకెక్కింది. ఈ చవటసన్నాసులు ఎక్కడో నోరుజారి ఉంటారు. మహమ్మారిలా అంతటా అంటుకుపోయింది" అన్నది మంజరి.

"ముఖం వాచేటట్లు కడిగిపారేయక్కాయ్!" అంటూ సలహా చెప్పింది వసంత.

ఆవిడంతపనీ చేసిందో లేదో తెలియదు గానీ- అదృష్టవశాత్తూ- ఆ వేళకు వారిద్దరూ ఇంట్లో లేరు. తిరిగి వచ్చేసరికి ఇల్లంతా సందడిగా ఉంది. జోరీగల గొడ్డుకుమల్లే పెర పర లాడుతుండే మంజరి తన్ను తాను నిగ్రహించుకోలేనంత ఉత్సాహంగా ఉంది.

"దీనికంతా కారణం మీరేనండీ!" అన్నది మంజరి కళ్ళ నిండుగా చలపతిని చూస్తూ. "శర్మగారు కూడా మీకు కుడిభుజం లాగా పనిచేశారు. మిమ్మల్నెలా పోల్చుకోవాలో నాకు తెలియడం లేదుగానీ- మొత్తానికి జయ విజయలకుమల్లే కలిసి - ఈ మహాకార్యాన్ని లాగించారు."

"ఈ సంగతి నాకెప్పుడో తెలుసు" అని కోసి పారేశాడు శర్మ

"అరె! మాట మాత్రమన్నా అనలేదేమండీ?" అని నిష్ఠూరమాడింది వసంత. పెద్దవాళ్లంటారు... చాలా పనులు - అటో ఇటో తేలిపోయిందాకా ఇంకొకరికి తెలియడం క్షేమంకాదు... అఁహ... నువ్వలా వ్యవహారాన్ని పెడలాగకు వసంతా! నీ మీద నమ్మకం ఉండటం, ఉండకపోవడమన్న

ప్రసక్తే లేదు ఇందులో. మూడు రోజుల క్రిందటే నీతో చెప్పాననుకో! విని నువ్వూరుకోవు- మీ అక్కతో చెబుతావు''.

''చెప్పను'' అన్నది వసంత తక్కున.

''మీ అక్కయ్య అన్ని ప్రాణాలూ కూడగట్టుకొని ఎదురు చూస్తున్న వార్త నీకు తెలిసికూడా చెప్పలేదనుకో, వసంతా! నువ్వేం మనిషివమ్మా?'' అన్నాడు శర్మ.

ఆ మాట వింటూనే వసంత రిచ్చపడింది.

''మాట సామెతగా అన్నాను గానీ, చెప్పకుండా ఉంటానటండీ!'' అన్నదావిడ మెల్లిగా తేరుకొని.

''కరెక్టు. నువ్వు సంతోషం పట్టలేక అక్కతో చెబుతావు. ఆవిడకు సన్నిహితులైన వారు అధమం అరడజను మందైనా ఉంటారు గదా! వారందర్నీ పేరు పేరు వరసనా పిలిచి ఈ శుభవార్త చెవిన వేస్తుంది మంజరి. ఆ అరడజను మందికీ కనీసం వో యాభైమందైనా సన్నిహితులుండరా? ఈ పంపిణీమీద ఈ వార్త పాకడానికి అభ్యంతరం మేమన్నా ఉన్నదా? వీరిలో - మంజరంటే ఇష్టంలేని వాడెవడో గట్టిగా పూనుకొంటే- చేసిన ప్రయత్నమంతా ధ్వంసమయి ఊరుకొంటుంది. ఇదంతా నాకు తెలుసు. అందుకనే-'' అన్నాడు శర్మ, చిరుచెమటను తుడుచుకొంటూ.

''నిన్నటినుండీ ఈ వార్త అందరికీ తెలిసిందిగదా మరి -'' అన్నది మంజరి.

''నిన్న నేనూ చలపతిగారూ మీ కోసం వచ్చిన సినిమా కంపెనీ వాళ్ళతో చెప్పాం... అందులో తప్పేముంది? ఈ కాగితం అటుమొన్ననే ఢిల్లీలోని అమెరికా దేశపు రాయబారికి అందింది. ఇలా అందినట్లుగా అక్కడున్న నా స్నేహితుడు వైర్ చేశాడు. వెంటనే చలపతిగారి కొక్కరికీ నేను చెప్పాను. నాకు తెలిసిన అరగంటకల్లా ఆయనక్కూడా ఈ సంగతి తెలుసును'' అన్నాడు శర్మ చలపతి కేసి చూస్తూ.

చలపతి తలాడించాడు.

''ఒడ్డునపడ్డ చేపలాగా నేనిలా గిజగిజలాడిపోతుంటే చూస్తూ ఊరుకొన్నారేగానీ, ఇదీ సంగతి అని మాట మాత్రం కూడా అనలేదేమండీ మీరు?'' అన్నది మంజరి.

''రామాయణమంతా మీకు చెబితిని, మీరు విన్నారాయె. మళ్ళీ మొదలు కొస్తారేం మేడమ్?'' అన్నాడు శర్మ.

మంజరి ఆ మాటలు వినిపించుకొన్నట్లు లేదు. ఆమె మనస్సు చాలా దూర ప్రాంతాలకు షికారుపోయింది. తను ముందుగా ఢిల్లీపోవడం, అక్కడి ఆంధ్ర సంఘం వారి సన్మానం, తరువాత బొంబాయిలో హిందీ సినిమా రంగం చేసే సన్మానాల్లో పాల్గొనడం... తరువాత విమానంలో, సముద్రం మీదుగా అమెరికా దేశానికి పోవడం... అక్కడ తనను ఆహ్వానించడానికి విమానాశ్రయంలో ప్రభుత్వోద్యోగులూ ఫిలిం ప్రముఖులూ రావడం, పత్రికా విలేకరులు చుట్టుముట్టడం, పొటోగ్రాఫర్ల కోసం 'పోజ్'లివ్వడం- అమెరికా దేశంలో టెలివిజన్ కూడా ఉంటుందట - ఆ ప్రోగ్రామ్‌లో పార్టిసిపేట్ చెయ్యడం, తనను గురించి న్యూస్, తన బొమ్మ అమెరికా పత్రికలలో పడటం, ఇండియాలోని ఫిలిం పరిశ్రమను గురించి తన అభిప్రాయాలు వెల్లడించటం- అక్కడి ఆర్టిస్టులతో కలిసి తను ఫొటోలు తీయించుకోవడం- ఇల్లాగ - ఎన్నెన్నో ఆలోచనలు పొర్లిపోతూ ఉన్నాయి.

హఠాత్తుగా ఆమెకు, తన సమయాన్ని దుర్వినియోగం చేస్తున్న భావన కలిగింది! తన ముందు కట్టుకుపోయినంత కార్యక్రమముంది. దీన్నంతా వొక క్రమపద్ధతిలో సర్దుకోవాలి. ఇండియాను గురించి అక్కడి వారెన్నో ప్రశ్నలడగవచ్చు. మరీ వివరంగా కాకపోయినా- స్థూలంగానైనా సమాధానాలు చెప్పకపోతే అసహ్యంగా ఉంటుంది. అలాగే అమెరికాను గురించి కూడా తనకు చాలా తెలుసునన్నట్లుగా బిహేవ్ చెయ్యాలి, తెలుసుకోవాలి కూడాను. ఆ దేశానికి సంబంధించిన అన్ని విషయాలనూ తెలివిడిచేసే పుస్తకాలుంటాయట. ముందుగా వాటిని తెప్పించుకొని చదవాలి. చదివి, అర్థం చేసుకోడం ఆలస్యమవుతుందనుకొంటే, ఇంకెవరి చేతనన్నా చదివించి, తెలుగులో చెప్పించుకోవాలి. వీటన్నింటికీ మించి, మరో చిక్కున్నది. తను తప్పో, వొప్పో తడుముకోకుండా, ఇంగ్లీషు మాట్లాడేస్తుంది. ఇండియన్స్ మాట్లాడే ఇంగ్లీషు కూడా తనకు బాగానే అర్థమవుతుంది. కానీ అమెరికనుల ఉచ్చారణ తనకు సరిగ్గా బోధపడదు. వారు సగం సగం మాటలు మింగేసి మాట్లాడతారు. ఈ బెదదనుండి తప్పుకోవాలంటే, తనిప్పటినుండే ఆ ఉచ్చారణకు అలవాటు పడాలి. అంటే ఎక్కువగా అమెరికన్లతో కలిసిమెలిసి ఉండాలన్నమాట! ఇవన్నీ ఇంకెవరో చేస్తే తను తీరికూచుని ఆనందించడానికి లేదు. అన్ని పనులూ స్వయంగా తను చూసుకోవలసిందే!

మంజరి, ఇంకోసారి తన చేతిలో ఉన్న పేపరు కేసి చూసింది!

ఆమె కళ్ళు కాంతితో నిండిపోయాయి!

# 30

మంజరికిప్పుడు పట్టపగ్గాలు లేకుండా ఉన్నాయి. ఎంత ఆపుకొందామన్నా ఈ ఉత్సాహం బయటపడుతూనే ఉంది. కాలం- మరీ నెమ్మదిగా గడుస్తున్నదేమోననిపించిందావిడకు. ఎందుకయినా మంచిదని, మద్రాసులో ఉన్న అమెరికన్ కుటుంబాలు కొన్నింటిని కలుసుకొన్నది. ఆ దేశంలోని ఆచార వ్యవహారాలను గురించి, సాఃఘిక జీవితాన్ని గురించి ఆవిడ ఎన్నో విషయాలను వారి నుండి నేర్చుకొన్నది. అదిగాక 'అమెరికా ప్రజలు - ప్రభుత్వము- - 'అమెరికా దేశపు సంస్కృతి- - 'అమెరికన్ ప్రజల సాంఘిక జీవనం' వంటి పుస్తకాలూ చాలా తెప్పించి చదువుకొన్నది. ఈ సమాచారం చాలా పోగుపడిన మాట నిజమేగానీ, ఇదంతా ఎప్పుడు, ఎక్కడ ఉపయోగపడుతుందో ఆవిడకు తోచలేదు. తన కాలంలో ఎక్కువ భాగం ఆ కుటుంబీకులతో గడపడం ద్వారా ఆవిడ అమెరికా భాషోచ్ఛారణను అవగాహన చేసుకొనేందుకు వీలు కలిగింది. అలాగే భారతదేశాన్ని సంగ్రహంగా పరిచయం చేసే పుస్తకాలు కొన్ని చదివింది. కొన్ని పుస్తకాలనుండి మంజరి నోట్సు కూడా తీసుకొన్నది.

ఆ గొడవ ఇలా సాగుతున్న సమయంలోనే చిన్న చిన్న కంపెనీలవారు తమ పిక్చర్లు పూర్తి చేసుకోవడానికి తొందరపడసాగారు. దాదాపు మూడు మాసాలపాటు మంజరి అమెరికా దేశపు అతిథిగా ఆ దేశంలో పర్యటిస్తుందాయె! ఆ తరువాత ఆగ్నేయాసియా దేశాలమీదుగా ఇండియాకొచ్చేసరికి- ఎంత హీనమైనా ఇంకో మాసంన్నర దాకా నన్నా పట్టవచ్చు. ఈలోగంతా ఇంకే దేశమన్నా అటునుండి అటే- మధ్యంతరంగా - మంజరిని ఆహ్వానిస్తే, ఆ వ్యవధి ఇంకా పెరిగిపోక తప్పదు. అంతదాకా

సినిమా రిలీజ్ కాకపోతే ఇహ బొచ్చె చేతికొచ్చినట్లే లెఖ్క. ఈలోగా ఇంకో నాలుగు సినిమాలు రిలీజుకు సిద్ధమవుతాయి. వాటి పోటీని తట్టుకోవడం కష్టం. ఆ తరువాత రిలీజ్ చెయ్యడం మంచిది కాదు. ఇవన్నీ ప్రతి ప్రొడ్యూసరు చూసుకోవలసిందే!

ఎక్కువ సినిమాలకు వొప్పుకోవడం ఎంత బుద్ధి తక్కువో మజరికి నసాళానికంటేంతగా అర్థమయింది. కాళ్ళా వేళ్ళా పడేవాళ్ళ దగ్గర్నుంచి కళ్ళెర్రచేసే వారిదాకా ఉన్నారు. వీరందర్నీ తమ నయానో భయానో సంతృప్తి పరచవలసిందే. అమెరికా ఆహ్వానం చూసుకొని వీళ్ళను కాదనడానికి లేదు. చిత్రమేమిటంటే, ఇంతమంది, ఇంతగా తనకు సినిమాల్లో అవకాశం ఇచ్చారు గనకనే, తనీరోజున అమెరికా దేశం పోగలుగుతున్నది. ఈ దేశంలో ఎంత మందికిలాంటి మహదవకాశం కలుగుతుంది గనకా!

మంజరి మనస్సిప్పుడు ఇసుల్క పుట్టకన్నా కనాకష్టంగా తయారయిపోయింది. అమెరికా ప్రయాణ సన్నాహాలు, సినిమాల కురదలాలను పూర్తి చేయడం, ఈ మధ్యనే 'అనారోగ్యం' నుండి బయటపడడడం, ఆ దిక్కుమాలిన పత్రిక వాడు 'సశేషం' అంటూ తనమీద వ్యాసాలు రాయడం, వెళ్ళేలోగా పెళ్ళి పనులు పూర్తి చేయమంటూ శర్మ వత్తిడి చేయడం- అదేదో ప్రాజెక్టు పని తమ కంపెనీకే ఇప్పించమంటూ గుజరాత్ వ్యాపారి 'త్రివేది' కళ్ళముందు లక్షలు మెరిపించడం, రాజన్ సణుగుడు, బొంబాయి నుండి 'లాలారాం' లెటిగ్రాములు- ఇంకేదో ఊళ్ళో మూసివేయబోతున్న హైస్కూలుకు భారీ ఎత్తున విరాళమివ్వమంటూ విజ్ఞప్తి చేస్తూ ఓ ముఠా వొచ్చిపడడం- ఎన్నింటినని ఆవిడొక్కతే చూసుకొంటుంది? పోనీ- ఇంకొకరి నిర్ణయానికి వొదిలే సమస్యలు కూడా కావివి. అవునో - కాదో తను చెప్పాలి. ఏ సంగతి చెప్పడానికయినా, తనావిషయాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకోవాలి. తనకు రవంత వెసులుబాటు దొరికితే, ఇలాంటి బోడి సమస్యలు లక్షల పాల్వు చేసుకొంటుంది. కానీ ఆ వెసులుబాటేది?

ఏది ఏమయినప్పటికీ తను వెళ్ళేలోగా ఈ బీరకాయ పీచును ఏదో విధంగా వొదిలించుకోవాలనీ, తనతోబాటు అమెరికా దేశం దాకా ఈ బేవార్సు వ్యవహారాలను తీసుకుపోకూడదనీ మంజరి తలపోసింది. శర్మ పెళ్ళినిమాత్రం - తను తిరిగి వచ్చిందాకా వాయిదా వేసింది. సరోసురోపడి చాలా వరకు కొద్ది కొద్దిగా ఉన్న సినిమాలన్నీ పూర్తి చేసింది. హైస్కూలు వాళ్లకు వేయిన్నూట పదహార్లకు ఓ చెక్కు పంపించి, 'ఇంతకు మించి నావల్లకాదు' అని కూడా ఉత్తరం చివరన ఓ ముక్క చేర్చింది. తనకిప్పుడు తీరిక లేదనీ- మళ్ళా తను తిరిగొచ్చిందాకా ఆగే పక్షంలో ప్రాజెక్టు కంట్రాక్టు వ్యవహారం గురించి చేయగలిగిందేదో చేస్తానని త్రివేదికి చెప్పి పంపేసింది. ఓ రాత్రి సందుచూసుకొని రాజన్ సణుగుడును ముందు వేసింది. లాలారాంకు తానొచ్చినప్పుడు అన్ని వివరాలూ మాట్లాడుకొందామని ఫోన్ చేసింది.

ఎంత తొందరపడ్డా మూడున్నర మాసాలకు పైగా పట్టింది. ఫార్మాలిటీస్ అన్నీ పూర్తి కావడానికి. ఇంకో పదిరోజులకు ప్రయాణమనగా, మద్రాసులో ఉన్న పెద్ద పెద్ద సినిమా కంపెనీలు, డిస్ట్రిబ్యూటర్లు, ఆర్టిస్టులు, పూటకొకరు చొప్పన మంజరికి పార్టీలివ్వసాగించారు. తొలిగా పార్టీ ఇచ్చిన పెద్ద మనిషి రావుగారు. ఆయనా సందర్భంలో చిన్న ఉపన్యాసం కూడా ఇచ్చారు.

"మంజరిగారు విదేశాలకు వెళ్ళడమంటే, మద్రాసు సినీ పరిశ్రమ వెళ్ళడమన్న మాటే! ఆంధ్ర చలన చిత్ర కళామతల్లి తన ప్రజ్ఞా ప్రాభవాలను దేశ దేశాలలోనూ ప్రదర్శించగల మహదవకాశం ఈనాటికైనా లభించినందుకు చాలా సంతోషం. ఈమె మంజరిగా కాక - మనందరి ప్రతినిధిగా అమెరికా దేశం వెళ్ళుతున్నదని నేను మనస్ఫూర్తిగా భావిస్తున్నాను. ప్రాచ్య - పాశ్చాత్య దేశాల నాగరికతలు భిన్నమైన వైనప్పటికీ, వాటి పునాదులు వొక్కటేననడంలో సందేహం లేదు. ప్రజల హృదయాలంతరాళాలలో, వారి జీవన విధానంలో ఈ పునాదులున్నాయి. బాహ్యంగా, ఎంతో వైవిధ్యంతో కనిపించిన ఈ రెండు సంస్కృతులకూ మంజరి వారధివంటి వారని నేను హృదయపూర్వకంగా నమ్ముతున్నాను" - ఈ ధోరణిలో ఆయన అరగంట సేపు మాట్లాడారు.

మంజరి అమెరికా దేశం వెళ్ళడానికీ, ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతులకూ సంబంధమేమిటని అడిగిన వాడొక్కడు లేడు. ఇటీవల రావుగారు అభివృద్ధిపరచిన లలిత కళల్లో 'ఉపన్యాసం' వొకటి. అది ఏ సందర్భంలో కానీయండి, ఆయనగారు కళ, సంస్కృతి, సాహిత్యం, సృజనాత్మకత, వస్త్వైక్యం, అది భౌతిక పరమార్థం, తాదాత్మ్యం, భావవ్యంజనం వగైరా వగైరా పదాలను రెండేసి నిమిషాల కొకటి చొప్పున పేల్చి పారేయడం అభ్యసించారు. దీనివల్ల వారికి 'నటన'తో బాటుగా ఇంకా అనేక విషయాలలో పరిపూర్ణమైన ప్రవేశమున్నదన్న భ్రమ ఏర్పడసాగింది. బాగా తెలిసినవారికి రావుగారితో విరోధం పెట్టుకోవడం ఇష్టంలేదు. ఏమీ తెలీనివారు ఇదంతా నిజమేనని గాఢంగా విశ్వసించారు. ఇక రావుగారి ధోరణికి అడ్డేమున్నది?

ఆఖరుకు విజయ, చంద్రం కూడా బ్రహ్మాండమైన పార్టీ ఇచ్చారు. లోలోపల ఎన్ని కలతలున్నా అందరూ కలిసికట్టుగా- కనీసం పైకయినా- ఆ పది రోజులూ పని చేశారు. "ఈ పార్టీలతో ఊపిరాడక చచ్చేటట్టున్నాను. ఖర్మకాలి నా జాతకంలో అమెరొతీఇకాదేశం వెళ్ళేరాత  ఉన్నదో లేదో" అన్నది మంజరి చాలాసార్లు విసుగుతో.

చలపతి ఓ పెద్ద మనిషిని - పదహారనాల తెలుగువాణ్ణి- ఓ రాత్రి పూట పట్టుకొచ్చి మంజరికి పరిచయం చేశాడు.

"ఎవరు?" అన్నది మంజరి ఆ పదహారణాల తెలుగువాడికి నమస్కారం చేస్తూ.

"నా స్నేహితుడు, విజయవాడలో పుస్తకాల కంపెనీ పెట్టుకొన్నాడు. పోటీవల్ల పైకి రాలేకపోతున్నాడు. మీ పుస్తకం వేస్తాట్ట. మీచేత 'సరే' అనిపించుకు పోదామని - " అంటున్నాడు చలపతి.

"నా పుస్తకమేమిటి చలపతీ?" అనేసింది మంజరి.

అన్న తరవాత నాలుక కొరుక్కున్నది. చలపతి ఆ పెద్ద మనిషితో ఇంతకుముందు ఏమన్నాడో తనకు తెలీదు. పుటుక్కున తను నోరు జారింది! తనో గొప్ప రచయిత్రినని చలపతి ఆ పెద్ద మనిషితో చెప్పి ఉండడమే జరిగితే, పాపం- అతనేమయిపోతాడు?

"అదేనండీ!" అంటూ ఎంతో విషయంగా సమాధానం చెప్పసాగాడు చలపతి, "మీ జీవిత చరిత్రను, సచిరతంగా ప్రకటిస్తానంటున్నారు..."

"సరే"నన్నది మంజరి అయోమయంగా.

''నువ్వు పద కిష్టయ్యా! అమ్మగారూ 'సరే'నన్నారుగా, మిగతా విషయాలు నేను మాట్లాడివస్తాను...'' అంటూ ఆ పదహారనాల తెలుగువాణ్ణి అవతలకు పంపేశాడు చలపతి.

తీరా అతను వెళ్ళిపోయాక ''ఏమిటీ కథంతా?'' అన్నది మంజరి.

''నిన్నెందుకు అమెరికా దేశానికి ఆహ్వానించారో, చాలా మందికి తెలీదు. దానికి బలమైన బ్యాక్ గ్రౌండ్ మనం ఏర్పాటు చేసుకోకపోతే నలుగురూ నాలుగు మాటలు అంటారు. ఇప్పుడు పార్టీల్లో నిన్నాకాశానిక ఎత్తేస్తున్న వారంతా నువ్వంటే యిష్టముండే ఆ పని జేస్తున్నారనుకోకు. ఎంతమంది లోలోపల కుళ్ళుకుపోతున్నారో నాకు తెలుసు... వాళ్ళందరకీనకూ సమాధానంగా ఉండేలాగున ఈ పుస్తకం తయారు కావాలి. ఈ కిష్టఇగాడు న్యూస్ ప్రింట్ కోసం ఇక్కడికొచ్చాడు. పనిలో పనిగా ఈ పుస్తకం తగిలించాను'' అన్నాడు చలపతి.

''మరి రాయాలిగదా?''

''రాయాలి! నువ్వొచ్చేదాకా ఈ శర్మగాడు చేసేపనేమిటట? ఈలోగా దీన్ని తయారు చేస్తాను. నువ్వు ఎప్పటికప్పుడు, అమెరికా వార్తలు, ఫొటోలు పంపుతూ ఉండు. మేమిక్కడ వాటి కాపీలు తీసి బాగా పబ్లిసిటీ యిస్తాం. అలాగే, ఆ దేశంలో నీ ఫొటోలు పబ్లిష్ చేసిన పత్రికలు, నీ ఇంటర్వ్యూలు వచ్చిన మాగజైన్లు... ప్రముఖులను నువ్వెప్పుడెప్పుడు కలుసుకొన్నదీ ఆ తేదీలు, వేళలూ, నీకు ఆతిథ్యమిచ్చిన వారిపేర్లు, నీకు సన్మానం చేసిన సంస్థల చిరునామాలు... ఇల్లాగ, ప్రతి చిన్న విషయాన్నీ నోట్ చేసుకొని అట్టేపెట్టు. లేదా- ఏ రోజు విశేషాలు, ఆ రోజునే రాసి మాకు పంపించు- అవన్నీ మేము జాగ్రత్తపరుస్తాం. నువ్వు తిరిగొచ్చాక...''

''ఊఁ'' అన్నది మంజరి, అతను ఆగడం చూసి.

''వీటి సాయంతో నువ్వో పుస్తకం ప్రచురించవచ్చు. నీ జీవిత చరిత్రకన్నా నీవు రచించిన ఈ పుస్తకం ఇబ్బడి ముబ్బడిగా అమ్ముడుపోతుంది... ఎందుకూ నవ్వడం... అమ్మకం కాదనా నీ అనుమానం -''

''కాదు... నేను రాయడమేమిటాని!'' అన్నది మంజరి.

''సరే! ఏదో చెయ్యి... అన్నట్టు- నా వెంట నువ్వు కూడారావడానికి వీలుపడుతుందా? బహుశా అలా కుదరదనుకొంటాను. అలాంటి అవకాశం ఉంటే ఎంత బావుండును!'' అన్నది మళ్ళీ.

ఆవిడకు తనమీద అంతకద్దు అనురాగం ఎందుకేర్పడిందీ చలపతికి తెలియలేదు. ఆ ఆనందంలో ఉక్కిరి బిక్కిరయి, అతనింకో సూచన కూడా చేశాడు.

''ఆ దేశంవాళ్ళకు వ్యాపారమంటే చాలా ఇష్టం. అందుకోసం ఎంత దూరదేశమయినా పోతారు. లాభాలొస్తాయనుకుంటే, ఎత పెట్టుబడి పెట్టమన్నా పెడతారు. నీకక్కడ ఆ బాపతు మనుషులు తటస్థపడితే- తప్పకుండా ఎదురవుతారనుకో- ఈ విషయం కదిపి చూడు... ఎందుకంటున్నానంటే అమ్మాయ్!... ఎంతకాలం కొట్టుకు చచ్చినా ఈ సినిమా ఫీల్డు నమ్మతగింది కాదు. ఎప్పుడో ఒకప్పుడు మనం చల్లగా తప్పుకోవలసిందే! ఆ నాటికి మన చేతిలో ఏముంటే అదే మనకు దక్కుదల. ఆ నాలుగు రాళ్లూ మార్చుకొని తింటుంటే - ఎంతకాలం వస్తాయి గనుక? తీయడం ప్రారంభిస్తే కొండల్లాంటివి తరిగిపోతాయి. ఇహ నీ బోడి సంపాదనొక లెక్కలోదికాదు. అంచాత - తెలివిగా -

ఈలోగానే - ఏదో వో ఇండస్ట్రీ ప్రారంభించావే ననుకో! బాలారిష్టాలన్నీ గడిచి, అది నిలబడగలిగే నాటికి, నువ్వూ ఈ ఫీల్డు నుండి రిటైరవుతావు. కడుపులో చల్ల కదలకుండా, ఈ ఇండస్ట్రీస్ చూస్తూ కూచోవచ్చు. నువ్వయినా, నేననయినా ఎంతకాలమని ఈ లాయలాసా పడగలమో చెప్పు?'' అని బోధించాడు చలపతి.

మంజరి ఏమీ అనలేదు. తలపంకించి సన్నగా నిట్టూర్చింది.

''నా మాటలు నీకు నచ్చలేదు కదూ?'' అన్నాడు చలపతి.

''అబ్బే- అది కాదు'' అన్నది మంజరి తనను తాను సర్దుకొంటూ. ''నువ్వెంత దూరంగా ఆలోచిస్తావో తలుచుకొంటే ఆశ్చర్యం వేస్తుంది చలపతీ! భగవంతుడు నాకీ తెలివి ఎందుకివ్వలేదోననుకొంటాను చాలా సార్లు.'''

''లోకం భగ్గుమని మండిపోదా నా తల్లీ!'' అనుకొన్నాడు చలపతి.

పైకి మాత్రం -

''ఆ - సింగినాదం తెలివితేటలు పోనిస్తూ'' అని చప్పరించేశాడు చలపతి.

ఇంకా అక్కడే ఉంటే ఏమేం చెబుతాడోనని, ఏదోపని పురమాయించి అవతలకు పంపించేసింది మంజరి. అతగాడు వెళ్ళాక, ఆ వెళ్ళిన దిక్కుగా మెటికలు విరిచిందావిడ.

ఎంత కాదనుకొన్నా చలపతి చెప్పిన మాటలే చెవుల్లో గింగురుమంటున్నాయి. తనకింకా ఎక్కువ కాలం ఈ రంగంలో చోటుందని ఎప్పుడో ఊహించింది మంజరి. ఈనాడు తనకోసం పడిగాపులు పడుతున్న జనమే రేపు తను కనిపిస్తే చీదరించుకోవచ్చు. అయితే ఆ దశ రావడానికి హీనమైన ఇంకో పది సంవత్సరాలు పడుతుంది. ఈలోగా తన పేరు దివిటీలు వెలగవలసిందే! తనమాటకు ఎదురుండకూడదు. ఇక ముందెప్పుడో ఏదో అవుతుందని, ఆ అయ్యేదాన్ని తలచుకొంటూ ఇప్పటినుండే మధనపడటం మాత్రం ఏం భావ్యం గనుక! ఆ పదహారోనాడు, తను ఇబ్బంది పడవచ్చు, పడకపోవచ్చు. అప్పటి స్థితిని చూసి జడుసుకొని, తనీ నిమిషం నుంచే హడలుకు చావడం కేవలం అనవసరం! ఉన్నంత వరకూ నిప్పులాగా మండవలసిందే! లేనప్పుడు బూడిద కమ్ముకొని మగ్గిపోవలసిందే! కాకిలాగా పదికాలాల పాటు ఉసూరుమంటూ బతకడంలో ఆనందం లేదు...

ఆ రాత్రి నిద్రపడుతుందన్న ఆశ బొత్తిగా లేకపోయింది మంజరికి. మనస్సును కుదుటపరచుకొందామనుకొన్నాకొద్దీ, అది చెల్లా చెదురుకాసాగింది. పోనీగదాని గట్టిగా కళ్ళు మూసుకుంటే - కళ్ళు తెరిచనప్పటి విషయాలే మెదలుతున్నాయి. పూర్వంలాగా 'పానీయం' పుచ్చుకుంటే, నిరద ముంచుకురావడం లేదు. నిద్ర సంగతి దేవుడికి తెలుసు- కనీసం - హైలెవెల్ మత్తు కూడా కలగడం లేదు. ఏదో తీసుకొన్నమన్న సంతృప్తి తప్ప ఆ తీసుకోవడం వల్ల పూర్వం అనుభవించిన థ్రిల్లింగ్ వొచ్చి ఎంత కాలమయిందో! తనొక వేపున ఒక్కొక్క మెట్టే పైకెక్కి పోతూ ఉంటే, ఇంకో వేపున మామూలు మనుషులకుండే సుఖసౌఖ్యాలు కూడా లేకుండా పోతున్నాయి. అయినా- సంపాదనమీద, కీర్తి మీద తనకింకా యావ పోలేదు! మనిషి దుఃఖబంధాలనుండి తప్పుకోలేనట్లే సుఖబంధాలనుండి కూడా తప్పుకోలేదేమోననిపి

స్తుంది.

అనవసరంగా ఆవలించి, అంతకాన్న అనవసరంగా వొళ్ళు విరుచుకొని పక్కమీద అటూ ఇటూ పొర్లింది మంజరి. గడియారం టిక్కు టిక్కులు, దూరంగా పహరావాడి బూట్ల చప్పుడు తప్ప ఇంకే శబ్దమూ వినిపించడం లేదు.

రేపీ వేళకు తను ఢిల్లీలో ఉంటుంది. ఆ తరువాత - బొంబాయి, అటునుంచి బీరూట్, లండన్- అలా అలా - నగరం నుండి నగరానికి, దేశం నుండి ఇంకో దేశానికీ రివ్వున ఎగిరిపోతూ-

ఈలోగా సర్దుకోవలసినవి ఇంకా చాలా ఉన్నాయి. ఎందుకైనా మంచిది, పత్రికల వాళ్ళకో పార్టీ ఇవ్వనున్నాడు శర్మ. ఫిలిం ఇండస్ట్రీ మొత్తనికి డిన్నర్ ఏర్పాటు చేయడం బావుంటుంద న్నాడు చలపతి. తను దానికీ దీనికీ కూడా తలూపింది. ఇన్నిటికీ చలపతి ఆ ఏర్పాట్లేమన్నా చేశాడా లేదా?

మంజరి చలపతి గదికి ఫోన్ చేసింది. బెల్ మోగుతున్నదేకానీ ఎవ్వరూ ఎత్తలేదు.

"ఉత్త దున్నపోతు!" అనుకొన్నది మంజరి.

"ప్రతిదీ నేనే కనుక్కొంటూ ఉండాలి. ఏ మాత్రం కనుమరిగినా, ఏదో పీకలమీదకి తీసుకొచ్చి పెడతారు. ఈ తెలివి తక్కువ సంజ్ఞతో ఇక వేగలేను" అని గొణిగింది మంజరి.

ఆ వెంటనే ఆవిడకింకో విషయం కూడా జ్ఞాపకం వచ్చింది. ఇంతవరకూ జరిగిన ప్రయత్నాల్లోనూ, వాటి జయాపజయాల్లోనూ తనపాలెంత? చలపతి, శర్మల పాళ్ళెంత? వీరుగా - ఇంకా రెవరన్నా అయితే, తనిన్ని పనులు సాధించగలిగేదేనా? వీరయినా ఇంకొకరి కోసం ఇంతలా శ్రమ పడతారా? పడతారని చెప్పడం సాహసమవుతుంది. అయినప్పుడు తనెందుకలా వారిమీద చీటికీమాటికీ కస్సుబస్సుమనడం?

మంజరి తల చిటచిటలాడిపోయింది. సొరుగులోంచి సీసాలాగి కొన్ని బిళ్ళలు మింగి- నీళ్ళు తాగింది. బిళ్ళలు గొంతులోనే చిక్కడినట్లనిపించింది. ఇంకో గుక్కెడు నీళ్ళు గుటక వేసింది.

తన గదిలో ఈ పక్కమీద ఇలా పడుకోవడానికి- బహుశా ఇదే ఆఖరు కావచ్చు. తను దేశాల నుండి తిరిగొచ్చాక బొంబాయిలో స్థిరపడిపోదామనుకొంటున్నది. అక్కడ- తనకు అన్ని వసతులూ సక్రమంగా ఉంటే - మద్రాసులోని ఈ ఇళ్ళను, వసంతకో - రాజమణికో ఇస్తుంది - ఇష్టమయితే - బుద్ధిపుడితే; లేదా- వారికి తెలియకుండానే రాసిపారేస్తుంది! అదీ కానప్పుడు మద్రాసు యూనివర్శిటీకి డొనేషన్ కింద ఇచ్చేస్తుంది. తెలుగుదాన్నయి ఉండి కూడా అరవ విశ్వవిద్యాలయానికి రాసిచ్చినందుగ్గాను తెలుగు పత్రికలు తనను దుమ్మెత్తిపోస్తే పోయవచ్చు. కానీ తన సంపాదనలో ఎక్కువ భాగం తమిళదేశంనుండే వచ్చింది. వాళ్ళ డబ్బు వాళ్ళకిస్తే తప్పేముంది?

అయినా తనకివేం ఆలోచనలుట! అన్నీ అప్పగింతలు పెట్టవలసిన అవసరం ఇప్పుడేమొచ్చిందీ?

ఏమొచ్చిందో మంజరి చెప్పుకోలేకపోయింది. ఎందుకంటే - అప్పటికే ఆవిడ మనస్సంతా మబ్బు కమ్మినట్లయిపోయింది. కనురెప్పలు బరువుగా కిందికి వాలిపోతున్నాయి. మెడదాకా పచ్చడం లాక్కుని పక్కకు తిరిగింది మంజరి.

డ్రాయర్ సొరుగులోని 'గార్డినాల్' సీసా బోసిగా ఆమెవేపు చూసింది.

- ఆ మొన్నాడు, అక్షరాలా మంజరికి ఊపిరి పీల్చుకోవడానికైనా తీరిక లేకపోయింది.

మద్రాసులోని ఫిలిం ప్రముఖులొక్కక్కరే ఆమెను అభినందించిపోసాగారు. కొందరి దగ్గరకు ఆవిడే స్వయంగా వెళ్ళి వారి ఆశీర్వాదాలు పుచ్చుకొని మరీ వచ్చింది. మాధవరావుకు, రామచంద్రానికీ వారం రోజుల కింద టెలిగ్రాములు ఇచ్చింది. వారి నుండి జవాబు లేదు.

"రిప్లయి పెయిడ్ టెలిగ్రాం ఇవ్వండి" అన్నది మంజరి ఆ రోజు ఉదయమే.

శర్మ ఇచ్చానన్నాడు కూడాను. కానీ జవాబు లేదు. ఇంకోసారి కనుక్కోవడానికి శర్మ కూడా అందుబాటులో లేడు. అతను బ్రహ్మాండమైన పార్టీ ఏర్పాట్లు చేస్తున్నాడు. సినిమా పత్రికలకు ప్రశ్నలు రాసే వాళ్ళని కూడా ఆ పార్టీకి ఆహ్వానించాడతను.

"చాలా జింజిఖానా పెట్టుకొన్నావయ్యా శర్మాజీ!" అన్నది మంజరి.

"మన వసంతా వారితోనే ఉన్నది. రేపు మీ న్యూస్ వేయవలసిన వాళ్లూ, మీ బొమ్మ అచ్చు వేసేవాళ్ళూ వీళ్ళే! ఈ జనం గనక 'ఆఁ సింగినాదం' అనుకొన్నారో, మీరు అమెరికాదేశం వెళ్ళినా, అంతరిక్షానికెళ్ళినా మీ పొరుగువాడికి తెలీదు. అంచాతనే నేనిన్ని బదవలు పడుతూంట-" అన్నాడు శర్మ.

అతనింకో విశేషం కూడా చెప్పాడు.

"ఈ పార్టీకి కొంత మంది అమెరికా దేశం వాళ్ళను కూడా పిలిచాను. వారుగానీ, ఇంకెవరన్నాగానీ నిన్ను రకరకాల ప్రశ్నలడిగితే - అడుగుతారనుకో - ఠకామని చెప్పెయ్యి. మరీ కంఠతా పట్టింది వొప్పగించినట్టు కాకుండా - ఆ విషయంతో నీకు క్షుణ్ణంగా పరిచయమున్నట్టు మాట్లాడు... మధ్య మధ్య, కాస్తంత తడుముకొన్నట్టూ, ఆలోచించినట్టూ, ఇలా అలా సాగిపోవాలి... ఇదంతా నీకు కొత్తకాదుగదా మేడమ్! మామూలుగా నువ్వు చేస్తూ ఉండేదే!" అన్నాడు శర్మ.

మంజరి తలూపింది.

ఆవిడ భయపడుతున్నదని కాదుగానీ, ఏదో బెరుకు మెరుగ్గానే ఫీలవుతున్నదనడం మాత్రం నిజం.

ఆ విషయం పార్టీ ఇస్తున్నప్పుడు మరింత స్పష్టంగా తేలిపోయింది.

"ఆ ఆహ్వానం మీకే రావడానికి ప్రత్యేకమైన కారణం ఏదన్నా ఉన్నదా?" అని అడిగాడొక విలేకరి.

ఆ ప్రశ్న మంజరి ఊహించనిది. దానికి జవాబు ఆవిడ దగ్గర సిద్ధంగా లేదు. ఆవిడ తత్తరపడుతూ శర్మకేసి చూసింది.

అతనొక పక్కగా రెండు వరసల వెనగ్గా ఉన్నాడు. ఆ సమయంలో శర్మ చెయ్యగలిగిన సాయం కూడా ఏమీ లేదు.

"మీరేమీ చెప్పలేరా?" అన్నాడతనే.

మంజరి తలెత్తి అందరి కసీ ఓసారి చూసింది.

"మీలాంటి పెద్దల ఆశీర్వాదమే ప్రత్యేకమైన కారణం!" అన్నది.

చిన్న కలకలం చెలరేగి సర్దుకొన్నది.

"మన దేశపు సినిమాలు, విదేశీవాటికన్నా - సాంకేతికంగా తక్కువ స్థాయిలో ఉ

ంటాయిగదా! ఇందుక్కారణమేమిటని అమెరికా దేశీయులడిగితే మీరేం చెబుతారు?'' అన్నాడో విలేకరి.

``అన్ని సినిమాలూ - సాంకేతికంగా తక్కువ స్థాయిలో ఉన్నాయన్న వాదనతో నేనేకీభవించలేను. సత్యజిత్ రాయ్ సినిమాలు ఏ విదేశీ చిత్రాల స్థాయికీ తీసిపోవు'' అన్నది మంజరి.

``మన ఆచార వ్యవహారాలను చూసి, వారు పరిహసించవచ్చు.అ ప్పుడేం చేస్తారు?'' అన్నాడతనే.

``అలా జరగదు. వారు నమ్మకావాలని తమ దేశానికి ఆహ్వానిస్తున్నారు; అదీ ప్రభుత్వ స్థాయిలో. ఒక విదేశీ అతిథిని ఇబ్బందిపడే ప్రశ్నలడిగి అవమానపరుస్తారని నేననుకోను... దురదృష్టవశాత్తూ అలానే జరిగితే, నా నిరసనను తెలియపరచి, నా పర్యటనను రద్దు చేసుకొంటాను.''

``హియర్ హియర్'' అన్నారెవరో వెనకబెంచీలనుంచి.

``మన సినిమా పరిశ్రమకు, మీ పర్యటన ఎలా లాభిస్తుంది?'' అన్న ప్రశ్నకు మంజరి మంచి సమాధానం చెప్పింది.

``ఈ రోజుల్లో ఏ దేశపు సంస్కృతి అయినా గిరిగీసి, మడిగట్టుకు కూచోవడం సాధ్యం కాదనుకొంటాను. యూరప్ నుండి మనం చాలా నేర్చుకొన్నట్లే, మన నుండి యూరప్ దేశాలు కూడా ఎంతో నేర్చుకొన్నాయి. అలాగే మన సంస్కృతి ప్రభావం ఆగ్నేయాసియా దేశాల మీద ముమ్మరంగా ఉంటే - మనమీద ఇంగ్లండ్, అమెరికా దేశాల నాగరికత ప్రభావం హెచ్చుగా ఉన్నది. ఇది మనం కాదనలేని సత్యం. ఇందులో ఏది గొప్పది? అన్న ప్రశ్నకు తావే లేదు. దేని గొప్పదనం దానిదే! నేను సాంస్కృతిక ప్రతినిధిగా మారతమే ఆ దేశం పోతున్నను. ఈ పర్యటన వల్ల కలిగే లాభమేమిటో, ఇప్పటికిప్పుడే నేను అంచనా వేసి చెప్పలేను. ఇటువంటి సుహృద్భావ పర్యటన వలన కలిగే ఫలితాలను గ్రాఫ్ గీసి చూపెట్టడం సాధ్యం కాదేమో మరి! అయినా అమెరికా దేశీయులకు భారతీయ సాంస్కృతిక జీవన విధానాన్ని గురించి నాకు తెలిసిన మేరకు చెప్పగలనని మీకు మాట ఇస్తున్నాను. నాకుగానీ, నన్నీ స్థాయికి తీసుకొని వచ్చిన ఈ పరిశ్రమకుగానీ, నా జీవితానికిగాని మచ్చను తెచ్చే ఏ పనీ నేను చేయనని మీకు హామీ ఇస్తున్నాను. అలాంటి కార్యకలాపాలలో పాల్గొనబోనని మీ ముందు శపథం చేస్తున్నాను...''

ముందుగా చేసుకొన్న ఏర్పాట్ల ప్రకారం శర్మ చప్పట్లు కొట్టాడు. నిమిషం తిరక్కముందే ఉప్పెనగా ఆ చప్పట్ల ధ్వని అంతటా వ్యాపించింది.

``దేశాలమధ్యా, జాతుల మధ్యా సరిహద్దులు చెరిగిపోతున్నాయి... భూగోళమంతటా వొకేవొక ప్రభుత్వం ఏర్పాటు కాగల శుభదినం ఎంతో దూరంలో లేదు. ఐక్యరాజ్యసమితి- ఆ తరహా భావనకొక రూపం వంటిది! ప్రపంచ ప్రజానీకమంతా వొకే వ్యక్తిగా నిలబడే రోజు తప్పకుండా వస్తుంది. ఆ మహోదయానికి, వేకువ వెలుగువంటివే ఈ సుహృద్భావ పర్యటనలు! వేకువకాంతి వలన చెప్పుకోదగిన లాభమేమీ ఉండకపోవచ్చు. కానీ వేకువే లేకపోతే- ఉదయం ఉండనే ఉండదు. ఏ కారణం వల్లనయితేనేంగానీ, దేశాల మధ్యా, జాతల మధ్యా పరస్పరావగాహనం లోపించింది. తెల్ల చర్మం ఉన్నవారు అధికులనీ, నల్ల తోలున్నవారు తక్కువనీ కొందరనుకోవడం పొరపాటు. ఎవరి ప్రత్యేకత వారికున్నదనీ, ప్రపంచ నాగరికతా గ్రంథానికి ప్రతి జాతివారూ వొక అధ్యాయాన్ని చేర్చుతూనే

ఉన్నారనీ తెలియజేయడం నా పర్యటన ముఖ్యాంశం. ఇదెంత బలంగా నేను చేయగలిగితే నా పర్యటన అంతగా ఫలప్రదమయినట్లు లెఖ్క. ప్రత్యేకంగా ఫిలం పరిశ్రమకు కలిగే లాభం కూడా ఉంటుందేమో, నేను చెప్పలేను... అది - ఆ దేశీయులు మనతో ఏ మేరకు సహకరిస్తారన్న విషయాన్నిబట్టి నిర్ధారణ చేయవలసి ఉంటుంది'' అన్నది మంజరి.

ఇద్దరు ముగ్గురు విలేకరులు చిల్లర మల్లర ప్రశ్నలేవో అడిగారు. మంజరి వాటికి చురుగ్గా సమాధానం చెప్పేసింది.

రాజన్ మధ్యాహ్నమే వచ్చాడు. అతనితో వో ని ఎమిషం ఏకాంతంగా మాట్లాడదామనుకొన్నది మంజరి. ఐనా వీలు చిక్కలేదు.

''చూస్తున్నారుగా?'' అన్నది మంజరి దీనంగా ముఖంపెట్టి.

''ముందు కావలసిన పనులేమో చూడు. మనం తరువాత మాట్లాడుకొందాం!'' అన్నాడా పెద్ద మనిషి.

ఐనా అతని కా అవకాశం చిక్కనేలేదు.

విమానం బయలుదేరడానికి ఒక గంట వ్యవధి ఉండగానే చలపతి అంగలార్చసాగాడు.

''నువ్వు చప్పున బయలుదేరాలి. కనీసం పావుగంట ముందైనా అక్కడుండకపోతే బావుండదు'' అన్నాడతను.

''ఐనా నలభై నిమిసాల టైముందిగా?'' అన్నది వసంత.

ఆ పిల్లకేమో దిగులు దిగులుగా ఉంది.

''ఎంత హీనంగా చూసుకొన్నా ఏదరోడ్రోం చేరడానికి అరగంట పడుతుంది. మధ్యలో రైల్వే గేటు వేశారంటే చచ్చామన్నమాటే! అందుకనే - అవసరానికి పనికొస్తుందని మన రెండో కారు, గేటు అవతలపక్కన ఉంచమని పంపించాను. మరి నువ్వు తెమలడానికి పది నిమిషాలన్నా పట్టదా! ఇప్పటికప్పుడే రెండు నిమిషాలు తిరిగాయి.''

రాజన్ లోపలికి పోవడం చూసి, ఏదో పనున్నదానిలాఆ మంజరి కూడా లోపలికొచ్చింది.

''మళ్ళా ఎప్పుడు కనిపిస్తావ్?'' అన్నాడు రాజన్.

మంజరి సమాధానం చెప్పకుండా, అతన్ని కౌగిలించుకొని వదిలేసింది.

''మీరు వచ్చారు గనక సరిపోయింది గానీ, లేకపోతే - కథంతా అడ్డం తిరిగి ఉండును'' అన్నది మంజరి.

''అదేం?'' అన్నాడు రాజన్.

''నేను ప్రయాణం మానేసేదాన్ని!''

రాజన్ ఏదో అనబోయాడు. బయటినుండి చలపతి అంగలార్పులు వినిపిస్తున్నాయి. మంజరి చప్పున కౌగిలి వదిలి ఇవతలికొచ్చింది.

''శాస్త్రిగారు పెట్టిన లగ్నం - ఖచ్చితంగా మూడు నిమిషాలు మాత్రమే ఉంది. నీ సామానంతా కారులోకి సర్దాం'' అన్నాడు చలపతి.

మంజరి ఎదురుగా ఉన్న తిరుపతి వెంకటేశ్వరస్వామి పటానికి నమస్కరించింది.

“ఇంకొక్క నిమిషమే ఉంది” అన్నది వసంత డగ్గుత్తికతో.

మంజరి నిశ్శాబ్దంగా మెట్లు దిగి, కారులో కూచున్నది. నిమిషం పూర్తియింది - కారు బయలుదేరింది.

దోవపొడవునా, మంజరి అభిమానులు గుంపుపడి చూడసాగారు. కొంతమంది ఆమె కారు రాగానే 'జై జై'లు కూడా కొట్టారు ఫీచర్ ఫిలిమ్సు తీసే ఓ ప్రొడ్యూసర్ ఈ దృశ్యాలన్నీ షూట్ చేశాడు. శర్మగారు స్వయంగా ఏర్పాటు చేసిన పాతికమంది ఫొటోగ్రాఫర్లు దోవపొడవునా ఫొటోలు తీస్తూనే ఉన్నారు...

విమానాశ్రయమంతా పిలిం ప్రముఖులతో నిండిపోయింది... పూలదండలతో మంజరి పూర్తిగా మునిగిపోయింది. వచ్చే బహుమతులకు అంతూ పొంతూ కనిపించలేదు.

“ఇహ మీరు వెళ్ళి కూచోండి... విమానం ఇంకో అయిదు నిమిషాల్లో బయలుదేరుతుంది!” అన్నారెవరో...

పూలదండలు, బహుమతులు వసంతకిచ్చింది. మంజరి. ఆవిడ బుగ్గలు పుణికి ముద్దాడింది.

“జాగ్రత్త... కనిపెట్టి ఉండు...” అన్నది చెవిలో.

అదే ఆఖరిమాట!

తలొంచుకొని విస విస విమానంకేసి వచ్చింది. లోపలికి పోతూ, ఓసారి వెనక్కు తిరిగి చూసింది. కొన్ని వందల చేతులు, తనను చూసి గాలిలో అల్లల్లాడుతున్నాయి... మంజరి తన సీట్లో కూచుంది. ఆమె కేమిటోగా ఉంది. మనస్సంతా ఏదో వత్తిడికి గిలగిలలాడిపోతున్నట్లనిపించింది.

అద్దంలోంచి మరోసారి బయటికి చూసిందావిడ. ఆ జన ప్రవాహానికి ఓ చివరన, విసిరేసినట్లుగా, రెండు ముఖాలు విమానంకేసి ఆత్రంగా చూస్తున్నాయి. మెరుపు మసకలోంచి వారిని గుర్తుపట్టగలిగింది మంజరి.

అతను రామచంద్రం!

ఆ పక్కనే నుంచున్నది మాధవరావు!!

నాళాలను బద్దలు చేసుకొని రక్తం పైకి ఉబుకుతుందేమోననిపించిందామెకు.

ఏదో అనబోయిందావిడ -

మరుక్షణంలో విమానం గజగజలాడసాగింది.

మంజరి కిందిపెదవి కొరుక్కుంటూ చివుక్కున లేచి నిలుచుంది.

విమానం బయలుదేరింది.

అద్దానికి ముఖం ఆనించి, విసిరేసినట్లున్న ఆ ఇద్దరికేసీ చూసింది మంజరి.

రామచంద్రం పై ఉత్తరీయంతో కళ్ళొత్తుకొంటున్నాడు. మాధవరావు అతని భుజాలమీద చేతులు వేసి పరుగెత్తుతున్న విమానం వేపు చూస్తున్నాడు.

మంజరి తన సీట్లో కుప్పకూలిపోయిందీ. రెండు చేతుల్లోనూ ముఖాన్ని దాచుకొని వెక్కెక్కి ఏడుస్తున్న సమయంలోనే ఎయిర్ హొస్టెస్ చిరునవ్వుతో ఆమె పక్కనే కూచుని, ముంగురులను దిద్దసాగింది...

ఢిల్లీలో ఉన్న 48 గంటల్లోనూ, ఏ ఎనిమొతిఇది గంటలో తప్ప మంజరి స్థిమితంగా ఉండేందుకే విల్లేకపోయింది. ఆవిడ అంతకుముందే ఢిల్లీ ప్రముఖుడికి జాబు రాయడం మంచిపనయింది. ఆయనగారు మంజరికోసం సకల సన్నాహాలతోను ఎదురు చూస్తున్నాడు. ఢిల్లీలోని చాలా మంది ప్రముఖులు ఆమెను అతిథిగా ఆహ్వానించారు. కానీ వ్యవధిలేని కారణంగా వాటన్నింటినీ ఆవిడ సవినయంగా కాదనవలసి వచ్చింది.

ఇండో అమెరికన్ కల్చరల్ డెవలప్ ఎమెంటు సొసైటీ'' వారు హోటల్ అశోక్‌లో బ్రహ్మాండమైన పార్టీ యిచ్చారు. దానికి కళాకారులకన్నా, రాజకీయ వేత్తలు, దౌత్య వర్గాల ప్రతినిదులు, గూఢచారులు, కొందరు ఉన్నతోద్యోగులు, కోటీశ్వరులు వచ్చారు. ఢిల్లీ ప్రముఖుడు- వారిలో చాలా మందిని మంజరికి పరిచయం చేశాడు. వారందరూ ఆ ప్రముఖునితో అతి చొరవగా మాట్లాడటం చూసి, మంజరి ఆశ్చర్యపోయింది.

''నన్ను మాటి మాటికీ 'సార్ సార్' అని పిలవకండి. నా పేరు సక్సేనా! నేను బాగా అభిమానించేవాడు నన్ను 'అండీ' అంటే చాలా బాధపడతాను'' అన్నాడు ఢిల్లీ ప్రముఖుడు.

''మీ పేరు తెలీక కాదు'' అన్నది మంజరి నవ్వుతూ. ''ంఇమ్మల్ని అంత చనువుగా పిలవడం నా కిష్టం లేకే. మీరు ఆకాశమంతటి మనుషులు.''

''అందరికీని! మీ విషయంలోగాదు'' అన్నాడు సక్సేనా. ఆ తరువాత ఆమెను లోపలికి తీసుకొచ్చి గది తలుపులు వేశాడు.

''మీరు నాకేదో వొప్పగించారు. చేశాను. మీరు చెప్పిన ఆరు దేశాలనుండీ 'వీసా'లు పుచ్చుకొన్నాను'' అన్నాడు సక్సేనా.

''చాలా థాంక్సండీ!'' అన్నది మంజరి.

''ఈ రుణం ఎలా తీర్చుకోవాలో తెలీకుండా ఉంది''

సక్సేనా అటూ ఇటూ చూసి, గొంతు సవరించుకొన్నాడు.

''చెప్పండి. నా చేతిలో ఉన్నదేదైనా నేను చేస్తాను.''

''నాకా నమ్మకముంది'' అన్నాడు సక్సేనా. ''మీ కంటే అవసరం లేకపోవచ్చుగానీ ' నాకో కారు కావాలి. నా మిత్రుడికి దాన్ని ప్రెజెంట్ చెయ్యవలసి ఉంది. ఇక్కడ కొనలేక కాదుగానీ, అనవసరంగా బోలెడంత ఖర్చు చెయ్యడం ఎందుకనిపించి మానేశాను. మీరు అమెరికా వెళ్లగానే ఓ కారు కొనెయ్యండి. మీరు తిరిగొచ్చేప్పుడు, మీతోబాటు ఇండియాకు తీసుకురావచ్చు. అప్పుడు డ్యూటీ ఇంతపడదు. సెకండ్ హాండ్ కదూ మరి!''

''ఫారెన్ ఏక్స్ఛేంజి కావద్దూ?'' అన్నది మంజరి.

''నేను దానిక్కావలసిన ఏర్పాట్లన్నీ చేశాను. మీరు చేయవలసిందల్లా 'కారు నాది' అనడమే! మీకేమీ అభ్యంతరం లేకపోతే నాకీ ఉపకారం -''

''ఎంత మాట!'' అని అతని రెడు చేతులూ పట్టుకొని, మృదువుగా నొక్కింది మంజరి.

ఆరోజు మధ్యాహ్నం బాంబేనుండి ''లాలారాం''- ''త్రిపాఠీ'' ''జోగిందర్'' - వచ్చారు.

లాలారాం మిగతా ఇద్దరినీ మంజరికి పరిచయం చేశాడు.

"నేనీ రాత్రికే బాంబే వస్తున్నాను కదా! అంత తొందరపడ్డారేం?" అన్నది మంజరి.

"లేదు. మనం మాట్లాడవలసింది చాలా ఉంది" అన్నాడు లాలారాం.

"అయితే ముందుగా రాకపొయ్యారా? అసలే నాకు టైం లేదు గదా!" అన్నది మంజరి కొంచెం విసుగ్గా.

అది గమనించి కూడా ఏమీ జరగనట్లే ఉన్నాడు లాలారాం.

"త్రిపాఠి పేరు మీఉ తెలిసే ఉండాలి. అహమ్మదాబాదులో రెండు మిల్సున్నాయి. జోగిందర్ బాంబేలో గొప్ప ఆటోమొబైల్ డీలర్. వీరిద్దరితోనూ నేను బిజినెస్‌ను గురించి రాత్రే వో వొప్పందానికొచ్చాను.... విటున్నావా?" అన్నాడు లాలారాం.

"మన పిక్చర్ ఫారెన్‌లో - ముఖ్యంగా అమెరికాలో ఎగ్జిబిట్ చేయడానికి నువ్వు ఏర్పాట్లు చేసిపెట్టాలి. తరువాత - "ఇండో అమెరికాన్, కొలాబరేషన్ పిక్చర్స్" పేరుతో నేనో కంపెనీని ఏర్పాటు చేశాను. దానికి నువ్వాదేశం నుండి కొత్త కాపిటల్ పెట్టించాలి. ఇక్కడనుండి కావలసినంత డబ్బు వీరిద్దరూ  పెడతారు" అన్నాడు లాలారాం.

మంజరికసలే చిరాగ్గా ఉన్నది. దానికితోడు లాలారం చెప్పే ధోరణి కూడా ఆవిడకంతగా నచ్చలేదు. ఒకప్పుడైతే ఎలా ఉండేదోమరి! ఈ క్షణాన ఆవిడ మనస్సులో చిత్రవిచిత్రమైన ప్రపంచాలెన్నో గిర్రున తిరిగిపోతున్నాయి. వాటితో పోలిస్తే ఈ లాలారాంలూ, వీరి వ్యాపారాలూ ఏపాటి? తను చేయవలసిందంతా ముందే ఉన్నది. ఇంతవరకూ తను సాధించింది - ఇకముందు తాను చేయదలచుకొన్నదానితో పోలిస్తే వీసపాలుకూడా లేదు. బ్రహ్మాండమైన ఆ ప్లాను ఫలప్రదం కావడానికి తనిప్పటినుండే పునాదులు వేసుకుంటూ రావాలి. తను - అనవసరంగా, ఈ త్రిపాఠీలతోనూ,జోగిందర్‌లతోనూ పెట్టుకుని, అసలు విషయం మరిచిపోవడమే జరిగితే - మరిచిపోతుందని కాదు - తన ప్రయాణమంతా వృథా!

- అందుకనే

"అలాగే! మనం తాపీగా ఆలోచిద్దాం, చేద్దాం" అన్నది మంజరి.

"ఇహ కానట్టే అనుకుందామా? అనిపించింది లాలారాంఉ. కానీ మంజరి దోరణి అలా లేదు. ఆవిడ గొంతులో అనుమానించడానికేమాత్రం అవకాశం లేదు -అని  "చేసి తీరతాను" అన్న నిశ్చయమూ లేదు.

"ఏం చేసేట్టు?" అనుకొన్నాడు లాలారాం, గడ్డం బరుక్కొంటూ.

ం ం ం

మంజరి విదేశీ ప్రయాణం బ్రహ్మాండంగా విజయవంతమయింది. ఇలా జరుగుతుందని ఆవిడ కాదు సరికదా - ఆవిణ్ణి ఆహ్వానించిన అమెరికాన్ ప్రభుత్వం కూడా అనుకొని ఉండదు. ముఖ్యంగా మంజరి ఉచ్చారణ, వేషధారణ అమెరికనులను ముగ్ధుల్ని చేశాయి. ఆవిడ వారితో అమిత చొరవగా ప్రవర్తించింది.

"నేను దౌత్య ప్రతినిధిగా మీ దేశం రాలేదు. కళాకారిణిగా వచ్చాను. అయినా ' మీ దేశం పట్ల, నాకూ నాలాంటి కోట్లాది మందికీ అమేయమైన సుహృద్భావం ఉన్నది. మీ దేశం చూడాలని

కలలుకనేవారు - నాకుమల్లేనే చాలా మంది ఉన్నారు!'' అన్నాదొక సందర్భంలో మంజరి.

``మీ సినిమాలు చాలా వరకు మా దేశపు సినిమాలను పోలి ఉంటాయి కదూ!'' అన్నాడొకాయన.

``అవును, అందులో తప్పేముంది? ఈ నిమిషాన నన్ను చూసినవారు అమెరికాన్ లేడీననుకొంటారుగానీ ఇండియన్ననుకోరు... చెప్పవచ్చిందేమిటంటే - యూరప్ ప్రభావం మాదేశంమీద చాలా ఉన్నది. అలాగే -'' అన్నాడతనే.

మంజరి నవ్వింది.

``మీ గోధుమలు తింటున్నాం. మీరిచ్చిన పాలపొడితో మా పిల్లలు పెరుగుతున్నారు. మీ పత్తితో మా మిల్లులు బట్టలు నేస్తున్నాయి. మీ పెట్టుబడితో మా పరిశ్రమలు బతుకుతున్నాయి. మీ పిక్చర్లు చూసి మేం ఆనందందిస్తున్నాం. మీ వేషభాషలు చూసి మేం మురిసిపోతున్నాం. ఎంచేతనంటారు? మీకూ మాకూ మౌలిక విషయాలలో భేదం లేదు కనక'' అన్నది మంజరి.

ఆకాశాన్నంటే అక్కడి భవనాలనూ, సంపదనూ చూసి మంజరి ఆశ్చర్యపోయింది. ఆవిడ పనిగట్టుకొని 'మార్లిన్ మన్రో'ను, 'ఎలిజబెత్ టేలర్'నూ చూసి వచ్చింది.

మన్రోతో మాట్లాడుతున్నంత సేపూ మంజరికి మబ్బుల్లో తేలిపోతున్నట్లనిపించింది.

``మీ పిక్చర్లు చూశాను - చాలా చాలా చూశాను'' అన్నది మంజరి మన్రోను కన్నార్పకుండాచూస్తూ.

``అలాగా!'' అన్నది మార్లిన్.

``ఎలా ఉన్నాయి?'' అని అడుగుతుందేమో, గబగబా చెప్పేద్దామనుకొన్నదావిడ. కానీ మన్రో ఆ మాటే అనలేదు.

``మిమ్మల్ని చూద్దామన్నది నా చిన్నప్పటి కల. అది కలగానే ఉండిపోతుందనుకొన్నాను. దాదాపు మూడు నెలలు కిందట కూడా ఈ కల నిజమవుతుందనుకోలేదు. కానీ అయింది. నా అధికార కార్యక్రమంలో మిమ్మల్ని చూడటం ప్రత్యేకంగా లేదు. కానీ - నేను కావాలని కార్యక్రమంలో మార్పు చేసి, మీ దగ్గరకొచ్చాను'' అన్నది మంజరి.

``థాంక్స్!'' అన్నది మన్రో నవ్వి.

``ఆ నవ్వుకోసం, దేవతలు పడి చావమన్నా చస్తారు - ఇక మనుషుల సంగతి లెఖ్కేమిటి?'' అనుకొన్నది మంజరి.

``నాకు'' అంటూ ప్రారంభించింది మంజరి. ``యాజ్ యంగ్ యాజ్ యు ఫీల్! 'జంటిల్ మెన్‌న ప్రఫిర్ బాల&ండ్స్' 'ది సెవెన్ ఇయర్ ఇచ్' - 'బస్‌స్టాప్' అన్న మీ చిత్రాలు నచ్చాయి. దివ్య మోమనమైన మీ అందం చూసి, అనేక సార్లు నేను అసూయకూడా పడ్డాను. మీరు నా ఆరాధ్య దేవతవంటివారు!'' అన్నది మంజరి.

``మీకెక్కడా - ఆ పిక్చర్సులో అతి అనిపించలేదా?'' అన్నది మార్లిన్.

మంజరి ఆలోచించి 'లేదు' అన్నది. ``ఇవన్నీ నేను చూశాను. 'అతిగా' నేనెక్కడా ఫీల్ కాలేదు... అయితే మా దేశస్థులకు, ఇక్కడి వేషభాషలు అంతగా పరిచయం లేని కారణాన, కొంత ఎబ్బెట్టుగా ఉంటే ఉండొచ్చు. కానీ, సమస్త విశ్వాన్నీ మోహ సముద్రంలో మునకలు వేయించగల మీ అందం

- ప్రేక్షకుల్ని ఆలోచించనీదు; ఊపిరి పీల్చనీదు. మీ పాదాలవెంట, నీడల వెంట తిప్పుకొని, ఉన్మాదుల్ని చేసి దూరంగా చీకటి గుయ్యారాల్లోకి విసిరి పారేస్తుంది! మిమ్మల్ని 'సెక్సు భూతం' అంటూనే మీ పిక్చర్లకోసం 'క్యూ'లో నిలబడిన వేలాది మంది ప్రజలను నేను చాలాసార్లు చూశాను'' అన్నది మంజరి.

మార్లిన్ ఏదో, ఆలోచిస్తూ అంతలోనే కళ్ళొత్తుకొన్నది. ఆవిడ పెదవులు నవ్వుతున్నాయి. కానీ సన్నని వణుకును మంజరి కనిపెట్టింది.

''మీకు ఆరోగ్యం బావోలేదేమో, నేను వెళ్ళనా?''అన్నది మంజరి.

మార్లిన్ కంగారు పడుతూ 'కాదు కాదు' అంటూనే ఆమెను కూచోబెట్టింది. ''నేను మిమ్మల్ని ఈ రాత్రి నాతో ఉండవలసిందిగా కోరుదామనుకొంటున్నాను'' అన్నది మన్రో.

మంజరి నిలువునా చలించిపోయింది. మనస్సునిండా ఆనంద ఝురులుపొంగి పొరలి ఆమెను వివశను చేశాయి. ఎవరి దర్శనంకోసం కోట్లాకొలది ప్రజలు, అహర్నిశలూ తహ తహలాడి పోతూ ఉంటారో, ఎవరి స్పర్శకోసం ప్రపంచాన్నే కొనివేయగల కుబేర పుత్రులు సైతం తపస్సు చేస్తూ ఉంటారో - ఆ మార్లిన్ మన్రో - తనతో ఒక రాత్రి గడవమంటూ ఆహ్వానించడం కన్నా తను కోరవలసిందేమీ లేదనిపించింది మంజరికి.

''నా జన్మ ధన్యమయిందనుకొంటున్నాను. ఎప్పుడో, ఎన్ని జన్మల క్రిందటో నేను పుణ్యం చేసుకొని ఉండాలి. మీ దర్శనం కావడం కాదు - మీకు అతిథిగా ఉండే మహద్భాగ్యం నాకు లభించింది. మిగతా నా కార్యక్రమాలన్నీ రద్దు చేసుకొని, ఇక నిశ్చింతగా చచ్చిపోవడానికి నేను సిద్ధంగా ఉన్నాను'' అన్నది మంజరి ఉద్రేకంగా

''అదృష్టవంతురాల్ని'' అన్నది మార్లిన్ నవ్వుతూ.

మంజరి సన్నగా నవ్వి, మన్రో చేతిని తన చేతిలోకి తీసుకొన్నది. ''నేనోమాట అంటున్నాను- మీరేమీ అనుకోవద్దు - ఆ పిక్చరు చూశాక, నేను పురుషుణ్ణి కానందుకు చాలా రోజులపాటు బాధపడ్డాను'' అన్నది మంజరి.

మార్లిన్ మనసారా నవ్వింది. కానీ ఆ నవ్వులో ఏ మూలనో విషాదం రేఖ లీలామాత్రంగా గోచరిస్తున్నది.

''భగవంతుడు నాకింత అందమిచ్చినందుకు సంతోషించాలో, ఏడవాలో కూడా తెలీదు... నా ఫొటోలకోసం కోట్లాది ప్రపంచ ప్రజలు ఎదురు చూస్తుంటారని తెలిసినపుడు, నేను వారిని పరోక్షంగా బాధపెడుతున్నానా అనిపిస్తుంది... కానీ - మీ దేశం సంగతేమో నాకు తెలీదు - ఇక్కడ తారలకున్న వ్యక్తిత్వం చాలా పరిమితం. నిర్మాతలు ఏం చెప్పినా చెయ్యవలసిందే! ఎవరో నాబోటి మొండి ఘటాలు మాత్రం, కాదని ఎదురు తిరిగి, లేనిపోని చిక్కులు కొనితెచ్చుకొంటారే తప్ప-

''దాదాపుగా అక్కడా అంతే'' అన్నది మంజరి.

''ఈ అందం నన్ను పాడు చేసిందేమోననుకొంటాను. దీనికోసం కోటీశ్వరులైనవారు, నా పాదాలముందు సాగిలపడి, ఆకర్షణం వలపన్ని, నన్ను స్థిమితంగా ఉండనివ్వడంలేదు... ఎక్కడన్నా కాలూని నిలుద్దామంటే, నేను నమ్ముకొన్న భూమి, చూస్తుండగానే కళ్ళముందు కరిగిపోతున్నది.

మళ్ళా ప్రవాహంలో దూకి ఊపిరి తిరక్కుండా ఈదుకు పోవలసిందే! ఏవో సంకెళ్ళు, తాళ్ళు క్షుద్రమైన నీతి చుట్టాలు, అసూయలు ఇలాంటివి నాకు గిట్టవు, ఇంకొకరి కోసమని - ఇవన్నీ నేను నటించలేను'' అన్నది మార్లిన్.

ఆవిడ ఏ విషయం గురించి ఇలా అంటున్నదీ మంజరి గ్రహించింది.

''మీకు మనుషులంటే, ''కసి''గా ఉంటుందా?'' అన్నది మంజరి ఆకస్మికంగా.

అన్న తరువాత, నాలుగ కొరుక్కున్నది. ఆవిడతో తనకేపాటి పరిచయమున్నదని అలా తూలి మాట్లాడటం? అయినా, మార్లిన్ నొచ్చుకోలేదు, పైగా, పళ్ళన్నీ మెరిసేలాగా నవ్వి, మంజరి చేతిని మెత్తగా నొక్కింది.

''నాకు మనుషులంటే పరమద్వేషం ఉంది. కానీ- అందరిమీదా కాదు. నన్ను బాధించిన వ్యక్తులన్నా తరిమికొట్టిన వ్యక్తులన్నా, అడుగడుగునా ఆటంకాలు కల్పించినవారన్నా, నన్ను ఇరుకుల్లో పెట్టి, వొంచి, చీల్చి, తమ అవసరాలు గడుపుకొనే వారన్నా నాకు మహాద్వేషం. అంతేకాదు- ఆ వ్యక్తులు ఏ తరగతులకు చెందుతారో - ఏ వ్యవస్థలకు చెందుతారో - వాటిని కూడా నేను నా ప్రతి రక్తకనంతోనూ ద్వేషిస్తాను... ఒకప్పుడు, ఈ పరిశ్రమ నన్ను క్షణం నిలబడనీయకుండా తరిమి కొట్టింది. నేనెందుకూ పనికిరానని తీర్పు చెప్పింది. నా మీద పుంఖానుపుంఖంగా అపవాదులు, అబద్ధాలు గుమ్మరించింది. ఈంతట్టుకొని నిలబడ్డాను. ఇవ్వాళ నాకోసం నా గుమ్మం ముందు కోటీశ్వరులు చేతులు గట్టుకొని నిలబడటం చూస్తూన్నప్పుడూ, నా కోసం వెయ్యి మంది సెట్‌మీద నిరీక్షిస్తున్నారని తెలిసనప్పుడూ, నాకు మహా హాయిగా ఉంటుంది. సాధ్యమైనంత ఆలస్యంగా నేను స్టూడియోస్‌కు వెడతాను. నా కోసం ఎదురు చూసి చూసి, రానని నిరాశపడి, జరుగుతున్న నష్టానికి ఆందోళనపడి, ఏమీ అనలేక, అనకుండానూ ఉండలేని అయోమయావస్థలోపడి, మనుషులు గిజగిజలాడిపోవడం నా కెంతో ఇష్టం. చాలా మంది 'త్వరగా రారాదా?' అంటారు నన్ను, రాలేక కాదు- రావడం కష్టమనీ కాదు. ఒకప్పుడు నేనూ ఎదురు చూశాను వీరందరి దయాదాక్షిణ్యాలకోసం. ముష్టి వాళ్ళలాగా నిరీక్షిస్తూ కూచోవడాన్ని కావాలని నేను సృష్టిస్తున్నాను. 'పాపం' అని నేను జారిపోవడమే జరిగితే నా కసి తీరేదెప్పుడు? ఇంకో జన్మ ఉంటుందో లేదో, నాకు తెలీదు. ఉన్నా నాకిలాంటి మహత్తరావకాశం అప్పుడు లభిస్తుందో, లేదో అంతకన్నా తెలీదు. అందుకనే ఈ జన్మలోనే, నేను చేయగలిగినవన్నీ చేయదలచుకొన&ఆనను'' అన్నది మార్లిన్.

''మీరు తరచుగా లాస్ ఏంజిల్స్‌లోని కంటి హాస్పిటల్‌కు పోతుంటారని చదివాను, నిజమేనా?'' అన్నది మంజరి.

మన్రో ఓ క్షణం ఆలోచించి-

''నిజమే!'' అన్నది నవ్వి. ''నే నక్కడే పుట్టాను. బహుశా అందుకే నా కీ పరిశ్రమ మీద ఇంత 'గ్రిప్' ఉన్నదేమోననుకొంటాను... నా తండ్రిని నేనెరగను. నా తల్లి పేరు 'గ్లాడిస్ మన్రో'. ఆమె భయంకరమైన దరిద్రాన్ని అనుభవించింది. ఆ వారసత్వం నాకూ సంక్రమించింది. కుక్కపిల్లలాగా, బానిసలాగా, నేను చాలా చేతులు మారాను. ఇంత తిండిలేక రోజులకు రోజులు పస్తున్నాను. బహుశా మీకు తెలుసేమో- నేను నా నగ్న చిత్రాన్ని ప్రకటనకు అమ్ముకొని బతికాను...''

''పోనీండి!'' అని సర్దుంబోయింది మంజరి.

''ఇందులో రహస్యంగానీ, అబద్ధంగానీ లేదు. ఏవో మెరుపుల్లాంటి మాటలు తియ్యగా చెప్పి, లోకాన్ని మోసగించగలంగానీ, మనల్ని మనం మోసం చేసుకోగలమా? ఆత్మ వంచనను నేను సహించలేను. అందుకే జీవితంతో రాజీపడలేకపోతున్నానేమోననుకొంటున్నాను. కొంత మోసం, దగా, కృత్రిమత్వం, నటన, లౌక్యం - ఇలాంటివేవో కొన్ని ఉంటే తప్ప జీవితంలో రాణించలేమని నా నమ్మకం. కానీ ఇవి నాలో లేకపోవడం నా దురదృష్ట!'' అన్నది మార్లిన్.

''మీరు ప్రపంచ ప్రసిద్ధ నటీమణులు గదా-'' అన్నది మంజరి.

''ఛస్! దాన్ని గురించి కాదు నేనడం - బతుకుని గురించి'' అన్నది మన్రనో. ఉద్రేకంగా ''నాకు కోపమనీ, ఉద్రేకమనీ, చిరాకు పరాకు లెక్కువనీ, అహంకారిననీ అంటారు - నిజమే! కానీ - నేనిలా కావడానికి కారణాలేవో ఈ ప్రపంచానికి అవసరం లేకపోయింది. నా ఎనిమొతీఇదో ఏట- నేను చీకటి గదిలో 'రేప్' చేయబడ్డాను. మంచులో, వానలో - చీకట్లో - ఆకలితో - భయంతో, దైన్యంతో, నా చిన్నతనమంతా గడిచిపోయింది. మనసారా కావాలనుకొన్నవారు నాకు దూరమయ్యారు. నేను ద్వేషించేవారికీ శరీరమిచ్చాను. దీనికోసం నరుక్కుని, రక్తం కాలువలు కట్టేటట్లు చేశాను, చేస్తున్నాను. నేను తంతున్నకొద్దీ డబ్బూ, కీర్తీ నా కళ్ళముందుకు దొర్లుకొస్తున్నాయి'' అన్నది మన్రో.

''మీకు జీవితంమీద ఆశ లేదా?'' అన్నది మంజరి.

మన్రో పలకలేదు. వెంటనే.

''నేనేమీ చెప్పలేను. నాకేమీ తెలీదు'' అన్నదామీదట.

మంజరి టాపిక్ మార్చాలని ప్రయత్నించింది.

''నాకు ఆశలేదు'' అన్నది హఠాత్తుగా మార్లిన్. ''బతుకు ఇప్పటికీ నన్ను దగా చేస్తున్నదనుకొంటాను. ఈ డబ్బు, కీర్తీ, నాగరికత ఇవన్నీ నాకు కావలసినదాన్ని సాధించలేకపోయాయి. చేతికి చిక్కనట్టే చిక్కి, ఫలితం జారిపోవడం నా బతుకులో చాలా సార్లు జరిగింది. ఈ అఘాతాలు నన్ను కుంగదీస్తున్నా.''

''మీకు సాధారణంగా ఆడవాళ్ళంటే గిట్టదట కదూ? మరి నేనంటే మీకెందుకింత ఆపేక్ష?'' అన్నది మంజరి నవ్వుతూ.

''మీ గురించి నిన్ననే ఏదో పత్రికలో చదివాను. చిన్నతనంలో మీరూ కష్టపడ్డారనీ, చాలా ఏళ్ళపాటు నాటకాలాడి, చివరికి ఈ ఇండస్ట్రీలో చేరారనీ, ఆ కోలమిస్టు రాశాడు. మిమ్మల్ని మీ దేశంలో 'ఇండియన్ మార్లఇన్' అంటారని కూడా రాశాడు. ఈ చివరి వాక్యం నాకు నచ్చింది. మిమ్మల్ని కలుసుకోవడానికి, చాలా ఉత్సాహపడ్డాను.''

''చూశారుగా? ఇప్పుడు చెప్పండీ!'' అన్నది మంజరి.

''ఆ కోలమిస్టు పూర్తి నిజం రాయలేదనిపించింది. బహుశా అతనికి మీ గురించి ఎక్కువగా తెలియదేమో? సంగ్రహంగా రాశాడు. అతను రాసిందానికికన్నా మీరెక్కువ బాగున్నారు... నేనిక 'అమెరికన్ మంజరి' అని పేరు పెట్టుకొంటాను'' అన్నది మన్రో పకపకలాడిపోతూ. ''రండి! ఎటన్నా పోదాం'' అని లేచిందావిడ.

“ఒద్దు. మీతో ఇంకా విశదంగా మాట్లాడాలి. మీ మాటలు వింటుంటే, నా హృదయంలో పాలవెల్లువ పొడిచినట్లనిపిస్తూ ఉంది. బయటకెళ్ళి, చెట్లనూ, పిట్టల్నూ, ఎప్పుడన్నా చూడొచ్చు. కానీ- మతో గడపగలుతున్న ఈ ఓనాలు మళ్ళారావు.”

“ఇన్నిటికీ అసలు సంగతి మీకు చెప్పలేదు” అంటూ ప్రారంభించింది మన్రో. “ఆడవాళ్ళంటే నాకు అసహ్యంకాదు, జాలి. ఎదిరించి, తెగించి, మొండికెత్తి బతకలేరు. జావలాగా, మంచులాగా జారిపోతారు. ముఖ్యంగా ఈ లక్షనం నాకు సరిపడదు. చాలా మంది ఆడవాల్ళు సాఫీయైన జీవితం కావాలనుకొంటారు. నేనంతటి స్తబ్దతను భరింలేను. ఉరుకులు, పరుగులతో, ఉన్నతోన్నత పర్వతాగ్రం నుండి అగాధంలోకి దూకే మహా ప్రవాహంవంటి బతుకు నాక్కావాలి. ‘ప్రశాంతం లేదులే’దంటూ తెకతెక లాడిపోతానే తప్ప, నిజంగా బ్రతుకొక గమ్యాన్ని చేరి, అక్కడే నిలబడిపోతే- ఆ నిశ్చాలత్వాన్ని భరించగలనా? లేదనుకొంటాను. కానీ ప్రశాంతి కోసం ఆత్మఘొల్లుమని గోల కెత్తడం మానదు, అదంతే!”

మంజరి కనురెప్పలు, నీటి పొరల్లో తడిసి బరువెక్కాయి.

“మనం చెయ్యని తప్పులకు శిక్ష అనుభవించవలసి రావడం కాన్న జీవితంలో విషాదం ఉండబోదు. అలాంటివి నేను చాలా అనుభవించాను.. “సెవెన్ ఇయర్ ఇచ్” పిక్చర్లో, ఓ చోట గౌను పైకెత్తి కథానియక నడుస్తుంది.”

“అవును, జ్ఞాపకం ఉంది!” అన్నది మంజరి.

“ఆ పిక్చర్ ఔట్ డోర్ షూటింగ్ సమయంలో, ‘జోడిమాగియో’ కూడా ఉన్నాడు. అందరూ ఆ సీన్ చూసి ఆనందించారు. ఒక్క నా ‘జో’ తప్ప. అతనికోసం నేనెంత ఆరాటపడ్డానో తలుచుకొంటే - మనుషులింతగా - పశువులకన్నా అధమాథములుగా ఎందుకు ప్రవర్తిస్తారో తెలీదు. నన్నింకొకరు చూడకూడదనీ, తాకకూడదనీ, నాతో మాట్లాడకూడదనీ ‘జో’ అస్తమానం గొణుగుతుండేవాడు. నా వృత్తికా నిబందన సరిపడదు! అసలందుక్కూడా కాదు - నా శరీరంమీద తనకంత అధికారమున్నదని, ‘జో’ అనుకోవడం నా కిష్టంలేదు. అతను పోయినందుకు నేను చాలా రోజులపాటు బాధపడ్డాను. కానీ నన్ను నేను మోసగించుకోలేదు. నా నా వ్యక్తిత్వాన్ని అమ్ముకోనూలేదు. అంతకు ముందెప్పుడో - చాలా రోజుల కిందట సంగతనుకో - నా కింకా సినిమాల్లో అట్టే ప్రవేశం దొరకని కాలమది. కొలంబియా ప్రెసిడెంట్ హారికోహన్‌కు “షేంక్” అనే నా హితైష ఇ ఫోన్ చేసి నన్ను పంపించాడు. “కోహన్” తలుచుకొంటే నాకెంతయినా సాయం చేయగలడు. అతనికొక విలాస నౌక ఉన్నది. అందులో నా కొక పార్టీ ఇస్తాను రమ్మన్నాడు. నేనందుకొప్పుకొంటే, మొత్తం కొలంబియా కంపెనీని కొనేసి ఉందునేమో మరి! “నాకిలాంటి పార్టీల మీద మోజు లే”దని మర్యాదగా చెప్పి వచ్చేశాను... నేను నీతికోసంగాదీ సంఘటనను చెబుతూంది. మనుషుల తత్వం అర్థం చేసుకోవడానికి ఉపయోగపడతాయనే అంటున్నాను. ఇలా ఎన్నో జరిగాయి...” అన్నది మన్రనో. ఆవిడ పెదవులు వణుకుతున్నాయి.

మంజరి గుండెలు గుబగుబలాడాయి.

ప్రపంచ ప్రజల నమోవాకాలను అనుక్షనం అందుకొనే, ఆ జగదేకసుందరి జీవితంలో, ఎంతటి

విషాదం పేరుకొనిపోయి ఉన్నదో చాలా మందికి తెలీదనుకొన్నది మంజరి.

''నువ్వు చాలా గడసరిదానివి'' అన్నది మన్రో, అంతలోనే మామూలు స్థాయికివస్తూ. ''నీవు మాట్లాడుతున్నకొద్దీ ఇంకా ఇంకా ఏవేవో చెప్పకోవాలనిపిస్తుంది... నీకు ఇండియన్ భోజనం కావాలా? అసలేమీ వద్దా? అదేం కుదరదుగానీ... అలా కాదు. పోనీ, గుడ్లు, కాయలు తీసుకో'' అని బలవంతం చేసింది మన్రో.

హఠాత్తుగా, సంభాషణను ఆపి ఇలా తిండిని గురించి మన్రో ఎందుకు మాట్లాడిందో మంజరికి అర్థంకాలేదు. చప్పుచప్పున ఇంత తిన్నారు. మన్రో ఆమెనో క్లబ్బుకు తీసుకొచ్చింది. ఎక్కువమంది వీరిని గుర్తించలేదు. ఒకరిద్దరొచ్చి, మన్రోను డాన్సుకు పిలిచారు. తరువాత హిచ్‌కాక్‌ది ''రేర్‌విండో''పిక్చర్ కొంచెం చూసి, చాలా పొద్దుపోయి ఇంటికొచ్చారు.

''మీకు సాధారణంగా పక్కమీద పడుకోగానే నిద్దరొస్తుందా?''అన్నది మంజరి.

మార్లిన్ తేలు కుట్టినట్లు ఉలిక్కిపడింది. చేతిలో ఉన్న గౌను జారిపోయింది.

''అయితే-మీకూ సరిగ్గా నిద్రపట్టదన్నమాట?''అన్నది మన్రో గొణుగుతూ.

''లేదు!''

''సరే''అన్నది మన్రో.

ఆమె గొంతు పొడారిపోయింది. పెదవులు ఎండిపోయాయి. కళ్లల్లో మునుపటి కాంతి, ఉత్సాహం లేవు.

''మనం మిగతా విషయాలు రేపు మాట్లాడుకొందాం. మీరా పక్కమీద పడుకోండి. నేనిక్కడ పడుకుంటాను. ఇంకో పదినిముషాల్లోల డాక్టర్లు అర్నాల్డు వస్తున్నాడు. అతను మీకూ, నాకూ నిద్రపట్టే మందిచ్చిపోతాడు...''అన్నది మన్రో.

''నేను సాధారణంగా గార్డినాలఎ వాడతాను''అన్నది మంజరి.

''అవి టాబిలెట్స్. ఇది ఇంజక్షన్. 'పెంటతాల్' అంటారు. దీన్ని తీసుకొన్నాక గానీ, ఆ మందు వాడటంలోగల పరమానందం అర్థంకాదు....మీకు స్వర్గంలో నమ్మకముందో, లేదో నాకు తెలీదుగానీ, ఈ మందు తీసుకొంటే, ఆ స్వర్గసౌఖ్యాలన్నీ మీ అనుభూతిలో కొస్తాయి. అరె...చిత్రమేనే! ఇది మీదేశంలో వాడకపోవడమేమిటి?''అన్నది మన్రో.

''వాడతారేమో నాకు తెలీదు, నేను మాత్రం ఈ పేరు వినడం ఇదే మొదటిసారి!''

డాక్టరు ఆర్నాల్డు పొట్టిగా బొద్దుగా ఉంటాడు.

ముందుగా మంజరికి, ఆ తరువాత మన్రోకూ ఇంజెక్షన్ చేసి తలుపు దగ్గిరగా నొక్కి వెళ్లిపోయాడు. ఇద్దరూ, అప్సరసల్లా వెల్లకితలా తిరిగి పడుకొన్నారు. వారి ముఖాలు ప్రశాంతంగా, చిరునవ్వు లొలుకుతూ ఉన్నాయి. వారిమీద విద్యుద్దీపపు కాంతులు కురిసి, మెరిసి, గోడలకు కట్టుకొని, నీడలకింద మారిపోతున్నాయి.

''మీరు చెప్పే మాటలు వింటుంటే నాలోంచి ఎవరో నాకు బోధచేస్తున్నట్లుగా ఉంది. మీతో మాట్లాడ్డం నిజంగా వో గొప్ప అనుభవం'' అన్నది మంజరి. ఆ మరునాడు మన్రోతో.

మన్రో చాలా బాధగా నవ్వింది.

''మీరు కూడా, లోకమనుకొంటున్నంత సుఖంగా లేరనుకొంటాను''.

''ఔను''అన్నది మన్రో, కాస్సేపయ్యాక ''దీనిక్కారణం, జీవితంతో రాజీ పడకపోవడం. మనం, మన స్వభావానికి విరుద్ధమైన మార్గంలో పడినపుడు, అలాంటి, విషాదం సంభవిస్తుంది. కానీ లోకం అలా అనుకోదు. మనం ఎక్కిన ఎత్తు కనిపిస్తుందే తప్ప, అందుకు మనం చెల్లించిన మూల్యం సంగతి లోకం పట్టించుకోదు. ఎందుకంటున్నానంటే ఆత్మవంచన, వ్యక్తిత్వాన్ని మరుగులో ఉంచటం, కపటం, దగా ఇలాంటివేమీ లేనిదే బ్రతుకులో పైకిరావడం కష్టం. మీ అనుభవం ఇందుకు భిన్నం కావచ్చు''.

''కాదు''అన్నది మంజరి క్షణం కూడా ఆలోచించకుండా. ''కానీ మనంపైకి వచ్చామని చాలామంది అనుకొంటున్నారు. మనం సుఖంగా లేమంటే ఎవ్వరూ నమ్ముతారనుకోను. గట్టిగా మనం కాదన్న రోజు, ''ఇదంతా పోజు''అని సులభంగా తేల్చిపారేస్తారు. కానీ-ఇలా అయ్యేందుకు కారణమేమిటో, ఇలా జరక్కుండా ఉండేందుకు ఏం చెయ్యాలో తెలిస్తే బావుండును''.

మన్రో అసంతృప్తితో అటూ ఇటూ మెసిలిపోయింది.

''నా కప్పుడప్పుడు, బ్రతుకుమీద విపరీతమైన ద్వేషం కలుగుతుంటుంది. ఈ శరీరంలో ఇమడలేక ''జీవుడు''గిలగిలలాడిపోతున్నట్లనిపిస్తుంది. కానీ, దాన్ని పూర్తిగా నమ్మలేను....ఉన్నదానితో బతకలేం, క్రొత్తదేం కావాలో తెలీదు. అదీ మన విషాదానికీ ప్రధానకారణమనిపిస్తుంది...అవునుగానీ మంజరీ! మనం అరవిడిచి చాలా చెప్పుకొంటున్నాం...బతుకులో భగ్నప్రేలు చాలా వున్నాయి. అవి నన్ను నిలువునా దహించాయి. ఇప్పుడే నాకేమనిపిస్తుందంటే, స్త్రీ తన సంపూర్ణ వ్యక్తిత్వాన్ని ప్రదర్శించినప్పుడు, పురుషుడు సహించలేడని! మనం-ఆడవాళ్ళం వారికి కావలసిన విధంగా మారుకొంటూ వస్తే తప్ప, మన ఇష్టమంటూ బయటపడిన రోజు, సంఘర్షణలు, కీచులాటలు తప్పవు...వింటున్నావా?''అన్నది మార్లిన్.

''శ్రద్ధగా''అన్నది మంజరి. ''మిమ్మల్ని ఇంకో సంగతి అడగాలనుకొంటున్నాను''.

''ఏమి''టన్నట్లు చూసింది మన్రో.

''మన జీవితానికీ, సంపాదనకీ లంకె కుదరదనుకొంటాను...మీ అభిప్రాయం చెప్పండి!''

''కుదరదు''అన్నది మన్రో, ''ఏంచేత? కారణం తెలియదు; కానీ కుదరదని నా అనుభవం రుజువు చేసింది. అయితే 'జేన్ రస్సెల్' అభిప్రాయం అందుకు భిన్నంగా ఉన్నది. ఆవిడ సినిమాల్లో పనిచేస్తున్నది. సంసార యాత్ర సుఖంగా గడుపుతున్నది''అన్నది మన్రో.

''అయితే 'సుఖంగా' అన్న ముక్క మినహాయించవలసి ఉంటుంది. లేదా జేన్‌గానీ ఆవిడ భర్తగానీ, వ్యక్తిత్వాన్ని కొంతమేరకైనా, కోల్పోయైనా ఉండాలి...'' అన్నది మంజరి పకపక నవ్వుతూ. ''అయినా ఇలాంటి వ్యవహారాలలో అనుభవం లేనిదాన్ని. ఈ సబ్జెక్టు మీద నా అభిప్రాయాలు అంత ఖచ్చితమైనవి కావు''.

మన్రో కూడా నవ్వింది.

తదేకంగా, మంజరి కేసి చూస్తూ తనలో తాను,ఏదో గొణుక్కునది మార్లిన్. తరువాత మంజరిని గాఢంగా ఆలింగనం చేసుకొని, పెదవులను చుంబించింది మన్రో.

"ఇప్పటికే ఈ కార్యక్రమంలో, నా గురించి చాలా మార్పులు చేసుకొనవలసి వచ్చింది....మీ గురించి ఇక్కడి వారు చాలా ప్రచారం చేశారు. ఎందరో మిమ్మల్ని విడిచిపోవాలని లేదు. కానీ, మన ఇష్టప్రకారం ఏం జరిగింది కనక, అది జరగలేదనుకోవడానికి! ఉన్నంతలోనే సుఖం, తృప్తి. మీకీ దేశంలోకావలసిందేమన్నా ఉంటే చెప్పు, నాకు చేతనయినంత వరకూ చేస్తాను. నా వల్ల కానిది అర్థర్‌తో చెప్పి చేయిస్తాను"అన్నది మన్రో.

"అర్థర్...అర్థర్,...ఈ పేరు ఎక్కడో విన్నాను"అన్నది మంజరి మెల్లగా.

"గొప్ప నాటకకర్త. పూర్తిపేరు ఆర్థర్ మిల్లర్. అతనినాటకాలకోసం నేను ప్రాణాలివ్వడమన్నా ఇస్తాను...కొద్దిరోజుల్లో అతనూ, నేను వివాహమాడబోతున్నాం! ఈ సంగతి నా నోటిమీదుగా...చెప్పడం మొదటిసారిగా విన్నది మీరే!"

"చాలా రహస్యమా?"

"ఓ రకంగా రహస్యమే! ఆర్థర్, మేరీగ్రేన్‌లు ఇంకా డైవోర్స్ తీసుకోలేదు. న్యాయసంబంధమైన ఈచిక్కులు తొలిగాక, మేం పెళ్ళాడదలుచుకున్నాం"అన్నది మన్రో.

మంజరి ఏదో అడగబోయి, అంతలోకే గతుక్కుమని మానేసింది.

"నాకిక్కడి పరిశ్రమను గురించి, నటీనటుల్ని గురించీ తెలుసుకొందామని ఉంది. ఈ ప్రయాణం కూడా అందుకే! ఇండియా వెళ్లేప్పుడు, దూర ప్రాచ్యదేశాలమీదుగా పోతాను".

"చాలాచోట్ల నాకు తెలిసినవారున్నారు, మీరు జపాన్ వెడతారా...'సాకీబూ'ను కలుసుకోండి. అతను జపానులోని మూడు వోడల కంపెనీలకు యజమాని. పలుకుబడి ఉన్నవాడు. బర్మాలో 'హా-కిమ్' నాకు ఆప్తుడు. నేనతని గెస్టుగా మూడు వారాలున్నాను. నూనె కంపెనీల యజమాని. ఇలాగే..."

అంతలోకే ఫోన్ మోగింది. ఒకే ఒక నిమిషం మాట్లాడి, ఉల్లాసంతో ఫోన్ పెట్టేసింది మన్రో.

"మీకోసం స్టూవర్టు కారు పంపుతున్నాడు! ఆర్థర్ కూడా వస్తున్నాడు! మీకతన్ని పరిచయం చేస్తాను...16వతేదీన మీకు గేబుల్ డిన్నరిస్తున్నదిట. అక్కడ కలుసుకొందాం"అన్నది మన్రో.

ఆరోజు రాత్రి చలపతికి ఉత్తరం రాస్తూ "మన్రోను ఆలింగనం చేసుకొన్నప్పుడు, నన్ను నేను మరిచిపోయాను. ఆ కౌగిలింత కోసం ప్రపంచంలోని కోట్లాది ప్రజలు అక్షరాలా కలలు గంటారని నాకు తెలుసు. ఆ కౌగిలింత ఖరీదు కొన్ని వేల డాలర్లుంటుందేమో! అయినా అది లభింపదు... నవ్వు నిజమనుకో, అబద్ధమనుకో చలపతీ! ఆ క్షణాన నువ్వే నా మనోవీధిలో కనిపించావు. అచ్చంగా నీలానే మన్రో కూడా పెదవులు కలిపింది. నాకిక్కడ ఊపిరాడటం లేదు. కార్యక్రమాల వత్తిడి నన్ను కుంగదీస్తుంది. నా న్యూస్ పడిన పత్రికలన్నీ జతచేసి ఉంచు. అలాగే ఫొటోలు పడినవి కూడాను. కేవలం తెలుగు ప్రెస్‌వే కాకుండా, ఆలిండియా వైడ్‌గా చూడటం అవసరం. శర్మనూ వసంతనూ కనిపెట్టి చూస్తూ ఉండండి. లోగడ నేను పంపిన ఫొటోలు అందాయా? ఈ పదిరోజుల్లోనూ, నాకు రెండుసార్లు కలలో కనిపించావు నువ్వు. త్వరలో రావాలనుకొంటున్నాను...నీ ఫొటో నా వెంట తెచ్చుకోనందుకు ఇప్పుడెంతగా విచారిస్తున్నానో చెప్పలేను. శలవు..."అని ముగించాదావిడ.

"ఛస్తాడు వెధవ; ఈ ఉత్తరాన్ని వెయ్యిమందికయినా చూపెడతాడు. వాడికదో రోగం"అనుకొన్నది

మంజరి.

సువిశాలమైన అమెరికా దేశాన్ని ఆ కొస నుండి ఈ కొసదాకా చూడడానికి ఓ జీవితకాలం చాలదు. ఇక ఆదేశీయుల జీవన విధానాన్నీ, కళాసంస్కృతులనూ అవగాహన చేసుకోడానికి ఏళ్లూ పుళ్లూ చాలవు. అయినప్పటికీ, ఇలా వచ్చి అలా పోయే ప్రతివారూ, ఆ దేశపు సంస్కృతిని గురించీ, ప్రజల జీవిత విధానాన్ని గురించీ ఆకాశమంతెత్తున పొగిడిపోవడం రివాజు. ఈ దేశం వారు ఇంకోదేశం పోయినా ఇదే తంతు! మనం ఎరిగి చేస్తున్న అనేక తప్పుల్లో ఇదొకటి!

'బిల్‌మోర్' సిటీలో మంజరికి పౌరసన్మానం జరిగింది. అది స్టూవర్ట్ స్వస్థలం. ఆనాటి సభకు అయిదారు వందలమంది హాజరయ్యారు. అదప్పటికి చాలా పెద్ద సంఖ్యట. న్యూయార్కు నుండి ఓ నాయక బృందం వచ్చి, పదినిముషాల పాటు గోలగా పాడి వెళ్ళిపోయారు. చాలామంది చప్పట్లు కొట్టడం చూస్తే, వారు బాగా పాడారని అర్థమవుతున్నది. కానీ, ఏం పాడిందీ మంజరికి అర్థంకాలేదు. అంతకన్నా న్యూసెన్సు ఆ ట్యూను. పాట వింటున్నంతసేపూ, రక్తంపంపుతో లాగేస్తున్నట్లనిపించింది గానీ, మనస్సుకు హాయిగా లేదు. అయినా, ఇవేవీ తను పై కనడానికి లేదు. ఆ పాట తను కూడా మెచ్చుకోవాలి. కనీసం మెచ్చుకొన్నట్లు కనిపించాలి.

లాంఛనంగా అనవలసిన నాలుగు ముక్కలూ అంటున్నప్పుడు, మంజరి స్వాధీనం తప్పిపోయే ప్రమాదం సంభవించింది. అయినా అతి బలవంతం మీద ఆవిడ నిగ్రహించుకోగలిగింది!

'గేబుల్' డిన్నరిచ్చినమాట నిజమే! దానికి చాలామంది ప్రొడ్యూసర్లూ, ఆర్టిస్టులూ వచ్చిన మాటా నిజమే! మంజరి చాలాసేపు మన్రో కేసం వెదికింది. ఆ సంగతి తెలిసినవాడల్లే స్టూవర్ట్ రహస్య కాస్తా చెప్పేశాడు.

"మన్రోకూ, ఫాక్స్ సంస్థకూ మధ్య వ్యవహారలేమీ బాగాలేవు. కాంట్రాక్టు ప్రకారం నడిచి తీరాలంటారు ఫాక్స్ అధినేతలు. మిమ్మల్ని నాశనం చేసి వదిలిపెడతానన్నది మన్రో. మిల్లర్ రాజీ కుదుర్చుతున్నాడు. బహుశా ఫాక్స్ సంస్థ లొంగిరాక తప్పదనుకొంటాను"అన్నాడు స్టూవర్టు.

"ఏంచేత?"అన్నది మంజరి.

"మన్రోలాంటి నటిని వదులుకోవడానికి ఫాక్స్ యజమానులు బుద్ధిహీనులు కారు. కాకపోతే-ఆమె నుండి ఎక్కువ లాభం పిండేందుకు చూస్తారు. ఎవరైనా అంతే! కానీ ఓ సంగతుంది. మార్లిన్ కైనా అంత పట్టుదల పనికిరాదు. తనక్కావలసింది డబ్బయినప్పుడు, లేనిపోని పెట్టడమేమిటి?"

ధోరణిని మార్చడం మంచిదనుకొన్నది.

"పిక్చర్ పేరేమిటి?"

"బిలియనీర్! గ్రెగరీపెక్ హీరో, మన్రో హీరోయిన్ అనుకొన్నారు. ముందుగా కథ మార్చమన్నది మన్రో. ఆ దరిమిలా హీరోను మార్చమన్నది. ఇప్పుడు ఫిలిం పేరే మార్చమంటున్నది. ఇల్లాగ తనకిష్టం వచ్చినటట్లు మార్చుకొంటూ పోతే-అంతమనేది ఎప్పటికి?"అన్నాడు స్టూవర్టు.

మంజరి ఆ వార్త విన్నప్పటి నుండి బాధపడింది. అప్పుడుగానీ, ఆ తరువాత అమెరికా దేశం విడిచిపెట్టేటప్పుడు గానీ, మన్రోను ఇంకోసారి చూడాలని అనుకొన్నది. కానీ ఆమె కోరిక తీరలేదు.

"మన్రో చాలా మంచిది కదూ?"అన్నదొకసారి మంజరి ఎలిజబెత్ టేలర్‌తో.

''పిచ్చిది-అంతే! అంతకన్నా మార్లిన్ గురించి నేను చెప్పగలిగిందేమీ లేదు''అన్నది టేలర్ బుసలు కొడుతూ.

కాస్సేపాగి మళ్లీ అన్నది:

''తను చాలా తెలివైనదాన్నని మార్లిన్ అనుకొంటున్నదేమో నాకు తెలీదు. ఆవిణ్ణి మోసం చేయడమంత సులభం ఇంకోటి లేదు. జో ఆమెను విడిచిపెట్టడానికి, చాలా జాగ్రత్తగా పథకం అల్లాడు. ఫ్రాంక్ సినాట్రా కూడా అందులో చేతులు కలిపాడని చెబుతారు. నిజానిజాలు తెలీవు మరి! జో-సినాట్రా కలిసి, ముందుగా ఓ చవటను మన్రో దగ్గరకు పంపించి, ఆమెను కబుర్లలోకి దింపారు. ఇద్దరూ మాట్లాడుతూ ఉన్నప్పుడు, 'జో', 'సినాట్రా'లు అక్కడ తయారయ్యారు. అనుకొన్న ప్లాను ప్రకారం, అతను వీరిని చూస్తూనే పారిపోయాడు. కావలసిన పనేదో జరిగిపోయింది. మన్రో భర్తకు ద్రోహం చేసినట్లు తేలిపోయింది. దానికి సినాట్రా సాక్ష్యం కూడా ఉన్నది. జో విడాకుల కోసం కోర్టుకెక్కాడు''అన్నది టేలర్.

''తనూ కోర్టుకొచ్చి నిజం చెప్పలేకపోయిందా?''అన్నది మంజరి.

''లేదు. అప్పట్లో మన్రో ఆరోగ్యం అంత బావోలేదు. ఆవిడ కొద్దిరోజుల్లో తల్లికాబోతున్నది...''

''తనకు పిల్లలున్నట్లు మార్లిన్ నాతో చెప్పనేలేదు''అన్నది మంజరి.

''ఇప్పుడు లేరు''అన్నది టేలర్.

మంజరి ఇంకేమీ అనలేదు.

ఇంకో మూడు రోజుల్లో తను అమెరికా నుండి వెళ్లిపోతుందనగా మార్లిన్ నుండి జాబు వచ్చింది.

''నిన్ను చూడాలని నా ప్రతి రక్తకణంతోనూ కోరుతున్నానంటే నమ్ము. కానీ, నేను పరిస్థితులకు బానిసనై పోయాను. నాజీవిత సూత్రాలు నా చేతుల్లో లేవు. ఓరాత్రి నీతో గడిపినట్లు టేలర్ నాకు రాసింది. ఇండోఅమెరికన్ కల్చరల్ డెవలప్‌మెంట్ సొసైటీ వారు నిన్ను బుక్ చేశారని విని చాలా సంతోషించాను. స్టూవర్టు చాలా సమర్థుడు. అతననుకొన్నదాన్ని తప్పకుండా చేస్తాడు. నేను లండన్ నించి కదలడానికి ఇంకో వారం దాకా వీలుపడదు. నీ ప్రోగ్రాం షీట్ నా దగ్గర లేదు. వీలుంటే నిన్ను లండన్‌లో కలుసుకొంటాను. నీకు నా ముద్దులు''.

అమెరికా నుండి బయలుదేరబోయే ముందు ఆ దేశంలోని భారతీయులు చాలామంది మంజరికి విందులు ఏర్పాటు చేశారు. ముఖ్యంగా తెలుగువారికి చూసినప్పుడు మంజరి ప్రాణం లేచివచ్చింది.

''నిన్నెక్కడో చూశాను!''అన్నాడొక పొడుగ్గా ఉన్న వ్యక్తి గుంటూరుజిల్లా భాషలో.

''మాది గుంటూరు...'' అన్నది మంజరి కళ్ళింత చేసుకొని.

''నేను ఎ.సి. కాలేజీలో చదివాను! నువ్వు...అరే-నువ్వు నాకు బాగా తెలుసు. నీ పేరు మంజరి కాదు....''అన్నాడు వెంకట సుబ్బారావు.

మంజరి తత్తరలాడింది.

అయినా తొణకలేదు.

''నా పేరదే! మనిషిని పోలిన మనుషులంటారు లెండి!''

"ఆ గడ్డం మీది పుట్టుమచ్చ నాకు బాగా గుర్తు. నేను కొత్తపేట నాగార్జునా లాడ్జిలో ఉంటుండేవాణ్ణి!"అన్నాడతను.

మంజరికా పాతసంగతులన్నీ జ్ఞప్తికొచ్చాయి. ఓ రాత్రి,ఓ వెంకటసుబ్బారావూ, ఇంకో ఇద్దరూ వచ్చి, నాగమణితో మాట్లాడి, తనను కొత్తపేట తీసుకుపోవడం, అక్కడింకో ఇద్దరుండటం, తను కాదనడం, వాళ్ళు తంతామనడం, గోల కావడం, పోలీసులు రావడం, అంతా కళ్లముందు మెదిలింది!

"మీరిక్కడేం చేస్తున్నారు?"

"చదువుకొందామని వచ్చాను. చదువయ్యాక ఇక్కడే ఉద్యోగం దొరికింది. ఇహ ఇండియాకు పోలేదు. ఆవిడ నాభార్య, ప్రమీలారావ్. ఇద్దరు పిల్లలు".

అమెరికా దేశంలోని ఆఖరు సమావేశంలో మంజరి ఇచ్చిన ఉపన్యాసం చరిత్రాత్మకమైనది. దాన్ని మంజరీ, సూవర్టూ కూచుని తయారుచేశారు. ప్రఖ్యాత ప్రాచ్య విద్యావేత్త హారిమన్ ఈ ఉపన్యాసపు తొలి పాఠాన్ని రాశాడు. దాన్ని సినిమాటిక్గఆ తయారుచేయడానికి స్టూవర్టు శ్రమించాడు. నట్లుపోకుండా చదవడానికి మంజరి అయిదారు రిహార్సల్సు దాకా చేయవలసి వచ్చింది.

"ఆధ్యాత్మిక విభూతిని అఖిల ప్రపంచానికీ భారతదేశం అందించిందననడం ఎంత సత్యమో, ఆధునిక ప్రపంచాన్ని అమెరికా తీర్చిదిద్దిందనడమూ అంతే సత్యం. బాహ్య దృష్టికి తత్వశాస్త్రానికీ, సైన్సుకూ ఎక్కడా పొంత కనిపించనప్పటికీ, ఈ రెండు మార్గాలూ చేరేది వొక్క చోటికే! ఐన్స్టీన్ అంతటివాడు, 'భగవంతుణ్ణి చేరుకోడానికి తపస్సు, సైన్సూ రెండు మంచి మార్గాలే'అన్నాడు. ఈ రెండు మార్గాలకూ మన రెండు దేశాలూ ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. నేనిక్కడికి రావడమంటే-మంజరి రావడం కాదు...వ్యక్తిగతంగా నేను చాలా చిన్నదాన్ని. కానీ నా దేశం గొప్పది. అంతటి గొప్ప దేశంలో జన్మించడం నా పూర్వజన్మసుకృత విశేషం! ఇండో అమెరికన్ సాంస్కృతిక సంబంధాలు నా రాకతో బలపడుతున్నాయని స్టూవర్టు అన్నాడు. నా ఈ అల్పమైన జీవితం, ఈ మహత్తర కార్య సాఫల్యత కోసం వినియోగపడినందుకు నేను చాఆ సంతోషిస్తున్నాను. ఇకనుండి మన ఉభయదేశాల మధ్యా,ఇంతకన్నా సన్నిహితమైన సంబంధాలు ఏర్పడాలని నేను కోరుతున్నాను. గొప్ప ప్రజాస్వామిక దేశాలైన ఇండియా-అమెరికాలు అఖిల ప్రపంచానికీ మార్గదర్శకం కావాలని నేను గాఢంగా వాంఛిస్తున్నాను. ఇక్కడ నుండి వెళ్ళడం నాకెంతమాత్రం ఇష్టం లేదు. ఈ దేశంలో ఉన్నంతకాలం నన్ను మీలో ఒక వ్యక్తిగా చూశారు. నా దేశాన్ని మరిపించారు. నా పట్ల మీకు గల అమేయమైన అభిమానానికి ఇంతకన్నా మంచి ఉదాహరణం చూపలేను. నవచైతన్యంతో తొణికిసలాడే ఇక్కడి ప్రజలు, పచ్చని పంటపొలాలు, ప్రజలలోని స్నేహశీలత, స్నేహానురక్తి, ఆప్యాయత, మానవత నన్ను ముగ్ధం చేశాయి. మహత్తరమైన మీ దేశానికి రాగలిగినందుకూ, మీతో కొంతకాలం పాటు కలిసిమెలిసి ఉండగలిగినందుకూ నేనెంతో ఆనందిస్తున్నాను. ఈ అనుభవం జన్మజన్మలకూ నేనెంతో పదిలంగా దాచుకొంటాను".

ఇంకో అరగంటలో విమానం బయలుదేరుతుండగా, స్టూవర్టు ఓ కవరు ఆమె చేతికిచ్చి సన్నగా నొక్కాడు.

మంజరి కళ్లు చికిలించి చూసింది.

“కారు తాలూకు కాగితాలు...అదే...మీరు కొన్న కారుకు సంబంధించినవి. మీరు ఇండియా వెళ్ళిన అయిదురోజులకల్లా కారు బాంబే చేరుతుంది. మీకు 'సక్సేనా' చెప్పాడనుకొంటాను అన్ని సంగతులూ. వెళ్ళగానే, మీరీ కాగితాలను అతనిపేర మార్చి ఇవ్వండి. నేను పై నెలలో ఇండియా వొస్తున్నాను”.

“అది సరే-నేనడిగినవి?”అని మెడ తడుముకొన్నది మంజరి.

“అవికారుతో సహా వస్తాయి. పంపించాను. ఎంత హీనంగా చూసుకొన్నా, అక్కడి మార్కెట్ ధరల ప్రకారం 60, 66 లక్షల దాకా రావాలి. మిగిలిన వాటిని నాతో తీసుకువస్తాను. ఇంగ్లండ్‌లో బెంజిమిన్ మిమ్మల్ని కలుసుకొంటాడు. అతనేదన్నా బహుమతి ఇస్తేకాదనకు, తీసుకో. అదీ సంగతి”.

మంజరి కళ్లు మిలమిలలాడాయి.

# 31

ప్రాచ్య, పాశ్చాత్య దేశాల పర్యటన నుండి మంజరి రావడానికింకో వారం రోజుల వ్యవధి ఉన్నదనగానే, చలపతి, శర్మ కలిసి పెద్ద ఎత్తున “స్వాగత సమితి”నొకదాన్ని ఏర్పాటు చేశారు. నిజానికి సమితితో వారికెలాంటి ప్రత్యక్ష సంబంధమూ లేదు. మద్రాసు నగరంలోని ఫిలిం జర్నలిస్టులు కొందరు కలిసి ఈ పేరుతో మంజరికి స్వాగతం చెప్పడం బావుంటుందని శర్మగారే ముందు పురమాయించారు. అందుకయిన ఖర్చులేవో ఆ దరిమిలా మనం వసూలు చేద్దామన్నాడు. అలా ప్రారంభమైన ఆ సమతి రానురాను మద్రాసులోని ఫిలిం పరిశ్రమ నంతటినీ ఆకట్టుకొన్నది. ఆ పరిశ్రమలోని ప్రముఖులు చాలామంది ఆ సమితిలో కావాలనే చేరిపోయారు. విదేశీ పర్యటనతో మంజరిస్థాయి పెరుగుతుందనీ-అప్పుడావిడ రేటు నక్షత్ర మండలాలకు దాటిపోతుందనీ ఊహించిన మధ్యరకం ప్రొడ్యూసర్లు-ఆమెను మంచి చేసుకోవడానికి ఇంతకన్నా సమయం దొరకదని-లంగోటీలు బిగించి రంగంలోకి దిగారు. రావుగారూ-మూర్తిగారూ సరేసరి. ఇండో అమెరికన్ కల్చరల్ డెవలప్‌మెంట్ సొసైటీవారు, ఉభయదేశాల సంయుక్త నిర్మాణంగా ఒక చిత్రాన్ని తీయబోతున్నట్లూ, అందులో భారతదేశం తరపున మంజరి కథానాయికగా బుక్ అయినట్లూ ఇక్కడి పత్రికలు పెద్దపెద్ద శీర్షికలతో వార్తలు ప్రచురించాయి. స్థానిక అమెరికన్ కాన్సులెట్ కూడా అది 'అబద్ధం' అనలేదు. కానీనిజమని కూడా వారు వొప్పుకోలేకోయారు. లేకపోతే అటువంటి ప్రతిపాదన వొకటి ఉన్నమాట నిజమేననీ, అదెంత వరకు కార్యరూపం దాల్చిందీ తాము చెప్పలేమనీ వారన్నారు. ఏది ఏమైనప్పటికీ, ఆమెతో రవంత మంచిగా ఉండటమే మంచిదనిపించింది వారికి! ఆవిడ తలుచుకుంటే- ఆసినిమాలో మంచి వేషం దొరక్కపోదు. అంత పని ఆవిడతో వున్నప్పుడు, పోయి పలకరించడానికే వంచ్చిందట? రేపావిడ ఏమీ చేయకపోవచ్చు. అయినా మంచిగా ఉండటంలో తప్పేమీ లేదు గదా!

మూర్తి, రావుగారలు కదలడంతో-వారి ముఠాలు కూడా తర్లుకొచ్చాయి. చలపతిగారికి ఆఖరు నిమిషంలో ఇంకో బ్రహ్మాండమైన ఆలోచన వచ్చింది.

“ఈ సందర్భంలోనే మనం పత్రికలచేత సప్లిమెంట్సు వేయిస్తే కాదూ?”అన్నాడు.

తనకిలాంటి ఆలోచన రానందుకు శర్మ రవంత నొచ్చుకున్నాడు. అయినా అతగాడు బయటపడదలుచుకోలేదు.

"నాకూ ఈ ఆలోచన ఉన్నది. కానీ మంజరి 'ఎందుకొచ్చిన దుబారా' అంటుందేమోనని నా భయం"అన్నాడు శర్మ తడుముకోకుండా.

"అందులో దుబారా ఏముంది?"

"ఉన్నదంతా అదే! పత్రికలు ఊరికే సప్లిమెంట్సు వేయవు. అయిదు వేలో, ఆరువేలో ఇవ్వాలి. కాక, ఇంత రెవిన్యూ ఎడ్వర్‌టైజ్‌మెంట్సు ద్వారా వస్తుందన్న గ్యారంటీ ఇవ్వాలి. ఆదంతా మనం చెయ్యగలమా?"అన్నాడు శర్మం.

"మీరు పూనుకుంటే చెయ్యగలం. నా వొక్కడివల్లా అవుతుందనేది... అబద్ధం...ఎందుకంటున్నానంటే.. ఇంతవరకూ తెలుగు సినీ ఆర్టిస్టు విదేశాల కెళ్లడమంటూ జరగలేదు. మంజరి దానికి ప్రారంభోత్సవం జరిపింది. తెలుగు ఫిలిం చరిత్రలో ఇదో నూతన ఘట్టం! ఇలానే ప్రతిదీ ఉండాలని నా అభిప్రాయం...ఏ సినీ ఆర్టిస్టును గురించైనా పత్రికలు సప్లిమెంట్సు వేశాయా?"అన్నాడు చలపతి.

"నార్తిండియాలో సంగతి నాకు తెలీదు గానీ..."

మధ్యలోనే చలపతి అందుకొన్నాడు.

"సౌతిండియాలో లేదుగదా!దట్సాల్, మనం ప్రొసీడ్ కావచ్చు. మంజరి ఏమీ అనదు. నాదీ పూచీ"అన్నాడు.

"పోనీ ఓమాటు వసంతను కూడా అడిగి చూదామా?"అన్నాడు శర్మ.

చలపతికిక వోపిక నశించిపోయింది.

"చాలామంది ఆడవాళ్లకు ఆలోచన చెప్పే తాహత్తు ఉంటుందని నేననుకోను. వాళ్ళు వండడానికి, పండడానికి తప్ప మరెందుకూ పనికిరారు. అలా అనడం ఈరోజుల్లో భావ్యం కాదు గనక-మనం నోరు మూసుకొంటున్నాం. నాయనా నరహంసెట్టి వెంకట్రత్తం. వొక్కసంగతి చెప్పవోయ్! ఇంతలా అనుభవం ఉన్న ముండాకొడుకులం మనకే దిక్కుమొక్కు లేకుండా పోతుండెనే-ఈ ఆడముండలు సలహాలిచ్చేదేమిటి, చచ్చేదేమిటి? కాబట్టి మనం ముందుకు పోవడమే ఉత్తమం"అని సలహా ఇచ్చాడు అతడు.

"అదికాదు బాబూ! మంజరి కత్తికి రెండువేపులా పదునుంటుంది".

"కాదు. నాలుగువేపులా పదునుంటుంది. అందుకనే దెబ్బకాచుకోడం సులభం కాదంటున్నాను. ఆవిడొచ్చి 'ఎందుకిలాచేశా'రని నిలవేస్తే నా వేపు వేలు చూపించు, నే సమాధానం చెబుతాను"

"కన్ను పోయేంత కాటుకెందు చెప్పండి?"అని నసిగాడు శర్మ.

"అయితే నీ ఇష్టం. రేపు 'ఇలా ఎందుకు చెయ్యలే'దని ఆవిడడిగితే, నవ్వు సంజాయిషీ ఇచ్చుకోగలవా? ఆ ధైర్యం నీకుంటే నాకేమీ అభ్యంతరం లేదు"అని తాత్కాలికంగా అస్త్రసన్యాసం చేశాడు చలపతి.

శర్మ ప్రాణం విలవిలలాడిపోయింది. తనేమిటి చేయడం? ఏదైతే అదే అవుతుందని, అలాగే

అనేశాడు చివరికి.

ఆలోగా చలపతి విజయవాడ పబ్లిషర్‌కు వైరిచ్చాడు. మంజరి ఫలానాతేదీకి మద్రాసు వస్తున్నదనీ, అదేరోజున ఆమె 'జీవితకథ'ను ఏ సినిమా కవిచేతో ఆవిష్కరింపచేదామనీ కనుక త్వరగా ప్రింటింగ్ పూర్తి చేయమనీ విడిగా జాబు కూడా రాశాడు. ఒకవేళ పుస్తకం అచ్చయి ఉండటమే జరిగితే, అధమం 15వందల కాపీలు వెంట తీసుకురమ్మన్నాడు. కనీసం, వారం పదిరోజుల పాటు మంజరికి ఇక్కడ సన్మానాలు జరుగుతాయి. ఆనందడిలో నువ్వా కాపీలను హాట్‌కేన్సులాగా అమ్ముకోవచ్చును''అని కూడా ఓ ముక్క తగలించాడు.

-అనుకొన్న రోజుకు అనుకొన్న పనులన్నీ పూర్తయ్యాయి. మద్రాసులోని సంగీతదర్శకులు, ఆర్కెస్ట్రాలతో సహా, విమానాశ్రయంలో మంజరికి స్వాగతం పలికారు. అమెరికా కాన్సులేట్ జనరల్ కార్యాలయోద్యోగులు, రాష్ట్రమంత్రులు ఇద్దరు, దర్శకులు,నటీనటులు, డిస్ట్రిబ్యూటర్లు పూలదండలతో బారులు తీరారు.

మంజరి విమానం పదినిమిషాలు ఆలస్యంగా వచ్చింది!

విమానం తలుపులు తెరుచుకొన్నాయి. ముందుగా హెూస్టెస్ దిగింది. ఆమె వెనుక మంజరి మెట్ల దగ్గరికొచ్చి నిలబడింది.

విమానాశ్రయం ప్రతిధ్వనించేలాగా జయన్నినాదాలు పెల్లుబికాయి. మంజరి ఒక్కసారి కుడిచేతిని గాలిలోకి ఎత్తి చిరునవ్వు నవ్వింది.

''మంజరి ఇప్పుడు ఆకాశమంత ఎత్తుకు ఎదిగింది''అన్నారెవరో.

# 32

''అమెరికన్ జీవిత విధానం గురించి చెప్పడం వొకంతట సాధ్యం కాదు...అయినా నేను కన్నదీ, విన్నదీ మీ ముందుంచడానికి ప్రయత్నిస్తాను. అతిథి సత్కారంలో అమెరికనులు-ప్రపంచంలో ఎవరికీ తీసిపోరని నా అభిప్రాయం. నేను చాలా ప్రాచ్యపాశ్చాత్య దేశాలలో పర్యటించాను. ఆయా ప్రజల ఆదరాభిమానాలు నన్ను అనందసాగరంలో మునకలు వేయించాయి. అమెరికనులలో ఉత్సాహం, ఉద్వేగం అధికం. పట్టుదల అత్యధికం. కృషి అనన్యం. అసాధ్యమైన లక్ష్యాన్ని ఏర్పాటు చేసుకొని, దాన్ని సాధించేందుకు రక్తతర్పనం చేయగల జాతి అమెరికన్ జాతి. అయినా వారి హృదయాలు ఆర్ద్రంగా ఉంటాయి. పాచ్యదేశాల సంస్కృతి అంటే-ముఖ్యంగా భారతీయ కళలన్నా, సంస్కృతి అన్నా వారికెంతో మక్కువ. కొన్ని ఇతరదేశాలలో లాగా, నా ప్రయాణానికి నిర్బంధాలు లేవు. స్వేచ్ఛగా నేను దేశమంతటా తిరిగాను. అమెరికనుల వ్యవసాయ క్షేత్రాలు, ఫ్యాక్టరీలు, హెూటళ్లు, షాపులు, ఫిలింస్టూడియోలు, నాటకశాలలు, టెలివిజన్ కేంద్రాలు, పల్లెసీమలు, మహానగరాలు, అన్నీ తిరిగాను. అన్నిచోట్లా నాకాప్రజల్లోని జీవచైతన్యమే కొట్టవచ్చినట్లుగా కనిపించింది. అతిథి సేవలో శతాబ్దాలుగా పేరుమోసిన భారతీయులు అమెరికనులను చూసి నేర్చుకోవలసింది చాలా ఉంది. వారి కళాభిజ్ఞత, సాహిత్య పిపాస, లలితకళలపట్ల వారికి గల ప్రగాఢానురాగం అనేక సందర్భాలలో నన్ను విచలితం చేశాయి. ఆధునిక జీవనంలోని వైవిధ్యాలన్నీ మనకాదేశంలో కళ్ళకు కట్టినట్టు కనిపిస్తాయి.''

అంతవరకూ చదివి వినిపించి, ''ఎలా ఉంది?''అన్నాడు శర్మ.

మంజరి అదోలాగా తలపంకించింది.

''నీకు నచ్చినట్లుగా లేదనుకుంటాను?''అన్నాడు శర్మ.

''నచ్చకపోవటమని కాదుగానీ, మరీ అమెరికనులకు తైర్ కొట్టినట్లుగా ఉన్నదేమోనని నా అనుమానం. నిజంగా-మీరూ అలా ఫీలవుతున్నారా చలపతీ?''అన్నది మంజరి.

''నేనంతగా గమనించలేదే!''అని తప్పుకొన్నాడు చలపతి.

''అంతో ఇంతో ఆకాశానికెత్తినమాట నిజమే! అందులో తప్పేమిటి? రేపు వారితో మనకు చాలా పనులున్నాయి. బోలెడంత డబ్బు మన ప్రాజెక్టు కింద ఖర్చుచెయ్యబోతున్నారు. వారికి మనమిస్తున్నది ఎందుకూ కొరగా పబ్లిసిటీయేనా, ఇంకేమన్నానా?''అని కోపగించుకొన్నాడు శర్మ.

''అక్కడి సినీ పరిశ్రమను గురించి ఇంకా రాయలేదా?''

''రాశాను!''అంటూ శర్మ మళ్ళా చదివి వినిపించడం సాగించాడు:

''సినిమా పరిశ్రమ అత్యున్నత స్థానంలో ఉన్నదేశం అమెరికా ఒకటేననుకొంటాను. వాణిజ్యరీత్యా చూసినా, కళా దృష్ట్యా చూసినా అమెరికన్ చిత్రాలు లోకోత్తరంగా ఉంటాయి. లక్షలు ఖర్చుచేసి కోట్లు పిండుకోవడమంటే ఏమిటో మనకు తెలీదు. అది అమెరికనులకు బాగా తెలుసు. ఒక్కో పిక్చరు కోసం వాళ్లు 5,6కోట్లు ఖర్చుచేసి, అంతకు యాభైరెట్లు, నూరురెట్లు కూడా సంపాదించిన సందర్భాలున్నాయి. పది ఫ్లోర్స్ ఉంటే మన బతుక్కది గొప్ప స్టూడియో. దాన్ని చూసుకుని మురిసిపోతూ ఉంటాం. నేను అమెరికాలో 80,90 ఫ్లోర్సున్న స్టూడియోలను చూశాను. నిజానికవి స్టూడియోలు కావు-మహానగరాలు. అందులో బ్రహ్మాండమైన కారడవులు, మహోన్నత పర్వతాలు, నదులు, సరస్సులు, జలపాతాలు, ఎడారులు, బందభూములు, చిత్రవిచిత్రమైన పక్షులు, క్రూరమృగాలు, ఆకాశాన్నంటే సౌధాలు, అత్యాధునిక నగరభాగాలు, నీగ్రోల మురికిపేటలు, రెడ్ఇండియన్ల గుడిశలు అన్నీ ఉన్నాయి. సహజత్వం కోసం అమెరికనులు ఖర్చుపెట్టినంతగా మరెవ్వరూ ఖర్చుచెయ్యరనడం అతిశయోక్తి కాదు. ప్రతి చిన్న విషయాన్నీ వారెంతో శ్రద్ధగా పరిశీలిస్తారు. అన్నీ టైం ప్రకారం చకచకా జరిగిపోతాయి. నేనక్కడ ఉండగానే, ఒక మహానౌక సముద్రంలో మునిగిపోవడం షూట్ చేశారు. అదేతెలుగు డైరెక్టరైతే, రెండు డైలాగ్సుతో ఆ సీనుకొట్టి పారేసేవాడు. హిందీ డైరెక్టరైతే, ఓ న్యూస్‌పేపర్‌లో ఓడమునిగిపోతున్న బొమ్మా, దాని కింద న్యూసువేసి, ఎవరో చదువుతున్నట్లు ఓ షూట్ తీసిపారేసేవాడు. కానీ అమెరికన్ దర్శకుడలా చేయలేదు. పసిఫిక్‌లో ఆ సీన్ నిజంగా క్రియేట్ చేశారు. ఎందుకైనా మంచిదని వంద కెమెరాలతో ఓ సీను షూట్ చేశారు. విమానాల ద్వారా కూడా కొన్ని షాట్స్ తీయించారు. ఇంతా చూస్తేసినిమాలో ఆ సీను మూడు నిమిషాలకన్నా ఉండదని తెలిసింది. దాంతో పోలిస్తే మనమూ మన పరిశ్రమా ఏ దశలో ఉన్నదీ ఊహించడానికే భయమేస్తుంది! మనం ఇక్కడ కూచుని, సినిమాలకూ, నాటకాలకూ చుక్కెదురనుకొంటాం. అమెరికాలో అదేమీ లేదు. నాటకరంగం ఎంతగా అభివృద్ధి చెందిందో నేను చెప్పలేను...నాకున్న బాధ్యత లన్నింటినీ త్వరగా వదిలించుకొని, అదే పద్ధతిమీద, నాటకరంగాభివృద్ధికోసం కృషి చెయ్యాలనుకొంటున్నాను. భగవత్సంకల్పం ఎలా ఉంటుందో తెలీదు...అయితే సినిమాలకు పోటీ లేదని కాదు. ఈనాటి అమెరికన్ సినిమాను టెలివిజన్

సవాలుచేస్తున్నది. అతిదారుణమైన ఈ పోటీలో ఏ రంగం గెలుస్తుందన్నది ప్రశ్నకాదు; అంత ఆరోగ్యకరం కాదన్నదే నా అభిప్రాయం. అమెరికనుల జీవనం అవశ్యం అనుసరణీయం. కోటీశ్వరుని బిడ్డలయినా కష్టించి పనిచేస్తారు. దాదాపు ప్రతి కుటుంబానికీ కారున్నది. భార్యాభర్తలిద్దరూ సంపాదిస్తారు. పది వస్తువులకోసం, పదిచోట్లకు తిరగనవసరం లేదు. ఒకచోటనే మనక్కావలసిన అన్ని వస్తువులూ దొరకుతాయి. చాలామంది అమెరికనులు సెక్స్‌కు అధికప్రాధాన్యమిస్తారని మనం అనుకొంటాం. అక్కడి ఆచార వ్యవహారాలు మనకు కొత్తగనక, అలా అనిపంచేమాట నిజమే! కానీ అదే పూర్తి నిజం కాదనిపించింది నాకు. నేను, మార్లిన్ మన్రోతో కలిసి, రెండుమూడు క్లబ్బులకెళ్ళాను. ఒకచోట న్యూడ్ డాన్సులు జరుగుతున్నాయి. ఆ నగ్నత్వం మనలో శారీరక వాంఛలను రెక్కొలపవదు. ఏదో అనిర్వచనీయమైన ఆనందానుభూతిని కలిగిస్తుంది. నాకలాంటి అనుభూతే కలిగింది కూడాను. బహుశా నేను కళాదృష్టితో చూడడం వల్లనే అలా అనిపించిందో, లేక అందరూ ఆ నృత్యాలను చూసి, నాకు మల్లేనే అనుకొంటారో నేను చెప్పలేను. భారతదేశం నుండి భారతీయుల సహృదయత్వాన్ని, స్నేహవాత్సల్యాలను నేను పదిలంగా పట్టుకెళ్లి అమెరికనుల కర్పించాను. వారి నుండి సౌజన్యాన్ని, సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని ఈ దేశానికి తీసుకొచ్చాను. నాకు అవకాశమే లభిస్తే, మళ్లీమళ్లీ అమెరికాను చూడాలనియున్నది''అని ముగించాడు శర్మ.

మంజరి సిగరెట్ ముట్టించి, గుప్పుమని పొగవదులుతూ ''బావుంది శర్మాజీ''అన్నది.

''మీరు చెప్పిన పాయింట్సును నేను వెనకా ముందూ సెట్ చేస్తున్నాను. ఓ ఆర్డర్‌లో పెట్టాక, ఇతర దేశాల పర్యటనను గురించి కూడా రాస్తాను''అన్నాడు శర్మ.

''త్వరగా కానివ్వండి. జనంలో వేడి తగ్గాక, మనమేం చేసినా తిరిగిరగులుకోదు...వీటిని హిందీలోకి, ఇంగ్లీషులోకీ మార్పించండి. అన్ని పత్రికలకూ పంపించండి!''అన్నది మంజరి.

''అలాగే చేదాం!''అన్నాడు శర్మ.

అతను లేచిపోతూ ఉండగా, మంజరి, చిన్న చిటిక వేసి చిరునవ్వు నవ్వుతూ ''నాకు మన్రో ఓ అద్భుతమైన ఘట్టం చెప్పింది. అది బావుంటుందని మీరనుకొంటే-నా జపాను పర్యటన సందర్భంలో, ఎక్కడన్నా ఇరికించండి!''అన్నది.

''చెప్పండి!''అన్నాడు శర్మ.

''మన్రో ఆమె రెండవ భర్త జోతో కలిసి జపాన్ వెళ్లింది. అమెరికన్ సైనికాధికారుల కోరికమీద, కొరియాలో యుద్ధం చేస్తున్న అమెరికన్ సైనికులకు వినోద ప్రదర్శనలివ్వడానికి అంగీకరించింది. అక్కడి సైనికాధికారుల ఆమె గౌరవార్థం బ్రహ్మాండమైన విందును ఏర్పాటుచేసి, తమ 'మెస్'కు ఆమెను ఆహ్వానించారు. అంతవరకూ బాగానే ఉన్నది. మన్రోను చూడడం కోసం వేలాదిమంది అమెరికన్ సైనికులు మెస్‌లో పోగుపడ్డారు. ఆ హడావుడిలో వారొక ముఖ్యవిషయాన్ని మరచిపోయారు. అంతకుముందుగా మెస్‌లో మన్రో నగ్నచిత్రం వొకటి గోడకు వేళ్ళాడుతూ ఉండేది. కనీసం ఈ సమయంలోనైనా, దాన్ని తొలగించి ఉండవలసింది! కానీ ఎవ్వరూ ఆపనిచేయలేదు. ముందుగా అక్కడా చిత్రాని చూసింది మన్రోయే! ఆమెతో బాగు మిగతా వారు కూడా చూశారు. చూసి చాలా నొచ్చుకున్నారు. దురదృష్టవశాత్తూ దాన్ని తొలగించడం మరిచిపోయామనీ, మిమ్మల్ని

అనుమానించాలన్న దురుద్దేశంతో దాన్నక్కడ ఉంచలేమనీ అమెరికన్ అధికారులు పదేపదే మన్రోకు సంజాయిషీ చెప్పుకొన్నారట...దానికి మన్రో ఇచ్చిన సమాధానమేమిటంటే- ఇందులో మీరుగానీ, నేనుగానీ బాధపడవలసిందేమీ లేదు. బతుకులోని సంక్లిష్టతా దశలు మానవతను ఏ స్థాయికి తీసుకుపోతాయో అర్థం చేసుకొనేందుకు ఈ బొమ్మ సాయపడుతుందనుకొంటాను. ఇంకొద్ది గంటలలో 'మార్లిన్' మట్టిలోకలిసిపోతుందనగా, ఈ నగ్నచిత్రానికి నమూనాగా నిలిచింది. ఫలితంగా మట్టిలో కలిసిపోవడానికి బదులుగా, ఊపిరి పీల్చుకొని ఇవతలి ప్రపంచంలో కొచ్చిపడింది. ఇలా నిలబడటం తప్పని నేనిప్పటికీ అనుకోడం లేదు. ఈ బొమ్మకోసం మార్లిన్ నిలబడకపోతే, ఈనాడు మీముందీ జగదేక సుందరి నిలబడేదే కాదు'అన్నదట మన్రో. దీన్ని కాస్త అలాఇలా మార్చేసి, నా టూర్‌లో ఎక్కడన్నా ఇరికించండి యాజిటీజ్‌గా కాదు; అవసరమైతే ఓ చిన్న సీన్ క్రియేట్ చేయండి. ఇన్సిడెంట్ బలమైంది కాదూ?''అన్నది మంజరి.

''మార్వొలెస్ మేడమ్! ఇలాంటివి లక్షాతొభయ్ ఇరికించేస్తాను. మీకెందుకూ...మీరలా చూస్తూ ఉండండి; ఈవ్యాసాలను లోకోత్తరంగా తయారుచెయ్యకపోతే నాచెవి కోయించుకుంటాను సరా?''అన్నాడు శర్మ.

మంజరి అతని బుగ్గలు పుణికి గట్టిగా ముద్దాడి వదిలేసింది.

# 33

రాజన్‌ను రమ్మంటూ జాబులు రాసింది. ఫోన్ చేసింది. వైరిచ్చింది. అతను రాలేదు గానీ, అతని దగ్గర నుండి ఓ కాగితం పట్టుకుని కనకసుందరం గారొచ్చారు.

''వీరు నాకు చాలా ఆప్తులు. నీతోపనుండి వచ్చారు. ఆ పని పూర్తిచేసి పంపించు''అని రాశాడు రాజన్.

''చెప్పండి. నావల్లయ్యేదైతే తప్పకుండా చేస్తాను''అన్నది మంజరి.

''నేను ఉన్న ఆస్తంతా తగలపెట్టుకొన్న మనిషిని. ఇరవయేళ్లపాటు నాటకాలాడాను. ఆడించాను. నా సొమ్మంతా అందులోనే కరిగిపోయింది. ఈ సంగతి మన రాజన్‌కు కూడా తెలుసు. పిల్లలు ఎక్కొచ్చే వేళకు నేను బికారినయ్యాను. నాతోబాటు పనిచేసినవారూ, నా కంపెనీలో చిన్నచిన్న వేషాలేసినవారూ, ఈనాడు లక్షలుసంపాదించారు. వారందరూ తలో చేయీ వేసి, నాకు సాయం చేశారు. కాస్త కాళ్లూని నిలబడుతున్నాను. మీరూ నాకు సహాయపడితే-నాకదే చాలు''అన్నాడు కనకసుందరం.

అంతచెప్పినా, అతనిక్కావలసిందేమిటో మంజరి బోధపరచుకోలేకపోయింది. అదే-రవంత సున్నితంగా అడిగింది కూడాను.

''పోనీ, పెట్టుబడికి ఏపాటి కావాలో అడగండి''అన్నది మంజరి చెక్కుమీద సంతకం చేసి, అంకెవెయ్యకుండా.

కనకసుందరం, రెండు చెంపలూ పెడీపెడీమని వాయించుకుని లబలబ లాడిపోయాడు.

''నా ఉద్దేశం అదికాదు తల్లీ! మీ ఆశీర్వాదంం వల్ల, నాకిప్పుడు ఆర్థిక సహాయమేమీ అవసరం

లేకపోయింది. స్నేహితుల ప్రోద్బలం వల్ల, నేను సబ్బుల పరిశ్రమ ప్రారంభించాను. సరుకయితే మంచిదే! ప్రొడక్షన్ కూడా బాగానే జరుగుతున్నది. కానీ అమ్మకాలే లేవు. నాకన్నా ముందీ ఇండస్ట్రీలో పాతుకుపోయిన వారు, నా సరుకు మార్కెటు కెక్కకుండా అడ్డుపడుతున్నారు. పెట్టిన పెట్టుబడంతా లాకప్ అయిపోయింది. ఏమీ తోచక తమ దగ్గరికొచ్చాను''అన్నాడు కనకసుందరం.

అతనిక్కావలసినదేమిటో మంజరి కర్థమయింది. అయినా ఆవిడ బయటపడదలచుకోలేదు.

''అన్ని టన్నుల సబ్బులను నేను మాత్రం ఏం చేసుకోను బాబూ!''అన్నది మంజరి నవ్వుతూ.

''సరుకు చూడండి''అన్నాడు కనకసుందరం. అరడజను సబ్బుబిళ్ళలు బల్లమీద పేరుస్తూ, ''మంచి వాసన, త్వరగా అరగదు. వాటర్ కంటెంట్ మిగతా సబ్బులన్నిటికన్నా తక్కువ. ఇలా రుద్దితే చాలు మీగడ లాంటి నురగ బోలెడంత వస్తుంది చూడండి మీరే!''

''చూదాం!''అన్నది మంజరి.

''నా స్థితి చూసి రాజన్ గారిక్కడకు పంపించారనండీ! మరేం లేదు...ఈ సబ్బు మీరు వాడుతున్నట్లూ, ఇది తమకెంతో వచ్చినట్లూ ఓ సర్టిఫికేటు ఇప్పించండి చాలు. మీపేరుమీదుగా ఈ సరుకును అమ్ముకొంటారు''అన్నాడు కనకసుందరం.

మంజరి ఏమీ అనలేకపోయింది. నిజానికిలాంటి వ్యవహారాలంటే ఆవిడకు గిట్టవు. అప్పుడెప్పుడో వో పెద్ద సబ్బుల కంపెనీవారు, తన అభిప్రాయం కోసం చాలాసార్లు తిరిగారు. పదేపదే అడిగారు. అడిగించారు. అయినా తను కాదన్నది. దేశంలో పేరుపొందిన స్టార్సంతా ఆ సబ్బునే వాడుతున్నట్లు పేపర్లో ప్రకటన లిచ్చారన్నారు. వాళ్లు ''ఇందువల్ల మీకే వల్లమాలిన పబ్లిసిటీ!''అన్నారు. తను 'ఛా, ఫో''అన్నది. తను-మిగతా వారందరికన్నా గొప్పదాన్నన్నది. వాళ్లిక నిరాశ చేసుకొనిపోయారు. వారినైతే తను కసిరికొట్టింది. కానీ, ఈ కనకసుందరాన్నలా అనడానికి లేదు. ఇతగాడు రాజన్ నుండి ఉత్తరం పట్టుకొచ్చాడు. ఇతన్ని కాదంటే రాజన్‌ను కాదన్నట్లే! రాజన్‌కు, తనకూ ఇంకా చాలా వ్యవహారాలున్నాయి కాబట్టి తన కిష్టమున్నా, లేకపోయినా, ఈ పనిచేయవలసిందే! అయినా ఎందుకన్నా మంచిదని చలపతిని సలహా అడిగింది మంజరి.

''తప్పకుండా వొప్పుకో, డబ్బు ఎదురిచ్చి, సబ్బులకంపెనీల ద్వారా, తలనూనెల మాన్యుఫాక్చరర్సు ద్వారా పబ్లిసిటీ ఇచ్చుకొంటున్నవారు పుంజీలకొద్దీ ఉండగా లేనిది, మనకేమయిందిట? నన్నడిగితే, ఈ తరహా ప్రచారం లేకపోవడం మనకొక లోటేనంటాను. 'నిజంగా మంజరికంత కీర్తే ఉంటే ఏ సబ్బుల కంపెనీ, ఆమెనెందుకు ఉపయోగించుక'దని ఎవరన్నా అడిగితే ఏమిటి చెప్పడం?''అన్నాడు చలపతి.

''ఏం రాయమంటారండీ?''అన్నది మంజరి తాపీగా.

''మీరేమీ రాయనవసరం లేదు. నేను రాసే పట్టుకొచ్చాను. మరొకసారి చిత్తగించి, సంతకం చేస్తే చాలు''అన్నాడు కనకసుందరం.

మంజరి ఆ కాగితాన్నందుకొన్నది.

''ఈ సబ్బు నాకెంతో అభిమానము. పాలమీగడ వంటి దీని నురగను నా చర్మములోనికి సున్నితముగా అదుముకొందును. నా సౌందర్యరహస్యము ఈ సబ్బే!''

అని అందాల రాణి మంజరి చెప్పుచున్నది''.

'ఇక్కడ మీ బొమ్మ వేస్తామండీ!''అని, ఆ ప్లానంతాచూపించాడు కనకసుందరం.

మంజరి ఆ కాగితంమీద సంతకం చేసి నిట్టూర్చింది.

కనకసుందరం వెళ్లిపోయాడు.

''నువ్విలా బలవంతం చేస్తావనుకోలేదు చలపతీ! లేకపోతే నిన్ను సలహా అడక్కనే పోదును''అన్నది మంజరి ఆ తర్వాత.

''దీన్ని గురించి ఇంతగా నువ్వు మదనపడటం ఫూలిష్‌నెస్. నీ మార్లిన్ మన్రో లక్స్ సబ్బులకంపెనీ ఎడ్వర్‌టైజ్‌మెంటుకోసారి పోజిచ్చింది. కావలిస్తే జాబురాసి కనుక్కో. కొన్ని పనులు కాదన్నా ఆగవు. జరిగిపోతాయి. అప్పుడెప్పుడో, ఓ కాలెండరు కంపెనీవాడు, నీ బొమ్మనడిగితే వాణ్ణి తన్ని తగిలేశావు. అయినా జరగవలసిందేదో జరిగిపోయింది. నీ అనుమతి లేకుండానే, నీ బొమ్మతో వందరకాల కాలెండర్లు మార్కెట్‌లో అమ్ముడవుతున్నాయి. వీళ్లందరి మీదా నువ్వు కేసులు పెట్టలేవు. కోర్టుల చుట్టూ తిరగనూ లేవు. అలా చూసీ చూడనట్టు పోనిస్తుండాలి.నువ్వప్పుడే గనక ఆ కాలెండర్ కంపెనీవాడి మాటను విన్నట్లయితే ఎంత బాగుండును! నువ్వు కాదన్నాక వాడు, 'సరోజ' బొమ్మను తీసుకొన్నాడు. రెండు లక్షల క్యాలెండర్లు 'స్విస్'లో ప్రింట్ చేయించాడు...''అన్నాడు చలపతి.

''ఈ దఫా అలాంటి అవకాశమొస్తే జారవిడుచుకోను-సరా!''అన్నది మంజరి మొండిగా.

చలపతి లోలోపల నవ్వుకున్నాడు.

# 34

లాలారాం నీళ్లు నములుతూ కూచున్నాడు. మంజరి సోఫాలో జారగిలబడింది. ఆమె చేతిలో వందరూపాయలనోట్లకట్టలు బంతుల్లాగా ఆడుతున్నాయి.

''ఊఁ, తరవాత?''అన్నది మంజరి.

''ఏం లేదు. ఇంతకన్నా నేను మాత్రం ఏం చేయగలను మంజరీ! లోగడ నా పిక్చర్లన్నీ సెంచరీ కొట్టాయి. లక్షలకు లక్షలు ఆర్జించాయి. అయినా నేనిప్పుడు కానీ లేకుండా వీధిలో నిలబడ్డాను. ఒకప్పుడు నా దయాదాక్షిణ్యాలకోసం, వీధి వాకిలి దగ్గర ప్రాణాచారా పడినవాళ్లు కోట్లు ఆర్జించారు. నేను బికారినయ్యాను. ఇలా మారుతుందనుకోలేదు''అన్నాడు లాలారాం.

''అంటే, ఇప్పుడు ప్రాణాచారం పడే దశ నీకు పట్టిందంటావ్-అంతేనా?'' అన్నది మంజరి.

లాలారాం మాట్లాడలేదు.

మంజరి అతనికేసి కొరకొర చూసి, ఓ నోట్లకట్టను కాలితో అతనిమీదికి విసిరేసింది.

''తీసుకో, నీకెంతకావాలో తీసుకో. నాపట్ల విశ్వాసంగా ఉన్నంతకాలం నీకొచ్చిన భయంలేదు...పిక్చరు లేవని బెంగపడకు. ఇండో అమెరికన్ కల్చరల్ డెవలప్‌మెంట్ సొసైటీవారు పిక్చర్ తీస్తారు. అందులో నీకు తప్పకుండా ఛాన్స్ ఇప్పిస్తాను. డోన్ట్ వర్రీ''అన్నది మంజరి.

''తీసుకో, నీకెంతకావాలో తీసుకో. నాపట్ల విశ్వాసంగా ఉన్నంతకాలం నీకొచ్చిన భయం లేదు. పిక్చర్లు లేవని బెంగపడకు. ఇండో అమెరికన్ కల్చరల్ డెవలప్‌మెంట్ సొసైటీవారు పిక్చర్ తీస్తారు.

అందులో నీకు తప్పకుండా ఛాన్స్ ఇప్పిస్తాను. డోన్‌ట్ వర్రీ''అన్నది మంజరి.

''థాంక్యూ మేడమ్''అన్నాడు లాలారాం. ''ఇందులో ఎన్ని తీసుకోమంటారు''.

''నీక్కావలసినన్ని!''

''కాదు, చెప్పండి!''అన్నాడు లాలారాం. ''ఇందులో ఎన్ని తీసుకోమంటారు''.

''నీక్కావలసినన్ని''

''కాదు, చెప్పండి!''అన్నాడు లాలారం మొహమాటపడిపోయి.

''ఓ యాభై నోట్లు చాలా?''

''అయిదువేలా?''

''చాలకపోతే ఇంకో యాభై తీసుకో లాలూ! డబ్బును మనం సంపాదించాం. మనల్నది ఎప్పుడూ ఆడించకూడదు..''

లాలారం. నోట్లు లెక్కపెట్టడం చూసి పండ్లు కొరికింది మంజరి.

''చూడు బాబూ! ఇంకోచోట మంచిపరి దొరికిందాకా, నువ్వు నా దగ్గరే ఉండు. నాకు గార్డియన్‌వనుకో, పర్సనల్ సెక్రటరీవనుకో, డైరెక్టరువనుకో, ఇంకోటనుకో- ఇంకోటనుకో- నా కభ్యంతరం లేదు. కానీ ఎక్కడా మన స్టేటస్‌కు భంగకరంగా ప్రవర్తించకు''అన్నది మంజరి.

''అలాగే!''అన్నాడు లాలారాం.

''ఇందాక తాజ్‌లో ఓ గమ్మత్తు జరిగింది. నేనూ, సితారా, హేమ, అన్వర్, రూన, మనోజ్, కుంతీ కూచున్నాం. ఏదో తిన్నాం, తాగాం. అయిపోయింది. సితారా వెయిటర్‌కు పదిరూపాయలు బక్షీస్ ఇచ్చింది. అన్వర్ రెండు పదులిచ్చింది. నేనురెండు వందనోట్లు, కాలితో వాడి ముందుకు విసిరాను. వాడా నోట్లు కళ్లకద్దుకొని, నా పాదాలు తాకి దణ్ణం పెట్టాడు. అప్పుడు నా జరీచెప్పులు జారిపోయాయి. వాటిని జేబుగుడ్డతో తుడిచి, తరువాత ముద్దుపెట్టుకొని, ఆ తరువాత నా కాళ్లకు తొడిగాడు...చెప్పొచ్చిందేమిటంటే, ఆ సితారా పొగరు అలా అణిగిపోయింది. నేను చేసిన పని మందిదంటావా, కాదా?''అన్నది మంజరి.

''మంచిదే!''అన్నాడు లాలారాం.

''ఆవిడకు సీషోర్‌లో ఇల్లుందటగా?''అన్నది మంజరి.

''ఉంది....ఆవిడకేమిటి? చాలామంది కావరసలో ఇళ్ళున్నాయి...ఖాను, అన్వర్, కుంతి, ముంతాజ్, మాలా, తరుణి-వీరందరికీ అక్కడే ఇళ్లున్నాయి. మద్రాసు నుండి వచ్చిన జయంతిమాల, పద్మలత-వీళ్లు కూడా అక్కడే ఇళ్లు కట్టారు''.

''మనమూ కడదాం!''

లాలారాం మాట్లాడలేదు.

''ఏం?''అన్నది మంజరి.

''మీరింకా బొంబాయి పరిశ్రమలో స్థిరపడలేదనుకొంటాను. ఏవొక్క పిక్చరో హిందీలో సక్సెసయిలే లాభం లేదు. అల్లాగ మూడునాలుగు బొమ్మలు, దేశమంతటా హొరెత్తించాలి. అప్పుడు ప్రొడ్యూసర్లు నీ ఇంటిచుట్టూ కుక్కల్లాగా తిరగమంటే తిరుగుతారు. అందాకా మీరా ప్రయత్నం చేయటం

మంచిదికాదు....''అని సలహా ఇచ్చాడు లాలారాం.

మంజరి కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. అయినా ఆవిడ తన ఉద్రేకాన్నంతా అణుచుకొని, ''అయితే ఏం చేదాం లాలారాం!''అని సలహాకొచ్చింది.

''మీకు తెలియంది లేదు. మద్రాసులో పరిస్థితులే ఇక్కడా ఉన్నాయి.కాకపోతే ఇక్కడ కాంపిటీషన్ ఎక్కువ, అవకాశాలూ ఎక్కువే!''అన్నాడు లాలారాం.

''తనొక్కో పిక్చర్‌కు ఆరు లక్షలు తీసుకొంటుందట-సితారా చెప్పింది. మిగతా వాళ్లు కూడా 'అవునవు'నన్నారు నిజమేనా?''

''కావచ్చు. ఇచ్చేవాళ్లుంటే మీరుపదమూడు లక్షలు డిమాండ్ చేస్తారు. సితారా, అన్వర్, మలా,-వీళ్లందరకూ వెనక్కాతల మనుషులున్నారు. మీకు లేరు. అంతే భేదం...''అన్నాడు లాలారాం.

''నిజమే!''అనుకొన్నది మంజరి.

''నేను అమెరికా వెళ్లడానికి ముందుగా ఎవరో 'త్రిపాఠి'అనీ 'జోగిందర్'అనీ నీ వెంట వచ్చారే! వారేమయ్యారు?''అన్నది మంజరి.

''ఉన్నారు. వారిపుడు లాభం లేదు. త్రిపాఠీని మంజులత పట్టేసింది. జోగిందర్‌ను అన్వర్ పట్టుకొన్నది. వారికా మోజు వదిలిందాకా మనమేమీ కదిలించలేం. అవునుగాని, లోగడ-చాలా రోజుల కింద అనుకో-సేఠ్ కిషన్‌దాస్‌తో నువ్వోసారి జుహులో కనిపించావు? జ్ఞాపకముందా!''అన్నాడు లాలారాం.

''ఆఁ, లేకపోవడమేం కర్మం. పరమకర్కోటకుడు, బద్మాష్!''అన్నది మంజరి.

''అయినా కోటీశ్వరుడు. చాలా ఫిలిం కంపెనీలకు అతనేనిజమైన ప్రొడ్యూసరు. నవ్వుతన్ని పట్టగలిగితే బొంబాయంతటినీ జయించినట్లే! అతని మాటను చాలామంది కాదనరు...''

''నాకప్పుడే అతనంటే అసహ్యమేసింది లాలూ! చాలామందిని మోసం చేశాడని విన్నాను. నిజమేనా?''అన్నది మంజరి.

''ఆ! ఎవర్నీ ఏమీ ఆనందే కోట్లు పోగుపడటం అసంభవం! నీకతని మంచితనం కావాలా? డబ్బు కావాలా? అతనయినా అంత సులభంగా బోల్తాపడే మనిషి కాడు. ఢక్కాముక్కీలు చాలా తిన్నవాడు. అతను నీకు చిక్కితే చాలు...చక్రం అడ్డంగా తిప్పుతాను...''

''చూదాం!''అన్నది మంజరి.

అన్వర్, రూప, కుంతీ కూడా అతన్ని గురించి లాలారాం చెప్పినట్లే చెప్పారు.

''మేమందరం ఏదో వొరగపెడతాడని పోయినవాళ్ళమే! చివరికి చేతులు ఝాడించుకొంటూ వచ్చాం''అన్నది రూప.

''నాకా వోపిక కూడా లేకపోయింది. రెండురోజుల పాటు కాల్‌షీట్సన్నీ కాన్సిల్ చేయించుకున్నాను. శరీరమంతా మాంసం ముద్దలాగయింది...''అన్నది కుంతి నవ్వి.

మంజరి ''ప్చ్''అని చప్పరించేసింది.

ఎదుటివారికి అనుమానం కలక్కుండా ఉండేందుకు అలా నటించినా, నిజానికిదొక సవాలు కిందనే మంజరి భావించింది.

"ఇన్నేళ్ళ నా అనుభవం, నా తెలివితేటలు వీడిముందు ఎందుకూ పనికిరాలేదంటే, వీడెవడో లోత్తర పురుషుడన్నమాటే! అలాంటివాణ్ణి కాలికి బలపం కట్టి తిప్పినా విజయమే! వాడికి దాసోహమన్నా విజయమే!"అనుకొన్నది మంజరి.

మూడు మాసాల పాటు ఆవిడ అహోరాత్రాలు శ్రమించింది. చివరికి ముక్కుకు తాడువేసి కిషన్‌దాసును తన ఇంటికి లాక్కొచ్చి పడేసింది.

ఆ రోజున రాజమణికి రాసిన ఉత్తరంలో, ఈ విషయం కూడా చేర్చింది మంజరి.

"కొంతకాలం పాటు వొక్కో మనిషి జాతకం అద్భుతంగా ఉంటుందనుకొంటాను అక్కా! ఇప్పుడిప్పుడే నా జీవిత చక్రం సులభంగా తిరుగుతున్నది. బొంబాయంతటికీ కీలకమైనవాడు నాకోసం పడిచస్తున్నాడు. వాణ్ణి చిత్రహింసలు పెట్టిగానీ వదలను...ఇక్కడ ఇల్లు కట్టాలన్న ఆలోచనకొక రూపమిస్తున్నాను. బహుశా మరో పదిరోజుల్లో స్థలం తీసుకోగలననుకొంటాను. అందర్నీ కనిపెట్టి చూస్తూ ఉండు. వసంతకు, మరీ అంత అతుక్కుపోయి, ఆ శర్మగాడితో తిరగవద్దని చెప్పు. వాడింకా ఆ పెళ్లి మైకంలోనే ఉంటే ఉండనీ. క్రమంగా మైకం విడిపోయాక, వాడే తప్పుకొంటాడు. చలపతిగాడు, మరీ దుబారాచేస్తే నువ్వే మందలించవచ్చును. వసంతకు మంచి మందులిప్పించు...నాకు మందిచ్చిన డాక్టరు నీకూ తెలుసు గదా! ఇప్పుడప్పుడే నేను రావడం పడదు. ఉంటాను...."అని పూర్తిచేసింది మంజరి.

ఆవిడనుకొన్నట్లు పదిరోజులలో స్థలనిర్ణయంజరగలేదు. అందుకోసం మళ్లీ చాలా బదవలు పడవలసి వచ్చింది.

"మలబార్ హిల్స్‌మీద బాగా ఉంటుంది"అని సలహా ఇచ్చాడు లాలారాం.

"నీ సలహా అడిగినప్పుడుచెప్పు లాలూ! అనవసరంగా తొందరపడకు"అని మందలించింది మంజరి.

లాలారాం తలొంచుకుని వెళ్లిపోయాడు.

"నాకు మరోచోట, మరోచోటా అవసరం లేదు. సితారా ఇంటిపక్కనే కావాలి. అంతకన్నా రెట్టింపు ఎత్తూ, రెండింత వైశాల్యమూ ఉండాలి"అన్నది మంజరి సేట్ కళ్లల్లోకి చూస్తూ.

"లాభం లేదు"అని పెదవి విరిచాడు కిషన్‌దాసు.

మంజరి అతని చెంపమీద చిటుక్కుమనిపించిది గోముగా.

"ఆ మాటలనడానికి మీరెందుకు సిగ్గుపడతారో నాకర్థంకాదు. ఫలానా మంజరి ఫలానా కోటీశ్వరుణ్ణి  నమ్ముకొని కూడా అద్దె కొంపలో ఉంటుందని నలుగురూ అనుకోవడం నాకు చిన్నతనమో, మీకు చిన్నతనమో మీరాలోచించినట్లు లేదు. ఈ విషయమై మీకు చీమ కుట్టినట్లు కూడా లేకపోతే నాకూ లేదు. కందకులేని దురద కత్తిపీటకెందుకుట?"అన్నది మంజరి.

కిషన్‌దాసు అసలు సంగతి చెప్పాడు.

"అక్కడ స్థలం లేదు. ఉన్నదంతా సముద్రమే! దాన్ని కొని, పూడ్చుకోవాలి. ఇల్లు కట్టేవేళకు, గజం వేయి రూపాయల ఖరీదుకు మనకు గిట్టుబాటవుతుంది!"అన్నాడు కిషన్‌దాసు.

"అయితే మానేద్దాం"అని చప్పున జారిపోయింది మంజరి.

కిషన్‌దాసు ఉక్కిరిబిక్కిరయ్యాడు.

అందులో ఏదో తిరకాసు ఉన్నదని అనుమానించాడతను. కానీ ఏమున్నదో మాత్రం కనుక్కోలేకపోయాడు.

"స్థలమంటే, పదోపాతికో ఉంటుందనుకొన్నానుగానీ, ఇలా వేలకు వేలు తింటుందనుకోలేదు. మీరన్నట్లుగా అన్నేసి వేలు నీళ్లపాలు, రాళ్లపాలు చేయడం నాకూ ఇష్టం లేదు. ప్రస్తుతానికి మానేద్దాం. తరువాత చూసుకొందాం"అని నచ్చబలికింది మంజరి.

ఆ రాత్రి పదకొండు ప్రాంతాల కిషన్‌దాసు వెళ్లిపోయాక, అన్వర్‌కు ఫోన్‌చేసింది మంజరి.

గొంతు వింటూనే గుర్తుపట్టింది అన్వర్.

"మీ పక్షి ఏం చేస్తున్నట్లు?"అన్నది మంజరి నవ్వుతూ.

"మీదో?"అన్నది అన్వర్.

"ఇప్పుడేపోయింది...అయినా దోవకొచ్చేటట్లు లేదు అన్వర్! గడ్డితిని సంపాయించిన డబ్బేమోమరి. లెక్కించి లెక్కించి ఖర్చుచేస్తాడు...అందుక్కాదు. నా డబ్బుతో అలాంటి కొంపలు అరడజను కట్టగలను. కానీ ఆ పని నాకిష్టం లేదు. ఇంకో వెధవాయ డబ్బుతో నేను ఇల్లు కడదామనుకొన్నాను..అది నేనింకా అసంభవం అనుకోలేదు అన్వర్!...నాకింకా నామీద విశ్వాసం ఉంది. నువ్వీ విషయంలో నాక్కాస్త సాయపడితే పని సానుకూలమవుతుంది!"

అన్వర్ పకపక నవ్వి-

"నేనుగానీ మీ పక్షికి కావాలట్నా?"అన్నది.

"కాదు..ఒకవేళ అంటే?"అన్నది మంజరి.

"నీకోసం వొప్పుకొంటాను. నీకేమోగానీ, నాకు మగవాళ్లందరూ వొక్కలాగే కనిపిస్తారు మంజూ! జోగిందర్‌కూ, కిషన్‌దాసుకూ భేదం లేదు..."అన్నది అన్వర్.

"అదేంకాదు. కిషన్‌దాసును రేపోఎల్లుండో మీ పక్షి కలుసుకొనటట్లు చేసి, ఊదరగొట్టి వొదలమని చెప్పు. కనీసం సిగ్గుపడయినా లొంగుతాడేమో చూదాం. ఈ పనే జరిగితే నీవు కోరి బహుమానం-"అని ఊరించింది మంజరి.

"ఏమిస్తావ్?"అన్నది అన్వర్ అటు ఎగతాళీ ఇటు నిజమూగాని గొంతుతో.

"నా దగ్గరున్న దేదికావాలన్నా నీకు సంకోచం లేకుండా ఇస్తాను"అన్నది మంజరి. "బహుశా నా నిజాయితీని గురించి నీకు అనుమానం లేదనుకొంటాను".

"ఎంతమాట మంజూ! నాకు చాలాకాలం నుండీ పచ్చలహారం మీద మనస్సుంది. అలాంటి దానికోసం నేను చాలా ప్రయత్నించాను...ఎంత ఖరీదిచ్చినా ఇక్కడలాంటి పచ్చలు దొరకవన్నారు! మరి నువ్వెలా..."అన్నది అన్వర్.

"ఆ మధ్య రేస్‌లకు రాజా భవానీ ప్రసాద్ వచ్చాడు అన్వర్! అపుడతన్ని రేస్ గ్రౌండ్స్‌లో కలిశాను...గొప్పరసికుడు. సుఖపడటమంటే అతనిదగ్గరే చూడాలి. మనల్ని స్వర్గంలోకి తీసుకుపోతాడు...కాశ్మీర్‌లో ఎవరో ముస్లిం జమీందార్ దగ్గర ఈ హారం కొన్నాట్ట అతను. తన జ్ఞాపకార్థంగా నన్నుంచుకోమని ఇచ్చాడు"అంది మంజరి.

''పోనీ, అలాగే వుంచుకో!''అన్నది అన్వర్.

''కావాలన్నావు గదా మరి!''

''అన్నాను, దాని వెనక ఇంత చరిత్ర ఉన్నదని తెలీక. పోనీగానీ నువ్వాహారం వుంచుకొని, నాకా రాజాను పరిచయం చెయ్యి మంజరీ! ఆ సుఖామేపాటితో నేనూ చూస్తాను...సరే ఉంటాను. మా పక్షి గూటికొస్తున్నది. ఈ రాత్రే 'కీ' ఇచ్చి వదులుతాను. దెబ్బకు దెయ్యం పోకపోతే అప్పుడడుగు''అని ఫోన్ పెట్టేసింది అన్వర్.

మంజరి సన్నగా ఈలవేసి, ఎగిరి మంచంమీద పడుకొంది. స్ప్రింగ్ మాట్రెస్ పైకీ కిందికీ ఊగిసలాడి, మంజరికి జోలపాడినట్లయింది.

''మరీ అన్వర్ ముండకు ఇంత శరీకకండూతెందుకో! ఇదంతానిజమేననుకొన్నదన్నమాట! ఓసి నా పిచ్చితల్లీ!''

మంజరి కళ్లు మూసుకొంది.

చిత్రం!

పదినిమిషాలకల్లా ఆవిడకు హాయిగా నిద్రపట్టింది.

సితారా ఇంటి వైశాల్యం అయిదు వందల గజాలు. మంజరి ఇల్లు అంతకు రెండు రెట్లు వైశాల్యం ఉండలి. అంటే ఆవిడ పదిహేను వందల గజాల స్థలం కొనాలి. స్థలమంటే అక్కడ నేల ఉండదు. సముద్రాన్ని కొని మనమే పూడ్చుకోవాలి. డెవలప్ చేసిన భూమిలో మూడోవంతు కార్పోరేషన్‌కిచ్చి మిగిలిన రెండువంతుల్లోనూ మనం ఇళ్లు కట్టుకోవాలి. అక్కడి పద్ధతి ఇదీ!

''నేను వొద్దన్నానుగా! అంతడబ్బు వెదజల్లటం దేనికి?''అన్నది మంజరి.

''ఇది ప్రిస్టేజిక్వశ్చన్. నువ్వేమీ అనకు''అన్నాడు సేఠ్ కిషన్‌దాస్.

ఆ మాటలంటున్నప్పుడు కిషన్‌దాసు ముఖకవళికలు పరిశీలించింది మంజరి. ఎందుకో ఆవిడ మనస్సు అనుమానంతో గిజగిజలాడిపోయింది.

''ఏం జరుగుతుందో చూదాం''అనుకొన్నదావిడ.

# 35

ఏడాదితో పూర్తవుతుందనుకొన్న ఇల్లు, ఇంకో ఆరుమాసాలకు గానీ, కాలేదు. అయితే ఈ ఆలస్యం కాంట్రాక్టరుది కానేకాదు. మొట్టమొదట మంజరి ఒప్పుకున్న ప్లానుకూ, ఆ దరిమిలా ఆవిడచేసిన ఎడిషన్లకూ ఎక్కడా సంబంధం లేదు. అంగుళం చువ్వ సరిపోయే చోట రెండంగుళాల చువ్వ వాడమనేది. ఎనిమిది గంపల ఇసకకు గంప సిమెంటు పోస్తే సరిపోయేదానికీ, నాలుగింటికికొకటి చొప్పున పొయ్యమనేది. సున్నం జిగురులేదనేది. వాటరింగ్ సరిగ్గా జరగడం లేదనేది. లక్షాతొంభైవేల పేచీలు లేవదీసేది.

''మీరడిగిన ప్రకారం బిల్డింగ్ కడితే నాకొంప ఆరిపోతుంది''అని గోలకెత్తాడు కంట్రాక్టరు.

''అలాగని అధమస్తపు కొంట కట్టించుకోనా? పోనీ వో పనిచెయ్యి. నువ్వు లేబర్ కంట్రాక్టు వరకే. మెటీరియల్ నేను సప్లయి చేస్తాను.అప్పుడు నువ్వు నష్టపోవడమన్న ప్రసక్తే ఉండదు''అని

సలహా ఇచ్చింది మంజరి.

''సరే''నన్నాడు వాడు.

ఈ దఫా ఎక్కడెక్కడి ఇనుమూ చాలకుండా పోయింది. వంద బస్తాల సిమెంటు తెచ్చి పడేస్తే మూడోనాటికల్లా ఖాళీ గోతాలు చూపించేవాడు కంట్రాక్టరు. మనస్సులో ఏమనుకొన్నా పైకిమాత్రం పొంగేది కాదు మంజరి. సితారా దొడ్లో పదిగజాల పొడవునా, మూడు గజాల వెడల్పుతూ ఈతకొలను ఉంది. దానికి రెట్టింపు సైజులో మంజరి కట్టించింది. జయపూర్‌నుండి ప్రత్యేకంగా మార్బుల్ స్టోన్ తెప్పించి, చుట్టూ పరిపించింది! ఈపనులన్నీ చలపతీ, లాలారాం చూసుకొంటున్నప్పటికీ ఏదో వో సమయంలో ఆవిడ కూడా కలగజేసుకోక తప్పేది కాదు.

సరిగ్గా ఆ సమయంలోనే కిషన్‌దాసును పోలీసులు అరెస్టు చేశారు. అదృష్టవశాత్తూ ఆపని మంజరి ఇంట జరగలేదు.

లాలారం ఆ వార్త చెప్పినప్పుడు, మంజరి దాదాపుగా మూర్ఛపోయిది. ఆవిడ తేరుకోవడానికి అరగంటకు పైగా పట్టింది. నోటమాటరావడానికి ఇంకో నాలుగు గంటలపాటు ఆగవలసి వచ్చింది. అయినా మంజరి ముఖంలో కళాకాంతులు లేవు. ఆవిడ చీమ కదిలినా గుండె లార్చుకుపోయేంతగా వణకసాగింది.

''ఏం జరిగింది మంజూ?''అని చాలా ఆప్యాయంగా అడిగాడు చలపతి.

''ఏం లేదు...నాకే..ఆరోగ్యం బాగాలేదు. అంతకు మించి జరగడానికేముందిట?''అన్నది మంజరి.

అది నిజం కాదని చలపతికి తెలుసు. ఆవిడేదో దాస్తున్నదనీ, తననింకా నమ్మలేదనీ అతననుకొన్నాడు.

''ఇందులో ఎవరి తప్పులేదు. నేను మాత్రం ఆవిణ్ణి పూర్తిగా నమ్మాను గనకనా అనుకోవడానికి?''అని సరిపుచ్చుకొన్నాడు చలపతి.

శర్మ, వసంత కూడా కుదిపిచూశారు గానీ, మంజరి తొణకలేదు.

ఆఖరుకు రాజమణి దగ్గర బయటపడింది.

''నేను మొదణ్ణించీ వాణ్ణి అనుమానిస్తూనే వున్నాను. కానీ రుజువులేందే మంన మాత్రం అనడం దేనికనుకొన్నాను. చివరకు కొంప మునిగినంత పనైంది. అవి మామూలు నోట్లు కావు...''అని గొల్లుమన్నది మంజరి.

''హాసి''అని నోరు నొక్కుకున్నది రాజమణి.

ఆవిడ ఆపాదమస్తకం చెమటతో తడిసిపోయింది.

''ఈ పీడ ఇంతటితో పోదక్కా! పోలీసులు మన ప్రాణాలు తీసిగానీ వదలరు. అసలే కళ్యాణి చావప్పుడు పోలీసులు వో చూపు మనమీద వేసి వుంచారు. అదింకా మటుమాయం కాకముందే ఈ పీడ చుట్టుకొన్నది. ఇదంతా నా ఖర్మ!''అని నెత్తిబాదుకొన్నది మంజరి.

రాజమణి మెత్తని మాటలతో ఓదార్చగలిగిందీ గానీ, ఈపీడ విరగడయ్యేందుకు ఉపాయం చెప్పలేకపోయింది.

ఆపని చేసినవాడు చలపతి.

"ఆ మధ్య నీకు ఢిల్లీలో తెలిసినవాడెవడో ఉన్నాడని చెప్పాడు చూడు. వాడిపేరేదో ఉండాలి.....సక్సేనా అనుకొంటాను. అవునా? అతగాడేమీ నీకీ సందర్భంలో సాయం చెయ్యలేడా?"అన్నాడతను.

"చూదాం..అయినా కొంప మునిగిపోయేదేమీ లేదుగానీ అనవసరంగా రద్దీ పడాలసొస్తుందేమోనని నా భయం. ఇదీ అతని ఫోన్ నెంబరు. ఢిల్లీకి కాల్ బుక్ చెయ్యి"అన్నది మంజరి.

సక్సేనా వచ్చాడు.

"అంతా నేను మధ్యలోనే విన్నాను"అన్నాడు నవ్వుతూ.

"ఎవరు చెప్పారు?"అన్నది మంజరి.

"మరీ అంతలోతుల్లోకి వెళ్లకండి. మీకు పని కావడం ముఖ్యమా? వివరాలు ముఖ్యమా?"అన్నాడు సక్సేనా.

మంజరి ఇంకోమాట మాట్లాడకుండా అతన్ని లోపలకు తీసుకొచ్చి కూచోబెట్టింది.

"ప్రజల గౌరవాదరాలవమీద నా వృత్తి ఆధారపడి ఉంది. ఇంతవరకూ లేదుగానీ, ఇకముందా దాసుగాడు నన్ను కూడా ఈ రొంపిలోకి లాగుతాడేమోనని భయంగా ఉంది. అలాంటిదే జరిగితే నేనీ బాంబేలో తలెత్తుకొని తిరగలేను. అసలే ఇక్కడి వాతావరణం నాకు ప్రతికూలంగా ఉన్నది. దాన్ని తట్టుకొని నిలబడే ప్రయత్నంలో ఉండగానే, ఈ అపవాదఋఖులఋ మీదకు విరుచుకుపడుతున్నాయి. ఇక్కడ నుండి తిరిగి మద్రాసు పోవడం కన్నా, ఏ రైలుకిందనో తలపెట్టి చావడం మేలు"అని వాపోయింది మంజరి.

సక్సేనా అటూ ఇటూ చూశాడు.

"ఎవ్వరూ లేరు!"అన్నది మంజరి.

"నీకే ఇబ్బంది కలక్కుండా నేను చూస్తాను.. నాదీ పూచీ-మరి నాకేమిస్తావ్?"అన్నాడు సక్సేనా అదోలా నవ్వుతూ.

సక్సేనా చెయ్యిచాపాడు.

మంజరి అతని చేతిని తనచేతిలోకి తీసుకుని "మాటతప్పను"అన్నది నవ్వుతూ.

- "ఇదిగో అడ్రసు. సాయంత్రం ఇక్కడకు రా. వీధి చీడీలమీద తెల్లటోపీ కుర్రవాడు కనిపిస్తాడు. 'ఎర్రలక్క కావాలి'అను. నిన్ను లోపలికి తీసుకొస్తాడు. నేనక్కడే ఉంటాను"అన్నాడు సక్సేనా.

"అంతదూరం దేనికి? మనమిక్కడున్నా అభ్యంతరపెట్టే వారెవ్వరూ లేరు..అయినా, ఇప్పటికా మీరు నా గురించి బయటపడడం! నేనే అడిగితే బావుండదని ఊరుకొన్నానుగాని, మిమ్మల్ని మద్రాసులోనే రేప్ చేద్దామనుకొన్నాను".

సక్సేనా నవ్వి వెళ్లిపోయాడు.

"మనిషికొక రోగం. ఇంతోసి భాగ్యానికీ అక్కడెక్కడికీ వెళ్లి 'ఎర్రలక్క కావాలి'అనాలట. వాడెవడో తెల్లటోపీ నన్ను లోపలికి తీసుకుపోతాడుట. అంత భయపడేవాళ్లూ, పిరికిదద్దమ్మలూ, ఆడదానికోసం

ఇంతలా పాకులాడ్డమెందుకు?''అనుకొన్నది మంజరి.

ఇష్టంలేకపోయినా మంజరి అలకంరించుకొన్నది.

''ప్రాణం పోతున్నాసరే, మా జన్మలకీ మేకప్ తప్పదు. ఆఖరుకు శవానిక్కూడా మేకప్ చేసిగానీ పారేయరు''అని విసుక్కొన్నది.

అనుకొన్న వేళకు ఆ చిరునామా దగ్గరకొచ్చింది మంజరి. తెల్లటోపీవాడు చీడీల దగ్గర కనిపించాడు.

వచ్చే నవ్వును ఆపుకుంటూ-

''ఎర్రలక్క కావాలి?''అన్నది మంజరి.

''రండి!''అన్నాడతను.

మంజరి అతన్ననుసరించింది.

గదిలోకొచ్చిన మరుక్షణమే, తలుపులు మూసుకొన్నాయి. చూస్తుండగానే, కాటుక పూసినట్లుగా చీకట్లు అలుముకొన్నాయి.

మంజరి గుండెలు అవిసిపోయాయి. అప్పుడెప్పుడో ఆవిడ చదివిన డిటెక్టివ్ నవలల్లోని సంఘటనలన్నీ జ్ఞాపకం వచ్చాయి. ముచ్చెమటలతో ఆపాదమస్తకం తడిసిపోయింది.

''భయపడకండి!నేనున్నాను''.

అది సక్సేనా గొంతు.

తరువాత, గరుగ్గా ఉన్న చెయ్యి తన మణికట్టును పట్టుకొని ముందుకు తీసుకుపోవడం మంజరికి తెలుసు.

పదినిమిషాలు నడిచాక వెలుతురు కనిపించింది.

''కూచోండి!''అన్నాడు సక్సేనా

మంజరి కూచున్నది.

తనో సిగరెట్ అంటించి, మరోటి మంజరికి ఆఫర్ చేశాడతను.

''థాంక్స్, ఇప్పుడొద్దు''.

పదినిమిషాలైనా సక్సేనా నుంచి ఎలాంటి రెస్పాన్సు రాకపోవడంతో లోలోపల చిరాకు పడింది మంజరి.

''ఏమో అనుకొన్నాను గానీ, వీడు పరమబడ్డు''అనుకొన్నది.

''ఎందుకింత శ్రమతీసుకోవడం? ఈ కాస్తదానికీ మా ఇల్లుపనికిరాకపోయిందా? అప్పటికీ నేను చెప్పాను గదా!''అన్నది మంజరి.

''మీ మనస్సు బావోలేదు కదూ?''అన్నాడు సక్సేనా.

''అబ్బే!''అన్నది మంజరి.

''మీరు బుకాయిస్తున్నారు. ఇలా వచ్చి కూచోండి. పదినిమిషాలు, చిన్నపిక్చర్ చూదాం''.

మంజరి అతని పక్కనే వచ్చి కూచున్నది.

''మీరు నాకో ప్రామిస్ చెయ్యాలి. ఇక్కడ చూసిన విషయాలు మీరే పరిస్థితుల్లోనూ బయట

అనకూడదు. అలా అన్నట్లు నాకు తెలిస్తే మీరు ప్రమాదాల్లో చిక్కుకోవలసి వస్తుంది. మీరలా చేస్తారని కాదుగానీ ముందుగా చెప్పడం నా విధి గనుక చెబుతున్నాను. మరోలా అనుకోకండి!'' అన్నాడు సక్సేనా.

ఈ ధోరణికి మంజరికి నచ్చలేదు. చాలాకాలమయింది ఆవిడిలాంటి బెదిరింబీపు మాటలు విని. ఇంతకాలంగా ఎదుటివారిని అదరించి బెదిరించి హడలగొట్టిందేగానీ, తనొక్కమాటా పడలేదు. ఇప్పుడీ సక్సేనాగాడేదో వాగుతున్నాడు. ఈ క్షణాన తను 'వీలు'కాదని లేచిపోవచ్చు. కానీ పోయి చేసేదేమిటట? వీడు పలుకుబడి కలవాడే ననడంలో సందేహం లేదు. లోగడ తనతో అన్నవన్నీ చేశాడు. ఇదీ చేస్తాడు. కాకపోయినా, తనిప్పుడు బయటికి వెళ్లను కూడా లేదు. దోవ తెలీదు సరిగదా, కనీసం-

''మీరొప్పుకొంటే సినిమా మొదలవుతుంది''అన్నాడు సక్సేనా.

''ఊఁ''

''యస్''అన్నాడతను.

మరుక్షణమే లైట్లన్నీ ఆరిపోయాయి.

చిన్నతెరమీద ఓ క్షణం పాటు తెల్లకాంతి పడ్డాక, బొమ్మలొచ్చాయి.

వాటిని చూసి మంజరి రిచ్చపడింది. లోగడ ఇలాంటి ఫిల్ములను గురించి ఆవిడ విన్నదేగానీ, చూసిన పాపానపోలేదు. ఇప్పుడు కూడా కొరత కూడా తీరిపోయింది.

పదినిమిషాల పిక్చర్‌లోనూ కలిసి మూడు సీన్సున్నాయి. ముందుగా పూలతోట! అందులో అమ్మాయి, అబ్బాయి. తరువాత ఈతకొలను సీను. ఇద్దరూ కలిసి ఈదడం. మూడవది ఈ కార్యక్రమాల పర్యవసానమేదో అదీ!

సినిమా చూస్తున్నంత సేపూ మంజరి కొంత అనీజీనెస్ ఫీలవుతూనే ఉన్నది.

''సిగ్గూ శరమూ లేకుండా వొళ్ళమ్ముకొని బతికినదాన్నే ఈసినిమా చూసేందుకు అభిమానపడి ఛస్తున్నానే-ఇహ మామూలు మనుషులు ఎలా చూస్తారో?''అనుకొన్నది మంజరి.

పదినిమిషాలయ్యాక లైట్లు వెలిగాయి.

''ఎలా ఉంది?''అన్నాడు సక్సేనా.

''బాగానే ఉంది గానీ-అసలలాంటి నెవరు చూస్తారండీ?''అన్నది మంజరి.

''న్యాయంగా అయితే ఇవన్నీ నేను చెప్పకూడదు గానీ, మీమీది గౌరవంవల్ల చెబుతున్నాను. కులీన వంశస్థులు చాలామంది వీటిని చూస్తారు. కొందరు ఫిలిం కాపీలను కొనుక్కుపోతారు కూడాను...ఇందులోకి మామూలు స్త్రీలు, పురుషులు పనికిరారు. అందంగా, ఆరోగ్యంగా, బలంగా ఉన్నవాళ్లు కావాలి. మీ స్నేహితురాళ్లల్లో చాలామంది మా ఖాతాదారులే! వారితో తీసిన ఫిల్ములూ ఉన్నాయి. చూస్తానంటే ప్రాజెక్టు చేయిస్తాను...''అన్నాడు సక్సేనా.

''ఎవరెవరు?''అన్నది మంజరి.

''చూడండి!''అన్నాడు సక్సేనా.

''అవసరం లేదు. మీమాట మీద నాకామాత్రం నమ్మకం లేదంటారా?''

"సితారా, అన్వర్, కుంతి, భాను, జయంతిమాల, కుర్షీద్ మణి వీళ్లందరూ వస్తూనే ఉంటారు"అన్నాడు సక్సేనా.

"నాకీ ఫిల్ము ఎందుకు చూపినట్లు?"అన్నది మంజరి చాలా తాపీగా.

"ఎలా వ్యవహరించాలో మీరు తెలుసుకోవడానికి. మీరు మేకప్‌లోనే వచ్చారు గనుక సరిపోయింది. లేకపోయినా పర్వాలేదు. లోపల అన్నీ రెడీగా ఉన్నాయి. మీకు 'జోడు'కూడా ఏర్పాటు చేశాను. మీరు జాగ్రత్తగా చేస్తే పదినిమిషాల్లో పనంతా ఫినిష్ అవుతుంది. ఏమాత్రం సిగ్గుపడి పాడుచేసినా, మళ్లీమళ్లీ రీటేక్ చెయ్యాలిసొస్తుంది".

'రీటేక్' అని గొణుక్కొని తనలో తనే నవ్వుకొన్నది మంజరి, తల అడ్డంగా తిప్పుతూ.

"మీకిష్టంలేందే రమ్మని చెప్పడం భావ్యంకాదు. మీరేదో ఉపకారం కావాలన్నారు. చేస్తానన్నాను. అందుగ్గాను మీరు నాకీపని చేసిపెడితే చాలు. కాదు, కూడదు, పోలీసులతో యాతనే పడతానంటారా-మీ ఇష్టం! అయితే, ఈ వ్యవహారం వొడ్డుకు చేరుస్తుందో చెప్పలేను"అన్నాడు సక్సేనా.

మంజరి ముఖం పాలిపోయింది.

కళ్ళల్లో భయపు ఛాయలు అల్రాడాయి.

"మేకప్ చెరిగింది, సరిచేసుకొంటాను"అన్నది మంజరి గొంతును స్వాధీనంలోకి తెచ్చుకొంటూ.

# 36

(మాధవరావు చెప్పిన కథ)

మళ్లీ నేను రంగంమీది కొస్తాననుకోలేదు. కానీ రాక తప్పింది కాదు. మనుషుల్ని గురించి నాకైతే కొన్ని నిశ్చితాభిప్రాయాలున్న మాట నిజమే! నా అంచనాలు కూడా సాధారణంగా తప్పిపోవు. కానీ వొక్కో వ్యక్తి, కొమ్ములుతిరిగి, వాడి అంచనాలను కూడా దాటిపోవడం కద్దు. దానికేమిటి కారణం? జాతకం అలాంటిదీ! అని సరిపెట్టుకొంటాం.

అట్టడుగు నుండి ఆకాశంలోకి లేచిన మనుషులు సాధారణంగా తమ పూర్వ పరిస్థితులను అసహ్యించుకోవడమూ; పూర్వపు పరిచయస్తుల నుండి ముఖం తప్పించడమూ చేస్తూ ఉంటారు. గతస్మృతుల తాలూకు బాధామయ వాతావరణాన్ని వారు భరించలేరు. నామట్టుకు నేను, నా చిన్నతనంలో పడిన యాతనలన్నీ పైకి చెప్పుకొన్నానా? లేదే!

మంజరి ఇందుకు భిన్నమైన వ్యక్తిత్వం కలిగిన మనిషి. ఆవిడ తన శత్రువులను ప్రతి రక్తకణం తోటి ద్వేషించింది. ఆప్తులను ప్రాణపదంగా, అంతకు మించి కూడా ప్రేమించింది. జీవితంలో అడుగడుగునా ఆమె తిన్న దెబ్బలు, అనుభవించిన నరకయాతన ఆమె బతుకును తీర్చిదిద్దాయి. అనుభవాల నుండి జీవరసాన్ని పీల్చుకొని వ్యక్తిత్వాన్ని వికసింప చేసుకొన్న మనిషి! ఈరోజున మంజరి పైకొచ్చింది గనుక, ఇవన్నీ నేనంటున్నానని మీరభిప్రాయపడితే-మీకర్మకు నేను చేయగలిగిందేమీ లేదని మనవి చేస్తున్నాను.

విదేశాలకు వెళ్లబోయేముందు, మంజరినోసారి చూడాలనిపించింది. రామచంద్రంతో చెబితే తను రానన్నాడు. నేను బలవంతం చేశాను. వాడు ఏడుస్తూ బయలుదేరాడు. తీరా మేము విమానాశ్రయం చేరుకొనే వేళకు విమానం బయలుదేరి పోయింది.

నిజానికి విచారించవలసివాణ్ణినేనయినా, రామచంద్రాన్ని నేనే వోదార్చవలసి వచ్చింది.

“నాకు తెలుసు, మంగమ్మ మళ్ళా మనకు కనిపించదు. అందుకే నేను రానన్నాను. నువ్వు నా ప్రాణాలు తీశావు”అని విరుచుకుపడ్డాడు రామచంద్రం.

అంతకు ముందొకసారి కళ్యాణి హత్య జరిగినప్పుడు వద్దామనుకొన్నాం కానీ వీలుపడింది కాదు. నాటికి నేడు మళ్లీ బొంబాయికి రావలసి వచ్చింది. అసలీ ప్రయాణం కూడా ఉండకపోను. మునుపెన్నడూ రాయనంత బలంగా ఈసారి జాబు రాసింది మంజరి.

“ఈ ప్రపంచంలో, ప్రాణాలున్నంత కాలమూ, మనుషుల మధ్య సంబంధాలుంటాయన్న నమ్మకం నాకిప్పటికీ ఉన్నది. మిమ్మల్ని చూడాలని నేనెంత ఘోషిస్తునా&న్నో నాకూ, ఆపరమాత్మకూ మాత్రమే తెలుసు. ప్రతి జాబు చివరనా ‘సుఖంగా ఉన్నావు గదా!’అంటారు. నేనెలా ఉన్నదీ వొక్కసారి వచ్చి చూడండి. ఆప్తులకోసం నా ఆత్మదశదిశలూ అన్వేసిస్తున్నది. ఎంతో ఎత్తుకు ఎదిగానని మీరు లోగడ జాబులో రాశారు. బహుశా అందువల్లనే కావచ్చు. భూమిమీద కాళ్లు నిలపలేకపోతున్నాను. ఒక్కో తరంగం మహోధృతంగా వచ్చి నాకాళ్లకింద మట్టిని తవ్వి లాగిపారేస్తుంటే, ఏమి చెయ్యడానికీ తోచన,ఏడ్చినా వినే దిక్కులేక అల్లాడిపోతున్నాను. నాకెన్నడూ లేని భయమేదో లోలోపల కలుగుతున్నది. అసంతృప్తి జ్వాలలు ప్రతి రక్తబిందువునూ మాడ్చివేస్తున్నాయి...ఈ మహా సంక్షోభం నుండి రవంత బయటపడేందుకూ, కాస్త చల్లని వాతావరణంలో ప్రశాంతంగా బతికేందుకూ నాకు అవకాశముంటే చాలు. అది మీరు మాత్రమే కలిగించగలరు. ఈ ఉత్తరం చూడగానే మీరూ, రామచంద్రం గారూ కలిసి రండి! ఈసారి రాకపోతే, అక్షరాలా నన్ను చంపుకుతిన్నట్లే!”

ఇదీ జాబు!

ఈ పంక్తుల వెనుక నాకు మంజరి దీనారావం వినిపించింది.

“నువ్వు ముందు పదరా! వారం రోజులూ ఆటూఇటూగా నేను వస్తాను”అన్నాడు రామచంద్రం.

దోవపొడుగునా నాకు మంజరిని గురించిన ఆలోచనలతోనే సరిపోయింది. ఇన్ని వందలమైళ్ల రైలు ప్రయాణంలోనూ కొన్నివేళ సార్లు ఆవిడ పేరు విన్నాను. ఆవిడ బొమ్మ చూశాను.

“ఇండియా మొత్తం మీద ఏదో ఒక భాషలో, ఏదో వొక ప్రాంతంలో ఆవిడున్న సినిమా ప్రతిరోజూ ఆడుతుంది”అన్న మాట విన్నాక, మంజరికి పట్టిన అదృష్టానికి పళ్లు పులిసిపోయాయి.

స్టేషను దగ్గరకు తనేస్వయంగా కారు తీసుకొచ్చింది. ముందుగా నేనావెను గుర్తుపట్టలేకపోయాను. ఆవిడే నన్ను పలకరించింది.

“బొమ్మలో ఉన్నదానికీ, నీకూ ఎక్కడా పోలికేలేదు మంజరీ!”అన్నాను నవ్వుతూ.

“సినిమాలో బాగున్నానంటారా? విడిగా బాగున్నానంటారా?”అన్నదావిడ.

“ఎక్కడ బాగున్నా ఏంలాభం? నేనా ముసలివాణ్ణి. మరి నువ్వేమో-రోజురోజుకూ చిన్నదానివయిపోతున్నావు గానీ, వయస్సు పెరుగుతున్నట్లు లేదాయె. నాటకాలాడే రోజుల్లో నిన్ను

చూస్తే, ఇంకో రెండుమూడేళ్లకన్నా "సర్వీస్"కు పనికిరావనుకొనేవాణ్ణి. కానీ ఇప్పుడలా లేవు. అందరికి వయస్సు పెరుగుతుంటే సినిమా మనుషులకు తరుగుతుందా ఏం?"అన్నాను సరదాగా.

మంజరి సమాధానం చెప్పకుండా నవ్వి, ఓ క్షణం నాకేసి చూసి తలవొంచుకొంది.

"మాట్లాడవేం?"అన్నాను.

"ఏం మాట్లాడినా మీరు ముసలివాళ్ళు. మీ వల్ల నాకు ఉపయోగం లేదు"అన్నది మంజరి.

"మరి కారు తిప్పించు తిరుగుబండికే పోతాను".

"పదండి! ఈ దిక్కుమాలిన గొడవలకన్నా, ఏమారుమూల గ్రామంలోనో, ఊరిబయట పూరిపాకలో గొనెపట్టా పరుచుకొని, ఆదమరిచి నిద్రపోదామనిపిస్తుంది"అన్నది మంజరి!

"నేనక్కణ్ణించే వస్తున్నాను. నన్ను చూసి అసూయపడేందుకేమీ లేదు. ఎందుకలా జనం నీ కారుకేసి మిర్రిమిర్రి చూస్తారు?"అన్నాను.

మంజరి రెండు చేతులతోనూ తల బాదుకొన్నది.

కదిలిస్తే కంపు కంపవుతుందని నేను మాట్లాడలేదు.

మంజరి ఇలు-అది ఇల్లా, రాజభవనం గానీ-చూశాక, నాకు పిచ్చెక్కుతుందనిపించింది. ప్రత్యేకంగా జయపూర్ నుండి పాలరాళ్లు తెప్పించానన్నది. కేవలం స్నానాలకొలను కట్టడానికే ఇరవయ్యయిదు వేలదాకా అయినట్లు చెప్పింది. ఆఖరి అంతస్థులో నిలబడిచూస్తుంటే అటు సముద్రమూ, ఇటు బొంబాయి నగరమూ నేత్రోత్సవంగా కనిపిస్తాయి.

చలపతి నన్ను చప్పున అనమాలు పట్టాడు. శర్మగారు కూడా నన్ను ఆప్యాయంగానే పలకరించాడు. వసంతను చూసిన జ్ఞాపకం లేదు గానీ, రాజమణినాకు బాగా తెలుసు. వీరుగాక మిగిలిన నౌకర్లందరూ నేనంటే అమిత గౌరవాభిమానాలు ప్రకటించారు. వారం పదిరోజుల పాటు చలపతీ, శర్మా నన్ను బొంబాయంతా తిప్పారు.

"స్టూడియోలు చూస్తారా?"అన్నాడు శర్మ.

"వద్దుగానీ, మంజిర షూటింగేదన్నా ఉంటే చూదాం"అన్నాను.

ఆ సమయానికి ఏదో లవ్‌సీన్ షూట్ చేస్తున్నారు. మంజరి పల్లెపడుచు వేషంలో ఉన్నది. హీరో పైజమా, లాల్చీ, సన్నటి కళ్లజోడు వేసుకొన్నాడు. వాళ్ళిద్దరూ వొకరికొకరు చూసుకొని, సన్నగా పాట పాడతారు. మొదటి చరణం పిక్చరైజ్ చేసేసరికే, మధ్యాహ్నమయింది.

"నాకు తలనొప్పిగా ఉంది ఇంటికిపోతాను"అన్నది మంజరి.

"అయ్యో ఎలా?"అన్నారెవరో.

ఆమాట వచ్చిన దిక్కుగా కళ్లురిమి చూసింది మంజరి. ఆ ముఖం చాటుకు తప్పుకొన్నది.

మంజరి మాటకున్న విలువేపాటిదో చూశాక, ఆవిడతో మాట్లాడటానికి నాకూ భయమేసింది. అయినా అంత వ్యవధానమేదీ!

బారెడు పొద్దెక్కిగానీ లేవదు. మళ్లీ రాత్రి ఏ పన్నెండింటికో గానీ కొంప చేరదు. ఈలోగా ఖాళీ దొరికితే భోజనానికొస్తుంది. ఆ సమయంలో ఇంటి దగ్గర కొన్ని వందలమంది గుంపుగూడి ఉంటారు. వారందరితోనూ మాట్లాడటం అసంభవం. ఉన్న రెండు ఫోన్లూ, అస్తమానూ మోగుతూనే

ఉంటాయి. చాలా వాటికి లాలారాం, చలపతి, శర్మగార్లే సమాధానమిస్తుంటారు. ఇక ఉత్తరాల సంగతి సరేసరి!

మంజరి భాగ్యాన్ని చూసి నేను అసూయపడ్డమాట నిజమే! లక్షలు దాటిపోయింది. ఆ తరువాత అంకె చేరబోతూ ఉంది. సంపాదన ఎంత భారీగా వున్నదో, ఖర్చులూ అంతే! దాదాపు ఓ వందమంది విద్యార్థులకు ఆవిడ జీతానాతాలిస్తున్నది. రెండు అనాథశరణాలయాలు ఆవిడ పేరుమీదుగా నడుస్తున్నాయి. రకరకాల రాజకీయపార్టీలకు ఆవిడ భారీ ఎత్తున విరాళాలిచ్చింది. పత్రికలకు ఏదో రూపంలో ముట్టచెప్పకపోతే-భావ్యంగా ఉండదు. ఇవిగాక, ఇంకా విడిచందాలూ, పన్నులూ, లంచాలూ, వార్షికాలూ, ఎన్ని తగలడ్డాయో!

"ఒక్కోసారి సంపాదించడం మానేద్దామాఅనిపిస్తుంది. కానీ, అది మనచేతుల్లో ఉండదు. "నాకు డబ్బొద్దోయ్ బాబూ! అన్నా వినిపించుకోరు. రాత్రింబవళ్ళూ నిద్రాహారాలు మాని సంపాదించి, పన్నుల కింద ప్రభుత్వానికివ్వాలంటే కడుపు రగిలిపోతుంది. అందుకే ఖర్చులు విపరీతంగా పెట్టేస్తున్నాను. అప్పటికీ మొత్తం సంపాదన లెక్కలోకిరాదు"అన్నది మంజరి.

\- "ఇది మోసం కాదా?"అన్నాను ఆవిడతో.

మంజరి నవివ్వ-

"అసలు బతుకే పెద్ద మోసంమాధవరావుగారు!"అన్నది నాకేసి చూస్తూ.

"నేను వారం రోజుల పాటు నాప్రోగ్రాములన్నీ కాన్సిల్ చేశాను. ఛస్తారు వెధవలు. చావనీండి. ఎవరికట జాలి? నేను వచ్చిన రోజుల్లో వొక్కడు నన్ను కనికరించిన పాపాన పోలేదు. వీళ్ళమీద నాకెందుకు జాలిఉండాలండీ?"అన్నది మంజరి.

"నువ్వు మంచిదానివి. మెత్తటి దానివి, నీది జాలిగుండె, ఎదుటివారి కష్టాలు చూసి నువ్వు భరించలేవు"అన్నాను.

"కొంతమేరకేనిజం! కొందరు సుఖపడుతున్నా నేను చూడలేను. ముఖ్యంగా నా శత్రువులు. నన్ను బాధించినవారి మీద కసి తీర్చుకోడంలో నేను పరమానందాన్ని అనుభవిస్తాను. అందులోనూ, డబ్బుతో మనుషుల్ని కళలనూ కొని వ్యాపారం చేసే వారంటేనూ, ఎదుటివారిని ఇబ్బందుల్లో ఇరికించి అవసరాలు గడుపుకొనేవారంటేనూ, నా నరనరమూ ద్వేషంతో ఆక్రోశిస్తోంది. వారిని నేలబెట్టి కాలరాచలలేని నా అసమర్థతను తలుచుకొని ఎంత విచారిస్తానో మీ రూహించలేరు. ఒక్కో రాత్రి నాకసలు కంటిమీదకు కునుకే రాదు బాబుగారూ!"అన్నది మంజరి.

"ఎంచేత?"అన్నాను.

"ఎప్పుడో నేను పొందిన అవమానం, తిన్న దెబ్బలు, ఈసడింపులు, రూపాయికాసు చేతిలో ఉంచి-నన్ననుభవించిన మనుషులు జ్ఞాపకానికొస్తే-నిద్రరాదు. ఈ సినిమా లైనులోనూ అంతే! ఓ బుకింగ్ రావడం కోసం ఎన్ని బాధలు, ఎన్ని ఆశ్రయింపులు, ఎంతమందికి ఎన్నెన్ని ఆశలు చూపడం-తలచుకొంటే ఎంత అసహ్యమేస్తుందో చెప్పలేను"అన్నది మంజరి.

"ఇప్పుడలాంటి బాధలు పడుతున్నట్లు లేదే!"అన్నాను ఆమెను ఉపశమింపచేద్దామన్న ఉద్దేశంతో "మాకీ లోగుట్టులన్నీ తెలీవు. తెలిసిందల్లా, నీవెంట అబ్బాయిలు పడుతుంటారనీ, నువ్వువాళ్లను

ఏడిపించి, ఏడిపించి, చేతికి చిక్కి, పెళ్లాడి, విడిపోయి, కష్టాలుపడి, తిరిగి కలుసుకొని, నువ్వూ, వాడూ ఓ యుగళగీతం ఆలపిస్తూసుఖంగా ఉంటారనీ!''

మంజరి బాధగా నవ్వింది.

''ఇందాక డబ్బున్నవాళ్లంటే ద్వేషమన్నావుగదా! మరి నీసంగతేమిటి?''అన్నాను.

''నా మీద నాకెంత ద్వేషమో, మీకెలా తెలియచేయను చెప్పండి. నేనెక్కడో చదివాను. ''సౌందర్యం దేవతలిచ్చే గొప్పవరం''అని ఆ వరాన్ని క్షుద్రమైన ప్రయోజనాలకోసం ఉపయోగించవలసిరావడం కన్నా దురదృష్టం నేను సహించలేను''అన్నది మంజరి.

ఆవిడ కళ్ళల్లో నీటిజీరలు చూసి చకితుణ్ణయ్యాను.

''జీవితాన్ని చూసి నీలాంటిది భయపడడంలో అర్థంలేదు''అన్నాను. ఆవిడ వీపుతట్టి. ''పద పోదాం...నేను చాలా దూరదేశం నుండి వచ్చినవాణ్ణి. ఉన్న నాలలుగు రోజులూ నాతో కులాసాగా ఉండాలి గానీ-ఇలా బాధగా ఉండకూడదు''.

మంజరి అరగంటసేపు మేకప్‌చేసుకొని గానీ బయలుదేరలేదు.

''మీప్రశ్నకిప్పుడు సమాధానం చెబుతున్నాను. నేను నాగజెముడు మట్టలాంటి మొండిప్రాణిని. బతుకుమీద నాకున్న పాటి ఆశ చాలామందికి లేదు. నేను ఆశాజీవిని. ముందెప్పుడో, ఏదో మహోపకారం జరుగుతుందనీ, నాక్కావలసిందేదో లభిస్తుందన్న ఆశ లేకపోతే, నా జీవితం మరింత భారంగా తయారయి ఉండేది''అన్నది మంజరి.

కారు ఊరి వెలుపలకు వచ్చింది.

రోడ్డుకు రెండుపక్కలా గుడిశలు క్రిక్కిరిసి ఉన్నాయి. పిల్లలు రోడ్లమీదనే పడుకొని నిద్రపోతున్నారు.

''పందుల గూళ్లలాంటి ఈమురికి కూపాల్లో మనుషులుంటున్నారని జ్ఞాపకం వచ్చినప్పుడల్లా కళ్లకు చిల్లులుపడి, రక్తంకారిపోయేలాగా ఏడవాలనిపిసుస్తుంది. అలా ఏడ్చిన సందర్భాలూ చాలా వున్నాయి. ఎందుకు చెబుతున్నానంటే-నాకు బ్రతుకులో సుఖం ఎక్కడ తప్పిపోయియిందో మీరు కనుక్కొంటారని''అన్నది మంజరి.

''నాకు తెలుసు''అన్నాను.

''చెప్పండి?''

''నువ్వు కారుపోనిస్తుండు. అపనవసరం లేదు...ఏమిటంటే...నీకు సంబంధంలేని విషయాలను గురించి నువ్వనసరంగా ఆలోచించి సగం పాడయిపోతున్నాననుకొంటాను. నీ సంగతేదో నువ్వుచూసుకో. లోకం మరామత్తు చేయడానికి చాలామంది ఉన్నారు. వారి పనులు వారిని చెయ్యనివ్వు.. వర్షం పడుతున్నట్లుంది. కారు మళ్లింతామా?''

తిరిగి గుడిశల దగ్గరకొచ్చేసరికి వర్షం ఎక్కువయింది. పిల్లాజెల్లా ఆ పందుల గూళ్లల్లో దూరి బిలబిలలాడుతున్నారు.

మంజరి కారు తలుపులన్నీ మూసింది. లోవల వల్లమాలిన ఉక్క. బయట ఆకాశానికి చిల్లులు పడినట్లుగా వర్షం!

ఉన్నట్లుండి హఠాత్తుగా కారు తలుపు తెరుచుకొని, రోడ్డుమీదికి ఉరికింది మంజరి. కారణం తెలియక నేనూ దిగాను. మంజరి పక్కనే ఉన్న గుడిశ తలుపుతీసుకొని లోపలికెళ్లింది.

ఒ నడికారు స్త్రీ గోడకు చేరగిలబడి నొప్పులు పడుతూ ఉంది. పై నుంచి వర్షపు నీరంతా ధారలకింది, ఆ గుడిశలో పడుతున్నది. ఆ ఇల్లాలి వంటిమీద గుడ్డముక్క కూడా లేదు. గోనెపట్టా చుట్టుకుని, గొడ్డులాగా మూలుగుతున్నది. చుట్టూరా, అయిదారుగురు స్త్రీలు, ఇద్దరు పిల్లలూ ఉన్నారు. వర్షపు నీటికి, గాలి ఉదుటుకు దీపం చిటపటమంటున్నది.

నేనుకారులోకొచ్చేశాను.

పావుగంటకల్లా మంజరి కూడా వచ్చేసింది. ఆవిడ వంటినిండా రక్తం డాగులున్నాయి. గుడ్డలన్నీ నీరు వొడుస్తున్నాయి.

స్టీరింగు ముందు కూచుని, సన్నగా నిట్టూర్చింది మంజరి.

"ఏమయింది?"అన్నాను.

"నీళ్లాడింది. మొగబిడ్డడు. తెగబారెడున్నాడు బొద్దుగా. అంతదాకా అన్ని బాధలూ పడి, ప్రాణాలు విలవిలలాడిపోయేట్టు తన్నుకులాడిన ఆ తల్లికూడా పసిబిడ్డ ఏడుపువినగానే, లేని వోపికనంతా కూడదీసుకొని, బిడ్డను రొమ్ములకు అదుముకొన్నది. అప్పటిదాకా చేసి మేమందరమూ ఏమయ్యామో తెలీదు. మమ్మల్ని మరిచిపోయినందుక్కాదు..ఆమె లోపలి మాతృత్వ కాంక్షను గురించి నేనంటూంట"అన్నది మంజరి.

"పోనీ హాస్పిటల్లో చేర్పించేవాళ్లం కదా, కార్లో తీసుకురాలేకపోయావా;"అన్నాను.

మంజరి మాట్లాడలేదు. అద్దంలో చూసుకొని, ఓసారి జుట్టు సరిచేసుకొంది. కింద పెదవి బిగపట్టి, ఉద్వేగాన్ని అణచుకొంటూ కారును స్టార్టు చేసింది.

దోవలో కూడా మేమెక్కువ మాట్లాడలేదు.

భోజనాలయిన వేళకు రాత్రి పదిగంటలయింది. తాయారు నాకేసి, మంజరికేసి చూసి తలవంచుకొంది.

"ఏమిటి?"అన్నాను.

"అదా!"అన్నదేగాని మంజరి చెప్పలేదు. "వారికి అలవాటు లేదు తాయారూ!ఉంటే అప్పుడే చెప్పేదాన్ని గదా! నాకా? లోపలుంచు, అవసరమయితే పిలుస్తాను.

తాయారు వెళ్లిపోయాక.

"మీకు నిద్రగానీ రావడం లేదు గదా?" అన్నది మంజరి.

"లేదు"

"అలా ముడుచుకొని కూచోవటం దేనికి?సాఫీగా కూచోండి!"అన్నది మంజరి నేను వొదిగి కూచుని ఉండటం చూసి.

నేను సర్దుకొన్నాను.

"జీవితంలో విషాదం డబ్బు లేకపోవడం కాదు; మనల్ని ప్రేమించేవాళ్లు లేకపోవడం, మనం ప్రేమించడానికి ఎవ్వరూ దొరక్కపోవడం...మీరు లైట్‌గా తీసుకోండి! నేనిది అక్షరాలా అనుభవించి

చెబుతున్నాను...ఆ తల్లి...ఇందాక ప్రసవించినావిడ గుడ్డల మిల్లులో పనిచేస్తున్నదిట. ఉదయం కూడా పనిలోకెళ్లిందట. ఈ పూట కాన్పు. మొగుడు సాయంత్రం షిఫ్టులో పనికిపోయాడు. మిన్ను విరిగి మీదపడినా పనిమానేందుకు లేదు.. ఏ పూట మానితే ఆ పూట పస్తు! బహుశా ఆపసిబిడ్డకు సరైనా ఆలనా, పాలనా ఉండకపోవచ్చు. ఉండదనని ఆ తల్లికీ తెలుసు. తమలాగా తమ బిడ్డ కూడా కూలీగా బతకాలని తెలుసు. అయినా ఆబిడ్డను రొమ్ములకదుముకుని, వాడికళ్లల్లో కళ్లుంచి చూసేప్పటి తల్లి ఆనందం, సంతృప్తి ఏ మేడలూ, ఏ కార్లూ, ఏ రత్నహారాలూ ఇవ్వలేవనుకొంటాను. మీరేమంటాను?''అన్నది మంజరి.

నేనేదో అనబోయాను. ఏమనదలచుకొన్నదీ ఇప్పుడు జ్ఞాపకంలేదుగాని, మంజరిని ఆభారమైన వాతావరనం నుండి తప్పించడానికే ప్రయత్నించే వాణ్ణనడం మాత్రం ఖాయం.

ఫోన్ అదేపనిగా మోగుతోంది. తాయారొచ్చి, క్షణంసేపు విని''ఎవరో సక్సేనాగారంట, మిమ్మల్ని పిలుస్తున్నారు''అంది.

మంజరి ముఖం పాలిపోయింది. దాన్ని కప్పిపుచ్చుకోవడానికి వ్యర్థప్రయత్నం చేస్తూ ఫోన్‌దగ్గర కెళ్ళింది. అవతలి వారేమంటున్నారో నాకుతెలీదుగానీ, మంజరి మాత్రం ''అది చాలా అన్యాయం''-''మీరట్లాగని ముందుగా నాతో చెప్పలేదు''-''ఇలా నన్ను ఇబ్బంది పెట్టడం న్యాయంకాదు''అంటున్నది. ఆవిడ ధోరణి బట్టి, చెప్పదలుచుకొన్న సమాధానం పూర్తిగా చెప్పడలేదనీ, నేనక్కడుంటమే అందుకు కారణమనీ ఊహించాను. ఏదో పనున్నవాడిలాగా, పక్కకు పోయాను.

మరుక్షణమే మంజరి ఏడుపు గొంతుతో మాట్లాడటం నాకు వినిపించింది.

''నాకు సహాయపడతానని, ఇలా ఉచ్చుల్లో బిగించడం ధర్మం కాదు...నేను అన్యాయార్జనం చేయడం కోసం ''బ్లూఫిల్ము''లో నటించలేదు...దాన్ని బయటపెట్టకండి..అలాగే మీకెంతకావాలో రేపు వచ్చి పట్టుకెళ్లండి!''.

టెలిఫోన్ పెట్టేసిన ధ్వని వినిపించిందిగానీ నేను వెళ్లలేదు!

అయిదారు నిమిషాలు పాటు సన్నగా వెక్కిళ్లు వినిపించాయి.

''ఎందు''కని అడగకుండా ఉండేందుకు నా సర్వశక్తులూ ఉపయోగించవలసి వచ్చింది.

''మీకూ నిద్రొస్తున్నట్లుగా ఉందే! కిందికెళ్లి పడుకోండి. మళ్లా మనం రేపు కలుసుకొందాం''.

మంజరికళ్లల్లో నీరు సుడులు తిరగడం, పెదవులు భయంతో వణకడం నేను గమనించాను.

అవే ఆఖరుమాటలు నేను వినడం!

ఉదయానికల్లా చచ్చిపడున్నది.

తాయారు మాత్రం అర్థరాత్రప్పుడు, ''అమ్మా అమ్మా''అన్న పిలుపులు వినిపించాయనీ, తను వెళ్లి తలుపు తడితే జవాబు రాలేదనీ చెప్పింది. ''అవేబాబూ ఆ తల్లి ఆఖరిమాటలు! ఇంతలా జరుగుతుందనుకోలేదు. నిద్రపోతున్నదనీ, నిద్రలో కలవరించిందనీ అనుకొన్నాను. ఏమాత్రం ముందు పసిగట్టినా కడుపులో పెట్టుకు కాపాడుకొనేదాన్ని''అంటూ భోరుమని ఏడ్చింది తాయారు.

ఆకుపచ్చని కాశ్మీరపు తివాచీ మీద మంజరి శరీరం వెల్లకిలా పడి ఉంది. పడకగదిలోకి ఉన్న కిటికీ పూర్తిగా తెరిచి ఉంది. టెలిఫోను కిందపడి ముక్కలయిపోయింది...అల్లంత దూరంలో

పసుపుపచ్చని మందుబిళ్లలు చెల్లాచెదురుగా పడి ఉన్నాయి.

మంజరి మరణానికి కారణమేమిటని కాదు నాప్రశ్న. అసలిలాంటి అమానుషమైన ముగింపు జరగడం నాకిష్టం లేదు. తన సౌందర్య తీవ్రతతో దేశదేశాలను తపింప చేసిన మంజరి శరీరం నిర్జీవంగా, కాశ్మీరపు తివాచీమీద పడి ఉండటంలో ఏదో అపశృతి ఉన్నదనిపించింది నాకు. ఆమె సంపాదించిన కీర్తిప్రతిష్టలు, సిరిసంపదలు ఆమె నీ కొసకు తరుముకొచ్చాయనిపించింది.

అనన్యమైన ప్రతిభాసంపదలున్న వ్యక్తిమీద జీవితం ఏదో రూపంలో కసి తీర్చుకొంటుందంటారు.

మంజరి విషయంలోనూ అదే జరిగింది!

పావుగంటకల్లా పోలీసులకొచ్చారు.

కొలతలూ, ఫోటోలూ తీసుకోవడం అయ్యాక-

"ఈమె స్వగ్రామమేదో, తల్లిదండ్రుల పేరేమిటో చెప్పండి!"అన్నాడు పోలీసాఫీసరు.

ఎవ్వరూ కిమ్మనలేదు.

సువిశాలమైన ఆ చలువరాతి మందిరంలో శబ్దం కూడా శిలారూపం దాల్చింది!

**(ఐపోయింది)**

2012వ సంవత్సరానికి 'జ్ఞానపీఠ పురస్కార'గ్రహీత డాక్టర్‌॥రావూరి భరద్వాజ గురించి

అవిభక్త హైదరాబాదు సంస్థానానికి చెందిన 'పరిటాల జాగీర్'లోని మోగులూరు గ్రామంలో, 1927 జులై5న జన్మించారు. తండ్రి పేరు కోటయ్య, తల్లి పేరు మల్లికాంబ. పెరిగింది గుంటూరు జిల్లాలోని తాడికొండ గ్రామంలో.

పొట్టకూటి కోసం-వ్యవసాయ కూలీగా, పశువుల కాపరిగా, రంపంలాగే పనివాడిగా, తిత్తులూదే కూలీగా, పేపర్‌బాయ్‌గా పనిచేశారు.

17వ ఏట నుండి రచన చేయడం ప్రారంభించారు. అచ్చయిన తొలికథ-'విమల'. 1946 ఆగస్టు ఆఖరి వారం ప్రజామిత్రలో అచ్చయింది. అచ్చయిన తొలి పుస్తకం -'రాగిణి' 1950లో. ఆయన ఇప్పటికి దాదాపు 43కథలు బాలలకు, 17నవలలు, 11 సాహిత్య గ్రంథాలు, 33సైన్సు కథలు రాశారు.

1968లోనూ, 1983లోనూ రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డు, 1987లో సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు, అదే సంవత్సరం భారతీయ భాషా పరిషత్ వారి అవార్డు కాక ఇంకా చాలా చాలా పురస్కారాలు అందుకున్నారు. వీరి రచనలు అనేకం ఇంగ్లీషు, హిందీ, తమిళం,కన్నడం, మలయాళం భాషల్లోకి అనువదింపబడ్డాయి.

మూడు విశ్వవిద్యాలయాలు గౌరవ డాక్టరేట్ ఇచ్చి సత్కరించాయి. వీరి రచనలమీద నాలుగు విశ్వవిద్యాలయాలలో పి.హెచ్.డి. స్థాయి పరిశోధనలు జరిగాయి.

ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంలో తెలుగుప్రసంగ కార్యక్రమాల ప్రయోక్తగా ఉద్యోగ విరమణ చేసిన డా॥భరద్వాజగారు చదువుకున్నది ఏడవతరగతి వరకు మాత్రమే!

భరద్వాజ రచన 1965సంవత్సరంలో ''కృష్ణాపత్రిక''లలో సీరియల్‌గా వెలువడిన, ఈ ''పాకుడురాళ్లు''నవలకు -2012 సంవత్సరానికి 'జ్ఞానపీఠ పురస్కారం'లభించింది. దీని తొలిప్రచురణ 1978లో. ఇది విశాలాంధ్రలో నాల్గవ ప్రచురణ. వజ్రోత్సవ సంవత్సరంలో ''విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్''కు పరోక్షంగా లభించిన పురస్కారం ఇది.

## 2012వ సంవత్సరానికి 'జ్ఞానపీఠ పురస్కార' గ్రహీత డాక్టర్॥ రావూరి భరద్వాజ గురించి

అవిభక్త హైదరాబాదు సంస్థానానికి చెందిన 'పరిటాల జాగీర్' లోని మోగులూరు గ్రామంలో, 1927 జూలై 5న జన్మించారు. తండ్రి పేరు కోటయ్య, తల్లి పేరు మల్లికాంబ. పెరిగింది గుంటూరు జిల్లాలోని తాడికొండ గ్రామంలో.

పొట్టకూటి కోసం – వ్యవసాయ కూలీగా, పశువుల కాపరిగా, రంపంలాగే పనివాడిగా, తిత్తులూదే కూలీగా, పేపరు బాయ్‌గా పని చేశారు.

17 వ ఏటనుండి రచన చేయడం ప్రారంభించారు. అచ్చయిన తొలికథ – 'విమల'. 1946 ఆగష్టు ఆఖరి వారం ప్రజామిత్రలో అచ్చయింది. అచ్చయిన తొలి పుస్తకం – 'రాగిణి' 1950లో. ఆయన రాసిన "దైవరాజకీయాలు" కథ అప్పట్లో స్వర్ణకంకణం అందుకొంది. ఆయన ఇప్పటికి దాదాపు 43 కథలు బాలలకు, 17 నవలలు, 11 సాహిత్య గ్రంథాలు, 33 సైన్సు కథలు రాశారు.

1968 లోనూ, 1983 లోనూ రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డు, 1987 లో సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు, అదే సంవత్సరం భారతీయ భాషాపరిషత్ వారి అవార్డు కాక ఇంకా చాలా చాలా పురస్కారాలు అందుకున్నారు. వీరి రచనలు అనేకం ఇంగ్లీషు, హిందీ, తమిళం, కన్నడం, మలయాళం భాషల్లోకి అనువదింపబడ్డాయి.

మూడు విశ్వవిద్యాలయాలు గౌరవ డాక్టరేట్ యిచ్చి సత్కరించాయి. వీరి రచనల మీద నాలుగు విశ్వవిద్యాలయాలలో పి.హెచ్‌డి. స్థాయి పరిశోధనలు జరిగాయి.

ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంలో తెలుగు ప్రసంగ కార్యక్రమాల ప్రయోక్తగా ఉద్యోగ విరమణ చేసిన డా॥ భరద్వాజగారు చదువుకున్నది ఏడవ తరగతి వరకు మాత్రమే!.

భరద్వాజ రచన 1965 సంవత్సరంలో "కృష్ణాపత్రిక" లో సీరియల్‌గా వెలువడిన, ఈ "పాకుడు రాళ్లు" నవలకు – 2012 సంవత్సరానికి 'జ్ఞానపీఠ' పురస్కారం లభించింది. దీని తొలిప్రచురణ 1978లో. ఇది విశాలాంధ్రలో నాల్గవ ప్రచురణ. వజ్రోత్సవ సంవత్సరంలో **"విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్"** కు పరోక్షంగా లభించిన పురస్కారం ఇది.



**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

